ఓమ్

# శ్రీ కృష్ణాభ్యుదయము

15469

## పూర్వభాగము



రచయిత

వాడేల వేంకటశేషగిరిరావు



శ్రీ లక్ష్మీగణేశ జ్యోతిషాలయము, రావిపాడు
కంభం తాలూకా, కర్నూలుజిల్లా.

 1954 [ వెల రు. 6-0-0

# ఆమోదము



శ్రీకృష్ణాభ్యుదయ మనుపేర రచింపఁబడిన యీ కావ్యమునకుఁ బరిచయ వాక్యములు వ్రాయు భారము కృతికర్త నాపైఁ బెట్టినారు. సత్కవీశ్వరులు బ్రహ్మశ్రీ వాడేల వేంకట శేషగిరిరావుగారు విద్యా వయోవృద్ధులు. వారికంటెఁ బిన్ననైన నన్నీకార్యమునకు వారు నియోగించుట నాయందలి వాత్సల్యమే కారణము గాని యన్యము కాదు. శ్రీశైలేశ చరిత్రాది కావ్యములచే వారి కవిత తెలుఁగునాఁటఁ గల కాలమునుండియు మన్నింపఁబడుచున్నది. అభినవ రామలింగ బిరుదాంకితులై యార్వాచీనాంధ్ర కవితాశకకర్తలై కింకవీంద్ర ఘటాపంచానన కులై కీర్తిమూర్తులైన శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారే వీరి శ్రీశైల చరిత్రాదుల కవితాధోరణిని బ్రశంసింపఁగా నస్మాదృశుల ప్రశంసల చేఁ బనేమి? అయిన నీకావ్యము పరమ భాగవతాగ్రగణ్యుఁడు సహజ పాండిత్యుఁడునై సకలాంధ్రలోకమునకు భక్తిమార్గమున నాచార్యస్థాన మలంకరించిన పోతనామాత్యుఁడు రచించిన శ్రీమదాంధ్ర మహాభాగవతమునందలి దశమ స్కంధములోని యితివృత్త మాధారముగా విలసిల్లిన కతనచే సహజముగాఁ బ్రజలు పోతన రచనవలె దీనిఁ బరిగణింతురా యను సందియము కలుగకపోదు.

అది యట్లుండఁగా వర్తమానాంధ్ర ప్రభుత్వాస్థాన కవులును కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణేత్యాది నానాబిరుదాంకితులును, విశ్వకవీంద్రకోటి కధ్యక్షస్థాన మలంకరింపఁ గలిగినవారు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్యాసభాగవత మామూలాగ్రముగా నాంధ్రీకరించి యున్నారు. ఇట్టిచో నీరచన యెట్లు ప్రకాశించునని శంకించుటయు న్యాయమే.

అయినను శ్రీ కృష్ణమూర్తి శాస్త్రిగారే యీ కావ్యముఁ గవియన నాలించి యానందించి ప్రశంసించుటవలన రచయితకించుక

ప్రోత్సాహము గలిగినది. జీవత్పండిత కవికోటిలో గురుస్థానమ్మునం
రిల్లు మహనీయులందు గణనీయులగు సకలకళా విచక్షణావధాన శిర
ణీత్యాది ప్రశంసాంచితులగు శ్రీ కాశీ కృష్ణాచార్యుల వారును నీ
రచన నామోదించి గ్రంధకర్తపేరు తెలియకున్న నీకవిత్వము, పోతరా
కవిత్వమని భ్రాంతిం జెందియుందు' ననుటవలన నీ కావ్యము ప్రకటనా
మగునను విశ్వాసము రచయిత కేర్పడినది.

ఇట్లు ప్రస్తుతాంధ్ర కవి ప్రకాండులలో విద్యావయోవృద్ధు ల
నీ పూజ్యులిర్వురు రచయితను మెచ్చి యాశీర్వదించుటవలన నిది ప్ర
శిత మగుచున్నది. 'ఆపరితోషాద్విదుషాం। నసాధుమన్యే ప్రయోగవిజ్ఞా
మ్మను కవికులగురువు కాళిదాసంతటివాడే భావింపంగా నితర కవు
తమ రచనలను విద్వదామోదమునం గాని ప్రకటింప సాహసింపకుంకుట
నాశ్చర్యమేమి?

వర్తమానాంధ్ర సాహిత్యములో 'దేవు నావ మున్న దేశ
లోకకుండు। నిప్పుడూర నూర నింటనింట' నన్నట్లు రచయిత లసంఖ్యా
లైనారు. ఈ రచయితలలో నెవరు కవులో యెవరు కారో తేల్చి చెప్ప
కష్టసాధ్యమగు కార్యము. ఛందస్సులో విప్లవము, నితివృత్త స్వీకా
ములో విప్లవము, భావకల్పనలో విప్లవము, శిల్పములో విప్లవము, ని
బహుముఖములుగా విప్లవము పెల్లుబుకుచున్నది. ప్రాచీన సంప్రద
యానుసారముగాం గావ్యములు నిర్మించు వారిలోనే యొకరి రచ
గొకరి కింపుగాదు. ఇంక నవీనమార్గ విహారస్థుల మార్గము లరయుచో
ఒక్కొక్కరి దొక్కొక్క మార్గము. ప్రతివాడును దను మార్గము
దామగ్రగణ్యుల మనుకొందురు. ఈ రచయిత పురాకృత విశేషమేమొ
యట్టి తెగువ కలుగలేదు. ఇట్లనుటచేం బరప్రత్యయనేయబుద్ధి యీయ
కంటంగట్టుటకు గొందఱు సాహసింపకపోరు. అట్లు సాహసించువారీ ర
యిత యభినవ రామలింగ బిరుదాంకుని ప్రియ శిష్యుండన్న విషయమె
పరి గమనించి మఱి సాహసించుట మంచిది.

ఇపు డీ కావ్యరచనా విశేషములను స్థాలీపులాక న్యాయము
నెత్తిచూపుట తొలిపలుకులో నావశ్యకమగును. ఇట్టిచో వెంటనే య

యితివృత్తముగల యన్యకావ్యములతోఁ బోల్చి చూపుటవసరమన్న భావనము కలుగకపోదు. కాని నాకది యగత్యమనిపించుటలేదు. హేతు వేమనఁగా నీరచయిత యాయా కవుల రచనల నధఃకరింపఁగోరి యీ రచనకుఁ గడఁగలేదు. వారియెడల నీయనకు మాత్సర్యము లేనేలేదు. ఇట్లున్నచో మాత్సర్యమున్న సెబా సనిపించుకొనవలదా! కనుకనే మాత్సర్యము లేకపోవుట యచ్చఁజూచు వారుండకపోరు. ఆంధ్ర సాహిత్యములో నొకే యితివృత్తము నొకే సంప్రదాయమునఁ జిత్రించుట కల కావ్యము లనేకము యున్నవి. అయ్యును నాయా కావ్యకర్తలు పరస్పర మాత్సర్యములతోఁ దమ రచనలు సాగింపలేదు. ఆయాయితివృత్తములందు వారికిఁ గల యాదరములే వారి నందులకుఁ బురిగొల్పినవి. ఈ కవికూడ నిట్లే శ్రీకృష్ణ చరిత్రమందుఁగల ప్రీతిచేత మాత్రమే యీ రచనకుఁ బూనుకొనెను.

పోతనామాత్యుఁడు సహజ పాండిత్యుఁడైనట్లే యీ కవియును సహజ పాండిత్యుఁడు. ఇట్లనుటచేత నిర్వురి పాండిత్యము సమానమే యను భావము విజ్ఞులకుఁ గలుగకుండుఁ గాక. వీరి కక్షరాభ్యాస మొనర్చినవారు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు. కవితా విషయమున వీరు తమ గురువు సుబ్రహ్మణ్యస్వామి యని వివరించిరి. వీరు కవులేగాక సిద్ధాంతులుగూడ. ఈ సిద్ధాంత భాగమునను వీరికిఁ బ్రవేశము స్వామి యనుగ్రహముననే కలిగినవని తెలియుచున్నది. 'ప్రవేదిరే ప్రాక్తన జన్మ విద్యాః' అన్నట్లు లీశ్వరానుగ్రహమున నదృష్టవంతునకు వివిధవిద్యాపరిచయ మేర్పడుటలో నాశ్చర్యము లేదు.

ఈ కావ్యము భాగవత దశమస్కంధమునకు నికృష్టమైన యను వాదము కాదు. అనుసరణము మాత్రమే. కనుకనే కవి కొంత విజృంభించుట కవకాశము చిక్కినది. దాననే పోతన రచనకును నీ రచనకును గథా విషయమునందక్క నితర విషయములం దంతగాఁ బోలిక కనఁబడదు. కనుక నుక్తి వైచిత్రిలోని వైవిధ్యము పాఠకులు సులభముగా గమనింపఁ గలరు. ఒకే యితివృత్త మిర్వురు కవులచే వేర్వేఱుగా రచింపఁబడినపుడే యుక్తి వైచిత్రియే గదా పఠనకుతూహలముఁ బ్రోదిసేయును కావున

నీరుచిభేద మెఱిఁగి యానందింపఁ గోరు రసికులకీ రచన యాహ్లాద మొసఁ గూర్చు ననుటలో సందియ మించుకయు లేదు.

ఇంతేగాక నేటి సాహితీ ప్రియులలోఁ బలు తెగలవారున్నారు. వీరిలోఁ గొంతమందికిఁ బూర్వ కవుల కవిత్వమే కవిత్వముగాని నవీనుల కవిత్వము కవిత్వముగాదను విశ్వాసమున్నది. వీరి యీ యపోహ ప్రస్తుతాంధ్ర కవిత్వముపై వీరి దృష్టిని బ్రసరింపనీయకున్నవి. ఇఁకఁ గొందఱు పురాతన సంప్రదాయముల నిట్టె త్రోసిరాజందురు. ఈ యిఱుతెగల వారివలనను సాహిత్యమున కపచారము జరుగుచున్నదని చెప్పకతప్పదు. మఱికొందరు శైలీ మాధుర్యమునకు ముగ్ధులగుచుందురు. కొంద ఱర్థ గౌరవమునకుఁ దలయూఁతురు. కొంతమంది యలంకార ప్రియులు. కతిపయులు నూత్నచ్ఛందపుఁ జందముల డెందములఁ బొందుపఱుతురు. మఱియుఁ గొందఱు సర్వతోముఖ విప్లవ మగ్గింతురు. కాని వా రభిలషించు నా విప్లవములోని గుణాగుణములు వారు నిర్దేశింపఁ జాలరు. అసలు దాని స్వరూపమే వారు నిర్ణయింపలేరు. కాని యా నిరాకార నిర్గుణాది విశేషణ భీషణము భావించి భావించి మైమఱచుచుందురు. కొంత మంది వైదేశిక కవితా రీతులను మాత్రమే ప్రీతి వెలయింతురు. ఇతివృత్తము ప్రజా జీవితమునకు సన్నిహితమై యుండఁదగు నను మిషతోఁ గొందఱు నిస్సార లౌకిక విషయములకు మాత్రమే ప్రాధాన్య మిత్తురు. కుల మత వివాదములు కుప్పగూలి క్షణక్షణక్షుర రాజకీయపక్ష విక్షేపాక్షయ ఝంఝులు సుడివడు నీనాఁడు పాఠకులలో సంకుచిత దృష్టు లేర్పడుట యాశ్చర్యమును గాదు.

పరిస్థితు లిట్లున్నను సక్రమగు కవిత కెన్నటికిన్ మన్నన కలిగి తీఱునను విశ్వాసము లోకశ్రేయస్సే లక్ష్యముగా సత్కవులు కావ్యములను రచించుచున్నారు. సహృదయులును, సాహితీ పరమార్థ విదులును నగు పాఠకుల యాదరమున సత్కావ్యములు ప్రచారము గాంచుచునే యున్నవి. సుకవులు భవభూతివలె 'కాలోహ్యయం నిరవధి । ర్విపులాచ పృథ్వీ' యన్నట్లు మాఱులేని ధీరతతో 'విశ్వశ్రేయః కావ్య' మ్మను నిర్వచనమ్మునకిమ్ముగఁ గృతులు విరచింతురను నా యీ మాటలనే

కవిమ్మన్యులును వ్రాయొనవచ్చును. అట్లు వ్రాయొనినంతమాత్రానఁ దదీయ వచనములకు సంభావన యెంతవఱకు సిద్ధించునో విజ్ఞు లెఱుఁగకపోరు.

ఇంత యుపోద్ఘాతమునకు మూలమిా శ్రీకృష్ణాభ్యుదయమునందలి యితివృత్తము పౌరాణికమగుటయుఁ బ్రాచీన సంప్రదాయము నెడ ననురక్తితో రచన నడచుటయును మాత్రమే. కనుక వెనుక నొకరు భాగవత దశమస్కంధేతివృత్తమును గావ్యముగాఁ దీర్చిదిద్దఁగా మఱల నిదియేల యను ప్రశ్న మవిచారజనితము.

ఇఁక నిందలి యుక్తివైచిత్ర్యాదులఁ బరికింతము. నాతొలి నుడులలోనే యిది మూలమునకు మక్కికి మక్కి యను వాదము కాదని చెప్పి యుంటిని. అయ్యును నితివృత్తసామ్యముంబట్టి పూర్వకవివాణియు నీకవివాణియుఁ గొన్నికొన్ని యెడల నెట్లు నడచెనో మచ్చునకుఁ గొన్ని పట్టులు పేర్కొందును.

ఉ. ఈ పసిపాప యేడ భరియించుట యేడ నగంబటంచునుం
జాపలమున్ వహింపకుఁడు సాగర పర్వత కాన నాపగా
వ్యాపకమౌ చరాచర ధరావరణంబది పైని వ్రాలినం
జూపుడువ్రేలు వ్రాలదొక సుంతయు భీతిఁ దలంగి నిల్వుఁడీ.

ఇట్లు గోవర్ధనోద్ధరణ సందర్భమునఁ బోతనామాత్యుని కృష్ణుఁడు

శా. బాలుండీతఁడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపఁగాఁ
జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁ బోల దీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరాచక్రంబు పైఁబడ్డ నా
కేలల్లాడదు బంధులార నిలుఁ డీక్రిందం బ్రమోదంబునన్,

అని గోపాలకుల నుద్బోధించినాఁడు.

సకల ధరాచక్రము పైఁబడినను నా చూపుడు వ్రేలింతైన వ్రాలదని శేషగిరిరాయని కృష్ణుఁ డనుచున్నాఁడు. నా కేలల్లాడదని పోతనామాత్యుని కృష్ణుఁ డనుచున్నాఁడు. ఈ రెండురకముల పలుకుబడులలో నేది శక్తిమత్తరముగా నగపడుచున్నదో భావుకు లెఱుఁగుదురు గదా!

అయినను నీ సందర్భమున నుత్పలమాలకంటె శార్దూల వృత్తము గ్రహిం
చిన పోతనామాత్యుని ఛందోవిజ్ఞతను బ్రశంసింపక తప్పదు.

ఈ క్రింది పద్యములను జూడుఁడు.

క. ఎక్కడి గృహమింక నీవెక
సక్కెములాడెదవె నమ్ము జగదీశ్వర! మే
కిక్కడఁ దఱిలినపుడ
మ్మక్కపతుల్ నమ్ము విడిచిరది యెఱుఁగవో!

తే. భవ సముద్రమునందు నూర్పు విడ నేని
యదను చిక్కక తపియింతుమయ్య యింత
కాల మింకను నాజోలియేల మాకు
స్వామి సంసారతరణ సౌభాగ్య మిమ్ము.

శ్రీకృష్ణుని సందర్శింపఁ జన్న మునిపత్నుల మాట లివి. ఇదే సంద
ర్భమునఁ బోతనామాత్యుని పద్యములఁ జూడుఁడు.

మ. తగునే మాధవ యిట్టివాఁడి పలుకుల్ । ధర్మంబులే మాఱొడన్
మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ । మమ్మున్ నివారింప మ
చ్చిగ నీయంఘ్రులు సేరినార మటవోఁ । జేకొందురే వార లా
పగి దేమొల్లము కింకరీ జనులఁగా । భావించి రక్షింపవే.

ఇట్లు భగవంతునిచే ననుగ్రహింపఁబడిన తమ పత్నులసుకృత
విశేషముం దలపోసి పశ్చాత్తప్తులయిన మునులు.

ఉ. ఎవ్వఁడు యజ్ఞమూర్తియగు నెవ్వని యర్చనఁజేసి మోదముల్
నివ్వటిలున్ జగత్త్రయికి నీరజనాభుఁ డతండె వచ్చినం
గవ్వకునైనఁ గైకొనము జ్ఞానుల మే మని యెంతయేనియుం
గ్రొవ్వితి మిట్టు లంగనలకున్ సరిగా మగిదా! మహాత్ములై.

అని పరితపించిరి. ఇట్టిదేఁ బోతన పద్యముఁ జూపెదము.

చ. కటకట! మోసపోయితిమి కాంతలపాటియు బుద్ధిలేదు నేఁ
డిట హరిఁగానఁ బోనెఱుఁగ మేము దురాత్ముల మెమి కల్మషో

ద్భటులము విష్ణుదూరగుల ప్రాజ్ఞత లేల తపంబు లేల ప
ర్యటనము లేల శీలములు యాగములున్ మఱియేల కాల్ప నే.

పాత్ర పోషణదక్షత యీ రెండు రచనలలో నెందధికముగ సంభా వ్యమగునో విజ్ఞు లెఱుఁగఁ గలరుగదా!

ఇఁక రసపోషణ విధానమించుక ప్రస్తావించు టుచితము. ఈ యితివృత్త రమణీయత రసపోషణమునఁ గవి కెంతో తోడ్పాటొనరించు చుండుటచేఁ గావ్యము రసవంతమై యలరారుచున్నది. ముఖ్యముగా శృంగార రసమనిన నీకవికి మిక్కిలి యభిమానము. ఇది యడుగడుఁ గునఁ బాఠకులకు గోచరించుచుండును. ఉదాహరణమునకు గోపికావస్త్రాప హారణములోని యీ క్రింది పద్యముఁ జూడుఁడు.

సీ. చెలియ కృష్ణుఁడటన్న పలుకెంత మధురమో
వినఁగోరు నదియ నావీను లెపుడు
కలికి యవ్వాని చక్కఁదన మ్మెట్టిదో
కనఁగోరు నదియ నాకన్ను లెపుడు
పూఁబోఁడి వాని కెమ్మోవి నేమున్నదో
రంజిల్లు నంద నారసన యెపుడు
మగువ యాతని సౌకుమార్య మ్మెట్టిదో
యాసించు నదియ నా యంగకములు

తే. రమణి వేయేల నా శరీరమ్ములోని
ప్రత్యణువు వానికోసమై పరితపించు
నా సొగసుకాని సాహచర్యమ్ము లేక
బ్రతుకలేనమ్మ కొమ్మ! నే బ్రతుకలేను.

ఇట్లుదాహరించుకొనుచుఁ బోయిన మొదలంత మాఱును, మాఱంత మొదలు' నన్నట్లు పీఠిక మూల గ్రంథమును మించిపోవును. శృంగారరసమం దధిక తాత్పర్యముగల యీకవి యొక్కొక్కచోట హద్దులు దాఁటెననిపించును. ఆయా పద్యములు రసికులు కంఠస్థము చేయఁదగును.

"సిగ్గట సిగ్గుఁబొగ్గు నది చిన్నపు డెప్పుడొ పోయె'

"అప్పుడు లేనిలజ్జ యిపుడా పయికొన్నది యంగభంగమై యెప్పుడొ నాకు లోజ్జయితి రిందఱు"

ఇట్టి వింకను గలవు. ఈ యితివృత్తము భాగవతము కానిచో నీకవి యీమార్గమున నింకెంత విజృంభించి యుండునో! ఇట్టి పద్యముల నెల్ల నొక గ్రంథరూపమున వీనినుండి వేఱుగాఁ బ్రచురించియుండిన నీ రచయిత ప్రశస్తి మిన్నంటఁగలదని నా యభిప్రాయము.

అలంకారముల విషయములలో నీ కవి యంతగా శ్రద్ధ నహింప లేదు. అట్లని వీరి కవితాలతాంగి నిరాభరణ సుందరి కాదు. సహజ సౌందర్యము మఱుఁగునడున ట్లలంకారములలో మునిఁగినదియుఁగాదు. ఏ యలంకారమైనను సందర్భోచితముగా నమర్పఁబడినదే కాని యసందర్భ ముగా నమర్పఁబడినది కాదు. స్వభావోక్తికి 92 వ పుటలో నీ క్రింది పద్యము చూడుఁడు.

సీ॥ జలజదళంబులందలి హిమాంబువులట్లు
జిలుఁగుఁ గన్నుల నీర మొలుకువాని

..........................

..........................

భీతుని విధానఁబైకిఁ గన్పించువానిఁ
బట్టి బంధింపఁ గొనిపోయెఁ బడఁతిమిన్న.

గోపికా వస్త్రాపహరణ ఘట్టములో వృక్షాగ్రమందుండి చీరలు చేఁబూని యున్న శ్రీకృష్ణు నాశ్రయింప గోపికలు వృక్షముఁజుట్టుముట్టు దృశ్యము రంతులరాటముగా నుత్ప్రేక్షింపఁబడినది. ఇది సరిక్రొత్త పోకడ. ఇట్లన్నింటికి నుదాహరణము లిచ్చుచుఁ బాఠకుల గ్రంథ పఠనాభిలాషమును నిలువరించుట నా యభిమతము గాదు.

వీరిశైలి లలితము. భావము సులభగ్రాహ్య మగును. పాండిత్య ప్రకర్షకై సుదీర్ఘ సమాసము లుపయోగించు నలవాటు వీరికి లేదు. పద్యముఁ జదివినంతనే పాఠకునకు భావము బోధపడవలెనని వీరి సంకల్పము. ఎందైన రసావేశమున దీర్ఘ సమాసములు దొఱలినవిగాక. అవియును గరిపపద భూయిష్ఠములు కావు. ఎన్నో లోకోక్తులనేగాక వ్యావహారిక భాషాపదముల నెన్నింటినో తమ రచనయందుఁ బ్రవేశపెట్టి

సామాన్య భాషాజ్ఞానము గలవారికిని దమ కవిత్వ మందుబాటులోనికిఁ దెచ్చిరి. అట్లయ్యును వీరిరచన గ్రాంథిక రీతినే సాఁగినది.

ముఖ్యముగా నీ కావ్యములో గమనింపఁదగిన విశేషములు కొన్ని గలవు. కంసకాలయవనుల జన్మవృత్తాంతము లిందు లిఖింపఁబడినవి. ఇవి పోతన రచనలోఁ గానరావు. రుక్మిణీకల్యాణ ఘట్టములో వైలక్షణ్య మున్నది కావ్యము మొదటినుండి తుదివఱకు నాటకధోరణిలోనుండి యా యా పాత్రలు మనకన్నులకుఁ గట్టినట్లుండును. అక్రూర ధృతరాష్ట్రుల సంభాషణము ముఖ్యముగాఁ జదువఁదగినది వీరి ప్రత్యేకత దీపించెడి ఘట్టము లిట్టి వెన్నో కలవు. వట్టిమాటలలోఁ జమత్కార ముట్టిపడునట్లు రచన నడపుట వీరికిష్టము. మన స్తత్త్వ శాస్త్రమున వీరికిఁ బ్రవేశమున్నట్లాయా పాత్రల సంభాషణలలోఁ దేటతెల్లమగును.

మొత్తముమీఁద వీరి యీ కావ్య మొక వింతధోరణిలో నడచుచుఁ బాఠకుల నాకర్షించుచున్నది. ఒక్కొక్కచోటఁ బోతన భాగవతమే చదువుచున్నా మనిపించును. అట్లని యీ కవి పోతన ననుకరించుటకు యత్నింపలేదని సమగ్రముగాఁ జదివినవారికిఁ దెలియఁగలదు. రాసక్రీడలలోని పోతన 'నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు' అను ప్రారంభముగల పద్యమును వీరి 'నల్లనివాఁడు రేవెలుగు నవ్వులవాఁడు' అను ప్రారంభముగల పద్యముతోఁ బోల్చిచూడుఁడు ఆ పద్యము నీ పద్యము మఱపించును. ఈ పద్యము నా పద్యము మఱపించును.

ప్రస్తుత గ్రంథము దశమస్కంధ పూర్వభాగము. వీరు రెండవ భాగమును గూడఁ ద్వరలోనే ప్రకటింపనున్నారు. ఆంధ్రసాహితీప్రియు లీకవిని బ్రోత్సహింతురుగాక. ఈ కవీశ్వరు లింకను నితోధికముగా భాషాసేవచేసి చరితార్థులయ్యెదరు గావుత.

కృతిపతి శ్రీకృష్ణ పరమాత్మ యీ కృతికర్త కాయురారోగ్య భాగ్యము లిచ్చి యనుగ్రహించుత మని యాసించుచున్నాను.

ఓం తత్సత్.

ఇట్లు విధేయుఁడు,
దేవరకొండ చిన్నికృష్ణశర్మ.

విజయ మాఘ బ. ౭. గురువారము
విజయవాటిక.

శ్రీ ర స్తు

శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ, వేదవిద్యావిశారద, ప్రసన్నవాల్మీకి, విశ్వకవి, కవిబ్రహ్మ.

# శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు

సుదర్శనభవనము

రాజమహేంద్రవరము

తేది 9 ... 1 ... 1954

జననము క్రీ. శ. 1866 సం॥
అక్షయాశ్వయుజ
బహుళ షష్ఠి

★

16-వ సంవత్సరము మొదలు
ఇప్పటివరకును రచించిన
గ్రంథములు సుమారు 150.

★

శ్రీకృష్ణభారత రచనాకాలము :
1916 మొదలు 1926 వరకు

★

సువర్ణాభిషేకము :
ది 11—1—1930
శుక్ల సం॥ పుష్య శుద్ధ ఏకాదశి
క్షీరారామపురము

★

కవిగండపెండేర బహూకృతి :
ది 20—10—1933
రాజమహేంద్రవరము

★

గజారోహణోత్సవము 1934
విజయవాడ - సాలూరు

★

శిలావిగ్రహప్రతిష్ఠాపనము :
ది 29—11—1941
రాజమహేంద్రవరము

★

మణికిరీటము 1945
విజయవాడపురము

★

శ్రీకృష్ణరామాయణ రచన 1947
శ్రీకృష్ణభాగవత రచన 1948

శ్రీ శాస్త్రుల వేంకటేశ్వరరావుగారు
రచించిన శ్రీకృష్ణార్జునోదయమను భాగ
వత దశమస్కంధ గ్రంథములో నుండు కొన్ని
పద్యములు వారు చదువగా విని. ఆ మహ
నీయుని కవిత్వము మృదు మధుర
[illegible] ద్రాక్షాపాకముగా ఉండుటను-
[illegible] లోకమున పండితలోకస్వ
[illegible] అనేక పదములను స్వీకరించి తమ
కవిత్వమును అలంకరించుటయు నేను
ఇప్పటి నవ్యభాషా కవులు వాడే
ఖండ పద్ధతుల వీరందరు స్వీక
రింపలేదు. తమ కవిత్వము సర్వజన
సంబోధకముగను ఉండవలయు
నను అభిప్రాయము గలవారెందరును
[illegible] నియత సంప్రదా
యములను [illegible]
రచించి ఆంధ్ర భాషా పోషకుల
[illegible] నందులకు నేను ఎంతో సంత
సించుచున్నాను-

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

# నివేదిక

శా. శ్రీకృష్ణాభ్యుదయప్రబంధమును లక్ష్మీభర్త కర్పించుచుం
ప్రాకట్యంబుగవ్రాయ నెంచితిని నాప్రాపై శివాపుత్రుల
స్తోకాదర్శముఁ జూపుచుండ నటు గాదో శాస్త్ర విజ్ఞానమే
మే కన్పించనినన్నుఁబోంట్ల సాదృశ్యప్రసంగంబొకో!

చ. ఇది సురముఖ్యునాజ్ఞగ గ్రహించితి నుంచితి సర్వబాధ్యతల్
సదయులపైని భాగవతసారము తీరముఁ జేరుదాఁక సాం
ప్రదముగ వ్రాయగాఁ గలముఁ బట్టితి వందలువేలు పద్యముల్
కుదురుగఁ గూర్చి శ్రీరమణుఁగూరిచి కోరికలూఁర వ్రాసితిన్.

ఉ. బాలతమాలసాలరుచి బంధురదివ్యకళావిభూతిచే
గ్రాలుమురారిదివ్య కథ వ్రాయగఁ దీయనిభావసంపుటీ
జాలములోలశబ్దపరిసర్పితమై చవులారుచుండె వా
చాలత నిండె నెమ్మనము సమ్మతిఁ బండెఁ గరండసామ్యమై

గీ. విజయభారతి యనునితివృత్తమొకటి
పద్యరూపముగా వ్రాయఁ బాలుగొంటి
నందున దశావతారఘట్టాంతరమునఁ
గృష్ణలీలావిభూతి వర్ణించునపుడు.

మ. ఒకపద్యంబును రెండుమూఁడు పదులెన్నో యయ్యో నేమైన ను
త్సుకతన్ మాత్రము దీరనాతురత తో ద్తో హెచ్చె శ్రీకృష్ణుది
వ్యకథావృత్తముచిత్తముం బుణికి నవ్యాలంకృతి స్ఫూర్తితోఁ
ప్రకృతానందము మేరమీఱి కడలన్ వ్యాపించె నెంతేనియున్.

ఉ. అంతటఁ దొల్తఁ బూనుకొనినట్టి ప్రబంధము నాఁగి యిందిరా
కాంతుడు శ్యామసుందరుని కబ్బము వ్రాయఁగడంగితిన్ మన
శ్శాంతిని గంటి నాపయిని సాఁగెను గ్రంథ మనంతవేగ వి
క్రాంతమహేశ్వరేప్సితము కైవడి లేవడిమాట లేనిదై.

శా. భక్త్యావేశము ప్రోత్సహింప స్థిరుఁడై బ్రాహ్మీమహాదేవియే
సూక్త్యంతర్గత భావగుంభిత పదస్తోమంబునందీర్పుచో
ముక్త్యావేశమునన్ లిఖించు ఘనుఁ డాపోతన్నతో దీటుగా
రక్త్యానంద మెఱుంగనట్టి జడుఁడా వ్రాయున్ ప్రబంధంబురున్.

గీ. వానిపద రేణువులఁ బోలలేని నేను
భాగవతకావ్యరచనకై పాటుపడుట
దైవనిర్ణయమే సూవె తలఁచితలఁచి
వ్రాసితిని తోఁచినంత శ్రీవరుని కరుణ.

కం. శ్రీకృష్ణాభ్యుదయంబును
శ్రీకృష్ణుడె చెప్పుచుండ చెలఁగి లిఖింపన్
నాకొదవెను సద్భాగ్యము
శ్రీకరుచరణాబ్జసేవఁ జేసెడుకతనన్.

చం. లలితపదప్రయోగ కుశలత్వము నేని యలంకృతిన్ మహా
త్కలనయుఁగాని పాండితియుఁ గావ్యరసప్రసర ప్రసిద్ధియు
గలుగకయీశ్వరార్పణముగా రచియించిన గ్రంథమందుఁ బా
టిలు నెరసుల్ తలంపక పఠింపుడు పండితులార మ్రొక్కెదన్.

ఉ. బమ్మెరపోతరాజకృతభాగవతంబొకటుండ నందు శ్రా
వ్యమ్ముగు కృష్ణగాథభవబంధ విమోచనమంచునెంచి చి
త్తమ్ముగదించిశాస్త్రవిధితప్పక ముప్పదియారునూర్లు ప
ద్యమ్ములవ్యాసమాతృకకు దీటుగసూటిగనాఁటి వ్రాసితిన్.

కం. శ్రీకృష్ణాభ్యుదయంబను
ప్రాకటనామంబునుంచి వరకావ్యంబున్
శ్రీకృష్ణార్పితముగనా
శ్రీకృష్ణునిచరితగూర్తుఁ జిత్తమెలర్పన్.

గీ. వ్రాసియుంచి వత్సరమయ్యె ద్రవ్యలోప
మౌటముద్రణకీయలేనైతి దాని
నంతలో దైవచిత్రమేమందు నేడు
వేలరొక్కములభియించె వింతభంగి.

గీ. ఆంగ్లమునఁ గ్రాసువర్డనుసట్టిపోటి
జరుగు నాన్‌యండిసీయను (R M. D C) చతుర్వాణి
యందు గెల్పొంది యుండి ద్రవ్యంబు గంటి
సచ్చు కిచ్చితి విబుధుల మెచ్చువడసి.

మ. స్థిరసంకల్పుఁడు పండితోత్తముడు కాశీకృష్ణుఁడా పూజ్యు డ
గరి కేల్మోడ్చి సమీక్షఁ జేయుఁ డన సింగారంబుగా నవ్విమే
పరికింపు ల్పనిలేవు నేఁటికవితా ప్రావీణ్యమం దెంగుకీ
సరిపోనట్టి వృథాశ్రమం బని సమీక్షం జేయకే పిమ్మటన్.

గీ. ఐన గొన్నిపద్దెంబుల ననుము విందు
నేటికవితాప్రపంచమో నాఁటివిధమొ
తెలియఁబడు నన్న సంతస మొలికిపారఁ
జదివినాఁడను హారికథన్ జతురఫణితి.

మ. కవివర్యా! యని నన్నుఁ బేర్కొనుచు నీకావ్యంబు వర్ధిల్లు ని
భువి నాసూర్యశశాంకతారకముగా మోదంబు సంధిల్లెనా
శ్రవణానందముఁ జేసినా వని ప్రశంసావాక్యముల్ కంఠమా
ర్దవ మొప్పార వచించి వ్రాసె సదభిప్రాయంబు పత్రంబుపైన్.

గీ. బిరుద మని కమ్మ సంతోషపరవశతను
బుచ్చుకొని మ్రొక్కి దీవనల్ పొంది మఱలి
గృహముఁ జేరియు శ్రీపాదకృష్ణమూర్తిఁ
బండితాఖండలునిఁ గాంచఁ బయనమైతి.

గీ. అతఁడు కవిసార్వభౌముడు వితతయశుడు
ప్రవరుఁ డాస్థానకవి మహాగ్రంథకర్త
తతమహామహోపాధ్యాయధవళకీర్తి
నవ్యజగతివెల్గొందు శ్రీనాథమూర్తి.

గీ. వారి దర్శించినంతఁ బ్రబంధమందుఁ
గొన్నిఘట్టములను బ్రీతి విన్నపిదప
వార లిచ్చినట్టి సదభిప్రాయ పత్రి
మందుకొని మ్రొక్కి దీవెన లందుకొంటి.

గీ. అంత బెజవాడపురమున కరిగి యచట
నచ్చునకు గ్రంథరాజము నిచ్చి దాని
కవసరం బగు నేర్పాటు లన్ని చేసి
మఱలి వచ్చితి రావిపాఁడుపురముఁ జేర.

గీ. ఇంక వచ్చెడునాదాయ మెంతయేని
యన్న పూర్ణాన్నసత్త్రపర్యాప్తిఁ గోరి
పుచ్చుకొందును దోలుదొత్తి నిచ్చు తోడ
భక్తవరులార ప్రోత్సాహ పరుపుఁ డీరు.

క. మాతో నేకీ భావో
పేతుండై మమ్ముఁ జేరెఁ బ్రియముదలిర్పన్
ఖ్యాతుం డీదరవంశో
ద్భూతుఁడు పట్టాభిరామపూజ్యుం డొకటన్.

గీ. కలిమిలేములు కావు లోకములు కావు
మానవుని మానవునిఁ జేయు మహితవిధులు
జడత కోల్పడు సహజవిస్తారభూత
దయయె సన్మార్గ వృత్తి కాదర్శపథము.

గీ. దాంభికుఁడు సేయునాభూరిదానములకుఁ
గన్న నెన్నోమడుంగులు వన్నె గాంచు
హృదయపూర్వకముగఁ దృణ మిచ్చెనేని
ప్రకృతిసిద్ధుఁడు సన్మార్గపరుఁడు కాన.

ఉ. ఈదరవంశ భూతుఁడు మహేశ్వరభక్తుఁడు శిష్టమార్గసం
పాదకుఁ డార్యసన్నుతుఁడు ప్రాజ్ఞుడు రామయమంత్రినందన
డాదరభావ మొప్పు పరమార్థము సార్థము జెందునట్లుగా
సాదరుఁడై వచించె నరజన్మము ధన్యత నందుపద్ధతిన్.

గీ. శ్రీగిరీంద్రముపైని వేంచేసియున్న
మల్లికార్జునస్వామి సంపన్నదేవ
తాయతనమందు నన్నసత్త్రంబు నడుప
వలయు మన మంచుఁ దేనియ లోలుకఁ బలికె.

చ. హృదయము విచ్చి సమ్మదము హెచ్చి యభీష్టము మెచ్చి నానిసే
హృదమున కందె వైచి పరమేశ్వరుసన్నిధి నన్నసత్ర మొ
ప్పిదముగఁ బెట్టనొప్పుకొని పేర్మిని మువ్వుర మేకమై సుధీ
హృదమున మున్గితేలితిమిఁ కాదినసంబు పవిత్ర మంచునన్.

గీ. అన్నపూర్ణాన్నసత్త్రిపర్యాప్తికొఱకుఁ
దోడునీడగ నిల్చి మాత్రోవ ద్రొక్కి
ప్రోత్సహించిన వారి సంపూర్ణభక్తి
ప్రముక్కిదము నుతియింతుము ముదము గదుర.

గీ. యాచనాదైన్యమును దీర నర్హమైన
యోచనలఁ జేతు మెన్నియో తోఁచినటులఁ
దాఁచక వచింతు నెల్ల నిందనుకఁ బోఁట
లెన్ని పడినను ఫలియింప దీప్సితంబు.

క. పంచాంగము గుణియించితి
నంచిత శ్రీశైలచరిత నభివర్ణింతున్
కొంచెము ధనమే చేపడె
నెంచిన లాభమ్ము చెంద దిన్నాళ్ళకునున్.

ఉ. నాయనుజమ్ముకై వడి ననారతమున్ లలిఁ దేల్చుచున్ సదా
సాయముఁ జేయుచుండు బుజుసత్త్వుఁడు సుందరరాము పట్టి నా
రాయణ రాయనామకుఁడు వ్రాసినపొత్తము లచ్చు కిచ్చు నా
ప్యాయన మొంద సత్త్రివిషయమ్ముల యందును సాయమయ్యెడున్.

గీ. జ్ఞాతిసముదాయమందు విఖ్యాత పురుషుఁ
డైనవాడేల సుబ్బరాయాభిధానుఁ
డతులగుణుఁడు వేంకటసుబ్బయాఖ్యుఁడోలి
సత్త్రినిర్వాహణము మేలు సలుపుచుంద్రు.

గీ. అల్లుఁ డగు మత్కమల్లికృష్ణాభిధానుఁ
డెంతయో సాయపడుచుండె నిట్టికృషికి
నట్టిభక్తుల సతము ప్రియంబు గదురఁ
బ్రోచుఁగావుత మైశ్వర్యముసిడి శివుఁడు.

# గురుస్తుతి

శా. శ్రీలక్ష్మీగణనాథషణ్ముఖుల సంసేవించి భావించి వి
ద్యాలాభంబును గంటిఁ గొంటి గవితావ్యామోహదాహంబు నా
ప్రాలేయాచలబాలబాలకుల నా ప్రాపంచు శ్రీకృష్ణలీ
లాలావణ్యకథాసుధారసముఁ గ్రోలంజాలితిన్ లీలమై.

మ. వరకౌండిన్యసగోత్రసంభవుఁడ శ్రీవాడేలవంశార్ణవ
స్ఫురదిందీవరమిత్రపాత్రుఁడ కళాపూర్ణోజ్జ్వలానందస
ద్గురులక్ష్మీగణనాథసేవకుఁడ సాంగోపాంగసిద్ధాంతన
వ్యరహస్యానుగతుండ శేషగిరిరాయాభిఖ్యుఁడై వజ్ఞుఁడన్.

# కవివంశక్రమము

సీ. బమ్మెరాన్వయమహావారాశిచంద్రుఁడౌ
పోతరా జేకాలంబున జనించె
గవిసార్వభౌమవిఖ్యాతపట్టము గొన్న
శ్రీనాథుఁ డేశాఖఁ జెందియుండె
గవికోకిలపదంబుఁ గైకొన్న కంకంటి
పాపరా జేకులప్రథితుఁడయ్యె
సోమయాజిసుకీర్తిఁ బ్రామినతిక్కన్న
యేమహాన్వయమురాణింపఁ జేసె

తే. నాతఁడు ప్రబంధపరమేశుఁ డన్నయశము
గొన్న యెఱ్ఱాప్రగడ యెట్టికొలమువాఁడొ
యట్టియార్వేలవారియం దవతరించి
నాఁడఁ దత్పదములజాడ నడుచువాఁడ.

సీ. సర్వసర్వంసహాచక్రభాగము నేలు
మంత్రాంగకుశలు రమాత్యవరులు
భండనోద్దండప్రకాండపాండితి నొప్పు
మహితాస్త్రధారు లమాత్యవరులు

ప్రతివాదివాదవిపాటనదక్షులై
నిత్యావధాను లమాత్యవరులు
దానకర్ణు లనంగ దశదిశాక్రాంతని
ర్మలయశోధారు లమాత్యవరులు

తే. భక్తిసామ్రాజ్యసుస్థిరపట్టభద్రు
లమలవిఖ్యాతకార్యపర్యాప్తకుశలు
రట్టియార్వేలవంశమం దవతరించి
నాఁడెఁ దత్పదములజాడ నడచువాఁడె.

గీ. ఆరు వేలనియోగిబ్రాహ్మణకులంబు
నందు వాడేలవంశవిఖ్యాతుఁ డయ్యె
వేంకయామాత్యధీమణి వేదవిహిత
ధర్మకర్ముఁడు నిరతాన్నదాత యతఁడు.

సీ. అన్నపూర్ణాదేవి యని వాసి గని క్షుధా
తురులఁ దృప్తులఁ జేయు పరమసాధ్వి
భర్తయే తనకుసర్వస్వంబుగా నెంచి
సత్పతిత్వము గన్న సచ్చరిత్ర
యనుదినంబును భర్త ననుగమించుచు వేద
విహితధర్మము నెరవేర్చుతరుణి
పుట్టినింటికిఁ దాను మెట్టినింటికిఁగూడ
సద్యశంబును గూర్చుచారుసుగుణ

తే. వేంకయామాత్యధీవరు వెలఁది మూర్తి
మాంబ బద్వేటివారలయాడుబిడ్డ
దొడ్డయిల్లాలు గొనములదొంతి యింతి
నామె వర్ణింపనౌనె శేషాహికైన.

క. ఆపుణ్యదంపతులకున్
శ్రీపతిభక్తుండు శిష్టసేవకుఁడు యశః
ప్రాపకుఁ డనువంగాఖ్యుఁడు
చేపడెఁ దనయుండుగాఁగ శ్రీహరి దయచేసె.

గీ. రంగయామాత్యవర్యుఁ డర్భకుఁ డునైన
తరుణమందే దివంబున కరిగెఁ దండ్రి
యార్తి విడిమూర్తమాంబ యేకైకపుత్రుఁ
బెంచుచుండెను విద్యఁ జెప్పించుకొనుచు.

ఉ. వేంకటరంగయాఖ్యుఁడు వివేకవివర్ధనుఁడై సురూపవిఖ్యా
నాంకుఁడు నా రహించెడువయస్సున నుండఁ దదీయమాత వం
శాంకుర మైనసత్సుతున కర్హవిధాన వివాహ మాట కా
శంక వహించి యోజనలు సల్పుచునుండెడు కాలమందునన్.

గీ. వారిస్వగ్రామ మగుతర్లు పాడుపురికిఁ
బరిసరంబున మారికాపురి రహించు
నం దనావృష్టిదోష మత్యధిక మైన
నార్తిఁ జెందిరి ప్రజలు సస్యములు పోయి.

ఉ. ఆపురమందు మేటి యయి యందఱకుం దలలోనినాల్క యై
కాపుర మున్న శ్రీయుతుఁడు గౌరవపాత్రుఁడు సర్వరాజవం
శోపగతుండు "కోనయ" మహాత్ముఁకుఁడై ప్రజలందుచున్న సం
తాపము దీర్ప నెంచి బహుధా పరికించి తలంచి యొప్పుగన్.

ఆ.వె. చెరువుకట్టపైనిఁ జేరి విరటపర్వ
మెవ్వ రేని చదివి రేని భక్తిఁ
గాటకంపుబాధ కడ లంటి వర్షము
కురియు ననెడుశుద్ధి కుదిరి యంత.

ఉ. అట్టిమహాత్ముఁ డెవ్వఁ డని యాత్మఁ దలంచి యొకింత యెద్దియో
యట్టె తళుక్కనన్ హృదయమందు వెలింగిన రంగయాఖ్యుఁడే
యిట్టి విధాల కర్హుఁడని యెంచి రయంబున బండిఁ బంచి దా
నెట్టిన సర్వయత్నములు నేమముగా నొనరించుచుండఁగన్.

గీ. రంగయామాత్యవర్యుఁ డుప్పొంగిపోయి
తల్లి యగుమూర్తమాంబతోఁ దరలి మారి
కాపురిం జేరఁబోయెఁ దద్గ్రామవాసు
లెల్ల నెదురేగి స్వాగత మిచ్చి రెలమి.

ఉ. పండితుఁడున్ వచోనియమపాలుఁడు శీలము నెంచి సర్వదా
యండజవాహనున్ హృదయమందు ధరించినవాఁడు కీర్తి మా
ర్తాండుఁడు రంగయార్యుఁడు బుధప్రమదంబుగఁ జెర్వుగట్టపై
నుండి విరాటపర్వమును నూర్జితభంగిఁ బఠించె నంతయున్.

గీ. పటపటార్భాటములతోడఁ బరఁగె మొగులు
నురుములున్ మెఱుపు లొదవి చెలువునిండ
వర్షధార ప్రవర్తిల్లెఁ గర్షకజన
చిత్తహర్షము చెలరేగి మత్తుకొనియె.

గీ. కోనయామాత్యుఁ డంత సమ్మానితముగ
రంగయార్యుని నిజమందిరమునఁ జేర్చి
యుచితభంగిఁ గానుకలు బహూకరించి
పలికె నెల్లరు విన మోదకలన వెలయ.

గీ. ఇతని వాగ్ధాటి పాండితీ నుతవినయము
నన్ను మెప్పించె నాచిన్నికన్నసుతకుఁ
దగినవరుఁ డితఁడే కాన తప్పకునికి
దాని నిచ్చి పెండిలిఁ జేతు వీని కనుచు.

గీ. ఆరువేలనియోగుల కర్హమైన
లక్ష్యలక్షణసంపన్నలాక్షణికుఁడు
రంగయామాత్యుఁ డౌ హృదయంగమముగఁ
బెండ్లి జేసెదసుతనిచ్చి ప్రీతిమీఱ.

గీ. రిక్తుఁడును బితృహీనుఁడు రెక్కలార్చి
బ్రతుకుకష్టజీవియు నైనరంగయార్యుఁ
డల్లుఁ డయ్యె జమీందారునంతవాని
కద్దిరా కాలమహిమ మహాద్భుతంబు.

ఉ. అంతటఁ గొన్ని నాళ్ళకు మహాత్ముఁడు కోనయమంత్రి ప్రీతి సి
ద్ధాంతులఁ బిల్వఁబంచియు నుదాహృతదివ్యముహూర్తముంచి న
స్వాంతముతోడఁ దాను మన సారఁదలంచిన రంగయార్యునిం
జెంతకుఁ జేరఁగాఁ బిలిచి చేసె వివాహముఁ గూఁతు నిచ్చియున్.

క. కన్యాదాన మొనర్చెను
మాన్యుఁడు కోనయ్య రంగమంత్రికిఁ గృపతో
నన్యోన్యాదర్శమ్మగ
మాన్యులు దంపతులు గంద్రు మమతలు దీరన్.

క. ఏనాఁడామహిళామణి
పూని పదాంభోజమూని పొందెనొ నికటం
బౌనాఁడే సిరిసంపద
లూనెన్ లక్ష్మీకటాక్ష మొయ్యన వెలసెన్.

గీ. రంగధాముని లక్ష్మి శ్రీరంగధాము
లక్ష్మియే యన నొప్పె సలక్షణముగ
భోగభాగ్యములకు వెలిపోక వీఁక
బ్రదుకుచుండి రాదర్శదంపతులు వారు.

చ. కడుపు ఫలించె వారలకుఁ గన్యక యొక్కతె వేంకమాంబ నాఁ
బొడమె నంతరం బొకసుపుత్రుడు వేంకయ పుట్టె నిట్లు వం
గడము సమృద్ధమానటులఁ గల్గిరి ఆర్వురుపుత్రికామణుల్
కొడుకులుముప్వు రర్ధమును గోరికలూర లభించె భోగ్యమై.

గీ. వేంకమయు మూర్తిమాంబయు పిచ్చమయును
రాములమ్మయు నచ్చమ్మ రాచమల్లు
సుబ్బమ యనంగ నార్వురుసుతలు వెంక
యయును వెంకటరామయ్య యనెడుసుతులు.

సీ. రాజమల్లుకుటుంబరమణి యై వేంకమ్మ
రామయమంత్రి కర్ధాంగియయ్యె
బద్వేటివంశశోభనముగ మూర్తెమ్మ
సుబ్బరామామాత్యసుదతి యయ్యెఁ
బాలుట్లశంశముఁ బాలింప నచ్చమ్మ
చెన్నయామాత్యునిఁ జెట్టపట్టె
స్వాగాజులవారిసతి రాములమ్మ శ్రీ
కోనయామాత్యునిఁ చానయయ్యె

వరదరాజులవంశము వాసిగాంచ
నచ్చమాంబ వేంకటనరసనరసార్యుఁబొందె
రాచమల్లుకుటుంబమురమణఁజెంద
సుబ్బమాంబ సుబ్బయమంత్రిసుదతి యయ్యె

గీ. జ్యేష్ఠపుత్రుఁడు వేంకయ చెలఁగి రాచ
మల్లువారిమహాలక్ష్మి మమత గాంచె
రమ్యగుణుఁ డైన వెంకటరామయార్యుఁ
డయ్యె వరదరాజులవారి యల్లుఁ డనఁగ.

శా. ఆపుణ్యాత్ముఁడు రంగయార్యుఁడు సదా యాత్మానుసంధాత యై
చాపల్యంబును మాని వైష్ణవ కథాస్వారస్యచిత్తంబునం
గోపాలప్రభు నాశ్రయించియుఁ దపోగోష్ఠిం బ్రవర్తిల్లు నే
తాపంబుం గొనఁ డెట్టివేళలను జిత్తభ్రాంతి గోరాడిసన్.

సీ. తొలికోడికూతతో మెలఁకువ గని లేచి
కాల్యకృత్యంబుల గడపివైచి
స్నానమొర్చి వస్త్రముగట్టి భక్తితో
నూర్ధ్వపుండ్రంబుల నొప్పుదిద్ది
నిత్యనైమిత్తికనియమముల్ నెరవేర్చి
ప్రార్థనాదికములఁ బరఁగఁ జేసి
జపమాల చేఁబూని సదనము వెల్వడి
పంచపాళి వసించి భక్తి గదుర

గీ. రామనామముఁ జేయుచు రక్తి భక్తి
ముక్తి చెలువొంద గాలముఁ బుచ్చుచుండు
రమ్యగుణశీలి ధీశాలి రంగయార్యుఁ
డవతరించిన శ్రీనాథునట్లు దోఁప.

గీ. అతఁడు పోతనకృతభాగవతము నెల్లఁ
దాళపత్రము లంటి ముత్యాలఁ బోలు
నక్షరమ్ముల లిఖియించె నక్షజముగ
భక్తితాత్పర్య మిట్లుగా పరిఢవిల్లు.

క. నరున కనాయాసముగా
మరణము చేకురు టసాధ్యమార్గముసూవే
పరమేశ్వరుదయచే నది
దొరకొనియెన్ వారి కెంతదొడ్డఫలంబో!

చ. తనకడగొట్టుకూతురికిఁ దద్దయుఁ బెండిలిఁ జేయుచో సుహృ
జ్జనములు బాంధవు లలిసి సద్మము నిండుగనుండఁ బెండ్లియై
చనియెడునాడు మాలికను జయ్యనఁ ద్రిప్పుచుఁ ద్రిప్పుచున్ హరీ
యని తలవాల్చె రంగయ మహాత్ముల మృత్యువురీతి యిట్టిదా.

ఉ. ఆమహనీయుజ్యేష్ఠ సుతుడై జనియించిన వేంకయార్యుఁ డు
ద్దామమనీషి సత్త్వగుణధన్యుఁడు లౌకికకార్యధుర్యుఁ డెం
తోమతిమంతుఁడై మనియె నుర్విని సంతతి లేని లోటు గా
కేమియు నెందుఁ గీడ్వడఁ డహీనకృతాచరణుండు గావునన్.

ఉ. వేంకటరామయార్యుఁడు పవిత్రుఁడు రంగయమంత్రి పుత్రకుం
డంకిలిఁ బెట్టఁ డేక్రియల నన్నరుఁ దండ్రికి భక్తియుక్తుఁడై
సంకటహారిఁ గొల్చుచును సజ్జనపాళిని జేరదీయుచున్
జంకొకయింత లేక యనిశంబు బుధార్చనఁ జేయుచుండెడున్.

గీ. ఆతఁడు నిరతాన్నప్రదాత్రాఖ్య గాంచె
బుధసురార్చనలందు సంపూర్ణుఁ డయ్యె
లౌకికజ్ఞానకుశలుఁడై లలిఁదనర్చె
సాటివారలలో తాన మేటి యయ్యె.

గీ. వరదరాజుల వేంకటనరసయార్తు
తనయ వేంకటలక్ష్మాంబికను వివాహ
మాడి యనుకూలదాంపత్య మనుభవించి
గడపె గార్హస్థ్యధర్మరతుకుఁడు నగుచు.

ఉ. ఆఁకలిగొన్నవారిముఖ మార్తిఘటింపఁగ లేకపోయినన్
రూకలు నప్పు దెచ్చుకొని రూఢిగ నాతురు సేద దీర్చు నెం
దాఁక సమర్థమౌనో యటుదాఁక స్వధర్మము నిర్వహించు నా
తేఁకువ యెట్టిదో పరమధీరున కాతనికే సువేద్యమౌ.

తే. లేద నెడుమాట దా ననలేఁడు నిమిష
మేని వెనుక ముం దాడఁబోఁ డెంత తిథులఁ
దృప్తిపరచినఁ గాని సంతృప్తిఁ గనఁడు
ప్రవరుఁ డాతఁడు వేంకటరామసుకృతి.

సీ. తనపంక్తి నతిథి లే కునికి నొక్కండుగా
భుజియింప నెన్నఁడుఁ బూనుకొనఁడు
సూపశాకాపూపచోష్యాదిపాకము
ల్దిని గాని హృదయసంతృప్తి గనఁడు
వలదన్న వినక భోక్తల కెల్ల దధిఘృతం
బులను వడ్డింపక చలము విడఁడు
భుజియించుతఱి నన్నమో యన్న ముష్టివా
నిని సత్కరింపక తినఁడు మెతుకు

తే. నతిథి కభ్యాగతికిని దివ్యాన్ననీజ
మనఁగ నెన లేని యశమంది నట్టిపుణ్యుఁ
డన్నదాత సుధీమణి యఘరహితుఁడు
రమ్యగుణమూర్తి వేంకటరామసుకృతి.

ఉ. ఛాయవిధాన భర్తకనుసన్నల వేంకటరామయార్యు తే
జ్జాయ యహర్నిశంబులును సాదృశవృత్తిఁ జరించుచుండు నా
ప్యాయితవృత్తి భర్తృపదపంకజముల్ భజియించు నిట్లు సు
శ్రీయుతులైన దంపతులు చెంది రనంతసుఖంబు నుర్విపై.

మ. ఒకనాఁ డామహిళాశిరోమణి శరీరోత్పన్నరోగార్తయై
యెకచో నొత్తిలియుండ నంతవఱకెం దున్నాఁడో సద్బ్రాహ్మణుం
డొకఁ డన్నాతురుఁడై ప్రవేశపడె నట్లో లేచి యాతల్లి సం
కటముం జేసి క్షుధాతురుం దనిపెఁ బండంబోవు నయ్యెంతలోఁ

గీ. ఒకరితర్వాత నొకరుగా నికటమునకు
నాల్గుపర్యాయములు వచ్చినా రతిథులు
వారికిం గూడ వంటలు వడ్డనలును
జేసెనఁట తల్లి యెంతటిస్థిరచరితయొ.

సీ. అన్నపూర్ణాదేవి యని యంద్రు సహానధ
రిత్రి నాఁ బెలుచ వర్ణించుచుంద్రు
పరమపతివ్రతావరశిరోమణి యంద్రు
గృహాలక్ష్మి యనుచుఁ గీర్తించుచుంద్రు
నిరుపేదజనుల నాదరమునఁ గాపాడు
పరమాప్తురా లనిపల్కుచుంద్రు
బంగారుబొమ్మని బాంధవు ల్పొగడెద
రాదర్శగృహిణి యం చభినుతింతు

గీ. రామె నెఱిఁగిన పుణ్యాత్ము లన్నియెడల
జ్ఞాపకము వచ్చినపుడెల్ల సర్వవిధుల
నభినుతింతురు మెచ్చెద రాదరమున
నేఁటిదనుకను మాతర్లుబాటిజనులు.

ఉ. ఇట్టుల పుణ్యదంపతు లహీనయశంబున మన్కి గాంచుచో
గట్టిడిబ్రహ్మ నెన్నడుటఁ గాదని వ్రాసెనొ యేమొ వారికిం
బుట్టరు వంశమండనులు పోవఁదొడంగెను బ్రాయ మెట్టిలో
నెట్టిరి కాలమానమును నేమము దప్పక నోము నోచుచున్.

శా. ఎన్నోనోములు నోచినోచి తుదకెన్నే వ్యర్థమై వాంఛ యు
త్పన్నం బైనది యైన నట్టి గడువం దర్శించి యాత్రాను తె
న్నెన్నో చేసి వృథా వృథాయయి మనోభీష్టంబు సిద్ధింపకే
బన్నంబుల్ పడి రట్లు దంపతులు విభ్రాంతానురాగాత్ములై.

క. అది యేనోమో వ్రతమో
చదునగు భూతలము నలికి సరసాన్నములం
బొదలించి కుడుచుకర్జము
ముద మది మది నేర్చెఁ బుత్రమోహముతోడన్.

క. ఎన్నో శ్రమలం బడ నే
పున్నమునవొ కాని యొక పుత్రిక గలిగెన్
జిన్నారిబాలఁ గన్గొని
కన్నులపండువుగ నెలమికడలిఁ బొదలుచున్.

గీ. ప్రాణముల కెత్తు కెత్తుగా బాలఁ దలఁచి
లలిని చిన్నారిచిలిపచేష్టలకు లలరి
ధన్యతము లైనరీతిఁ దద్దంపతులు ర
హించి పెంచిరి ప్రోజ్జ్వల హీరమట్లు

గీ. ఆమె యేసూవె గుణముల కాటపట్టు
నమలవిద్యాస్రవంతి రాయంచకూన
భాగ్యశాలిని నాపాలిపట్టుగొమ్మ
దేవతామూర్తి సుబ్బమాదేవి తల్లి.

గీ. అంత నైదేండ్లపిదప మాయమ్మగాంచె
ప్రథమపుత్రు మదగ్రజుఁ బ్రథితకీర్తి
నవిరళానందనిరతు నాధ్యాత్మికరతు
మహాతు వేంకటసుబ్బయామాత్యసుకృతి.

గీ. జగతిఁ బ్లవనామవత్సరశ్రావణాసిత
పక్షసప్తమీభార్గవవాసరమున
నాదు నగ్రజుఁడు జనించె మోద మొదవ
పుణ్యమిథునము తలఁపు లి పొంగి పొరలె.

గీ. అంత నాఱేండ్లు నిండు ననంతరమున
నౌనర విశ్వావసునాశ్వయుజబహుళద
శమిని బుధవార మర్థనిశాఘటికల
నన్నుఁ గని యుబ్బిపోయె నాకన్నతల్లి.

గీ. నేను నిర్భాగ్యుఁడను నవనీతహృదయ
తల్లిఁ గోల్పోతి నాచిన్నతనమునందె
మాతృగండముచేఁ బుట్టి మాతఁజంపు
కొంటిఁ పదిమాసములు దాటుకొనకమునుపె.

క. నాతల్లి లక్ష్మమాంబిక
గీతింజనె లక్ష్మిగూడ (శ్రీ)విడి జనకుం
కాతతదుఃఖపయోనిధిఁ
జీతము చెడి పడియెఁ బాలు చెడెఁ గాపురమున్

గీ. అంత మాపితృభగిని యగు నచ్చమాంబ
భర్తపోయిన దాటచే బయలుదేరి
వచ్చి మాతండ్రి నూరార్చి వత్సలతను
దల్లిలేనిపిల్లల మమ్ము దయను బెనిచె.

గీ. ఆమెయే తల్లి యని లోక మరయుదనుకఁ
దలఁచుచుంటిని నేను వత్సలతఁ బెనిచి
తల్లి మఱపించి యక్కునఁ దార్చి కూర్చి
బెనుచుమేనత్త ఋణ మెట్లు చనునో నాకు.

గీ. తల్లిచనుబాలుఁ గ్రోలంగ నుల్లసిల్ల
నేను నోఁచనుగావున నేఁగెఁ దల్లి
బాలపోషణ కర్మము పాలె గాన
యావుపాలచేఁ బెంచె మాయత్త నన్ను

మ. ఒకనాఁ డావు వనమ్ములం దిరుగుచో నున్మత్తయై యత్త తా
నొకతై పోయె సవిత్రిజాడఁ గనఁగా నున్నట్లు గప్పించి తీ
వ్రకరుండుం జరమాద్రిఁ జేరుకొనె ద్రోవల్ డొంకలుం గాన
టికి రాలేక ప్రయాస నందె నట కన్నీరోడ మాయత్తయున్.

గీ. కన్నప్రేమకన్న నెన్నోమడుంగులు
పెంచుచున్నప్రేమ పెద్ద దనుచుఁ
బెద్దలాడుసుద్ది తద్దయు సరిపోయె
నచ్చమాంబ నన్ను నాదువిధిని.

చ. పదఁపడి పేర్మిఁ జేసెను వివాహము వేంకటసుబ్బమాంబికా
సుదతికి నవ్వయాన్వయవిశుద్ధుఁడు వేంకటరామమంత్రికిన్
సదయుడు నాదుతండ్రి గుణసాగరుఁ డల్లుడు భార్యతోడఁ ద
త్సదనముఁ జేరిపోయె సరసప్రతిమానవినూత్నరాగియై.

గీ. అంతఁ గొన్నాళ్ళతర్వాత నగ్రసుతుఁడు
విమలువెంకటసుబ్బయాభిఖ్యునకును
భాగినేయుఁడు బుచ్చయపట్టి శేష
మాంబికను గూర్చి చేసెఁ గల్యాణశుభము.

గీ. నాకుఁ బది జ్యేష్ఠునకుఁ బదునాలుగేండ్లు
పెంచి పెద్దఁజేసినయత్త ప్రియముదీరి
స్వర్గసీమ బ్రవేశించె సాకుభార
మీశ్వరునియందు నిల్పి జీవేచ్ఛ తొలఁగి.

ఆ. వె. ఆడుదిక్కు లేనిపాడుసంసారము
నీదలేకతండ్రి యేడ్చుచుండ
బావనన్నుఁ గూడఁ బయనంబు గావించి
పెనుప నెంచి వెంటగొంచ చనియెను.

చ. జనకునకన్న మిక్కిలిగ సర్వవిధమ్ముల సద్దుముద్దుగాఁ
బెంచెను నన్ను భావుకుడు వేంకటరాయమంత్రి యక్కయున్
జననివిధానఁ బ్రేమమయసాదరభావముతోడఁ గంటికిన్
నునుచుక బెంచె వారికరుణోన్నతి నెన్నఁదరంబె నాకునున్.

సీ. ఏవేళ కేయ్యది కావలె నందునో
యావేళ కది యిచ్చి యలరుచుండ్రు
తినువస్తువులు కోరికొనిన యాక్షణమందె
కొని యిచ్చి నెమ్మది గనుచుందు
ఆటపాటలలోన నలసివచ్చినయంత
శ్రమదీర ముచ్చట లాడుచుందు
ఆవశ్యకంబైన యన్నిపదార్థముల్
సమకూర్చి ప్రేమగా బ్రోవఁ గడంగ్రు

గీ. కన్నకొమరునకన్నను మిన్నయనుచు
నెన్నికొని నన్నుఁ బెంత్రు సంపన్నభంగి
కొఱతపా టిందునున్ లేక పాటవముగఁ
బెరుగుచుంటిని భావుకవరగృహమున.

గీ. అచట నిఱువదియేండ్లప్రాయమ్ము వఱకు
పెరిగినాఁడ విద్యాబుద్ధు లరసినాఁడ
శిక్షితుఁడనై ప్రవేశపరీక్షవఱకుఁ
జదివితిని పూర్ణవిద్య నిశ్చలతఁ గాంచి.

శా. నాయీదేహములోనిప్రత్యణువునన్ నాబావసౌహార్దమే
స్థాయిం గాంచియు గోచరించెడిని విజ్ఞానాడు లేవైన వా
లాయ మ్మయ్యెవి నాదుసోదరదయాలభ్యప్రభావంబె యా
నా ధన్యత్వము వారిభిక్ష యిదియే నానిశ్చయం బెప్పుడున్.

శా. నాపైఁ జిందినవారిప్రేమరస మీనాఁడైన సాదృశ్యమా
లేపంబై తడియారకున్నయది పక్ష్మిబాష్పముల్ మాపుచోఁ
గాపై ప్రాపకమై తనర్చునది శంకాంతంకముల్ దీర్చుచున్
గాపాడున్ నను సార్వకాలమును భాగ్యశ్రీ కటాక్షంబుగన్.

ఆ. వె. దిక్కుమొక్కు లేనిదీనుఁడనై యుండ
నన్నుఁ జేరఁ దీసి కన్నవాని
కన్నఁ బ్రేమ నెంచి కాపాడుమాన్యుల
వారిఋణముఁ దీర్ప వశమె నాకు.

క. తమయేకైకసుపుత్రిక
సమరసతను నిచ్చి పెండ్లిసలిపిరి నాకున్
సుమనస్కులు నాధ్యాత్మిక
గమనము గమకింప శుద్ధకర్ములు వారల్.

సీ. ఒకరితర్వాత నొకరు సాయుజ్యమునకు
సతిపతులు చేరుకొనినంత ధృతి దొఱంగి
నేను నాయున్నచెంతవసింప నెంచి
చేరితిని రావిపాడ్రమ్యసీమ కపుడు.

ఉ. గ్రామణివృత్తిచే బ్రదుకుఁ గాంచి స్వధర్మము నెంచి లౌకిక
గ్రామణియై రహించె నుతిఁ గాంచెను సాటికులీనులందున
న్నేమము దప్పఁబోక కరణీయకృతంబులు మీఱలేక యు
ద్దామవిధానము న్విడక తాల్చె మదగ్రజుఁ డట్టివృత్తినిన్.

క. పైవారియుత్తరువులను
గావలసినరైతుకోటికార్యవితతులున్
ధీవరుఁడై సరిఁ జేయుచు
జీవఁ దలిర్పంగ వృత్తి చేకొనె నతడున్.

ఉ. అతఁడు సధర్ముఁ డంచుఁ గొని యాడుదురెల్లరు వృత్తివిద్యయం
దస్ఖలితకార్యధుర్యుఁ డనియందురు పైనధికారు లెందునే
కౌతుకులు సేనిచందములఁ గూర్చుచు నేర్చినవృత్తియందు స
మ్మతుఁ డగు నెల్లవారలకు మాన్యుఁడు వేంకటసుబ్బయాఖ్యుఁడున్

ఉ. నేనును వైద్యవృత్తిగని నిచ్చలు సర్వులు మెచ్చు నట్లు స
మ్మానితభంగిఁ జేసెదను మానసమున్ మసిపూత బూయుస
జ్ఞానముఁ జేరనీను విరసప్రతిఘాతముఁ జేయ లేను దు
ర్మానముఁ జెందఁ బోను బరమప్రతికూలురయందు నేనియున్.

సీ. అగ్రజుఁడు నాకు నేను నాయన్నగారి
కండగానుండి యన్యోన్య మహరహంబు
నిత్యవిధులఁ బ్రవర్తిలి నియతి గదురఁ
గడుపుచుంటిమి మనములొక్కటిగఁ గలిసి.

చ. పొరుపులు లేవు మాకుఁ దలపోఁతల రోఁతలు నేకరూపమై
పరిణతి నందు నే నతనిప్రాపును గందు నతండు మన్మన
స్సరణిని జెందుఁ జిందు సరసమ్ముల దేహము లన్య మయ్యునాం
తరములు రెండు నొక్కటయి ధాత్రిఁ జరింతు మనూనసఖ్యతన్

సీ. తాతతండ్రులబుద్ధులు దారసిల్లె
ననఁగమాసహోదరులకు నన్నదాన
మన్న బెనుకూర్మి చెన్నారు మనములందు
నల్లె సాగించెదము నిత్యయాత్ర జగతి.

సీ. మామమాదునిల్లాండ్రు సముచితముగ
దోహద మొనర్చుచుంద్రు మా యూహలకును
విసుగుకసుకులు లేక యెవ్వేళనేని
యతిథిపూజ లొనర్చెద రాదరమున.

చ. కలిగినయంతలో వెలితి కన్పడకుండెడునట్లు సర్వదా
జలుపుచునుందు మేమతిథిసజ్జనపూజల నోజమై మనః
ఫలకములందఁ జెంది పరిపక్వత నందినఁ గాని యట్టియూ
హలు ఫలమంద లే దభినయంబు విడంబను జెంబు- [illegible] లెడున్.

గీ. అగ్రజున కేకపుత్రికయై జనించె
సుందరీమణి వేంకటసుబ్బమాంబ
మతుకుమల్లిసదన్వయమహితకృష్ణ
రాయునకు ధర్మపత్నియై రమణమీఱె.

గీ. ఆమె కొకపుత్రికయు నొక్కయాత్మజుఁడును
గలరు చిన్నారివారు మాకనుల నమృత
ధార లొలికించుచుంద్రు ముద్దార మమ్ముఁ
జేయుచుందురు మురిపెముల్ సేయుచుంద్రు.

క. ఇదె మావంశావళి స
మ్ముదమున వ్రాసితి యథార్థముల నన్నింటన్
సదయుఁడు శ్రీపతి వంశా
భ్యుదయముఁ జేకూర్పఁగాత మొప్పెసలారన్.



# విషయసూచిక

## ప్రథమాశ్వాసము


| | | |
|---|---|---|
| 1. | ఇష్టదేవతా ప్రార్థనాదికము | 1 |
| 2. | కథా ప్రారంభము | 2 |
| 3. | శ్రీకృష్ణ జననము | 10 |
| 4. | వసుదేవుఁడు శ్రీకృష్ణుని వ్రేపల్లెకుఁ జేర్చుట | 14 |
| 5. | నందవసుదేవుల సంభాషణము | 18 |
| 6. | వ్రేపల్లెలోని వేడుకలు | 37 |
| 7. | పూతనాసంహారము | 44 |
| 8. | శకటాసురవధ | 54 |
| 9. | తృణాసుర సంహారము | 59 |
| 10. | శ్రీకృష్ణ మహిమలు | 63 |
| 11. | గోపికలు యశోదకు కృష్ణుని దుడుకుపను లెఱింగించుట | 73 |
| 12. | వత్సాసురవధ | 102 |
| 13. | బకాసురవధ | 104 |
| 14. | గోపాలకులతో కృష్ణుని క్రీడలు | 105 |
| 15. | అఘాసురవధ | 107 |
| 16. | కృష్ణుడు గోపాలురతో చలిదులారగించుట | 112 |
| 17. | బ్రహ్మ గోగోపకులను దాచుట | 115 |
| 18. | కృష్ణుడు బ్రహ్మకు గర్వభంగము చేయుట | 116 |
| 19. | ధేనుకాసుర వధాఘట్టము | 129 |
| 20. | కాళీయమర్దనము | 133 |
| 21. | ప్రలంబాసురవధ | 154 |
| 22. | గోపికా వస్త్రాపహరణము | 160 |
| 23. | ఋషిపత్నులు శ్రీకృష్ణునర్చించుట | 170 |
| 24. | గోవర్ధన పర్వతోద్ధరణము | 174 |
| 25. | నందుని వరుణలోక దర్శనము | 191 |
| 26. | గోపికలు శ్రీకృష్ణుని దర్శింపవచ్చుట | 195 |
| 27. | గోపికాగీతలు | 221 |
| 28. | రాసక్రీడలు | 232 |
| 29. | జలక్రీడాభివర్ణనము | 238 |

## ద్వితీయాశ్వాసము


| | | |
|---|---|---|
| 30. | శంఖచూడవధ | 245 |
| 31. | గోపికావిరహము | 247 |
| 32. | వృషభాసురవధ | 251 |
| 33. | నారదుఁడు కంసునితో సంభాషించుట | 254 |
| 34. | కంసుని జన్మరహస్యము | 258 |
| 35. | అక్రూరసందేశము | 270 |
| 36. | నారదాగమన ఘట్టము | 276 |
| 37. | వ్యోమాసుర వధాఘట్టము | 281 |
| 38. | అక్రూర సందేశఘట్టము | 283 |
| 39. | అక్రూరుఁడు యమునాజలంబుల మునింగి బలరామకృష్ణుల గాంచుట | 302 |
| 40. | కృష్ణాదులు మధుర జేరుట | 304 |
| 41. | రామకృష్ణులు మధురలో విహరించుట | 308 |
| 42. | రజక వధాఘట్టము | 313 |
| 43 | శ్రీకృష్ణుఁడు వాయకు ననుగ్రహించుట | 315 |
| 44. | కుబ్జాపరిపాలనము | 317 |


## తృతీయాశ్వాసము


| | | |
|---|---|---|
| 45. | శ్రీకృష్ణుఁడు ధనుశ్శాలలో నాయుధములను విరచుట | 321 |
| 46. | కంసుఁడు మృత్యుభీతి నందుట | 323 |
| 47. | శ్రీకృష్ణుఁడు కువలయాపీడమును వధించుట | 326 |
| 48. | బలరామకృష్ణులచే ముష్టికచాణూరులు చచ్చుట | 341 |
| 49. | కంసునిమరణము | 346 |
| 50. | శ్రీకృష్ణుఁడు కంసుని వధించుట | 354 |
| 51. | ఉగ్రసేనబంధవిముక్తి | 365 |
| 52. | శ్రీకృష్ణుఁడుగ్రసేనునికిఁ బట్టంబు గట్టుట | 366 |
| 53. | సాందీపమునికడరామకృష్ణులు విద్యనభ్యసించుట | 370 |
| 54. | రామకృష్ణులు యమలోకమునుండి గురుపుత్రుని దెచ్చుట | 375 |


## చతుర్థాశ్వాసము


| | | |
|---|---|---|
| 55. | శ్రీకృష్ణుఁడుద్ధవుని బృందావనమునకు బంపుట | 379 |
| 56. | భ్రమరగీతలు | 382 |
| 57. | ఉద్ధవుడు గోపికలకు శ్రీకృష్ణ సందేశము దెల్పుట | 387 |
| 58. | గోపికలుద్ధవునికి శ్రీకృష్ణలీలలెరింగించుట | 390 |
| 59. | శ్రీకృష్ణుఁడు కుబ్జామందిరమున కరుగుట | 394 |
| 60. | శ్రీకృష్ణుఁడక్రూర గృహంబున కరుగుట | 401 |

| | | |
|---|---|---|
| 61. | శ్రీకృష్ణు డక్రూరుని హస్తినకనుపుట | 404 |
| 62. | అక్రూరుఁడు ధృతరాష్ట్రునితో మాట్లాడుట | 413 |
| 63. | జరాసంధుండు శ్రీకృష్ణునిపై దండెత్తుట | 423 |
| 64. | జరాసంధుండు పరాజితుఁ డగుట | 427 |
| 65. | జరాసంధుని దండయాత్రాపరంపర | 436 |
| 66. | కాలయవనవినాశము | 438 |
| 67. | కాలవనుడు కృష్ణుని వెంబడించుట | 440 |
| 68. | ముచికుందుని వృత్తాంతము | 444 |
| 69. | కాలయవన జన్మవృత్తాంతము | 448 |
| 70. | ముచికుందుఁడు హరినిమోక్షమర్థించుట | 449 |
| 71. | జరాసంధుఁడు ప్రవర్షణగిరిని దహించుట | 451 |


పంచమాశ్వాసము


| | | |
|---|---|---|
| 72. | శ్రీకృష్ణునియాలస్యమునకు రుక్మిణి పరితపించుట | 477 |
| 73. | చెలికత్తెలు రుక్మిణి నోదార్చుట | 479 |
| 74. | అగ్నిద్యోతనుఁడు రుక్మిణికిఁ గృష్ణునిరాక నెఱింగించుట | 483 |
| 75. | రుక్మిణి కాత్యాయనీ మందిరమున కేగుట | 489 |
| 76. | రుక్మిణి కృష్ణునితో యుద్ధమొనర్చి భంగపడుట | 499 |
| 77. | బలరాముడు రుక్మిణి నోదార్చుట | 503 |
| 78. | రుక్మిణీ కృష్ణుల వివాహము | 505 |



గ్రంథకర్త:
వాడేల వేంకట శేషగిరిరావు

ఓమ్

# శ్రీ కృష్ణాభ్యుదయము

## ప్రథమాశ్వాసము

—* ఇష్టదేవతా ప్రార్థనాదికము *—

శ్రీలావణ్య సుధా చకోరము, వ్రజస్త్రీచిత్తపంకేజ పా
ళీలోలాళివరంబు, రమ్యముగళీ లీలాసమాకృష్ట లో
కాలోకస్థిత జీవ సంచయము, శ్రీ కైవల్యబంధంబు, గో
పాల బ్రహ్మము మన్మనస్థితము, సంప్రార్థింతు శుద్ధుండనై.

ఉ. వెన్నలు ముచ్చిలించి, యలివేణులకున్ భవబంధ మోచనం
బున్నిమిషంబులోఁ గలుగఁ బ్రోచిన చక్కని నల్లనయ్య! ని
న్నెన్నఁదరంబె మాదృశుల కింద్రవిరించి ముఖామరాళి యై
న న్నిను నెంచఁ జాలరనినన్ విషయైక నివిష్టు లేముకా.

శా. నిన్నుం బార్థునియట్లు కొల్వఁగలనే! నీరేజపత్రాక్షా! కా
దన్నన్ వ్యాసమహర్షివోలె భవదీయాఖ్యానముల్ వల్కనై
న న్నేర్వంగల నంచుఁ జెప్పుదునె యత్నం బిద్ది యేలన్నఁ బో
తన్నంబోలి తరింపఁగోరెసుమి! దేవా! నన్ను మన్నింపుమీ!

మ. అతఁడా వ్యాసకృతంబు భాగవత కావ్యంబున్ సమగ్రంబుగా -
ధృతి మీఱం దెలిఁగించె దాఁటె భవవార్ధిన్ నేను నాలీలఁ ద
త్కృతిలోనన్ యదువంశవర్ధనుఁడవై యింపొందు నీగాథ నం
చితరీతిన్ రచియింతు నీకరుణ లోఁ జింతించి గోపాలకా!

క. అల దశమస్కంధములో
పలిగాథ మదీయ శక్తి వంచన లేకే
తెలుఁగున రచించెదను యదు
కులతిలకా! తప్పు లెన్నకుము నాయెడలన్.

చ. అని హరి సన్నుతించి ముదమారఁగ నాతని దివ్యగాథ నే
ర్చినకొలఁదిన్ రచించి కృతకృత్యుఁడనై భవబంధ మోచనం
బును గనువాఁడ నంచుఁ దలపోసి సమస్త సుపర్వమూర్తి యా
తని నుతిచేతనే సకల దైవత సన్నుతిఁ గాఁదగు నంచు నెంచుచున్.

క. వ్యాసాదిక కవివర్యుల భాసురభక్తిన్ భజించి వాణీకరుణో
ల్లాసమునన్ శ్రీకృష్ణకథాసంగ్రహ మేను గూర్పఁ దలకొంటి నిటుల్.

తే.గీ. తన చరిత్రము తన కంకితముగఁ దానె
పలుకుకొనుఁగాక నానోట జలజనేత్రుఁ
డింక నెఱసులు గలవేని యెంచి యపహ
సింపకుఁడు కవులార! మన్నింపుఁడు నను.

వ. అని శ్రీకృష్ణాంకితంబుగా నాయొనర్పంబూనిన శ్రీకృష్ణాభ్యుదయంబను
కావ్యంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

—* క థా ప్రా రం భ ము *—

మ. అవని దృష్ట సురాలయం బనఁగ నత్యైశ్వర్యసంవిస్తమై
తవు నింపౌమధురాపురం బనియ స్వస్థానంబుగా నెంచి భూ
ధవచంద్రుం డొకఁ డుగ్రసేనుఁ డను నాతం డేలు దేవేంద్రవై
భవ మొప్పారఁగ శత్రుభీకరుఁడుగా వాసిం బ్రకాశించుచున్.

మ. తనకుం బుత్రిక లేని హేతువున నా ధాత్రీశుఁ డన్నుం గ
మ్మని బిడ్డం గొని, కూర్మి పుత్రికని యోఁ జూపించఁగా [illegible]
వ్వనితా రత్నము దేవకీప్రథిత సర్వశ్లాఘాలస్తుత్యయై
తనరెన్ రూపగుణసంపదన్ స్మరనిశాత ప్రాణదాస్త్రంబనన్.

తే. గీ. ఉగ్రసేనుని నందనుం డురుభుజాబల
భీత సురపతి కంసుండు విశ్వకంట
కప్రవృత్తిఁ జెలంగియుఁ గడుఁ బ్రియమున
దేవకిన్ మన్నన యొనర్చు భావమందు.

వ. ఇట్టులుండ నుగ్రసేనుండు సంప్రాప్తయౌవనయైన దేవకిం గాంచి
గుణోత్తరుండగు వసుదేవున కీయం దలంచి బాంధవామోదంబున
మహావైభవంబుగాఁ బరిణయోత్సవంబు నడపిన యనంతరంబ.

మ. అనఁగుం జెల్లెలిన్ మఱందిని ముదంబత్యంతమై యొప్ప స్యం
దన మెక్కించి మఱందియింటికి మహోత్సాహంబునం గొంచుఁ బో
యిన కంసుండు వినంగ మార్గమునయం దీరీతి విన్పించె 'నో
యి! నరేంద్రాత్మజ! భావికాలగతి నూహింపంగ లేవయ్యయో!

తే.గీ. ఏ యువిద నత్తవారింటికిట్లు నీవు
పంపఁ బూనితొ యాకూర్మిభగిని కింకఁ
గలుగు తనయుఁ డెనిమిదవ కాన్పువాఁడు
నిను వధించును టి మ్మింత నిక్కువంబు'.

ఉ. ఆనుడు లాలకించిన నరాధిప సూనుఁడు విహ్వలించి డెం
దానను మృత్యుభీతి కడునర్తనముం బొనరింప సోదరిన్
వే నిశితాసిఁ ద్రుంచునెడ నిక్కముగా మృతి తప్పునంచు లో
నూనిన నిశ్చయంబున మహోగ్రత దేవకిఁ జంపఁ బూనినన్.

క. కని వసుదేవుఁడు చింతన్
మునిఁగియు మదిఁ జిక్కఁబట్టి బూపకుమారుం
గని పల్కెనిట్లు 'బావా!
చను నే నీ కెందు నిట్టి సాహసమూనన్.

ఉ. పెంచితి పెద్దఁజేసితివి ప్రేముడితో నొక యింటిదానిఁ గా
వించితి వీలతాంగి నెదొ వించు విచారణ ఖూఁగి యింతలో
నంచితశీల నీమె నకటా! వితగా వధియింపఁ జూతువే?
పెంచిన కూర్మియెల్లఁ బృథివీవర! యింతటిలో నశించెనే ?

మ. త్రిజగద్భీకర విక్రమంబున సముద్దీపించు నీతో సుర
వ్రజముం బోర సముత్సహింపదుగదా! బావా! యెదోపల్కుచే
తఁ జిరస్నేహము విస్మరించి యిటు కాంతా హత్యకుం బూనుకొ
న్న జనుల్ నవ్వరె? భీరువై తివని; దైన్యం బిద్ది నీకర్హమే?

శా. ఎన్నండో సుతుఁ డుద్భవించునఁట! వాఁ డెంతే బలాఢ్యుండునై
నిన్నుం జంపెడునంట! నమ్మఁదగునే? నీకిట్టి చిత్రోక్తుల
న్నన్నా! యట్లగుఁ గాక, బంధులముగామా? నీవినాశంబు మే
ము నిక్కంబుగఁ గోరువారమొకొ! సద్బుద్ధిన్ విలోకింపుమా!

తే. పుట్టినట్టి సుతులఁ బుట్టినప్పుడ తెచ్చి
యిత్తునీకు వారి నీవు చంపి
భయముఁ బాపికొమ్ము పాపివిగాకు మ
న్యాయ్యముగనుఁ గొంత హాత్యసేసి'

వ. ఇట్లు వసుదేవుండు పలుకుటయుఁ గంసుం డిట్లనిరా.

శా. ఏమీ! నన్ను వధింపఁగాఁ బృథివిపై నిక్కాంతగర్భంబునఁ
దామాయావి జనించునంట! యదియట్లౌఁగా కటం చేను నా
నామోదించి సహింపనౌనఁట! యుపన్యాసాలు చాలించు నీ
సామంబుల్, పసివారినిచ్చెదవా! పెల్చన్ మిత్తిఁ దప్పింతువ!

వ. అని కంసుండు నిరాకరించి కడునత్యాచారముం జేయఁ బో
యిన యంతన్ వసుదేవుఁడిట్లనుఁ 'కృపాహీనుండవై ముద్దు
ల్లినిఁ దున్మాడిన యంతమాత్రమున నేలీలన్ విధిన్ దాఁటన
విను నీప్రాప్తవిధాన మట్లయినఁ దప్పింపంగ నున్నాధమ!

శా. బావా! శాంతివహింపఁ జెల్లెడిని; ప్రాప్తంబటిదే యైనచో
నీ వేయత్నముఁ జేసినన్ విఫలమే; నిర్మాత యేనాఁటి కే
యేవృత్తంబుల సంఘటించు నవి రానేవచ్చు వాలాయమై;
భావోన్మాదముఁ జెందఁ దీఱవు; వృథావైషమ్య మేల ?

తే.గీ. గాలిమాటలఁగలఁగి, యకటా! యనుంగుఁ
జెల్లెలిని జంప నెట్లు నీచిత్త మొప్పె?
బావ! వినవయ్య! నామాట; పడఁతిఁ జంపి
పాపమున్ మూటఁగట్టుకో వలదుసుమ్మ'

వ. అని కడు దీనుడై పలుకు నానకదుందుభి దీనవాక్యముల్
విని, విని, కంసుఁడత్తఱిని విస్మితుడైన యనుంగుసోదరిన్
గని నెఱిచేఁబిడి, మదిఁ గాక శమింపక పల్కెనిట్లు 'నీ
వనిన విధాన నర్భకుల నర్పణ సేయుదొ లేదొ మానుమున్

వ. అని దేవకీదేవిని విడిచిపుచ్చె

గీ. విష్ణుమాయావృతుండయి విడచివైచెఁ
జేతజిక్కిన కారణభూతనటులఁ
గొనిచో, దుష్టుఁడైన రక్కసున కేమి?
కరుణ గలుగుట యేమి? యేమఱుట యేమి?

వ. అట్లు హత్యాప్రయత్నంబుడిగియుఁ గంసుండు

చం. మిము నెటు నమ్మవచ్చు నని మేషము కంటికి రెప్పరీతి, నే
మముఁ గొని కాచియుండుటలు మాకగునా? తఱితీపి మాటలన్
సమయముఁ దప్పఁగొట్టి, సడిఁ జప్పుడుఁ జేయక పుత్ర రక్షకై
భ్రమఁ గొని, యన్యభూములకుఁ బాఱిన నేమి యొనర్ప నాకగున్.

గీ. గోటఁ దీరెడు పనులకు గొడ్డలియొకో!
ప్రాణగొడ్డంపుఁ బనిదీరు పద్ధతులను
సాధ్యమైనంత త్వరలోనఁ జలుపవలయు
నేమరికఁ జెందరాదు సహించి నరుఁడు.

చం. అని తెగనాడి, ముందటిప్రయాణము నాపి శతాంగమున్ మర
ల్చెను మధురాపురంబునకుఁ జెచ్చెర వారిని బందికానలో
నునిచి యొకింత నెమ్మదిని నూఱటఁగాంచె, దదీయవృత్తముఁ
విని, బలుఁ డుగ్రసేనుఁడు తపించుచుఁ బుత్రకుఁ బిల్వనంపినన్.

ఉ. కనలుచు నుగ్రమూర్తియయి, కంసనృశంసుఁడు 'వీరికేల నా
నుల ప్రసక్తి; ప్రాఁజదువు పాటలు పాడెద; రెంత జెప్పినన్
వినరు; వివేకముం గనరు; వీరల ద్రోవఁ జనంగఁ గుక్కతో
కను గొని గంగ యాడినటు గాఁగల వేను దలంచు కార్యముల్'

వ. ఇట్లు చింతించి యతండు

చం. మనమునఁ జింత లేక, యనుమానము లేక, స్వబంధువర్గమా
నను నభిమానగౌరవము లన్నియుఁ దీఱ, దురాగ్రహంబుచే
జనకుని, మాతృదేవతను, జయ్యన నొక్క గృహాంతరంబునం
దునిచి స్వతంత్రుఁడై తలఁపు లొప్పఁగ రాజ్యము నేలెఁ గ్రూరతన్.

మ. వెలిలో శోధకులైన రక్షకభటశ్రేణిన్ నియోగించి, వే
త్తఱి నే సాధక బాధకమ్ము లెటు సందర్భించునో వాని స

త్వరమే తెల్పుకొనంగ నాజ్ఞలిడి చింతల్బాసి విశ్రాంతిగా
ధరణీచక్రము నేలె గంసుఁడు మహోద్దామ ప్రకారంబునన్.

ఉ. వాని ప్రభుత్వమందు హరిభక్తులు, సాధులు, ముక్తసంగులున్
మానులు, బ్రాహ్మణోత్తములు, మందునకైనను లేరుగాని య
జ్ఞానిశిరోమణుల్ పరమజారులు చోరులుఁ గ్రూరవంచకుల్
స్థానికులైరి; దుష్టబలసంపద లగ్గల మయ్యె నంతటన్.

గీ. విష్ణువిద్వేషు లగువారి వేడ్కఁ గూడి
యడ్డు మాఁకయు లేక యిచ్ఛానుగతిని
బఱఁగి పంచాననసమగ్రబాహుశక్తి
నెనసి తా లోకములను శాసింపఁదొడఁగె.

శా. కారాగార నివాసమే స్థిరము కాఁగా దేవకీదేవి సం
సారానందముఁ గాంచెఁ దత్ఫలితసంప్రాప్త గర్భమ్ములతో
నాఁకిరత్నము గ్రుంగిపోయె; 'నకటా నాకేల యీప్రాప్తి, క
ద్వారం గన్నకుమారు శాత్రవునకర్పింపఁగ' నం చేడ్చియున్.

గీ. విధివిధాన మట్లౌటచే వెతలఁ దీఱి
తమకు రానున్న కష్టసందర్భములను
ధైర్యమున నెదుర్కొనుటకై తాల్మినంది
దంపతులు వేచియుండి రత్తఱిణమునకు.

మ. నవమాసంబులు నిండుచోఁ బ్రసవమై నారీలలామంబు తా
నవలోకించెఁ గుమారు; నేడ్చునెడ నయ్యార్భాటముల్ సవరి
వివరింపం జని కంసునకుఁ దెలుపఁ బృథ్వీభర్త విచ్చేసి య
ధ్యవసాయంబునఁ ద్రుంచె బాలుని మనోవైషమ్యము ల్దీఱఁగన్.

గీ. దేవకీవసుదేవు లీ స్థితినిఁజూచి
కుప్పగూలిరి శోకప్రకోపమునను;
తెప్పిఱిలి కొంతవడికి నాముప్పు తప్ప
దనుచు నూఱటఁజెంది రయ్యవసరమున.

గీ. ఆఱుకాన్పులీరీతి నన్యాయమయ్యె
మగుడ నేడవగర్భము మగుడ కొ వె

తెలిసి 'శ్రీహరీ! యేల యీదిక్కుమాలు
పాడుసంతాన'మని దుఃఖ పడె లతాంగి.

ఉ. చేతులనెత్తి మ్రొక్కి, తనచిత్తము శ్రీహరియందుఁ జేర్చి 'యో
పూతచరిత్ర! దీనపరిపోషణ! పాలయ, రక్షమాంప్రభో!
భీతను, దుష్టదానవవిభీతకరాళముఖాంతర స్థితా
తీత విషాదమగ్న నతిదీనను న్యూనత నొంది వేడెదన్.

మ. హృదయస్థుండవు నాచు, స్థాయిఁగని తండ్రీ! యెట్లులున్నావొ! నా
యది యుబ్బూఁతల నూఁగు మానసము కాదా? డోలికాసామ్యమై
యిదమిత్థంబని తెల్పరాని, కడ కూహింపన్ సమర్థంబు కా
నిమరాప ప్రతిఘాతయాతన లయో! నీకేల? గోపాలకా!

ఉ. ఇప్పటికారుమార్లు సహియించితి; లోకమునందు నెవ్వరే
నెప్పుడుఁ జెందియుండని, భరింపని యాతన; గన్నవారినే
యప్పన జేసినాను మనసారనరాంతకు కత్తివాతకున్
జెప్పనదేమి? భూతమను, జెడ్డపిశాచిని నేను మాధవా!

గీ. పురిటిలోఁ బసికూనలఁ బుట్టినపుడె
బొడ్డు గోయకపూర్వమే బుద్ధిపూర్వ
కముగ నెత్తి యీపాడు కరముల మృత్యు
దేవికందించినాను సందేహపడక.

క. ఈనినపులినో! పామనొ
నేనగుదును గాని కన్ననిసువులఁ బాయన్
మానవకామిని యెవ్వత
పూనుకొనుం బ్రాణమోర్చి భూమిస్థలిలోన్.

శా. దేవా! యింకభరింపలే నుబుసు; నీదే భార మీకాన్పు నే
త్రోవన్ దీర్చెదొ? యేదియెట్లయిన, నాదుర్మార్గుఁడే వచ్చి నా
జీవంబుల్ బలివెట్టనెంచినసరే; చేజేత నాపాప న
ద్యోవారాశిని ద్రోయఁ ద్రోయ'నని యెంతో ఖిన్నయై యేడ్చుచున్

గీ. సొమ్మసిలిపడిపోయిన సుదతిగర్భ
మందు శేషాంశమై వృద్ధిపొందు పిండ

మొదలి వ్రేపల్లె వసుదేవుగృహిణి రోహి-
ణీరమణి గర్భమునఁ జొచ్చె శౌరికరుణ.

తే.గీ. అంత దేవకిఁగాంచి కంసావనీశ
దాస జనములు మిత్రుల సంతసముతోడ
బర్విడి నృపాలుతోడ నావార్తఁ జెప్ప
నమ్మఁజాల కతండు రయమ్మునఁ జని.

క. చెఱసాలకరిగి యటఁదన
పరిచారకులాడినట్టి వాక్యము నిజమై
యెఱిఁగి మహాశ్చర్యముతో
మఱలెన్ గృహమునకు మనసు మల్లడిగొనఁగన్.

తే.గీ. అందు బృందావనమ్మున నందునింట
నున్న రోహిణి వసుదేవునువిద యోగ
మాయ వైచిత్ర్యమున రెండుమాసములకె
నాథు తేజంబు దాల్చి నందనునిఁగనియె.

తే.గీ. యాదవులు వారు విష్ణుమాయా విమోహి
తాత్ములై రోహిణీసూను సహితులేశ్వ
రాంశజాతుని బలరాముఁ డనెడు సార్థ
కాఖ్యయిడి ప్రీతి గడుర సమాదరింత్రు.

వ. అంతమఱలఁ గొంతకాలంబునకు దేవకి గర్భవతియై [illegible]
గడచిన

సీ. దేవకీ దేవిగర్భస్థుఁడై వెలసెడు
దేవదేవు లోకార్థలీలావతారు
నెఱిఁగి ధాత్రాది సురవర్యులెల్ల వచ్చి
ప్రస్తుతించిరి దివ్యవాక్ఫణితి నిట్లు.

శా. వందే నీలతమాలకోమలతనుం, వందే కృపాసాగరం
వందేపూర్ణశశాంకచారువదనం, వందేరమానాయకం
వందే సుందరకుంద పుష్పరదనం, వందేజగన్నాయకం
వందే దివ్యకిరీట మోహనరుచివ్యాలీఢ.శోభాననం.

గీ. శ్యామసుందర రుచిమోహనా! సరోజ
దళవిశాల సులోచనా! దళితదాన
వవిభవవిచారణా! మఘువప్రముఖజ
జనపరిపాలనా! నారాయణా! నమోస్తు.

శా. వందే విష్ణుమనంత మవ్యయవిభుం వందే విరాడ్రూపిణం
వందే నీరజలోచనం రిపుహరం వందే త్రిలోకేశ్వరం
వందే శేషఫణీంద్ర భోగశయనం వందే కుమారప్రియం
వందే కౌస్తుభ దివ్యలాంఛన ధరం వందే గురుం మాధవం.

క. ఇందీవర సుశ్యామం
వందారు జనానురక్త వైభవధామం
బృందారకరిపు భీమం
వందే త్రైలోకసుజన వందితచరణం.

సీ. దేవహితార్థమై యనుమతించి, జగంబులు మెచ్చ దేవకీ
దేవికిఁబుణ్యమూర్తి వసుదేవునకుం దనయుండ వౌదువా
దేవ! మహానుభావ! పరిదేవనలందెడు శిష్టవర్యులం
బ్రోవ దలంచినావ! పరిపూర్ణ కృపానిధి వౌచు మాధవా!

గీ. అనుచు సురలెల్ల భూభారహరణ నిపుణ
మతి రమాపతి వినుతించి దితిజకోటి
యాగడములింక నశియించినట్ల యనుచు
సంతసంపడి పారవశ్యమ్ము నొంది.

గీ. దేవకీ వసుదేవులు దీనులగుచు
మ్రొక్కఁగా వారి గరుణించి రక్కసులను
నుక్కడంపంగ దేవకి యుదరమందుఁ
బెఱుగుచున్నాడు; సుజనుల నరసిప్రోవ.

వ. అని దేవకీదేవిం జూచి.

మ. రమణీ! చింతిలకమ్మ నీకొడుకు దీర్ఘాయుస్సమేతుండు వి
శ్రమలెల్లన్ గడదేర్చు; రాక్షస వధార్థంబుర్వి లీలావతా

గముఁ బాలించెడు శౌరియే యితఁడు; గర్భస్థుండుగానున్న వాఁ
డమరప్రార్థితుఁడై; సుఖప్రసవమా నానందమొప్పారెడిన్
వెతఁబడకమ్మ! కంసపృథివీపతిపన్నులు గప్పి తా సుర
క్షితముగ నుండు; నెవ్వనికిఁజిక్కఁడు; చిక్కెడువాఁడు కాఁడు; వాఁ
డతులిత విక్రమాఢ్యుఁడజ గామరదివ్యయశోవిశాలుఁడై
క్షితిపయిఁ బెద్దకాలము వసించు; నృశంసుల రూపుమాపుచున్
అదితివి నీవు కశ్యపుఁడె యానకదుందుభి మిమ్ముఁగోరి మీ
యుదరమునందు పుట్టుగని యొప్పెడువాఁడు, త్రివిక్రముండు, మీ
కొదవు సుఖానుభూతి, యిఁకనూఱటఁ జెందుఁడటంచు చెప్పి స
మ్మదమొదవించి సర్వసురముఖ్యులుఁ జేరిరి వారి ధాములన్

## —* శ్రీ కృష్ణ జననము *—

శ్రీరమణీ మనోవిభుఁడు శిష్టజనోద్ధరణార్థమై భువిన్
గారణజన్ముఁ డౌ నని, వికాసమునందెను దిక్కులెల్ల, భూ
భారము దీరెనంచు ఫణిసర్పుఁడు దీనతమానె, దేవతా
వారము భీతిఁగోల్పడిరి; పాడిరి వేలుపు చేడెలాడుచున్.

శ్రావణ బహుళాష్టమి నర్ధరాత్రమందు
శుభముహూర్తమునందు పూషుండు స్వీయ
రాశియందుండఁగా శుభగ్రహము లుచిత
కల్యములనుండఁ బ్రసవించెఁ గాంత యపుడు.

జలరాసులుప్పొంగి కలవీచికలనెత్తి
హాహోరుసారించి జోహారుసేయ
దిక్కుంభినీకోటి దివ్యమణులూర్చి
మాలికలొసఁగి జేజేలుసేయ
భూరమారమణి సింగారించుకొని పల్ల
వాంగుళుల్మోడ్చి యంగ నంజలింప
సుములొచు బృందారకులు నింగినుండి పూ
సోనలు గురిసి ప్రస్తుతులుసేయ

తే.గీ. మొనసి ఫణిరాజు మణిరాజముల నమర్చి
నవ్యనీరాజనమొసంగి నతులు సేయ
వెన్నెల రహింప రేరాజు పేర్మిసూప
శౌరి లీలావతారుఁడై జననమందె!

ఉ. చీకటికోణమైనచెఱఁ, జిత్రవిచిత్రకళాప్రపూర్ణమై
ప్రాకట వైభవోన్నతులు పర్వెన దేవకీదేవి గాంచి, య
స్తోకసుఖప్రమోదములఁ జొక్కుచు, మక్కువదీఱఁ బ్రక్కలో
శ్రీకరమూర్తి సాధుజనచిత్తనవోత్పలబంధుఁగన్గొనెన్.

మ. తను దా నమ్మక, విస్మయానుమితచిత్తభ్రాంతయై చారులో
చనయుగ్మంబరమోడ్చి, విచ్చి, సవిలాసప్రోద్ధతిన్ రెప్ప ల
ల్లన నల్లార్చుచు, వ్రేళ్ళతోఁ దుడిచి సోల్లాసంబుగాఁ గ్రమ్మఱన్
గనియెన్ దేవకిదేవి కట్టెదుట సాక్షాద్విష్ణు రోచిష్ణువిన్.

గీ. చారునీరదవర్ణుఁ డాజానుబాహుఁ
డంబుజాక్షుఁడు, వనమాలి, కంబుకంఠుఁ
డర్కతేజుఁడు నవ్యపీతాంబరుండు
నభయహస్తుఁడై సతికిఁ బ్రత్యక్షమయ్యె.

చ. కని, తమి దీఱ నేత్రములఁ గ్రమ్మెడు బాష్పకణంబులొత్తుచున్
మనసును జిక్కబట్టి, యనుమానము దీఱి, నిలింపముఖ్యు ల
న్ననుఁడి దలంచి, యాతని, ననంతు, నమేయు, ననాదిమూర్తిగా
మనమున నిర్ణయించుచు, నమస్కృతిఁజేసి విలోలచిత్తయై.

గీ. వచ్చినాఁడవా నాతండ్రి! వ్యసనకలిత
నన్ను నోదార్చి పోవ నిన్నాళ్ళకిపుడు;
దేవదేవోత్తమా! నీదు దివ్యమూర్తి
నెన్ని నాళ్ళకుఁ గనుఁగొంటిఁ గన్నులార.

గీ. నన్నుఁగన్నయ్య! నాపాలి చిన్నితండ్రి!
వేచియున్నాను నీరాక వేవిధాల
భర్తతోఁగూడి చెఱఁబడి బ్రతికి చచ్చి
బ్రతుకుచున్నాను జావనేరక పొగులుచు.

గీ. అనుచు నానందవివశయై యవ్విభుండు
పూర్వపరిచితుఁడైనట్లు పోలఁతి తలఁచి
ప్రేమభక్తివిశ్వాసము ల్పెనగొనంగ
ముద్దుగాఁబిల్చి పొగడి వ్యామోహపడఁగ.

మ. వసుదేవుం డిల మోకరించుచుఁ గరద్వంద్వంబునున్ మోడ్చి సం
తస మొప్పార నమస్కరించి, జగదుద్ధారా! దయాసాగరా!
వ్యసనాందోళిత చిత్త శోభనకరా! వైకుంఠలోకేశ్వరా!
యసమానోజ్జ్వల చారుభూషణధరా! యంచుం బ్రశంసింపఁగన్.

తే.గీ. అతఁడు ముల్లోకములదొర యట్లు తనకుఁ
దనయుఁడై పొడమంచి దేవకి తన్మయత్వ
మొంది తనభాగ్యమే భాగ్య మనుచు నిట్లు
సన్నుతించెను శౌరి నుత్సాహ మొప్ప.

క. నాపాపఁడవై, నాయొడి
నే పవళించెదవ! సామి! నిఖిల సుజన హృ
త్తాపము నార్పగవా? తం
డ్రీ! పుత్రవిహీన నన్నుఁ గృప మనిచెదవా!

శా. మాకాభాగ్యము కల్గనిమ్ము సుతుగా మన్నించి లాలించి గో
ద్యోగాన్నాళ్లు ప్రపంచయాత్ర సుఖసంతోషాలతోఁ దేలని
మ్మోకల్యాణగుణాకరా! బ్రదుక వెంతో భారమైపోయెఁ దు
రాకంగోరి భరించియుంటి నిటఁ గారాగారమందిట్టులన్.

క. సర్వాంతర్యామివి, భూ
నిర్వాహకుఁడవు, సమస్త నిర్ణేతవు, మా
దుర్వహదుఃఖ మెఱుంగవె
గర్వోన్నతుఁడైన దుష్ట కంసుని వలనన్.

మ. అని కన్నీరొలుకంగ ప్రేమమయవాక్యప్రౌఢతిన్, దీనయై
మనవుల్ చేసెడు తల్లిఁగాంచి హరి యమ్మా! నీవుచింతింపఁగాఁ
బనిలే దీశ్వరచిద్విలాసమిది, సంప్రాప్తించె నీరీతి; మీ
వనటల్ తీఱెడిఁ గంసభూమిపతిపాపం బింకఁబండున్ జుమీ!

మ. అదిగో! యయ్యెడ సేవకావళులు మాయాదేవి పొత్తిళ్ళలో
నిదురంజాల మునింగినారు; మనకేనిర్బంధము ల్లేవు; ప్ర
ల్లదుఁ డాకంసుడు రాఁడు; వాఁడు మదిరాలాస్యంబులోఁ జొక్కినాఁ
డిదె యోగ్యం బగు; సన్మహూర్తమగుఁ జూవే కష్ట మీడేరఁగన్.

తే.గీ. ఇపుడె వ్రేపల్లెలో నందునింట నతని
ప్రేయసి యశోద ప్రసవించి పిల్లపోయి
తల్లడిలుచున్న దిప్పుడా తల్లిప్రక్కఁ
జేర్చుఁడీ నన్ను శుభములు చెందు మిమ్ము.

మ. భయమావంతయు లేదు; సర్వముశుభప్రస్ఫీతమౌ; దైవని
గ్రయమిల్లేయగు; యత్నకార్యముల విఘ్నాలెవ్వియున్ రావు; ని
శ్చయమీవాక్యఁమటంచు' దెల్పి హరియిచ్ఛామాత్రరూపంబుతోఁ
బ్రియపుత్రుండయి తల్లిప్రక్క నొదిగెన్ వేడ్కల్ పిసాళింపఁగన్

తే.గీ. అంత దేవకీ వసుదేవులదటువిడి
యేమికానున్నదో యింకనీశ్వరాజ్ఞ
యనుచు నాయత్తపడి తట్టయందుఁబొత్తి
గుడ్డలమరించి యందులోఁగూననుంచి.

వ. అంతలో దేవకి వివర్ధమాన పుత్రస్నేహంబున

ఉ. ముద్దులుమూటగట్టు తనపొన్నరి చిన్నరి కన్నకూననున్
పద్దబరుండ బెట్టుకొని, వావిరికన్నవ జేపురింపగా
ముద్దులు బెట్టిచన్నిడెడు మోజువహించి, నిమిత్తమాత్రి మా
ప్రొద్దుసరాగవాక్యములు పొంపిరివోవ వచించి పొంగుచున్.

క. నాతండ్రీ! ననువీడెద
వా! తల్లినిగాన! నేను; వాత్సల్యము లే
దా! తమి దీఱం బెనుచుచుఁ
జేత మురంజిల్లు ఫలము చెందద! నాకున్.

తే.గీ. కన్నదానను నిను బెంపఁగాద? నాకుఁ;
బరుల పాలౌదువా? నీదు బాల్యచేష్టి

తమలఁగని ముద్దులాడు భాగ్యమున కేను
తగన? నాప్రాప్తమిట్టిదా? తండ్రి! యనుచు.

తే.గీ. కనుటయొక్కటె నాపాలుగాఁగ నిన్నుఁ
బెనిచి సంతోషపడు దివ్యవిభవము మఱి
వేఱు కాంతకుఁ జెందునా? విధి యటంచు
భోరుభోరున నేడ్చె నంభోరుహాక్షి.

క. కనియానక దుందుభి నె
మ్మనమునఁ జింతించి వేఱుమార్గము లేమిన్
వనితామణి నోదార్చుచు.
మనవిధి యిట్లుండెఁ జింతమానుము దేవీ!

క. హరి నిర్ణయమది తప్పక
జరిగియె తీరంగవలయు; జాలము సేయన్
సరికాదు; వేళ మీఱినఁ
బరిణతియెట్లౌనో? దుఃఖపడకుము పడఁతీ!

క. మన చిన్నితండ్రి యెచ్చటఁ
మనినను మనవాఁడె భయము మానిపినంతన్
మనదరికి వచ్చు; నంతకుఁ
గనిపెట్టుకయుంట ముఖ్యకార్యము మనకున్.

వ. అనిపలికియు వసుదేవుండును, బుత్రస్నేహాంబగ్గలంబై శిశువుం[illegible]
జాలఁడయ్యె నంతట.

తే.గీ. భర్త నిర్విణ్ణుఁడై నిల్వ బాలుఁ దున్న
తట్ట గంపితకరములఁ దలను నెత్తె
భాగ్య; చెఱసాల తాళము ల్బద్దలయ్యె
ద్వారములు విచ్చెఁ దమయంత దారి నిచ్చె.

—* వసుదేవుఁడు కృష్ణుని వ్రేపల్లెకుఁ జేర్చుట *—

క. గమనోన్ముఖుఁడై యాతఁడు
శ్రమపడు సతికోర్పుఁజెప్పి, ప్రణమునిడఁగా

సుమములు జలజలరాలెను
కమనీయంబైన కమ్మగాడ్పు విసరెన్.

ఉ. అయ్యదికృష్ణపక్షము నిశార్థము మీరుట నప్పుడప్పుడొ
య్యన నెఱిఁ జందురుండుదయ మందుచుఁ బాలవెలుంగు వెన్నెలల్
నెయ్యపుబావపై విసరి నేఁడెకదా సుదినం బటంచు దాఁ
జయ్యన వెంటనంటె, తమసమ్మునడంచుచు, దారిజూపుచున్.

సీ. వెనువెంట ఫణిరాజు ఘనఫణావళివిప్పి
హరిశిరంబున ఛత్రమట్లు తనరఁ
బరువంపు పిల్లతెమ్మెరలసాకునముంద
మలయానిలుండు చామరము వీవఁ
బాలవెన్నెల కిరణాల దీపములెత్తి
రేరాజు మునుముందు దారిసూప
నమృతంపుసోనలు, సుమవృష్టిగుఱియుచు
ననుసరించి సురాళి వినతిసేయ

తే.గీ. దేవతల్ మౌనులాశీర్వదించుచుండ
నప్సరసలెల్ల భరతనాట్యములుసేయఁ
దూర్యములు మ్రోయ, వసుదేవతురగుఁడగుచు
మధురవెడలెను జగదేక మధురుఁడతఁడు.

సె. దిక్కుంభినీకుంభ తేజోవిముక్త ము క్తాహారరుచులు న ర్తనమొనర్చి
ఫణిఫణాగ్రస్థిత భవ్యచలన్మణి కలదీపికోద్దీపనలు రహించి
తెమ్మెరమూహా స్త కంకణ మణిహార విభూషణోజ్వలకాంతిపుంజమెనసి
గోత్రాచలోత్తుంగకోటీర సంస్థిత నవరత్న విద్యుతుల్ నవకమెసఁగ

తే.గీ. కమఠపృష్ఠవిన్యస్త, శృంగారమేరు
కుధర పీతకాంతిచ్ఛటల్ గుములుతీరి
పూని వసుదేవు నెత్తిపైబుట్టలోని
బాలుఁబొదివె సూర్యప్రభాభాసురముగ.

తే.గీ. ధారుణీభారవహన విశారదాఖ్య
నమరు, కరి, నాగ, కిటి, గోత్ర కమఠములును

దుర్భరంబగు భాగము తొలఁగుననుచు
ననుసరించిరి శ్రీహరి నట్టివేళ.

తే.గీ. ఇందఱిటు శౌరినిఁ బరివేష్టించి, యెంచి
కడుమహోత్సవములఁజేసి గారవించు
టెఱుఁగనే యెఱుంగడు, సుంతయేని గనఁడు
పాప మవ్వసుదేవుఁడు భ్రాంతుఁడగుట.

తే.గీ. కాళరాత్రి; రహస్యపుఁగార్యము; వెను
వెంట నెవ్వరురారు; దానొంటివాఁడు
దూరపుఁ బ్రయాణము; ప్రయాస దారియందు
నెట్లుసాధించె వసుదేవుఁడిట్టిపనుల.

ఉ. కలఁచునె ధీరచిత్తములఁ గష్టములేగతిఁ జుట్టుముట్టినన్
నిలుతురె సాధకుల్ తమదునేమము దాఫలియించుదాఁక? పె
క్కులను విహంగసామ్యముగఁ గాఁగలచోటికి నేఁగి, నేస్తులఁ
దలఁపులు దీర్చి దిద్దుకొని, ధన్యత గాంతురుగాక యుర్విపై.

క. చనిచని వసుదేవుండటఁ
గనియె మహోత్తుంగభంగ ఘనతరబహుళ
వనబిందురుద్ధగగన
సునిశితగంభీర గమన సుందరయమునన్.

శా. లీలామానుషబాలమూర్తియయి లేలీహానతల్పుండు నా
హ్యాళిందేలుచు వచ్చుచో, నతనినభ్యర్చించి పూజింపఁగా
బాళిం జెంది, సమస్తవాహినులతో, భవ్యప్రమోదంబునన్
గాళిందీనది తానెదుర్కొనెఁ దరంగక్రాంతిమై నొప్పగన్.

శా. వీచీ హస్తము లెత్తి కంకణరుచుల్ వేలా విలోలంబుగా
శ్రీ చైతన్య సరోజ భాస్కరునిపై సేస ల్ప్రసారించుచున్
బ్రాచుర్యం బొనరించె విశ్వమయు సంప్రాప్తాబ్ది నారాయణ
ప్రాచీనాఖ్య మహార్థమట్లు యమునావామాక్షి యుప్పొంగుచున్.

తే.గీ. ఇఱుతటంబులు గడచి పైకెగసి చనును
దారవీచికానిచయము ల్మోరమీఱ

హోరుపెట్టు ప్రవాహము మీటిపోయి
దుస్తరంబయ్యెఁ గాళింది విస్తృతముగ.

తే.గీ. తన్నుఁబోలు నీలాకృతిఁ దనరువాఁడు
నాది నారాయణుఁడు వచ్చె నను ముదమున
యమున యుప్పొంగి దుస్తరమై తనర్చె
నొకరి మేలింకొకరి బాధ కొదవినట్లు.

మ. వసుదేవుండు ముహూర్తకాలమట విభ్రాంతాత్ముఁడై నిల్చి, వె
క్కసమై పాఱు ప్రవాహముం గని, సరే? కానున్నదేదో యగున్
వ్యసనం బెందులకు? కింతదాఁకఁ బను లెవ్వాఁడోర్చి యీడేర్చె న
య్యసమాన ప్రతిభా విశారదుఁడె, యియ్యర్థంబుఁ జేకూర్చెడున్.

మ. అని ధైర్యంబు వహించి, గొంకక, శిరంబం దొప్పుచున్నట్టి బు
ట్టను భద్రంబుగ రెండుహస్తముల తోడంబట్టి, "నారాయణా!
దనుజారీ!" యని యాడి పాడుకొనుచుం, దద్వాహినింజొచ్చి చ
య్యన నేగం దొడఁగెన్ స్థిరాశయత దైవాధీనమై యొప్పఁగన్.

మ. చని కాళిందినదీప్రవాహమున, నిశ్శంకాత్ముఁడై, ఫ్రాని, కా
లునిచెన్ మెల్లగ నడ్వసాగె; నదియేమో! గారడీ మాయయో!
మునుకల్ వేయు తరంగపంక్తుల నభో భూభాగము ల్గప్పుచుం
డిన నవ్వాహిని రెండు పాయలుగ వీడెం దొంటి సంరంభమున్.

చ. ఒడుదుడుకేమిలేదు; నది యుత్తర దక్షిణ దిక్పథంబులం
బడి ప్రవహింపసాగె; నిరపాయముగా సరి రెండు పాయలై
నడుమ విశాలమైన రతనా లమరించిన రాచమార్గ మే
ర్పడె వసుదేవుఁ డేమఱక బాలకుఁ గైకొని దాఁటె నేటినిన్.

సీ. మానిరేదివ్యులు? ఫ్రాని క్షీరోదధి
మథియించి యమృతంబు మలయుదాఁకఁ
జాలించెనో కొక్క విశ్వామిత్రుఁడు తపము
సృష్టికిఁ బ్రతిసృష్టిఁజేయు పట్టున

విడనాడెనా యగస్త్యుడు పట్టు? వారి జ
లం జెల్ల నాపోశనంబుఁగొనక
రక్తిపీడెన భగీరథుఁడు? వియద్గంగ
క్షితిపైని బ్రవహింపఁ జేయు దనుకఁ

తే॥గీ॥ గార్యశూరులేదెల్లెనఁగాని పట్టి
మానుకోలేరు; మానరు పూనికలను;
నడుమనెన్నెని యిడుమలు పొడసువచ్చు
విచ్చిపోవచ్చు నది సాయియిచ్చు సూవె.

చ. త్రికరణశుద్ధిగానెవఁడు దేవునిపై భరముంచి ధీరుఁడై
సకలఫలాఫలంబులకు జంకక సేయుచు, సాక్షిమాత్రుఁడై
యకలుషుఁడైనచోఁ గరతలామలకంబయి వాని యత్నముల్
నికరముగా ఫలించు, తమినించు, వరించు జయంబువానినిన్.

క. యమునాతరణం బవ్విధి
సుముఖంబయి కడచిపోవ సుఖియై సంతో
షముగా నానకదుందుభి
క్రమముగ వ్రేపల్లెజాడ గని నడచెపడిన్.

—* నంద వసుదేవుల సంభాషణము *—

చ. అటఁజనుచుండ గన్పడియె యాదవముఖ్యుఁడొకండు తన్నదీ
తటమున ఖిన్నుఁడై బొటియఁద్రవ్వుచు నేలను మట్టిదోడుచున్
దటుకునగాంచి, నందునిఁగ దాఁగ్రహియించి, ప్రమోదితాత్ముఁడై
యిటులనె "నోయినంద! యిపుఁడేమి యొనర్చెద విందు నొంటిగన్"

తే.గీ. అనుచు వసుదేవుఁ డడిగిన విని విషణ్ణుఁ
డైన నందుఁడు పరిచితుండైన యతని
నెంతయో తడ వరసి గుర్తించి తుదకుఁ
బలికె నిట్టుల గద్గద స్వరముతోడ.

ఉ. ఎక్కడనుండి రాక? యిపు డెచ్చట నే పనులుండె? నేటికీ
విక్కడి కేగుదెంతు? చెలి నెట్టుల వీడితి? వర్ధరాత్రమం

దిక్కరణిన్ జరింపఁ గతమేమని ప్రశ్నపరంపరల్ సదా
గ్రుక్క మరల్పకే పలుకు గోపునితో వసుదేవుఁ డిట్లనున్.

మ. అనఘా! యన్నిటి కుత్తరంబులిడు టత్యావశ్యకంబైనఁ జా
లిన కాలంబు లభింప దెల్ల వినవౌలే నీవు మున్ముందు చ
ప్పిన నేఁ బోనగుఁ గ్రమ్మరం జెఱకు నీ పుణ్యంబుచే శౌరి త
జ్జనకుం గా వరియించె నిన్నుఁ గొను మీ సన్మాన్య హర్షంబుతోన్.

మ. చెఱలో దేవకిదేవియందు జనియించె న్వాఁడు మత్పుత్రుఁడై
హరి యీతండు జనించినంత విశదం బౌనట్లుగాఁ దెల్పె స
త్వరమే నీ గృహలక్ష్మి యా నల యశోదాదేవి కర్పింపగాఁ
జెఱవీడం బరతెంచి తే నతని నాశీర్షంబున న్మోయుచున్.

తే.గీ. నీ యశోదగర్భమున జనించినట్టి
బాలికయ యోగమాయ యిబ్బాల పంచ
తను గనదు బాఱియం ద్రవ్వ టనవసరము
రమ్ము! పోదమింటికి యశోదమ్మకడకు.

ఉ. నీసతి బిడ్డ పోయె నను నిస్పృహచే మతిపోయి యున్న ది
ప్డే సమయంబు బాలకుని నెత్తి సతీమణిప్రక్కఁ జేర్పఁగాఁ
ద్రాసము మాను నామె తన తల్పమునం బసికూనఁ గాంచి సం
తోసముతోడ రమ్మని యధోముఖుఁడై వసుదేవుఁ డాడినన్.

క. విని యాశ్చర్య ముదంబులు
పెనగొని నందుండు దేవవిహిత కృతంబున్
బనుపడ సేయఁగ నింటికిఁ
జనెఁ దా వసుదేవుఁ గూడి సంతోషమునన్.

మ. ఇఁక నీ నా టనుగోలె మీ తనయుఁడే యీ ముద్దుపాపాయి మా
మక సౌభాగ్య విధాత యీ నిసువెసుమ్మా! వీనిపై నాసచే
సకలానందము నొందియున్ బ్రతుకు నిస్సారంబుగాఁ దోఁచి చా
వక జీవించితి మిన్నినాళ్ళు చెఱలో వారాలు లెక్కించుచున్.

తే.గీ. పాప యీతఁడు కనులలో పాప మాకు
హృదయవర్తి మా హృదయ నీరేజతరణి
శ్యామలాకారుఁ డందాల చందమామ
నెట్లు పోషించెదో! వీని నింకమీఁద.

తే.గీ. కన్నవా రన్నదే మాకుఁ గలుగు యశము
పెంచి పెద్దను జేసి లాలించి ముద్దు
ముచ్చటలు దీఱ ముఁజెసి సమ్మోదజలధిఁ
దేలు సత్కీర్తిభోగభాగ్యాలు మీవి.

వ. అనియు వసుదేవుండు పుత్రవాత్సల్యంబు ముమ్మరంబై పెనంగొన.

సీ॥ వెన్నెలపుల్గులైకన్నులు చిన్నారి
కన్నయ ముఖచంద్రుఁగాంచఁ దొడఁగెఁ
జెలువయి హృదయము పరితాపరసమూరి
తోఁణకుచు నిలువెల్ల వణఁకుగూర్చె
సుడిగాలి కడురేగి చిడిముడిపాటున
వేడినిట్టూర్పుల వెడలఁద్రొక్కె
ద్రవియించి చిత్తము దరిమీఱి పొంగులు
వారి యవారిగా ధార లుఱికె

తే.గీ. పరమవిభ్రాంతుఁడయ్యు నిబ్బరము దొఱఁగి
నిలుకడయలేని యారాటముల భరించి
నన్నివిధములఁ జిన్నారికన్నవాని
విడువలేక విడువలేక విడువఁదొడఁగె.

ఉ. ఎంతటి పండితుండయిన నెట్టివిరాగసుఖానుభూతి వి
భ్రాంతుఁడునైన, దివ్యమునిసత్తముఁడైన, సమాధినిష్ఠలం
దంతులు గన్నవాడయిన, హస్తములం దన కన్నవాని ని
శ్చింతగ నన్యకర్పణముఁజేసి భరించునె? యాత్రికీరునే?

ఉ. మానవనైజమా మమత మాయురె! యెంతగఁజిక్కఁబట్టినన్
బూనియొకానొకప్డు పొలివోక గనంబడు ధీరులందునున్

జానలేకారు పూరుషులున్సైతము దుఃఖమహార్ణవంబులో
లీనులుగాకపోరు విదళించు మహాపదఁజెందువేళన్.

తే. ఒకముహూర్తకాలము దుఃఖమొలికిపారి
సేదదీఱికర్తవ్య సంసిద్ధికొఱకు
బాలుని యశోదపాన్పుపైఁ బవ్వళింపఁ
జేసి నందునితో నిట్లు జెప్పఁదొడగెఁ

మ. సకలార్థప్రతిపాదకుండు, జనరక్షాదక్షుఁడీమూర్తి, బా
లకుఁడై, యొక్క-నిచేతఁబెంపఁబడు లీలంగోరె నాఁడట్టి ప్రా
ప్తికి నేసర్వుఁడఁగాను నీకరములందే వీనినర్పించి నా
నిఁక నీయిష్టము పోయివచ్చెదనుజుమ్మా! నందగోపాలకా!

ఉ. ఇంతకు నేనుజెప్పునదియేమన? నీశ్వరదత్తుఁ డీతనిం
గాంతయునీవు ప్రేమనయగారము లొప్పఁగఁ గన్నవానిఁగాఁ
బెంతురు శోభనం బనుభవింతురు మాకును వీనిక్షేమ వృ
త్తాంతము నప్పుడప్పుఁడు దయన్వినిపింపుఁడు పోయివచ్చెదన్.

చ. అన విని నందుఁడోసరిలి యానక దుందుభి రెండుచేతులో
య్యనఁ దనచేతులంబొదివి, "యయ్యా! మరేమిభయంబులేదు సీ
తనయు మదీయుఁగాఁబెనిచెదన్ గని ప్రాణముతో సమానుఁగా
వినిచెద వానిక్షేమములు, వెంబడివెంబడి నెల్లకాలమున్.

సీ. సారసాంసారిక క్షీరవారాశిలో
నాప్యాయనముగూర్చు నమృతధార
మాభావిజీవిత మహితవనమ్ములోఁ
బ్రియముగా నినదించు పికవరమ్ము
హృద్గగనంబులో నింపొంద వెన్నెల
పూలమాలలమర్చు పూర్ణచంద్రుఁ
డసమాన మానసాహ్లాద సరోవర
రసకేళి నడయాడు రాజహంస

తే.గీ. పుణ్యసంప్రాప్త సౌఖ్యానుభూతి నమరు
ప్రాణముల నవ్యజీవనప్రాణభితఁడు

ప్రేమసామ్రాజ్యమున నిల్పి హృదయమందు
దాఁచి పోషించు కొందునో తండ్రి! వీని.

తే.గీ. ఇది భగవదాజ్ఞగాఁగ భావింతుఁ జుమ్మి
శంక దక్కఁ జనుము నీవు సగఁబురికి
దైవసంకల్పమున కన్యథా కలుగునె
వనటఁ బడకని నందుండు పలికినంత.

ఉ. కర్ణరసాయంబులగు కమ్మనివాక్యము లాలకించి సం
పూర్ణమనోవికాసమునుబొంది విచారము మానిపోవఁగా
నిర్ణయంబొనర్చుకొని నెచ్చెలిఁగౌఁగిట గ్రుచ్చి పొంగుచున్
వర్ణనఁజేసి బాలకుని భామ యశోదకడన్ గనించుచున్

తే.గీ. ఆలతాంగి తల్పంబున కవ్వలదిశ
నుంచఁబడి మృతబాలగానెంచఁబడెడు
యోగమాయను బుట్టలోనుంచి దాని
శిరముపైఁదాల్చి సెలవంది భరముదీరి.

చ. వెలుఁగుననుండి చీకటికి వేసనుచెంచెడు వానిపోల్కి గ
న్నులుజిగితప్పి కొంతవరకుం దనవచ్చినదారి కాన రా
కలులితుఁడై, క్రమంబుగ వికారము దీరి పథమ్ముఁబట్టి చిం
తలువిడి పోయి పోయి క్రమతన్ వసుదేవుఁడు జేరెఁగారనున్

చ. మునుపటికీతినే నిగళముల్ కరపాదములంబిగించె; వి
చ్చిన చెఱతాళముల్ బిగిసెఁ; జెప్పునదేమి? యథాతథంబుగాఁ
బనుపడెనెల్ల, నయ్యెడల; బ్రక్కనఁ గాపులుగాయుచున్న య
జనములు నిద్రమేల్కనిరి, సంభ్రమమెంతయు సందడింపఁగన్.

తే.గీ. ఉలికిపడిలేచి తమదీపకళికలెత్తి
పాఱఁజూచి దేవకిసతి ప్రక్కనున్న
పాపఁగని రిచ్చవడి యెంతపని జరిగెనో
యనుచు నొండొరులన్ జూచుకొనుచువారు.

శా. నీఁడేయష్టమగర్భజాతుఁడు మహావిష్ణుండు గాఁబోలునే
పాడైపోతిమి; సర్వయత్నములునున్ బాడయ్యె; నీల్గాడు నా

జాడల్ ముందుగ నాకుఁ జెప్పుఁడని యాజ్ఞాపించె భూపాలుఁడీ
పాడిట్లయ్యెను; మాయనిద్రమము నాపాదించె; నెట్లంచునున్

చ. తడఁబడుమాటలాడుచును, దత్తరమొందుచు, రాచకార్యమి
వ్వడువున రిత్తబోయెనిఁకఁ బ్రాణములుండవు; గండకత్తెరై
పొడమెను వీఁడు మాకొఱకె పుట్టెను, గంసుని చావుమాట యె
ప్పుడొ యదియేమొ మాబ్రదుకు పోవుటనిక్కము నేఁడటంచునున్.

తే.గీ. భయముచే సోలిపోవుచు బయలుదేరి
గాలియీతలఁ దేలుచుఁ గడురయమునఁ
గంసరాజుసన్నిధికేగి కారణార్థ
ముల వచింపవచ్చిరి సేవకులు తెగించి.

తే.గీ. అన్యసేవకు దేహము లప్పగించి
బ్రతుకు నస్వతంత్రుల దుష్టఫలములివియె
వారితప్పులు సైతము వీరి నొంచు
నాల్కచాపల్యమునఁగదా నవయుఁబొట్ట.

మ. హృదయావేదన మేరమీరి నృపుఁడారేయిన్ విలోలాత్ముఁడై
యెదలో బల్లెము గ్రుచ్చినట్లయిన నేఁడీయంచు నెంటాడు న
ల్లదెవాఁడేయని పట్టబోవుఁ బడు దూలాఁడున్ గిలారించు నం
గదరెట్టించిన మీసముల్నిమురు హుంకారంబుగావించుచున్.

తే.గీ. భూనభోంతరములునిండు బొబ్బలిడుచుఁ
గంసభూపతి యొఱలోని కత్తిదూసి
పాఱుచుండెను చెఱసాలఁ జేర నప్పు
డెమురుపడి సేసకులు దెల్పి రెఱిఁగినంత.

తే.గీ. మండిపడి కంసభూపుఁ డుద్దండుఁ డగుచు
సేవకుల వీడుకొని సాఁగి దావవహ్ని
శుష్కవనములపై వాలుజోక, వాయు
వేగమునఁ బోయెఁ జెఱసాల వివరమునకు.

ఉ. కన్నులనిప్పుకల్లోలుల ఖడ్గముద్రిప్పుచు హుంకరించుచున్.
మిన్నులు ముట్టనార్చుచును మీసములన్ వడిద్రిప్పి త్రిప్పి నీ
కన్నకుమారుఁడేడి యిటుగ్గై కొనిరా! బలిచేసిగాని నా
కన్నులుహాయిఁ జెందవని కంసనృశంసుఁడు పల్కెనుగ్రుఁడై.

తే.గీ. భయదహరిగర్జనము విన్న బాలహరిణి
కరణి దేవకిఁ గంసుని గర్జనంబు
సెవులఁ బడినంత నతిభీతచిత్తయగుచు
నేలఁ గూలెను లతకూనలీలఁ దూలి.

తే.గీ. ఆమెచందంబుఁగనుఁగొనినంతట వసు
దేవుఁ డెంతయుఁ జింతించి ధృతి వహించి
భామదరిఁ జేరి వేదనాభార మెల్ల
దొలఁగ నిట్లని సాంత్వనోక్తులు వచించె.

క. చేలతనము గాకీగతి
గోలా వగపేల నీకు? గోపాలకుఁడే
పాలకుఁడు మనకు లె మ్మిఁక
బాలకునర్పింతు మాట పాడి తొలఁగకే.

వ. అనుటయు.

మ. వసుదేవుంగని కంసుఁడిట్లనియె నోవాచాట! యీశృత్రిమ
వ్యసనాదర్శములున్ బ్రదర్శనము లత్యాచారవిన్యాసముల్
మసిపూత ల్సరిపోవు మాకు విను యుష్మద్వాక్ప్రకారంబుగన్
బసివానింగొని తెచ్చి యిమ్మిటుల నీవాశ్ చూతువాపిమ్మటన్.

క. ఆకాశవాణి చెప్పిన
దీకానుపుఁగూర్చి కాన నీఖడ్గముచే
మీకూనగొంతు గోయుదుఁ
గాక విడువలేను వేగఁ గై కొని రమ్మా.

వ. అనిన వసుదేవుం డిట్లనియె.

శా. బావా! యిప్పటికేడుకాన్పులిటు విధ్వంసంబుగానయ్యె; మా
కా వార్ధక్యముచేరువైన; దిఁకఁ బుత్రానందమేమానో? మా
యీవంశాంకురమైననిల్పి మమురక్షింపం బ్రయత్నింప రా
దా! వైషమ్యములేల? యాప్తులముకామా? మేము చింతింపుమా!

తే.గీ. అనుచు వసుదేవుఁడనఁ గంసుఁడౌడుగఱచి
హుంకరించుచు నిట్లనె నుగ్రఫణితి
ఎంతవాఁడవురా భళీ! యెందునందె
కత్తరించెద వదికెద వృత్తకధల.

ఉ. చెప్పినదేమి? తొల్దొలుతఁ; జేయదలంచినదేమి? యిప్డు నీ
వెప్పనికైన సాహసుఁడవే; నినునమ్మఁగరాదు నీచుఁడా!
యప్పనసేసెదఁ సుతుల నందఱఁ బుట్టిననాఁడెయంటి వీ
వప్పలు కేడపోయె నిపుడయ్యది! నాల్కయొ! తాటిదూలమో?

మ. అనినిందించిన ఖిన్నుఁడయ్యు మదియత్యంతంబు తీండ్రించుచు
న్నను సైరించి, భరించి, మోమును వివర్ణచ్ఛాయలోడాచి, యె
య్యనఁబల్కెన్ వసుదేవుఁడయ్యసురతో నత్యంతదైన్యంబుతో
ననుకూలస్థితి తప్పునప్పుడెది చేయంజాలు నెవ్వండునున్.

శా. వాచాశూరులమేముకాము వినుబావా! యీమె నైసర్గిక
స్త్రీచాపల్యముచేతఁ గన్ననిసువున్ జేఁజేత నర్పించుచో
నీచందం బిటు లయ్యెఁ గాని స్థితి యేమేకాని వాగ్దత్తమున్
దూ, చా, దప్పక దీర్చుకోఁగలము, సంతోషింపుమీ నీవికన్.

ఉ. వంశము నాశమానను నెపంబునఁ బల్కితినంతెగాక, నే
యంశము లెట్లు వచ్చి మము నాఱడిఁబెట్టినఁ దప్పఁజాల వి
భ్రంశత నంద; నాపలుకు వ్యర్థముఁజేయఁదలంప; నిట్టి సూ
క్ష్మాంశము లెంచి మమ్ముఁదెగనాడుట న్యాయ్యమ! కంసభూవరా!

మ. నినుఁబ్రార్థించి తరింపనెంచితిని గానీ యిట్లుదావాగ్ని వై
ననుఁబూర్ణాహుతి జేయవత్తువని స్వప్నావస్థయందైన నెం
చను; గానున్నది కాకమానదిఁక; వంశధ్వంసమై చచ్చిచా
వనివారెందఱులేరు? నేనొకఁడ మాత్రాప్తంబిదే భూపతీ!

శా. ఏయుద్దేశముతోడ దేవకిని నాయిల్లాలుగాఁగూర్చి నా
వో యాయాశయమీవెతప్పితివి; వంశోన్నాలనప్రక్రియా
ధ్యాయంబున్ దలపెట్టినావు; నడిఁబాయన్ మాయనీకౌను గా
నీ! యేమర్మముఁ గర్మముం గనము మాకేమౌను? గంసేశ్వరా!

శా. మాదాంపత్యసుధాసరోవరమునం భాసిల్లురా యంచ న
య్యో! దారింతువు; జీవితానుభవ దివ్యోద్యానమిట్టుల్ శ్మశా
నాదర్శంబొనరింపఁ బాల్పడితి నయ్యా! లోహహస్తాలతో;
నీదౌర్భాగ్యులమమ్ము జంపి సుఖివై యంతేని వర్ధిల్లెదో!

ఉ. లోకములోన స్త్రీజనుల, లోలుపులై తమయన్నదమ్ము లెం
తో కరుణించి గౌరవముతోఁ గనుచుందురు; వస్త్రవాహనా
స్తోక విభూషణాది వసతుల్గలిగింతురు; గాని యిట్లు పే
రాకలిగొన్న సింహముక్రియన్ గబళింపఁగఁ బూనుకొందురే?

మ. అకలంకోజ్జ్వలకీర్తికాముఁడవునై యత్యాశఁ బోద్రోలి మా
మక సౌభాగ్యసుమంబులో మధువుసంభావింతువా? సఖ్యమే
వికలావస్థను లేవఁదీసి యిటులే వేధింతువా! సాఁగనీ!
యిఁకనీయిష్టము; రెంట నేదిహితవో యీవే వరింపందగున్.

ఆ.వె. చెప్పదగినవన్ని చెప్పితి నాపైనిఁ
జెప్పఁబోను వేఱ చెప్పలేను
జేయదగినవైనఁ జేయుము కాకున్న
మానుకొనుము రెంట మాకె శుభము.

తే.గీ. నీవునొకమానవుఁడవని, నీకుఁగూడ
హృదయమునునదియున్నదని, దయకలిగి
కఱఁగునేమోయని తెగించి కరుణపొరయు
మాటలాడితి క్షమియింపు మనుజనాథ.

ం. అనవినిమోదఖేదములు నాగ్రహ నిగ్రహముల్, మనోరుజా
వినిమయముల్, పెనంగొనుచుఁ బేరిమిఁ దాండవమాడుచుండ, నే
మనుటకునోరురాక నొక యర్థనిమేషము మౌనధారియై
కనెఁ దన చెల్లెలిన్ మఱఁది; గౌరవమొప్పఁగఁ గంసుఁడత్తఱిన్

ఉ. అండజవాహనుండు దనకాదరువై వసుదేవుఁ డంతగా
ఖండితమాడుచున్న వినఁగా సహియించెనుగాని, తామ సో
ద్దండుఁడ, చండశాసనుఁడు, దక్షుడు, గండరగండ, ధీరుఁడౌ
గుండెలు దీయు బంటు పటుకోపుఁడు కంసుఁడు సైపనేర్చునే?

ఉ. ఎంత కిరాతుఁడైన, గుణహీనుఁడెయైన, ఋణానుబంధ శు
ద్ధాంతర సంస్కృతిస్మృతి యొకప్పుడు గల్గకపోదు; కాన దు
ర్దాంత సరాగసత్వుఁడగు దానవకంసుఁడు జ్ఞప్తికల్గి తా
క్షాంతివహించె; నొక్క త్రుటికాలము; లోలిత చిత్తవృత్తుఁడై.

మ. వసుదేవా! నిజమాడినావు; భువిలో వైవాహికానందముల్
ప్రసవప్రాప్త సుఖానుభూతులకు సామ్రాజ్యమ్ములేకాని, దు
ర్వ్యసనత్రాసములందు తప్పనివి; యాప్రారబ్ధమే నీకు వె
క్కసమైవచ్చెను; నీవుకర్మునిది; దుష్కాలంబు వాటిల్లుటన్.

తే.గీ. నీకు లోకముతోఁబాటు నేను జెల్లి
నిచ్చి పెండిలిఁజేసితి నిట్లువచ్చు
టెఱుఁగ నాకాశవాణి విధించె నిట్టి
శిక్ష లందుకు నేనేమి చేయఁగలను?

క. మీకాపురమేమైనను
నాకేమీ? నేను బ్రదుకునాఁడు కదా? యీ
వ్యాకులములు నాకులములు
ప్రాకటముగ హృదయమందు వరుసఁజెలంగున్.

తే.గీ. సూతికాగృహమందు నేఁజొచ్చియిపుఁడె
నాకు, మారకుఁడైన వినాశకరుని
దేవకీదేవి యొడినుండి దిగువలాగి
ఖండ ఖండములుగ హేతిఁ జెండివైతు.

క. అని కంసుఁడు కోపోద్దీ
పనమున నటనేగుచుండఁ బరికించి యశో
ధనుఁడగు వసుదేవుఁడు వా
నిని నిల్పి కుమారిఁదేర నేమించె సతిన్.

తే.గీ. అపుడపుడె తేరుకొనెనేమొ యంబుజాక్షి
దేవకీదేవి పతియాజ్ఞ దెలిసి, హృదయ
శూన్యమై నేలఁజూచుచు స్రుక్కి సూతి
కాగృహమువీడి మెల్లఁగా గాలుగదిపె.

తే.గీ. విరియఁబడు కొప్పు; ముఖముపైఁబొరయుకప్పు
నిప్పుకలుగుప్పుకనువిప్పు; నీటుదప్పు
మైలతికయొప్పు; తబ్బిబ్బుమాటచొప్పు
నపరశోకావతారము నందె లేమ.

ఉ. కాలునివోలెఁ గట్టెదుట ఖడ్గము ద్రిప్పుచుఁ బ్రల్లదంబులన్
బ్రేలుచుఁ దూలిపోవుచు, విభీతిదమౌ మిడిగుడ్లు ద్రిప్పుచున్
బాలను బొట్టఁబెట్టుకొన బారలుసాచు కిరాత కంస భూ
పాలునిఁబ్రేమోలనిల్చె సతి; వ్యాధునిచెంగటఁ జిల్కరీతిగన్.

తే.గీ. పచ్చిబాలెంత; యపుడె భూపతనమైన
పురిటి నెత్తురు కందును గరములెత్తి
పెద్దపులినోటిలోఁ దానె పెట్టవలసె
హరి హరీ! యిట్టియాపదఁ బొరయరాదు.

తే.గీ. ఈతఁడష్టమ గర్భసంజాతుఁడు ననుఁ
ద్రుంచువాఁడు కాబోలు, నీకుంచెకోల
వంచి యాకాశవాణి జిహ్వాకవాట
మునుగుదించి మూయించెద ననుచుఁ బ్రేలి.

క. పగఁబట్టియున్న సర్పము
పగతునిఁగని కాటువేయ వడువెనయఁగఁ దై
కొఁగఁ బ్రాకి ఫణమునెత్తెడు
తగవునఁ జేయెత్తె నృపుఁడు తద్బాలికకై.

ఉ. అంతటదేవకీసతి దురంతదవానల మాలికా సమా
క్రాంతలతాభయైనిలిచి కన్నులు జొత్తిల, భీతచిత్త వి
భ్రాంతతమోవికార పరిరంభములంబడి సొక్కిపోయి, యొ
క్కింత దలంగి హస్తములనెత్తి కుమారికఁ జూపి యిట్లనున్

శా. అన్నా! అల్లుఁడు కాఁడు; కోడలగుఁజుమ్మా! దీనిఁగాపాడుమీ!
పున్నెంబౌను; కుమారుఁడైననె కదా పూనిక్తన్ వధింపంగనౌఁ
జిన్నారిం దెగటార్చి నీవెనయు నా శ్రేయమ్ము లెట్లుండునో
మన్నింపందగు; నీకు మ్రొక్కెదను; సంభావింపుమా నామదుల్.

క. అనవిని నివ్వెఱపడి నె
మ్మనమున ననుమాన మొదవి మానిని యురమం
దెనసిన బాలిక విధిగాఁ
గనుఁగొనెఁ గనులప్పళించి కంసుఁడు భీతిన్.

క. తనకనులను దా నమ్మఁడు;
కనుఁగొను; నౌనౌను; దెలిసెఁ; గాదిది యేదో
కనుగట్టు గారడీపని
యను మఱలంగాంచు, విసుగునందుఁ గలంగున్.

క. చిడిముడిపాటున బొమ్మలు
ముడిఁబెట్టెడు; నొడుగఱచు మూర్ధము ద్రిప్పున్
దడఁబడి నడయాడును మది
చెడి తనలోఁ దానె నవ్వుఁ జిందులు ద్రొక్కున్.

క. ఆకాశవాణి చెప్పిన
దీకానుపుగాద? దీననేకద! హరి దా
నాకై భువి జన్మించుట
యీకారణ మిట్టు లౌట కేమి కతం బౌ?

తే.గీ. అని గడియ యోజనలు సేసి మనము రెచ్చి
వెచ్చనిట్టూర్పు పుచ్చి యివ్వింతయందు
నేవొ గూఢరహస్యము లిమిడియున్న
వెవ్వఁడో కారకుఁడు గలఁ డిం దటంచు.

క. తేతెమ్ము కూతురో! యది
భూతమొ! ప్రేతమొ! పిశాచపోతమొ! యేదో!
యేతీతువైన వధ్యయొ?
పోతరము న్వీడు మనుచు భూపతి కినుకన్.

తే.గీ. చెలువచేతులయందుఁ బొత్తిళులలోన
నున్న కసిగందుఁ జేతితో నొడిసిపట్టి
కఱకు ఖడ్గముఁ గ్రిందుగా బఱపి దాని
పైఁ బడెదునట్లు బాలను బైకి విసరె.

చ. అదియటుపైకిఁ జిమ్మబడి యాకసమందున దివ్యమూర్తియై
పొదవు చతుర్భుజంబులును, బూర్ణశశాంకుని బోలుమోము, నొ
ప్పిదమగు దేహసంపదయుఁ బెంపగు హారకిరీట భూషణాం
గదము లెసంగ నిల్చి వెటకారముతో ననెఁ గంసభూపుతోన్,

శా. ఓరీకంసనృశంస! మానుమిఁక నీయుద్యోగసంరంభముల్
సారాసారవివేకహీనుఁడవునై సన్మార్గులౌ పుణ్యులన్
గారాగారములందుఁ బెట్టి సతమున్ గారించుచున్నావు నీ
నేరంబిట్టిది సైపరాదు; వినుమీ నీకింకఁ జేటయ్యెడిన్.

తే.గీ. యోగమాయను నేను నీ యాగడములఁ
దెల్పఁగా వచ్చియున్నాను దేవదేవుఁ
డాదివిష్ణుఁడు వ్రేపల్లెయందుఁ జేరి
పెరుగుచున్నాఁడు నినుఁజంపఁ దఱిని వేచి.

చ. ఖలుఁడవు నీవు సాధువులఁ గాఱియవెట్టెదు నీహితంబు లోఁ
దలఁచి వచించు నార్యుల మదంబున ధిక్కరణంబొనర్తు వి
శ్వలయముగల్గు కార్యముల వాంఛయొనర్తువు నీదురాగతం
బులు కొనసాఁగు నెప్పుడని పొంగుదు వీవు నిరంకుశుండవై.

ఉ. చండభుజాబలంబున నెసంగిన దానవరాజు లెందఱున్
గొండొకనాఁడు ధాత్రిపయిఁ గూలుటెఱుంగవొ యింతకాలమా
ద్దండత మించి సాధుజనతా పరిపీడనఁబొందు పాపముల్
పండినవోయి కంసనరపాలక! కాలమునీకుఁ జేరువౌ.

ఉ. దేవకిఁ జంపినంతట మృతిం గనఁబోనిక నేనటంచు దు
ర్భావముతోడ సోదరినిఁ బట్టి వధింపఁగఁ జూచితీవు ల
జ్జా విధమింతలేక శిశు సంహననంబునకుం గడంగి తే
త్రోవఁ జరించినన్ విధిహతుండవుగాక మనంగ నేర్తువే.

మ. ఇలపైఁ బుట్టినవారలెల్లరును దామెన్నాళ్ళు జీవించినన్
దలఁగంజాలరు కాలపాశహతి సత్యం బింత నీ కింతకుం
దెలియంజాలదొ తుచ్ఛదేహమున సక్తింజేసి నీవెన్ని ప్రా
ణుల హింసించితి వీమహాఘము నినున్ దూలింపదే యార్తులన్

ఉ. శ్యామల మోహనాకృతి సమస్త జగత్పరిపూజ్యమూర్తి ల
క్ష్మీ మహిళామనోహరుఁడు శ్రీహరి నిన్వధియింపనచ్చు నీ
వేమెయి సాహసించినను మృత్యువుతప్పదు నేఁటికైనఁ బ్ర
జ్ఞామహితుండవై సుజన సంగతితోఁ జరియింపఁ జూడుమా.

వ. అనియిటుయోగమాయ తెగనాడుచునుండఁగ గంసుఁడాగ్రహ
మ్మునఁ గరవాలమెత్తి చలమున్ బలమున్ మెఱయంగ నాలతాం
గిని వధియింపఁ జూడఁ బరికించి హసించుచు నా నెలంత యా
తని యసికందకుండఁగనె తాలిమి దప్పక వెండి యిట్లనెన్.

మ. తగునోయీ! యిటువంటి చెయ్దములు తథ్యమ్మెన్న నినుంబోలు భీ
రుగణాగ్రామణికిన్ గుబుద్ధికిని నేర్పుల్ నీకు బోధింపఁ జూ
డఁగ నజ్ఞానము యౌను గాని మఱి వీడన్నేర్తువే జన్మ మా
దిగ నీకేర్పడినట్టి దుర్గుణము ధాత్రీనాథ! వీరుండవే.

మ. ననుఁ జంపన్ దలపోసి తీవు బళిరా! నాచిత్రచారిత్ర మెం
దను విన్నాఁడవుగావు త్వాదృశులు దీనుల్ నన్నుఁగన్నెత్తి చూ
డ నశక్తుల్ మఱిచంపఁగల్గుటెటు మూఢా! నాప్రభావంబుచే
తన వర్తించు జగమ్ములెల్లఁ బరమార్థం బింత గుర్తింపుమా!

ఉ. నానుడియందు నిక్కముగ నమ్మికకల్గదయేని శంక యే
లా? నృప! నీదునాయుధము లన్నియు నిప్పుడ నిభుజాబల
శ్రీ నెఱయంగ నేయుము పరీక్షయొనర్పుము తత్ఫలమ్ము మో
దాన భవత్పరాక్రమ విధానము నేను నొకింత చూచెదన్.

మ. వెకలీ! నా కరుణావలోకనమునన్ విశ్వంబునన్ నీకు శౌ
ర్యకలారేఖ యొకింత యేర్పడియె నీవజ్ఞానివై వీరకో
టికి నేనే మొనగాఁడనౌదునని యీశేవన్ విజృంభింతువా
ప్రకటత్వద్భుజశక్తి యంతయును నీపై నేమగుం జూడుమా!

మ. అని యీమాయ యిటుల్ వచించి దరహాసాంకూరముల్ తోఁగమై
మొనయంగెందలిరాకు మోవి చెలువమ్ముల్ గ్రుల్కఁ గందోయిఁ బ
ర్విన రమ్యద్యుతు లింపునింపఁగ ధరిత్రీకాంతు డాయంగ వ
చ్చినయట్లె మఱికానరాకునికి నచ్చెర్వొంది కంసుండటన్.

క. ఆపాదమస్తకంబుగఁ
బ్రాపించిన కంపమున ధరాపతితుండై
శ్రీపతి యారూపునఁ దన
యేపడఁగించునో యటంచు నెంతయు వగతోన్.

చ. ఎఱుఁగుదు మాయలన్, సురల నెందఱినో రణరంగమందు భీ
కరముగ నోర్చితిన్ దుదకుఁ గామినియొక్కతె తూలనాడ నె
త్తెఱఁగున నిల్వ నేరనయితిన్ మఱి భీతుఁడనైతి నేఁటి య
చ్చెరువిది కన్నె లేడిఁగని సింగము తత్తఱపాటు నొందెడిన్.

ఉ. ఈవెఱపెట్లుకల్గె? హరి యెట్లు వధింపఁగఁ గల్గు నన్ను? మా
యావి యతండు శక్తుఁడగునా యిటుదాఁగఁ బనేమి? మాయ యి
ట్లే వెలయించి తాను గృతకృత్యుఁడు గాఁదలపోసెనేమొ! కా
నీ! విధి యట్టు లున్నయది యేమొ! యిటుల్ దగఁ గుంద నేఁటికిన్.

తే.గీ. ఇది హరి కృతంబుగాని యింతేని దేవ
కియును వసుదేవుఁడెఱుగరు కృపణుఁడనయి
బాంధవుల నెల వేధింపవలయునింక
శౌరిమాయకుఁ బ్రతిమాయ సలుపలేక.

తే.గీ. ఈమెఁ బ్రాణాధికముగ మన్నించి యుంటి
నాఁడు; చెఱనుంచి యేడ్పింతు నేఁడు; మృత్యు
వార్త విన్నంతనే యెంత పట్టిమాచు
చున్నవితయయ్యె సోదరి యుసురు తగిలె.

క. అని మనమునఁ బరితాపము
గొని మానము నంది, శాంతి గోల్పడి, బడుగై
కనుఁగొలఁకుల నీరంబులు
గొనకొని స్రవియించుచుండఁ గోమలిఁ గాంచెన్.

తే. దేవకీదేవి వాని నేత్రోత్సవముగఁ
గాంచి మది కొంత కలఁగెను గాఁ దలంచి
మెల్లగా లేచి దరిఁ జేరి చల్లఁబడగఁ
బిలిచె నన్నా! యటంచు సంప్రీతి గదుర.

క. అన్నా! యను పిలుపున నే
మున్నదొ! పాయసము గంసు నుల్లములోనన్
భిన్నాభిప్రాయము లెటు
లున్నవొ! ఖిన్నత్వ! మెంత జారెనొ కడఁకన్.

తే.గీ. ధరణిఁ బ్రేమైక హృదయుల తలఁపులందుఁ
గారణాంతరములఁ గలు కలఁత లారి
యొండొరులు పిల్చుకొనుటలో నున్న హాయి
మధురమో! పాయసమొ! దివ్యసుధయొ! యేమొ!

సీ. కలఁగనే కలఁగదు; కలఁగెనా! పెడబుద్ధి
తలుగనే తలుగని కరుణఁ బొరయు
విప్పనే విప్పదు, విప్పెనా! ఫణి మణి
గుప్పికాంతుల నెల్ల కప్పు విప్పు
ఈయనే యీయఁడు; నిచ్చెనా! ధనలోభి
యరమర లేక ద్రవ్యమ్ము నొసఁగు
పలుకనే పలుకఁడు! పలికెనా! మునిరాజు
పలుకుఁబల్కునఁ దేనె లొలుకఁ బలుక

తే.గీ. నెన్నఁడో కాని యిట్టివి యెనసిరావు
వచ్చెనా కుప్పతిప్పలై రెచ్చుచుండు
కంసుహృదయ మానాటికిఁ గలఁగి కలఁగి
దేవకీదేవిపైఁ గూర్మి తావు గనియె.

సీ. చలనచిత్రమున బొమ్మలువోలెఁ గృతవిధుల్
హృదయభిత్తిని గోచరించుచుండ
దాఁజంపిన కుమారతతి ఖడ్గములు జాపి
పొరసి ఢీకొనుచున్న వరుస దోఁప

యోగమాయ చెలంగి "యోరికంసా" యన్న!
పిలుపు ప్రతిధ్వనుల్ కలతఁబెట్ట
హరి చేత నిశితాసి నంది వరాంగము
నుత్తరించెడు భ్రాంతి తత్తఱింప

తే.గీ. కంసుఁడంతట నెమ్మదిఁ గలవరపడిఁ
బిలుచు ప్రేమైక సోదరి పలుకు వలన
హృదయము ద్రవించియొక్కింత పదిలపడగ
భావనా ప్రపంచములోనఁ బడియెనపుడు.

క. కరయుగ్మముచే దేవకి
చరణమ్ములు పట్టి చిత్తచాంచల్యమునన్
గరుణాగస మురియాడగఁ
బరివేదన లంది యిట్లు పలుకఁదొడంగెన్.

శా. అమ్మా! దేవకి! యీనృశంసుఁడు నికృష్టాత్ముండు దుర్మార్గతన్
గిమ్మాగ ప్రతిమానరాక్షసుఁడు సాక్షేపంబుగా నిన్ను నీ
సమ్మానంబు హరింపఁ బొల్పడిన నీచస్వైర సంచారి మా
యమ్మా! వీని క్షమింపుమా! యుడుగుమమ్మా! శోకతాపమ్ములన్.

మ. చెఱఁ ద్రోయించితి శిక్షఁ జేసితిని విక్షేపించి నీపుత్రులన్
గరవాలంబున కప్పఁజెప్పితి వృథా గాలించి గోరించి దు
ర్భరశోకాబ్ధుల ముంచి తేల్చితిని నిర్వంశంబు గావించి యి
గ్గిరగుల్గొల్పితి నీ ప్రశాంతహృదయక్షేత్రంబునన్ సోదరీ!

తే.గీ. స్వార్థపరుఁడను దుష్టకార్యార్థి నగుచుఁ
జేయరానన్ని యపకృతు లేసినాను
సాధుసజ్జన హృదయము ల్బాధ పెట్టి
ఫలము వెలి వోక గైకొని తలరినాను.

తే.గీ. కలుషుఁడను దోడబుట్టువు కన్నవారి
వనపరాధులఁ జంపిన యధమవృత్తి
బాలఘాతకుఁడఁగిరాత బాలిశుఁడను
క్షమకుఁ బాత్రుఁడఁ గాని రాక్షసుఁడ నేను.

వ. అని వసుదేవుఁగాంచి యనఘా! మహనీయులు మి మ్మకారణం
బునఁ దెగనాడి మీహృదయముల్ శ్రమపెట్టిన క్రూరకర్ముఁడన్
నను క్షమియించుఁడీ! యని ప్రణాముఁవిధు ల్వొనరించు కంసభూ
పుని వినయంబుల న్వినుచుఁ బోలునె? యాతనికిట్టి చందముల్.

తే.గీ. దక్షు నతివినయము ధూర్తలక్షణ మని
బుధులు పల్కుదు రవ్విధి పొడమెనేమొ!
కంసుఁడేడ? పశ్చాత్తాపకలన మేడ?
కఠినపాషాణము ద్రవింపఁగలిగినట్లు.

మ. ఇది దైవాజ్ఞయొ! లేక కైతవమొకో! యేమైనఁ గానిమ్ము త
ప్పుకు కాలోచితకృత్యము ల్దలుప సంభావ్యం బటం చెంచి స
మ్మోదమొప్పారఁగఁ గంసుగాంచి యనె నో భూపాల! నీయందుఁ ద
ప్పిది మేమీ? యనివాక్యచుర్విధి విడంబించెన్ ఫలం బిట్లు గాన్.

శా. ప్రాప్తాప్రాప్త ఫలాఫలంబులను గూర్పందీర్ప నెవ్వానికా
వ్యాప్తింజెందునె కాని సర్వమును దైవాధీనమై భూపతీ!
యాప్తశ్రేణికిఁ జెందునీవు మము నన్యాయంబు గావింప నీ
సుప్తింగూడఁ దలంచెదే? విధి మము న్బోధించెఁగా కిట్టులన్.

మ. అని యోదార్చినఁ గంసుఁ డూరడిలి స్నేహం బేర్పడం దేవకిం
గని తల్లీ! యిటులేల యేడ్చెదవు? నీకష్టంబు లీడేరెడిన్
గనుమీ నన్ను దయార్ద్రచిత్తవగుచుం గంసుండ నీసోదరుం
డను ప్రార్థించుచునున్నవాఁడ నని యాడన్ దీనయై యామెయున్.

క. అన్నా! యెన్నాళ్ళకు నేఁ
గన్నారం గంటి పూర్వకంసనృపాలున్
విన్నా నన్నిప్రియంబుల
నున్నన్ మఱి చన్న నొకటె యుర్విన్నాకున్.

శా. నీపైఁగోపముచేత నే ననునుగానీ యేది యెట్లైననుం
నాపాపంబెకదా! ఫలించి విధిగా నానావిధారిష్టముల్
ప్రాపైకన్న కుమారుల న్మనసవె నిర్వంశంబు గావించె న
య్యో! పైకొమ్మలు కూలి మ్రోడువలె నే నున్నాను నిర్జీవనై.

క. జీవితశేషం బెటనో!
యేవనిలోనో! విరాగవృత్తి న దెట్లో
భావించి కడపి పిమ్మట
గైవల్యముఁ జెంద నిచ్ఛ కలిగెడు నాకున్.

తే.గీ. ఈప్రపంచసంబంధమ్ము లేల మాకు?
మంచియో చెడ్డయో యేదో మించిపోయెఁ
బ్రాయమా తీరిపోయెను వార్ధకంబు
వచ్చె హరినామమే సుమీ వలయుఫలము.

చ. అనివిలపించు సోదరిని నాదట మీఱఁగఁగాంచి తేరు తె
మ్మని పనివిన్న భృత్యులు రయమ్మున నిల్ప శతాంగ మందు నో
య్యన వసుదేవ దేవకుల నాదరభావముతోడ నిల్పి క్ర
న్ననఁ జెఱమాన్పి పూని పయన మ్మొనరించెను గంసుఁ డత్తఱిన్

చ. ఇది పరమేశ్వరాజ్ఞ యయి యిట్లు దనర్చెనుగాక గంసు నె
మ్మది త్రుటిలో ద్రవించుటలు మన్ననజేయుట లార్తి దీర్చుటల్
సదమల భావమొప్పుటలు సాధ్యమె? యశ్రుతపూర్వమంచునున్
హృదయములం దలంచి పయనించిరి దంపతు లార్తి దీఱఁగన్.

ఆ.వె. నెమలికంటిసీరు నెనరునఁ దుడువంగ
గడఁగినాఁడు వేటకాఁడు నేడు
నల్లగుండు కఱఁగి వెల్లువయ్యె హాటె
నహహా! దైవచిత్ర మని తలంచి.

చ. రయమున దేరు దోలి మధురాపురివీథులఁ జొచ్చి యొప్పుగాఁ
బయనము జేయుచుండఁ గని పట్టణవాసులుఁ జేరవచ్చి ము
త్తియములఁ జల్లువారుఁ బ్రణుతించెడువారు నివాళు లిచ్చి ప్ర
త్యయములు చూపువారు గనులారఁ గనుంగొనువారు నైప్రజల్

సీ. బంగారుబొమ్మ దేవకితల్లి యి ట్లయ్యె
నక్కటా! యని జాలి నందువారు
కుచ్చిళ్ళ నాఁడె కన్గొంటి మీమె నటంచు
ననుతాపమునఁ బ్రియ మాడువారు

పాడుచెఱను నెట్టిబాధపడెనో! యంచు
నను తాపమునఁ బ్రియ మాడువారు
కన్నపాపలఁ బట్టి కంసుఁడు విదళింప
నె ట్లోర్చెనో!యని యేడ్చువారు

తే.గీ. నగుచు నానావిధంబుల నతివ లెల్ల
సహజ కరుణార్ద్ర భావముల్ సందడింపఁ
గంసు ననుకంప మివుల నక్కజము గొల్ప
వింతగాఁ జూచుచుండంగ వేడ్క గనుచు.

వ. చనిచని స్యందనంబు నిజసౌధముచెంగట నాపి కంసుఁ డో
య్యనఁ గయిదండ లిచ్చుచు స్వయమ్ముగ దింపి గృహప్రవేశవ
దనరఁగఁ జేసి తొల్లిటి ముదంబును నెయ్యము సందడింప సాం
త్వనవచనమ్ములం బలికి వారి నవారిగ గారవించుచున్.

క. బావా! మీస్వగృహముగా
భావించి వసింపుఁ డిందు వసతులెల్లన్
గావించెద నేమించెద
సేవకులన్ మీదునాజ్ఞఁ జేకొని నడువన్.

వ. అని వసుదేవదేవకుల నంచితరీతి బహూకరించి నె
మ్మనమున నూఱటం గని క్రమంబుగ వారల యాజ్ఞఁబొంది పో
డోకని నిజమందిరంబునకు గొబ్బున నేఁగెను గంసరాజు వా
రనయము దైవశక్తిఁ గొనియాడుచుఁ గాలముఁ బుచ్చి రయ్యెడన్

ఆ.వె. పాముపడగనీడఁ బడియుండు భేకము
వోలె నెప్పు డేమి పొసఁగు ననుచు
సందియమ్ము నొంది సతియుం బతియుఁ గాల
మొకరీతిఁ గడపుచుండి రందు.

—* వ్రేపల్లెలోని వేడుకలు *—

తే.గీ. అచట వ్రేపల్లెలో న్యసనార్త యైన
సతి యశోద కన్నులు విప్పి సంభ్రమమునఁ

ప్రక్కఁగా బాలుఁబొడఁగని భర్తతోడఁ
బలికె విస్మయభావ మగ్గలము కాఁగ.

మ. కలయో! నిక్కమొ! రమాపతి కటాక్షప్రాప్త సౌభాగ్యమో
యిలలో నశ్రుతపూర్వదివ్యవిభవం బీక్షించుచున్నాను గ
న్నులు జ్యోత్స్నకళ లీనుచున్నయవి చిన్ముద్రాప్రసూనాంచితో
జ్జ్వల సౌరభ్యము లిమ్పుచున్న దహహా! జన్మంబు సాఫల్యమౌ.

వ. అని యా నందసుందరి విభ్రాంతితో,

క. మృతబాలిక పసరుజ్జీ
విత మైన విధమ్ము నోఁప విస్మితచిత్తం
బతుకుగొని కూర్మికూనను
గుతుకమ్మునఁ గాంచి కాంచి కోమలి యంతన్.

ఉ. భ్రాంతి యొకింత దీరి పసిపాపను జేతుల నెత్తి వింతపై
వింతలు నేఁడు గానఁబడు వీఁ డెవఁడీపసిబాలుఁ డెట్లు నా
యంతికమందుఁ జేర్పబడె నద్భుత మౌ నని యింతి తా మనః
కాంతునిఁ గాంచి ప్రశ్న లిడఁగా నతఁ డిట్లనె సమ్ముదమ్మునన్.

మ. తరుణీ! యీతఁ డనన్యలభ్యుఁడు శుభోదర్కుండు నందవ్రజాం
తరని రేజకుమార సూర్యుఁడు యశోదావత్సలుండై వసుం
ధర జన్మించెను దత్తపుత్రుఁడయి నీ తల్పంబునం జేరి నాఁ
డురుసంభావ్యుఁడు ప్రాణతుల్యముగ నుద్యోగించి పోషింపుమీ!

మ. అన! నుత్ఫుల్లమనఃప్రసూన యయి దివ్యానంద వీచీ నిమ
జ్జనసౌభాగ్యవిలాస కేళికల స్వచ్ఛందంబుగాఁ దేలుచున్
ఘనసుశ్యామశరీరు మోహన కళాకందర్ప సంకాశు నం
దను, విస్ఫారితనేత్ర యై కనె యశోదాదేవి సోత్కంఠ యై.

వ. కని ముదమందుచున్ దనివి గల్గక యారతు లెత్తి చారులో
చనయుగళ ప్రదీపికల చాలనలోల విలాస వైఖరుల్
పనుపడఁజేసి ప్రేమమయబాష్పజలమ్ములు లాలవోసి క్రొ
న్ననలగు లేతనవ్వులఁ బసర్చి నమన్ మదిలోనఁ బొంగుచున్.

క. పరిచారికలు యశోదన్
దాసి సుచిత్వమ్ము నెఱపిరన్ మఱియవలన్
తరుణీమణి యొక్కర్తుక
చిఱుపాపను లేపనెత్తి శృంగారముగాన్.

తే.గీ. బొడ్డు కోసియు లాలలు పోసి శుభ్ర
వసనమున నొడ లొద్దిచి ధూపమ్ము వేసి
తల్లిప్రక్క నమర్చు పొత్తిళ్ళయందుఁ
బండఁబెట్టిరి కన్నులపండువుగను.

మ. హరి నారాయణమూర్తి దేవహిత కార్య ప్రాప్త రూపుండుగాఁ
బురిటింటన్ బసిపాపఁడై వెలయుచో మోదించి ప్రాగ్దేవి త
త్కరమందొప్పు నివాళిపళ్లెరములోఁ గర్పూర నీరాజన
స్థిరమై హారతు లిచ్చినట్లు లుదయించెన్ భానుఁడాదిక్కునన్.

తే. కంస మానసావృత ధైర్యకంచుకంబు
చించి చెండాడు మూర్తి జనించె ననుచు
దివిరి దివ్యులెత్తిన మణిదీప మనఁగఁ
బొడుపుఁగొండపై బాలభానుఁడు రహించె.

వ. వివిధ శకుంత సంతతులు విశ్రుతగాన వినోదమాధురీ
వివశతఁ జొక్కి చొక్కి వినువీధిని మంగళతూర్య నాదముల్
చెవులకు విందుసేయు క్రియఁ జేయుచు నాడుచుఁ బాడుచుండె శ్రీ
ధవుఁడు యశోదపజ్జ వితతంబుగ బాలకుఁడై రహింపఁగన్.

ఆ.వె. చెప్ప నేమి శౌరి చిద్రూపుఁడమలుండు
విశ్వమయుఁడు కాన పృథివిఁదనర
క్షితిననంతకోటి జీవరాసుల హృద
యములు కప్పువిప్పి యాడఁదొడఁగె.

క. వ్రేపల్లెలోని జనములు
పాపను గను సంభ్రమమునఁ బరువిడి చని రా
గోపకుఁడు నందునింటికి
నేపని పాటలు దలంప రేక్రియ నేనిన్.

తే. మనయశోదమ్మ చిన్నారి తనయు నొకని
గన్నదఁట చూచివత్తము గాక యనుచు
గోపకామినులెల్లరు గుములుకూడి
నందు నిలుఁజేరఁ జనిరి సానందలగుచు.

ఉ. ఆకలిదప్పులన్ మఱచి రండఱుఁ జంబకలోహసామ్యమై
శ్రీకరునందు లగ్నమయి చేరిన చిత్తము లత్తమిల్ల నా
లోకము లేకమై నిలిచె లోలుప లోచన నిమేష మీఁగి య
స్తోకమనీషలం దగిలి స్తోత్ర మొనర్చిరి శ్యామసుందరున్.

తే. గొల్లలము మూర్ఖుల మమాయికులము మేము
చల్లఁగాఁ బ్రోవ వచ్చితో నల్లనయ్య!
యుల్లములు పల్లవించె సూర్యోదయ మయి
మామనస్తామసములెల్ల మాసిపోయె.

ఉ. విజ్ఞులు కారు; కారణవివేకములేదు హరిప్రబోధ మం
దజ్ఞులు; వెఱ్ఱియాదవులనాహతచిత్తులు; భక్తియుక్తులై
యజ్ఞమయున్ మహామహితు నాశ్రితవత్సలు దేవదేవునిన్
బ్రాజ్ఞులువోలెఁ గొల్చి పలుభంగులఁ బాడిరి కూడి వేడుకన్

క. నందుఁడు బ్రహ్మానందముఁ
జెందుచు స్నానాదికములఁ జేసి శుచిత్వం
బంది మహనీయ భూసుర
బృందమునుం బిలువనంపెఁ బ్రియ మెసలారన్.

తే. బ్రాహ్మణులు స్వస్తి పుణ్యాహవాచనములు
చదివి శాస్త్రీయవిహితమౌ జాతకర్మ
సలుపఁజేసిరి నందుఁడు సంతసించి
వివిధదానము లొనరించె విప్రతతికి.

తే. గోరిజలకు శృంగములకు బంగరుమలాము
వేసి, పసుపుఁగుంకుమలను బెట్టియున్న
పాడిమొదవులు క్రేపులతోడఁ జేర్చి
విప్రులకు దాన మిడె నందవిభుఁడు చెలఁగి.

క. విలసిత మణిమయభూషణ
ములు నానావిధ దుకూలములు కానుకలుఁ
దిలశైలము లేడను వి
ప్రులకుం దానంబులిచ్చి పొందుగ నంతన్.

శా. ఈ యాభీర కుమారుఁ డూర్జిత యశోహేరాళుఁడై సంతత
ధ్యేయ ప్రాభవ దివ్య వైభవ సము ద్దీప్త ప్రతాపాంచితా
ధ్యాయారంభుఁడు దుష్టశిక్షణ కళా దక్షుండునై పృథ్విపై
నాయుశ్శ్రీ విభవాభిరాముఁడయి నిత్యానందుఁడై వర్ధిలున్,

క. అని సద్బ్రాహ్మణులా వ్రజ
తనయుని దీవించి యుచితదానంబులచేఁ
దనిసి మహామోదంబునఁ
వినుతించిరి నందుపట్టి విశ్రుతగుణముల్.

క. సురదుందుభు లాకసమున
మొఱసెను కాహళలు మ్రోఁగె ముదమారఁగ న
ప్సరసలు పాడిరి యాడిరి
గరుడోరగ సిద్ధ సాధ్యగణములు వేడ్కన్.

తే. మందలో గోగణములు సానంద కేళి
సలుపఁగాఁ జొచ్చె లేఁగలు సంభ్రమమునఁ
గ్రేళ్లుఱుక సాఁగెఁ బోతులు కెఱలి ఱంకె
లెసఁగఁ బ్రమదంబుతోడ వర్తించె నంత.

క: వ్రేపల్లెయందు నాఁడు మ
హా పర్వదినంబుగాఁగ యాదవులెల్లన్
శ్రీపతి భజనలు సేసిరి
తాపంబులు తొలఁగి చెలఁగి తన్మయులగుచున్.

సీ. గోమయ జలములఁగొని వాకిళులముందు
జల్లుగాఁ గలయంపి జల్లిచల్లి
పట్టెలుదీసి శుభ్రముగ లోగిళ్లను
నందంబు తనరార నలికియలికి

రంగారు శృంగార రంగవల్లులు వింత
వింతగా నందందుఁ బెట్టి పెట్టి
చివురుటాకుల విందుఁజేయు తోరణములు
ద్వారబంధములకు జారఁగట్టి

తే. పసుపు కుంకుమబొట్లును ద్వారములకు
నొప్పుగుఁబ్పెడు విధమున నుంచి యుంచి
మంగళాంగులు నందు గృహాంగణమును
దీర్చిదిద్దిరి యందాలు దేరునట్లు.

తే. పదునొకండవ రోజున సుదతులెల్లఁ
జేరి బాలెంత సుస్నాతఁజేసి బాలు
నకుఁ దలంటి లాలలువోసి నాఁటిపనులు
జలిపి రానందమునఁ గులాచార విధుల.

క. నంద యశోదలు బ్రహ్మా
నందముఁ జెందుచు గుమారు నామకరణమున్
బొందుగ జేసిరి భూసుర
బృందము లాశీర్వదింపఁ గృష్ణుఁడటంచున్.

ఆ.వె. పెరుగుపాలు వెన్న విరివిగాఁ గొనివచ్చి
కానుకలిడి ప్రమోదకలితులగుచు
గోకులంబునందు గోపాలకులు ప్రీతి
విందు గొనిరి నాఁడు నందునింట.

చ. మురుని కటారులో యనెడు మంగళ విగ్రహాలైన గోపికా
తరుణులలోన రమ్యమణిదామమునందలి కొల్కిపూస నై
పౌరయు యశోద మృత్కలశమున్ భుజసీమ వహించి వారితో
వరయమునాతరంగిణికి వచ్చె జలమ్ములు దేరనొప్పుగన్.

ఆ.వె. పురుఁడు దీరునాఁడు తరుణులు జలపాత్ర
లెత్తి నీరు దెచ్చుటిది సధర్మ
మనుచుఁ జేతులల్లె యానాఁడు యమునా జ
లమ్ము దెచ్చిరబల లిమ్ము మీఱ.

ఉ. అంతట వల్లవీరమణు లా జల పాత్రలు దింపి పేరట
మ్మెంతయు సంతసమ్మున ముగించి కుమారకుఁ బూలతొట్టిలో
వింతగ నుంచి మించి కడు వేడుకఁ జొక్కుచు జోలపాట ల
త్యంతముదమ్మునం బలికి రమ్యకరాంక శశాంకమూర్తికిన్.

శా. జోజో, నందకులార్ణవామృతకరా! జోజో కృపాసాగరా!
జో, జో, నీలపయోదమోహన కళాస్తోకప్రభా భాసురా!
జో, జో, గోకులదేశశోభనకరా! జో, జో, యశోదాకుమా
రా! జో, జో; సుకుమార! మారసమ! నందానంద సంధాయకా!

క. లాలీ బంగరుబాలా!
లాలీ నవమోహనాంగ లాలి కుమారా!
లాలీ గోపీజన హృ
ల్లోలా! లీలావతార లోకాధారా!

మ. అనుచుం జోలలు పాడిపాడి సతులత్యానందలై దృష్టిదో
ష నివృత్త్యర్థము నెత్తినీళ్ళ తుడుపుల్ చక్కట్లు గావించి చ
ల్లి నివాళించియు బుజ్జగించునెడ లేలీహానతల్పంబుపై
వనజాక్షుండటు నిద్రవోయె సుఖియై బాలుండు దా నూయెలన్.

ఉ. బంగరుడోలయందు విరిపానుపుపై హరినీలరత్నమున్
హంగుగ నిల్పుచందమున నర్భకుఁడాడుచునుండ నెంతయో
ప్పొంగి యశోద తన్మయతఁబొందెడురీతి మృదూక్తులాడుచున్
మంగళహారతిచ్చిరి సుమంగలులందఱుఁజేరి కూరిమిన్.

క. పేరంటమునకు వచ్చిన
నారీమణులందఱకును నానావిధ సం
భారములును దాంబూలము
లారమణి యొసంగె మోదమారఁ బ్రియమునన్,

మ. పసుపుం గుంకుమలిచ్చి చందనము సంబాళించి తాంబూలముల్
కుసుమవ్రాతము నానఁబ్రాలు ఫలముల్ గోధూమచూర్ణంబు లొ
ప్పు సుగంధమ్ము లపూపముల్ ల్చలిమిడుల్ పూబోండ్లకర్పించి సం
తసమారన్ గయికోలు సేసెను యశోదాదేవి యుప్పొంగుచున్.

తే. అంత నర్ధాస్తమయమైన నర్భకునకు
బాలొసఁగి తలనంటియు లాలఁబోసి
తిలకముందిద్ది కాటుకదీర్చి తల్ప
మునఁ బరుండఁబెట్టె యశోద ముదముగదుర.

క. అల్లారుముద్దుగా నిటు
నల్లని కృష్ణయ్య నంగనామణి యెంతో
నుల్లాసమ్మునఁ బెంచెను
గొల్లపడుచులెల్లఁ దన్నుఁగూడి మెసలఁగన్

శా. బాలుఁడు శుక్లపక్ష హిమభానునిరీతిఁ బ్రవర్ధమానుఁడై
లీలల దేలియాడుఁ గుసిలించు హాసించుఁ గుదించు నెన్నొ చం
దాలుగఁ గాళ్లుచేతులు గదల్చును; ముద్దులుమూటగట్టు ద
న్నా లలితాంగులెల్లఁగని యద్భుతమోదరసాబ్ధిఁ దేలఁగన్.

మ. అదియేనాఁటి ఋణానుబంధమగునో యానాఁడు వ్రేపల్లెలో
యదువంశోద్భవులెల్ల బాలకుని నిత్యంబున్ బొడంగాంచకే
ముదితుల్ కారు; కుమారవీక్షణముఁ బ్రాముఖ్యంబుగాఁ జేతు
య్యది దైనందినచర్యయయ్యె; హరిమహాత్మ్యంబు సాహిత్యమై.

ఆ. చన్నుగుడుపువారు జలకమాడించు వా
రాడువారు ముద్దులాడువారు
పలుకరించువారుఁ బరిచర్యలొనరించు
వారు నైరి గోపవనితలెల్ల.

క. అందఱి హృదయమ్ముల నా
నందము దళుకొత్తి కనుల నమృతరసమ్మున్
జింది వ్రజాంగనచేతుల
కందుకమైమెలసె శౌరి కన్నయవేడ్కన్,

—* పూతనాసంహారము *—

ఉ. అట మధురాపురమ్మున దురాత్ముఁడు కంసుఁడు యోగమాయ ప్ర
స్ఫుట వచనమ్ములందలచి పూతనరక్కసి బిల్వనంపి యొ

చ్చట హరిపుట్టెనో యతనిజాడ లెఱింగి వధింపఁజూడఁగా
బటుతరమైన యాజ్ఞలిడి పంపె నిలింపులు సంచలింపఁగన్,

తే. ప్రమద దైతేయ భామిని భాగ్యమనుచుఁ
కంస రాజేంద్రు నానతిఁ గని రయమునఁ
గామరూపిణి మానవ కాంతవోలె
బాలకుల పాలి మారియై బయలుదేరె.

చ. చని చని దేశ దేశములఁ జక్కని బాలురఁ బట్టి యెట్టులో
హననముఁజేసి చేసి తమియారక యంతట వత్సనాటికిం
జని యట నందబాలకు ప్రశస్త మహత్త్వము నాలకించి వా
నిని హరిఁగాఁ దలంచి కడు నేర్పున నుక్కడఁగింప నెంచియున్.

సీ. ముఖపద్మమందు గుమ్మున మూఁగి నెఱికురుల్
మధుప విక్రీడల మలయుచుండ
చెక్కుటద్దములలోఁ జిరునవ్వుల వెలుంగు
లింపుమీఱఁగఁ జెల్వమినుమడింపఁ
బసిఁడిమైఁ దీవపైఁ గుసుమ గుచ్ఛములట్లు
స్తనమంజరులు కేళిఁజలుపుచుండఁ
మదనాయిత విలాసమాధురీ గరిమతో
నధరబింబము కామ మదివెలార్ప

తే. నూత్నయౌవనశోభ నూనూగులతిక
నతుకు గోము విధాన సమ్మతిదనర్ప
మదన జగదేక పూజ్య సామ్రాజ్యలక్ష్మి
యన నిశాటి నరవధూటియై రహించె.

సీ. కురులు నున్నగదువ్వి గోరించి సారించి
వాలుజడన్ జతవాలు సేసి
హొయలుగా దిగజారి బయలుగాఁ గన్పించు
విఱజాజి పూదండ తురిమివేసి
మోమునఁ గస్తూరిబొట్టుఁ జక్కగదిద్ది
కనులఁగాటుక నీటుగా నమర్చి

జాళువాసరిగంచు చలువపావడ గట్టి
మైజారు పయ్యెద మలుపు ద్రిప్పి

తే. గుట్టు జోకొట్టు రవికలోత్తట్టు దొడిగి
యగరు జవ్వాది గంధములలఁది మేనఁ
దారహార విభూషణ తతి ధరించి
యింతి మరువంతి రతనాలబంతి యయ్యె.

ఉ. పయ్యెదకొంగులో నణఁగుబంతులొ? మన్మథశాస్త్రపారముల్
వెయ్యివిధాల నూల్కొలుపు విస్తృతమౌ గిలిగింతలో కదున్
నెయ్యముగూర్చు దొంతులని నిచ్చలు శిల్పకళా చమత్కృతిన్
వియ్యములందు బంతులన వేడుక గూర్చుఁ గుచంబు లింతికిన్.

క. ఉబ్బెత్తు గుబ్బలంగని
తబ్బిబ్బయి పాలుద్రావు తమకముతోడన్
బబ్బముగాఁ బసిపాపలు
గొబ్బున దూకెడు విధానఁ గుచములఁ బెంచెన్.

చ. చనుమొనలందు దుర్విషముఁ జక్కఁగఁ జక్కని పూతఁబూసి నా
సన గమనింపరానటులఁ జందనమున్ బయిదిద్ది కంచుకం
బును ధరియించి పయ్యెదను బొందుగఁ బైసవరించి బాలుసన్
జనుగుడిపింపనెంచి కడుసంభ్రమముం దులకించి వింతగన్.

ఉ. ఆతత కామఖేల లురియాడఁగఁ బయ్యెదకొంగు జారఁగా
భీత దృగంచలమ్ము లగపింపఁగఁ గాముక చిత్తవృత్తముల్
పాతరలాడ మత్తకలభ ప్రతిమాన విశేషయానయై
పూతన రాజవీధిఁ బడిపోయెను నందగృహమ్ముఁ జేరఁగన్.

ఉ. కాతరలౌచు గోపికలు కన్గొని యజ్జగదేక సుందరిన్
జేతము లెందుకో చెదరి చివ్వలు రవ్వలుఁ బెట్టుచుండఁగా
నీ తరుణీలలామ యెవరిచ్చట కెచ్చటి నుండి వచ్చె? నే
గోతులు దీయునో? యనుచుఁ గొందల మంది రకారణంబుగన్.

తే. కారణములేని కార్యము ల్కలుగఁ బోవు
సర్వమయుఁడగు నీశ్వరుఁ డాద్యుఁడైన

బుద్ధి భావిఫలాఫలమ్ములను దెలిసి
మాయ తెఱఁగప్పి తెలియని మబ్బుఁబూయు.

క. వెఱబొమ్మలట్లు వల్లవ
తరుణులు నిశ్చేష్టలగుచుఁ దఱితీపుల సుం
దరిఁగాంచి పలుకకుండిరి
వెరపుడిగి యశోద దాని వివరములరయన్

ఉ. ఎవ్వరిదానవీవు? పను లెవ్వరితో నిట? నేలవచ్చినా?
అవ్వ! యటన్న మాటవిని, యాసుర యించుకరిచ్చనొంది నే
నెవ్వతనైననేమి? పనియేదొ తలంచి హితాశనైతి; మీ
రివ్విధి గౌరవింతురని యెంచనటంచు వచించి లజ్జిలెన్.

ఉ. అంత యశోద భామినుల నందఱ దవ్వులఁబిల్చి నూతనా
గంతుకలన్ సగౌరవముగాఁ బరికించుట లెస్స యన్న న
క్కాంతలు చింతమాని మృదుకంబళముం గొనివచ్చి వేసి ర
య్యింతి సుఖోపవిష్టయయి యెంతయు సంతసమందినట్లుగాన్.

తే. అతిథి మర్యాద లొనరించి యాదరించి
యుచితరీతిని బ్రశ్నించి రువిద లెల్లఁ
జిఱునగవు ముద్దుమోముపైఁ జిందులాడ
బాలఘాతకి వారితోఁ బలికె నిటుల.

ఉ. నేనొక యాదవాంగననె నీ కొమరుండు త్రిలోకమోహనుం
డౌననువార్త వింటి విని యర్భకునందలి ప్రేమచేత నెం
తో నవనీతచిత్తనయి యొయ్యనవచ్చితిఁ జూచిపోవ నో
చాన! వరాలమూటగని చయ్యనఁబోయెద బాలుఁ దెమ్మిటన్.

మ. అదియేమో? చెవిసోకి సోకకయె మాయాప్రేమ యుప్పొంగుచున్
హృదయస్థంబయి యెన్నఁడెన్నఁడని యావేగంబుగల్పించె నం
గద దీరన్ దిలకింపవచ్చితిని నీ గర్భప్రసూనంబు నో
ముదితా! బాలునిఁ దెమ్ము చూచెదను సమ్మోదమ్ము చెన్నారఁగన్

చ. అనవిని యయ్యశోద ముదమందుచుఁ గన్నకుమారుఁజూడఁగాఁ
బనిగొని యింతదవ్వులకు వచ్చినభామిని వాంఛదీర్చుటల్

తన విధియంచు నెంచి వనితాసహజ ప్రణయప్రకీర్ణయై
పనిచెను డోలలోని తనబాలకుఁదెమ్మని యొక్కకామినిన్.

చ. ముదమునఁబోయి పాపకనుమూసిన ముచ్చవిఁజూచి చేతు లొ
ప్పిదముగ ద్రిప్పుచున్ బెదవివిచ్చుచు నుచ్చురుగొట్టుచున్ గరం
బుమటునఁ దేలివైచె సతియొప్పుగ భామినిఁగాంచి యేమనన్
నిమరమునింగెఁ బాప యని నెక్కొనుమక్కువ పిక్కటిల్లఁగన్.

ఉ. ఆపసిపాప లేచునని కచ్చుగ ముచ్చటలాడుచుండి ర
గ్గోపిక లంతలో నిసువుగోల వినంబడగా యశోద కై
లాపగనాతె శీఘ్రముగ నచ్చటకుం బరుగెత్తి డోలలోఁ
బాపని లేపి ముద్దులిడి భవ్యముదంబున స్తన్యమీయుచోన్.

ఉ. బాలుఁడు పాలు ద్రావఁ డొకపట్టున నిల్వఁడుఁ బోరువెట్టుచున్
గోలలు లాలనల్వినఁడు జొత్తిలి యుల్కిపడున్ యశోద యే
లీలను బుజ్జగింపఁ గుసిలింపులు మానఁడు భామలెల్ల గ
గ్గోలుగఁజేరి చేతనగు కోపులఁదాపముఁబాపఁ జూచుచున్.

చ. ఒకత యురంబునం దునిచి యుయ్యెలనూపు భుజాననెత్తి యొ
కొకరిత బుజ్జగించును మఱొక్కత జోలలుపాడుచుండు వే
ఱొకరిత బూచివచ్చెనని యొత్తుగఁబల్కుచు నూరడించు నే
తకవికలెట్లుజేసినను దాపముమానఁడు బాలుఁడత్తఱిన్.

సీ. చక్కని నాబాబు జడుసుకొన్నాఁడమ్మ
యని విభూతి ముఖాన నలఁదు నొకతె
కనకంపుఁ బళ్లెరమున వసంతము గల్పి
త్రిప్పి యుమిసి దృష్టి దీయునొకతె
కన్నయ్య నెవ్వరో కనులలో బెట్టుకు
న్నారని దిగదీయఁ గోరునొకతె
చిన్ననాతండ్రికి శ్రీరామరక్షా య
టంచుఁ దాయెత్తు కీలించు నొకతె

తే.గీ. ముడుపుగట్టి దేవతలకు మ్రొక్కునొకతె
వేయి విధముల జోతలుఁజేయు నొకతె

యెన్ని చేసిన బాలకుఁ జేడ్పు మానఁ
డొక్కచేసోరు చేతుల నుండఁబోఁడు.

తే. ఏమియుం దోఁపక యశోద యేకతమున
నొక్కచోఁ జదికలఁబడి యుత్సవములు
గ్రామదేవతలకు జాతరలు నొనర్ప
ముడుపులం గట్టి మ్రొక్కులు మ్రొక్కొనియె;

ఆ.వె. నోరువాయిలేక పోరువెట్టు నిసుంగు
తెవులు దెలియలేక యువిదలెల్లఁ
జేతనైన పనులు సేసి చేయించిరి
ఫలముగనక దుఃఖ మలముకొనియె.

క. అంత కంతకుఁ బోరెక్కువైన నింకఁ
జేయునది లేక చేఁజేతఁ జిన్నవాని
నెత్తి పూతనచేనుంచి; రెలమిగదుర
శాంతిగని రా దిగంబర స్వామివారు.

మ. ఇది నాపుణ్యము; మీరలిందఱొక్కటై యెన్నో ప్రయత్నింపఁగా
నదటుం దీఱని బాలనాయకుఁడు తానై వచ్చి నాచేతులం
దొదిగెన్ ధన్యను; వీనిఁగన్గొను మహోద్యోగంబు ప్రాప్తించె;న
హ్హృదయా వేదన తీరిపోయెనని యెంతే యుబ్బ తబ్బిబ్బుగన్.

ఉ. పూతన బాలు నెత్తుకొని బుగ్గలు దట్టుచు వింతవింతలౌ
రీతులఁ జేయుచున్ బలుకరించుచు నూఁకొని యాకలించుచున్
జేతము వచ్చినట్లు దమిఁ జెందుచు ముద్దులు పెట్టి పెట్టి సం
గీతము జేసి చేసి గిలిగింతలఁ బెట్టుచు రట్టు వుచ్చుచున్.

ఉ. టక్కు టమార విద్యల బడాయి హడావుడి బాలుఁడమ్మ! వీఁ
డెక్కడ నుండి వచ్చెనొకొ యిన్నిటి నెన్నడు నేర్చెనొర! యీ
చక్కని చుక్క వెన్నెలలసామి జయంతుడు వీనిఁగాంచఁగా
నిక్కముగా యశోద మహనీయ తపం బొనరించె నంచునున్.

తే. పొగడి బాలకు ముద్దుగా బుజ్జగింప
వాఁడు కేరింత గొట్టుచు నాడఁదొడఁగె
నట్టిచందమ్ము గని క్రొత్త లచ్చెఱువున
నెంతవాఁడమ్మ నీకొడు కిట్టిఁ డయ్యె.

తే. ముక్కుమొగ మెఱుఁగని యొక్క ముదిత యొడిని
నాడుచున్నాఁడు వీఁడెంతవాఁడొ తల్లి!
క్రొత్త యొకవింత ప్రాఁతలు ఱోత లనెడు
సామ్య మీపాపయందున సార్థకమగు.

ఉ. ఎక్కడిపిల్లఁడే యితని నెంతగ లాలన సేయుచున్న మా
ప్రక్కకు రాఁడు; క్రొత్త సతిపైబడి మాదెస జూడఁడేమొ యే
మక్కువదీర్చెనో మరులు మందులు బెట్టెనొ తేనె లిచ్చెనో
యక్కట! యంచు నయ్యువతు లబ్బుర మందుచు నుండిరెల్లరున్.

ఉ. ఐనను జూడఁగావలయు నాతఁడు వచ్చునొ రాఁడొ యంచునన్
జానయొకర్తు చేతులను జాపిన బాలుఁడు మారుమోముగాఁ
బూని యొకరు తీసికొనఁబోయిన భోరున నేడ్చె; నంతఁ జే
యూని యశోద రమ్మన నుహూఁ! యని ప్రక్కను జూచె బాలుఁడున్

క. నాతండ్రి యింక రారా!
నీ తల్లినిగాన? పాలు నీకిచ్చెదరా!
చేతము నిలువదు రా రా!
నాతపము ఫలంబ యనుచు నందుని సతియున్.

క. పిలిచినఁ బలుకఁడు బాలుఁడు
కిల కిలమని నవ్వి ముఖము క్రిందికి దిగుచున్
మెలఁతలు సూటిగ మాటలు
పలుక యశోదమ్మకించపడి యిట్లనియెన్.

ఆ. వె. చిన్నవాఁడు తెలియకున్నాఁడుఁ వీనిని
యబ్బురించుకొనకుఁ డమ్మలార!
దృష్టి తగులునేమొ తీయనిమాటలఁ
జేరఁ బిలువుఁ డతఁడె చేరవచ్చు.

వ. అన విని గోపసతులం దిలకించి

మ. ఘనుఁ డీపాపఁడు నాయదృష్టమున నే కాఁబోలు నిట్లయ్యె; నో
వనితా రత్నములార! యూరడిలి నావాత్సల్యముం దీర నిం
డ నిమేషంబును మీఱ లోఁ దెడిది కాదా? నేను నా వంతగున్
మన స్త్రీజాతికి నింతకన్న సుఖ సామ్రాజ్యంబు వేఱున్నదే?

క. అని పూతన వాక్రుచ్చుచు
ఘనముదమున బాలునెత్తి కౌఁగిట నదిమెన్
దనపని తీరెడు సమయముఁ
బను పడెనని మురిసిపోవు భావముతోడన్.

ఉ. అంత యశోద బాలుఁ డురియాడుచుఁ జిన్నికరంబులెత్తి య
య్యింతి కుచాగ్రసీమ నెలయించి కడున్ గుసిలించి పయ్యెదన్
వింతగ జాఁరగాఁ దిగిచి వేసట బాసటఁజేసి ముద్దుగా
రంతులు మంతనమ్ములు బరాబరిఁ జేసినఁ జూచి కాంతలున్.

క. ఆఁకొనియున్నాఁడమ్మా!
చేకొని పాలిమ్ము; చాలసేపగుఁ దాళం
డీ కొమరుఁడు నేఁడంతయు
నీకొడుకయి పోయె మఱచె నిక్కముగ మమున్.

వ. అని పలుకుటయు

క. పూతన యమ్మాటలు విని
చేతోముద మంది సిగ్గుఁ జెందినరీతిన్
బ్రీతి గని మూతిఁద్రిప్పుచు
"నా తరమా సిగ్గుకాద నాతుల కన్నన్.

ఉ. సిగ్గట! సిగ్గు, బాగ్గు; నది చిన్నపు డెప్పుడో పోయెఁ బూరుషుఁ
దగగ జేరునాడె యది దాఁటుకొనంజనుఁ గాని నాఁటికీ
సిగ్గరి పుత్రు నెట్లు గను స్త్రీ సముదాయమునందె యింతగా
సిగ్గిలు పిల్ల యెట్లు పతిఁ జేరెనో, బిడ్డల నెట్లు కాంచునో?

ఉ. స్త్రీలమె మేము; మాయెదుటఁ జన్నిడి కూనకు స్తన్యమిచ్చుచో
నేలవలేశముం బరువు హీనతఁ జెందునె సిగ్గు పోదులే;

బాల, విరాళి మాని, పసి పాపకు స్తన్యమొసంగు; మట్లు కై
కోలయి పోవుచోఁ బరువుఁ గూర్తుములే కొనివచ్చి యంచునున్.

వ. ఉల్లసంబాడు ప్రేతలఁ గాంచి

క. అమ్మా! మీరేమన్నను
సమ్మతిఁగొని నిండజెకుర స్తన్యము లీయన్
మ మ్మొక గడియం దునిచిన
గుమ్మగఁ బాలిత్తు ననుచుఁ గుటిల వచించెన్.

శా. పోనీలెమ్మని దాని వాక్యముల నామోదించి, ప్రత్యేకమా
స్థానం బొక్కటి చూప నప్పుడఁటి, యిష్టప్రాప్తి చేకూఱు ది
వాన్యందం బడి చేరువయ్యె నని యొయ్యారంబుగా లేచి, య
క్కూటనం జంకనుబెట్టి చేరుకొనియెం గోణంబునం దొంటిగన్.

చ. అది తొలిఘట్టమా దితిసుతాళి వధింప నటంచు శౌరి నె
మ్మదిఁ దలపోసి చిత్రగతి మానినిపైఁగడుఁ గూర్మిదోఁపఁగా
నొదిగి హసించుచుం బొదలు చుండెను; గారణమెంచలేక య
మ్మెనితలు దాఱుమాఱుగుచు మోహనకృష్ణునిఁ గాంచ్రు దీనలై.

చ. చని యట భద్రపీఠమున సంతసమార సుఖోపవిష్టయై
తన మృదుకంచుకంబు కడుఁదాలిమితో వెడలించి పిల్లవా
నినిఁ దగురీతి దాల్చి గమనించి కుచంబును నోటనుంచె నో
య్యన బసివాఁడునుం గుడువ నాతురుఁడై తమకంబు మీఱఁగన్.

చ. పొదుగును గ్రుమ్మి గ్రుమ్మి పసుపోతము క్షీరము లాను రీతిగా
ముదిత యురమ్ము గ్రుచ్చి నటు మూతిగదల్చి చెలంగి పాలు స
మ్మదమునఁ ద్రావుచుండ, నది మ్రుయ కన్గొని చావఁడేమి? నే
నదికిన దుర్విషంబు వృథ యైన దటంచు వితాకుఁ జెందుచున్.

చ. అది విడిపించి బాలుని ముఖాంతరమందు ద్వితీయముంచినన్
మొదటికిఁ గన్న నెక్కువ ప్రమోదముగాఁ జవిఁ జూడసాఁగె; న
మ్మదవతి తీవ్రమై యెగయు మంటలు దాళక తీవ్రబాధకున్
బెదఱుచు బాలుపట్టు విడిపింపఁ దలంచి కలంచె వానినిన్.

ఉ. బాలుఁడు పట్టువీడఁ డనపాయముగాఁ జను నోటఁ బెట్టి తాఁ
ఏలుచు రక్తమాంసములు, బిత్తఱిచూపుల మత్తభూతమున్
గాలమునందుఁ జేపవలె గన్నములో నొక దొంగరీతిగా
గోలకు సాహసింప దుసికోఁతలచేఁతకు నోర్వబెట్టునున్.

ఉ. పీలిచి పీల్చి రక్కసిని పిప్పినిఁజేయ గుటుగుటుక్కనం
గ్రోలెడు జాలముం గొలిపెఁ గొంటు కుమారుఁడు; వానిబాధ
దాళఁగ లేక క్రిందఁబడి తన్నుకొనన్ మొదలయ్యె నద్ది యే
గోలయుఁ జేయఁ జాల్పడకు గొంకును బింకముఁజెంది యుండెడు.

ఉ. గాటపుకీతి నొక్కపరి గ్రక్కున గ్రుక్కెడు వేడిరక్తమున్
నోట దొఱంగఁగా నురుసు నొచ్చుచు బాలుఁడు తొందరించుచో
బోటుకుఁ దాళలేక యది బొబ్బలు పెట్టుచు వ్రాలెఁ బృథ్విపైఁ
గాటుక కొండవోలె దిగఁ గారెడు రక్తము కాల్వ గట్టఁగన్.

ఉ. దిక్కులు పిక్కటిల్లినఁ బ్రతిధ్వనులీనెడు బొబ్బలంతలన్
రక్కసి పెట్టఁగా విని కరమ్ము భరమ్మున ముద్దుగుమ్మలా
పొక్కిలిబిడ్డ యున్న దెస పోయిరి; కాంచిరి ఘోరదృశ్యమున్
వెక్కసమైన భీతి గని బిట్టు వడంకెద రంద ఱొక్కటన్.

క. ముసిముసి నగవుల వదనము
పసిగాఁ గళ లీన దాని స్తనమధ్యమునన్
గసిగందక జోగాడెడు
పసికందును గాంచి రెల్ల భామలు ప్రీతిన్.

ఉ. కాటుకకొండపై జలదఖండము వ్రాలినలీలఁ బుట్టపైఁ
గోటరమందు నాగశిశుకోమల లాస్యములీలఁ గోటపై
నాఁట విచాలితంబయిన నవ్యపతాక విధాన దుష్టయా
బోటి నిశాటివక్షమునఁ బొందుగ నాడెడు బాలుఁ డుద్ధతిన్.

తే. గుములు గుములౌచు నటు గొల్లకొమరులెల్లఁ
బరుగు పరుగున వచ్చిరి బాలుఁజేరఁ
బొరసి పొరసి పాపిష్ఠ యాసురవధూటిఁ
గాంచి కాంచి విభీతులై కలవరపడి.

తే. చయ్యన యశోద హస్తములు సాచి కొమరు
మెల్లగా నెత్తుకొని తనువెల్ల వణఁకి
పోవఁ బరువెత్తె నావలి చావడికిని
జేరి తత్తఱపాటెంత దీఱెనిలచె.

ఆ.వె. వజ్రభిన్నమైన వసుమతీ ధరమట్లు
హరి విదళితమైన హస్తివోలెఁ
గృష్ణుచేత నసువులీగిన పూతన
కానిపించె గోపకామినులకు.

—* శకటాసుర వధ *—

శా. లీలాబాలకమూర్తి వెన్నుఁ డిటు లోలిన్ జిత్రచారిత్రుఁడై
వ్రేలన్ వ్రేతల నద్భుతప్రమదవార్ధిం దేల్చుచుండంగ దు
శ్శీలాధిష్ఠితులైన దానవులు లక్ష్మీనాథు సాధింపఁగా
నాలోచించి భయార్తుఁ గంసుఁ గని ధైర్యంబుం బ్రబోధించుచున్

చ. హరి నినుఁ జంప వచ్చునని యంత భయంపడె దేల? భూప! యా
హరి గిరి లెక్కయే? ముదలయైన రయమ్మున మంద కేఁగి య
చ్చెరువుగ మాయఁ బన్ని హతుఁ జేయకయుందుమె? యింక మీఁద నె
త్తఱి నిటు ధాత్రిఁ బుట్టఁ డలదయ్యము మాపసఁ జూడ నేర్చెనన్.

ఉ. నీవు ప్రజావాదము జనించునొకో! యని సంశయంబుతో
నీవిధిఁ దత్తఱింతువు సుమీ! పసివాని వధింపవచ్చుచో
నావల గోట మీటుపని కక్కట! గొడ్డలి గావలెన్ ధరి
త్రీవర! యట్టులైనను ధృతిన్ జయమే యగు నాఁగఁ జెలునే!

తే. అబల పూతన నిహత యైనంతమాత్ర
బాలకుఁ డవధ్యుఁ డని నీవు భ్రాంతిపడెదు
సురలకు నజయ్యులము మేము చొచ్చుపనికి
నంతరాయము గలుగునే యవనినాథ.

క. అన విని కంసుఁడు మోహం
బున వల్లె యనెన్ సురారిముఖ్యుం డొకఁ డీ

పని కేను మున్న చనువాఁ
డను విందురుగాక నాపటాటోప మెదో!

తే. అని తనదు మిత్రులకుఁ జెప్పియప్పుడవోయె
నొక్కరుండును ప్రేపల్లెదిక్కు గాఁగఁ
దనకు మృత్యుభయంబు తప్పినది గాఁద
లంచి కంసుఁడు మిత్రులఁ జెలంగె నంత.

శా. అందున్ లోకవిమోహనుండు హరి సర్వానందసంధాయి యై
ఏం దౌమాటల ముద్దుఁజేతల విడంబింపంగ గోపాంగనా
సందోహ మ్మనిశమ్ము తల్లలితచేష్టామోదిత మ్మై తన
ర్చెం దాత్పర్య మ దెల్ల మెల్ల మఱపించెన్ బాహ్యలోకస్థితిన్.

సీ. కిసలయప్రాయ మౌ పసికుసిలింపుల
పసదనం బెసలార నసము నించి
కాల్సేతు లొప్పుగాఁ గదలించి మురిపించి
చిరునవ్వు లొలికించి మరులు పంచి
ఊఁకొని హృదయము లుయ్యేల లూగించి
కిదుకుచు ముద్దులపదును బెంచి
యొదిగిలఁబడి చేయి నాతి కిలారించి
తలమునక ప్రేమ దొంతఱలు నించి

తే. వల్లవీ హృత్సరోజకు పరిమళింప
ముద్దుముద్దుగ నాడుచు ముదము నింపఁ
గన్గొని యశోద తమిదీఱఁ గౌఁగిలించి
బోరగిలఁబడి యాడెడు ముద్దులయ్య.

గీ. నిన్న మెన్న నె పూతనబన్న మొదవ
దాని మఱపింప గాఁబోలుఁ దండ్రి నేఁడు
బోర్లపడు ముద్దుముచ్చటల్ బుచ్చివాఁడు
పండువు నొనర్చు కొండము రం డటంచు.

సీ. సంపెఁగనూనెతో సొంపుగా దల నంటిఁ
కమ్మపన్నీట స్నానమ్ముఁ జలిపి

ధౌతవస్త్రమ్మునఁ దడి యొత్తి ఘుమఘుమ
గంధమ్ము నంగరాగమ్ము నలఁది
కస్తూరికాతిలకము ముఖమ్మున దిద్ది
కనులఁ గాటుక నొప్పగా నమర్చి
పులిగోళ్ల 'హారముల్' పుష్పదామంబులు
నందముగాఁ గంఠమందు వేసి

తే. కాళ్లఁ జిఱుగజ్జె లందెలు గట్టి మొలకు
గంటలమరించి చేతులఁ గంకణములు
పెట్టి కుబుసము దొడిగి మేల్పట్టుటోపి
నెత్తిపై నుంచి కై సేసె నెలఁత బాలు.

గీ. భద్ర భర్మాసనముపైని బాలు నునిచి
బ్రాహ్మణులు దీవన లొసంగ వాద్యవితతి
మ్రోయ వనితలు హారతు లీయఁ జెలఁగి
పేరఁటము యశోదమ్మ సొంపారఁ జేసె.

ఉ. బాలకుఁ దావులించుటలు భామిని కాంచి విలోలచిత్తయై
జోలలు పాడి వక్షమున సొంపుగ నుయ్యెల లూపి శ్రీగమా
పాలకు నిద్రపుచ్చి యొకబండికి చాపున బాలుకోసమై
స్త్రీ లొనరించు సెజ్జపయిఁ జెల్వుగ బాలుఁ బరుండఁబెట్టియున్

గీ. పసుపు కుంకుమలు ఫలమ్ము లొసఁగి మఱియు
నగరు గంధము దివ్యమాల్యాంబరములు
భూషణమ్ములు ముత్తైదువులకుఁ బంచి
బ్రాహ్మణులకు దానాదులుఁ బఱఁగ నిచ్చె.

ఉ. కోరిక లూర నప్పుడఁటి కోరినవారికిఁ గోరినట్లుగా
భూరివిరాళముల్ వివిధభూషణము ల్సవరించి యోగ్యమా
తీరున విందుపంక్తులను దీరిచి వడ్డన తాను జేయుచున్
గూరిమితోడ నుండి తనసూనఁ దలంప దొకింత యంతటన్.

గీ. అంతలో నట కేతెంచినట్టి యసుర
శౌరిపానుపుకడ నున్న శకటమందుఁ

జేరి దొఱలుచుఁ దనుఁ జంపఁ బాఱి వచ్చు
నెఱిఁగి బాలుఁడు కా లెత్తి యెగసి తన్నె.

క. గిరగిరఁ దిరుగుచు శకటము
సరిగా వినువీధి కెగిరి చకచక మను న
య్యిరుసునఁ బొరసిన చక్రము
లురియాడుచుఁ దొలఁగి పోయి యొఱఁగెన్ ధరకున్.

గీ. ముక్క చెక్కలై తురుముగా మొగులునుండి
చెదరఁగా గిందఁ బడె బండిచెక్క లెల్ల
నొక్క టొక టొక్కయంగమై యుర్విపైని
• వికృతరాక్షసరూపము వెలసె నంత.

క. కులిశాహతి ధర నొఱఁగిన
కులశైలమువోలె నేలఁ గూలినదనుజున్
బలవత్తరదేహునిఁ గని
విలపించుచు బాలు వెదక వెడలిరి చెలువల్.

గీ. చెక్క చెదఱక ప్రక్కపైఁ జిన్ని తండ్రి
కమ్మఁగా నిద్ర పోవుటఁ గనులఁ గాంచి
యుల్లములు పల్లవింప నీలోత్పలాక్షు
లెత్తి ముద్దిడి సంతోష మెసక మెసఁగ.

ఉ. ఎన్న గరానిచిత్ర మిది యెన్నఁడు విన్నది కాదు; కన్నులన్
గన్నది కాదు బాపురె యొకానొకయంజన పర్వతంబు నా
నున్నకిరాతుఁ డేడ యగ మూఁడని యీపసిపాపఁ డేడ? యీ
కన్నయ తన్నె నంట గిరికంధరుఁ డీల్గెడినంట! యద్దిరా!

ఉ. ఇందఱ ముంటి మిందు మన కెవ్వరికిం గనరాక యీతఁ డే
సందున దూఱె? నింత తెగఁజూచినకాయము నేడదాఁచె నే
చందమునన్ రథానఁ బడి చక్రములో నణఁగారె? నెట్టు లీ
కందు వధించెఁ? గట్టుకథగా వినుపించు ని దేమిచోద్యమో!

సీ. కన్నులుఁ దెఱవని చిన్నారి పసికూన
కలకురక్కసు నెట్లు కాలఁ దన్నెఁ?
దన్నెఁబో మెత్తనితాపుకోపులు గాక
యింతటి పెనుఘాత యెట్లు తగిలెఁ
దగిలెనో కొండంతతనువుపై నది యెంత
యబ్ధింగో గాకిరె ట్లంత గాక
యబ్లైన నీ ప్రళయాంతకు పెనుకాయ
మిన్ని ముక్కలు చెక్క లెట్లు లయ్యె
తే. నయ్యొ వినువీధి కేకితి నట్లు లుఱక
యెగిరె ధగ్ఁగూల్చె నౌరౌర యిది యపూర్వ
మద్భుతము పిన్నవాని కృత్యంబు గాద;
యేవో గూఢరహస్యము లిందుఁ గలవు.

క. అని పరిపరివిధముల న
వ్వనజాక్షులుఁ బురుషు లదటుఁ బడుచున్నంతన్
గని నందుఁడు వారించుచు
ననె మృదుమధురోక్తు లిట్లు లమృతము లొలుకన్.

చ. ఇది యొక దైవమాయ మన మిందఱ మేల? మ టెంద టెందటై
నఁ దెలియరాని గోప్యవిధి నందకులాభరణంబు దక్కఁ స
మ్మదమగుఁ గాదె యెల్లరము ముఖ్యముగాఁ దలపోయుచుండు మ
య్యది నెఱవేఱిపోయె నిఁక నౌ నని కా దని వాద మేల నాన్.

గీ. అన్ని సంబరములు మాని యర్భకునకు
దిగమడుపు లెన్నియో చేసి దేవతలకు
బలుల నర్పించి సంతోషపడుచు నెవరి
గృహములకు వారు చేరిరి గేస్తు లెల్ల.

క. శకటాసురవధ యివ్విధిఁ
బ్రకటముగా జరిగిపోవ భయ ముడిగి మహో
త్సుకులై యమరులు శ్రీహరి
నకలుషులై పాడి యాడి రంబరవీధిన్.

—* తృణాసుర సంహారము *—

తే. తమదునెచ్చెలి యిట్లు బీరములు వలికి
గోపబాలుని పదహతిఁ గూలు సెటకేఁగి
విస్మయంపడు దనుజులఁ జేర్మి ననున
యించి యాయువు మూడి రోషించి యొకఁడు.

శా. నానెయ్యుం బరిమార్చినట్టి ఖలు నా నారాయణుం బూరికిం
గానీ కిప్పుడ భూమినుండియ తొలంగంజేసెదన్ జండ వే
గానన్ గేవలరూపుండ నై యనుచు దుర్గర్వంబున న్వచ్చె ది
వ్యానీకంబును దల్లడిల్ల దనుజుం డాపల్లె కల్లంతటన్.

క. ఇంతై యంతై పాపం
డింతి యశోదమ్మ కనుల కింపుగఁ దోఁపం
బంతినలె బారకాడెడు
సంతస మొనఁగూర్చె బాలచర్యల కడిమిన్.

మ. ఒకనాఁ డా సరసీరుహాక్షి తొడపై నొప్పారఁ గందర్పుఁ బో
లుకుమారు న్వహియించి గోపికలతో లోకాభిరామాయణం
బకలంకస్థితి ముచ్చటించుచు వినోదావస్థయం దుండ న
వ్వకుఁ డోర్కించుక భారమైనటులఁ దోఁపన్ జాల విభ్రాంతయై

గీ. ఎవ్వ రేమనుకొందురో యేమొ యనుచు
బాలుఁ దొడనుండి క్రింద దింపక యశోద
యట్టులే పెట్టుకొని యుండె నంత కంత
కధికముగ బర్వు మోయలే దయ్యె వాని.

గీ. అంగనలచేతి కందీయ నబ్బురించు
కొందురేమో యటంచుఁ దా నొందలేక
యన్ని బరువులు వహియించు నవనిపైని
బాలుఁ బవళింపఁజేసెను బాన్పు చేసి.

శా. వచ్చెం జెచ్చెర నంతలో నటకు విశ్వక్షోభకృ ద్వేగ వ
ల్గ చ్చిత్రక్రమధూత ధూళివిసర్గాక్రాంతాఖిలాశా వ్రజా

యింటు నంటను వెదకి యేసందునందు
వట్టిదే యైన గుండెలు బాదుకొనుచు.

క. అయ్యో నాతండ్రీ నీ
వెయ్యెడ నున్నావు తల్లి యేడ్చుచుండన్
గు య్యాలింప వదేరా
యయ్యావు కావా బిరాన ఆఁ యనరాదా?

క. నాయన్నా నీకొఱకై
వేయాఱువిధాల వెదకి విసిగితి నయ్యా?
త్రాయము వెట్టెద రారా
నాయెదపై బ్రాలిపోర నందకుమారా!

క. అని యాక్రందించుచు సతి
తనయుఁడు పలుకమిని గుండె దడదడ లాడన్
గనులం గారెడుజలములు
మునుకొని యేఱులుగఁ బారి ముంచుచునుండన్.

సీ. తేఱుకొని యువతులఁ జేరి తెఱవలార!
బిడ్డఁ డెటు కొట్టుకొనిపోయె వేగఁ గరుణ
నరయుఁడమ్మా నిసుంగు నాయంకమందుఁ
జేర్చుఁ డమ్మలారా జోత సేతు మీకు.

శా. ఏ మై పోయెనో పిన్నపాపఁ డకటా? యెందుండెనో గాలి యే
భూమిం ద్రోసెనో కొండలో నిడియెనో పోఁద్రోసెనో వారిలో?
నామాణిక్యము పృథ్విపై బ్రదికియున్నాఁడో మఱేమయ్యెనో?
రామా! రక్షక! యంచు నందసతి తోరం బైనదుఃఖంబునన్

క. వనటన్ మునింగి సూత్రము
పనుపడ కున్నట్టి గాలిపడగ విధానన్
జని చని యనిలాహతచం
దనతరువై కుప్పగూలెఁ దత్సతి యొకచోన్.

క. కలవరపడి గోపిక ల
జ్జలజాక్షికి శీతలోపచారక్రియలన్

జలుపఁగఁ గొందఱు వెదలిరి
జలజాయతనేత్రు వెదకి జాడలు దీయన్.

చ. అటుగనియాకసంబున దృణాసురుఁ డప్పుసివానిగుండెలోఁ
బటుతరముష్టిఘాతమునఁ బట్టి వధింపఁ గరంబు నెత్త న
క్కిటుకు గ్రహించి బాలకుఁడు కేఱుచు బాహుయుగంబు సాచియుఁ గ్
గట్టువుగ వానికంఠమును గట్టిగఁ బట్టి బిగించి వ్రేలుచున్.

సీ. గాలితాకిడి నూగు తాళవృక్షమునందుఁ
గట్టి యుంచిన మధుకలశమట్లు
బోతరించిన యెనుబోతుకంఠములోన
నివ్వటిల్లెడు చిన్నముర్వ్వవోలె
దేవాలయధ్వజ దివ్యమేఖలలందు
నంటి జారెడు చిఱుగంటకరణి
గాలియీతలఁ దేలుగండభేరుండము
గోళ్లనూగాడు కుక్కుటముకీతి

గీ. భండనోద్దండ చండుఁ డౌ దండిదనుజు
కంఠమును రెండుచేతులఁ గలయఁ బెనఁగి
బొండిగను చిన్నితలతోడఁ బొడిచి పొడిచి
వ్రేలుచుండెను బాలుఁడు విహాగవీధి.

గీ. గొంతు నొక్కి నొక్కి బంతిగా నొకచేత
బొండిగను గదల్చి పొడిచి పొడిచి
పెక్కుగతుల దనుజు తుక్కుదులారించి
నేలఁ గూల్చె వాని బాలకుండు.

ఉ. బొబ్బలు వెట్టుచున్ బెదఱి ముక్కున నోటను నల్లఁ గ్రక్కుచున్
గుబ్బలివోలె నేలపయిఁ గూలిపడెం దనుజుండు వానిపై
గొబ్బున వ్రాలి బాలకుఁడు గోలవిధంబునఁ బూర్వరూపుఁడై
నెబ్బర లేక యుండి పసిచేష్టలఁ జేయఁ కొడంగె నొప్పుగన్.

గీ. కొప్పరమునందుఁ జీమగా గోచరించు
తనయుఁ గాంచిరి పాపిష్ఠ దనుజుపైన

వాఁడు బావురుమని యేడ్చె వనిత లెల్ల
జేకమై పోయి బాలకు నెత్తికొనిరి.

క. గండాలపిల్లఁ డమ్మా
గుండతనాలో మఱేమి కుమ్మో దుమ్మో
గుండెలు చెఱువై పోవును
రం డమ్మా పోద మని బిరాన నడచుచున్.

క. బాలుని నందసతీమణి
పాలికిఁ గొనిపోయి లేపి పాపఁ డితఁడె సూ
జాలిని మాను మటంచును
లీలగ నొడిఁ నుంచి రతని లేచులు ప్రీతిన్.

ఉ. కన్నుల నీరముల్ దొలఁగఁ గాంచి కుమారకు నెత్తి దువ్వుచున్
దిన్నగ బుగ్గలన్ బుడికి తీయనిమాటల బుజ్జగించి నా
యన్న యెటేగినావు ప్రళయానిల మెచ్చట నిన్ను డించె న
న్నన్న యి ప్పేమిగోరములో యెన్నఁడు గన్నవి విన్నవో నోకో!

మ. అని యా భీకలతాంగులం గలసి మాయా బాలుతో నింటికిన్
జని బృందారకకోటికిన్ వివిధపూజల్సేసి యా ముద్దు పా
పనికిం జ న్నిడి నిద్రపుచ్చె; నట గోపవ్రాత మా మానుపా
దునికాయమ్ము పురీ బహిఃస్థలమునందుం బూడ్చి రా నంతటన్.

గీ. నాఁటనుండి యశోద చిన్నారిసూను
వేయికనులఁ గాపాడుచు వితతముగను
రక్ష సేయింపఁ దలపోసె రక్షకునకుఁ
బుత్త్రివాత్సల్య మనెడు సమ్మోహమునను.

—* శ్రీ కృ ష్ణ మ హి మ లు *—

చ. ఒక దివసాంతమందు దనయుం గయిసేసి యశోద యంకపీ
ఠికఁ గొని ముద్దుముచ్చటలరీవిని తావులుఁ బెట్టి సొంపుగాఁ
దికమకమాట లాడుచును దీయనిముద్దులు పెట్టి పెట్టి యు
త్సుకత తలిర్ప బాలకునితో సుఖలీలల దేలుచుండఁగన్.

చ. పకపక నవ్వఁగా దొడఁగె బాలుఁడు బాలసరాలడోలలో
సుకముగ నూఁగిన ట్లయిన సుందరి కందొవవింపఁ జెంది బా
లకునకు నోట నోరిడి విలాసపుముద్దులహాయిఁ దేలుచో
సకలచరాచరప్రకృతి చక్కఁగఁ గన్పడె వానినోటిలోన్.

చ. కనుఁగొని సంభమము దమకమ్ము భయమ్ము పెనంగొనన్ మనో
వనజము నిర్భరప్రణయ బంధురమై రుచు లీన లీనమై
మునుకలు వేసి జాగృతి సమూలముగాఁ గికురించి వంచుటన్
వనజదళాక్షియూఁగ యయివారక చూడఁ దొడంగె బాలునిన్.

చ. హరి కరుణాసముద్రుఁడు రయమ్మున వైష్ణవమాయ గప్పి య
గ్గరితమనంబు ద్రిప్పి తమకంబు ఘటించినఁ దొంటిరీతి సం
బరములుఁ జెందగాఁ దొడఁగె బాలునితోడ యశోద యింతలోఁ
దరుణులు వచ్చి చేరిరి ముదమ్మున బాలకుఁ గూడి యాడఁగన్.

క. పసిబాలుక్షేమ మరయఁగ
వసుదేవుఁడు పంప యాదవపురోహితుఁ డా
నసముఁడు గర్గుఁడు మందకు
వెసఁజనుదెంచెను బ్రమోదవిలసితుఁ డగుచున్.

క. కని నందుఁడు సంతోషం
బున నెదురుగఁ బోయి మ్రొక్కి పుణ్యాత్మా ర
మ్మని నిజమందిరమునకును
గొనివచ్చి సుఖాసనమునఁ గూర్చొనఁజేసెన్.

గీ. అర్ఘ్యపాద్యాదివిధులచే నతిథిపూజఁ
జేసి పుణ్యాత్మ! మీవంటి సిద్ధపురుషు
లూరకే రారు మావంటివారికడకుఁ
గారణము తెల్పుఁడీ యనె గౌరవమున.

క. అనఘా వసుదేవవిభుం
డనిపిన నే వచ్చినాఁడ నర్భకులఁ గనన్.
బని యేమి లేదు వేతే
యనె గర్గుఁడు ప్రియము గదుర నానందునితోన్.

మ. వసుదేవుండు శుభుండె? దేవకియు శశ్వన్మోదముం గాంచు నే
నిసువుల్ వారియనుగ్రహంబునఁగదా నేఁ గాంచియున్నాను వ
మ్మసమానాంచితసౌఖ్యడోలికలలో నాడించుచున్నాఁడు మా
పసివాఁ డెట్టిఁడొ వానిచేష్టితము లప్పా మాకు దుర్గాహ్యముల్

ఉ. ఈతనిచిత్రవర్తనము లెంతయు నబ్బుర మౌను గాని మా
చేతము లెంకుకో భయముఁ జెందుచునుండెడు పూతనాఖ్య న
ప్పాతకిఁ జేరఁ బైఁబడుకిఁ బాఱెను బాలను గ్రోలె బండియా
భూతముఁ దన్నె గాలిఁ బడిపోయెను వీనికృతంబు లిట్టి వౌ.

చ. అనియెడి నందుఁ గాంచి దరహాసముఁ జేయుచు గర్గమౌని యి
ట్లనె నఘా! మహాత్ములకు నైన నెఱుంగఁ దరంబు గాని యి
వ్వనజదళాక్షుచిత్రములు వర్ణనసేయఁగ సాధ్య మౌనె? యీ
తని మహిమం బచింత్యముగుఁ దా నల విష్ణుఁడు సూవె మిత్రమ

క. మును వసుదేవుఁడు చెప్పిన
వినియుందువు కాదె వీనివింతచరిత్రల్
కనియెద వింకను జోద్యము
లను నీ కిటు లబ్బె సత్ఫలంబులు మెండై.

వ. అని మఱియు గర్గుండు

క. బలరాముని జూపుచు ని
య్యలఘుఁడు శేషుండు తొల్లి యాదేవకి గ
ర్భలసితుఁ డై పిమ్మట దా
విలసిలె రోహిణీసుతుఁ డయి వింతగఁ గంటే!

గీ. రెండు గర్భములందుఁ దా వృద్ధిఁ జెందఁ
బడుట సంకర్షణుం డనఁబడెడు వీఁడు
మఱియు బలరాముఁ డన బలమహిమఁ దనరు
నుక్కడంగించుఁ బెక్కుర రక్కసులను.

చ. అని వివరించి గర్గముని యాదవముఖ్యుఁడు చేయుమన్ననల్
గని పసిపాప లిర్వురను గన్నులపండువు గాఁగ జూచి ప

చ్చినపని దీరి నందునుతిఁ జెంది క్రమంబుగ దారిఁ బట్టియుం
జనె మధురాపురంబునకుఁ జయ్యనఁ దా ననుమోదితాత్ముఁడై.

సీ. తల్లియుల్లములోని మల్లెపూపంది రై
చల్లని పూసోన జల్లు గుఱియు
నందుని హృదయారవిందమరంద మై
విందుఁ జెందెడు రుచుల్ చిందుచుండు
నన్నతో జిన్నారి వన్నెచిన్నెలుఁ జిల్క
ముద్దుముద్దుగ నాడి ప్రొద్దుఁ బుచ్చు
గోపకాంతలఁ గూడి తీపికోపులుఁ జేపి
తేపతేపకు మరు ల్గొల్పుఁ జేయు

తే. మందలోఁ గల గోపాలబృందములకు
డెందము లెలర్చు నందాల చందమామ
యగుచు నల్లారు ముద్దుగ నాడుచుండు
నల్ల వ్రేపల్లెవాడలో నల్లనయ్య.

గీ. అందఱి మనమ్ములందు నానందరసముఁ
జిందుమందారమాల యై చందమామ
వలె దినదినాభివృద్ధి శోభిలుచునుండె
మందలో నందుపట్టి యానందమెసఁగ.

సీ. రజితాద్రి మణికంధరములలో శివునట్లు
నందువక్షోవీథి నాట్యమాడు
జాబిలి వెలుఁగులోఁ జను చకోరమురీతిఁ
దల్లియొడిం జేరి యుల్లసిల్లు
శేషశయ్యం జేరు శ్రీరమావిభుఁ బోలె
బలదేవు తొడలపైఁ బవ్వళించు
మరురాణి పాలిండ్ల నొరయుహారము రేవ
గోపికాకుచసీమఁ గునిసియాడు

తే. మధుర మకరంద మత్త మౌ మధుపమట్లు
గొల్లపిల్లల హృదయముల్ కొల్లగొట్టు

మదన గోపాలమూర్తి సముద్రమదము గదురఁ
బెరుగుచుండెను వ్రేపల్లె పురమునందు.

గీ. రమ్యసరసిలో బాలమరాళమట్లు
విరులరాసిని మదనమంజరి విధాన
మలయజవనమ్మునఁ దులసిమొలకవోలె
గోకులంబునను యశోదకొడుకు దనరె.

క ఎంతవిచిత్రమొ హరికిన్
స్వాంతము నర్పింపకున్న జడుఁ డాపల్లెన్
గాంత మటన్నను గల్గం
డంతయు శ్రీకృష్ణమయమె యాశ్చర్యముగన్.

సీ. హృదయ వీణను మీటు లెఱిఁగిన యొకలేమ
యవ్యక్తమాధుర్య మనుభవించు
దలఁపులో వలపులు పులకరించినకాంత
లోలోనఁ దమి దీర లోల యౌను
మదను పూసెజ్జలో నొదిగిపోయెడుభామ
కనులలో నునుసిగ్గు కప్పివేయు
వలరాజు గిలిగింత మెలివడు జలజాక్షిఁ
జిలిపిచేష్టల ముద్దుగొలుపుచుండు

తే. మేను వివశమౌ కమ్మతెమ్మెరలు గొన్న
కలికి కులుకుల తెర విప్పి నిలుపఁజూపు
హద్దుమీరిన చిన్నారి ముద్దులయ్య
మగువలఁ గటించు నది యేమిమాయ యగునొ.

గీ. చూడఁ జిన్నారి బాలుఁడు క్రీడలేమొ
మదనుఁ డందీయు కమ్మని మధురసంబు
వీడఁగా లేరు త్రావఁగా వీలుపడదు
వింతవల పది పడఁతుల వేఁచు నదిర.

సీ. జడ వేసి నెమలిపింఛము దోపి మణు లుంచి
ఫణిరాజు వీఁ డని పలుకు నొకత

మృగమదంబు జవాది మేన నొత్తుగఁ బూసి
గంధసింధుర మని కాంచు నొకత
సురపొన్న నాగకేసర మాలికలు వేసి
యమసింహుఁ డని ముద్దు లాడు నొకత
కైసేసి ముఖమునఁ గస్తురిబొట్టుంచి
రేరా జటంచుఁ గీర్తించు నొకత

తే. వఱలు పీతాంబరము గట్టి భవ్యభూష
ణముల మైనుంచి యపరమన్మథుఁ డటంచుఁ
గౌఁగిట గదించు నొకత యిక్కరణిఁ జెలుల
నన్నిరూపుల రంజించు నతఁడు సతము.

క. నందుని హృన్మందిరమును
బొంది తమస్సున్ హరించు బ్రోజ్జ్వలమణి యై
విం దొనరించి యఖండా
నందముఁ జేకూర్చుచుండె నారాయణుఁడున్.

క. జనని యశోదాసతి హృ
ద్వనజము వాత్సల్యమధు విభావితముం గాఁ
దనరించుచుఁ దనియించుచు
ఘనమహితానంద మొసఁగుఁ గన్నకొమరుఁడై.

క. గోపికల హృదయపాత్రల
లోపల మధురసము చిలికి లోలుపుఁ డౌచున్
జేపడిన వెన్న మెసవుచుఁ
బాపఁడు ప్రణయామృతమ్ముఁ బంచెడుఁ గృపతోన్.

ఉ. అందఱచేతిబంతి యయి యాడుచుఁ బ్రాణులప్రాణ మై మహా
నందముఁ జిందుచున్ వెలయు నందతనూజునిఁ బొందుఁ జేయుచో
సుందరు లన్నియున్ మఱచి చొక్కుచు సోలుచు నుందు రెందు నే
సందు లభించినన్ బరవశత్వమునన్ జని కాంతు రాతనిన్.

సీ. పాలకుండలు గాంచి పకపక నవ్వుచుఁ
దోఁగి యాడుచుఁ బోయి దొంతుల ద్రోయుఁ

కనకంటి కేదేని గనిపింప నట్టేలు
విదలించి దూరాన విసరి వేయు
లేఁగదూడలతోఁక లూగించి వానిపైఁ
బడి క్రీడ లాడి సంబరము నందు
జలపాత్రములను జేతుల నుంచి నీళ్ల
నలుదిశలం జిమ్మి కులుకుచుండుఁ

తే. బంకమునఁ జొచ్చు సరి గాని పనులొనర్చు
నన్నిటికిఁ దానె సిద్ధమౌ నాకతాయి
చేష్ట లొనరించు వారింపఁ జీదఱించు
బాలలీలలఁ దేలు గోపాలమూర్తి.

గీ. ఇట్లు నానావిధంబుల నింటియందు
నన్న బలరామునిం గూడి యాటలాడుఁ
దమకుఁ బట్టనిపని గాని తమ యరుగని
చోటు గాని కాన్పింప దాసోదరులకు.

గీ. రెండుపదముల భూమ్యంతరిక్షములను
గప్పి జగమునఁ దనగొప్ప విప్పియున్న
మూర్తి నేఁడు నందకిశోరమూర్తి యగుచు
తప్పటడుఁగుల వేయుట తప్పదయ్యె.

క. బుడిబుడియడుఁగుల నిడుచును
బడుచును లేచుచు వినోదభంగి నెఱపుచున్
దడఁబడు నడకలు మొద లయి
నడయాడం గడఁగె శౌరి నటరాజువలెన్

గీ. అన్ని విద్యల కాటపట్టైనవానిఁ
గమల గర్భునిఁ గడుపారఁ గన్నవాఁడు
మాట లెఱుఁగని ముద్దులమూట యగుచుఁ
జిలుకపలుకులు పారముఁ సేయఁ దొడఁగె.

క. క్రమముగ మాటలు నేర్చియు
నమృతరసము లొలుక సాఁగి యందందు బ్రహ్మా

దముగాఁ దిరుగుచుఁ దిరుగుచుఁ
గమనీయం బైన కలభగమనము నేర్చెన్.

గీ. బాలుఁడు వినోదకేళికాలోలుఁ డగుచు
ముద్దుసుద్దులఁ బ్రొద్దులు పుచ్చుఁ దొడఁగెఁ
దోడి బాలుర ననుజునిఁ గూడి స్వారి
వెడలు గడుసరిపనులకుఁ గడఁకఁ జూపె.

సీ. బలరాముభుజముపై బాహుదండము మోపి
నలరాజుహారాయలు తావలము కాఁగ
మదకలభ ప్రతిమానయానమ్మునఁ
గిసలయచరణముల్ పస దలిర్ప
చంచలామధుర దృగంచలముల్ వేడ్క
లురియాడ గోములు గురియుచుండఁ
బలుకుఁబల్కునఁ దేనె లొలుకఁగా బలదేవుఁ
బలుకరించుచు వింత లొలయుచుండ

తే. గోపబాలురు వెనువెంట గుములుగుములు
గట్టి మార్గముఁ జూపింపఁగాఁ గడంగి
బాలగోపాలకృష్ణుఁడు లీలఁ దేల
స్వారి వెడలెను దొలిసారి యూరిపైన.

చ. చని చని యొక్క లేవయసుఁజక్కనిచుక్క గృహంబుఁ జేరి వా
హినులును దాను నన్నయు మహీస్థలిఁ గూర్చొని యుండఁజూచి య
వ్వనజదళాక్షి యందఱకు బాలును బండ్లు మిఠాయి నీయఁగాఁ
దిని తనివోక శేషమును దెమ్మనెఁ గమ్మనిమాట లాడుచున్.

వ. పలుకక యున్న దాని బలవంతముగాఁ గొనిపోయి యింటిలోఁ
గల హాతశేష పాా పెరుగు గమ్మనిపాలు మిఠాయి వెన్నము
ద్దలు గ్రసియించి ంచి తనదాహము తీరెనటంచుఁ దల్లితోఁ
దెలుపను మంచుఁ జెప్పి కడుఁదేకువ లోకువఁ జేసి ధీరుఁడై.

గీ. చెక్కటద్దాలపైఁ దనచేతు లుంచి
బ్రతిమిలాడెడుగతిఁ దోగి కృతుక మొప్ప

నెగిరి యొకముద్దుఁ బెట్టుచు వగలుఁ జూపి
మఱలెఁ గృష్ణయ్య తన యింటిమార్గమునకు.

మ. మఱునాఁ డట్టి కుమారవీరులు పురీమార్గంబులం బోయి యొ
క్కరు లేకుండిన శూన్యగేహమునఁ గష్ట్యద్దాఁటి లోఁ జేరియున్
బెరుగుం బాలును వెన్నమీఁగడలు నావేశంబునం గ్రోలి చె
చ్చెఱ భాండమ్ములఁ గ్రింద ద్రోసి చనిసంతృప్తాత్ములై యిండ్లకున్.

గీ. అనుదినం బట్లు బాలకు లంతఁ జేరి
గోకులంబున నున్నట్టి కొంప కొంప
దిరిగి స్వేచ్ఛావిధంబుగఁ బెరుగుఁ బాలుఁ
గొల్లగొట్టుచు నుండిరి కోర్కు లూర.

మ. రమణీయాంచిత మోహనాంగుఁ డయి శ్రీరామావతారంబునన్
భ్రమచే స్త్రీలును బూరుషుల్ తన పరిష్వంగం బపేక్షించు టో
ప్పమి నైయె యేకసతీత్వసిద్ధి కిపు డాభాగ్యంబుఁ గృష్ణావతా
రమునం దీర్పఁ బ్రతిజ్ఞ సేసి యది తీర్పన్ బూనె వెన్నుం డిటుల్.

శా. ఆ రామప్రభుఁ గోరి యెవ్వరు కళావ్యామోహులై వేఁగిరో
వారే వీరలు గోపికాయువతులై వర్ధిల్లుచున్నార లా
ప్రారబ్ధానుగతమ్ముగా నిపుడు మారాకారు శ్రీకృష్ణునిన్
జేరన్ వత్తురు ముద్దు తీరెదరు రాజీవేక్షణల్ ముగ్ధలై.

శా. శ్రీకృష్ణప్రభు వట్లు గోపయువతీ చిత్తాపహారక్రియా
స్తోకవ్యాజసమాత్త చౌర్యమున కుద్యోగించె ధీరాత్ముఁడై
యేకాంతంబున దూరి పాల్పెరుగు లెంతే గ్రోలి సంతృప్తుఁడై
రాకాచంద్రనిభాస్యలన్ బరమవిభ్రాంతాత్మలన్ జేయుచున్.

సీ. ప్రత్యూషమున లేచి పని గొని పల్లెలోఁ
గట్టినకడపలఁ గలయఁ దిరుగు
గోపకామిలతో గొంకు జంకులు లేక
మరులు రెట్టించుచు సరసమాడుఁ
బాలు మీఁగడ వెన్న పసదనంబు లొసంగ
గ్రహియించి జాయలుగా మసలుమందు

నంతతో నాఁగక యతిచాపలంబునఁ
గొంపకొంపకు నేగి గోలఁ జేయు

తే. జన్ని విడిచిన యాబోతుసరణిఁ జెలఁగి
చేత మెల్లెట్లు వచ్చు నారీతిఁ జేయుఁ
గూడ దని కాని దని యెంచఁబోడు విడఁడు
బాలగోపాల కృష్ణుఁడు లీలలందు.

సీ. పాలుద్రావిన మానె భాండము లైనను
దక్కనీయక త్రోసి ప్రక్కలించు
నడిగి యేని గొనండు వడివడిగాఁ బోయి
స్వగృహంబునన్ వలె సంచరించుఁ
బట్టుకోఁ బోయినఁ బరువెత్తుకొని పోవు
నెట్టి ధీరున కేని పట్టువడఁడు
దొంగతనంబులో దొరతనంబులొ యెవ్వ
చలపట్టి వాంఛితములను దీర్చు

తే. నుట్లపై నున్నఁ గ్రింద నెన్నెన్నొ యెత్తు
వేసికొని యెక్కి పొట్టలోఁ బోసికొనును
మిగిలినవి పారజిమ్మియు నెగసిపోవు
లీలలం జేయు గోపాలబాలుఁ డట్లు.

క. దొంగ దొంగలలో దొర దొరలలోన
గొల్లపల్లెలో దూరనియిల్లు గాని
కొల్లగొట్టి పాలు పెరుగు చల్ల వెన్న
మ్రింగిపోనికొంపలు గాని మిగిలిపోవు.

శా. అంతే కాక వ్రజాంగనామణులతో హాస్యప్రసంగంబులున్
గంతుక్రీడల వింతకృత్యములు శృంగారంపు సయ్యాటలున్
రంతు ల్మంతనవిక్రియల్ జలిపి నందం బొప్పు సంసారవి
భ్రాంతుల్ దీర్చుచుఁ గోడిగంబులవిధుల్ పాటించు శ్రీకృష్ణుఁడున్

సీ. ఎదయైన దేనువు లీరు గోపతి నేను
మధుపుష్పములు మీరు మధుప మేను

కలువకన్నెలు మీరు నెలరాజు నేనౌదు
జలదంబ నేను జంచలలు మీరు
యరవిందములతీరు పౌరయు మీడెందముల్
తరుణార్కుఁ డేనయి విరియఁజేతు
నూఁత గోరి కుదించు లేఁతతీవెలు మీరు
భరియించు మందారతరువు నేను

తే. చంద్రికలు మీరు పరిపూర్ణచంద్రుఁ డేను
నన్ను మీరును మిమ్ము నే నన్నివిధుల
నొకరి నొకగ మాకర్షించుచున్నవాఁగ
మేల జాగని చెలులంకో మేల మాడు.

సీ. మధురపుష్కరిణిలో మలసి యాడెడుహంస
మృదుమృణాళచయంబు మెసవకున్నె?
మొగలిపూచెండులో సొగలీను చిరునాగు
సురభిళ శ్వసనము జూరగొనదె?
మరుని పూసెజ్జలో నొరిగిన మదిరాక్షి
యధరసుధారసం బతఁడు గొనఁడె?
మాకందఫలకుల మసగొనురాచిలుక
నిలుచునే పరిపక్వఫలము లరసి

తే. మరు శిరస్త్రాణమణులట్లు పొరసి యెనొ
వన్నె చిన్నెలు గురియించు నన్నువలను
మిమ్ము విడనాడ నాకుఁ దరమ్మె యనుచు
మరునిచదువులమర్మ మేకరువు వెట్టు.

—* గోపికలు యశోదకు శ్రీకృష్ణుని దుడుకు పను లెఱిఁగించుట *—

క. రారమ్మా పోదము మన
గారాబులముద్దుబిడ్డకథ లన్ని యశో
దా రమణికి వినిపించినఁ
దీరెదునో యేమొ కొంత తెఱఁగు పొఁజేసెదా?

సీ. అనుచు గోపాలకామినులు యశోద
కడకుఁ జేరియు మ్రొక్కి యొక్కెడ వసించి
చెప్పికొనసాఁగి రిట్టు లా చిన్నికృష్ణు
కొంటెతంటాల పరవళ్ళగోల లెల్ల.

క. ఓతల్లి యశోదమ్మా
నితనయునిపోఁడుఁ జెంద నేరము తల్లీ!
కాతరలము కాపాడుము
మాతరమా వీనిబుద్ధి మాన్ప నిజముగన్.

క. వ్రేపల్లెవాడలోపల
నీపాపఁడు దూరనట్టి నిలయము గానీ
రాపాడని చెలి గానీ
చేపడ దొకటైన మిగులఁ జిత్రము తల్లీ!

క. చూపుల కేమో పాపఁడు
గోపికలను వీఁడు చేయు కొంటెతనాలో
శ్రీపతి కొకనికె తెలియును
మాపాపము పండెనమ్మ! మంజులవాణీ!

క. కాపురములు చెడిపోయెడు
తీపురములుఁ జేయసాఁగెఁ దేకువతోడన్.
నూపురములు ధ్వను లీనఁగ
గోపురములు దూఁకి పాఱుఁ గువలయనేత్రా.

క. పాలును వెన్నయుఁ బెరుగును
గ్రోలుటయే కాక యున్నకుండలనెల్లన్
నేలం బడ విదలించియుఁ
జేలిక లొనరించి వేయుఁ బేశలగాత్రీ!

ఆ.వె. ఉట్టిపైనిఁ బెట్టి యుంచిన నింటిలో
నున్నపీఁట లెల్ల నొకటి పైన
నొకటి నుంచి దొంతి యొనరించి దానిపై
నెక్కి త్రావుచుండు నేపు మీఱ.

తే. అంతతోఁ బోఁడు కుండల కడుఁగునంతఁ
జిల్లి పొడిచి దోసిళ్లతోఁ జల్లి యెల్లఁ
బట్టి త్రావును శేషము వట్టిపాలు
నేఁటి మాస్థితు లిట్లయ్యె నీలవేణి!

తే. తాళములు వేసి పోయినఁ దలుపు లన్ని
యున్న వున్నట్టె యుండెడు నుట్టిపైనఁ
బెట్టఁబడియున్న వన్నియు వట్టిపోవు
నెట్లు వోరఁబడునో కృష్ణుఁ డిండ్లయందు.

తే. కాపుదారిగ నుండెడు కాంతకనులఁ
గారముం గ్రొట్టి యింటిలోఁ జేరి వెన్న
ముద్దలన్ మ్రింగిపోవుచు ముగుదమూతి
కలమి పోవును నీ ముద్దులయ్య సుదతి!

తే. అంద జింటికి వచ్చి యాచందము గని
యామెయే వెన్నఁ దినె నని యదరిపడుచు
ముష్టియుద్ధ మొనర్తురు ముగుద లెల్లఁ
బోఁడుపో డింట నింట నీనాఁడు తల్లి!

తే ఇంటినిండుగ జన మున్న నెవని కేని
కనఁబడక యెట్లు వచ్చునో కావలసిన
వన్ని యెట్లు గ్రహించునో యవలఁ బాజి
యెట్లు పోవునో యామాయ యేమొ తల్లి!

తే. లేఁగదూడలతోఁ గలు సాగఁదీసి
చక్క నొండింటి ముడి వెట్టి చకచకమని
రెంటినిం దోలు నయ్యావి రెండుకడల
గింజుకొని గింజుకొని కూలి పింజమూరు.

క. ఒక లేఁగదూడ తోఁకకు
నొకముసలి గడ్డమునకు నురి పోసి మహా
త్సుకుఁడై తోలుచు దానిని
బకపక నగు వాఁడు పొందుపాట్లను గనుచున్.

క. సతిపతు లిరువురు నిద్రా
గతు లౌతఱి జుట్టుకొనలు కలిపి ముడినిడున్
జతనముగాఁ బొంచుండియు
స్థితినిం గమనించి నవ్వి చివ్వునఁ జాఱున్.

క. అక్కడ నున్నాఁ డని లే
దిక్కడ నున్నాఁ డటంచు నెంచుటె యౌఁ గా
కిక్కడ నక్కడ నెక్కడ
నొక్కఁడె తా నై రహించు నుత్పలనేత్రా!

క. ఇంటింటం జెలరేగిన
కొంటెలగోపయ్య పనుల కుండై మండై
మింటి కెగయుఁ బెను మంటలు
తంటాలై వేఁచు మమ్ముఁ దామరసాక్షీ!

క. ఒకటా రెండా యెన్నని
కికురింత ల్చెప్పవచ్చుఁ గృష్ణచరిత్రం
బాకనికిఁ జిక్కఁడు దక్కఁడు
పకపక నగి వెళ్ళిపోవుఁ బర్వేందుముఖీ!

సీ. పట్టుకొనఁ బోవఁ దాఁ బట్టుపడినయట్లె
డాయవచ్చును క్షణములో మాయ మౌను
బఱుగుపఱుగునఁ బోవును మఱలి వచ్చు
వెక్కిరించుచుఁ జక్కఁగా వెడలిపోవు.

ఆ. వె. ఇన్ని మాట లేల యీతఁడు సేయని
కొంటెపనులు గాని కొంపలంముఁ
జిచ్చుఁ బెట్టనట్టి చిలిపిచేతలుగాని
లేవు లేవు తల్లి లేవు లేవు

కం. అత్తకు మామకు నడుమన్
బొత్తులు లేకుండఁజేయు బోరు గొలుప నే
యెత్తులో యెత్తును మత్తునఁ
జిత్తములం గుత్తకొనును జెలువా వింటే!

మ. ఇవి యిట్లుండఁగ మేను పెంచెకు మహాహేయాతిహేయంబులౌ
నవి యింకం గల వన్న! యర్భకుఁడు మాప్రాణము ల్దీయున
ట్టివికారాలను గొంప లార్ప మొదలై ఢీకొట్టుచున్నాడు మా
రవిరాసాలఁట పిల్లఁ డీతఁడు స్మరప్రాగల్భ్య మె ట్లబ్బెనో!

శా. రాకాచంద్రనిభాననుం డఁట మనోరంగాంతరంగుం డఁటే
మాకై తాను జనించె నంట ధరో మన్నించి పాలించుచో
శ్రీకై నెల్యపదంబు నిచ్చునఁట లక్ష్మీనాథుఁడే తానఁటే!
యోకల్యాణి! యివేమి మాటలొకొ యెంతో వింతఁ జేకూర్చెడిన్

ఉ. గోపతి యంట తాను మఱి గోవులు మే మఁట చూలు నిచ్చు పై
కోపులతీపుఁ జూపు నఁట కోరికలూరఁగఁ గన్నపాపలన్
జేపుగసాల నిచ్చి తమిఁజెందఁగవచ్చెడు నంట కోమలీ!
యీపసిపాప కిట్టి నుడు లెట్టుల వచ్చెనొ యేమొ? చిత్రమా!

ఉ. చూపులలోనె పూవిలుతుఁ జొక్కపుటమ్ములు నాటఁ జూచులో
జూపుల లాహిరీరసముచొక్కులు దిద్దు విలాససఖ్యతా
లాపములందు వాగ్రమణి లాస్యము సేయునటుండు నిట్టిఁడౌ
నీ పసివాని చెయ్దములు నీకె సువేద్యము నందభామినీ!

ఉ. ఆనడ లేమిటో? కలభయానము నూనముఁజేయు మోముపై
లేనగ వెందుకో? పరిమళింపులవెన్నెలచిన్నె లొత్తు; ను
డీన మ దేలనో? మరునిరీవిని తావులుఁ బెట్టు; నమ్మ నీ
కూన విలాసవేషములు కోమలి! కానము ధాత్రి నెయ్యెడన్.

ఉ. చందురులోఁ గురంగమము చక్కలిగింతలు వెట్టినట్లు మా
డెందము లంది పుచ్చుకొని తీవి గిలా వొనరించుచుండు నే
సందున దూరునో పలువచందము లేవి గ్రహించునో యటం
చందఱ మొక్కరూపున నహర్నిశముల్ గనుచుండు మాతనిన్.

గీ. నిన్న మొన్నటివాఁడు మాకన్నులెదుటఁ
బుట్టియున్నాఁడు వీని కీబుద్ధు లెట్లు
పట్టుపడెనొకొ యది యేమొ పరమశివుఁడె
తెలిసెడుంగాక నరులకుఁ దేటపడదు.

గీ. విషయపరిణామ మేమైన వింతకథకు
నవ్వు వచ్చును గోపము నివ్వటిల్లు
నెంతొ తృప్తిగ హా యనిపించు నొకట
యేమి మాయమొ యేమొ వీఁ డెట్టివాఁడొ?

ఉ. నవ్వులు గావు మానుడులు నమ్మము దేవునితోడు నిక్క మా
నివ్వొక లెక్కలోని వఁటొ? యీ తలవెంట్రుకలన్ని యున్న వి
చివ్వలమారి కన్నియ విచిత్రపవిత్ర చరిత్రసూత్రముల్
నెవ్వగ లెన్నొ నేర్చుకొనె నీసుతుఁ డిప్పటినుండి కోమలీ!

కం. ఏదేవుఁడు లేఁడఁట తా
నే దైవమ్మంట పురుషుఁ డితఁడే యఁట మే
మేది యొనర్చిన నయ్యది
యాఁ దనకొఱకే యటంచు నను నితఁడు సఖీ!

కం. వ్రతము లొనర్పఁగఁ గన్గొని
స్థితరూపుఁడ నేను గల్గఁ జిత్రపటములా?
వ్రతమంటపమం దుంచుట
యతినా యని విసరి వైచె నన్నిటి నేలన్.

కం. మీఁదులు కట్టినకుండలు
బాది విదారించి క్రిందఁ బడఁ దన్ని యొహా!
మీఁ దఁట! మీఁదు! నిదేదో
చాదస్త మటంచు నవ్వి చంకలు గొట్టెన్.

ఉ. వాని నిగూఢవర్తనము వాఁడె యెఱుంగును ఒల్లి వోట సుం
తేని గ్రహింతు వేమొ యిది యేలవలేశము మే మెఱుంగఁగా
రానివిచార మై కొఱకరాని విచిత్రపుఁగొయ్య యయ్యొ నో
చాన కుమారుఁ డిట్టిఁడు నిజమ్ముగఁ గల్గఁడు వేరికేనియున్.

ఉ. కాని విశేష మొండు విధగాఁ బొడగట్టుఁ బరోక్షమందు నె
న్నేని వికల్పములు గలుగు నెచ్చట పోవునొ? వానిఁ గాంచఁగా
నే నయగారు ముప్పతిప్పలు నిప్పునఁ గ్రాగెఁడు వెన్నవోలె మా
మానసముల్ ద్రవించు హరిమాయయొ? వానిప్రభావమో సతీ!

ఉ. కామినులెల్లఁ గొట్టెదము కట్టెద మందురు పూరుషుల్మహో
ద్దామముగా విధించెదరు దండన లెన్నియొ వాఁడు వచ్చెనా ?
మా మగవారు మేముఁ ద్రప మాలిన దేబెలువోలె నిల్చియున్
మోములు దేలవైచి కడు ముచ్చటగాఁ గనుచుందు మాతనిన్.

మ. చెలువా! కన్నులు కల్గిసందులకు మీ చిన్నారికన్నయ్య ము
ద్దులు ముచ్చట్లన రెచ్చఁ గొట్టి కడుసంతోషాంతరంగంబుతోఁ
దిలకింపం దలపోసినార మిపు డీ తీ రౌట లూహింప మొం
దుల కా వాదువిధాత మా కొదవు సంతోషంబు భంగించునో

మ. ఉవిదా యెన్నని చెప్పుకోఁగలుగు నెన్నో యెన్నో యెన్నెన్నోయు
న్నవి యీ నెంద్రుకలన్ని చెప్పుకొన కున్నా మెన్నో సిగ్గౌట వి
న్నవి కన్నట్టవి కానిచిత్రములు కన్నా వట్టినత్పుత్రు దు
ర్వ్యవసాయంబులమచ్చుఁ జల్లు మని మాపైఁ బుచ్చినా వంగనా

శా. నీదే తప్పునవచ్చు నిందు సరి యా నిర్దుష్టమార్గంబునన్
శ్రీదున్ నిల్పి భయంబుఁ బెట్టునెడ నీ చేడ్పాటు వాటిల్లునా?
పాదాక్రాంతుఁడు కాకయున్నె వశుఁడై వర్తింపకున్నె కడుం
బ్రోదిం బెంచితి వింత చేసితివి మమ్మున్ ముంచినా వంగనా!

శా. ఏదో తాళక నీకుమారుని త్రపాహీనక్రియ ల్గొన్ని నీ
తో దీనంబుగ నింత వాగితిమి మా దోషా లెవే నున్న న
మ్మా! దూషింపకు పుత్రు నెట్లయిన సన్మార్గంబునం బెట్టి మా
కేదో దారిని జూపు మింకఁ గరుణాదృష్టిన్ యశోదమ్మరో.

మ. ఇఁక నీచిత్తము చెప్పఁగాఁదగిన వెన్నేఁ జెప్పినా మమ్మ నీ
దుకుమారున్ సరిచేయఁ జూచెదవొ "మీతో నేమి పొండంచు నం
పకముల్ చేయుదొ యమ్మ నేదయిన మా భాగ్యంబె యా నేలుకొం
టకు భూముల్గనమే మొ భైత్స్యమున కాటంకంబు లే ముండిడిన్.

గీ. సిగ్గు మొగ్గును దెలియని చిన్నివయసు
వాఁడు మాటాడునున్నాఁడు కోడెగాఁడు
జోడుకత్తెతోఁ గోడిగ మాడునట్లు
వలదు వల దన్న వినఁడు చాపలము విడఁడు.

చ. అని విని యయ్యశోద త్రప నంది వరాంగము దించి కన్నులన్
జినుకులు రాల మెత్తనగు చిత్తము తత్తరమందుచుండ నే
మనుటకు నోరు రాక నిజమా? కలయా? యని చింత సేయుచు,
దన మునిగోళ్లతో ధరణిఁ దాకుచు నేమన నేర కార్త యై.

ఉ. పిల్లఁడు బాల్య చాపలము పెంపున మిమ్ముఁ గలంచెనేమొ? స
ర్వైన్ మనస్సులం గొని తపింపక శాంతి వహింపుఁడమ్మ మి
మ్మెల్లర వేడికొందు క్షమియింపుడు బాలుని నా నిమిత్త మై
పిల్లలఁ గన్న తల్లు లివి పెద్దవి సేయ రటంచుఁ దెల్పినన్.

ఉ. వారటు వోవ వీరు దిగఁబారిరి యింటికి బాలుఁ గాంచి యే
రా! రమణీ మనోహరుఁడ వై విహరించెదవంట యిండ్లలో
దూరి పదార్థముల్ మిసిమి దొంగతనంబునఁ దింటువంట యీ
నేరుపు లెట్లు వచ్చె నవనీతుఁడ ని కని మందలించుచున్.

ఉ. నందకుటుంబమందు జననం బయి యింతటి పాడుపేరు నీ
వందుట వంశగౌరవము నార్చుట కాదఁటరా? యయోమయా
నందముఁ జెందుచుండు నొకనాఁడును దిన్నగ నింట నుండ వీ
చందము లేమిటో యెఱుగఁజాలము జాలములీలఁ దోచెడున్.

ఉ. మాకులమందు నివు తలమానిక మై మము నుద్ధరింపఁగా
శ్రీకరమూర్తి వౌదు వని చిత్తమునం గడు నెంతు గాని ము
క్కా-కల దీరు దొంగవని కామినులన్ విలపింపఁజేయు ప
ర్యాకులమూర్తి వంచు కలనైన దలంపను గోపనందనా?

గీ. గాలిమేడలు నేలపైఁ గూలిపోయె
వంక లేనివంగడము కళంకిత మగు
నూరిలో వారితో నెల్ల బోరుసాగె
నింక నే నోర్వఁజాల నం చింతి యలిగి.

ఉ. కోల నొకండు చేతఁ గొని కొట్టఁగఁ బోయిన బాలుఁ డేడ్చి "య
మ్మా! లవలేశమేని నెప మన్నది నాయెడ లేదు భామలే
గోల యొనర్తు రి నన్నుఁ గడుగోముల నోమెడుతామసమ్మునన్
బాలన సేయుమమ్మ పసిపట్టకు కొట్టకు గుట్టు చెప్పెదన్.

ఆ.వె. గాలిమేడలైనఁ గూలక తప్పవు
శంక లేక వంక మంకు విడదు
పోరు లేనిబుద్ధి వోరలి వర్తింపదు
కులము విలువ వృత్తివలనఁ గాదు.

మ. అని యేమో పరిభాష లాడు సుతు వాక్యంబుల్ గడున్ మెచ్చి
మ్మన మాధ్యాత్మికవృత్త సంకలిత మై మాయా ప్రపంచాను భూ
తిని గర్వించి తటస్థ మై నిలిచెఁ దద్దేవిన్ విలోకించి నం
దనుఁ డమ్మా! యని చేరవచ్చియుఁ గరద్వంద్వంబు నందిచ్చుచున్.

గీ. ఎత్తుకోవమ్మ నాపయి నింతకోప
మేల? యేడ్చెదు తామస మీఁగు మమ్మ!
యాఁకలయ్యె నన్నముఁ బెట్టవమ్మ! యనుచు
గునిసి యాడఁదొడంగె నక్కుట్టివాఁడు.

శా. మాయాకల్పము దీరి లోకమును సమ్మానించి మాతృక్రియా
ధ్యాయం బెంతయు నెంచి యంతట యశోదాదేవి గోరాడు లేఁ
బ్రాయంపుంబసికూన నెత్తికొని మూర్ధాఘ్రాణముం జేసె నెం
తే యానందము డెందమం దొదవ రమ్యోహాసమాక్రాంత యై.

ఉ. అంతట లోని కేగి సతి యన్నము బంగరుగిన్నె నుంచి పూ
బంతిగఁ జంకలో నెనయు బాలుని నోట నొకొక్క ముద్దయున్
వింతకథావిధానముల వేడుక గొల్పుచుఁ బెట్టుచుండె నా
రంతుల పిల్లవాఁడు సుకరంబుగ మ్రింగుచునుండె నన్నమున్.

ఉ. ఇంతటిగోలవే? తనయ! యెట్లు గలంచితివయ్య వారి నే
కాంతముగాఁ గలంతువఁట కానిపను ల్పచరింతు వంట కే
రింతలు గొట్టుదంట బెదరించెదవంట యెవేవొ చెప్పి ర
వ్వింతల నేడ నేర్చితివి బిడ్డ గురుండెవఁ డయ్య వీనికిన్.

ఉ. అందఱికండ్లలో నలుసవై నడయాడకుమన్న! యెందు నే
కుందు ఘటిల్లునో? విషపుఁగోరలతో నెవ రేమి యందురో
యిందఱినోట నాను టది యెన్నఁడు గూడదు దుష్టవృత్తిచేఁ
జందురులోని మచ్చవలె శాశ్వతదుర్యశ మందు నందనా!

చ. అన విని నవ్వి బాలుఁడను నమ్మ! మదీయుల నెమ్మనంబులన్
గొని విహరించుచందమును గోరెద నెప్పుడు నేను నొక్కచే
మననము నాది దుష్టమగుమార్గము లెంచను దామసమ్ముచే
నను గ్రహియింపలేనియెడ నాయెడ దోషము లేదు తల్లిరో!

చ. మనముల మర్మముల్ దెలిసి మన్ననఁ జేసెదఁ గాని యెన్నఁడ
వ్వనితలఁ జిన్నఁబుచ్చ నవి వారల కర్థము కావు హృద్యమా
పనులను లోకవాసనల బాహిరవృత్తుల కంటఁగట్టి నె
మ్మనము లపక్వమై విమతమార్గముఁగాంతురు వారు తల్లిరో!

గీ. ఉవిదలందఱదృక్పథ మొక్కటయ్యు
నభిరుచులభేదముం బట్టి యర్హమైన
కృతుల సాగింపవలసెఁ బ్రత్యేకముగను
గాననే యిన్ని విధములు గానఁబడెడు.

క. గురువుల కెవ్వఁడుగురు వా
గురువే గుఱియైన నింక గురు వెందులకే
గుఱితించెడువారలె యీ
పరమార్థము తెరువుఁ జేరఁబోరెద రమ్మా!

క. చదువులమర్మముఁ జదివిన
చదువరిఁ జదివింప నెవఁడు చాలును విద్యా
పదములు సన్నుతపథమును
బొదవెడునిశ్రేణి సూవె బుద్ధిఁ దలంపన్.

గీ. కనులలోఁ బాప తన్నుఁ దాఁ గాంచలేదు
దానిఁ గనిపింపఁ జేయు నవ్యానియునికి
గానమున్నను లొట్టలాఁ గాక కనులు
మినుకుపుణుకుల మననము గొనవు తల్లి!

మ. అని యింకన్ బలురీతులన్ నిగమవేద్యార్థంబులన్ సూటిగా
వినిపింపంజను పుత్రునిం గని కడున్ విభ్రాంతితో నందభా
మిని బాలుం డితఁ డెట్టివాఁడో వినుచున్ మేమెన్నఁ డాలింపకుం
డిన యర్థంబులు ధాతయో హరియొ కంకేశాలుఁడో వీఁ డగున్.

తే. అని తలంచు కాంతను జూచి హరి స్వకీయ
మాయదీపింప మఱల నహ్మా యదెంతో
మందుచున్న దాఁకలి యన మగువ భ్రాంత
యగుచు నన్నంబు వెట్టెద ననుచుఁజనియె.

చ. బలుఁడును గోపబాలకులు పాపనితోఁ జెలగాట మాడుచున్
గులుకుచు నందచందములు గ్రుమ్మచు జిమ్ముచు నవ్వుపువ్వుజ
ల్లులు గురియించుచున్ మిగులలోలుపులై వివిధప్రసక్తులం
జలుపుచు బాలకేళి సరసంబుగఁ జేయుచు నుండి రొక్కచోన్.

ఉ. ముద్దులు మూటగట్టు నగుమోమున మోహనరేఖ లొప్పఁగాఁ
బెద్దగ నవ్వుచున్ దలఁపుఁబెంపులు గుంపులు గూర్చి యొప్పముల్
హద్దులు పెట్టి బాలురను హాయిగఁ గూడుచు నాట లాడుచున్.
ప్రొద్దులు పుచ్చుచుండె యదుపుత్త్రుఁడు నందకిశోర మొప్పగన్.

గీ. మట్టిలోఁ బడి పొరలుచు మదనమూర్తి
మలసి యాడెడు బలరాముమాట వినక
దానిఁ జవిఁ జూచి కమ్మనౌ దీనిఁ దినుఁడ
టంచు బాలురకున్ మన్ను పంచఁదొడఁగె.

క. ము న్నొకనాఁడు వహించిన
మన్నే యిది శిరముపైన మన మందఱ మీ
మన్నునఁ బుట్టుట గిట్టుట
మన్నే మనయునికి మనికి మానించుఁజుఁడీ!

వ. అను నతని పలుకు లాలించి,

చ. బలుడును బాలురున్ బలుగువాఱుచుఁ బోయి యశోదదేవితో
దెలివిడి సేసి రవ్విధులు దిమ్మరపోయి యిదేమిపాపమో
పలుతనంబు లెక్కువగు బాలున కీతని జారఁబుచ్చుచో
మెలఁకువఁ జెందలేఁ డని గమించె యశోద కుమారుఁ గాంచఁగన్.

సీ. తనువుపైఁ బొరసిన ధరణీపరాగము
పూసిన వెలిబూది పూఁత కాఁగ

జడకొండిపైఁ గాంతు లడరు వజ్రపుబిళ్ల
పొలుపారు నెలవంకపువ్వు గాఁగ
గళమునఁ జీరాడు కమనీయహారముల్
రమణీయసర్పదామములు గాఁగ
నుదుట నొప్పెడు మృగమదతిలకము తీవిఁ
గనుపట్టు ఫాలలోచనము గాఁగ

తే. చిందు లందందుఁ బడి పంకచిహ్నిత మగు
గమ్యవసనము చర్మాంబగంబు గాఁగఁ
బరమ శివుఁడు ప్రత్యక్షమై పొరసినట్లు
భావ ముదయించి కలవరపడి లతాంగి!

ఉ. అన్న! యిదేమిపాడుపని? యయ్యయొ ధూళినిదేలుచుంటి వి
కన్నులలోన నెత్తిపయిఁ గాయముపై నిదియేమిటోయి? నే
నెన్నివిధాలఁ జెప్పిన గ్రహింపవు మట్టిని దింటివంట నీ
యన్నయు బాలురున్ దెలిపి రట్టి వికారము లేల? పుత్రకా!

క. ఆఁకొనియున్నావో? పసి
లేకనొ మనయింటికూడు లేమిడి గొనియో
ప్రాకటమగు రుచి గనియో
చేకొని మన్ను దింటివంట చిన్నికుమారా.

వ. అని యడిగిన తల్లికి ముద్దుల కొమరుం డిట్లనియె.

శా. అమ్మా! నే నొకవెఱ్ఱివాఁడనఁటె? యన్యాయ్యంబుగా కిట్టిదా
దుమ్మో దూళియొ యెంచి మ్రింగుదునఁటే? దూష్యమ్ము లే వైన నా
శమ్మే పోవును గాని నిల్చునఁటవే? శంకాత్మ లేవేవొ వా
క్యమ్ము ల్దెల్పిన నమ్మచుందువు నను న్గారింతు వూరించుచున్.

క. కల్లయుఁ గపటము నెఱుఁగని
తల్లివి యెవ రేమి చెప్పుఁదల నూపుటయే
యుల్లములోని రహస్యముఁ
జెల్లముగాఁ బలుకుచున్నఁ దెలియవు తల్లీ!

తే. వెలుఁగులో నుండి చీకటి వివరములకుఁ
దమసముం దాటి కాంతిపుంజమున కిట్లు
ముందువెనుకలకుం బోవుచుందు వీవు
తెలియకున్నావు నీరల చిలిపిపనులు.

వ. అనిన యశోద యిట్లనియె

ఉ. పిన్నవు నీవు; చెప్పెదవు పెద్దతికంబులు దెల్పునంతనే
పన్నియు నర్థ మైనటులె యాత్మకుఁ దోఁచును బ్రక్క-చూపుతో
విన్నవి విన్నయట్లె చెవి వీడి పలాయనమౌ నదేలనో?
కన్నయ! యన్నిచిత్రములుగాఁ గనుపించును నీదు చెయ్దముల్

వ. అని యశోద నుడువుటయు

క. గోపకుమారకు లది విని
పాపం డొకమట్టిపెల్లఁ బట్టి రయముగన్
మాపలుకులుఁ బాటింపక
దీపిగ నున్నది యటంచుఁ దిన్నాఁ డమ్మా!

తే. అనుటయు యశోద నీరజాక్షుని మొగ మయి
తెచ్చిపెట్టుకొన్న కినుక తేటపడఁగఁ
గన్నుగవ కించిదరుణమై చెన్ను మీఱఁ
బలుకులం బ్రీతియు రహింపఁ బలికె నిట్లు

ఉ. ఇంతకు మన్ను దింటి వని యిందఱుఁ జెప్పెద రన్న కూడ నీ
పంతముఁ జెప్పె; నిక్కమొ యబద్ధమొ తెల్పుము రెంటనేదో? నీ
యంతు గ్రహింతు నేఁ డను డనర్భకుఁ డామెను గాంచి మించి యె
క్కింత హసించి ముద్దు లొలికించుచుఁ దానిటు పల్కె నింపుగన్.

ఉ. ఇన్నివిధాల నన్ను నలయించెద వన్నయు గోపబాలురున్
మన్ను గ్రసించినా ననుచు మాయగ సాక్ష్యము లిచ్చినారు; నే
నెన్ని వచించిన న్వినవు విఁ కెందుకు తల్లిరో! యిప్పుడే కదా
తిన్నది; నోరు విప్పెదను; తిన్నఁగఁ జూచి గ్రహింపు సత్యమున్.

మ. అని గోపాలుఁడు నోరు విప్పనెడ నయ్యబ్జాక్షి మోదించి లో
చనపర్వంబుగఁ గాంచె నంచిత ధరాచక్రమ్మె గా నుజ్జ్వలా
ర్కనిశానాయక ముఖ్యసంయుత మహాబ్రహ్మాండ భాండంబుజ
న్మాన విభ్రాంతి యనంతమై కనులు మబ్బుల్గ్రమ్మె నొక్కమ్మడిన్.

చ. మఱిమఱి కాంచఁగాదొడఁగె: మక్కువ మిక్కుటమయ్యె; దేహమే
మఱచె లతాంగి; యాత్మ హరిమందిరమం దురియాడఁజొచ్చె; జి
త్తమువునఁ గాంచినట్లు వితతంబుగ గోకులభూమిలోని సం
బరములఁ జూడసాఁగెఁ దన బాలు ముఖాంతరమందు నొప్పగన్.

మ. భళిరే! చిత్రము: నేను దల్లినఁట యీబ్రహ్మాండనాథుండు నా
కులదీపంబఁట; వీనిపై నలిగి యాక్రోశింతు నేలా యతం
డలుకల్ దీరు మటంచు వేడునఁట; యారా సూక్ష్మఖద్యోతమే
జలజాప్తుం దులకించ నెంచె నతఁ డాసాదించె నద్దానినిన్.

మ. ఇలలో నెన్నఁడు నెవ్వరుం గనని వే నీక్షించుచున్నాను క
న్నులతో ధన్యను నేను దుఃఖ మడఁగెన్; నోము ల్ఫలప్రాప్తమై
వెలసెన్; చారు సుధార్ణవ మహావీచీ ఘనాందోళికా
ఘనవిశ్రాంతిని గంటి విష్ణుచరణస్థానంబు నే నందితిన్.

ఉ. బాలకుఁ డేడ? వీనిముఖపద్మములోన నజాండ భాండముల్
గోళములట్లు స్పష్టముగ గోచర మౌ టది యేడ? శ్రీరమా
లోలుఁడు వీఁడు; లీలఁగొని లోకవిడంబన మంచి బాలుఁడై
ఖేలలఁ జేజూపఁగాఁ దొడఁగెఁ గీర్తివిశాలుఁ డటంచున్ నెమ్మదిన్.

క. నిర్విణ్ణహృదయ యై సతి
సర్వమును మఱచి లోకసామ్రాట్టు నెడన్
బర్వినదృష్టి మఱల్పక
పర్వేందు చకోరలౌల్యఫణితిన్ గనుచున్.

క. పూనినభక్తికతంబున
ధ్యాన మవిచ్ఛిన్నతైలధార విధమునన్
మానసముఁ బొరసి యుబ్బుచు
మానిని మాధవవిలీనమానస యయ్యెన్

క. నారాయణ! హరి! దురితని
నారణ! వారణ మహార్తివారణ! జగతీ
కారణ! కారణ కారణ!
శ్రీరమణీరమణ! సకల సేవితచరణా!

మ. అని ధ్యానామృత మాధురీ వివశ యై యానందవారాశిలో
మునుకల్ వేయుచు లోకమే మఱచి వ్యామోహంబుఁ బోనాడి ః
దను పాదాగ్రతలంబునం బడి యశోదాదేవి శీర్షంబు మో
పి నమస్కారగ మొనర్చి మానసము నర్పించెన్ బ్రపూర్ణంబుగన్.

చ. హరి కరుణాసముద్రుఁడు హృదంతరపక్వవిధానమార్గముల్
గఱపెడువాఁడు సన్నిహితకర్మఠులన్ దరిఁ జేర్చువాఁడు శ్రీ
వరుఁడు యశోదమానసవిపాకవిశుద్ధి నెఱింగి మోదసం
భరితుఁడు నై వివిక్తసముపాయము లొప్ప మనంబుఁ ద్రిప్పుచున్.

ఉ. వైష్ణవమాయ గప్పి జడభావము కప్పఁ దగిల్చినంత నా
తృష్ణ తొలంగి పూర్వవిధిన్ మమకారముఁ జెంది యర్మిలిన్
గృష్ణకుమారు నెత్తుకొని క్రీడ లొనర్చె యశోద పొంగుచున్
జిష్ణుని మాయచే జగము చెందెడు మోహము లిట్టివే కదా!

గీ. ద్రోణుఁ డను వసు ముఖ్యుఁడు తొల్లి నలువ
వలనబోధింపఁబడి ధరాతలమునందు
పత్ని ధర యను దానితో, వాంఛ లూర
హరిచరణదాస్యమును గోరి యవతరించె.

గీ. ద్రోణుఁడే నందగోపుఁడు తోయజాక్షి
ధర యనంబడు నదె యశోదాలతాంగి
వారివాంఛల తీరుపఁ గోరి శౌరి
తనయుఁడై వారియింట వర్తన మొనర్చె.

ఉ. బాలకుఁ డింట నాడునెడ భామ యశోద దధిన్ మథింపనా
వేళగృహంబున న్నిలిచి వే దరికంబముముందు భాండముం
బోలగ నుంచి కవ్వమునఁ బొందుగ ద్రాడమరించి నిల్పి యొం
తో లలితముగాఁ జిలుకుచుండె దధిన్ మథునాద మేర్పడన్.

సీ. కిసలయారుణకాంతు లెసఁగుపాణితలమ్ము
                లొరయుచుఁ దరిత్రాడు పొరయుచుండ
    గుత్తంపుఱకవిలో గుట్టుమిట్టులు దోఁగి
                యట్టిటు సయ్యాట లాడుచుండ
    గంబుకంఠంబునఁ గలతారహారముల్
                గునిసి గుబ్బలతోడ గోష్ఠిఁ జేయ
    బాహువల్లరికేళి నోహటించెడులీల
                నూర్ధ్వకాయము తమి నొప్పుచుండ

తే. చెమటబిందువు లాణిముత్తెములవోలె
    ముఖసరోజముపై నొప్పి ముద్దు లురియ
    హస్తకంకణ నిక్వణ మ్మలమికొనఁగఁ
    జల్లఁ జిలికెడు శ్రీకృష్ణుతల్లి యపుడు.

సీ. చిరుగజ్జె లందెలుఁ జేరి ఘల్లనిమ్రోయ
                గుప్పిగంతులు వింత గొలుపుచుండ
    జిన్నారికన్నులఁ జిటిముత్తెములువోలెఁ
                గన్నీరు తెప్పలఁ గ్రమ్ము కొనఁగఁ
    బవడంపుఁదీవెల నవనవత లూపు
                లలిత పాణులఁ గనుల్ నులిమికొనుచు
    గమ్మనిపూఁదేనెఁ గ్రుమ్మరించెడు నట్టు
                లమ్మా! యటంచు నోరారఁ బిలిచి

తే. పాలతమి గొన గోమాతపైకి వేగఁ
    గ్రేళ్లుఱుకు లేఁగదూడ విక్రియఁ దవర్చి
    గునిపి నడయాడి యొప్పులకుప్పవోలెఁ
    దల్లిచెంగట దుమికెను నల్లనయ్య.

చ. కిదుకుచు గొంగుఁ బట్టుకొని క్రిందికి లాగుచు ముద్దుముద్దుగాఁ
    బదరుచు గోములం గుడిచి పా లియవే యని గోలసేయుచున్
    బదముల నెత్తి పైకి నెగఁబ్రాకుచు దూఁకుచు సన్నమేళముల్
    మొదలిడి పోడుపోడుగను మూర్ఖత సూపఁ దొడంగె బాలుఁడున్.

చ. కని పని మాని తాఁ జిలుకుకవ్వము నవ్వలఁ బెట్టి హాయిగాఁ
దనయునిఁ జంకఁ బెట్టుకొని దవ్వుల కేగి సుఖోపవిష్టయై
పనుపడునట్లు వక్షమున బాలునిఁ జేర్చియు స్తన్య మీయ నె
క్కొను ముదమార బాలకుఁడు క్రోలఁదొడఁగెను బాలు లీలగన్.

తే. బాలుఁ డుబ్బుచు స్తన్యముం గ్రోలుచుండ
దాలిపైఁ గ్రాగుచున్నట్టిపాలు పొంగు
వాఱఁదొడఁగినఁ గన్గొని వారిజాక్షి
భాండముం గ్రింద దింపెడుపరవశతను.

చ. చను విడిపించి బాలకునిఁ జప్పున గ్రిందికి దించి లేచి పో
యినఁ గడు ఘూర్ణుచున్ గినుక హెచ్చి కుమారుఁడు వెన్నముద్ద లుం
చినకడ కేగి యన్నియును జిన్నికరంబుల నెత్తి నోటిలో
నునుచుచుఁ జప్పరించుచును నొయ్యన మ్రింగఁ దొడంగె వింతగన్.

తే. అంతలోఁ గోప మాఁగక యర్భకుండు
చేతఁ జిఱుఱాలు గొని గుఱిఁ జేసి పెరుగుఁ
బాలకుండలపైఁ బడులీల విసరె
భిన్న మయ్యెను భాండము లన్ని యొకట.

ఉ. పాలును జల్లయున్ దొఱఁగి పాఱుచు నేఱులు గట్టఁ జూచి గ
గ్గోలు వడంగ నెమ్మనము కొంటెకుమారునిఁ గంటగించుచున్.
దాలిమి మాలి శిక్ష లిడ దాపుల కేఁగె యశోద యంతలోఁ
గాలికి బుద్ధిఁ జెప్పెను బకాపక నవ్వుచు బాలుఁ డత్తఱిన్.

తే. వెన్న లుంచినచట్టిలో సున్న యాట
గాంచి తిని యుండ నగు నంచు నెంచి పీని
కొంటెపను లంతకంతకుఁ గోపు ద్రొక్కు
చున్న వేరీతి సవరింపఁ జన్నొ యనుచు.

చ. మురిపెములూర గోము గొని ముద్దులకుఱ్ఱఁ డటంచు నెంత య
బ్బురముగఁ బెంచినందులకుఁ బో యితఁ డింతగ మీఱి మేటితుం
టరి యయిపోయె నీతని హడావుడి మిన్నులు ముట్టుచుండె నీ
తెఱుపు మఱల్పకున్న గడిదేఱినకొంటెలగోపుఁ డయ్యెడిన్.

చ. పసితనమంచె తీర్పనగు బాలుర నెంతయుఁ బేర్మిఁ గానిచో
మసగొని కానివృత్తులకు మార్గము గందురు చెందరాని దు
ర్వ్యసనము లొంది కాపురుషపద్ధతులం గమకింత్రు పెద్దలై
నిసువుల మంచిచెడ్డల గుణించుటఁ దల్లియె కారణంబగున్.

చ. ఒకచెలకోలఁ జేతఁగొని యొయ్యన బాలకుఁ డేగినట్టి ది
క్కుకుఁ జని వానిజాడ నొకకోణమునం గని పట్టఁబోవ చి
క్కక పరుగెత్తె వాఁడు కని కారుణికత్వము లేక పట్టి త
ప్పక గుణపారము ద్దెలుపు భావముతో వెనువెంట నేఁగుచున్.

చ. నిలు నిలు బాలకృష్ణ! యిఁక నీచుదుకు ల్సహియింపఁబోను భా
మలు వచించినట్లు కడు మాయలమారివి వారియిండ్లలోఁ
జలిపిన దుష్టకృత్యములు స్పష్టముగాఁ గనిపించె నింక నీ
పలువతనాల కెంతటికిఁ బారము కన్పడదేమొ చూచెదన్.

ఉ. చిక్క నటంచు నెవ్వరికిఁ జిక్కియుఁ జిక్కనిరీతిఁ దోఁచుచున్
జక్కఁగఁ బారిపోదు వఁట చక్కలిగింతలుఁ బెట్టుచుండు నీ
టక్కరిమాయఁ గప్పెదఁట డంబు విడంబనఁ జేసెనంట నే
చక్కని నాకుఁ జిక్కవో విచారణఁ జేసెద నిగ్గు తేల్చెదన్.

గీ. అంత కంతకు దుశ్చేష్ట లధిక మయ్యెఁ
బట్టుకొనఁబోవఁ జిక్కవు పారిపోదు
వెంతబలవంతుఁడవో నీ యుదంత మేమొ
యంతు గనుగొందు నే నని పంతగించి.

మ. మొగమున ఘర్మబిందువులు ముత్తెములట్లు స్రవింపఁ బాదముల్
తొంగరుకొనంగ భారమునఁ దూలుచు గౌ నురియాడఁ గొంగు రఁ
గుగ దిగజార హారములు గోరముగా నురియాడ నయ్యశో
ద గమనవేగ మొప్ప వితతంబుగ బాలకు వెంట నంటెడున్.

క. చిఱుగజ్జెలు ఘల్లు రనుచు
మొరయఁగఁ గ్రేళ్ళురుకు లేఁగఁ బోలి హొయలుగా
నుఱుకుచు గంతులు వేయుచు
జిఱుపాప యశోదముందుఁ జిక్కక పాఱున్.

ఉ. చేతులఁ జిక్కినట్లుగను జిక్కకఁ చెంగున దూకి పాఱెడున్
బాతర లాడుచో వెనుకప్రక్కఁ గనంబడుఁ బట్టఁబూనుచో
బ్రాతి నదృశ్యుఁడౌ నిటుల బాలుఁడు తల్లిఁ గలంపఁజొచ్చె వి
ఖ్యాతుఁ డనంతుఁ డీశ్వరుఁడు కట్టడి నోర్చునె? యెట్టిభంగులన్.

శా. ఏమీ? చిక్కక పారిపోయెదవ! కానీ చూతు నెం దేగెదో!
నీ మాయల్ ప్రజకామినీముఖులపై నేమైన వ్యాపించు నే
మో! మాయాసతి నొంచు నేమొ! సుడిగాడ్పున్ బండి భంజించు నే
మో! మీ తల్లిని గండ్లమాయవుసుమీ! యోజింపు గోపాలకా!

శా. ఏమైనన్ సరె; నిన్నుఁ బట్టనగు నే నీనాఁడు నిద్రింపనా;
గోము ల్దీరిచి పెంచినందులకు నాకున్ మబ్బుఁ బాయంగ నే
మేమో యెత్తులు వేయుచుంటి; విఁక నీ విప్పట్ల రావమ్మ! లే
దా! మోహమ్ము త్యజించి పోయెదఁ దపోధర్మంబుఁ బాటింపఁగన్.

చ. అని ధృడచిత్తయై వెదకు నమ్మ పయిం దయ గల్గఁబోలు బ్ర
క్కనఁ గనిపించె బాలకుఁడు కన్నుల నీరము గ్రమ్మరించుచున్
వణకుచు భీతపోతము నెపమ్మునఁ; గన్గొని యయ్యశోద గొ
బ్బునఁ జని వానిఁ బట్టుకొని పొంగుచు వెక్క సమూర నిట్లనున్.

క. ఓహో యెవ్వరికందని
సాహసులా వీరు నేఁడు చయ్యన నాకే
యూహామెయిఁ జిక్కిరో నిజ
మూహింపం దరమె హేతు వుండు నదేమో!

వ. అని పలికి

క. చెలగోలఁ బట్టికొట్టన్
దలకొని చే యెత్తి ముద్దు తనయుముఖమ్మున్
దిలకించి కొట్ట నోపక
తలఁపు ల్దిగద్రావి కోల ధరణిన్ విసరెన్.

ఆ. వె. వరశిరీషకుసుమ సురుచిరాకారునిఁ
గొట్టరాదు పట్టి కట్టివేసి
బుద్ధిఁ జెప్పవలయుఁ బోయెద ననుచును
బట్టి లాగుకొనుచుఁ బడఁతి నడచె.

సీ. జలజదళంబులందలి హిమాంబువులట్లు
జిలుగుఁ గన్నుల నశ్రు లొలుకువాని
లోలమౌ బాలతమాలవృక్షములీలఁ
దను వెల్లఁ గంపించి వణకువాని
లలితమై చలియించు తలిరుటాకువిధానఁ
దడఁబడుచున్న పాదములవాని
షడ్జమస్థాయిలో స్వరమూర్ఛనము రీతి
డంబుగా వణఁకు కంఠంబువాని

తే. కొట్టకే యెన్నఁ డిటువంటి కొంటెపనులు
సేయనే క్షమింపవె యని చెప్పువానిఁ
భీతువిధానఁ బైకిఁ గన్పించువానిఁ
బట్టి బాధింపఁ గొనిపోయెఁ బడఁతిమిన్న.

సీ. సందైనఁ దల దూర్చి జారిపోవుటకై
తగునుపాయము లెన్నొ తలయుచుండఁ
బట్టు వీడఁ దలంచి పరిపరివిధముల
గునియుచు ముద్దుగాఁ బెనఁగులాడ
మాతృదేవిమనంబు మమత గెట్టింపఁగాఁ
బొరిఁబొరిఁ గుసిలింత లురియుచుండఁ
గరుణారసము పొంగి పొరలుచో విడు నంచు
బావురుమని యేడ్చి బెరువు నింపు

తే. నమ్మకము కల్గునట్లు నానావిధముల
బాసలొనరించి దండనఁ బాయఁ జూచు
నెన్ని సేసినఁ గాని యాయన్నుమిన్న
బాలుగుణపాలుఁ బట్టినపట్టు విడదు.

చ. చని చని యొక్కఱోలు గని చయ్యన దానికిఁ గట్టివేయఁగా
మనమున నెంచి వల్లవసుమారవు లిచ్చిన త్రాడు వట్టి పా
పనికటిసీమఁ జుట్టుటకుఁ బాల్గొనెఁ గాని యజాండభాండముల్
ఒరుపడియున్న బొజ్జ నది పట్టునె? చుట్టునె? కట్టనేర్చునే?

గీ. ఎన్నియో త్రాళ్లు దెప్పించె నన్ని చేర్చి
ముళ్లు వెట్టించె దానితో ముద్దుబాలు
నడుము బిగియింప యత్నించె బొడవు చాల
కొక్కచుట్టేని తిరుగక యుండెఁ ద్రాడు.

మ. ఇది యేమో మటుమాయ యింటఁ గల త్రాళ్లెన్నని దెప్పించి యొ
ప్పిద మా రీతిని ముళ్ళు వేసితి మిఁకం బృథ్వీధరవ్రాతమున్
బొదవం జాలెదు త్రాఁకు బాలునడుముం బూర్ణంబుగాఁ జుట్ట దం
తదియా వీని కటిప్రదేశ మరరే యాశ్చర్యమై తోఁచెడిన్.

శా. కానీ మాయలమారికృష్ణ యిది నీకర్జంబె యేమైన ని
న్నినాఁ డింతటితోడనే విడువ మన్నింపన్ దనూజుండవై
నా నేమంబును దీర్చెదో పరుఁడవై నానావిధారిష్టమౌ
దీనావస్థ ఘటించెదో యనుచు నుద్దిష్టాంతరంగంబునన్.

గీ. నిశ్చలకృతప్రతిజ్ఞయై నిలిచి యున్న
తల్లియాశయము ఘటింపదలఁచి శౌరి
తన్ను బంధింపఁదలఁచిన త్రాడు మిగులు
నట్లుగావించె నదిగాంచి యంబుజాక్షి.

గీ. పట్టి నడుమున కాత్రాడు చుట్టివేసి
ఱోటికిం గట్టె నవ్విరాడ్రూపు నప్పు
డెవరి కేవిధంబునఁ గాని యెన్నఁడేని
పట్టువడని శ్రీహరి నేఁడు పట్టువడియె.

గీ.! అయ్యులూఖలమున బద్ధుఁ డైనబాలుఁ
డెట్టులుం బోవఁజాలక యట్టు నిట్టు
ఱోటిచుట్టును దిరిగి యారాటపడఁగఁ
దల్లి యదిగాంచి యుల్లము తల్లడిల్ల.

సీ. పిన్నవాఁ డని యెంచి మన్నింతు నంటినా
యంతకంతకు దుడుకు కధిక మయ్యె;
హితవులు సెప్పి దుర్మతము దీర్చెదనన్నఁ
బెద్ద లూహింపని సుద్దు లాడు

వానితో నేమని వారింపకుంటినా?
లోకాపవాదముల్ జోక మయ్యెఁ
గోపించి తుంటరికోపు లాపుద మన్న
నవనవాస్త్రులనాడి నవ్వఁజేయు

తే. హింస పెట్టి బోధింపఁగా నెంత మన్నఁ
జేతులే రావు నేనేమి సేయుదాన
బాలుఁ డేలీల సన్మార్గలోలుఁ డౌనొ!
తల్లి హృదయము చల్లనౌ తలఁపు గనునొ!

క. అని చింతించి పదంబడి
మనమున నూరట వహించి మహిళామణి గొ
బ్బునఁ జని గృహకృత్యంబులఁ
బొనరింపన్ లోని కేగెఁ బుత్రువిడిచియున్.

ఉ. ఎన్నఁడునేని గోప మన నేమొ యెఱుంగని తల్లియంతగాఁ
జిన్నరికూనపై నలుకఁ జెందు టదేలనొ? కన్నులారఁగాఁ
గన్నయ కొంటెచేష్టలను గాంచి యెఱుంగదొ మున్ను క్రొత్తలా
మున్నవి కారణార్థము లేవొ జనియించెనుగాక చేరువై.

ఉ. అక్కడ గొప్ప వైన యకు ళార్జునవృక్షము లుండె ఱోటికిం
బ్రక్కగ నవ్వి పృథ్విపయి రాలెదుకాలము చేరువౌటచే
నెక్కడ లేని కోపము వహించె యశోద కుమారు ఱోటికిం
గ్రక్కునఁ గట్టె నిట్లయగుఁగా విధిలీల లనూహ్యవైఖరుల్.

ఉ. ఎప్పటి కెవ్వి యెవ్వరికి నెవ్విధిఁ దారసిలంగ నున్నవో
యప్పటి కవ్వి వారలకు నవ్విధిఁ జేరఁగ వచ్చు నెన్నఁడున్
దప్పవు తప్పఁజూచుటలు దైవము నొప్పరికించు తప్పులౌ
నొప్పి నిజానుభూతి గను యోగ్యులభాగ్యమె భోగ్య మిర్విపై.

సీ. నరవాహనుం డంప వరపుత్రులు నలకూ
బరమణిగ్రీవు లన్ వా రిరువురు
శంకరదూత లై చని రజితాద్రిని
ఫాలాక్షుకొల్వులోఁ బరిఢవిల్లి

యొకనాఁడు చెలరేగి యుద్యానవనముల
గంధర్వకాంతలఁ గలసిమెలసి
మధుపానవివశులై మగువలు దారు ది
గంబరులై పాడి యాడుచుండ

తే. నారదమునీంద్రుఁ డద్రిని జేర వచ్చెఁ
గాంచి మగువలు వస్త్రముల్ గట్టికొనిరి
పురుషులు మదించి యట్టులె తిరుగుచుండ
బ్రహ్మమానసపుత్రుఁ డవ్వారిఁ గాంచి.

గీ. వెఱఁగుపడి వీరు చిత్రప్రవృత్తివారు
ధనదు పుత్రకు లౌటఁ బోతరముఁ జెంది
గర్వమున మిన్ను మన్నును గాంచ నేర
రౌర! ధన మెంతటియనర్థకారి యౌను.

మ. ధనగర్వాంధుఁడు కన్నుగానఁ డుఱుకే దర్పించు నార్తాళియ
మ్మనవుల్ గైకొనఁ డార్యధర్మముల సమ్మానింపఁ డేప్రొద్దు ని
ర్ధనుఁడో చిక్కియు శ్రాంతుఁ డయ్యు నిజధర్మవ్యాపృతిఁ న్మానఁ డా
ధనికుం గన్నుల విప్పఁ జేయఁ గల దీదారిద్ర్యమే యెన్నఁగన్.

చ. అని మది నెంచి గుహ్యపతియాత్మజులం భువి నూరుదివ్యహా
యనములు మద్ది వృక్షములునై పడియుండుఁ డటంచు గోకులం
బున హరి కృష్ణదేవుఁ డయి పుట్టి యులూఖల బంధితుండు నై
యెనసిన శాపమోచనము నేర్పడు నం చని పల్కియంతటన్.

క. చనె నారదుండు ధనదుని
తనయుల శాపంబు తీరుతఱి యేర్పడఁగా
జనని యశోదాసతి కృ
ష్ణుని గట్టెను ఱోట మిగులఁ జోద్యము గాఁగన్.

క. అజరుద్రాదుల కేనియు
నిజసతి కేనిన్ మహోగ్రనియతుల కైనన్
సుజనుల కైనను జిక్కని
త్రిజగత్పతి చిక్కె నొక్కొ తెఱపకరములన్.

గీ. అట్లు బంధితుఁ డై యున్న యర్భకుండు
మెల్ల మెల్లఁగ మోకాళ్ల మీఁదఁ దోగి
యాడుచుం బోయి వృక్షమధ్యమునఁ జేరి
త్రోలు తరువుల కానించి కూల లాగె.

ఉ. అంతట వృక్షముల్ ఫెళ ఫెళార్భటు లుప్పతిలంగ వ్రేళ్లతో
సాంతము గుల్లగింపఁబడి క్ష్మాతలిఁ గుప్పగఁ గూలిపోయె శా
పాంతము గాన యక్షవిభునాత్మజు లిర్వురు స్వస్వరూపులై
చెంతకుఁ జేరి శ్రీవిభుని చిన్మయరూపముఁ గాంచి మ్రొక్కుచున్.

శా. దేవా! దీనశరణ్యా! పాలయ మహాదేవాదిదేవా! వికుం
ఠావాసా! నతలోక పాలనవిలోలా! భక్తచింతామణీ!
భావాతీత వినోద ఖేలనకళాప్రావీణ్యా! దామోదరా!
శ్రీవత్సాంకితదివ్యవక్షా! కరుణాసింధూ! రమావల్లభా!

సీ. మత్స్యమై సోమకు మథియించి వేధకు
నిగమము లిచ్చిన నేత వీవు
కూర్మమై మంధరకుధరము వహియించి
పాలవెల్లి మథించు ప్రభుఁడ వీవు
ఆదివరాహమై యాహిరణ్యాక్షునిఁ
జంపి భూసతిఁ గొన్న చతురుఁ డీవు
ఘననృసింహుఁడ వౌచుఁ గనకకశిపుఁ ద్రుంచి
ప్రహ్లాదు నోమిన ప్రభుఁడవీవు

తే. వటుఁడ వై బలి నొంచిన నటుఁడ వీవు
దాశరథి వయి రావణదర్ప మార్చు
పురుషుఁడవు నీవు బలరామమూర్తి వగుచు
క్ష్మాపతుల నోహటించిన శౌరి వీవు.

క. శిశుపాల దంతవక్త్రుల
విశసింపం బుట్టి నందువేశ్మమునందున్
వశుఁడవు నై వర్తింతువు
శిశువవు కా వయ్య నీవు శ్రీహరి! కృష్ణా!

క. అని యనేకవిధంబుల హరినిఁ బ్రస్తు
తించియుఁ గుబేరనందను లిద్దివికిఁ జనిరి
యచటిచిత్రములం గాంచునట్టి గోప
సుతులు నివ్వెర పడి కృష్ణుఁ జూచుచుండ్రు.

క. పిడుఁ గడఁచిన శబ్దము వినఁ
బడియాదవు లెల్ల మిగుల భయపడి గుములై
వడివడిఁ బదములు వేయుచు
బుడుతని పొడఁ గాంచి చుట్టు ముట్టిరి కడఁకన్.

వ. అంత నందుఁ డొక్కింత యాలోచించి యమందానందకందళితహృద
యారవిందుండై మందహాసరుచు లాననంబునఁజెలువంద నిజకాంతా
మణిఁ గాంచి.

గీ. వాన లేని వట్టిపిడుగు వసుధఁ బుట్ట
నెందు కావేదన వహింప నేదొ చిత్ర
మొదవియుండును పోదము ముదము గదురఁ
గందము కుమారుఁ గన్నులకఱవు తీర.

మ. అని ధైర్యంబు యశోదకుం గఱపి స్థైర్యప్రాప్తుఁడై కాంతతోఁ
జనె నందుండు కుమారుఁ గట్టినప్రదేశంబందుఁ జూడంగఁ గూ
లినవృక్షంబులు రెంటికిన్ నడుమఁ గేళీలోలుఁడై యున్న నం
దను వీక్షించిరి నేత్రపర్వముగ నానందంబు చెన్నారఁగన్.

మ. శరవేగంబునఁ జేరఁ బాఱి కరము ల్సాపంగఁ గన్నయ్య ము
ప్పిరిమోదంబునఁ దల్లిహస్తములలోఁ బూబంతియై వ్రాలె న
త్తఱి బంధమ్ములు విప్పి యెత్తుకొని మూర్ధం బల్ల మూర్కొంచు శ్రీ
హరి! కృష్ణా! నిను నెంత సేసితిని నా హస్తాలతో నంచునున్.

క. కట్టితి ఱోటికిని నిను నేఁ
జెట్టను బాపిష్ఠురాలఁ జిత్తము చెడఁగా
నెట్టెటు వాపోయితివో
చెట్టులు పడిపోవునపుడు చిన్నికుమారా!

గీ. అని యశోద బిట్టు నడరుచు నుప్పెత
తప్పదయ్యొ నీకుఁ దండ్రి! యెట్లు
చెట్లు పడియుఁ జెక్కు చెదరవు శ్రీహరి
కృప యిదంచు మదిని నెంచి నిలిచె.

శా. ఎన్నోనాళ్లుగ నిల్చియున్నవికదా యీవృక్షముల్ నేఁటికి
తెన్నై కూఁకటివ్రేళ్లతోఁ గదలి పృథ్విన్ గూలఁగానేల? యే
బన్నంబో తల సూపఁబోలు మొదలై ప్రాప్తించె నిబ్భంగి య
న్నన్నా! యెంత ఘటిల్లెనంచు జడులై గయ్యాళవుల్ భ్రాంతిచేన్

ఉ. అచ్చట సర్వముం గనుచు నాడుచు నుండిన గోపబాలు రా
ముచ్చట లాలకించి యిది మోసము కాదు కుమారకృష్ణుఁడే
ప్రచ్చెను రెండువృక్షముల వానికి ఱోలు దగిల్చి యెవ్వరో
వచ్చిరి పెద్దవారు నుతిపాడిరి యాడిరి వీనితోడుతన్.

గీ. ఎగిరిపోయిరి పావురా లెగసినట్లు
లెచటికో యేమొ యని తెల్ప నచటివారు
విస్మయమునంది తోఁచినవిధులననుచు
నెచటివా రప్పు డిండ్లకు నేఁగి రంత.

ఉ. బాలకుఁ జంక నెత్తికొని ప్రాకృతుగాఁ దలపోసి శౌరియే
పాలన సేసెఁగాక పసిబాలుఁడ వేడ మహావిపత్తికిం
బాలగు టేడ? నయ్యయొ! ప్రపంచమునం దిటువంటిఘోరముల్
పోలునె? యంచు ఖిన్న యయి పొక్కుచు నేఁగె లతాంగి యింటికిన్

గీ. ఆదినంబున జన్మర్క్ష మౌట సుదతి
పుత్త్రి తలనంటి లాలలు వోసి విందు
సేసె గోపాలురకునెల్లఁ జెలఁగి వారు
భోజనానంతరమున సమ్మోదము గదుర.

సీ. కులవృద్ధులతో వృష్ణికుల సంభవులుచేరి
సభఁ జేసి యానాటి చరితములను
ముచ్చటించుచుఁ దీరిపోయిన యాపద
లొక్క టొక్కటి వ్రేళ్ల లెక్క లిడుచు

బలరామకృష్ణు లుద్భవమైన దాదిగా
వ్రేపల్లెలో నెన్నొ వింత లొదవెఁ
గారణ మేమొ! దుర్గ్రాహ్యము దుర్నిమి
త్తములఫలం బెట్లు దారసిలునొ

తే. ప్రతినిమేషము భీతియే బాలకునకు
నెట్లుదీరంగవచ్చు నిక్కట్లు మన మిఁక
కేమి సేయుద మని నచియించుచున్న
యాప్తులం గాంచి యుపనందుఁ డనియె నిట్లు.

సీ. నిన్న మొన్ననె కదా చన్నిచ్చు నెపమునఁ
బాడుపూతన వచ్చి గోడు సేసె
సుడిగాలి యై రాక్షసుఁడు చిన్నికృష్ణయ్య
నెత్తుకపోయి తా నెగసె దివికి
బండిలో దూరి పాపను ద్రొక్కి పోవఁగా
నరుదెంచె ముక్కడియసురుఁ డొక్కఁ
డెన్నాళ్లనుండియో యున్నమద్దులు నేడు
కూలిపోయెను గృష్ణబాలుపైన

తే. నందఱముఁ జూచుచుంటి మీ యద్భుతములు
బాలుఁడా చెక్కు చెదరఁడు పాప మెంచు
భూతములు పోతరము పీఁగిపోవు వీని
నెవఁడు కాపాడుచున్నాఁడొ యిన్నివిధుల.

గీ. దుర్నిమిత్తము లయ్యును దొసఁగుపొసఁగ
కుంటచే మనబాలు రేగోడు వడక
హాయిగా నుండి యుంటచే నరయ నివియు
శ్రేయములే యౌను దుఃఖముఁ జెందవలదు.

ఉ. ఐనను గోకులంబున ననర్థము లన్నియు వెంటవెంటనే
పూని ప్రజావళిన్ గలఁత వుచ్చెడుఁ గావునఁ గొంతకాల మెం
దో నివసించు టొప్పు మన మూరట దీరఁగ సందియంబుతో
మానవు లుండఁబోల దనుమానమె పూనెడు ఘోరభూతమా.

కం. ముందే యోజించితి నే
సందర్భము లన్ని నేను సకలవిధములన్
బృందావనభూమియె మన
కందఱకుం దగిన వసతి యై రహియించున్.

గీ. మన పశుగ్రాసముల కేమి యునికి కేమి
యన్నివిధముల యోగ్యమౌ నా స్థలంబు
పోద మని తెల్పు నుపనందు బోధములకు
వల్లె యని రెల్లగొల్ల వా రుల్ల సిలుచు.

గీ. పయనమై యాదవులు తమబండ్లు గట్టి
కలసమస్తము నుంచి మందలును దాము
సిద్ధపడి బృందవనిఁ జేరఁ జెలఁగి యంద
ఱొకరి కొక్కరు ప్రోత్సాహ మొసఁగుకొనుచు.

సీ. మందమందమ్ముగా మందలు మునుముందు
కందోవవిందుగాఁ గదలుచుండ
బాలురు వృద్ధులు పడఁతు లెక్కినబండ్లు
వెనువెంట బారుగా వెడలుచుండ
విల్లు నంబులు దాల్చి వీరులౌ గోపకు
లిఱుగెలంకుల రక్ష జరుపుచుండ
దప్పెట్లు గొమ్ములు డాపాలు డుడుము లా
దులు బహుతూర్యముల్ సెలఁగుచుండ

తే. దమపురోహితు లెల్ల దఱలిరాఁగ
గొల్లవా రెల్లరపుడు వ్రేపల్లె వీడి
చల్లచల్లగఁ బయనము ల్సలిపి చేరి
కొనిరి బృందావనంబునఁ గోర్కెలూరఁ.

గీ. రోహిణీయశోదలు కూడి రౌహిణేయ
కృష్ణులును నొక్కబండిలో నెక్కివారి
ముద్దుముచ్చట్లఁ బ్రొదును బుచ్చుకొనుచు
జెలఁగిబృందావనమ్మును జేరికొనిరి.

గీ. అట్లు బృందావనమ్మున కరిగి బండ్ల
నర్ధచంద్రాకృతిగ నిల్పి యావరణము
నేర్పరించి గోపాలకు లింపు గదుర
నందు బసఁజేసి యుండి రానందమునను.

ఉ. అచ్చటి సైకతస్థలము లయ్యమునానదిపొంగు హంగులున్
బచ్చికబీళ్లు క్రేళ్లుఱుకఁ బారెడు లేళ్లు నికుంజపుంజముల్
ముచ్చటఁ దీర్చుచున్న యవి మోదముఁ జెందుచు నాడుకొంటకై
యిచ్చట బాగు బాగనుచు నెంతయు మెచ్చిరి బాలు రెల్లరున్.

సీ. వివిధకుంజలతాంతవృతి సంకీర్ణమై
పరఁగుగోవర్ధనపర్వతంబు
నొఱసిపాడుచుఁ గ్రింద ధరణీసతీవేణి
నాఁ దోఁచు వరయమునాస్రవంతి
తత్తీరమున సైకతస్థలంబుల నొప్పు
నానావిహంగమ నాట్యకేళి
పచ్చికబీళ్లలోఁ బడి చెంగుచెంగున
క్రేళ్లుఱికెడు కన్నెలేళ్లసొబఁగు

తే. తీవెపందిళ్లు సెలయేళ్లు రీవిఁజూపు
బహుమృగశకుంతసంతానభరిత మగుచుఁ
బ్రకృతిమహనీయసౌభాగ్యభవన మనఁగఁ
దనరుచున్నది రమ్యబృందావనంబు

సీ. ఒయ్యారమొలుకఁ గుహూ కుహూ యని
హాయి హాయిగాఁ బాడెడు కోయిలమ్మ
పుచ్ఛముల్ విప్పి యపూర్వభంగిమముల
నృత్యము లెలయించు నెమలిపడుచు
వచ్చి రాని బడాయి ముచ్చటచ్చట లాడి
కులికి కిలారించు చిలుకభామ
రంగు రంగులరీవిఁ జెంగలించుచు ముద్దు
లొలికి పాఱగఁ జొంపులుఁగు పెద్ద

తే. బూరలూదెడుచిన్నారిగోరువంక
వివిధగాంధారముల గుప్పు విహగతతులు
వఱల నొప్పెడుఁ బ్రకృతిసౌభాగ్యలక్ష్మి
సర్వసౌహార్ద్ర వనంబు బృందావనంబు.

గీ. అట్టి రమ్యతలంబుల నర్భకులరు
గూడి బలరామకృష్ణులు కోర్కెలూర
నాడుచుం బాడుచు న్నడయాడుచుండ
వింతయందాల బరిణయై బృంద మెఱసె.

సీ. మేతలు మాని గోమాతలు తలలెత్తి
యాపఁ బిల్లనగ్రోవు లూదువారు
వెలగలు మారేడు ఫలములు గుఱిఁజేసి
బంతులాటల వింతఁ బరఁగువారు
మొలగజ్జె లందెలు ఘలుఘల్లు మని మ్రోయ
గుప్పిగంతుల ముద్దుగొలుపువార
లుద్దీలుగాఁ జేరి యొండొరు నెదిరించి
యలరి త్రొక్కుడుబిళ్ళ లాడువా

తే. లిసుక తిన్నెలపై నెక్కి యింపుగదుర
నాడువారు సుస్థాయిగాఁ బాడువారు
నగుచు గోపార్భకులు శైశవానుగతుల
మలసి క్రీడింత్రు రామ కృష్ణులను గూడి.

క. బలరామ కృష్ణులిరువురు
పలువిధముల గొల్లపిల్లవారల తోడన్
జెలగుచు ముద్దులుగులుకుచు
సలలితముగ నాడుచుండు సమయమునందున్.

—* వత్సాసుర వధ *—

మ. హరినిం జంపఁగఁ బూని పోయిన సుపర్వారుల్ క్రమం బొప్పఁగూ
లి రటంచున్ విని కంసుఁ డెంతయును సంక్లేశంబుఁ జెందంగ దు

స్ఫుర గర్వాంధుఁ డౌ కానొకం డసుర భూభర్తన్ విలోకించి భూ
వర! నైరాశ్య మి దింత యేల ధృతిచేఁ బాలింపుమా కార్యముల్.

శా. నే నుండన్ వెలి వేల నీకు నధిపా నే నిప్పుడే పోయి నీ
మేనల్లుం డ్రను జంపివత్తుఁ జుమి భూమి న్నీ వికన్ శాశ్వతుం
డై నెక్కొందు వటంచుఁ జెప్పి ముదితుం డై యన్న నాతండు తో
డ్తోనన్ మందకు వచ్చి గోగణమునందున్ వత్సము ట్లుండఁగన్.

తే. చంద్రికాధవళంబు మాంసలసమున్న
తాంగకము భాంకృతి దళితాశాష్టకంబు
వత్స మది క్రొత్తగాఁ గనంబడుట నెంచి
హరి యిటుల్ వల్కె బలరాము నరసి నగుచు.

శా. అన్నా! చూచితె! వత్స మిద్ది తగు నేత్రానందకందంబుగా
నెన్నండుం గన మిందు మంద కిది తా నెందుండి యేతెంచెనో
కన్నుల్ నిప్పులు గ్రక్కుచున్నయవి కిన్కం దాల్పఁగాఁ బోలు నే
నన్నన్ వైర మి దెట్లు లేర్పడియెనో ప్రారబ్ధ సంబద్ధ మై.

చ. అని చిఱునవ్వుతోఁ గదిసి యా సురవైరిని డాసినంత హు
మ్మని దుమికెన్ ముకుందుపయి నా దనుజుం డదిగాంచి వెన్నుఁడున్
గినిసి కరంబు నెత్తి యలిగింతువె నీ పసువా! యటంచు మో
మునఁ జెడ మోదె రక్త మది బోరనఁ గ్రక్కుచు వాఁడు కూలఁగన్.

శా. నేలం గూలినదూడ యప్పుడ కడున్ జిత్రంబుగా రాక్షసుం
డై లోలాక్షుల బాష్పముల్ దొరలు హాహారావ మేపార నా
భీలుండై మడియంగఁ జూచి వెలి యుద్వేలంబుగా గోపకుల్
శ్రీలోలున్ హరిఁ జేరి నిల్చిరి ధృతిం జేపట్టుచున్ నెమ్మదిన్.

తే. పాపి వత్సాసురుం డట్లు భంగపడుట
బాలగోపాలుఁ డయి జయశీలుఁ డగుట
యరసి వేల్పురు జయ జయ హరి యటంచు
బుష్పవృష్టిని గురిసి రామోద మొప్ప.

—* బకాసురవధ *—

క. పూతనసోదరుఁడు సురా
రాతి యొకం డంత వత్సరాకృసుపాటున్
జేతోవ్యథగాఁ దెలిసి వి
భీతుం డగుకంసుఁ గాంచి పలుచనఁ బలికెన్.

క. విను ధారుణీశ నీ నె
మ్మనమునఁ గలభీతి నేను మాన్పెద నా బా
లుని నిడ్డ యేగి సమయిం
తును జూడు మటంచు రోషితుం డయి యంతన్.

మ. బకరూపంబు ధరించి గోగణము మేఁపన్ వచ్చు నానంద గో
పకబాలుం గని యన్యచింతనముల న్వర్జించి కాష్ఠాకృతిన్
బ్రకటైకాగ్రతఁ బూని డాయనగు శ్రీభర్తన్ వడిన్ మ్రింగె భీ
తకుమారవ్రజ మెల్ల నొక్కుమొగి నార్తధ్వానముల్ సేయఁగన్.

ఆ.వె. అకట యేమి చెప్పనగు దైత్యుని యవస్థ
కంససేమ నున్న కమలనేత్రుఁ
డగ్నివోలెఁ దాప మది యగ్గలంబు సే
యంగఁ గ్రక్కలేఁడు మ్రింగలేఁడు.

చ. విలవిలఁ దన్నుకొంచుఁ బృథివిం బడి యంత బకాసురుండు వి
హ్వలుఁ డగుచున్ బ్రయత్నమునఁ బట్టి హరిన్ వెడలంగఁ గ్రక్కినఁ
జలమునఁ గృష్ణుఁ డయ్యసురఁ జయ్యనఁ బట్టి వధించె మేలు మేల్
బళి! బళి! యంచుఁ దన్ను వ్రజబాలురు మిక్కిలి సన్నుతింపగన్.

పం. హారాత్త్రవృద్ధ ముగ్రఘూర్ణ మాయతాంగ శాఖ
శతాహతిప్రభగ్న నృత్తసంచయ మ్ముదీర్ణ కా
మకోపమమ్ము గా సురారి మాద్యదుగహస్తి రూ
పతీవి మేను వ్యాప్తమైనఁ బాఱఁజూచి బాలకుల్.

మ. తనువో యియ్యది మేరువో తెలియ దీ దైత్యుండు కుంచించె నీ
ఘనదేహం బెటు లింతవాఁ డెటుల భంగం బందెనో చిన్నికృ

ష్ణునిచే సద్దిర ధాత్రి నెందుఁ గలవే చోద్యంబు లిప్పాటి వీ
మన నందార్భకు లీల లే మన నసున్ మాయామయుం డీతఁడో.

తే. అని చెలంగుచు నందబాలుని మొగమ్ము
నట్టె కాంచుచు మఱచి యన్యంబు బాహ్య
లోకవిషయ విస్మరితాలోక యోగి
లోకమటు కొంతతడవు జోత్స్నకు లగుచు.

—✶ గోపాలకులతోఁ గృష్ణుని క్రీడలు ✶—

సీ. శ్రీకృష్ణుఁ డొకనాఁడు చెలఁగి వత్సపులతో
వనభోజనక్రీడ లొనరఁజేయఁ
బ్రత్యూషమున లేచి బాలుర మేల్కొల్పి
కాలకృత్యంబులఁ గడపినంత
నన్నపుఁగావిళ్లు సర్వసామగ్రులు
వేణువులును వక్రవేత్రములును
గొని లేగలను దోలుకొనుచు విక్రీడల
నాడుకొనుచు మాట లాడుకొనుచుఁ

తే. జల్లఁగా యమునాతటిస్థలముఁ జేరి
యుచితపులినస్థలంబును యోగ్యపరచి
యందుఁ గావిళ్లు దించి యానందగతుల
నిందు నందును విహరింతు రింపు గదుర.

సీ. ఇసుకతిన్నెలపైకి నెక్కి కాళ్లను ముంచి
కడఁగి పిచ్చుకగూళ్లు గట్టుచుండ్రు
చిఱుకాళ్లు దుంపలుఁ జేర్చి కాలువలకు
సేతువులం గట్టి చెలఁగుచుండ్రు
చిన్నచె ట్లిగఁబ్రాకి చిత్రముగాఁ గోఁతి
కొమ్మంచు నాటలఁ గులుకుచుండ్రు
సొంపునిండెడు సమశ్రుతులతో మృగపక్షి
శబ్దము లొనరించి సంతసింతు

తే. రిట్టి కౌమారలీలల నింపు లూర
సలుపుచును రామకృష్ణులు శైశవంబు
దీసుచుండిరి గోపాలవార మెల్ల
నేత్రపర్వముగా గమనించుచుండ

గీ. ఒకని చద్ది నింకొకఁడు ప్రక్కకు గదించి
వెదకుకొనుచుండ నవ్వుచు వెక్కిరించు
తనది దాఁచియు వేఱు చద్దినిగుజించి
వాదులాడును దన దని పంతమూని.

క. కొందఱు వేణువు లూదుచుఁ
గొందఱు శృంగములు వట్టి కొందఱు శ్రుతిలిం
పొందెడు గానముఁ బాడి ప
సందుగ నాడెదరు మిగుల సంభ్రమ మొనరన్.

ఉ. ఆడుచుఁ బోయి ముందు నడయాడెడుకృష్ణకుమారుఁ గాంచి యొ
వ్వాఁడు బిరానఁ బోఁ జని వానిని దాకునొ వాఁడె శ్రేష్ఠుఁడం
చాడుచుఁ బందెము ల్వాలికి యందఱు బేరెము దీసి వింతగాఁ
గూడి గదింత్రు బాలకుని గోపకుమారకు లుబ్బిపోవుచున్.

సీ. కోయిల మాకన్న హాయిగాఁ గూయునా
యని కుహూనినదము ల్వినుచువారు
మానసౌకసములు మాకన్న హాయిగా
నడయాడునా? యని నడచువారు
ఘనమయూరము లేమి భరతనాట్యము లేమి
యాడలేనూ యాని యాడువారు
పులుఁగులు మాకన్న ముందుఁ బాఱునె చూత
మని వానిచాయలఁ జనెడువారు

తే కొంగలం జూచి యట్టులే కూరుచుండు
వారు కోతుల తోఁకలఁ బట్టి చెట్టు
లెక్కువారు వివిధపక్షిమృగములధ్వను
లనుకరించెడువారు నై రంద రచట.

ఉ. కొందఱు కప్పలట్లు జలకుండములం బడి యీఁతలాడుచుం
గొందఱు చెట్లపై కెగసి కోఁతులరీతిని దూఁకులాడుచుం
గొందఱు చేతులెత్తి చిఱుకొమ్మల నుయ్యెల లూగుచుండి యి
ట్లందఱు వన్నిరూపులుగ హాయిగ నాడుచు నుండి రయ్యెడన్.

సీ. అమనస్కులకు నఖండాద్వయ పరమాత్మ
భవ్యస్వరూపుఁ డై పరఁగువాఁడు
బ్రహ్మవేత్తల కెల్ల బ్రహ్మసాక్షాత్కార
దివ్యానుభూతి నందిచ్చువాఁడు
భక్త్యర్చనావిధు ల్పాటించువారికిఁ
బరదైవతముగఁ గన్పడెడువాఁడు
మాయావిమోహవిభ్రాంత మానసులకు
బాలుడుగాఁ గానఁబడెడువాఁడు

తే. నిర్గుణానందనిర్మల నియతభూతి
హృదయ మర్పించు సుకృతుల కిచ్చువాఁడు
విష్ణు వాభీరకులమున వెలసె నట్టి
లెట్టిపుణ్యులో గోపాలు రెల్లవిధుల.

గీ. ఏకృపావను పదధూళి సోకినంత
శిల మనుష్యాంగనాకృతిఁ జెందఁగలిగె
నట్టిమహనీయు సాహచర్యమున నలరు
ప్రాప్తి చేకురె బాలురభాగ్య మేమొ?

—* అఘాసురవధ *—

గీ. పూతనా బకాసురులకు ముద్దుతమ్ముఁ
డఘుఁ డనెడువాఁడు బృందావనాంతరమునఁ
జేరెఁ గంసుని పంపునఁ జిన్నికృష్ణు
నెడఁ బ్రతీకార మొనరింప నిచ్ఛ గలిగి.

ఉ. బాలకు లాడుచుండఁ గని పాపి యఘాసురుఁ డోర్వలేక గో
పాలకుమారులం దఱపి పడ్డల నావుల నొక్కమాఱుగాఁ

దాలువులందుఁ జేర్చి కరి తామరతూండ్లు గ్రసించు పోలికన్
లీలగ మ్రింగివేయుటలు లెస్స యటంచుఁ దలంచెఁ గ్రూరుఁడై.

మ. ఒకకార్యంబున మూఁడుకార్యములు నాకుత్సాహముం గూర్చు మా
మకసోదర్యులఁ ద్రుంచినట్టియఘమున్ మట్టాడుటల్ కంస నా
యకునావేదన దీర్చుటల్ మఱియు నీ యాభీరవంశాంకుర
ప్రకరంబున్ విదళించుటల్ పొసఁగు నౌరా యంచు యోజించుచున్.

క. బాలురఁ గూల్చినచో గో
పాలురు భర మోర్వలేక పడి చత్తురు నా
భీలముగా నజగరమై
పోలఁగ వసియింతు బృందభూమి నటంచున్.

మ. విపులాభీలతరాస్యగహ్వరము పృథ్వీవ్యోమమార్గాంతరం
బుపసంధించెడురీతి విప్పుకొని దీర్ఘోచ్ఛ్వాసము ల్వీయుచున్
విపరీతంబుగ నాల్కఁ జాపి వడిగా విశ్రాంతరాళంబు మ్రిం
గు పటాటోపముతోడఁ బెంజిలువ యై క్రూరాసురుం డొప్పుచున్.

సీ. అధరోష్ఠపర్వత మవనీతలం బంట
వినువీధిఁ దాకు పైపెదవి దనర
గాఢాంధకారదుర్గమకంధరము వోలె
గంభీరవిపుల వక్త్రంబు దోఁప
గిరిశృంగములఁ బోలి యిఱుకెలంకుల నుండు
దీర్ఘదంష్ట్రలు భయోద్వేగ మొసఁగ
రాచమార్గమురీతిఁ దోఁచునాల్క విచిత్ర
వదనగహ్వరమునఁ బొదలుచుండ

తే. విలయవాతమురీతి నూర్పులు చెలంగ
దావశిఖలట్లు చూపులతాప మొసర
బాలురం బట్టి మ్రింగు తాత్పర్యమూని
యజగరం బయి పడియుండె నఘుఁడు పుడమి.

క. కదలఁడుఁ బొదలఁడు వింతగ
నోరిగిన దది మృగమొ యేమొ యున్నతనుధరా

స్ఫదమై తోఁచెడు నయ్యెడ
నది యేమో యనుచు భీతు లైరి కుమారుల్.

శా. ఏదైనన్ సరె కృష్ణుఁ డుండెనుగదా యీ మాయభూతంబు లె
న్నే దావాగ్నికి మ్రగ్గు జంతువులుగావే యింతమాత్రానకున్
వాదా లేల? బకాసుర స్థితిని విస్పష్టంబుగా జూచియున్
ఖేదం బొందుట దుర్బలత్వము మఱిం గ్లీబత్వమున్ దెల్పెడిన్.

క. అని యొండొరు లాలోచన
లొనరించుచుఁ గృష్ణుముఖము నొయ్యనఁ గని నాం
త్వనభావము లొప్పారఁగ
మన కేభయ మెుదవ దంచు మదిఁ దలఁచుటయున్.

శా. శ్రీకృష్ణుం డటు పాఱఁజూచి సురవైరిన్ జక్క గుర్తించి యో
త్సేకుండై పసుపాలు రందఱను రక్షింపం దలం పూని మి
థ్యాకారుం డతఁ డాసురాధముఁడు మీ రవ్వానికిం దాపుగాఁ
బోకుం డంచు వచించె బాలకులతో మున్ముందుగా నంతటన్.

సీ. సుడిగాలి యురవడిఁ బడి చెదఱుగఁ బాఱు
దూది పింజలవోలె దూడలెల్ల
సురియుగుండమునందు విఱియఁబాఱుచునున్న
యణుసహస్రములట్లు లక్షసులును
నఘదైత్యు నిశ్వసనానిల వేగమునందు
వఱలు రేణువులయి యరిగి యరిగి
వదనగుహాంతరవర్తను లై పోయి
కృష్ణురాకను నిరీక్షించి యుండి

తే. యాపదుద్ధారకా! కరుణాంతరంగ!
బాలగోపాలకృష్ణ! కృపాలవాల!
రావె! ప్రోవవే! యనుచు మొఱలిడుచుండి
రయ్యఘాసురవక్త్రమం దార్తిఁ బడుచు.

ఆ.వె. తనవిరోధి నందతనయుఁడు కృష్ణుండు
వత్సపులను గూడి వదనమందుఁ

జేరకునికిఁ జింతఁ జేసి నిశాటుఁడు
నమలఁడయ్యె వారి విమతుఁ డౌట.

మ. తనపై భారము మోపి రక్షణకళాదక్షుండుగా నెంచి కొ
ల్చినగోపాలకుమారు లయ్యసురకుక్షిం జేరి రక్షింపఁ జా
లినసాయంబు లభింపకున్కిఁ గష్టజాలిం బొంది దుఃఖించుచోఁ
గని కృష్ణుండు విలోలుఁడై విమతశిక్షాదక్షుఁడై గొబ్బునన్.

మ. సకలాత్ముండు దురాత్మాసురజగత్సంహారదక్షుండు దీ
నకృపాసాగరుఁ డాదిమూర్తి త్రిజగన్మాన్యుండు పుణ్యుండు గో
పకుమారావనదీక్షఁ గైకొని రిపుధ్వంసంబు గావింప ను
త్సుకుఁడై చొచ్చెనఘాసురాస్యమునయందుం దేవతల్ కుందఁగన్.

మ. అమరేంద్రుండును సర్వదేవతలు రుద్రాదిత్యులున్ బ్రహ్మయున్
గుములై యాకసమందు నిల్చి ఘనుఁ డీ గోపాలకృష్ణుండు దు
ర్గమ మా దైత్యునికుక్షిలోఁ బడె నహో! కానున్న దేమో యటం
చు మనోదార్ఢ్యము గోలుపోయి కను లశ్రుల్ గ్రమ్మఁగాఁ జూచు చోన్.

మ. ఘనుఁ డాకృష్ణకుమారుఁ డట్లజగరాకారంబులో నున్న దై
త్యుని కంఠంబునఁ జేరి దేహము మహోత్తుంగాద్రిరూపంబుగాఁ
బెనిచెన్ దానవుఁ డూర్పు నోక మహాభీష్మంబుగా రొజుచున్
దను పల్లాడఁగ లోచనద్వయము పాత్రప్రాయ మై వెల్వడన్.

ఉ. అంతకు నంతకుం దను వనంతముగాఁ గడ లంటఁ బెంచి శ్రీ
కాంతుఁ డఘాసురున్ వదనగహ్వర మొత్తుచుఁ జిత్తు సేయ దు
ర్దాంత తదీయ విస్తృతికిఁ దాళక ఘర్మనదీప్రవాహముల్
వింతపథాలఁ బట్టుకొని వే యమునానదిఁ జేరఁ బాఱఁగన్.

చ. ఇది కనుగట్టువిద్య యగునేమొ? గుహాముఖ మావగింజచేఁ
బదిలముగా బిగింపఁబడెఁ బంకజ మొండు విశాలవహా మహా
హ్రదమును గప్పివేయునది యయ్యెఁ గపిత్థఫలం బొకండు దు
ర్మదకరివక్త్రరంధ్రము సమాంతముగా బిగియించి వైచెడున్.

వ. అని దైత్యుండు చింతించిన

మ. ఒకపాదంబున భూమి నింకొకటిచే వ్యోమప్రదేశంబు నో
రిక దీరంగఁ దృతీయమందుఁ దను ప్రార్థింపంగ దైత్యేంద్రుమ
స్తకమం దుంచి యణంచినట్టిహరి విశ్వవ్యాపకుండై నరాం
తకుఁ డౌ నయ్యఘనామకాసురునివక్త్రద్వారమున్ మూయఁడే.

కం. పతితునికంఠబిలంబును
వితతముగాఁ గప్పె శౌరివిస్తృతతనుఁడై
యతఁడు భరింపక బాధల
క్షితిపైఁ బడి పొరలు చుండెఁ జింతావశుఁ డై.

గీ. కచ్చితమ్ముగ బిగిసినకంఠబిలము
నుండి వెలువడఁజాలక యుదరజనిత
దుష్టవాయువు కుంభించి తుదకు నెట్లొ
బ్రహ్మరంధ్రము విరియుచు బయలువెడలె

మ. అటు లారాక్షసుబ్రహ్మరంధ్రమును వ్రయ్య ల్సేసి దుర్వాయు వ
క్కటఁ దీవ్రంబుగఁ బృథ్విపై వెడలి వృక్షవ్రాతముం గూల్చె న
క్కుటిలుండుం గులిశాహతం బగుమహాగోత్రంబుచందాన భూ
తటి వ్రాలెన్ గతజీవుఁ డై యమరబృందం బద్భుతం బందఁగన్.

చ. అగసమరూపుఁ డై సమసినట్టి యఘాసురు నుండి నిరతం
బగు నొకదివ్యతేజము దిశాంతముల న్వెలిఁగించుజ్యోతి యై
నెగడి స్వయంప్రకాశకమనీయవిలాసవినోదవిగ్రహుం
డగు హరియందుఁ జిత్రముగ నైక్యము నందె సురాళి గాంచఁగన్

చ. ఎదనగుహాప్రదేశమున వల్లవపుత్రులు దుష్టవాయువుల్
పొదివి భరింపలేక మృతిఁబొందిరి రాక్షసుఁ డీల్గినంత శ్రీ
ప్రదుఁడగు శౌరి వత్సముల వత్సపులం బ్రదికించె నందఱున్
ముదమున వీడి వెల్వడిరి మ్రుక్కడిరక్కసువక్త్రదేశమున్.

చ. హరికరుణాసముద్రుఁడు ముఖాంతరమం దొకభక్ష్యమట్లు దాఁ
దిరుగుటచే నఘాసురునిదేహమునందు విశుద్ధసత్త్వవి
స్ఫురితముదివ్యతేజము సముద్భవ మయ్యె రమేశుఁ బొందె న
బ్బుర మొకొ స్పర్శవేధి యినుమును గనకంబును జేయఁజాలదొ?

మ. విమతధ్వంసముఁ గాంచి దివ్యులు మహావిష్ణున్ ద్రిలోకాధి నా
థుమహత్త్వంబును సన్నుతు ల్సలిపి సంతోషాంతరంగంబులో
సుమవర్షంబులుఁ బెల్లుగాఁ గుఱిసి యస్తోకంబుగాఁ దూర్యవా
ద్యముల మ్రోసిరి యప్సరోంగనలు నాట్యం బాడి రుప్పొంగుచున్.

—* కృష్ణుఁడు గోపాలురతోఁ జలుదు లారగించుట *—

క. గోవత్సములను బాలుర
నాకిధిగా బయటఁ జేర్చినంతటఁ గృష్ణుం
డావేదనఁ బడు వారల
తీవర మడఁగించి పలికెఁ దీయనినుడులన్.

మ. చెలులారా! పులినస్థలం బొకఁ డదే శ్రేష్ఠంబుగాఁ దోఁచు వీ
రలు నేనుం జని యాడుకొందమట నర్థం బౌనటుల్ భోజనా
దులు సేయంగ సమీపమందె పసులం ద్రోలంగ యోగ్యస్థలం
బులునుం గల్గెను రండు రం డనుచు సమ్మోదమ్ముగాఁ బిల్చుచున్.

ఉ. ఊరటఁ దెల్పి బాలకుల నొయ్యన వేదన మాన్పి వారితోఁ
జేరి సుఖంబుగాఁ బులినసీమకుఁ బోయి వినోదకేళికల్
దీరుచుఁ గొమ్ము లూదుచును దీయఁగ వేణువు నొత్తి కమ్మగాఁ
జారునినాదము న్వినుప సంతస మందిరి బాలురెల్లరున్.

సీ. కమలినీస్థానమ్ము గ్రమ్మి పుష్పించిన
సరసీరుహమ్ముల సురభిళమ్ము
కమ్మనిపూఁదేనెగమగమ ల్గుఱఁ జేసి
జుమ్ము జు మ్మనిపాడు తుమ్మెదలును
జలవిహంగమ్ములు చక్కఁగ నెలయింప
వెలయు ఋతముల వింత శ్రుతులు
నంటి యంటక వీచి హాయి! హా యనిపించు
కమ్మెతెమ్మెరల శృంగారకేళి

తే. చివురు జొంపములను విందుఁ జేయుచుండు
వివిధవృక్షవితానముల్ విరిసిపొరయు

పుష్పలతికలుఁ జెలువందఁ బులినతలము
లమరుచుండెడు యమునతీరమునయందు.

క. ఇచ్చట మన మందఱమును
ముచ్చటగా భోజనములు ముగియింత మదే
యచ్చట నీరముఁ ద్రావఁగఁ
బచ్చికలకుఁ దోలవలయుఁ బసువుల ననుచున్.

గీ. వత్సములు నీరములు ద్రావ వాని నచటి
పచ్చికబయళ్లలోఁ ద్రోలి వచ్చిముదము
గదురఁ గాల్సేతులను నటఁగడిగి బాలు
రంద ఱాసైకతస్థలి నొంది రంత.

చ. తొడరినపద్మకర్ణికకుఁ దోఁచుదళంబులఁ రీతి వింతగా
నడుమను బాలకృష్ణుఁడును నాలుగువైపుల మండలాకృతిన్
బడసి కుమారులందఱును బంక్తులు దీఱి వసించి చల్దులన్
గుడువఁ గడంగి రింపుఁ బలుకుల్ కులుకుల్ తళు కొత్త నర్మిలిన్.

సీ. హాయి! హాయి! మిఠాయికన్నఁ దీయనిపాయ
సమ్మని యూరింపసాఁగు నొకఁడు
నాభక్ష్యములకన్న నాణెమా? నీ వని
యెకసక్కెములను వర్ధించు నొకఁడు
కమ్మని యీయూరుగాయలరుచికన్న
మించు నే దని వచియించు నొకఁడు
షడ్రసాన్నంబులచవికన్నఁ బెరుగు బు
వ్వయె కమ్మనా ననిపలుకు నొకఁడు

తే. నన్ని విధములఁ జలిది మాయమ్మ కట్టె
నిదిగొ యని చూపి మిగుల వర్ణించు నొకఁడు
వివిధరీతుల బాలురు వెడఁగుమాట
లాడుకొనుచు భుజింత్రు దివ్యాన్నములను.

సీ. పెట్టెద నని చూపి పెట్టు మన్నంతనే
మ్రింగి నింగిని జూచు దొంగ యొకఁడు

తొడ గిల్లి ప్రక్కవాఁ డదరినఁ గని పట్టి
వాని గలిపి మెక్కువాఁ డొకండు
అటు చూడు మని గోప్య మాడి చూచెదునప్డు
చల్లఁగా భక్ష్యము ల్లార్చు నొకఁడు
ఒక పంక్తినుండి యింకొకపంక్తిఁ బడునటు
లన్నము విసరి వా దాడు నొకఁడు

తే. నిట్లు నానావిధంబుల నిచ్చకములు
మచ్చికలు మచ్చుఁ బూఁతలు దచ్చనములు
జలిపి యాభీరబాలురు చలుఁదు లాగ
గించుచుండిరి కృష్ణుతో నింపు గదుర.

మ. హవిరన్నంబులఁ దృప్తిఁ జెందని ప్రభుం డానాఁడు గోపాలబా
లవినోదమ్ములఁ జొక్కి చల్దులను నాహ్లాదంబుగా మ్రింగఁజొ
చ్చె విలాసంబుగ గోపబాలకుల యుచ్ఛిష్టాన్నము ల్సైతమున్
జవిఁజూడన్ దలపెట్టెఁ దృప్తిఁ గనె నిష్టాగోష్ఠిగా నాఁకుచున్.

తే. దాశరథి యైనదివ్యావతారమందు
శబరి యెంగిలి ఫలములఁ జవి గనియెను
యాదవాన్వయకృష్ణుఁడై యదుకుమార
వరుల యుచ్ఛిష్టముం దినమఱిఁగినాఁడు.

సీ. మొల గట్టువలువలోపలఁ బదిలమ్ముగాఁ
బిల్లనగ్రోవిని బెట్టియుంచి
కొమ్మును వక్రవేత్రమ్మును జతఁ జేసి
యెడమకక్షను నమరించి యుంచి
కుడిచేతఁ బెరుగుమీఁగడలు గల్పినయన్న
కబళము గొని యూరుగాయలమర
వ్రేళ్ళసందున నుంచి వింతగా నన్నము
గినుచుఁ బచ్చడి నంజుకొనుచు నుండి

తే. పంక్తినడుమను గూర్చుండి బాలకులను
నర్మములు పల్కి నవ్వించి నవ్వుకొనుచు

బాలకేళీవిలోలుఁడై బాలకృష్ణుఁ
డారగించెను జల్దులు కోరికోరి.

క. యజ్ఞపతి యజ్ఞవాహుఁడు
యజ్ఞేశుఁడు యజ్ఞభోక్త యజ్వయుఁ దానై
విజ్ఞులఁ దనియించెడు హరి
యజ్ఞానులఁ గూడి భోజనాదులు సేయున్.

—* బ్రహ్మ గోగోపకులను దాచుట *—

గీ. ఇట్లు గోపకుమారులు కృష్ణబాలు
తోడఁ గూడి యిష్టాగోష్ఠి యాడుచుండ
పచ్చికసవులు మేయఁగాఁ బసు లడవిని
బట్టిపోవగఁ గనరాక బాలు రపుడు

చ. పసువులజాడ కన్పడదు పచ్చికబీళ్లను గానరావ వే
దిశలను బట్టిపోయినవో! తెంపరు లెవ్వరు పట్టినారొ క
ర్కశు లగురాతుసాధముల కార్యమొ! దుష్టమృగాల నోళ్లలో
నశనము లైనవో యనుచు నాఱడి నొందిరి బాలురెల్లరున్.

ఉ. ఓ చెలులార! విభ్రమము నొందకుఁ డే నిపు డేగి లేగలన్
జూచి బిరాన వత్తు నిటఁ జొక్కముగా వసియింపుఁ డీరు సం
కోచము లే దటంచు హరి గోపకుమారుల నందు నిల్పి తా
లేచి మహాటవిం దిరిగె లేఁగలజాడ లెఱుంగఁ గోరియున్.

ఉ. శ్రీకరుఁ డయ్యఘాసురునిఁ జించినచందముఁ బిల్లవాండ్రతో
నాఁకొని చల్దులన్ మెసవునట్టివినోదము కేళిరీతు ల
య్యాకస మందు నుండి కను లారఁగఁ గాంచి విరించి ముగ్ధుఁ డై
ప్రాకటవైభవోన్నతు లపారమటంచును గర్వమగ్నుఁడై.

ఉ. క్రేపులు గోపు లోసరిలి కీడ్పడియుండెను గృష్ణబాలుఁడున్
దాపున లేఁడు వీరలను డాఁచి కలంచిన నేమి సేయునో
శ్రీపతి యంచు నెంచి సరసీరుహజన్ముఁడు వేఱు వేఱు గా
దాపరికంబుఁ జేసె హరితత్త్వమహత్త్వము నాకళింపకే.

చ. తరులతికానికుంజముల తావులు లోయలు కొండనెత్తముల్
గిరిగుహ లున్నతస్థలులు గ్రిందులు డొంకలు సందుగొందులున్
మఱుగులు దుర్గంబు లగుమార్గములున్ బరికించి యెందు నా
హరి వ్రజబాలురన్ బసులు నారయరా రని విస్మితిం గనెన్.

ఉ. ఇటఁ బులినస్థలంబుకడ నెవ్వరిఁ గానక బాలు రెల్ల నె
చ్చటఁ జనినారొ నా సలుపుజాలము నోర్వక పూడఁ బోయిరో
యటవిని లేఁగదూడల నటంచు నొకింత దలంచి కృష్ణుఁ డి
ట్టటు నడయాడి కారణము నంతయు యోజనఁ జేసి యంతటన్.

చ. ఇది మఱుమాయ గోవులెటు లేగినవో యని చూడఁబోవ నొ
ప్పిదముగ నిందు నాడుకొనుపిల్లలు కన్పడరైరి రాక్షసు
లుద్దిగొని యిట్టి కృత్యములకుం దల యొగ్గిరొ! యేమొ! యంచు నె
మ్మదిఁ గొని దివ్యదృష్టిఁ గనె మర్మవిధం బటుపై నతండనున్.

శా. నాతోఁ గేళి దలంచి యుత్సుకముచే నాళీకజన్ముండె యీ
చేత ల్సేసెను వత్సవత్సపుల డాఁచెన్ వానిఁ బుత్తెంచుచో
బ్రీతిం గొల్పడు నల్వ మానుకొనుచో బృందావనంబందుఁ జిం
తాతామిస్రము చిందులాడు నని కర్తవ్యంబు నూహించుచున్.

—* కృష్ణుఁడు బ్రహ్మకు గర్వభంగము సేయుట *—

సీ. భగవంతుఁ డగు కృష్ణభగవానుఁ డంతట
నుభయత్ర భోగ్యమై యొప్పునట్లు
దనవిశ్వమయమహత్త్వముఁ బ్రదర్శింపుచు
వత్సవత్సపులరూపములుఁ బొంది
యనురూపచేష్టావిహారవిలాసము
లన్నియథాతథమై రహింప
వేణుశృంగమ్ములు వేత్రము లుస్ఫురదలం
కారము లన్నపుఁగావిడులును
తే. దాల్చి స్వస్వరూపము లయి తనరుచున్న
వత్సముల వత్సప స్వరూపములతోడఁ

ద్రోలుకొని గ్రామసీమ సంతోష మొప్పఁ
జేరుకొనె ముద్దుకృష్ణుఁడై చిత్రగతుల.

శా. "సర్వం విష్ణుమయం జగ" త్తనెడు విజ్ఞానోక్తి సార్థంబుగా
నిర్వక్రప్రతిరూపధారి యయి తానే వారివా రిండ్లలో
వేర్వేరం జనఁద్రోలె గోవులను దా వెన్వెంట నుండెన్ యథా
పూర్వప్రాప్తము గాఁగ సర్వమును సంపూర్ణస్థితు ల్పొందఁగన్.

ఉ. అంతట బాలరూపధరుఁ డైనమురాంతకు మూర్తు లందఱున్
సంతస మొప్ప స్వీయులని భ్రాంతివహించి విచిత్రలీలగాఁ
జెంతకుఁ దీసి ప్రీతిమెయిఁ జెచ్చెర లాలనఁ జేసి నట్లు శ్రీ
కాంతుఁడు పల్లెలోఁ బ్రతినికాయమునన్ వసియించె బాలుఁడై

చ. పొదుగులు నిండి క్షీరములు పొర్లిన లేఁగలరాక గోరి స
సమ్మదమున జిందులాడు మొదవుల్ తమ మోరల నెత్తి యార్చుచో
వదలిరి లేగ దూడలను వత్సపు లంతట దూకులాడుచున్
బొదలుచుఁ గ్రుమ్మి క్రుమ్మిచిఱుపోతములానెఁబయస్సు లొప్పఁగన్.

సీ. ప్రతిగోవువత్సమై పాలనెల్లను దానె
గుటుకుగుటుకుమనఁ గ్రోలుచుండు
గోపాలరూపుఁడై గోపోతములకట్లు
విడిచి తల్లులఁ జేర నడపుచుండు
నాభీరకాంతల యల్లారుముద్దుల
తనయుఁ డై వారిలాలనము లందు
నింటింటఁ దానె యై యెల్లలాలనములఁ
దేలుచు నడయాడి పోలుచుండు

తే. ననుదినంబు గోవులం ద్రోలుకొని యరణ్య
భూములకుఁ బోయి మేపుచుఁ బొదలుచుండు
నెందు నందియ మెవరికి నెనఁగనట్లు
సర్వమయుఁడు శ్రీకృష్ణుఁడు సలుపసాఁగె.

గీ. వ్రేఁతలకు నావులకు నెల్లఁ బ్రీతి దినది
నాభివృద్ధి యై చెలఁగెడునట్లు శౌరి

వారి వారి సంతానమునలెనె యొప్పు
గుప్పుమెప్పుల నొందుచుఁ గొమరు మీఱె.

క. వ్రేతలు యశోదతనయుని
మాతృత్వము గోరి యుంట మన్నించియు నీ
రీతిఁ గుమారుం డగుచుం
బ్రీతిం దద్వాంఛఁ దీర్చె వెన్నుఁడు లీలన్.

సీ. బలరామునితోఁ గూడి బాలకృష్ణుఁడు లేగ
లను ద్రోలుకొని బృందవనమునందు
నుండఁగా గోవర్ధనోర్వీధరంబుపై
మేఁతలు మేయు గోమాత లెల్లఁ
దమవత్సములఁ గాంచి తమకంబు రెట్టింప
గోపాలురను లెక్క గొనక రేగి
నూపురమ్ములఁ దల లూపి కంఠము లెత్తి
తోఁకలు వినువీధి జోకఁ జాపి

తే. చెలగి యంభారవమ్ములుఁ జేసికొనుచు
బొదుగులను వీడి క్షీరము లొరలుచుండఁ
దాము పసువుల య్యు వాత్సల్య విధుల
మానవుల మించి పాఱెను మందఁ జేర.

మ. అది యేలొల్యమొ గాఢమౌ ప్రణయమో యారాటమో యేమొ య
క్కదుపు ల్తీవ్రముగా నదల్చినను శంఖారావము ల్సేసినన్
గుదియల్ చేకొని మోదుచున్న వినకే గోపాలురం జూడకే
ప్రిదులం బాఱి స్వవత్స సంతతులఁ జేరె న్మోద మేపారఁగన్.

ఉ. వచ్చిన తల్లులం గనిన వత్సము లింపు దలిర్పఁ జేరియున్
ముచ్చట దీర నట్టు నిటు ముద్దుగ గంతులు వేయుచుండగా
మచ్చికతోడ నాకుచును మక్కువ యెక్కువగాఁ జెలంగుచున్
హెచ్చుచు గోగణంబు గమనింప దలంపవు లేఁతదూడలన్.

క. గోపాలకు లెల్లరు దమ
క్రేపుల మరలింపలేక గ్రించుఁ దనమునన్

దాపునఁ బసులను మేపెడు
పాపలపై నలిగి వేగఁ బర్విడి రలుకున్.

ఉ. దాపుల నిల్పినందులకు దండనఁ జేయఁ దలంచు గోపకుల్
కోపము గీపము న్నడలి కోణములం దెటు దాఁగిపోయెనో?
పాపలఁ గాంచినంతటనె ప్రాణము లన్నియు లేచివచ్చి న
ట్లై పరమానురాగమున నచ్చట ముచ్చట దీరి రొప్పుగన్.

శా. ఈ వైచిత్రము లన్ని గాంచి బలుఁ డిం దేవో విశేషార్థముల్
రావు ల్గన్నవి లేనిచో దఱిపిదూడ ల్గాంచఁగా గోవు లెం
తో వాత్సల్యముఁ జూపనేమిటికి సద్యోజాతము లల్గఁగా
భావాలీఢసరాగు లైరి సుతులం బాలించి గోపాలురున్.

క. కౌఁగిళ్లం గదియించుచుఁ
దోఁగుచు మూర్ధములు ప్రేమతో మూర్కొనుచున్
రాగాలాపము లాడుచు
నాగోపాలకులు ముద్దులాడిరి సుతులన్.

గీ. అప్పు డీనిన దూడల కన్నఁ బ్రియము
లైనవా వీని కయ్యవి? కానినాఁడు
ప్రణయ మీరీతిగాఁ బొంగి పొఱలనేల
యనుచు నాలోచనాధీనుఁ డయ్యె నతఁడు.

గీ. దివ్యదృష్టిని గని కను ద్దెఱచి సర్వ
మీశ్వరమయంబుగాఁ జూచి కృష్ణునెడల
భక్తివిశ్వాసవినయము ల్ప బలమైనఁ
జేరి కీర్తించె బలరాముఁ డారమేశు.

మ. హరి కృష్ణా మహనీయమూర్తివి కదే! యానందకేళీవినో
దరసాస్వాదనఁ జేయుచుంటివి! మహత్త్వం బద్భుతం బయ్యె, నీ
వరరూపం బదె వత్స వత్సపలలో వర్తింపుఁగానే మహా
దరభావంబు పరిక్రమించినది యంతర్లీనమై వీరిలోన్.

గీ. కావుననె యిట్టిమమకార కారణంబు
దారసిలె; బుద్ధివిభ్రాంతి తలఁగిపోయె;

దమమునం గానరానిది ధవళ కాంతు
లంమఁ గాంచిరి గోపాలు రతిశయముగ.

క. గోవులు ఋష్యంశములన్,
దేవాంశములన్ బ్రజాళి తీరులు నిజమా
నీవే యందఱియందును
నీవిధిగాఁ గానుపింతు వేలనో కృష్ణా!

చ. అన విని మందహాసరుచిరాననుఁడై హరి, యగ్రజాను, గా
రణరహితంబుగా నెనసి రావు మహత్తరకార్యసంస్కృతుల్
పనిపడి యిట్టు లేనె బహుభంగుల వర్తిలు టయ్యె; సోదరా!
కనుఁగొన జాలె దీవు;ఘనకారణ మయ్యది ముందటంచునున్.

వ. అని హరి బలరాము నగ్గించెఁ బిమ్మట,

తే. దేవతాభావ మది యహంభావ మొనరఁ
జేసి వత్సవత్సపులను జిత్రవిధుల
నణఁచి యుంచె మాయాతల్ప మందు బ్రహ్మ
హాయనం బయ్యె నది భువియందు నవల.

చ. ఎవరు సృజించినారొలోకొ యీరల స్రష్టను నేను కలఁగా
నవమతు లెవ్వ రీపనుల కధ్యవసాయము లేవఁదీసిరో!
వివరము లెవ్వి దోఁచ వని విహ్వలచిత్తముతోడ బ్రహ్మ శ్రీ
ధవు మహనీయకృత్యములతత్త్వముఁ దా మది నెంచఁ జేమియున్.

గీ. ఎవఁడు మాయకతీతుఁడై యొసఁగి లోక
జాలమును మోహితముఁ జేయఁజాలు వాఁడొ
యట్టివాని స్వమాయచే నావరింపఁ
దలఁచి యవ్వానిమాయలోఁ దగిలె నలువ.

సీ. దినమణిబహుళకాంతిప్రసారంబులో
ఖద్యోతములవెల్గు వేద్యమానె?
యమవసనిశిరాత్రియంధకారముముందు
నీహారతమసము నెగడఁగలదె?

భవ్యమణిప్రభాభాసురరోచులం
గాజురాలతళుకుల్ గాంచఁబడునె?
యమృతరసప్రవాహమునందు లీనమౌ
చిఱుకాల్వ గమనంబుఁ బొరయఁగలదె?
తే. యఖిలబ్రహ్మాండభాండము లావరించు
విష్ణుమాయాసమృద్ధిలో వెలయఁగలదె?
యల్పుఁడగు వేల్పు పెద్దమాయాప్రవృత్తి
లీనమై పోయె రూపమె కానఁబడక.

మ. హరిమాయాగతుఁడైన పద్మజుఁడు పర్యాలోచనల్సేయఁన
త్తఱిఁ బీతాంబరధారులున్ ఘనసముద్యచ్ఛ్యామలాకారులున్
స్ఫురదిందీవరచారులోచనులునై సొంపారు గోవత్సపుల్
మురళిన్ మ్రోయుచు శృంగవేత్రధరులై పొల్పొంది కన్పించినన్.

సీ. వరకిరీటోజ్జ్వల స్ఫురదుత్తమాంగముల్
ఘనకుండలాంచిత కర్ణములును
విమల మౌక్తిక హారకమనీయకంఠముల్
శ్రీవత్సరుచిరవక్షోవిభవము
శంఖచక్ర గదాబ్జ సహితచతుర్బాహు
వులు కంకణాదివిభూషణములుఁ
నీలజీమూత సన్నిభ శరీరమ్ములు
కేయూర కటకాంగుళీయకములు
తే. పీతకౌశేయవసనముల్ వెలయుచున్న
తులసివనమాలికలు కల్గి యలరుచుండి
యపరవిష్ణుస్వరూపులై యచటఁ దోఁచు
వత్సపులఁ గాంచె వనజసంభవుఁడు చెలఁగి.

సీ. సాత్త్వికగుణనిదర్శనముగా దరహాస
ధవళచంద్రిక లొప్పు దనరుచుండ
వరరజోగుణకాంతిసిరి యరుణాపాంగ
వీక్షణమ్ములఁ దోఁగి విందు సేయ

బ్రహ్మాది యణుపర్యంతము సచరాచ
ర ప్రపంచము లుదరములఁ దోఁప
నణిమాదిమహిమలు నఖిలశక్తులు మహా
తత్త్వము లొప్పరసి సాంత్వనముఁ జూప

తే. పాల, భావ, సంస్కారేష్ట, కర్మ గుణము
లెల్ల రూపించి తము నుపాసించి కొలువఁ
బరమకల్యాణమూర్తులై పరిఢవిల్లు
గోపగోపాల సంఘముం గనుంగొనియె నల్వ.

తే. జ్ఞాన విమలాపరిచ్ఛిన్న సత్యరూపు
లయ్యు జాతీయ భేదశూన్యమునఁజేసి
బ్రహ్మవేత్తలకైన నెవ్వారిపరాని
పరమవైభవులగుచు గోచరులు కాఁగ.

తే. ఎవని యస్య తేజము చేతనే జగములు
వెలుగుచున్నవో యట్టి శ్రీవిష్ణురూప
ధారులౌ గోపబాలురఁ దన్మయులుగఁ
గాంచె భవశూన్యుఁడైనయక్కమలభవుఁడు

క. చరితార్థుండయి పద్మసంభవుఁడు స్వచ్ఛందానుమోదక్రియా
పరుఁడై యొప్పుచు బాహ్యదృష్టిని మఱల్పన్ గాంచె సర్వేంద్రియ
స్థిరతత్త్వంబుఁ దదేకదృష్టి గొని లక్ష్మీజాని చిద్రూపముం
బరికించున్ దనలోన బొమ్మవలె విభ్రాంతాత్ముఁడై యుంటచేన్.

అగ్నిలో విస్ఫులింగము లవతరించి
భిన్నభిన్న ప్రదేశముల్ గన్నరీతి
హరిమహద్భూతమున నసంఖ్యాకములుగ
భూతములు పుట్టె ముల్లోకములను బొరయ.

శా. తేజోభూతము వహ్ని కాన యది దీప్తి న్మించు నెందెందు త
త్తేజస్స్ఫూర్తి స్వరూప భావగుణముల్ దీపింపఁగాఁజేసెడున్
భ్రాజిష్ణుండగు విష్ణుమూర్తి సకలవ్యాపారపారంగతుం
డై జీవాత్మలయందుఁ దత్తదుచితవ్యాపారముల్ సూపెడిన్.

గీ. జఠర పాషాణ దారు వృక్ష జలములను
లీనమై యగ్నిరూపము గానఁబడక
గ్రాలురీతి భౌతికశరీరములఁ నడఁగి
విష్ణుమూర్తి యాడించు నీ విశ్వమెల్ల.

సీ. ఇది యిట్టిదనుచు నూహింపరానిదియును
మహితసర్వోత్కృష్టమహిమ గలది
స్వప్రకాశానంతసత్యనిత్యానంద
పూర్ణవిశ్రాంతవిభూతి గలది
యాత్మేతరాశాశ్వతార్థము ల్నిరసించి
విమలోపనిషదర్థవిజ్ఞత గని
తెలియఁదగినది యా దివ్యస్వరూపము
గాంచి విభ్రాంతుఁడై కమలభవుఁడు

తే. బాహ్యదృష్టిని బరికింప భయము నంది
నిలిచి నివ్వెఱపడుచుండ నెనరుగాంచి
ప్రత్యగాత్మ శ్రీకృష్ణుఁడు పర్వియున్న
మాయతెర విప్పివేసి సమ్మతి దలిర్ప.

ఉ. అంతట గన్నులం దెఱచి యమ్మహితాత్ముఁడు బాహ్యదృష్టిచేఁ
బొంతల నున్న సర్వపరిపూర్ణుఁడు కృష్ణుఁడె పూర్వరీతిగాఁ
జెంత వసించు బాలకులఁ జేరియు నాడెడువానిఁ జూచి య
త్యంతముదమ్మునందనదు హంసతురంగము డిగ్గి వచ్చియున్

మ. శ్రితమందారుఁడు కృష్ణదేవుపదరాజీవద్వయం బంటఁగా
నతిలౌల్యంబున దండమట్లు పడి సాష్టాంగప్రణామంబులన్
నతులం బాడుచుఁ జేసి పాదముల నానందాశ్రుతోయంబుతోఁ
జతురాస్యుండు ప్రమోదితాత్ముఁ డయి ప్రక్షాళించె సద్దేవునిన్.

గీ. అట్లు శ్రీకృష్ణుదివ్యపాదాంబుజముల
నొఱగి నాళీకభవుఁడు దా నరసినట్టి
మహిమ నాకలించుచు మోదవిహితుఁ డగుచుఁ
జెలఁగఁ గాలము దెలియని స్మృతిని నిల్చి

శా. శ్రీకృష్ణా! యదుభూషణా! గుణనిధీ! శీతాంశుబింబాననా!
నీకల్యాణగుణప్రవృత్తులను వర్ణింపంగ నే నాదునా
లోకాతీతుఁడ వాదిమూర్తివి మహాలోకస్వరూపుండ వ
స్తోకప్రాభవదివ్యవైభవమహోద్యోగుండ వబ్జాననా!

సీ. తనువనంతాకాశమును బోలినీలాప
రిచ్ఛిన్నమై గోచరించుచుండఁ
జెలువారుపీతకౌశేయవస్త్రమ్ములు
ఘనతటిల్లతలట్లు గానుపింపఁ
గర్ణయుగ్మమునందు రమణీయరుచులతోఁ
గుంజావతంసము లొక్కమరుగొల్పఁ
జడముడియందు ముచ్చట దీర ముడిచిన
నెమలిపింఛము కొ్రొత్తసొటుదోప

తే. కబళ మొకచేత శృంగము కటితలమున
వేణువు ముఖానఁ జంకిలో వేత్రమమరఁ
గంఠమునఁ బుష్పహారము లొక్కంతు లీన
వఱలు నందకుమారకా! వందనంబు.

సీ. బృందావనానంద చందిరుఁ డై నంద
నందనుఁ డింపొంద నాట్యమాడు
సుందరతారకానందరేఖలఁ జిందు
లాడువత్సపబృంద మాడుచుండఁ
మందాకినీనదిచంద మై చెలువొంది
పొందుగాఁ గాళింది పొఱలిపాఱు
నభ్రసంకాశ మై యందంబు గోరాడు
మందేభయూధము విందు సేయు

తే. ఇంద్రధనువట్లు నీరంధ్ర సాంద్రపుష్ప
వంద్యమై వృక్షసంతతు ల్వారుస తీరు
బృందవని గగనేందిరచందమగుచు
నందచందాల కిక్కయై విందు సేయు.

సీ. ఏమనోమోహనుఁ గాంచి వనలక్ష్మి
ఫలవృతభరిత మై నలపుఁ జిలుకు
నేనటరాజు మెప్పింప మయూరము
హాయిలు గులుకుచు నృత్య మొలయఁజేయు
నేగానలోలుని స్వాగతమిడుటకై
కోయిల హాయిగాఁ గులికి పాడు
నేసమవర్తి వర్తించిన మృగజాతి
సహజవిరోధము ల్పమసిపోవు

తే. నేజగన్నాథుఁడు విరించి యీశ్వరుండు
హరియుఁ దా నయి నడపు లోకాళి నెల్ల
నట్టివిశ్వమయుని నిన్ను నరసి సన్ను
తింప నేనెంతవాఁడను దేవదేవ!

వ. ఇట్లు లోకస్రష్టికర్త శ్రీకృష్ణుఁ బొగడి
క్రమత ముమ్మాఱును బ్రదక్షిణము లొనర్చి
పాదములనంటి యానతిం బడసి నిజని
వాసమున కేగె నానందపరవశుడయి.

ఉ. అంత దయాంతరంగుఁడగు హరి బాలుఁడు కృష్ణమూర్తి ని
శ్చింతగ వత్సవత్సపులఁ జేరి సుషుప్తినిఁ దీర్చి వారితో
మంతనము ల్ప్రసక్తులును మాటికి మాటికి ముచ్చటింపఁగా
సంతసమారఁ బూర్వవిధి సల్పిరి యాటలు పాట లొప్పుగన్.

ఆ: వె. తమ్ముఁ దమ్మిచూలి తస్కరించుటయును
హాయనంబు వ్యర్థ మాట లాది
యెఱుఁగనే యెఱుఁగక యీ మహాకాలము
నొక్కతృటిగ నెంచి యుండి రెల్ల.

గీ. తలపిదూడలజాడల నెఱుఁగఁగోరి
చనినకృష్ణుఁడు తిరుగవచ్చినవిధంబుఁ
దలఁచి బాలురు పూర్వవిధానమునసె
చలిది కుడువంగ రమ్మని పిలిచి రపుడు.

ఉ. నందకుమార! యొక్కఁడవు నట్టడవిం బడి పోవ నేల? మే
మిందఱ మింక నుండ లవ మేఁయియు సాయము గాక పోదుమా?
యందఱ మిట్లు వేచుకొని యాఁకొని నీకొఱకై వసింతు; మీ
చందము మాని రమ్ము మనచల్దులు తింద మటంచుఁ బిల్చుచున్.

గీ. ఎంతకున్ నీవు రామి మేమిందఱమును
నిమురఁ జెందితి మొక్కింత నీవు లేని
భోజనము రుచించునె మాకుఁ బ్రొద్దుపోయె
రమ్ము భుజియింత మింక నోగిరమ్ము లనుచు.

చ. పలికెడుగోపబాలకులభావము లాత్మఁదలంచి కృష్ణుఁడుం
దలఁకొని చల్దులం గుడిచి తద్దయు వేడుక క్రీడ లొప్పఁగా
వెలయఁగఁ బ్రొద్దు గ్రుంకుటలు వేఁ గని లేఁగలతోడ వారలు
న్వాల నిజగేహసీమలకు వచ్చిరి హెచ్చుముదంబు మీఱఁగన్.

చ. ఎదురుగ నేగి గోపసతు లెవ్వరిసూనుని వారుకౌఁగిటన్
గదిసి శిరంబు మూర్కొనుచుఁ గన్నుమిముద్దులు పెట్టి ముచ్చటల్
చదువుచుఁ బల్కరించుచును సంబర మందుచు లేఁగదూడలన్
గదుముచుఁ దాము బాలురును గ్రామముఁ జేరిరి మెల్లమెల్లఁగన్.

గీ. ఎవ్వరిగృహంబులకు వార లేగి పసులఁ
గట్టి స్నానాదికమ్ములు గాఁగ వేగఁ
జలువవలువలు గట్టి భోజనము లొనరఁ
జేసి మురిపెంపుముచ్చట ల్చెప్పుకొనుచు.

గీ. ఒక్కసంవత్సరముగోతె నొనరుచున్న
మానసానందమానాఁడు న్యూన మాయె
నెందుకో? కారణము గమనింపలేక
వారు తబ్బిబ్బు నడిరి విభ్రాంతి యెసఁగ.

ఉ. నేఁ డొకగొప్పవింత గమనింతుము క్రూరభుజంగరూపుఁ డా
వ్వాఁడొ యఘాసురుండఁట గిరంబున కంటిన నోరు విప్పి మా
దూడల నమ్ము నొక్కపరిఁ దోరముగా దిగమ్రింగెఁ గృష్ణుఁడా
పాడుకిరాతకుం దునిమి పాలనఁ జేసెను మమ్ము నెల్లెసన్.

చ. అన విని గోపగోపికలు నచ్చెరువందుచుఁ గృష్ణబాలుఁడే
మనసులభూషణుం డతులమానికమై తనరారువాఁడు నా
ఘనకరుణావిశేషమునఁ గాక భుజంగకరాళవక్త్రమం
దణఁగి సజీవులైనకథ యద్భుత మశ్రుతపూర్వ మంచునున్.

ఆ. ఐదుసంవత్సరములవయస్సునఁ దాఁకుఁ
దనరుఁ గౌమారదశ యన దానిపైన
నైదువర్షము ల్పౌగండ మనుచుఁ బెద్ద
లంద్రు పౌగండమునఁ గృష్ణుఁ డఘు వధించె.

క. బలరామకృష్ణు లిరువురు
సలలితముగ నిండ్లఁ జేరఁ జనిరి యశోదా
లలితాంగియు నందుఁడు దమ
కులదీపకు లైన ముద్దుకొడుకులఁ బ్రేమన్.

మ. కని లాలించిరి రోహిణీరమణి యకందర్పసంకాశులౌ
తనయద్వంద్వము నెత్తి ముద్దుగొని శ్రద్ధాభక్తు లొప్పార మ
జ్జన మాడించి, సువస్త్ర భూషణము లోజం దీర్చి, దివ్యాన్నముల్
దినిపించెం జవులూరుముచ్చటల నెంతేఁ జెప్పి యొప్పించుచున్.

శా. బలభద్రుండు కుమారకృష్ణుని బలప్రావీణ్యసౌజన్యముం
బలికెన్ "నేఁ డొకదుష్టదానవుఁడు సర్పంబౌచు దా భూనభః
స్థలము ల్గప్పి సువక్త్రముం దెఱచి విస్పష్టంబుగా, మమ్ములేఁ
గల నెల్ల దిగ్రమింగె నితఁ డెసుమీ! కాపాడె మమ్మెల్లరన్.

చ. అని వివరంబులం దెలిపినంత యశోదయు నందుఁ డన్యులున్
మనములు గ్రుంగి కృష్ణుని యమానుషచర్యలు దా మెఱుంగియు
న్నను సరిక్రొత్త యద్భుతఘనాప్రతిమానవిశేష మాటచేఁ
దనయులు చచ్చి పుట్టినవిధానము నెంచి కలంగి రెంతయున్.

క. ఊరటఁ గని దృష్ట్యాదులు
దీరిచి దుస్సాహసములఁ దొడరకుమన్నా!
నేరవు పసిపాపడవు కు
మారా! విను మం చని హితంబు మఱివినుచుచున్.

పచ్చికబీళ్లలో వత్సములఁ ద్రోలి
పులినస్థలంబులఁ బొంది తారు
బాలకేళీరసబంధురులై యాడి
యందందు విహరించి హాయి గదురఁ

తే. గాలమెుంబుచ్చి ప్రొద్దు గ్రుంకఁగనె చూచి
వత్సముల ద్రోలుకొని వచ్చి వారి వారి
యిండ్లకుం జేరి తృప్తి వహించుచుందు
రవియెుదైనందినకృతంబులై తనర్చ

ఉ. పాలనలాలసుండు సుగుపాలుఁడు సద్గుణమూర్తి శ్రీరమా
లాలితపాదపల్లవుఁడు లాస్యవిలాసవినోదశీలి గో
పాలకిశోరమై ధరణి భారము దీర్ప జనించి సర్వగో
పాలకుమారులం గలిసి ప్రాకృతునట్లు నటించు బాలుఁడై

—* ధేనుకాసుర వధా ఘట్టము *—

క. కతిపయదివసము లావలఁ
గుతుకముతో నాడుకొనుచు గోపకుమారుల్
గొనకొని హరితోఁ జెప్పిరి
వితతంబుగఁ దాళగహనవృత్తాంతంబున్.

క. శ్రీరాముఁడు సుబలుండును
గాదిలి నెచ్చెలులు కృష్ణుఁ గాంచి వయస్యా!
పోదము తాళవనంబున
క్రీడాపుల నున్న దనుచు నెఱిఁగించుటయున్.

చ. అది యెుక రమ్య మౌగహన మందు ననేకఫలద్రుమంబులుం
హృదయవికాసముం జలుపు నిం పగు కుంజలతావితానముల్
పొదలును దాళవృక్షములపుట్టుక యచ్చటనే యనం దగున్
గొదమ విహంగసంతతులు కోట్లుగ నున్నవి యందు మిత్రమా.

తే. ప్రకృతి మహాసియసౌందర్య భాగ్యలక్ష్మి
వైన నందనవన మన నౌను దానిఁ
గాని దుర్మార్గుఁ డైనట్టి ధేనుకాసు
రుం డనెడువాఁడు కాపురం బుండునందు.

ఉ. తాళఫలంబులన్ మెసవి దానవుఁ డవ్వనసీమ నొప్పుగాఁ
గాలముఁ బుచ్చుఁ బండ్లతమకంబున నెవ్వఁడునేని పోయినన్
గాల నదల్చి మట్టి లయకాలునివీఁటికిఁ బంపుచుండు జం
ఘాలుఁడు వాఁడు పెద్దసుడిగాలిని బోలెడు వేగముంచుచున్

ఉ. కమ్మనితాఁటిపండ్లు దినఁగా మన సయ్యెడు నెన్నొమార్లు వ్య
ర్థ మ్మయిపోయె మాయుబుసు తాళవనమ్మున కేఁగు టన్న మా
రెమ్మగృహమ్ముఁ జొచ్చు టని రిక్కలు గొట్టెద రెల్లవారు ద
ద్దమ్మలవోలె భీతులయి దాపుల కైనను బోరు మాధవా!

మ. ఇది మాపెద్దలు చెప్ప విన్నదె సుమీ! యే మెన్నఁ డాభూమిలో
బదము లొమ్మేపినపాపమే యెఱుఁగ మేప్రారబ్ధమో? నేడు స
మ్మద మయ్యెన్ వనికేఁగి కమ్మగ ఫలముల్ మెక్కఁగాఁ గోర్కెఁ దీ
వుదమా? యే మనెదోయి కృష్ణ యని గోపు ల్వాలకు నాలించియున్.

మ. దరహాసంబున నన్ను మోముఁ గని వాత్సల్యంబుఁ జెన్నార నిం
దఱివాంఛాపరిపూర్తిఁ జేయుటయె కర్తవ్యంబుగాఁ జెప్పి స
త్వరులై యన్నయుఁ దాను బాలకులతోఁ దాళాటవిం జొచ్చి ము
ప్పిరిమోదంబున గ్రింద రాలినఫలమ్ముల్ గాంచి లోలాత్ములై.

మ. బలభద్రుండు వినూత్నమత్తగజశుంభద్వీర్యుఁ డై లీలగా
ఫలతాలంబులఁ బట్టి యూపు నెడఁ గుప్పల్ తిప్ప లైపండుటా
కులలీలన్ ధరఁ దుల్లిపోయె ఫలముల్ గోవత్సపు ల్గాంచి గం
తులతోఁ జేరి ఫలంబు లేరుకొని రెంతో సంతసం బొప్పఁగన్.

చ. పటపట నేలపైఁ బడెడుపండ్లధ్వను ల్వినిపించి నంతనే
కుటిలుఁడు ధేనుకాసురుఁడు గొబ్బున నవ్వడి వచ్చుదిక్కుఁ బ్ర
స్ఫుటముగఁ జూచి క్రోధపరిపూర్ణ విలోలమనస్కుఁ డౌచు ది
క్తటులు ప్రతిధ్వను ల్సెలఁగఁగా వికృతంబుగ నోండ్ర వెట్టుచున్.

క. ఆగవేగముగాఁ బరువిడి
ఖరదనుజుఁడు కోపదృష్టిఁ గని బలరాముం
గుఱిఁ జేసి వెనుకపదముల
నురమునఁ దీండ్రించి తన్నె నుగ్రుం డగుచున్.

చ. అట్టులఁ దన్ని కృష్ణుఁడు ఖరాసురుఁ డున్మమున్నట్లు పాఱుచున్
బిట్టుగ నార్చుచున్ మసడ వెక్కను వచ్చె బిరానఁ బాదసం
ఘట్టనచేతఁ బృష్ఠతటి గట్టిగఁ దన్న బలుం డుదగ్రుఁ డై
నెట్టన పట్టి పాదముల నింగిదెసం నిగిడించి త్రిప్పుచున్.

గీ. ఉగ్రుఁడై వెన్కకాళ్లను నొడిసి పట్టి
దక్షిణకరంబుచే వియత్తలమువైపు
నెత్తి గిఱ్ఱునఁ ద్రిప్పుచు హీనదనుజు
విసరి వైచెను బలరాముఁ డసకమెసఁగ.

క. గిరికంధరుఁ డై యుంటచే
సురవైరిశిరంబు తగిలి సుడివడి ధరణిన్
విరిగిపడెఁ దాళతరువులు
రుచులు గ్రక్కుచును ఖరుఁడు నుఱుమై యొఱిగెన్.

గీ. దట్టముగఁ గూడియున్న యుత్తాలతాళ
సాలపంక్తి యొండొంటిని చదిమి చిదుము
కొనుచుఁ గుప్పతిప్పలునయి కూలిపోయె
నొకటిపై నొక్కటొఱఁగి బలోగ్రహతిని,

ఉ. తెల్లనియూసలున్ నలుపుఁదేఱుప్రకాండము లెఱ్ఱపండ్లునుం
బెల్లుగ నేలఁగూలి ఘనవిస్తృతనీలవిహాయసస్థలిన్
మొల్లముగా విలాసముల ముంచుక్రియం గనిపించె బృధ్వి యు
త్ఫుల్లమనోజ్ఞులై మిగులఁ బొంగుచు బాలకు లుల్లసిల్లఁగన్.

చం. ఖరదనుజుండు కూలిపడుకారణ మారసి వానిచుట్టముల్
ఖరముఖులైనవారు గిరికంధరు లొక్కట రామకృష్ణులన్
బొరసి యనేకభంగుల నపూర్వరణం బొనరించి రందఱన్
గురికొని త్రిప్పి త్రిప్పి ధరఁ గూల్చిరి కృష్ణుఁడు రాముఁ డొయ్యనన్.

ఉ. అంతము లేనివాఁడు జగదంతరము లన్నుపట్టివాఁడు వి
శ్రాంతయశోవిశాలుఁడు సత్యవిలాసుఁడు దుష్టదైత్యకా
లాంతకుఁ డైన చక్రి యథమాధముఁ డౌ ఖరదైత్యుఁ ద్రుంచుటల్
వింతగునా? గజేంద్రి మొక వెంపలిమొక్కవిధానఁ గాఁ గనున్.

తే. గీ. ఇంటిపేరు కస్తురివార లింటిలోన
గబ్బిలములవాసన యనుకరణిఁ దోఁప
బిరుదు మాత్రము ధేనుకాసురుఁడు కాని
గార్ధభుఁడు వాఁడు చేష్టితాకారములను.

శా. ఆరీతిం బలరామకృష్ణులు ననాయాసంబుగా గార్ధభా
కారుం ధేనుకనామరాక్షసునిఁ జక్కాడంగ బృందారకుల్
భేరీభాంకృతు లొప్పఁ జేసి వినతుల్ వేనోళ్ళ గావించి యొ
ప్పారఁగ బుష్పసువృష్టియుం గురిసి రయ్యాకాశమం దొప్పుచున్.

మ. ఒకఁడా రెండగునా యనేకములు గావో యిట్టి ఘట్టాలు బా
లకు లేకహస్త్రము భీతిఁ జెందక యపోల్లాసాత్ములై రామకృ
ష్ణకుమారుల్ ఖరదైత్యు ద్రుంచుటలు విస్పష్టంబుగా గాంచుచుం
డి కలుల్ గాక మహోత్సుకం బొనగ సంవేష్టించి రవ్వారినిన్.

తే. గీ. గర్ధభుఁడు మరణించి నిష్కంటకమగు
నవ్వనంబు సంచారార్హమై తనర్చె
సర్వమానవులకు మృగజాతికిని వి
హంగసంతతులకు నిర్భయంబు గాఁగ.

సీ. గోరజస్స్ఫురిత మౌ కుంతలమ్ముల లోన
నీటుగాఁ గన్పించు నెమలిపురియుఁ
గందొవవిందుగాఁ బొందింప వలగొని
తనరెడు వనపుష్పదామములును
గరుణాకటాక్షవీక్షణముల రమణను
సరిదిద్దు దరహాసచంద్రికలును
గమ్మని వేణునాదమ్ముతో లీనమై
కీర్తించు చెలికాండ్ర గేయములును

తే. వెలయ బలరామునిన్ వత్సపులను గూడి
కృష్ణుఁ డేతేఁగ గోపికాస్త్రీలు గుంపు
గూడి వారినెదుర్కొని గోష్ఠి తోడఁ
బల్లెకుం జేరి రెల్లరు నుల్లసిల్ల.

గీ. ఎవరియిండ్లకు వా రేగి యెల్లవిధుల
సాదరత లొప్పఁగా భోజనాదికములు
సలిపి శ్రీకృష్ణువర్యులు దలఁచుకొనుచు
హాయిగాఁ గాలముఁ బుచ్చి రందు నంత.

* కాళీయమర్దనము *

సీ. శ్రీకృష్ణుఁ డొకనాఁడు చేరి బాలకులతో
గోవత్సములఁ దోలుకొని యరణ్య
మున కేగి యందందుఁ జని యమున నాన
దీతీరమునకు నేతెంచి యచటి
పచ్చిక బీళ్లలో బసువులఁ దోలి తా
మనుదినక్రమమున నాటలాడు
కొనుచుండ శ్రీదాముఁ డనుకృష్ణుచెలికాఁడు
పలికె నొప్పుగ బాలకులను జూచి

తే. నేఁడు బలరాముఁ డింటనే నిలిచినాఁడు
వల దనెడువారు లేరు దవ్వులకు నేగి
వింత లేమైన నున్నచోఁ గాంత మనుచు
నందఱును సెబా సనిరి యానందమునను.

ఉ. "ఇందఱు గోపబాలకుల యీప్సిత మొక్క విధంబు గాఁగ నే
నెందుకుఁ గా దనన్వలయు తృప్తి ఘటించుట నా స్వధర్మమౌ
చంద" మటంచుఁ గృష్ణుఁడును సమ్మతిఁ జూపె గుమారు లందఱున్
మందలఁ దోలుచున్ వివిధమార్గములం బడి సంచరించుచున్.

చ. చని చని వృక్షశూన్య మయి శాద్వలహీనపరాగభూమినిన్
గని వడగాడ్పు సాంద్రముగఁ గాయను లాటఁగ ఘర్మవారి గ్రొ
బ్బున వెడలంగ దాహపరిభూతులు నై యమపుత్రులెల్ల వే
సని యమునానదిన్ డిగి భృశమ్ముగ నీరముఁ గ్రోలుచుండగా.

ఉ. దోసిళులందుఁ దోయములు దోసిళులందె సగంబు నిల్వ నే
మోసమొ యేమొ? సర్వులును మూర్ఛను లన్నియు వ్రాలిపోవ స
త్రాసముతోడ గింజుకొని తత్క్షణమే మరణించి రా నిప
ర్యాసవిధంబు గాంచి వ్యసనాతురుఁ డై హరి కృష్ణుఁ డెంచెను.

ఉ. ఇందఱు నేకకాలమున నిట్లయిపోవుట కేమి హేతువో?
చందురులోని మచ్చవలె స్వచ్ఛసుధారసపూర్ణమైనఁ గా
ళిందిజలంబులో విషము లీనము గా నగునే? నిగూఢ మీ
చందము దీనిఁ గన్గొనుట చాల నవశ్య మటంచు నెంచియున్.

క. ఏరీ మా బాలకు లని
నారీమణు లడుగ నే మనందగు నయ్యో
యీరీతి నయ్యె ననుచు వి
చారించెను బ్రాకృతుఁడుగఁ జక్రి మనమునన్.

ఉ. చల్లనిపిల్లవాయువులఁ జక్కిలిగింతలు పెట్టి గొప్పగా
నుల్లము పల్లవించునటు లుయ్యెల లూపి సుధారసంబులా
గొల్లగ ద్రావ నిచ్చుచును గోములు దీర్చు నదేమొ తల్లి నా
పిల్లలఁ బొట్టఁ బెట్టుకొను భీకరచారనమూర్తి యాయెనో

ఉ. ఆకసమందునం బులుంగు లాడవు వన్యమృగంబు లున్న య
ట్లే కనరావు వృక్ష మొకటేనియు లేదు నిదాఘమట్లు గాఁ
గాఁక లివేమి? దాహ మధికం బగు టేల? యటంచు భ్రాంతుఁ డై
ప్రాకృతునట్లు కొంతవడిఁ బాతలాడె యశోదబాలుఁడున్.

క. ఊరట గని లోదృష్టిన్
సారించి యథార్థ మెఱిఁగి సత్వరమే
యా భీరకుమారులఁ జేరి సు
ధారసమయదృష్టిఁ బఱపి తగ బ్రదికించెన్.

మ. హరిఁ జేరం గఁబుర్గ్లభం బఁట విమోహం బీఁగి దా పైనపై
హరికిం బ్రాణసమానులై యతనితో నానందకేళీవినో
దరసాస్వాదనఁ జేయుచున్ భవసముద్రంబున్ వెసం దాటు చుం
దురు వారిన్ బయి నెట్టియాపదలునుం దోరింపఁగా నేర్చునే.

ఉ. ఆదటఁ గాంచి నెచ్చెలుల నందఱఁ గౌఁగిట గ్రుచ్చి మిత్రులా
రా! దిగులొందఁబోకుఁడు నిజార్థము గోచరమయ్యె నిందు సో
న్నానుఁ డొకండు వర్తిలుట మానితశుద్ధజలంబు నింతగాఁ
జేవొనరించె దుర్విషముఁ జిందుచుఁ జెందుచు ఘోరరూపమున్.

శా. కాళీయుం డను ఘోరపన్నగుఁడు తాఁ గాంతాసుతోపేతుఁ డై
చాలంగాలము గోతె నిమడుఁగులో సంసారి యై యుంటచేఁ
గాళిందీజల మింతకుష్ట మయి దుర్గ్రాహ్యంబుగా నయ్యె నా
హాలాహాలవిషప్రభావమున నే యధ్వాన్న మిట్లయ్యెడున్.

సీ. అతనివిషవహ్ని తీవ్రదవానలాభ
మగుచుఁగను పూపుపర్యంతమందునఁ జ
రాచరమ్ములు లేకుండ నణఁచివైఁచె
గాననే సర్వశూన్యమై కానుపించు.

క. గరుఁడునిభయమున రమణక
వరణద్వీపంబు వీడి పఱుగిడివచ్చెన్
దురితాత్ముఁడు యమునానదిఁ
జొరఁ బడి కాపురముఁ బెట్టె సోత్సాహముతోన్.

క. హాలాహలముం బోలెం
గాళియు విషవహ్ని సెలఁగి కడుఁగ్రూరముగా
గాలిచె నయ్యుష్ణంతచే
గాలులు ప్రసరించుఁజుడి ప్రగాఢము లగుచున్.

వ. అని విని గోపపుత్రులు మహాద్భుత మం దుచుఁ గన్నులప్పగిం
చి నిలిచి నివ్వెరం బడుచుఁ జేష్టలు దక్కిరి కొంతదాఁక నె
ల్లనఁ దముఁ దామెఱింగికొని లాలనఁజేయుచుఁ జేతు లెత్తి యొ
య్యన హరిఁగృష్ణు నెత్తుకొని యాడుచుఁ బాడిరి ముచ్చటాడుచున్.

శా. శ్రీదాముం డను మిత్రుఁ డోసరిలి యో కృష్ణా! మహావృక్షమం
దేదో యొక్కటి కానుపించుఁ గత మేమి? శ్వేళదావాగ్నిచే
బూదిం బోక సమస్తముం జెడఁగ నేపుణ్యంబుచే నిల్చె? విం
తై దైవారెడు నన్న గృష్ణుఁ డనె స్మేరాంకూర రమ్యాస్యుఁడై.

గీ. పూర్వ మొకనాఁడు వేదరూపుఁ డగు గరుడుఁ
డమృతకలశము దెచ్చుచో నందు వ్రాలి
విశ్రమించెఁ దత్స్పర్శచే వృద్ధి నొంది
యున్నది కదంబతరు వని వెన్నుఁ డనుచు.

మ. ఇఁక సైరింపను దుష్టపన్నగుని నేఁడే దివ్యకాళిందినుం
డి కడం ద్రోయక యంచు లేచి కడునుడ్డీనంబుగా నార్చుచున్
సకలారాధ్యుఁడు చెట్టుపై కెగసి సోత్సాహంబుగా నిల్చి పా
ట్టకు దట్టీ బిగియించి దుష్టుఁ దునుమాడన్ సర్వసంసిద్ధుఁ డై.

చ. వల దని గోపబాలకులు వారణఁ జేయుచునున్న నెంచకే
ఖలకులనాశకుం డగుసుకర్ముఁడు కృష్ణుఁడు చండవేగసం
కలితవిషప్రవీర్యుఁ డగు కాళియునుక్కని దూష్యమైన యా
సలిలమునందు దూఁకెఁ దరుశాఖ వెస న్విడి వారిలోపలన్

ఉ. అమ్మహనీయమూర్తి జలమందు గుభిల్లున దూఁక నీరము
ల్సిమ్మె ధనుశ్శతావృతవిశేషతలమ్ముఁ గఠోరమైన శ
బ్దమ్ము దిశాంతము నిగిడెఁ బన్నగుఁ డాసడి నాలకించి రో
షమ్మున నీటిపై కెగసె సంభ్రముఁడై కనె బాలకృష్ణునిన్.

ఉ. హుమ్మని హూంకరించుచు మహోగ్రవికారకఠోర మహా శరీ
రమ్మున దుష్టదానవిరాముని నీలతమాల రమ్యకా
యమ్మును జుట్టి పట్టి వలయాకృతిగా బిగదీసి తీసి చూ
ర్ణమ్మొనరింపఁ బైకొనియె నాగకులాప్తుఁడు కాళియుం డొగిన్.

మ. ఖలవిధ్వంసముఁ జేయఁగా మనుజనాకారంబుతో లీలమై
నిల జన్మించిన శేషశాయి ఘనమత్తేభప్రతీకాశ దో
ర్బలవిఖ్యాతుఁ డనంతుఁ డాశ్రితజనారాధ్యుండు దుష్టాసురా
వళి శిక్షించిన మేటివీరుఁ డితనిం బా మేమి గావించెడిన్?

గీ. చుట్టి చుట్టి తోఁకను వీఁపు గొట్టి కొట్టి
కోటలను మర్మతలములు గొఱికి కొఱికి
గరళముల్ కుంభవృష్టిగాఁ గుఱిసి కుఱిసి
బాలు నలయించుచుండె నప్పన్నగుండు.

గీ. కోటలో నొంటరిగఁ జిక్కుకొనిన మేటి
వీరుని విధాన వెలుపలివారి కెవరి
కేని గనరాక తులకించు కృష్ణుజాడఁ
గనక గోపాలు రెల్లఱు వనట నొంది.

శా. ఏడీ మాజతగాడు కానఁబడఁడే? యెం దేగినాఁడో కదా?
రాఁడే! మా దెసఁ జూడఁడే! పలుకఁడే! రమ్మంచుఁ దాఁ బిల్వఁడే
కీ డేమైనను గాంచినాఁడొకొ? మాకృష్ణుండు మా కింకఁ జేఁ
దోడై రక్షణఁ జేయఁడా యనుచు నెంతో యార్తులై కుందుచున్

మ. రారా బాలకుమార వీర! సుకుమారా! మేరుగంభీర ధీ
రా! ఆఆవు లిఁకేలరా? విజితమారాకార! మామాటఁ జే
కోరా! యాటలనాడుకొందము ర నీకు న్మాకు మధ్యస్థమా
గారాబమ్ము దలంపరా! యనుచు దుఃఖవ్యగ్రులై యెల్లరున్.

ఉ. బాలురు చాపలంబు గని బావురుమంచు దిశాపరీతమై
గోల చెలంగుచందమున గొల్లున నేడ్చిరి: లేగ లెల్ల గో
పాలకిశోరముం గనక వావిరి కన్నుల నీరుగార్చుచున్
దూలుచు నింగిఁ జూచుచును దుఃఖముతో నిల వ్రాలిపోయెడున్.

కం. గోవృషభవత్ససంతతి
శ్రీవత్సలుపైని దృష్టిఁ జేరిచి దుఃఖ
ప్రావృతము లౌచు నశ్రులు
తీవరముగ గార్పఁ దొడఁగె ధృతి గోల్పడుచున్.

గీ. ధరణి కంపించె నుల్కలు దొఱలె గొల్ల
పల్లెలో నప్డు సర్వగోపాలురకును
నాంగిక స్పందనాదివ్యత్యయము లొదవె
నన్ని యాసన్నభయసంశయములు గాఁగ.

కం. నందాదిగోపబృందము
కుందుచు బలరాము వీడి కృష్ణుఁ డొకండే
యెందుకుఁ బోయెనో బాలుం
డిందం జే మయ్యె ననుచు సంశయపరులై.

గీ. బాలగోపాలకృష్ణుని ప్రబలశక్తి
గాంచియును వానిపైఁ బ్రేమకారణముగ
దుర్నిమిత్తములను గాంచి దోష మేదొ
యొదవె బాలున కని దుఃఖ మొంది రెల్ల.

చ. బలుఁడు హరిప్రభావవిభవంబు నెఱుంగుటచేత నేమియున్
బలుకక యూరకుండె నట బాలురు వృద్ధులు గోపగోపికల్
పలువురు మార్గగాము లయి పద్మయవాంకుశచక్రముఖ్యరే
ఖలు గల పాదచిహ్నములఁ గాంచుచుఁ బోయిరి కృష్ణుజాడలన్.

సీ. తడఁబడు పదములు వడఁకుశరీరము
లడియారు పెదవులు గదలుకొనఁగ
బద మేడ నుంతురో పథ మెట్లు నడతురో
యెటఁజేరవలయునో యెఱుకపడక
యడరుచు గుండెలు దడదడ లాడంగఁ
గన్నులు పచ్చనై కానఁబడక
గద్గదికంబులౌ కంఠంబు లెత్తి కృ
ష్ణా! యని పిల్వఁగా నాల్క రాక

తే. అన్ని విధముల లొజ్జయి యనిలహతము
లైన మవ్వపుఁ దీవియలట్లు బాల
వృద్ధగోపికాగోపకు ల్విచలితు లయి
నడువసాగిరి హరిపదన్యాసగతుల.

చ. చని యమునానదీతటముఁ జయ్యనఁ జేరి జలంబునందునన్
వినమితభోగిభోగపరివేష్టితగాత్రుని చేష్టితాదిల
క్షణ రహితాణుమాత్రు నవిచాలితనేత్రుని గన్నపుత్రునిన్
గని భరియింపఁజాలక నిశామము వాక్కు యశోద భీతయై.

చ. చెదరిన కేశపాశమును జీకటిగొన్న మనంబు గాలికిం
బ్రిదిలినకొంగు నేత్రములవెల్వడి పొంగెడునశ్రుభంగముల్
బొదలిన గుండె గ్రుద్దుకొని బోరన నేడ్చుచు లేచి పాఱుచున్
ముదిత యశోద తూలుగొని మూర్ఛను బొందుకొనంగఁ జూడఁగన్.

గోపికాసతు లెల్లరు గుములుకూడి
యయ్యశోదను పరికించి యామెతోడఁ
దారు స్త్రీసహజముగఁ గన్నీరు గారఁ
గృష్ణు వర్ణించి యెడి రిట్లెంతయేని

సీ. రార తండ్రీ యన్న బారకౌఁగిలిఁ జాపి
చిరుగంతులను నన్నుఁ జేరువాఁడు
ముద్దీయరాయన్న! ముసిముసినగవులఁ
దీయనియధరమందిచ్చువాఁడు
పలుకవేరా!యన్న జిలిబిలిపలుకుల
హృదయవిపంచి మ్రోయించువాఁడు
ఆడరా! యన్న సొంపార దూకుచు వచ్చి
హాయిహాయిగ నృత్యమాడువాఁడు

తే. నాయొడిని పవ్వళించి చిన్నారిచిలిపి
ముద్దుముచ్చటలను బ్రొద్దు పుచ్చువాఁడు
కనులలో నమృతముఁ జిల్కి మనసుదీర్చి
నన్ను మెప్పించువాఁడిఁక నాకు లేఁడు.

సీ. రమణీయనీలనీరదసుందరశ్యాముఁ
గనుఁగొనలేని యీ కన్ను లేల ?
చిన్నారి నా ముద్దులన్న కన్నయ్యను
గైసేయనోచని కరము లేల ?
రంజితశ్రీపదరాజగోపాలునిఁ
గౌఁగిట హత్తనికాయ మేల ?
శారద పూర్ణిమాచంద్రబింబాననును
గానమాలించని వీను లేల ?

తే. లలితలావణ్యరాశి నోములఫలంబు
యదుకులాభరణంబు వద్ధృదయదీప
మందచందాల కిక్క నంశాంకురంబు
బాలగోపాలుఁడే లేని బ్రదు కదేల ?

సీ. పూఁదేనెసోన లిం పొంద స్రవింపఁగా
అమ్మా ! యనుచు ముచ్చటాడు నెవఁడు
వెనుకతట్టున వచ్చి కనుమూసి కేరింత
గొట్టుచు నడయాడి కులుకు నెవఁడు
యొడిలోన వ్రాలియు వెడమాట లాడుచుఁ
జిఱునవ్వువెన్నెల లిందు నెవఁడు.
కందోవవిందుగాఁ గౌఁగిటిలో నక్క
ప్రేమామృతముఁ జిల్కు మోము నెవఁడు

తే. అట్టినానోముపంట భాగ్యాలదీవి
కనులలోపాప చిన్నారికన్నతండ్రి
ప్రాణమునకుఁ బ్రాణమ్ము వరాలమూట
కోలుపోయినజీవిత మేల నాకు ?

వ. అట్లు దుఃఖపరవశయైన యశోదం జూచి బలరాముఁ డిట్లనియె

ఉ. ఉత్తమమార్గము న్విడచి యూరక నేడ్తువు కాని సత్వసం
పత్తి గ్రహింపలే వకట బాలుఁడు మానవమాత్రుఁ డంచు నే
చిత్తమునం దలంపకుము; శ్రీపతి యాతఁడు వానివింతయౌ
వృత్తులు వానికే దెలియు వేద్యము లెట్లగు నెల్లవారికిన్.

ఉ. ఉత్తమమాత వౌచు మది నూరడిలందగుఁ గాని యింతగా
దత్తఱ మందరాదు; విను తల్లిమనోవ్యథ పిల్లవాండ్రకున్
మిత్తి యటండ్రు; బాలకుఁడు మృత్యుముఖంబున నుండ ధైర్యసం
పత్తిని గోలుపోవు టది భావ్యముకాదు; ధృతిన్ సహింపుమా !

వ. అని బలుఁ డిట్లు చెప్పినను నారట మోర్వక యంతకంతకుం
బెనుపగుచున్నదుఃఖమునఁ జిన్నలు పెద్దలు నేకరీతిగా

వంట ముసుంగిపోయి రిట వారిజనేత్ర యశోద రోహిణీ
తనయుసఁ గౌఁగిలించుకొని తాళకయేడ్చె విషాదతప్తయై.

శా. నామాతృత్వము నేటితో గడచె నన్నా! యున్నయొక్కండు సు
శ్యామాకారకుమారుఁ డిట్టులగు నాశాజ్యోతి చల్లారె; నీ
భూమిన్ నా కిఁక నేమి కల్గు;నదిగో పుత్రుండు రా రమ్మటం
చేమో పల్కఁడుఁ బోదు నే ననుచు నెంతే నార్తిపాలౌటయున్.

వ. బలరాముండు యశోద కిట్లనియె

సీ. అయ్యయో! యెంతభ్రాంతురా లైతివమ్మ!
కాయమర్మము లెఱుఁగనిమాత వీవు
తెలుపునలుపువిభేదము ద్దెలియుచున్నఁ
దెలియఁగా లేవు దుఃఖము తొలఁగ లేవు.

సీ. విషయవిహ్వాలులహృద్విషహాసుం డగువాని
విష మేమి చేయునే వెఱ్ఱితల్లి!
యింతవేయంతలు నంతులేనిబలాఢ్యు
లేమయిపోయిరో యెఱుఁగవమ్మ!
యానాఁడు కోట బ్రహ్మాండము ల్గంటివే
యదిమానుషకృతంబె యనా నటమ్మ?
నిన్నమొన్ననెకదా మిన్నంటుపెనుబాము
మశకసదృశముగా మంటఁ గలసె;

తే. గోటితో మోటినంత మున్నీటఁ బడెడు
వ్యాల మేమిచెయునర్చునే నీలవర్ణు
భయము లేదమ్మ యడరును బాయుమమ్మ!
తమ్ముఁ డెందున్న దక్షుఁడే తలఁపు మమ్మ.

సీ. అఖిలాండకోటిబ్రహ్మాండనాథుఁడు కాని;
కసిగందు మానిసి నిసువు కాదు;
దుష్టదానవపథోద్యోగధుర్యుఁడు కాని,
పరిభూతభీతికాతరుఁడు కాడు;

జగదేకవీర్యవిస్తారసత్త్వుఁడు కాని,
పరిమితమానవబలుఁడు కాదు;
లీలావతారగోపాలబాలుఁడు కాని,
చిన్నారి మనముద్దులన్న కాదు;

తే. వెఱ్ఱితల్లిరో యేల యీవిధమునీకు
మాయతెర విప్పి పరమాత్మచ్ఛాయ యైన
బుద్ధిఁ బ్రసరింపజేసిన బూర్ణసుఖము
గాంచెదమ్మ విభ్రాంతిని గాంచకమ్మ.

వ. అను బలరాముం గాంచి యశోద

శా. అన్నా చిన్నవు నేరపీవిషభుజంగాభీలకృత్యమ్ము నెం
దున్నాఁడో కనుఁగొంటివా భుజగదంష్ట్రాపాత్రుఁడై తమ్ముఁ డా
పన్నుండై కను మూసినాఁడు; మనలం బాలించఁగా రాఁడు, వాఁ
డెన్నండున్ననుఁ గూడి యాడుకొనఁ డింతే ప్రాప్తమా నాయనా!

చ. నను నెడబాసి లిప్తయును నాసుతుఁ డోర్వఁడు; పాముకాటు వె
సినయప్పు డెట్లు లేచ్చెనో? యిసీ యని యెంతగ డస్సిపోయెనో?
దనయునిఁ జేరఁబోదు, నికఁ డాశఁడు రాఁ డని లేచి చివ్వనన్
జని యమునానదిం దుముకఁ జాన యశోద గడంగినంతటన్.

చ. కనుఁగొని గోపభామినులు కన్నుల బాష్పము లొల్క పాఱి స
న్మునిమిషనేత్ర మాతృహృదయంబును, నివ్వెరపాటుఁజూపు, నె
క్కొనునవ్యవసాయసాహసము, గొందలపాటును నెంచి, వెంటనే
చని యమునానదిం దుముకుసాహసవిక్రియ మాన్పి రెల్లరున్.

ఉ. తీరముఁ జేర్చి యూరటలు దెల్పుచు, గృష్ణునమానుషక్రియల్
సారచరిత్రముల్ తలికె విస్మృతిఁ దీర్పఁ దలంచ్రు కాని,య
వ్వారిజపత్రనేత్ర రుజ వాయదు కన్గొని రోహిణీసుతుం
డారమణీలలామ నెుడియందునఁ జేరి వచించె నిట్టులన్.

సీ. ఈ చతుర్దశభువనాల నందు నేని
సన్నరాలో సినులమహాసింధువీర

మాత లేదు లేదన జగన్మాన్యఁగన్న
తల్లి నీవిల్లు నెమ్మదిఁ దల్లడిలిదె.

చ. అని వచియించి నీటిదెస వల్లనఁ జూడఁ గుమారకృష్ణుఁడా
య్యనఁ బెనుపాముతోఁ బెనఁగునట్టివిశేషము దోఁచి, "తల్లిరో!
కనుము త్వదీయనందనుసకర్జ మటంచు" బలుంగు బల్కఁగాఁ
గనులను విచ్చి యెల్లసను గాంచిరి కృష్ణుని బొమ్మలట్లుగన్.

ఉ. మానవనైజ మాట, క్షణమాత్రము విస్మృతుఁ డయ్యెఁ జేష్టలన్
మానిన కృష్ణబాలుఁ డమాంతముగా నిదళించి, దేహముం
బూనిచి, తన్నుఁ జుట్టుకొని పొంపిరి పోవు భుజంగవీరునిన్
గానుగరోటిపోత్రముల గ్రమ్ముచు గ్రుమ్ముచుఁ జిత్తు చేయుచున్.

ఉ. అంతకునంతకుం బెరుగునట్టి కుమారుశరీరపాటవం
బంతము గానుపింప, కుసియాడక బీటలు వాఱె, దేహ మా
ద్యంతముఁ జిట్లిపోవ సకఁ దాళక కాళియపన్నగుండు శ్రీ
కాంతునిఁ బట్టలేక వడిగా విడువం గమకించి యూర్చుచున్.

ఉ. కన్నుల నిప్పుక ల్రాలఁగా ఫణము ల్నిగిడించి యార్చుచున్
మిన్నుల దిక్కు దోఁకపయి నేకొని నిల్చి విషంబు ముక్కులం
గ్రన్ననఁ బాఱమంగలముకై నడిఁ గ్రాలెడుకన్ను లెత్తియున్
వెన్నునిఁ గాంచెఁ గాళియుఁడు విస్మయ సంభృతుండై తపించుచున్.

చ. సమయము వేచి బాలకుఁడు సర్పమునాల్కలు సాచి ముట్టెమొ
త్తము దిగనాకుమందు తఱి దక్షకుసం గసుడుందు వట్టి వ్రే
మమున గిరాటువెట్టెడుక్రమంబునఁ గాళియుఁ జిక్కఁ బట్టి వి
క్రమమున నాల్గుదిక్కులకు గ్రక్కున జూజమురీతిఁ ద్రిప్పుచున్.

సీ. విసరివైచిన దూరాన వెలకిలఁ బడి
లేచి రోజుచు నెదురుగా లేలిహాన
మరుగుదేరఁగఁ గృష్ణుండు చిఱునగవుఁ
వానిఫణములపై కెగఁబ్రాకె లీల.

ఉ. నూరుఫణంబులుక్ నలియ నూకలుగా దిగఁ ద్రొక్కి త్రొక్కి యం
భోరుహచారులోచనుఁ డపూర్వవినోదవిలాసకేళికా
సార, నిమగ్నుఁడై భుజగసారము నీరముఁ జేరి పాఱఁగా
ఘోరవిలాపఘోషపరిఘోషవిశేష మశేష మై చనన్.

సీ. ముక్కులన్ నోళ్ళ నల్లులు గ్రక్కి రక్కి
కోఱల విషధారలు గుఱిసి గుఱిసి
యేఱులై యొక్కరీతిగా బాఱుచుండఁ
గాళియుం డోకించుక తమోగర్వ మడఁగి.

క. తొంబదితొమ్మిదిశిరములు
దుంబీఫలములవిధానఁ దొట్రిలిపోవన్
డంబై యొక టుండినఁ గని
కంబుగ్రీవుండు వింతగాఁ బై నిలిచెన్.

క. జడముడిపైఁ బింఛంబును,
మెడలోఁ పూదండ లమరి మెఱయుపదంబున్
గడియములు గజ్జె లందెలు
నడుమునఁ జిఱుగజ్జె లమర నాట్యము చేయన్.

సీ. యమునాతరంగిణియమృతవీచీఘోష
మమరు మృదంగవాద్యమ్ము కాఁగ
నుల్లాసంబున వీఁచు చల్లగాడ్పులరివ్వ
రివ్వనుధ్వని శ్రుతిరీతి కాఁగ
వింతవింతగ నాడి వెలయుపక్షి కులము
ఋతములు కమ్మనికృతులు గాఁగ
వినువీధి గుంపులై వేల్పులు మ్రోయించు
కరతాళములు తాళగతులు కాఁగ

తే. దీరమున నున్నగోపాలవార మట్ల
దద్దయ్యులై యుండ మణిదగద్ధగితకాంతు
లంచి మెంది భుజంగశిరోగ్ర మంట
పమున నృత్యంబొనర్చె గోపాలమూర్తి.

వ. అతఁడు నటావతంసుఁ డని యుద్భుతతాండవకృష్ణుఁ డంచు దే
వతలు నుతింప శ్రీయుతులు నల్లవ్రేల్లరు గన్ను లప్పగిం
చి, తనివిదీరఁ జూచునెడ, శ్రీహరి కృష్ణుఁ డనేకగీతులం
వితతవినోదనాట్యకళ విందుగఁ జిందుచు నృత్య మాడెనున్.

వ. తకతకధోంతరీర్ఝణిత తద్ధిమిధోంకిటధో మ్మటంచునున్
ప్రకటితతాళవాద్యములు పర్వ మనోహరమూర్తి కృష్ణబా
లకుఁడు వియచ్చరాంగనలలాస్యము హాస్యము చేయురీతి ను
త్సుకత యెలర్పనర్తనము సొంపుగఁ జేసె ఫణీంద్రునౌదలన్.

తే. క్షీరవారాశిఁ ద్రచ్చి సుధారసంబుఁ
బంచునాఁడు మోహినీప్రణయనాట్య
భంగిమయొ నేఁటి కాళియఫణిఫణాగ్ర
నృత్యమో యేది శ్రేష్ఠమం చెంత్రు సురలు.

సీ. పుష్కరిణీతోయములఁ దోఁచుజాబిల్లి
వెలుఁగు లోఁ గులుకునుత్పలమువోలె
మహితవిద్యుల్లతామాలావిలోల మా
శారదనీరదశకలమట్లు
లందము లొలికించు నద్దాలమేడలోఁ
దనరారు హరినీలమణివిధాన
హరితకాంతుల నీను నవరంజిగసులలో
మేలైన బాలతమాలమట్లు

తే. విమతకాళీయఫణిఫణాగ్రములపైని
వెలయుశతమణిదీపికావిలసనముల
గులికి నడయాడి యొప్పులకుప్పరీతి
బాలగోపాలకృష్ణయ్య కేళిఁ జేయు.

సీ. రంగదుత్తుంగతరంగమాలికలతోఁ
బొంగుచు గాళింది హంగుసేయ
రంగురంగులకళ ల్పొంగలింప విహంగ
సంతానములు వింతకాంతు లీనఁగ

మంగళతూర్యము ల్నింగి మ్రోయుచుసురల్
విరిసోనవానలు గుఱియుచుండ
యాదవాన్వయులు సమ్మోదసదృగంచల
చంచలల న్నివాళించుచుండ
తే. సురభు లంభారవంబుల సరసమధుర,
లీలలం దేలి హరి శాలు మేల మాడ
భోగిభోగాగ్రమణిపీఠభాగమందు
నమృతతాండవ మొనరించె నాదిమూర్తి.
గీ. లోకకల్యాణమూర్తి యస్తోకకేళిఁ
దేలియాడిన విశ్రాంతరాళమందు
స్ఫురదపూర్వవిలాసరోచులు దనర్చఁ
జల్లగా సర్వహృదయము లుల్లసిల్ల.
క. జయ జయ వనమాలాధర!
జయ పద్మానిత్యచారులాలితవక్షా!
జయ కాళీయవిపక్షా!
జయతాండవకృష్ణ! సాధుసజ్జనరక్షా!
మ. అని కీర్తించుచు దేవత ల్వివశులై యానందనృత్యంబులో
మునుక ల్వేయఁగ గోపగోపికలు సమ్మోదంబు చెట్టింప న
య్యనఁ బాదమ్ములు మోపి యాడెదరు; బ్రహ్మానంద మొప్పారె మో
హనదృశ్యం బని కన్నవే కనులుగా కన్యంబులుం గన్నరే?
సీ. సురలు విపంచికాస్వరమేళనమ్మున
హాయిగాఁ బాడి నృత్యములు సేయ
హరి రమ్యతాండవ మనుకరించుచుఁ దీర
మున గోపసుతులు నర్తన మొనర్ప
నానందవివశలై యాభీరభామలు
భరతనాట్యవిలాసగరిమఁ జూపఁ
జరణవిన్యాససుందరభంగిమము లొప్ప
యాదవు ల్చాలరేగి యాటలాడ

తే. గ్రేళ్ళుఱికి లేఁగదూడలు క్రీడ సేయ
గోవు లంభారవమ్ముల గునిసి యాడ
సర్వ మానందమయనృత్యశాలఁ బోలె
వెలసె యమునానదీతీరపులినతలము.

మ. హరి కృష్ణా! యదువంశకృష్ణ! మహనీయానందకృష్ణా! ప్రభూ!
మురళీకృష్ణ! కుమారకృష్ణ! కరుణాపూర్ణాత్మ! కృష్ణా! మనో
హరకృష్ణా! వరబాలకృష్ణ! ఘననీలాంభోదకృష్ణా! యటం
చిర వా తాండవకృష్ణు నెంత్రురన మెంతేస్తోత్రము న్సల్పఁగన్.

శా. 'సర్వం కృష్ణమయం ప్రపంచ' మను విజ్ఞానోక్తి సార్థంబుగన్
సర్వాంతర్యము లేకమై హరిపయిన్ స్పష్టంబుగా నిల్చె దు
ర్గర్వాన్వితుఁడు కాళియుండు తనగర్వం బెల్ల ఖర్వంబుగా
సర్వాత్మున్ హరి నాశ్రయించె నుదుపశ్చాత్తాపసంతప్తుఁడై.

ఉ. అయ్యెడ పిచ్చితెమ్మెరలు నయ్యమునానది గోగణంబులుం
బెయ్యలుఁ బక్షిజాతములుఁ బృథ్వి విహాయసవీథి దిక్కులున్
వెయ్యివిధాల శ్రీవిభుని విస్తుతరీతులఁ సన్నుతింప గా
నయ్యెడఁ జూపెఁ గాళియుఁడు నెక్కొను వీర్యము మొక్కఁ బోయినన్.

మ. హరి గోపాల ముకుంద కృష్ణ పరమాహ్లాదానుసంధాయకా
శరణార్థిన్ గమనింపు, దుష్టజనశిక్షాదక్ష నారాయణా!
యెఱుఁగన్ నేరక చేసె నా సపకృతుల్ హీనాతిహీనుండ నా
తరమా నీ వరలక్షణం బరయ మత్తస్వాంతుఁడన్ శ్రీధరా!

ఉ. ఈవిషయంబు లెల్ల గ్రహియించి నకాళియుభార్య లందఱున్
శ్రీయుతపాదసన్నిధిఁ జేరి కుమారుల ముందు నిల్పి యెం
తో వినయాను లొప్పునటు దోయిలు లొగ్గి వినమ్రలై సుహృ
ద్భావము లుప్పతిల్ల ధరపైఁ బడి కన్నుల నద్ది మ్రొక్కుచున్.

ఉ. ఓ మహనీయ గాత్ర! విబుధోత్తమ! శ్రీరమణీమనోహరా!
నీమహిమావిశేషమును నేరక దప్పొనరించునట్టి మా
స్వామినిఁ శిక్షఁ జేయుట సమంచిత మౌను సురారులందఱన్
భీమగతిన్ వధించి కడుఁ బ్రీతిని శిష్టులనుద్ధరింతుకా!

క. తొలి భవముల జేయు తపః
ఫలముననో ధర్మకార్యపరిణతిచేనో
కలిగె మహోరగమునకు నే
డలపై హరి నృత్యమాడు నతత భాగ్య మహో!

సీ. నీచరణరేణువులఁ బొందు నియతమతులు
స్వస్వరూపానుసంధానసత్ఫలమును
కన్న సామ్రాజ్యపదవీమహానుభూతి
స్వర్గసుఖముఁ గామించరు సత్యమూర్తి!

గీ. అనవి సంసారచక్రమునందుఁ దిరుగు
జీవి నీపాదరేణువుఁ జెందు కాని
సఫలమందఁ డటం చా దనుజారియుఁ గ్రోధవ
శుఁడు కాళియుఁ డాప్రాప్తిఁ బడయఁగలిగె.

సీ. జ్ఞానవిజ్ఞానవిధానమూర్తి వనంత
శక్తుఁడవును జగత్సాక్షి వీవు
విశ్వమయుండవు, వేదవేద్యుఁడవు త్రి
కాలస్వరూపివి కర్త వీవు
సృష్టిస్థితిలయాదిశిష్టకృత్యుఁడవు, నోం
కారరూపుఁడ వవికారుఁ డీవు
భూతమాత్రేంద్రియబుద్ధ్యాశయాత్మవు
కర్మసాక్షివి నిత్యనిర్మలుఁడవు.

తే. ద్రష్టదృశ్యరహితుఁడవు, దర్శకుఁడవు
నాదిమధ్యాంతశూన్యుఁ డ వవ్యయుఁడవు
నిర్మలానంద జగదేకనేత వీవు
కృష్ణలీలావతార వర్ధిష్ణుఁ డీవు;

ఉ. శ్రీరమణీమనోరమణ చిన్మయరూపవిభూ! కృపాకరా!
క్రూరుఁడు పన్నగేశ్వరుఁడు కొంకక నీయెడఁ జేసియున్న యా
నేరము లెల్ల సైఁచి కరుణింపుము దాసుని నేరముల్ సహిం
పారఁగ ముక్తిఁ దగు నటుచుఁ బజ్జని వాక్యము వాడు దప్పకే.

గీ. ప్రజల యుపచారశతములు ప్రభువు గాక
క్షమనెవరు శ్రేవ్వార లోపత్యమూర్తి!
సర్పజాతికిఁ గోపము సహజ మాట
నింతసని యయ్యెఁ దచ్ఛాంతి యిట్టు లోదవె.

శా. ఈకాళీయుని నాశ్రయించకొని యెన్నేభూతము ల్కల్గు నో
లోకారాధ్య! సమీరాశుఁ జేయు. దగు నీలో భీతచిత్తంబులన్
మాకూన ల్పడి మూర్ఛ ముగ్గి రకటా! మానంశమే మాసెడిన్
నీకారుణ్యము లేకపోవునెడ మన్నింపం దగున్ రక్షకా!

వ. అని కొండాడెను సర్పభామినుల దైన్యావస్థ నీక్షించి త
త్క్షణమే శాంతి వహించి దీనజనరక్షాదక్షుఁడౌ శౌరి గొ
బ్బునఁ గాళీయుఫణాగ్రమంటపతలంబు న్వీడి చింతామణి
ఘనపీఠంబును డిగ్గు నింద్రమనిక్రియన్ గన్పించె నప్పట్టునన్.

గీ. పదియు నాలుగు భువనము లుదరమందుఁ
గలిగియున్నట్టి స్వామి నౌదల వహించి
మోయఁగా భార మైనకాళీయుఁ డప్పుడు
కొలుకొనియె నొక్కింతగ గ్గోలు వీడి.

సీ. చరణఘట్టనమున బలిచక్రవర్తిఁ
దొడరి పాతాళభూమికిం ద్రొక్కినట్టి
యతులవిక్రమాఢ్యుని శిరమందు మోయఁ
గలిగెఁ గాళీయుఁ డెంతటిబలుఁడో కాని.

గీ. మాపరిస్పృపజాతి తామసగుణైక
భూతములు బుద్ధిజాడ్యసంభూతభీతి
చేత సోన్మాదములు కాన జాతిగుణము
విడఁగాలేక యిట్లయి పాడువడితి.

మ. సకలారాధ్యుఁడ వీవు సర్వవిధులన్ స్వాభావికమ్ముల్ ప్రవ
ర్ధకశక్తు ల్బలసంపద ల్వివిధజాతంబు ల్త్వదీయప్రరో
జకబీజంబులు, తత్త్వభేదములు, ప్రజ్ఞాప్రజ్ఞలుం గూర్చి ప్రా
పకుఁడే వేఁచు గుణప్రవృద్ధజగితిం బాలింపు సర్వాత్మనా!

మ. అరవిందాక్ష! త్వదీయకల్పితజగంబం దేను నీ రీతి దు
ర్ధరదుష్కరజన్మ మొంది, తి నిసర్గక్రోధతాపంబు సం
దరియం జేరఁ దలంచి ముట్టితిని నా తప్పేమి? బ్రహ్మము చే
యెఱుఁగన్నేరని నిన్ను నే దెలియ నౌనే? దీనచింతామణీ!

మ. ఇఁక నైనం దయఁ జేసి ప్రోవఁగదె నా కేదారిఁ జూపింతు నో
యకలంకోజ్జ్వలకీర్తిశాలి యని భక్తాభీష్టసర్వార్థదా
యకుఁ డౌదం చని యెంచి నీ చరణదివ్యాంభోజము ల్పట్టితిన్
సకలేశా! బహుపుత్రవంతుఁడను గంనాపింత రక్షింపవే!

శా. నా యీ తామసచిత్తవృత్తి నిఁక నైనం దీర్చి సాధుక్రియా
స్థాయిం గూర్పఁగదయ్య, శ్రీయదుకులస్వామీ! యటం చుగ్రకా
ళీయుం డెంతయు దీనుఁడై పలుక, శౌరీ హాసితల్పుండు నున్
పీయూషప్రవిదుక్తులన్ ఫణిపతిన్ వీక్షించి తా నిట్లనెన్.

మ. ఫణిరాజా! యమునాప్రశాంతి కలుషప్రాయంబుగా నయ్యెఁ ద
త్క్షణమే, నీవు కుటుంబయుక్తుఁడవు నై కాళిందినిం బాసి య
వ్వంబుధిం జేరఁగఁ బోయి యచ్చోట వసింపంబోలెడిం బ్రాణిహిం
సనకృత్యమ్ములు మానుకొ మ్మనుచు నాజ్ఞల్ వెట్టుచున్ వెండియున్

గీ. ఉభయసంధ్యల నెవఁడు నీయుదకుదివ్య
మదనుశాసనకీర్తనల్ మహితభక్తిఁ
బాడునో వాఁడు పన్నగోపద్రవంబుఁ
బొరయకుండెడుఁగాత యీ ధరణి నింక.

గీ. ఏ గరుత్మంతుభయముచే నాఁగలేక
రమణకద్వీపము విడి హ్రదముఁ జేరి
నావాహనుఁడు నిన్ భక్షింపఁ బోవఁ గడుఁడు
మత్పదాంకయుక్తుఁడవై మనుటఁ జేసి.

వ. అని హరి సెలవిచ్చుటయు విని యతివినమితుండై సపరివారంబుగాఁ గాళియుండు వెడలె నప్పుడు

క. యమునానదితోయమ్ములు
నమృతోపమదివ్యరసము లై ప్రవహించెన్

రమణీయమూర్తి గ్రహించి
సుమహితకరుణావిశేషసుష్మముచేతన్.

గీ. దివ్యగంధవాసనల్ దశల గ్రమ్మ
మణిగణాకీర్ణకనకభూషణము లమర
నవలకాంశుల క్షౌమాంబరములు వెలయ
హ్రదము వీడి యేతెంచెను హరి మురారి.

ఉ. వచ్చినకృష్ణు గోపజనవారము కాంచి ప్రమోదితాత్ములై
చెచ్చెరఁ జేర వచ్చి తమచేతులు జాపి మృదూక్తులెన్నవా
క్రుచ్చుచుఁ గౌఁగిలించుచును గోరిక లిరిక లెత్త నెన్నియో
ముచ్చటలాడుచున్ మురిసిపోవుచుఁ విస్మయులైరి మిక్కిలిన్.

ఉ. పోయినప్రాణము ల్మరలఁ బొందినరీతి యశోద కృష్ణునిన్
హాయిగఁ గౌఁగిలించి గుతియారఁగ ముద్దులు వెట్టి యంతతో
స్థాయిని గాంచలేక, పలుచందములన్ మురిపెంబు సూపుచున్
నాయన! హాయిగా మఱలి నాయొడిఁ జేరితివా యటంచునున్.

శా. ఆనందాశ్రువులో మఱేమొ యవి యత్యంతంముగా నొప్పఁగా
నానీలాలకచారులోచనయుగవ్యాప్తంబులై మించుచో
స్నానప్రక్రమ మయ్యె బాలునకు స్వచ్ఛందంబుగా నాడుచు
న్నానందం బసిబాలు నట్టివెకదా మాతృత్వవాత్సల్యస్థితుల్.

చ. హరిమహిమావిభూతివిషయమ్ము గ్రహించిన రాముఁ డెంతయున్
మురియుచుఁ గృష్ణుఁ జేరఁ జని మూర్ధము మూర్కొని కౌఁగిలించి సం
బరమున నవ్వుచున్ గుజనభంజనకార్యవినోదుఁ డైన (శ్రీ)
హరి యితఁ డంచుఁ బల్కి ముదమారఁగ నాడఁదొడంగె వానితోన్.

క. నందుఁడు కలితానందుఁడు
నందనునిం గౌఁగిలించి నవ్యానందం
బొందుచు మూర్ధము మూర్కొని
కందోనవిం డై సుఖవికారము జెందెన్.

క. అయ్యో రీతులనందఱు
నెయ్యములం బఱపి కృష్ణునిర్మలదయచే

నొయ్యన సఫలమనోరథు
లయ్యు సుఖానందవిభవ మందిరి పేర్మిన్.

గీ. అచట విపదగ్ధ మైనవృక్షాదు లెల్లఁ
బల్లవిత మయ్యె గోగణ ముల్లసిల్లె
మోరలను జాచి యొప్పవంభారవములఁ
జేయుచుండెను వత్సముల్ సెలఁగుచుండె.

మ. సకుటుంబంబుగ సాగ్నిహోత్రులకుచున్ క్ష్మాదేవతల్ నందగో
పకుఁ జేరంజని నీతనూభవుఁడు శుంభద్వీర్య సంరంభుఁడై
కకుబంతోజ్జ్వలదివ్యకీర్తిధరుఁడై, కాళీయు మర్దించి సో
త్సుకుఁడై వచ్చెను భాగ్యవంతుఁడని సంతోషంబుగాఁ బల్కుచున్.

క. నిర్వక్రవిక్రముఁడునై
గర్వితకాళీయుని నొంచి గండము దీరన్
సర్వారిష్టహరంబుగ
నుర్వీదేవులకు దాన మొసఁగుము నందా!

వ. అనుచు భూదేవకులోత్తము లానతిచ్చిన నల్లెయని

ఉ. అంతట భూమిదేవులకు నాబుధముఖ్యుఁడు నందగోపుఁ డ
త్యంతముదంబునన్ వివిధదానము లిచ్చి కుమారుఁ గూడి సు
స్వాంతముతో నమస్కృతులు సల్పఁగఁ జూచి చిరాయురస్తు సం
తెంతయు మెచ్చి దీవనల నిచ్చిరి భూసురవర్యు లెల్లరున్.

గీ. అపుడు సూర్యాస్తమయ మైన నఖిలజనులు
దూరమున నున్నపల్లెకుఁ జేరలేక
మందలుం గూడ నారేయి యందె పులిన
తలమున వసింపనుండిరి యుత్సాహు లగుచు.

గీ. శ్రాంతులై నిద్ర మునిఁగినసమయమందుఁ
గాఱుచిచ్చేడఁ బుట్టెనో క్రమ్ముకొనుచు
బటపటార్భటులం గోపవార మున్న
పులినసీమకుఁ జేరువై యలముకొనియె.

సీ. భూనభోభాగము ల్బొలిమిపుచ్చెడుకొని
నాలుక ల్సాపుచుఁ గీల లెసఁగి
రివ్వురివ్వునఁ బ్రసరించి శోధ్వనుచున్న
పెనుగాలిచే స్థితి పెరిగి పెరిగి
నీలజీమూతసన్నిభము లై ధూమము
లష్టదిగ్దేశము లావరించి
పటపటార్భటుల దిక్తటి నంటు విస్ఫులిం
గము లాగఁజిమ్ముచు గ్రమ్మ క్రమ్మి
తే. రెముకటి నెంట నంకొకటిగా నుర్విఁగల్గు
తరులతాగుల్మజంతుసంతతుల నెల్లఁ
గాల్చి పీల్చుచుఁ జెలరేగి కాఱుచిచ్చు
గొల్లలున్నస్థలముఁ జుట్టుకొనియె నంత.

చ. నలుదెసలందు గ్రమ్ముకొని నాట్యముఁ జేసెడుచిచ్చు గాంచియుం
గలవరమంద గోపకులు గాలుచుఁ దూలుచు నేల వ్రాలుచున్
బహువిధమైనబాధలకుఁ బాల్పడి కొల్పడి దారి డొంక వి
హ్వలు లయి విష్ణురశ్రవుని యాశ్రయమే తగు నంచు నెంచుచున్.

క. బలరామకృష్ణు లిర్వురు
నలఘులు లీలానటోరు లౌదురు వారే
బలవత్తరకర్మంబము
పిలువఁగలారంచు నెంచి నిశ్చలమతు లై.

ఉ. యాదవు లెల్ల నౌదలల హస్తము లుంచి నమస్కరించుచున్
శ్రీదయితా! సుధీవినుత! చిన్మయరూప హరీ! మురారి! సో
న్మాదదురంతరాక్షసవినాశకరా! సకలేశ! కృష్ణ! రా
వే! దయచేయవే! యనుచు నెంతయుభక్తిని గొల్చి రంతటన్.

తే. క్షీరవారాశిఁ ద్రచ్చుచోఁ జెలఁగినట్టి
హాలహాలం బట్టె ద్రుంగినహరునికరణి
నఖిలభీకర మైనదావాగ్ని దాని
నింతగాఁ గబళించె శ్రీకాంతుఁ డపుడు.

మ. అతిలోకం బగువట్టిచర్యఁ గని గోపానీక మాశ్చర్యము
గ్నితఁ గృష్ణుం బరమేశుగాఁ దలఁచునంతన్ దుర్నివారంబు లో
కతతివ్యాప్తము విష్ణుమాయ యెనయంగా భ్రాంతమై యెంచె న
ప్రతిమున్ శౌరి మనుష్యుఁగా సుతునిఁగా భవ్యాప్తమిత్రంబుగాన్.

—* ప్రలంబాసుర వధ *—

గీ. పల్లవములు నానావిధప్రసవములును
మంజరులు నెమ్మి పింఛముల్ మంజులముగఁ
దాల్చి చిరుగంతు లిడుచు బృందావనమ్ము
నందు గోపాలకులు కూడి యాడుచుండ్రు.

చ. అటు బలరామకృష్ణులు మహావనియందు వినోదు లై, నదీ
తటమునఁ దోడిబాలురును దద్దయుఁ గ్రీడల నాడి పాడుచో
నటుకఁ బ్రలంబదానవుడు నర్భకు లందఱఁ జంపివేయఁగా
వటువువిధాన వచ్చి బలభద్రునిఁ దాఁ బొడఁగాంచి మ్రొక్కుచున్.

ఉ. తానును గ్రీడలాడెడుముదంబున వచ్చితి నన్నఁ గృష్ణుఁ డ
వ్వానివిధానముం దెలిసి పల్కక యూరక యుండె; భద్రుఁడున్
మానముఁ దాల్చె బాలకులు మన్ననఁ జేసినయంత వాఁడు స
న్మానితుఁ డైనచందమున మక్కువఁ జెందియు వారిఁ గూడియున్.

వ. ఆప్తమిత్రుండును బోలె వారలం గలసి వర్తించు నప్పుడు

సీ. బాలు రందఱు సమబలు లయి రెండు ను
ద్దీలుగా నేర్పడి చీలునట్లు
లోకజట్టుతోడ నింకొకగుంపుఁ బెనఁగుచు
బలపరాక్రమములఁ బఱపునట్లు
విజయు లౌవారిని విజితులు సరిహద్దు
మేరదాఁక వహించి తీరునట్లు
మోయఁదప్పినవారి మోయించుకొనువారు
సరి ఘునఁ జేతులం జఱచునట్లు

తే. పందెములు వేసికొని మహానందముగను
క్రీడ లాడంగఁ దలపెట్టి కృష్ణరామ
వరుల నొక్కొక్క జంటను వరుస నాయ
కులుగ నేర్పించుకొని బాలకులు చెలంగి.

క. బలరాముని పక్షంబున
బలియును శ్రీదామువృషభ పాత్రులు వెలయన్
నిలిచిరి ప్రలంబవరభ
ద్రులు మున్నగువారు నందసుతుని జంటన్.

గీ. వాహ్యావాహక సంఘము ల్పసులఁ ద్రోలు
కొనుచు భాండీరకం బను గొప్పవటము
దఱియఁగా నేఁగి యచట నేర్పఱచుకొనిన
రీతి నా టాడి రెల్ల సంప్రీతి గదుర.

మ. బలుపక్షంబు జయించెఁగాన విధులం బాటించి కృష్ణార్భకుం
డల శ్రీదాముని భద్రుఁడా వృషభు నన్యాయప్రలంబుండు దా
బలరామున్ వహియించి మోయుటకు శుంభద్వేగులై వచ్చి ధీ
రులుగా నిల్చిరి వారు వారిపయి నారోహించి రుత్సాహులై.

క. శ్రీదాముని మోసెడు దా
మోదరుతో వాదు లాడి మున్ముంగ నేఁ
బోదు నని బలుని మోసెడు
జోదు ప్రలంబాసురుండు చొక్కము కాఁగన్.

శా. కానీ చూత మటంచు నొక్కరొక రే కా లూని మున్ముందు నే
నే నేనే సరిహద్దుఁ జేరుదు నటం చెంతే విలోకించుచున్
పై నున్నట్టి కుమారవీరుల నుడు ల్పాటించి వెన్వెంట నే
జా నొందం బఱువెత్తఁ జొచ్చిరి మరుత్సామ్యంబుగా నంతటన్

ఉ. లావరి యైన దుష్టుఁడు ప్రలంబుఁడు రాముని దోర్యుగంబునన్
ఠీవిగఁ దాల్చి పైకెగసి డేగవిధంబున నాకసంబునం
బోవఁదొడంగె బాలకులు బొమ్మలకైవడి నింగిఁ జూచుచుం
జేవఁ దొఱంగి యేడ్పెదరు శ్రీపతి వారల నూరడించుచున్.

మ. అతిలోకం బగు వట్టి వర్త్యఁ గని గోపానీక మాశ్చర్యము
గ్నితఁ గృష్ణుం బరమేశుగాఁ దలఁచునంతన్ దున్నవారంబు లో
కతతివ్యాప్తము విష్ణుమాయ యెవయంగా భ్రాంతమై యెంచె న
ప్రతిముఁడౌ శౌరి మనుష్యుఁగా సుతునిఁగా భవ్యాప్తమిత్రంబుగాన్.

—* ప్రలంబాసుర వధ *—

గీ. పల్లవములు నానావిధప్రసవములును
మంజరులు నెమ్మిపింఛముల్ మంజులముగఁ
దాల్చి చిరుగంతు లిడుచు బృందావనమ్ము
నందు గోపాలకులు కూడి యాడుచుండ్రు.

చ. అటు బలరామకృష్ణులు మహావనియందు వినోదులై, నదీ
తటమునఁ దోడిబాలురను దద్దయుఁ గ్రీడల నాడి పాడుచో
నటుఁ బ్రలంబదానవుడు నర్భకు లందఱిఁ జంపివేయఁగా
వలువువిధాన వచ్చి బలభద్రునిఁ దాఁ బొడఁగాంచి మ్రొక్కుచున్.

ఉ. తానును గ్రీడలాడెదముదంబున వచ్చితి నన్నఁ గృష్ణుఁ డ
వ్వానివిధానముం దెలిసి పల్కక యూరక యుండె; భద్రుఁడున్
మౌనముఁ దాల్చె బాలకులు మన్ననఁ జేసినయంత వాఁడు స
మ్మానితుఁడైనచందమున మక్కువఁ జెందియు వారిఁ గూడియున్.

వ. ఆప్తమిత్రుండును బోలె వారలం గలసి వర్తించు నప్పుడు

సీ. బాలు రందఱు సమబలు లయి రెండు ను
ద్దీలుగా నేర్పడి చీలునట్లు
లోకజట్టుతోడ నింకొకగుంపుఁ బెనఁగుచు
బలపరాక్రమములఁ బఱపునట్లు
విజయు లౌవారిని విజితులు సరిహద్దు
మేరదాఁక వహించి తీరునట్లు
మోయఁదప్పినవారి మోయించుకొనువారు
సరిగున్ జేతులం జఱచునట్లు

తే. పందెములు వేసికొని మహానందముగను
క్రీడ లాడంగఁ దలపెట్టి కృష్ణరామ
వరుల నొక్కొక్క జంటను వరుస నాయ
కులుగ నేమించుకొని బాలకులు చెలంగి.

క. బలరామునిపక్షంబున
బలియుచు(శ్రీ)దామవృషభపాత్రులు వెలయన్
నిలిచిరి ప్రలంబవనగభ
ద్రులు మున్నగువారు నందసుహితునిజంటన్.

గీ. వాహ్యావాహకసంఘము ల్పనులఁ ద్రోలు
కొనుచు భాండిరకం బను గొప్పవటము
గలిసియుఁగా నేఁగి యచట నేర్పఱచుకొనిన
ంతి నా టాడి రెల్ల సంప్రీతి గదుర.

వ. బలుపక్షంబు జయించెఁగాన విధులం బాటించి కృష్ణార్భకుం
డల శ్రీదాముని భద్రుఁడావృషభు నన్యాయప్రలంబుండు దా
బలరామున్ వహియించి మోయుటకు శుంభద్వేగులై వచ్చిధీ
రులుగా నిల్చిరి వారు వారిపయి నారోహించి రుత్సాహులై.

క. శ్రీదాముని మోసెడు దా
మోదరుతో వాదు లాడి మున్మునఁగనేఁ
బోదు నని బలునిమోసెడు
జోదు ప్రలంబాసురుండు చొక్కము కాఁగన్.

శా. కానీ పూత మటంచు నొక్కరొకరే కా లూని మున్ముందు నే
నే నేనే సరిహద్దుఁ జేరుదు నటం చెంతే విలోకించుచున్
పై నున్నట్టికుమారవీరులనుడు ల్పాటించి వెన్వెంటనే
జా నొందం బఱువెత్తఁ జొచ్చిరి మరుత్సామ్యంబుగా నంతటన్

ఉ. లావరి యైనదుష్టుఁడు ప్రలంబుఁడు రాముని దోర్యుగంబునన్
రీవిగఁ దాల్చి పెకెగసి డేగవిధంబున నాకసంబునం
బోవఁదొడంగె బాలకులు బొమ్మలకైవడి నింగిఁ జూచుచుం
జేవఁ దొలంగి యేడ్పిదరు శ్రీపతి వారల నూరడించుచున్.

ఉ. వాఁడు ప్రలంబుఁ డ న్దనుజవర్యుఁడు; మా బలరాము నన్నుఁ దు
న్మాడఁ దలంచి యే యిటుల మాయఁ గుమారకరూపధారియై
యాడుకొనంగఁ జేరె మము నందఱ నేఁటికి వీలు చిక్క యీ
కీడొనరింప నెంచి దివికిం గొనిపోయెను భద్రు నట్టులన్.

మ. బలభద్రుం డసమానబాహుబలసంపన్నుండు; దైతేయవం
శలవిత్రుండు నిశాచరాధమునిపీచం బార్చి వెన్వెంటనే
కలియ న్వచ్చెదు మి మ్మటంచు హరి పల్కన్ బాలు రొక్కింత ని
శ్చలతం గాంచి విహంగవీథిఁ గని రాశాజ్యోతు లల్లాడఁగన్.

క. చని చని ప్రలంబదనుజుఁడు
ఘనసత్త్వుఁడు రాము మోయఁగాలేమిని, బ
ల్కినుకం బూర్వపురూపము
గొని పాఱఁదొడంగె నింగి గొబ్బున, నంతన్.

సీ. ఉల్కలవిధాన వెలుఁగుచు నున్న కనులు
గనుబొమల నంటుకోర లంజననగంబు
కరణి మైచాయ, గిరిమస్తకంబు గలిగి
వికృతదానవరూపుఁ డై వెలసె నతఁడు.

ఉ. చనెను ప్రలంబదానవుండు, శౌరిశిరంబున నున్న దివ్యకాం
చనమయ మౌ కిరీటరుచి, స్వర్ణవిభూషణకాంతు లెల్లఁ జై
కొను నెడ గ్రొమ్మెఱుంగుఁ దళుకు ల్చెలువారుసుధాంశుబింబముఁ
గని వినువీథిఁ బాఱెడునొకానొక మేఘమువోలెఁ దోఁచెడిన్.

చ. కనుఁగొని మేను ఝల్లుమనఁగా బలభద్రుఁ డొకింతభీతుఁడై
మననము సేసి దానవునిమస్తకముం బదతాడనంబులం
గొనకొని ముష్టిఘాతములఁ గ్రుమ్మిన నెత్తురు నోటఁ గ్రక్కి దు
ర్జనుఁ డిలఁ గూలిపోయెఁ గులిశప్రహతిం ధరఁ ద్రెళ్లుకొండ నాన్.

క. రాముఁడు దైత్యవిరాముఁడు
తామసు హరియించి మిత్రతతిఁ జేరుటకై
ప్రేమమున దఱియవచ్చిన
నామహితబలాఢ్యుఁ గని సమాదరత నటన్.

క. బాలకు తైలము సెలంగన్
లాలించిరి బహువిధాల లాస్యము లొప్పన్
బూలను గుఱిసిరి దివ్యులు
కాళియమదహారి వానిఁ గౌఁగిట గ్రుచ్చెన్.

ఉ. అంతట వత్సపు ల్చె లగి యాడుచు నుండ డెడునంత గోవు లా
ప్రాంతములందు మేఁత గనరామిఁ జరించుచు బోయి పోయి, యే
క్రాంతలనో చొరంబడియె; గ్రాసము మేయుచునుండె నంత నా
ప్రాంతములందు దావశిఖి ప్వ్యాఁగ గోగణ మార్చె బిట్టుగన్.

గీ. గోవు లఱచుటయును సాంద్రదావహ్ని
యడవిఁ గాల్చుటయును గాంచి యాల వెనుక
గొబ్బునం గేళిఁ జాలించి గోష్పదాంకి
తములఁగాంచుచు గోపులు దఱలి రపుడు.

ఉ. ఘోరదవాగ్ని యేర్పనెడ గోవులు తాళక చెంగుచెంగునన్
బాఱుచు దుర్గమం బయినబంధురకాననసీమఁ జేరె నా
భీరులు వానియునికిఁ గనిపింపమి విహ్వలచిత్తులై మనో
భార మనంత మై తిరిగి వచ్చిరి చెచ్చెరఁ దొంటి చోటికిన్.

గీ. కాఱుచిచ్చంత కంతకుఁ జేరు వయ్యెఁ
గాల్చుచో గోపు లోర్వక కంపితులయి
కృష్ణభగవానుమహిమ లెఱింగి యుంటఁ
గరము లెత్తి మ్రొక్కి నుతింపఁ గడఁగి రెల్ల.

మ. హరి! గోపాల! ముకుంద! కృష్ణ! జగదారాధ్యా! రమావల్లభా!
కరుణాసాగర! దీనబాంధవ! మముం గాపాడనేతెమ్ము నీ
చరణాబ్జంబులు నమ్మినాము; చెలివై సామ్రాట్టువై మమ్ము నా
దరభావంబున బ్రోచుచున్నవరబాంధవ్యంబుఁ బాటింపుమీ.

వ. అని వారు వేడుకొన్నంత

గీ. ఒక్కయుత్తుంగవృక్షము నెక్కి కృష్ణుఁ
డాలమందలజాడల నరసి వానిఁ
బేరుపేరులఁ బిలువంగఁ బెద్దఱంకె
లెనయ మందయు నుత్తర మిచ్చె నంత.

ఉ. గోపులఁ గాంచి భీతిలుట చూడను కన్నులు మూయుఁ డిందఱున్
దాపను లాఱు మి మ్మడఁచుదావశిఖ ల్వడిఁదీఱు నన్న యా
జ్ఞాపరిపాలనం బొనర సల్పిరి వారలు దోయిలొగ్గి సం
తాపద దావవహ్నిఁ గొని త్రావె సుధారసమట్లు కృష్ణుఁడున్.

గీ. అంత సూర్యాస్తమయ
మైన నఖిలగోపకులును బలరామకృష్ణులు గోగణములఁ
దోలుకొని వేణువుల నూఁది తోరముగను
పల్లెఁ జేరిరి ముచ్చట లుల్లసిల్ల.

సీ. ఏమన్మథాకారుఁ గామించి చంద్రచ
కోరలౌల్యంబున గోపికలును
నేసుకుమారు లాలింప గోగోవత్స
లాలనంబున యశోదాలతాంగి
యేభానుమంతునకై భగవద్భాగ
వతనిరీక్షలను గోపాలవరులు
నేశ్యామసుందరు నీక్షింప గురుశిష్య
వాత్సల్యవిధులచే వత్సపులును

తే. సమయమును వేచియుండి రా సాధుమూర్తి
సర్వమానవహృదయసంచారి యతఁడు
కృష్ణమూర్తి విచ్చేసినఁ దృప్తిగదుర
నంద ఆనందపరవశు లైరి వారు.

సీ. కమనీయబర్హిపింఛము శిరోభూషణ
ప్రాయ మై కనువిందుఁ జేయుచుండ
గర్ణికారసుమాళి కర్ణయుగ్మమునందు
హాయిలుగా ముద్దుల నొలుకుచుండ
వైజయంతీదివ్యవనమాల యురమున
గునిసియాడుచు వింత గొలుపుచుండ
వరపీతకౌశేయవసనము లొమ్మలనూలు
చిరుగజ్జె లందెలుఁ జెలఁగుచుండ

తే. నధరపీయూషజముం శిరోభూషణ జింది మధురమురళి
మ్రోయుచు న్గోపబాలురు ముదముగనఁ
బొగడఁగాఁ బాదవిన్యాసములకు శోభఁ
జెందుబృందావనిం జేర నందసుతుఁడు.

చ. కనుఁగొని గోపభామినులు కన్నులపండువు గాఁగ, లోకమో
హనసుకుమారసుందర ఘనాంచిత చారు తనూవిలాసమున్
మననముఁ జేసి నిక్క మగుమక్కువ యుక్కన నైయె యెలర్పగాఁ
బ్రణయరసానుభూతి సుఖపర్యవసానవిలోలచిత్త లై

మ. మురళీనాదము కర్ణరంధ్రములలో ముగ్ధానురాగామృత
స్ఫూదానందరసమ్ము గ్రుమ్మునెడ సమ్మోదమ్ము చెన్నారుచున్
రమణీరత్నము లెల్ల శ్రీహరిపదధ్యానంబున న్మగ్న లై
యరవిందాయతచారులోచనయుగం బర్పించి రుప్పొంగుచున్.

ఉ. వేణువు చేసికొన్న ఫలవిస్తృతపుణ్యవిశేష మెట్టిదో
కాని? యనారతంబును ముఖస్థలమందున హాయిహాయిగా
నానవమోహనాంగు మధురాధరసారము గ్రోలుచుండెడిన్
గానరసమ్ముఁ జిందుచు జగన్నుతకీర్తి వహించు నద్దిరా!

ఉ. ఆవనమాల వైభవమహత్త్వము సూవె యనన్యదుర్లభ
ప్రావృతదిగ్దశాంతరుచిర స్ఫురితోరుయశో విశాల మా
రా!వనజాయతాక్షుని యురస్స్థలపీఠము నెక్కి యాడుచున్
దావులు గుపిగుప్పి లలిత మ్మగు మండన మై రహించెడిన్.

ఉ. ఏమితపం బొనర్చినదొ యేమొ మయూరి తదీయపింఛముల్
శ్రీమహిళామనోహరుఁడు శీర్షమునం ధరియించుచుండు ని
ష్కామతపస్వినివిధము కావలె నట్టుల గానినాడు వే
ణీమణి యై రహింపఁగలనిస్తులభాగ్యము చెందఁగల్గునే

ఉ. ఈతృణము ల్లతాతరువు లీయమునానది బృందభూమి గో
వ్రాతము సైకతస్థలులు వత్సపబృందము నోచుకొన్నవి
ఖ్యాతఘనవ్రతాంచితమహత్త్వము లెట్టివొ కాని లోక వి
విఖ్యాతు ననంతు దివ్యపదకంజములం భజియింప నేర్చెడిన్.

శా. ఏపుణ్యంబునఁజేసి పొందగలమో! యీస్వామితో స్నేహసం
ల్లాపంబుల్ పచరించుచున్ మన వయోలావణ్యముల్ ధన్యతం
బ్రాపింపంగలభాగ్య మోసుదతులారా! తెల్పు నెవ్వారు లే
రా! పెద్దల్ వ్రతదీక్షులర్హ్యములు లేవా! కోమలీసాధ్యముల్.

—* గోపికా వస్త్రాపహరణము *—

వ. అని విచారించి గోపబాలికలు హరిం బ్రాణవిభుంగాఁ గోరి సర్వమ
గళ సర్చించువారై స్నానార్థంబు యమునకుం బయనించుట లెఱింగి
సర్వజ్ఞుండైన మదన జనకుండు వినోదంబు సంకల్పించి యదృశ్యుండై
వారల ననుగమించుచుండె నప్పు డక్కన్నియలు నందనందన చర
ణారవింద పరిభ్రమమాణ మానసేందిందిర లయి యన్యోన్యంబున.

ఉ. ఏమన నేర్తునే? సకియ! యంత మఱల్పఁగఁ జూచుచున్నఁ గం
టే! మన సిద్ధి యప్పుభ్రమియించుచు నందకుమారుఁ గోరి యా
కామితమెట్లు గల్గె? ననఁగా మఱి యుత్తరమొండులేదు పో
భూమి నతండు నాకొఱకె పుట్టె నటం చొకనిశ్చయింబగున్.

క. కను విచ్చిన మూసిన వె
న్నుని రూపంబాకటె మన్మనోగోచరమా
వనితా! ప్రణయమహిమ మే
మనవచ్చున్ బాహ్యలోకమట మిథ్యసుమా!

ఉ. భామిని యేమి చెప్పుదును వారిజనేత్రునిఁ గోరఁటాది నా
మైమఱి పొరరేఁబవలు మాధవ! మాధవ! యన్నమాటయే
పో! మఱుమాట యాప్యజనముల్ సకియల్ పెరవారుఁ బిల్చి యే
మేమని రేనియుం బలుక నింకెవియున్ ననుఁ గానియట్లుగన్.

శా. ఈ చిత్రమును వింటివే! చెలియ! శ్రీకృష్ణార్పిత స్వాంతనై
యేచందమ్మున నిద్రరాక తుదకెట్లోఁ గన్నుమూయంగ రా
కాచంద్రాననుఁ డామనోహరుఁడు నాకై దండ నాసించి తా
నేచేరెన్ దమిఁబట్టి కన్దెఱచినా నేఁడీ యెటుల్ వోయెనో.

ఉ. ఆనిముసమ్ములోఁ గలిగినట్టి సుఖానుభవమ్ము నెన్నఁడుం
గాని యెఱుంగనే నుడులఁగాని మఱెట్టులఁగాని తెల్పఁగా

నానె! యఖండ మద్వయము నాపరితోష మొకండె చాలుఁజు
మ్మోవలి నాయతాక్షి! యమృతోపమమై బ్రతికింపఁగా ననున్.

సీ. చెలియ కృష్ణుఁడటన్న పలు కెంతమధురమో
  వినఁగోరు నదియ నా వీను లెపుడు
కలికి యవ్వాని చక్కఁదనమ్మెట్టిదో
  కనఁగోరు నదియ నాకన్ను లెపుడు
పూఁబోఁడి వాని కెమ్మోవి నేమున్నదో
  రంజిల్లు నంద నారసన యపుడు
మగువ యాతనిసౌకుమార్య మ్మదెట్టిదో
  యాసించు నదియ నాయంగకములు

తే. గీ. రమణి వేయేల నాశరీరమ్ములోని
ప్రత్యణువు వానికోసమై పరితపించు
నాసొగసుకాని సాహచర్యమ్ము లేక
బ్రతుక లేనమ్మ! కొమ్మ! నే బ్రతుక లేను.

తే. వాఁడునో! వాడదో! పల్లవంబు సఖియ!
చెలువు కెమ్మోవి యూర్పుగాడ్పులకె వాడు
మాయునో! లేదో! యద్దంబు మంజువాణి
వెన్నునికపోల మిట్టన్న వన్నె మాయు.

ఉ. అంజలిఁబట్టనెంతుసకియా! యదుఁగద్దున నందపుత్త్రుఁ డెం
దుం జనుచున్న నొచ్చుకొనునో యెట నేతృణ మైనఁదాకి యం
చుం జివురాకుకన్న సొగసుందనముల్ కల వాని యంఘ్రులం
చుం జలియించుఁ జిత్త మొకచొప్పున నిల్వదు పట్టఁజూచినన్.

సీ. నాలోనఁ గోటివీణలు మ్రోఁగునే సఖి!
  ప్రియుని పలుకంత విన్పించుచున్న
నామేను నాది కాదే మానినీమణీ!
  నందనందనుఁడు కన్పట్టుచున్న

నా మానసమ్ము మానసముపైఁ దేలు నే
యతఁడు నన్నొకకంట నరయుచున్న
నాకింక లోక మున్నదె స్ఫురింపదు చెలీ!
ప్రియుఁడు నన్నె పలకరించుచున్న
తే. తేలిపోదునె దివ్యలోకాలలోన
కాంతు శ్రీపాదములఁ గొల్వఁగలిగితేని
పడఁతి నాథుఁడె నన్నుఁ జేపట్టె నేని
యెల్ల లోకమ్ము నేనె పాలించుదాన!
వ. ఇట్లు మదన వేదనాదోదూయమానమానసలై విస్రంభాలాపంబుల నమ్మరాళగమనలు కాళిందిం గదిసి రప్పుడు.
శా. బాలల్ పుట్టము లూడ్చి తీరముపయిన్ భద్రంబుగాఁబెట్టి కే
ళీలోల్యంబున నేటఁ జొచ్చి మనసుల్ దీఱంగ నిచ్ఛాగతిన్
వాలాయమ్ముఁ బరస్పరమ్ము వితతాంభశ్శీకరశ్రేణిచే
నోలో! యోల! యటంచు మించునటులత్యుత్సేకతన్ నొంచుచున్.
ఉ. నెమ్మొగ మంటి మూగికొను నీలశిరోజము లంబుజమ్ముపైఁ
గ్రమ్మెడు బంభరంబుల తెఱంగునఁ దోఁప మనోభవుంగు నా
త్మమ్ముగఁ బూరుపాళి యెడఁదల్ నొగిలింపఁగ దూసినట్టి శ
స్త్రమ్ములనంగ భాసిలి రుదాత్తగతిన్ జలకేళిఁ దేలుచోన్.
తే. నీలవర్ణాంచితాంబు సన్నిహితగోప
కామినీ ముఖ పద్మముల్ గ్రాలె నపుడు
గగనమున నొక్కయపుడ వింతగ శతాధి
కమ్ములై తోఁచు చంద్ర బింబమ్ము లనఁగ.
మ. జలకేళీరతలైన యా చెలువలా చందమ్మునన్ మించు వాం
ఛలఁ దన్నుం దలపోయుచున్ మధురదృశ్యంబున్ ఘటింపంగ నా
జలజాతాక్షుఁడు వారిజేక్షణల వస్త్రంబుల్ వడిం బట్టి న
వ్వులు చిందించుచుఁ దీరభూరుహా వరంబుజేరి మేలమ్ముగన్.
మ. భళిరే! చానలు? మేలు! మేలు! యమునాభంగిర్మలం జూడ నం
చలటుల్ మించురుగాక యావిన మహోత్సాహంబు లిట్లొప్ప నే

చెలువల్ గల్గరె తాన మాడరె వయస్కు లింత దర్పించి న
గ్నలుగా నేళులఁ దేలియాడుటెవ్వడైనం గంటిమే? వింటిమే?

చ. అనిపరిహాసమాడు నెడ నంబుజనేత్రలు తద్రవంబు వ
చ్చిన దెసఁజూచి కన్గొనిరి శ్రీరమణీ హృదయాధినాథు బా
లుని నవమన్మథాకృతు విలోల విశాల విలోచనాబ్జు నా
త్మనిలయసుప్రతిష్ఠితు సమస్త సతీజనలోభనీయునిన్.

చ. కని వెఱఁగంది యొద్ది పలుకన్ దలఁపన్ జతనంబుసేయఁ జా
లనియట్టు గొంతకాల మవలన్ బురుషుండతఁ డంచు దాము నం
గన లఱచున్ మనస్సున కొకానొక యూహస్ఫురించె దాని వె
న్కను మఱితోఁచె నాత్మగత నగ్నత పుట్టెను సిగ్గుకోడుతన్.

వ. అంతటఁగృష్ణదేవుఁ డిట్లనియె.

చ. వినుఁడు జగాన స్త్రీపురుషభేదము లన్నవి రెంటిచేతనే
మనసులు మార్పుఁజెందుటలు మర్మము గప్పెడు ముప్పు వచ్చుటల్
వనితలు వేవురైనను వివస్త్రలుగాఁ జరియింత్రు గాని యొ
క్కని మగవానిఁ గన్గొనినఁ గంతుల మింతురు రంతు లాడుచున్.

చ. ఇవి సహజంబు లోకముల నిట్టివి ద్వంద్వము లెవ్వి నాకు నొ
ప్పిదములై కావు స్త్రీపురుషభేదము లెంచను భక్తియుక్తులై
హృదయసమర్పణక్రియల నెవ్వరు సేయఁగలారొ వారినే
వెదకుచు వచ్చి చేరెదను వేడుక దీరెద నేరి కోరుచున్.

చ. అటులనె మిమ్ముఁ గోరి నడయాడుచువచ్చితిఁ గూడియాడ నె
చ్చటఁ గనిపింపరైతి రిటు సాగితి నిచ్చట మిమ్ముఁ గంటి న
ప్పటికి జలావగాహనవిభావనకార్యనిమగ్నలై మహో
త్కటసరసాట్టహాసములఁ దాండవమాడు నుంటి రెల్లరున్.

చ. దెసమొల లయ్యు నీరములఁ దేలుచు సోలుచు నీదులాడుచున్
విసవిస నీరుఁ జల్లుకొని వేడుక లందుటె కాని దవ్వుఃన్
మసలుచు నగ్నదృశ్యము లమాంతముగాఁ గని నవ్వుచున్న నా
దెస నొకరైనఁ జూచి గుఱితింపరు కాంచరు వ్రీడపోడిమిన్.

ఉ. అప్పుడు లేనిలజ్జ యిపుడా పయికొన్నది యంగభంగమై
యెప్పుడొ నాకు లొజ్జయితి రిందఱు కా దననేల? యిప్పుడో
కప్పురగంధులార! వెటకారము దూరము పారఁద్రోలి నా
చొప్పు గ్రహించి మెప్పుగొనుజోక దలంపుఁడు చీకు దీరెడిన్.

ఉ. తప్పుడునాటకంబులకుఁ దాళము వేసెడువాఁడఁ గాను నే
నెప్పుడుఁ జెప్పఁ గాని పను లెవ్వియుఁ జెప్పిన ధర్మమార్గముల్
తప్పక చెల్లి తీరనగు దైవనియోగములం గలంపలే
రొప్పులకుప్పలార! నిఁక నూరటఁ జెందియు దారి నొందుఁడీ!

శా. ఇంతే కాదు రహస్య మింకొకటి విన్పింతుం బ్రజానీక మే
కాంతస్థానములందు గోప్యవిషయాకల్పంబు సాధించి వి
శ్రాంతిం గాంతు రెచారుఁ జూడ రని నిశ్శంకంబు బింకంబుగా
నంతా రామయప్రపంచ మను వాక్యార్థంబు నూహింపకే.

గీ. కర్మచక్షువులను గప్పఁ గలిగినట్టి
గంతలో బొంతలో యెవో కలవు కాని
జ్ఞానలోచనములు మూయుసాధనములు
లేవు పదునాల్గు భువనాల లేవు లేవు

ఉ. నాకను లెంచుచేతనో యనారత మోలిన పాలిగాపులై
లోకము లేకదృష్టిని విలోకనఁ జేయుచునుండు దానికిం
గాక రహస్యసంగతముగాఁ జనువిక్రియ లేవి లేవు ప్ర
త్యేకత లెవ్వి సాఁగ నిఁక నేల వృథా విపరీతవాదముల్.

చ. అనుగతమోహాభీతిని దృగంచలచంచల లుజ్జ్వలింపఁగా
గనెదరు లోకవృత్తములఁ గావు విభిన్నవిరాగభావముల్
పనుపడె మీకు వాని నెడఁబాసి విశుద్ధనిబద్ధ దృష్టితో
ననుఁ గనుఁ డొక్కసారి యమనస్కవిధంబు సుబోధకంబగున్.

ఉ. మానుడులందు నమ్మికము న్యాయము ధర్మము ఉన్నవన్న స
న్మానము మీకుఁ గల్గునెడ నాతిచిరమ్ముగ విజ్ఞతత్త్వముల్
పూనుఁడు మర్మకర్మములుఁ బోవును తీరును శోకతాపముల్
మానినులార మీ కొదవు మానము న్యూనత లేను బూనెడన్.

శా. ఈవాక్యంబుల నెంతసామ్మసిలిరో యేమో ద్రవీభూతలై
యావామాక్షులు చేతు లెత్తికొని కృష్ణా! దేవదేవోత్తమా!
నీవే సర్వజగన్నియామకుడవున్ నీ కంతయున్ స్పష్టమే
భావాతీతుఁడ వాదిమూర్తి వని సంభావించుచుం గోపికల్.

చ. నిను గుఱితింప మావశమె నిదగులీలల నెన్న శక్యమా?
వనములఁ బెద్దకాలము తపం బొనరించిన పుణ్యమూర్తులున్
వనజభవాది దేవతలు వాసవముఖ్యులు దేవదేవులుం
గనుగొనలే కటన్న నిఁకఁ గాంతల మెంతటివార మౌదుమో?

మ. అని కొండాడుచు నగ్నదేహములతో నర్చించి చర్చింపఁగాఁ
బని యే మున్నది? నీయపేక్ష యటులై ప్రాల్మాలువో మేము కా
దననేలా? సరె యేని యెట్లయిన మా కానందమే సాఁగనీ
పనిపాటల్విడనాడి వచ్చితిమి నీ వాలైతి మిప్పట్టునన్.

శా. మానప్రాణము లప్పగించితిమి సమ్మానించి గోపాలకృ
ష్ణా! నీవారము నేటినుండియును బ్రాణా లుండునందాఁక ని
న్నే నెమ్ముంబున నమ్మి కొల్చెదము కానీ సాఁగనీ యోడ మ
మ్మేపటం బడఁద్రోచితన్ మనిచిన న్నీవే రమానాయకా!

ఉ. చేతులఁ బైకి నెత్తి వికసించు హృత్సరసీరుహంబులకె
బూఁతలు శౌరిపాదములకుండు సమర్పణఁ జేసి లోలవి
ఖ్యాతదృగంచలాంచితపిహారవిలాసము లోజ సేయుచుఞ
జోతలుఁ జేసి శ్రీపతినిఁ జుట్టిరి, చెట్టున నుండ గోపికల్.

శా. ఆసందర్శనకేళిఁ జూడ, దివియం దాబాలగోపాల మెం
తో సంరంభమున న్విమానములపై నొప్పారుచుం దేవతల్
బూసోన లురియించుచుండ్రు; పడిగాపు ల్పడ్డచందాన, నా
వాసమ్ము ల్విడిపోనరెంతకును, నిర్వ్యాజానుమోదమ్మునన్.

సీ. మరకతశయ్యపై హరినీలమణికోలె
నాకుజొంపములతో హరి నసింప;
నీలమేఘాలపై ప్రాలువింద్రధనుస్సు
వలె శౌరికడల వల్వలు రహింపఁ

దీవెలు సాచి జొత్తిఁయువల్లులఁగు బాము
చెలిమిమెయిం జేతు లెత్తి నిలువఁ
చాలవెల్లిని దూఁగుపూలమాలికలట్లు
కొమ్మల వ్రేలాడుకొక లొప్ప

తే. బాలగోపాలకృష్ణలీలాలలామ
జాల మన నొప్పుగోపికాస్త్రీలతోడ
నోలలాడుచు నానాఁడు కేళిఁజేసె
సిగ్గుసింగారములుఁ బాపి చేరఁదీసె.

శా. లీలామానుషవిగ్రహుం డగుటచే లీలాప్రపంచంబునం
గేళిం దేలుచుఁ దేల్చి, భక్తతతితోఁ గ్రీడించు సోల్లాసియై
లీలానాటకసూత్రధారి యయి, సొలిం దీనులం బ్రోవనై
జాలిం బొందును; రోగికేకద చికిత్సాకృత్య మర్థింబగున్

ఉ. ముక్తుఁడు భక్తియుక్తుఁ డయి, మూలమునంపల ధర్మమర్మముల్
రక్తిగ నెంచుఁ గాని, యనురాగపరాగములందు నెన్నఁడా
సక్తుఁడు కాఁడు; దైవికవిచారము భారము లెప్వ యుండ; వు
ద్రిక్తుఁడు కాఁడు,స్వార్థము స్మరింపఁడు, పెంపఁడు కర్మశేషమున్.

మ. మణి చేఁ జిక్కినవాఁడు, లోష్ఠముల సమ్మానించునా ? రమ్యకాం
చనదివ్యాంబరధారి గోచులను దాచం జూచునా ? స్వర్ణదీ
వనసుస్నాతుఁడు దుష్టసేచనవిధు ల్పాటించునా ? యున్నతా
సనసంప్రాప్తుఁ డధోవిధానమున కాసం జెందునా ! యెన్నఁడున్

గీ. వాసనాధిక్య మైనదుర్వాసువితతి
నగ్నితప్తము గావించినంతఁ గాని
కంపు మొదలంటఁ దీరదు గానఁ జెలుల
తృష్ణఁ బోకార్ప నగ్నిపరీక్ష యయ్యె;

వ. ఇట్లు పరీక్షించి సంతృప్తుండై హరి చెలువలకు వలువ లొసంగునప్పుడు

సీ. మునివ్రేళ్ళపై నానుకొని నిక్కి చేయెత్తి
తనుచీర గైకొనఁ దలఁచువారు
పాటుదప్పినఁ దూలపడి లేచి లంఘించి
పట్టుకొనఁ బ్రయత్నపడెడువార
లంది, యందనిచీరయంచును గొనవ్రేళ్ళ
సరికించుకొని లాగ నెంచువారు
పార్శ్వసంగతలైనవారిపైఁ గేఁగాని
యెగసి కోకను బట్ట నెంచువారు

తే. పొడుగువారిచేసాయముఁ బొంది యెట్లో
పుట్టముం గొనఁ దలపెట్టు పొట్టివారు
నయ్యొ సురపొన్న చెట్టు నయ్యతివ లెల్ల
చుట్టి ముట్టాడుచున్నారు పుట్టములకు.

సీ. ఆడ నాది, నా దదే యని యొక్కచీరకై
యతివ లిర్వురు వాదు లాడుకొనుచు;
నాదైన, నీదైన నేది చిక్కుకదా
యీనాఁటిమనగతి యింతె యనుచు;
అల్లదే కృష్ణయ్య యన్నికోకలఁ జేతఁ
బట్టెను జే జిక్కు బెట్టు లనుచు;
నాటలాడించి మిథ్యానాటకము సొంపు
గాంచుచున్నాఁ డహో కాని దనుచు;

తే. వేడికన్నీరు కొనగోట విసరువారు,
నులికిపడుచును నెల్లదిక్కు లునరయుచు
నుస్సురనుచును నిట్టూర్పు లూర్చువారు;
నైరి గోపిక లపుడు లజ్జార్త లగుచు.

సీ. అందనేయందనిఁ డందెనా కొస, లది
గమనించి పైకిఁ బుట్టములు లాగు;
నిస్పృహఁ జెంది యత్నింపరా కాంతలు
తలపైనఁ బడఁగ వల్వలను దిగుచుఁ

బలుకరా భామలు, పకపక నవ్వుచు,
వలదె చీర లటంచుఁ బలుకరించు
పైసిమాలినదిగంబరులె పో పొండని
చప్పట్లు చఱచి హాస్యములు పలుకు;

తే. మీఁకె కాఁబట్టుచున్నచో మాక యనుచు
మూఱిబిఱుపు రసాభాసముల వచించు
కొంటెగోపాలుఁ డవ్వేళఁ గోడిగముల
గురిసె యిబ్బంగి నలయించె గోపికలను.

క. జలజాతాయతనేత్రా!
లలితోత్పలనీలగాత్ర! లాలితమిత్రా!
కలుషాటవీపవిత్రా!
విలసితకమలాకళత్ర! విశ్వపవిత్రా!

క. శ్రీవత్సలాంఛనుండును
ప్రాకృతపీతాంబరుండు, ప్రవిమలకీర్తి
శ్రీవిస్తరుండు, లక్ష్మీ
సేవాలోలుఁడు, దివ్యసేవ్యుఁ డటంచున్.

క. పరిపరివిధముల శ్రీహరి
వరనామోచ్చారణానుభావము లొప్పం
బరఁగిరి గోపికలెల్లరు
హరివేణువుఁ జేతఁబట్టె; హర్షముతోడన్

చ. అణువులకోలె నీయుదరమందుఁ జతుర్దశలోకముల్ సదా
యణఁగు; విరాట్స్వరూపుఁడవునై నినుఁ గోరి భజింపనేర్చునం
తనె, మహనీయమూర్తులకు దర్శనమిత్తువు రాగసంయుతుల్
కనుఁగొనలేరు నీమహిమ; కారణకారణ! లోకమోహనా!

సీ. రాజితకోటీరరమ్యమణిప్రభా
లసితసమున్నమహాఫాలమ్మువాఁడు,
సన్మణికుండలచ్ఛవివిలాసాకీర్ణ
రమణీయవరకపోలములవాఁడు;

మణితులసీవనమాలావిలోలమై
డంబైనకంబుకంఠంబువాఁడు;
శ్రీవత్సకౌస్తుభశ్రీరమాశోభిత
సహజవిశాలవక్షమ్మువాఁడు;

తే. భర్మకేయూరమండనప్రజ్వలితరు
చిరచతుర్భుజుఁడు; వరమంజీరచరణుఁ
డంబుజాక్షుఁ డొప్పె నధరాగ్రమందు
వేణుదండము కెంగేల వెలయుచుండ.

క. ఆజానుచతుర్బాహుని
శ్రీజానిచిత్తచోరు, శ్రితమందారున్
రాజీవదివ్యలోచను
నోజం బూజించి రప్పు డువిదలు ప్రీతిన్

సీ. రతిరాజసుందరా! శ్రితజనమందార
వరకంబుకంధరా! శరణు! శరణు!
శ్రీరమాహృచ్చోర! స్నిగ్ధనీలశరీర!
దీనజనోద్ధార! తేనమోస్తు!
అఖిలలోకాధార! యంబుధిగంభీర!
వరకాంచనాంబరా! వందనంబు;
లోకశుభంకరా! లోలముక్తాహార!
నవమన్మదాధాకార! నతులు; నీకు

తే. విశ్వసంచార మేరుగంభీర! ధీర!
యఘవిదూర! గోపాలలీలావతార!
యఖిలదానవలోకసంహార! శూర!
మానిమానసపసంచార! తే నమోస్తు.

వ. అని గోపికలు కీర్తించిరంత

ఉ. జారుఁడు కాఁడు వీఁడు, సువిచారుఁడు; ధీరుఁడు; లోకమోహనా
కారుఁడు; మేరుధీరుఁడు, వికారవిదూరుఁడు, దీనభక్తపం

దారుఁడు; శ్రీరమాహృదయసుధామవిహారుఁడు; మానిచిత్తసం
చారుఁ డటంచు గోపికలు సన్నుతిఁ జేసిరి కృష్ణదేవునిన్

సీ. కనుసన్నఁ జేసి రంగారుసింగారముల్
చిలుకుచు దరిఁ జేరఁ బిలుచునొకతె
బంతు లాడింతురా! బాలకృష్ణా! యని
పిలిచి యొయ్యారము గులుకునొకతె
తలఁపులలోఁ దీపి పులక లెత్తింపఁ దోఁగి
యధరసుధారసం బాను నొకతె;
శృంగారరసము ద్రావింతు రారా యని
చిలిపిచూపుల ముద్దు లొలుకు నొకతె;

తే. హృదయ మిది నీది; నీసొమ్ము లేలనాకు
తీసికొని పొమ్మనుచు మూతి ద్రిప్పు నొకతె
యిట్లు నానావిధాల మన్నించి మించి
వేడ్కఁ జెల్లించుచుండి రా నెలఁతు లెల్ల.

గీ. భక్తివైరాగ్యశృంగారభావనములు
ముప్పిరిగొనంగ నెలఁతలు ముద్దుకృష్ణుఁ
బూజఁ జేసి విరాడ్రూపమును నుతించి
తలఁపులు ఫలింప వినతులు సలిపి రంత.

ఉ. నింగి విమానపంక్తివయి, నిల్చి నిలింపులు ముద్దు ముద్దుగా
మంగళవాద్యముల్సలిపి మార్దళముఖ్యనినాదమేర్పడన్
బంగరుపూలవాన హరిపైఁ గురియించుచు వేడ్కఁ జేసి యు
ప్పొంగి, త్రివిష్టపస్థలికిఁ బోయిరి; శ్రీహరి చేరెనింటికిన్.

—* ఋషిపత్నులు శ్రీకృష్ణు నర్చించుట *—

వ. ఇట్లు గోపకన్యకల ననుగ్రహించి జగద్వల్లభుం డగు రమావల్లభుండు చెలికాండ్రం గలసి యమునాతీరంబున గోగణంబుఁ బరిరక్షించుచు నుండునంత క్షుత్పీడితు లై యలసిన బాలురు హరిం గాంచి

శా. అన్నా! నేఁ డిది యేమిచిత్రమొ! యవార్యంబై నతీవ్రబాధ మ
మ్మున్నొప్పించెడిఁ దావజాలము గృహమ్ముల్ సేరునందాఁక నే
తెన్నెన్నం బరికించి యిప్పటిమహోర్మి దీప్ర నూహింపుమీ
పున్నెంబా నిఁక నాలసించినఁ జనుంబో ప్రాణముల్ మింటికిన్.

తే. అనుచు దీనులై నెచ్చెలు లాడుమాట
లాలకించిన నందగోపాలకుండు
మందహాసరోచులు మోము నందగింపఁ
బలికె నిట్టుల గోపాలకులను గాంచి.

ఆ.వె. ఒక్కపాండవుఁడె వృకోదరుం డనుకొంటి
నతని కిపుడు తమ్ములైతి లీర
లెంతొతడవు గడచెనే? మీరు చల్దులు
గుడిచి; యింతయార్తిఁ బడుట కకట.

ఉ. వినను నేమి కావలయు నాఁకటిచిచ్చటు పెల్లు మీఱుచోఁ
బూని యెటో వెతం దొలఁచుపొంతకుఁ బోవలె నల్లదే మునుల్
మానుగ యజ్ఞదీక్ష నవలంబము సేసి వసించుతావు త
న్మానికులంబుఁ గోరికొనినన్ భుజియింపఁగ నిత్తు రన్నముల్.

క. సందేహమ్ము లుడిగి ముని
సందోహము నాశ్రయింపఁజనుఁడీ కొనుఁడీ
విందుల్ నాకన్నులకున్
విందుగ మఱి మఱలి రండు వేగమె పొండీ.

వ. అని మానిజనంబు ననుగ్రహింపఁగోరి వెన్నుం డానతిచ్చుటయు వ్రజబాలకులు ససంభ్రమంబుగా యజ్ఞవాటికకుం జని యచటి ఋషులకు సవినయంబుగా నిట్లనిరి.

ఉ. వందన మయ్యలార వ్రజబాలుర మే మిట కింతదవ్వుగా
మందలఁ గాచుచుందుదుము మా కిపు డుగ్రముగా క్షుధార్తి ప్ర
బ్బెం దడవైన మృత్యువు ఘటిల్లునటుల్ గనిపించు సానుకం
పం దగఁ బెట్టెదన్న మిడి ప్రాణము లింతట నిల్పఁబెట్టరే.

తే. అనుడు మునివరు లాగార యజ్ఞకులకు
సవన మియ్యది యాతహాస్యముగఁ దోఁచె
నే? మఖము ముగియకపూర్వ మెట్లు? మీాకు
వచ్చు నన్నము పొం డింకఁ బలుకు లుడిగి.

వ. అనవుడు గోపాలబాలురు ద్విగుణీకృతవినయు లై వెండియు ని ట్లనిరి

శా. లీలామానుషవిగ్రహుండు హరి పాలించున్ మమున్ బాలగో
పాలుం డై నిఖిలార్థవేదులకు తద్వైశిష్ట్యమున్ మీామదిం
బోలం జూడ నెఱుంగ రే యతఁడె మమ్ముం బంపె మీాచెంత క
య్యా! లేదం చనఁబోక నిల్వఁజనరయ్యా పోవ నా ప్రాణముల్.

చ. అనవుడుఁ దాపసుల్ కుపితు లై వ్రజబాలురఁ గాంచి కేవల
మ్మను హరి మిమ్ముఁ బ్రోచుటకుఁ బూని గ్రహింపఁగ మమ్ముఁబోంట్లని
యనువున వేడ నేల? భువనైకవిభుం డతఁ డేల బ్రోవకుం
డునో చని వేఁడుఁ డాతని మనుష్యుల నేమిటి కాశ్రయింపఁగన్.

తే. అనుటయు న్వాని విగతాసు లగుచు బాలు
రెల్ల హరిఁ జేరఁబోయి మునీంద్రు లన్న
పలుకు లెల్లను వినిపింప మెలమెల నగ
వాలయ వారికిట్లనెఁ బురుషోత్తముండు.

చ. వలదు నిరాశ యింతటనె బాలకులార మఱొక్కమాఱు మీా
ర లటకు నేఁగి నేర్పు లమరన్ మునిపత్నులఁ గాంచి వెన్నుఁ డాఁ
కలిగొని యున్నవాఁ డనుఁడు కర్జ మ దంతియు దాసితోడ వా
రల చనుదెంచి మోద మలరన్ మన కిందున విందు సేయరే.

వ. అనిన నప్పలుకులం గాదనం జాలక గోపబాలురు మునిపత్నుల సందర్శించి

తే. జననులార! నీరజాతేక్షణుండు యశో
దాకుమారుఁ డిచట నాఁకటఁబడి
యంపినాఁడు మమ్ము నమచిత్తల మిమ్ముఁ
గాంచి యిట్లు తెల్పఁ గడఁగుఁ డనుచు.

క. అని విని మునికాంతలు ను
న్ననె యడిగెనె మాధవుఁడు పుణ్యం బేమో
చనుఁ డింక మేము యటకుం
జనుదెంతుము స్వామిపూజ సలుపుటకొఱకున్.

తే. అనుచు గోపాలకుల నంపి యఖిలభోజ్య
వితతి పళ్లెములయందుఁ బెట్టి యల్ల
తాపసాంగన లఖిలసంతాపహారుని
జరగ తాపంబు మాన్పఁగాఁ జనుట లెసి

శా॥ చాలుం జాలును గొల్లవాఁ డొకఁడు పూజ్యస్థాన మం చెంచి యీ
లీలన్ దేవనివేద్యవస్తువుల నోలిం గొంచుఁ బోఁ జెల్లునే
యీతాల్మిం బని యెట్టులం గలిగె మీ కింద్రుండుఁ జంద్రుడుంగాఁ
బోలం దోఁచెనె వాఁడు మీకుజతనమ్ముల్ మానుఁ డింకేనియున్.

వ. అని పురుషులు తమ్ము వారించుచున్నను దమయత్నంబు విడువక మునికాంతలు కృష్ణలగ్నమానసలై చనియప్పురాణపురుషుసందర్శించి వినయవినమితోత్తమాంగలై నిలిచినఁ గని యమ్మహానీయుండు వారల భక్తి మెచ్చి వారితెచ్చిన యన్నంబులు మిత్రకోటియుందాను నారగించి మునిసతులం జూచి మీరలు మాయెడం బ్రకటించిన బంధుభావంబునకు సంతసించితి మీకెల్ల శుభంబులు గలుగు నింక మీ గృహంబులకుం జనుఁ డనిన నన్నెలంత లతని విలోకించి

క. ఎక్కడిగృహ మింక నీ వెక
సక్కెము లాడెదవె మమ్ము జగదీశ్వర! మే
మిక్కడకుఁ దఱలినపు డ
మ్మక్క పతుల్ మమ్ము విడిచి రది యెఱుఁగవొకో!

తే. భవసముద్రంబునందు నూర్పు విడ నేని
యదను చిక్కక తపియింతు మయ్య యింత
కాల మింకను నాజోలి యేల మాకు
స్వామి సంసారతరణసౌభాగ్య మిమ్ము.

వ. అని వేడుకొనువారలం గని నందనందనుండు

శా. రామారత్నములార! మీమనము లశ్రాంతంబు మోక్షంబునే
యామోదించుట నే నెఱుంగుదును మీ రగ్గల్ సుఁడీ దాని కే
నీమాడ్కిన్ ఘటియింతు మీపురుషు లీదృక్సంగతిన్ జ్ఞాను లై
ప్రేమింపంగలవారు మి మ్మనల నర్థిన్ దీర్తు మీ కోర్కెయున్.

వ. అని సెల విచ్చి యంపిన నమ్మునిసతులు నిజనివాసంబుల కేగినం
గని తాపసులు వారలం గోపింపక తము యవివేకంబునకు లజ్జించుచుఁ

ఉ. ఎవ్వఁడు యజ్ఞమూర్తియగు నెవ్వనియర్చనఁజేసి మోదముల్
నివ్వటిలున్ జగత్త్రయికి నీరజనాభుఁ డతండె వచ్చినం
గవ్వకునైనఁ గైకొనము జ్ఞానుల మేమని యెంతయేనియుం
గ్రొవ్వితి మిట్టు లంగనలకున్ సరిగామగదా! మహర్షులై.

వ. అని పశ్చాత్తప్తులై రంత నట గోకులంబున;

—* శ్రీ గోవర్ధన పర్వతోద్ధరణము *—

గీ. ఇంద్రయాగ మొనర్చెదునిచ్ఛఁ జేసి
నందగోపాదు లెల్ల రానందమునను
యత్నము లొనర్చుచుండఁ గృష్ణార్భకుండు
గాంచి తనతండ్రిఁ జూచి ప్రశ్నించె నిట్లు.

ఉ. ఇంతటితీవ్రయత్నముల నేటి కొనర్చెదరయ్య? తీరికా
వంతయుఁ గానరాదు; క్రతువా, వ్రతమా? యిది యేమి? యేఫల
భ్రాంతి వహించి చేసెదరు? పాలకుఁ డెవ్వఁడు? కామితార్థము
ల్గాంతుర? సాంప్రదాయికముగా నొనరింతుర? తెల్పవే దయన్.

చ. అన విని నందగోపవిభుఁ డానుడు లన్నియుఁ జాపలంబుచే
ననెడు నటంచు భ్రాంతియుతుఁ డై మఱుమాట వచింపకున్నఁ గ
న్గొని, హరి కృష్ణుఁ డిట్లనియె; గోపకు లెల్లరు నేకదీక్షతోఁ
బనులొనరించుచుండ, నిఁక బాలుర మేము నెఱుంగరాదొకో?

గీ. శత్రుమిత్రత్వములు లేని సజ్జనుఁడవు
స్వపరభేదము లెంచని సాధుమూర్తి
వీవు; తండ్రీ! యుదాసీనుఁడేల యగాదు
నెఱుఁగఁ జెప్పకపోదు వి దేమి యనుడు.

మ. ప్రతిసంవత్సర మింద్రయాగమనుపేరం జేయుచున్నార; మీ
క్రతు వాభీరకులస్థులెల్లరకుఁ బూర్వాచారవృత్తంబు; దై
వత మింద్రుండు; సకాల వర్షవసతిన్ వాంఛించి, మేఘాధిపుం
డతఁ డైయుంటను గొల్చుచుంటి మిదియే యావద్విశేషం బగున్.

గీ. అతఁడు కరుణాసముద్రుఁడై యనుపుచుండు
కతనె సస్యానుకూలసకాలవర్ష
ములఁ గురిసి మేఘపంక్తి గోకులము నెల్లఁ
గడుసుభిక్షమొనర్చెడు కన్నతండ్రి.

గీ. నిగ్రహానుగ్రహసమగ్రనియతుఁ డౌచు
నెవఁడు మేఘోదకములచే నెల్లసస్య
ములను బండించు నాపంటవలన వాని
దొలుతఁ బూజింతు మిది మనకులమురీతి.

కం. అని నందుఁడు వచియించిన
విని చిఱునవ్వాననమున వెలయఁగఁ గృష్ణుం
డనె గోపాలకు లెల్లరు
వినఁగా గంభీరవాక్య విస్ఫురణమునన్.

సీ. కర్మముచేతనే గలిగెడు సుఖదుఃఖ
భయశుభానంద సంభావితములు
పూర్వకృతవిశేష పుణ్యపాపములచే
నుచ్చనీచస్థితు లొనరుచుండు
నెవ్వఁడేకర్మము నెట్లాచరించునో
తత్తత్ఫలంబులే తారసిల్లు
నాత్తఫలంబవశ్యానుభోక్తవ్యము
తప్పఁబోవదు తీర్పఁ దరము కాదు

తే. పూర్వసంచితఫలము లీ పుట్టువందు
నిప్పటివి భావిజన్మమం దెసఁగుచుండు
కర్మఫలదాత యీశుఁడు గాక యెవఁడు
కర్త యగు నీప్సితార్థము లొలుగఁజేయ.

గీ పూర్వ కర్మానుసరణ మై బుద్ధి పుట్టు
బుద్ధిపరమాత్మచ్ఛాయ యై పొసఁగుఁ గాన
నందు నుత్పన్నమైన యూహాదికములు
మార్గదర్శకములు సూవె మనుజులకును.

ఉ. జీవులు పూర్వకర్మఫలశేషముచేతనె కర్మభూమియం
దీవిధిఁ బుట్టు వందుటలు నెవ్వని కెప్పటి క్షేత్రదేశముం
దేవిధమైన ప్రాప్తి ఘటియింపఁగనున్నదో యట్టివాని నా
త్రోవను లాగి భోగ్యవసతు ల్విధియించును భాగధేయముల్.

మ. ఘనగోబ్రాహ్మణపర్వతప్రియముగాఁ గావించు యాగంబె స
జ్జనమాన్యం బగు గోపజాతులకు వాంఛాసిద్ధి యద్దాననే
యొనఁగూడున్ బ్రియమార నెల్లరును నుద్యోగించి యీయింద్రయా
గనిమిత్తంబుగఁ జేయువస్తువులతోఁ గావింపుఁ డాయజ్ఞమున్.

గీ. తనస్వకర్మంబునే దిద్దుకొనక యెప్పు
డసురపీడితుఁ డౌనింద్రుఁడా ప్రపంచ
కర్మసంచితములఁ బాపఁ గలుగువాఁడు
గ్రుడ్డివాఁ డెట్లు గ్రుడ్డికిఁ ద్రోవఁ జూపు?

గీ. జలదములు రజోగుణముచేఁ గలిగినయవి
దేశ మెల్లెడ వర్షించితీరవలయుఁ
దజ్జలంబులచేతనే దైవసృష్టి
నిలుచు నింద్రునిపని యేమి కలుగు నిందు?

ఉ. కాన మహేంద్రయాగమును గ్రమ్మరఁ జేసియు మీరలిందఱున్
గో నగ, భూసుర ప్రియము గొల్పు క్రతూత్తమ మాచరింపఁగాఁ
బూనుఁడు భుక్తిముక్తిదముఁ బుణ్యవివర్ధనకృత్య మాటచే
నేనును సమ్మతింతు నని నిశ్చలుఁడై హరి కృష్ణుఁ డాడుచున్.

క. నా యాదేశవిధానము
న్యాయం బని తోఁచునెడల నయ్యైవిధులం
దీయద్రిరాజపూజం
జేయుఁడు సంకల్పసిద్ధిఁ జెందుఁడు మీరల్.

సీ. పాయసాపూప భోజన భాజనములు
భక్తితో సమర్పింపుఁడీ బ్రాహ్మణులకు
ధేనువుల నెల్లఁ గైసేసి తృణము లొసఁగి
పూజ గావించి తనుపుఁడీ పుణ్యులార!

క. గోధనగనపోషణను
గోవులకును మనకుఁ గూడఁ గులవర్ధనమౌ
గావున నందఱ మిటకే
పోవుద మర్పించి సుఖముఁ బొందుద మన్నన్.

క. నందాదులు విని బ్రహ్మా
నందము దళుకొత్త బాలనాయకునాజ్ఞల్
పొందగు నని తలఁ దాల్చిరి
యందఱు గిరిపూజ సేయ హర్షముతోడన్.

సీ. గో, విప్ర, కుధరపూజావిధానములకు
వలయుసామగ్రులు పదిలపరచి
యాబాలగోపాల మాభీరకులజులు
సుస్నాతులై పరిశుభ్రవసన
ములఁ గట్టి యుచితరీతుల నలంకరణము
లొనరించుకొని భక్తియుక్తు లౌచు
శకటములం గట్టి సర్వసామగ్రుల
నందుంచి వివిధవాద్యములు మ్రోయ

తే. బ్రాహ్మణాశీస్సులను బొంది వారిగూడి
సంభ్రమమ్మునఁ బయనము ల్సల్పి సల్పి
యమలయమునానదీతీరమందు వెలయు
నట్టిగోవర్ధనాద్రికి నరిగి రెల్ల

ఆ.వె. బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణోత్తము లెల్ల
రగ్నులందు హోమ మాచరింపఁ
జెలఁగి గొల్లవారు జేజేరవంబుల
నుచితపూజనంబు లొనరఁజేసి.

గీ. మందలను వెంటఁ దోలుచు మందగతుల
సాగి ప్రీతిని సర్వు లానందవశత లై
దనర గోవర్ధనగిరి ప్రదక్షిణంబుఁ
జేయుచుండిరి హరియాజ్ఞఁ జెంది వారు.

చ. తొలుత ధరామరోత్తములఁ దోఁపుభక్తిని బూజఁ జేసి ని
స్తులరుచిరాన్నభోజ్యవసతు ల్లలిగించి నమస్కరించి ని
ర్మలు లయి భూరిదానములు మన్నన నిచ్చి ప్రదక్షిణాదికం
బులు నెరవేర్చి దీవెనలఁ బొంది సుఖించిరి గొల్ల లెల్లరున్.

చ. అనయము గోగణంబుల సముంచితరీతి నలంకరించియున్
దృణములు లేఁతపచ్చికలు తీయనిభక్ష్యము లన్నరాశి యిం
పొనరఁగ నారగించుటను నుంచి సముక్తపరిష్క్రియాది పూ
జనవిధు లెల్ల శాస్త్రవిధిఁ జల్పిరి యాదవు లెల్ల రుబ్బుచున్

గీ. అంతఁ గల్పోక్తవిధిగ బ్రాహ్మణులవలనఁ
బర్వతమునకుఁ బుణ్యాహవాచనములుఁ
జేసి శాస్త్రీయకుంభముం బోసి వివిధ
విధులఁ బూజ లొనర్చి రాభీరకులులు.

ఉ. పిమ్మట బంధుమిత్రులును బ్రేమ దలిర్పఁగ బంతిదీర్పఁగాఁ
గమ్మనివిందుభోజనముఁ గాంచియు ముచ్చట దీర సర్వభూ
తమ్ములుఁ దృప్తిపొందునటు తద్రుచిరాన్న సుభక్ష్య శేషము
ల్సమ్మతి నంది వడ్డనలు సల్పిరి యాదవు లుల్లసిల్లుచున్.

సీ. నందాదిగోపాలబృందము శ్రీహరి
కీర్తన ల్పాడుచుఁ గేలు మోడ్చి
గోపికాయువతులు కూడి కృష్ణకుమారు
బాలచేష్టితములఁ బాడుకొనుచు
బాలబాలికలు సొంపార వేణునినాద
ములు సెలంగ వినోదకలితు లగుచు
బ్రాహ్మణోత్తములు సంభావితులై వేద
పారాయణమ్ములఁ బ్రముదితులుగ

తే. మందలను వెంటఁ దోలుచు మందగతుల
సర్వు లానందవివశులై సాగి ప్రీతి
దనర గోవర్ధనగిరిప్రదక్షిణంబుఁ
జేయుచుండిరి హరియాజ్ఞఁ జెంది వారు.

మ. హరి కృష్ణుండు గిరీంద్రరూపధరుఁడై యాసంభరాశ్యన్న మ
త్తతి భక్షించియు నేనెపర్వతుఁడ భక్తత్రాణపారీణుఁడన్
బరమోత్సాహముతోడఁ గూడి నగగోబ్రాహ్మణ్య సంతృప్తి కె
ల్లరు గావించు క్రతూత్తమంబు కడునాహ్లాదంబు మాకయ్యెడిన్.

వ. అని వచించె నంత

క. కరచరణాద్యవయవములు
పొరసినగిరిరూపధరునిఁ         మునిన్
హరిఁ గృష్ణుఁ గాంచి సర్వులుఁ
బరమానందమున మ్రొక్కి పలికిరి ప్రీతిన్.

క. పర్వతపురుషుఁడు లోచన
పర్వముగాఁ గానుపించెఁ బసులను మనలన్
సర్వత్ర కాఁచి ప్రోచెడు
నిర్వక్రమవిక్రముండు నియతుఁ డటంచున్.

ఉ. అందఱు సాగిలంబడి కృతాంజలులై మనసార మ్రొక్కి స్ర
క్చందన దక్షిణాదు లిడి స్వామి త్వదీయుల మేము మమ్ము మా
మందల విప్రవర్యుల సమస్తజగంబుల సర్వదేవతా
బృందముఁ బ్రోచి రక్షణ వహింపుము పెంపుము పర్వతప్రభూ.

సీ. భూమి యంతయు సస్యసంపూర్ణమయి స
కాలవర్షము లుఱియంగఁ గఱవుఁగాట
కములు లేక సుభిక్షమై కాల మొప్పు
నట్టు లాశీర్వదింపు మో యద్రిరాజ.

సీ. ఇంద్రయాగమునకు సేకరించినట్టి
వస్తుసామగ్రులను నిట్లు వ్యయ మొనర్చి

పర్వతక్రతువును జేసి గర్వపడెను
గొల్లలం గని సురపతి కుపితుఁ డౌచు.

శా. ఏటేటన్ బొనరించుయాగమును నేఁ డీకృష్ణపౌగండుఁ డు
ద్ఘాటించెన్ వ్రజవాసు లెల్లరు గడుం గర్వోన్నతిం బొంది నా
మాటే యెంచరు కాని చూతు నిఁక నీమాయార్భకుం డెట్లు నా
యాటోపంబు సహించునో యనుచు నాకాధీశుఁ డుద్వేగియై.

గీ. ప్రళయకాలమునందు బ్రపంచభాగ
మెల్ల నేకార్ణవ మొనర్చి యెసఁగుచుండు
నట్టి సంవర్తకగణమేఘాధికములఁ
బిలిచి యింద్రుఁడు కుపితుఁడై పలికె నిట్లు.

ఉ. కంటిరె! బాలకృష్ణుఁ డిటు కాని పను లాచరించుచుండె నా
తుంటరిమాట నమ్మి పెడత్రోవలు బట్టిరి గొల్లవారు నా
వంటిబలాఢ్యునిం ద్రిదశవంద్యునిఁ బూజ్యుని నోహటించి యీ
కొంటెకులాలు ప్రాముకొను కోరిక లేమియొ నేను జూచెదన్.

క. కృష్ణుఁడు మానవమాత్రుఁడు
జిష్ణుఁడను నేను నాకుఁ జేసెడు క్రతువా
కృష్ణ ప్రియముగఁ జేసిరి
వృష్ణికులోద్భవులు వారిపిక్యముఁ గందున్.

శా. ఐనం జూచెద మీరు పోయి యిపుడే యాగోకులం బందు మీ
మీనైపుణ్యము లొప్పునట్టుల శిలామిశ్రంబుగా దంతి హ
స్తానితంబుగ వర్షధారలను భూమ్యాకాశము ల్మట్టుచం
దానన్ ముంచుఁడు బృందభూమి నని యుద్దామంబుగాఁ బల్కుచున్

శా. మాయాజ్ఞ ల్శిరసావహింపక పృథఙ్మార్గం బపేక్షింతురా
మీయౌన్నత్యము లాఱిపోవును జుఁడీ మీవెంటనే నేనునున్
నాయైరావత మెక్కి వత్తు నని యాజ్ఞ ల్వెట్టి సోత్కర్షుఁడై
మాయాతీతుమహత్త్వముం గనక దౌర్మార్గ్యంబుగా నింద్రుఁ డున్.

మ. తనయైరావత మెక్కి వజ్రమును జేతం బట్టి ధాత్రీధరం
బును ఖండించెడు నాఁటియత్నములకుం బోలెనో బంధోద్యోగి యై
ఘనసంవర్తక మేఘసంఘములు నుగ్రత్వంబునన్ వెంటనే
చని బృందావనభూమిపైఁ జదల నిస్తంద్రంబుగాఁ గూడియున్.

మ. పగలే చీఁకటు లావరించె దిశలన్ బ్రహ్మాండభాండంబులా
బగులం గొట్టెడు మేఘఘర్జితము లుత్పన్నంబులయ్యెం ధగ
ద్ధగితాక్రాంతనుకీచికాగణము ప్రత్యక్షంబుగా ధారుణీ
గగనంబు ల్ముడివెట్టె ధార లొలికెన్ గాలాతివేలంబుగన్.

క. మిడిమేలపువాన యిదె
క్కడిదో యిటు లూడిపడెడుఁ గాని మును పె
న్నఁడు విని కని యెఱుఁగ మటం
చడలుచు గోపాలు రెల్ల రార్తి మునుఁగుచున్.

చ. బెదరినగోగణంబులను బిట్టుగ నార్చుచుఁ బట్టితెచ్చుచున్
బసుగురుఁ జెట్టుగుట్టలకుఁ బాఱి వరాంగము లొప్ప దాఁచుచున్
జిదిమెడు మంచుగడ్డలకుఁ జిందఱవందఱ నంది కుందుచున్
హృదయవిదారకం బయిన నేడ్చిరి గోపకులెల్ల నార్తులై.

చ. కనుఁగొని కృష్ణదేవుఁ డిది క్రూరుఁడైన మహేంద్రుకృత్యమౌ
నని మది నిర్ణయించుకొని యాతని పొగర మార్చునట్టి చో
ప్పుచు వ్రజవాసు లెల్ల సిగపూవులు వాడకయుండురీతిగా
మనుచుట నుత్తమం బయినమార్గముగాఁ దలపోసి యుగ్రుఁడై.

క: చని గోవర్ధనపర్వత
మును జేతులఁ బెఱికి లేపి మొగిఁ జిత్రవిధం
బున నిల్పి గోపజాతిని
మనుపం దలపోసె శక్తిమంతుఁడు వేగన్.

ఉ. చూపుఁడువ్రేలితో నగముఁ జొక్కముగాఁ బయి కెత్తి నిల్పి యో
గోపకులార! చూడుఁ డిదిగో నగరాజము మిమ్ముఁ బ్రోచు హృ
త్తాపము లాఱి మందలును దారును నీగిరిక్రింద హాయిగాఁ
గాపుర ముండఁబోలు భయకారణ మేమియు లేదు మీ కిటన్.

ఉ. ఈ పసిపాప యేమి భరియించుట యేమి నగం బటంచు నుం
జాపలను న్వహింపకుండు సాగరప్వాత కాననాపగా
వ్యాపక మా చరాచరధరావరణం బది పైని వ్రాలినం
జూపుడు వ్రేలు వ్రాల దొకసుంతయు భీతిం దలంగి నిల్వుడీ!

కం. శ్రీవరుం డివ్విధిం బల్కిన
గోవర్ధననగముద్ధరింప గోపాలకులున్
గోవులు గోపిక లెల్లరు
భావము లోకింత డిటవుపడి నిశ్చయులై

చ. హరికరుణావిశేషమున నాగిరిగర్భమునందు నీరము
లోనరకయు శీతవాతములసోకుడు లేకయు వర్షబాధయే
యెఱుగక గోపగోపికలు నెల్లరు మందలతోడ హాయిగా
జరిపిరి సప్తవాసరము సౌధములో నసియించుకీతిగన్.

గీ. క్రతువునకు దెచ్చుకొనుపదార్థములయందు
మిగిలినవి వాడుకొనుచు రేంబవళు లందు
భజనలొనరించుచును గోపవారమెల్ల
నెడతెఱపి లేనిజడివాన గడపి రిటుల.

క. శ్రీవత్సాంకితవక్షా!
సేవితసురపక్షా! దుష్టశిక్షణదక్షా!
భావోన్మాదవిపక్షా!
గోవర్ధనకలిత సకలకువలయరక్షా!

క. జయ జయ లక్ష్మీకృష్ణా!
జయ జయ గోపాలకృష్ణ! జయ శ్రీకృష్ణా!
జయ కృష్ణా! హరి కృష్ణా!
జయ గోవర్ధనగిరీంద్రసంయుతకృష్ణా!

గీ. ఆత్మవిజ్ఞానదీపిక లహరహంబు
దనరునటుభక్త్యవిచ్ఛిన్నతైలధార
లొలుకుచుం గోపగోపికాదు లిటు మెచ్చి
హరి కృపాపాత్రులై గొల్ల లతిశయిల్లి.

వ. అంతట గగనంబుననుండి సురలతో గోపకులయుల్లాసంబు వీక్షించుచు

మ. తలలోఁ బూవులు నైన వాడ వొకనిం దండింపఁగాలేరు ని
శ్చలభావంబున నేనొనర్చినపనుల్ సారంబులా కావు గో
కులమం దీహరి పుట్టి కృష్ణుఁ డనగా గోపగనోద్ధర్త యై
నిలువ న్నాదుప్రతిక్రియ ల్గెలువనౌనే యంచు నింద్రుం డొగిన్.

క. బలవంతునితో వైరము
వలచి వలచి తెచ్చికొంటి వారకపోదీ
ఖలకార్యఫలిత మంచును
దలపోసి చలంబు మాని దైవతరాజున్.

శా. ఓసంవర్తకామేఘమా చనుము నీయుద్యోగము న్మాని, యెం
తోసంరంభము జేసినాఁడ హరి నే యుత్కంపితుం జేయఁగా;
మోసం బెంచితి సత్యవిజ్ఞతను గోల్పోతిన్; రమానాథుఁడే
యీసౌందర్యనిధాన మానసుచు నూహింపం గలా యంచునన్.

ఉ. సిగ్గునఁ బాకశాసనుఁడు శ్రీపతికిం దనమోముఁ జూపఁగా
బెగ్గిలి పాఱిపోయె; తన భీష్మము నూష్మము భస్మమై చనన్
దిగ్గనఁ బాఱు మేఘము లదేగతి పట్టె; విహంగవీథిలో
నిగ్గుగఁ దోఁచె సూర్యుఁ డతినిర్మల మయ్యెను మేఘపంక్తులున్.

మ. కని శ్రీకృష్ణుఁడు పల్కె; సూర్యుఁ డదిగో కన్పించుచున్నాఁడు హె
చ్చిన నీరంబులు తగ్గిపోయినవి; దుశ్చేష్టుండు మార్గోన్మ మగున్
మన కేయడ్డము లేదు; పోద మన సమ్మానించి గోపాలు రొ
క్కనిమేషంబున సిద్ధమై రచట; స్వగ్రామంబునుం జేరఁగన్.

ఉ. అంతటఁ గృష్ణబాలుఁడు నిజాంగుళియందలిపర్వతంబు, ని
శ్చింతగఁ గ్రిందికిం దిగిచి చేర్చె యథాస్థలమందు; నొప్పుగన్
బంతులు దీరి దివ్యులు సెబా సని, దుందుభు లాదితూర్యముల్
వింతగ మ్రోయుచుం జదల వేడుకఁ జేసిరి పూలు చల్లుచున్.

గీ. నిగ్రహానుగ్రహసమర్థ నీలవర్ణు
ప్రాపు గల్గిన గోపాలవార మెల్ల

మండలను దోలుకొనుచు సానందులగుచు
గృహములం జేరఁ బోయిరి కృష్ణుఁగలసి.

సీ. గోవర్ధనోద్ధార! కువలయామృతకరా!
గోపీహృదయచోర! పాపదూర!
గోకులసంచార! గోపాలకిశోర!
నీలజీమూతసన్నిభశరీర!
యాశ్రితమందార! యఘదైత్యసంహార
యఖిలలోకాధార! వికృతిదూర!
యింద్రగర్వవిదార! యిందీవరాకార!
బృందావనవిహార! పృథులశూర!

తే. మారసుకుమార! మేరుగంభీరధీర!
నిర్వికార! నిరంజన! నిగమవినుత!
భవభయవిదూర యిందిరాప్రాణనాధ!
వేణుగోపాలరూపధరా! నమోస్తు.

వ. అని నిర్భరానంద కలితులై కీర్తించుచు

మ. హరినామస్మరణం బొనర్చుచుఁ బ్రమోదాంతర్యులై గోపకు
ల్సరిగా నిండ్లకుఁ జేరి బాలకునవిజ్ఞాతప్రభావంబు వి
స్ఫురితోజస్సుఁ బరాక్రమంబు సమయస్ఫూర్తిప్రయోగంబు నా
చరణప్రాప్తవిధంబు లెంతురు మహాశ్చర్యంబు వాటిల్లఁగన్.

శా. ఏ డేం డ్లైనను లేనిబాలకుఁడు వీఁ డేమీ మహాభారమై
చూడంజాలని యెంచఁగూడని మహాక్షోణీధరంబే మొకో
క్రీడాకందుక మట్లుఁ బుట్టగొడుగున్ గేలించుచందాన నా
రా! డాకేల వహించె బాలకుని కార్యం బౌనె యాశ్చర్యమున్.

గీ. జననమా? ప్రాకృతాభీరసంఘమందు
గడపుపనులా యనన్యదుర్గ్రాహ్యవిధము
లౌర! యశ్రుతపూర్వ మీయద్భుతములు
బాలుఁడో వీఁడు శ్రీరమాలోలుఁ డేమొ.

సీ. కను లైన సరిగ విప్పెనో లేదో యానాఁడె
పూతనపా ల్ద్రావి పుటము వేసె
బూలతో ట్టైను నూఁగుమూఁడుమాసంబుల
వాఁడె బండిని దన్ని పాప మణఁచె
నేడాదివాఁడెగా యెగసి తృణావర్తుఁ
గంఠము నొక్కుచుఁ గసిమసంగె
నఘవత్స బకధేనుకాసురావళి నెల్లఁ
జీల్చి చెండాడి హసించి మించె

తే. కాళియోరగు ఘనఫణాగ్రములయందుఁ
గూడి యానందతాండవ మాడి వెలసె
దావవహ్నిని మ్రింగి సంతాపమార్చె
నారయెటువంటివాఁడో యీ యర్భకుండు.

సీ. లోకంబు లెల్లఁ జీకాకుఁ బెట్టెడునట్టి
యఘదానవునిఁ జంపు టలఁతిపనియె?
చండప్రచండమార్తాండతేజుం డైన
దుష్టప్రలంబుని ద్రుంపనౌనె?
యేకాహుతిగ రేగి లోకము లక్కబళించు
దావవహ్నిని మ్రింగఁదరమె? చెపుమ!
నలువయంతటివాని తలవంచి వెఱపెంచి
భీష్మముం డించుట పిల్లలాటె?

గీ. త్రిజగదధినేత లోకైక ధీవిధాత
దేవతాసార్వభౌముని ధిక్కరించి
పుట్టగొడుగట్లు పర్వతమును ధరించి
మమ్ము గాపాడు టిద్ది సామాన్య మగునె?

చ. ఇతని మహత్త్వ మెన్నుటకు నెవ్వరి కౌ? నొక టేమి యెన్నియో
జతనము లిట్టివే పొసఁగ సాధ్య మసాధ్యము కానరాదు నే
కృతమయిన న్నఖాగ్రమునఁ గేల్పడి యుండినరీతిఁ దోచు న
ద్భుత మిది యెట్టు లేర్పడెనొ పుట్టిననాఁటను గోత్ర మీనికిన్.

క. ప్రాకృతులగు గోపాలురు
శ్రీకృష్ణుని మహిమ లెల్లఁ జెప్పిన నందుం
డాఁకొని నవ్వుచు నిట్లనె
శ్రీకరుఁ డవతారమూర్తి శిశు వితఁ డనుచున్.

మ. మును గర్గుండు వచింపలేదె? హరియే ముమ్మూర్తు లన్నందనం
దనుఁడై గోకులమందుఁ బుట్టె నని యాదామోదరుండే సుఁడీ
ఘనుఁ డీకృష్ణకిశోర మీతనికి దుర్గ్రాహ్యంబులుం జేయఁగా
లని కార్యంబులు లేవు లే వితఁడు లీలాబాలగోపాలుఁ డౌ.

సీ. ఎవ్వాని సేవింప నిందిరాదేవియే
తఱివేచి దరిఁ జేర నరయుచున్నొ
యేమూర్తి దర్శింప నింద్రాది సుర లెల్లఁ
బడిగాపుపడి పంచ విడువలేరొ
యేధన్యుకరుణకై సాధను ల్బలపట్టి
బహుకాలతపమునం బడయుచుండ్రొ
యేదివ్య వర్ణింప నిచ్ఛమై ఫణిరాజు
ఫణసహస్రము వెనుకఁబడుచునున్నొ

తే. యెవని కనుసన్న మాత్రాన నెల్లవారు
బద్ధహస్తములను సిద్ధపడుచునుందు
రట్టిమహనీయమూర్తి దేవాదిదేవుఁ
డాదినారాయణుఁడు కృష్ణుఁ డయ్యలార!

మ. మనప్రాప్తంబున మందలో నొకఁడుగా మాయాకిశోరంబుగా
మననేస్తంబుగ నాప్తబంధువుఁడుగా మన్నించుచున్నాఁడు నా
తని ముద్దాడుచుఁ బ్రేమఁగాంచుచు వినోదప్రౌఢతిం జేయుచున్
గనులారం గనుచుంటి మట్టి మనభాగ్యం బెట్టిదో యెంచుఁడీ.

చ. దినకరతేజుఁ డీఘనుఁడు దేవహితార్థము మానవాకృతిన్
గని మనవంశమండనుఁడు గా రహియించెఁ గుమారకృష్ణుఁడై.
దనుజవిమర్దనుండు తనధర్మము దీర్ప ననేకదుష్టులన్
హననము జేసెఁ జేయు నిఁక నద్భుత మేమియు లే దటంచునున్

ఉ. నామాఁడు తెల్పఁగా విని యనంతుఁడు కృష్ణుఁడు గా నెఱింగి యా
నందముఁ జెంది గోపతతి యాత్మల నాత్మ యతండె యంచు నా
సుందరనందనందనునిఁ జూడఁగ వైష్ణవమాయఁ గప్పియున్
డెందముల న్మఱల్చెఁ దొలి రేవను గొల్పడి గోపబృందముల్.

క. తమపూర్వకృష్ణుఁడే యని
తమకము గొని చెలులు గోపతతి గోపికలున్
క్రమవిధుల న్వర్తించిరి
సుమహితమహిమంబు బుద్ధిఁ జూడనికడఁకన్.

క. గోవర్ధనపర్వతమును
శ్రీవరుఁ డొకపుట్టగొడుగు చెలువున నెత్తన్
దీవర ముడిగినయింద్రుఁడు
దేవుని దర్శింప వచ్చి దీనుండగుచున్

మ. కుమతంబు న్విడి యేకతంబున శిరఃకోటీరరత్నప్రభా
సమకాంతిచ్ఛట లొప్ప పాదములపై సాష్టాంగదండప్రణా
మము లర్పించుచు వ్రాలి వేడుకొనుచున్ మన్నింపు మో దేవదే
వ మహాత్మా హరి కృష్ణ మూర్ఖుఁడను దుర్వాచాలుఁడన్ దీనుఁడన్.

ఉ. నీమహనీయతత్త్వమును నేరక బాలుఁడ వంచు నింతగాఁ
దామస మంది చేసితిని తప్పు గ్రహించి పరాఙ్ముఖుండనై
వ్యోమముఁ జేరఁ బాఱితిని నుల్లము జల్లుమనంగఁ జేరి నీ
కోమలపాదపద్మములు గొల్చితి నన్ను క్షమింప వే యికన్.

శా. నేనే సర్వజగన్నియామకుఁడ నా నిస్తంద్రగర్వంబుతో
జ్ఞానజ్యోతిని గోలుపోవుచుఁ దమస్సంక్రాంతిమై నిట్లు నా
చే నైన నన్నిప్రతిక్రియ ల్సలుప సంసిద్ధుండ నైనాను గో
పానీకంబు చకుం; గ్రతూత్తమము విల్పంజూచి నీచుండ నై.

సీ. సర్వసర్వంసహాచక్రమునకుఁ దండ్రి
వాచార్యుఁడవును నియామకుఁడవు
జ్ఞానోపదేష్టవు సంరక్షకుఁడవు సు
ధీపాలనోద్యోగదీప్తుఁడవును

గర్తవు భర్తవు హర్తవు స్వప్రకా
శస్వరూపుఁడవు విజ్ఞాననిధివి
నిత్యనిర్మలసత్యనిధి నవాఙ్మనస
గోచరుండవు సత్వగుణుఁడ వీవు

గీ. ఆదిమధ్యాంతశూన్యుఁడ వవ్యయుఁడవు
దేవదేవుఁడ వీవు గుర్తింపఁదరమె
నన్నుబోంట్లకు లోకసన్మాన్యచరిత
తప్పు లున్న క్షమింపుమీ దయ దలిర్ప.

గీ. నాసమిత్తమై గోపకు ల్వాసి సేయు
క్రతువు విఫల మాటను బ్రతీకారములను
జేసె గోగోపనాశముఁ జేయుఘాతు
కమున కొడిగట్టినాఁడ దుర్గర్వమునను

గీ. అట్టియైశ్వర్యమదవృత్తి నాపి వేయ
బాలకరి తుండముఁ బద్మమాల నెత్తు
లీల గోవర్ధనాద్రి డాకేల నెత్తి
వానబాధతీర్చితివి సీవారి కెల్ల.

ఉ. ఇంతటి దుష్టచర్య లివి యెన్నఁడు నేరికి నెంచనట్లు నా
స్వాంతము దీర్చి దిద్దుము కృపాపరిపూర్ణుఁడ వోచు నేఁటిమ
శ్చింతనమున్ క్షమించి దయఁ జేయుము చేయ నిఁ కెన్నఁ డిట్లు శ్రీ
కాంత! యటంచు వేడుసురకాంతునిపై హరి జాలి నొందియున్

మ. విను సంపన్మదమత్తులౌ జడులు దుర్వృత్తంబు లూహించు మన్
నను గుర్తింపరు; మద్దయార్హులగుపుణ్యస్ఫూర్తులం బూని ని
ర్ధనులం జేసెద లోకవృత్తములు మిథ్యల్గా నిరూపింతు లో
చనయుగ్మంబును విప్పఁజేయుట కిదే సన్మార్గ మూహింపఁగన్

సీ. షడ్రసోపేతభోజనతృప్తుఁ డగువాఁడు
డాఁకలిమంటల నరయఁగలఁడె?
సంతతసౌఖ్యవిస్తారుఁ డౌమత్తాత్ముఁ
డొరులకష్టసుఖమ్ము లెఱుఁగఁగలఁడె?

యముఁగద్దునకును వాహన మెక్కి శ్రీమంతుఁ
డన్యమార్గానుమాన మరయఁగలఁడె ?
యారోగ్యవంతుఁ డై యులరాజభోగి వ్యా
ధిగ్రస్తువంట గుర్తింపఁగలఁడె ?

తే. ధ్వాంత మున్నప్పుడేకదా కాంతివిలువ
దెలియనౌఁ గావున ధనాధిపులను నెల్ల
నిర్ధనులఁ జేసి వారిస నే నివృత్తి
వలన నడపింతుఁ బెనుకష్టములను గూర్చి.

శా. నీవైశ్వర్యమదంబుచేత గద హ్లాదిం గూర్చి గో, గోప, గో
పీ వారంబును ద్రుంప నెంచితివి నీవీరంబు గోవర్ధనా
దా విచ్చేసితి వింతవట్టు నటులే యైశ్వర్యయుక్తు ల్సహ్రా
ద్భాగంబు న్విడనాడి యేర్చెద రహంభావంబుచేఁ బేదలన్.

సీ. కన్నులు కల్గియుఁ గనలేరు దుర్గర్వ
శర్వరి వెన్నంటి చాటుపెట్టఁ
జెవు లుండి విన సాహసింపరు నిర్లక్ష్య
భూత మావేశించి భీతిఁగొల్ప
జిహ్వ యుండియు మాట సెప్ప రహంభావ
సోన్మాదభిత్తిక చుట్టుముట్ట
హృదయ మున్నను ద్రవియింపలే రభిమాన
వప్రము నలుదెస ల్పరిఢవిల్ల

తే. గ్రుడ్డి, చెవిటి, మూక, గుదురోగి మున్నగు
నార్తకోటి కాశ్రయంబు నీరు
చచ్చి చావనట్టిసంపన్నరోగుల
కౌషధమ్ము లేమి యనుట వింతె.

గీ. నీయహంకృతి గర్వము నివురు సేయ
నేనె క్రతుభంగ మొనరింపఁ బూనుకొంటిఁ
బొమ్మ సరి కాని స్వాతిశయమ్ము వీడి
భూతదయఁ గని సౌఖ్యముఁ బొందు మింక

వ. అని హరి హరిహయుఁ బ్రబోధించి సెలవిచ్చి యనుపుటయు

సీ. కమలాసనుసమాజ్ఞ గని కామధేనువు
  వత్సాళితో బృందవనిని జొచ్చి
లీలావతారగోపాలబాలునిపాద
  సరసిజమ్ములముందు సాగిలపడి
మనుజవాక్యముల ని ట్లనె విశ్వభావన
  విశ్వాత్ముఁ డవు వేదవేద్యుఁ డీవు
పరమదైవమ వౌట బ్రాహ్మణగోదేవ
  తాపతి వై పృథ్వి దనరునట్లు

తే. నీకు నభిషేచన మొనర్ప నిఖిలసురల
పనుపునం బద్మభవుఁడు న న్ననిపినాఁడు
క్షీరధారలచే నభిషేక మిపుడు
చేసెదనటంచు ననుమతిఁ జెంది కడఁగి.

సీ. దేవులు దేవమాతృకలును నదితియుఁ
  బ్రేరణంబొనరింపఁ బ్రియము మీఱ
సురపతి దేవర్షి వరులతో నేతెంచి
  తుంబురు నారదాదులు సుమంత్ర
ములు పఠియింపఁగా మునులెల్ల రాశీర్వ
  దించుచుఁ గీర్తి వర్ణించుచుండ
గరుడగంధర్వకిన్నరసిద్ధచారణ
  విద్యాధరులు కూడి వినుతి సేయ

తే. నప్సరస లాడ, వివిధతూర్యములు మ్రోయ
నాతఁ డైరావతకరంబునందుఁ గలుగు
సురనదీతోయములఁ గొని హరికుమారు
శిరముపై నభిషేకించి చేసె నతుఁడు.

గీ. కామధేనువుపాల నాకాశగంగ
తోయముల నభిషేకము తీరముగను

జేసి గోవిందయనుచు జే, జే, రవము ల
సెలఁగఁ బిలిచిరి గోపాలుఁ జిన్నికృష్ణు.

మ. విపులం జల్లిరి దేవతల్ ప్రసవముల్ నింపెం నాథుగోపాలతల్లున్
వరనీరంబులతో నదీవితతియున్ భాసిల్లె మాణిక్య దీ
ప్తి రహింఁచెన్ గనులున్ లతాళితరుసంతానంబు శోభించె నీ
ధరశిం బోషకసస్యసంపద సమృద్ధం బయ్యె నప్పట్టునన్

గీ. దేవతాపతి మున్నగు దివిజు లెల్ల
గోపకృష్ణుని యావతి గోపి రయమున
వారివారిగృహంబులఁ జేరి రంతఁ
జనె యశోదకిశోరుఁడు జననికడకు.

—* నందుని వరుణలోకద్వారనము *—

గీ. శ్రీవిభునిఁ గూర్చి యేకాదశీవ్రతంబు
జరిపి మరునాఁడు స్నానార్థ మరిగి నంద
వరుఁడు యమునానదీజలాంతరమునందు
మునిఁగె నరుణోదయాత్పూర్వమునఁ జెలంగి.

ఉ. వరుణునిదూత యొక్కరుఁడు వచ్చి నిశాచరకాలమప్పు డీ
యతఁడు జలంబులం దుమికె న్యాయము కా దని నందగోపకుఁ
గరములఁ బట్టి యెత్తుకొని గ్రక్కునఁ బాటిదివంబుఁ జేరియున్
వరుణునిముందు నిల్పి గతవార్తను దెల్పెఁ గరంబు నుగ్రుఁడై.

గీ. స్నానమునకుఁ గాళిందికిఁ జనిననందుఁ
డెంతకును రామి దలఁచి యోజించి గోప
గోపికలు సంశయించుచు గుములుకూడి
చనిరి యమునానదీతీరమునకు వెదుక.

ఉ. కొందఱు నీటిలో దుమికి కొందఱు చేరువ నున్నభూములం
గొందఱు నందు నిందు మఱికొందఱు గూఢతలంబులందు ని
ట్లొందఱు నంతటన్ వెదకి యాతనిజాడల నెందుఁ గానకే
కొందల మంది గోపకులు కొట్లన నేడ్చిరి దీనవక్త్రులై.

చ. జలముల మున్గిపోయెనొ నిశాచరుచేతులఁ జిక్కెనో మృగా
వళులకు నోగిరంబగునొ పాడుకిరాతకు లెవ్వరేని యీ
కలుషత నెంచిరో యనుచుఁ గన్నులబాష్పములేఱులై నదీ
జలములఁ జేరఁబాఱఁగ విషణ్ణతఁ గాంచి యశోద యిట్లనున్.

మ. తనయా! కృష్ణ త్రిలోకరక్షణకళాదక్షుండవే నీవు మీ
జనకుం డుండినచో లెఱుంగవాకొ నాస్వామిం బ్రసాదింపుమా
తనికోనంగను, గుంకుమంబుఁ బసుపుం దక్కింపుమా నాకు; నం
దనుఁ డీ వౌట భయంబు లే దనుచుఁ బ్రస్తావింతు నోపుత్రకా!

వ. అవిన పలుకు లాలించి గోపాలకృష్ణుండు

మ. జననీ చింతిలకమ్మ! యిప్పుడు జగజ్జాలంబులం దెందు ను
న్నను మాయయ్యను దోడితెత్తు; నసమానప్రోద్ధతిం బట్టి దా
చినదుర్మార్గుని యేవు మాపెదను, శిక్షింతున్ విచారించి, మీ
తనయుం డుండఁగ నేడ్వఁబోలునటవే తల్లీ యశోదాసతీ!

వ. అని యూరార్చి దివ్యదృష్టి నంతయు నెఱింగి ముకుందుండు వరుణుసఁ
జూడఁబోయిన

క. కనుఁగొని వరుణుఁడు దిగ్గన
దనసింహాసనము డిగ్గి తత్క్షణమె హరిం
ఘనముగ నభ్యుత్థానం
బొనరిచి యుపవిష్టుఁ జేసె నున్నతపీఠిన్

క. ఇందీవరసుశ్యామా!
వందితసుత్రామ! దైత్యవంశవిరామా!
బృందారకరిపుభీమా
నందార్భకదివ్యనామ నందితసోమా!

క. గిరిధర! గోపాలా! శ్రీ
వర! వరదా! నందగోపవంశాభరణా!
నరహరి! హరి! శ్రీకృష్ణా!
కరిపరిపాలన! ముకుంద! కరుణాభరణా!

ఉ. నీనరపాదరేణువితతింగని నేను సవిత్రయుక్తిగాఁ
బావను డైతి లోకపరిపాలనఖేలనలోల బాలకృ
ష్ణా! వనజాతచారుసువిశాలవిలోచన నీదుదర్శనం
బీనిధిఁ జెందఁగల్గితిని నెంతయు ధన్యుఁడ నంచు మ్రొక్కుచున్

ఉ. పూతనఁ జంపుటల్ తృణుని బూది యొనర్చుట బండినొంచుటల్
మాత యశోదదేవికి సమస్తఖగోళము నోటఁ జూపుటల్
ఖ్యాతిగ వత్సధేనుకబకాదులఁ ద్రుంచుట శైల మెత్తుటల్
ప్రీతిగనాలకించి కనువిందుగ నిన్గన నెంతు శ్రీహరీ!

సీ. నాయదృష్టవశంబున నయనపర్వ
ముగ నినుం గంటిఁ జేకొంటి ముక్తిలక్ష్మిఁ
దప్పు లున్న క్షమింపుము దానవారి
మ్రొక్కుచున్నాఁడ త్వత్పదాంబుజములకును.

శా. ఈ నా భృత్యుఁడు దానవుం డగుటచే వృత్తంబు యోజింప క
జ్ఞానుండై కొనివచ్చె నీజనకు న్స్నానం బాడుచోఁ జూచియున్
నా నేరం బొకఁ డైన లే దటుల నాన ల్వెట్ట నేనాఁడు; కృ
ష్ణా! నోనాడకు నన్నటంచు వరుణుం డార్తుండుగాఁ బల్కుచున్

ఉ. ఈతఁ డొనర్చుకార్య మది హీనసమాచరణంబె నా మన
శ్చాతకముందవచ్చెడు లసన్నవనీరద మిమ్ము తోఁచు నం
చాతతవాంఛచేత సమయంబును వేచితిఁ దండ్రి: జూడ వి
ఖ్యాతుఁడ వీవు వత్తువని యాస ఫలించెను గోపనందనా!

సీ. అందుచే నందముఖ్యుని ననుపనైతి
గోకులమునకు నీరాక గోరియుంట;
నిదిగో కొనిపొ మ్మటంచు నచించి వరుణుఁ
డఖిలమర్యాద లొనరించి యనిపె వారి;

క. జనకునిఁ గని ప్రేవల్లెకు
ఘనవేగముతోడ నేగి కాతరు లగు నా
జననికిని బంధుకోటికిఁ
గనఁబఱచెను నందవిభునిఁ గన్నయ ప్రీతిన్.

తే. వరుణదిక్పాలకునిభూరివైభవంబుఁ
లోకసౌందర్యవిధము తల్లోకవాసు
లెల్లరకుఁ గృష్ణబాలకునెడఁ గలిగిన
భక్తియును దెల్పె నందుఁడు ప్రజలకెల్ల;

మ. విని యాశ్చర్యముతోడ గోపకులు పృథ్వీభాగముం జేర్పఁగా
జననం బందినకృష్ణబాలకుఁడు సాక్షాద్విష్ణువే కానఁ ద
మ్ము ననిర్వాచ్యపదమ్ముఁ జేర్చు నని సమ్మోదమ్ముతో బాలకృ
ష్ణుని వర్ణించిరి పూజఁ జేసిరి గుణస్తోత్రక్రియ ల్పాడుచున్

గీ. బ్రహ్మపదమును జెందు సద్వాంఛ గల్గి
యున్నతనవారియాశయ మొనరఁ జేయు
టగ్గ మనుచు సర్వద్రష్ట యైనకృష్ణుఁ
డాత్మలో నెంచి కరుణారసార్ద్రుఁ డయ్యె

తే. లోకమున జీవు లజ్ఞానలోలుపు లయి
తజ్జనితపుణ్యపాపవర్తనములవలన
దేవతిర్యగ్భవంబులఁ దెఱలి తెఱలి
పరమకష్టముల్పొరయుట నెఱుఁగలేరు.

సీ. దోసిట నమృతము బోసి చూపించిన
గుటగుట కమ్మఁగా గ్రోలలేరు,
తెలుపునల్పుంబోలెఁ దెల్ల మూచున్నను
ననుమాన మనుభూతమును విడువరు,
నిండుజాబిల్లి రేయెండలో మసలుచు
విషయానృతాంధము విడువఁబోరు;
మహితసింహద్వారమార్గవర్తను లయ్యుఁ
వెఱటిబాటలమాట నుఱపలేరు;

తే. బాహిరముగఁ గన్గొందురు భావనేత్ర
యుగ్మ మరమోడ్చి చూచెద రున్నవట్టి
దెలియఁగాలేరు తెలిసియు నిలుపఁబోరు
గోపకులు మాయతెర కప్పి కొనుటఁ జేసి.

వ. అని చింతించి సంకల్పమాత్రంబున వ్రజసంఘంబు నెల్ల నుపరిలోకంబులం గొనిపోయిన నందాదు లానందంబుతోఁ గనుంగొనువారు ముందఱ

సీ. ప్రోజ్జ్వలనవరత్నపూర్ణప్రభాభాస
మానమానితనవ్యమందిరంబు
తప్తచామీకరద్రవవజ్రనిర్మిత
గోపురప్రాకారకుట్టిమంబు
కస్తూరికాగరుసుగంధబంధురధూప
కలితసన్మణిదీపవిలసితంబు
మరకతస్తంభసంపన్నమహోజ్జ్వల
ధర్మసింహద్వారభాసితంబు
తే. ఘనవిశాలశాలాజాలకలితమతుల
మంటపాంతఃపురవిలాసమందిరోప
వనసమంచితమఖిలమోహనపురంబు
కోటిరవిభాసురమ్ము వైకుంఠపురము.

వ. గాంచి యమందానందకందళితులై బాలకృష్ణునిమహిమం బుగ్గడించిరి

మ. హరి కృష్ణుం డిట్లు నిత్యరమ్యమును బ్రాప్యస్థానమౌ భవ్యసుం
దరవైకుంఠపురంబునున్ విమలసత్యజ్ఞానరూపంబు నె
ల్లరకుం జూపిన గోపవారము మహోల్లాసంబునం గాంచి సు
స్థిరసమ్మోదసమంచితాత్ములయి సందీపించి రెంతేనియున్.

—* గోపికలు శ్రీకృష్ణుని దర్శింప వచ్చుట *—

శా. శ్రీకల్యాణగుణాభిరాముఁడు కృపాసింధుండు సంభావ్యలీ
లాకౌమారవిలాసగోపకుఁడు సోల్లాసంబుగా నొక్కనాఁ
డక్కాళిందితటంబునందున వినోదార్థక్రియాలోలుఁడై
రాకాచంద్రునిపండువెన్నెలలు పర్వన్ నేత్రపర్వంబుగన్.

సీ. ఘనయమునానదీకల్లోలవీచికల్
కడఁగి యొండొంటిని గౌఁగిలింప

శారదపూర్ణిమాచంద్రుఁడు తారకా
గణముతోఁ జదల నర్తనముసేయఁ
గొల్లగాఁ బూచినమల్లెపూవులతావి
హరియించి కరువలి యాడుచుండ
శారికాకీరమయూరపికంబులు
జంటలై పయ్యాట జలుపుచుండఁ

తే. చెంగుచెంగున ముద్దులు చెంగలింప
దుముకు మురియుచు మృగదంపతులు నటింపఁ
బరమశృంగారదేవత పరవశ యయి
బృందవనిలోన నానందనృత్య మాడె.

క. ఆమధురశుభవిభావరిఁ
గాఁచుంచి శశాంకుఁ డమృతకరములచేతం
బ్రేమహిమాంబువు లొలుకుచు
గో ముపలాలించి ముద్దుగొలుపుచునుండన్

సీ. పులినోన్నతస్థలమ్ములవేదికల నెల్ల
యమునాంబువులఁ గలయంపి జల్లి
పచ్చికబీళ్ళతివాసీలు పఱపించి
మల్లెమొల్లలు వెదఁజల్లివేసి
గొజ్జఁగిసోనలు గుఱిసి మందసమీరు
వ్యజనవాహకునిగా నందు నిలిపి
గోవర్ధనాద్రిపైఁ గొమరారుమణిదీప
ములు నందు విందుగాఁ బొందుపఱచి

తే. కువలయసుగంధధూపము గొలుపఁజేసి
తనరువింతశకుంతసంతానము నుడు
లొప్పుతూర్యారవమ్ముల నొనరఁజేసి
బృందవని నిల్వఁ దనపొందుఁ జెందఁగోరి.

సీ. నెఱికపుఙ్నవరకాంతి విరజిమ్మికాళింది
రమ్య మా వేణీభరమ్ము గాఁగ

రంగురంగులహంగు చెంగలించుసుమాళి
రంగానుపీతాంబరంబు కాఁగఁ
దరులతాకుంజసంతాన సౌభాగ్యము
వివిధాంగరమ్యసౌష్ఠవము కాఁగ
ఝుమ్మ్ఝుమ్మని మూఁగుతుమ్మెదలరవంబు
కమ్మనికంఠస్వరమ్ము కాఁగఁ

తే. జెలఁగి బృందావనేందిర చెలువుఁడైన
యిందిరాపతి యగుతనుఁ బొందఁ గోరి
సరసకలకంఠకంఠనిస్వనము లొలయఁ
బిలువఁ దలఁపుల వలపులు పులకరింప.

వ. సుమారగోప సందోహమ్ములనుగమింపఁ జెలంగి[illegible]తుండు

ఉ. చని యమునానదీతటవిశాలసమున్నతసైకతస్థలం
బున రమణీయవేదపయిఁ బూర్ణశశాంకువినిండువెల్గులో
మనసిజరూపచారుసుకుమారుఁ డతండు విలాస మొప్ప నొ
య్యన మృదువేణుగానమును హాయిగఁ జేయఁ గడంగినంతటన్.

గీ. మన్మథోద్దీపకం బైనమహితవేణు
గానమాధుర్యమును విని కాంత లెల్లఁ
గృష్ణసంసక్తచిత్త లై గృహములు విడి
చేయుపనులను మాని విచ్చేసి రటకు.

సీ. ఒడిలోనఁ బసిపాప నునిచి పా లిచ్చెడు
పడఁతి బాలుని వీడి నడువఁదొడఁగె
పతిపాదముల నొత్తుసతి చివాలున లేచి
చెప్పి చూపక వని దొప్పి నట్టె
వండివడ్డించెడువయసుకత్తెలు పనుల్
మాని రివ్వున నేగఁబూనుకొనిరి
పాలుపిండెడుగొల్లపడుచులు పని మాని
పరవశలయి లేచి పయనమైరి

తే. భోజన మొనర్చుచుండిన పువ్వుబోఁడి
పొంగిపోవుచుఁ గాలికి బుద్ధి సెప్పి;
యిట్లు గోపిక లెల్ల శ్రీకృష్ణవిభునిఁ
జేరఁబాఱిరి తన్మయచిత్త లగుచు.

సీ. సరిగంచు చీరను సవరించుకొనుప్రేమ
మైజారుపయ్యెద మఱచిపోయె;
బిగుతుకంచుకమును బిగియించుకొనుభామ
ముడివేసికొనుమాట విడిచిచనియె,
యంగరాగము దిద్దు మంగళాంగి చెలంగి
పరిపూర్తి సేయగా నరయదయ్యె!
భూషణములం దాల్చుపొన్నికొమ్మ యొకర్తు
తలక్రిందులుగ వానిఁ దాల్పఁదొడఁగె;

తే. గనులఁగాటుక దిద్దెడుకనకగాత్రి
సగములో నిల్పి పయనమై సాఁగిపోయెఁ,
గట్టి కట్టని చీరతోఁ గదలె నొకతె
కుతుకమున రెచ్చి యన్యసంగతులు మఱచి.

ఉ. తల్లులఁ దండ్రులున్ సఖులఁ దత్పతు లాప్తులు, సన్నగమ్ముగన్
బెల్లుగ నాఁచుచున్న వినిపింపనియట్లు తదేకచిత్తలై
యెల్లవకామినీమణులు పర్విడి రొక్కట భావదీప్తిచే
నుల్లము లెంతయున్ మెఱసి యారక శ్రీహరిఁ జూపు మందెగన్

క. హరిపైఁ బొరసినమనములు
మఱలింపఁగలరె యెట్టిమతిసంపన్నుల్
స్థిరసంకల్పము లెన్నఁడు
చెడుగవు సాధారణజగతీపథములకున్.

ఉ. గోపిక లెల్లరుం గలసి గోపకుమారకరూపధారి [illegible]
శ్రీపతిసన్నిధానమునఁ జేరినఁ గాంచి హసించి యింతగాఁ
జాపల మెందుకో? పరమసాహసవృత్తిని బూని వచ్చినా
రేపని గోపి మీయెడల నేమొనరింపఁగనో వచింపుఁడీ.

సీ. క్రూరమృగ సర్ప దైత్యసంకులవనంబుఁ
జేరవచ్చితి రేరేయి స్త్రీజనంబు
లుండరానిస్థలం బిది యువిదలార!
పొందు మీ మీ నివేశనమ్ములకు మరలి.

ఉ. కానక మిమ్ము మీపతులు గాదిలిబంధులు దల్లిదండ్రులున్
బూని మహార్తులై వెదకఁబోయెద రేమొకొ యందు నిందు నో
మానినులార! స్త్రీల కిది మాన్పితకార్యము కాదు భర్తృసే
వానియతిం బ్రవర్తిలుట భావ్యము పొం డిఁక నిండ్లు చేరఁగన్.

చ. అన విని గోపకామినులు హర్షము గోల్పడి విన్ననైనయా
ననములు డించి పల్కుటకు నాలుక రాక చెమొకిందనట్టి నె
మ్మనములలో ననేకవిధమానితమార్గము లూహ చేసి, కా
దనుకొని, యూ నటంచు నిటు లందనిపొందని, కుందుఁ జెందుచున్.

సీ. విమలప్రేమామృతతరంగవిహ్వలీకృ
తనవచేతస్కులము నిన్ను దరియవచ్చి
నాము నీదయ నీచరణములుగొల్చు
భాగ్య మిచ్చెదో విరహాబ్ధిఁ బట్టి ముంతో!

సీ. కనుమూతలను నిన్నుఁ గౌఁగిలింతుము కాని
తెరచిచూచుచు వాంఛ దీరలేము;
ఊహలలోఁ బొందు నొందుచుంము కాని
ప్రత్యక్షముగఁ గాంచుఫలము గనము,
స్వప్నరాజ్యమున నిసరస నుందుము కాని
మేల్కనియుండ నీమెప్పు గొనము
దలఁపులలో సోలి పులకరింతుము కాని
బాహిరమున నిన్నుఁ బడయలేము

తే. అహరహంబును నీమూర్తి నాత్మఫలక
ములను నెలకొల్పి వలపుదృక్కు లిడిమ్రొక్కి
ప్రేమవిరులు సమర్పించి ప్రియముగాంచు
చుందుమే కాని యనుభవ మంద లేము.

సీ. నీవు వలదని త్రోచిన నెనరు మాని
కనలు గాంచినఁ గాం డని కసరుచున్న
నిన్ను విడలేము తాపము ఓపలేము
మోహదాహము దీర్పవె మోహనాంగ !

మ. మము నీరీతి నిరాకరింతువని మామాచిత్తవిన్యస్తవి
భ్రమలన్ హాస్యముఁ జేసి పుత్తువని నేరా లెంచి గోరాలుగా
మము నిట్లుంగడిఁ బెట్టి యమ్ముదని యేమాత్రంబు నూహింపనై
తిమి గోపాల ! తదేకదీక్షకిది సంధింతే! ఫలం బట్లుగన్.

ఉ. ఎల్లిద మయ్యె మా బ్రదుకు లెవ్వరికిం గొరగాక పోతిమే!
తల్లులు దండ్రులున్ విభులు దాపునకే మముఁ జేరనీరు; మా
వల్లభుఁ డంచు నమ్మికొని వచ్చిన నీ విటు లీసడించి మ
మ్మల్లరిఁ బెట్టసాగితివి యయ్యయొ భ్రష్టల మైతి మియ్యెడన్.

ఉ. ఎందుకు భోగభాగ్యవిధు లెందులకో కొఱగానియట్టి యీ
యందముఁ జందముం దరుణయౌవనరేఖలు వ్యర్థజీవితం
బెందుకు? సుందరాంగుల వరించి, భరించి తరించుమూర్తియే
యందనిమ్రానిపం డయిన నక్కట స్త్రీలు భరింపనేర్తురే ?

గీ. అతను సామ్రాజ్య భద్రసింహాసనమునఁ
బట్టమహిషీపదంబుఁ జేపట్ట నెంచి
పఱుగువాఱితి మిచటికిఁ బరువు పోయి
మఱలఁగాలేము సిగ్గు దొందఱలు తఱుమ.

గీ. వలచి, వలపించి, నాయకుఁ గలిసి మెలసి,
లలి చిగుర్పుఁగఁ దలఁపుల ఫలము గొనని
చెలువ జీవించి యేమి? చచ్చియును నేమి ?
పుట్టలోఁ జెద పుట్టదే? గిట్టిపోదె?

॥ అనిన వెన్నుం డిట్లనియె.

శా. ఔ లే ! నేరని వానిఁ బట్టుకొని హాస్యాలాడి గారింపఁగా
నాలోచించియె వచ్చినాడు; సరిలే యోఁగాము తెల్లైన నీ

వేళాకోళముమాట శాశ్వతముగా విశ్వంబులో నిల్వఁ గా
దా లీలావతులార ! కోడిగము లేలా బాలగోపాలుతోన్.

శా. నేనెన్నండును మిమ్ముఁ బిల్చితినె తన్వీరత్నముల్ మీరలా
రా ! న న్నిట్లులఁ బంతగింప నుచితం బానేమి? మీ మ్మేమి? యా
సునాస్త్రిం డిటు సేయుటేమి? యవఁ డాసూనాస్త్రిఁ డాతండు మీ
పై నేలా పగ యింత పూనె వివరింపం బూనుఁడీ యంగనల్.

క. అవురవుర ! యంగనలపై
నవునంచున్ విక్రయించు నతఁడెవ్వండో
చివురాకుబోడులారా !
భువివాఁ డోకఁడున్న విసను బొం డిందాఁకన్.

వ. అను పలుకు లాలించి గోపికలు

ఉ. నినుఁ గనుచున్న మామనసు నిప్పుసెగ న్నవనీతమ ట్లగా
నెనసి ద్రవించుచుండు మననీయక నీవెస కెల్లవేళలన్
గోని చనుచుండు నన్యములగోష్ఠి దలంపము నేమిసేతు మో
మనసిజరూపచారుసుకుమార! యలంతుల మైతి మిట్లులన్.

శా. ఏసం గాసశరీర మేమయినఁ గానీ! యుండనీ! మండనీ!
మా కేచింతయు లేదు. వల్లభుఁడ వై మన్నింతువా సర్వలో
కైకాదర్శ్యఫలంబుఁ జెందెదము లేదా యేడనో యెట్లులో
చీకాకై పడి త్రెళ్ళిపోదు మిఁక నీచిత్తంబు సర్వేశ్వరా.

సీ. చెవులలో నమృతముఁ జిలికిన ట్లనిశము
నీనామరవము విన్పించుచుండుఁ
గనులలో నమృతము తొణఁకుచుండెడునట్లు
గానెప్డు నీమూర్తి కానవచ్చు
హృదయ భాగమున ముద్రిత మైనరీతిగా
నెప్పుడు నీవ నర్తించుచుండు
ఘ్రాణేంద్రియంబులు గమగమలాడెడి
నీమేనిగంధమే నెమ్మిఁగాంచు

తే. జ్ఞానబాహ్యేంద్రియమ్ములు సర్వకార్య
ములను నీప్రతిరూపమే నిలిచియుండు
నన్య మెఱుఁగము మేము త్వదంకితులము
సంగముల వీడినార మనంగమూర్తి.

గీ. సర్వసంగపరిత్యాగి జ్ఞాని యనియు
వాని కేపాపములు నంటరాని వనియు
నీవు సారూప్య మిచ్చి రక్షింతు వనియుఁ
బలుకుదురె కృష్ణ యది సత్యపథము కాద?

ఆ.వె. పతియు గతియు నీవె పరమార్థమును నీవె
త్రాత వీవె లోకనేత వీవె
నీదు నాజ్ఞ లేక నెఱవేర వెవ్వియుఁ
గదలలేఁడు కమలగర్భుఁడేని.

ఉ. తల్లియుఁ దండ్రియుం గురువు దైవము బంధువు ప్రాణమిత్రుఁడున్
వల్లభుఁ డీవె యంచు మనవా రనువారిని ద్రోసిపుచ్చియుం
జెల్లియొ చెల్లకో యిటులఁ జేరితి మూరట నందగోరి నీ
యుల్లమునందుఁ జేర్చుకొనెదో నిరసింతువొ చూడు మచ్యుతా!

ఉ. కుమ్మరిపుర్వు పంకమునఁ గ్రుమ్మరుచుం దవిలి నంటియుంటకే
యిమ్మహియందు సంసృతిని నేము వహింతుము మే మొనర్చుకృ
త్యముల కీవె కర్త వని యధ్యవసాయముఁ జేయుచుందు మే
యుమ్మలికంబు గాంచము ప్రభూత్తము నిన్నుఁ దలంతు మెప్పుడున్

గీ. కామమునఁ గ్రోధమున స్నేహకారణమున
భయముచేతను సంబంధబాంధవమున
సౌహృదంబున నెట్లొ నీజపము సేయు
నెడలఁ దన్మయుఁ డౌ నందు రెల్లబుధులు.

ఉ. సరసతతోడ నిన్ను మనసార వరించి తరింప నెంచినా
మరమర లేక మమ్ముఁ జరితార్థులఁ జేయుము ప్రేమయున్ మనో
హారవిజయధ్వజంబును ధరావరణంబున శాశ్వతంబుగా
దొరఁకొనఁ జేసితి వనెడు దొడ్డయశంబును నిల్పు మచ్యుతా!

గీ. సర్వశక్తుఁడవును గార్యసర్వసాధ
కుఁడవు ఘటనాఘటన సమర్థుఁడవు నీవు
బాలుఁడవు నయ్యు మాపాలిప్రణయమూర్తి
వాదరింపుము కౌఁగిట నదుమునిమ్మ.

ఉ. నీరమణీయకోమల వినీలతమాలతనూ విలాసమున్
గోరని యట్టిభామ యది కోటి కొకర్తుక యైనఁ గల్గునే?
శ్రీరమణీమనోరమణ! చేతఁజూపాతర మారునల్లు నిం
పారఁగ బాహుపంజరమునందు భరింపఁగరాదొ మమ్ములన్.

సీ. హృదయకేదారము లను నయ్యోడువిధానఁ
ప్రేమామృతంబు వర్షింపరాదొ!
వలపులరసమున నిర్మిళితమౌ ప్రణయంపు
నవబీజముల నందు నాఁటరాదొ!
దలఁపులలోఁ గూర్మి మొలక లెత్తెడునట్టు
లధరపల్లవమున నదుమరాదొ!
ప్రణయసస్యము పండి ఫల మిచ్చునందాఁక
మరుదోహదక్రియ జరుపరాదొ!

తే. క్షేత్ర బీజసంయోగముఁ జేయఁజాలు
చతురహాలికుఁడ వయ్యు భూసత్వ మెల్లఁ
దీయఁగారాదొ? హాయిగాఁజేయరాదొ?
యేల జా గిట్లు సేయ గోపాలబాల!

సీ. బిడియమా? కౌఁగిట బిగియించి, వగ ద్రుంచి,
సొగసించి కరుణించ సుందరాంగ!
తలవంపులా? ముద్దు లొలికించి వలపించి
లలి ముంచి పరికించ లలితగాత్ర!
సరిపోలమా? నిన్ను మరుబంతు లాడించి
మురిపించి, మెఱపించ మోహనాంగ!
పనికిరామా? సేవ లొనరించి తనియించి
మనసు దీరి సుఖించ మదనమూర్తి!

తే. ఇంతబలవంత మేలనో ? కంతుకేళి
యంతుఁ జూతగలాడి మెప్పింతు వనుచు
దలచి పిలుచుటచేన? గోపాలబాల !
చాలుఁ జాలింక బిగువులు చక్కనయ్య !

సీ. మోమోటపడితివా? ముద్దులయ్యా ! యింకఁ
గదలిరా ! కౌగిట నసుముదాన
బెదరితివో యేమొ ? మదనమూర్తీ ! మాదు
తలవెండ్రుకలనీడ దాఁగికొనుము
కోపమా మాపైని? గోపాల! చిక్కని
మోవిపానక మిత్తు ముదముగనుము
యలసిపోతివో? మోహనాంగా రమింపుచు
స్తనపీఠమందు విశ్రాంతిఁ గనుము

తే. బంతులాడింతు రార ! విభ్రాంతి విడుము
కంతుకేళిఁ దనర్చి సౌఖ్యమును గొమ్ము
వలచివచ్చిన చెలుల నవ్వులకుఁ ద్రోయఁ
గలిమి కాలను దన్నెడు ఫలము కదర.

సీ. నవమన్మథుఁడ వీవు యువతీమణుల మేము
నాడ రా వేల సయ్యాట లొప్ప
గోపతివీవు ని న్నోరుగోవుల మేము;
కోపుఁ జూపింప సంకోచ మేల
మధుపరాజవు నీవు మధురపుష్పము లేము
మధుమరందముఁ ద్రావ మనసురాదొ
స్వాతిమేఘుఁడ వీవు చారుశుక్తుల మేము
వలపువానలఁ జల్లుతలఁపు గొనవొ

తే. స్రష్ట వీవు యోగ్యంపుక్షేత్రముల మేము
ప్రణయబీజముల న్నాఁట భయ మదేల
జాలి లేదయ్యో నీకు గోపాలబాల
యెంత యని వేడుకొందు మోహా వింతబాల !

సీ. పూలడోలికలలో లాలించి సోలించి,
జోలఁ బాడెదమురా! బాలకృష్ణ!
యందాలకోనలో హంగురంగులు నేర్పి
హాయి హా యనిపింతు మంగజాంగ!
వలరాజు కులుకులఫలము లర్పించియు
ముదముఁ గూర్చెదమురా మోహనాంగ!
మధుపాత్ర నెత్తి కమ్మగ నోటికిత్తుము
గుటగుటఁ గోలరా కోమలాంగ!

తే. మోహనాంగ నని నీవు దెల్పు నామమునుఁ జెవిన్క
గలిపి, తెలిపి కాంచెదము ముమ్మరము దీరి
పోర! ముదమార దమిదీరఁ జేరరార!
మారసుకుమార! మోహనాకార! ధీర!

సీ. అనురూపవరుఁడ వై హాయిగా విహరించి
యేలుకోవయ్య యిం కేల జాగు
తాళలేము విరాళిఁ దూలించి సోలించి
నే లెంచి పాలించ నేల చలము
మగవాని కేలరా బిగువు నొయ్యారమున్
జాలులే యందు కీ బేలతనము
అభినయించెదు తీరు నరయలేమా మేము
వగ లేలరా మాడ తగులమునకుఁ

తే. చిక్కియున్నవి మనసులు చేరఁదీసి
పారముం గని సంతోషపడుము మమ్ముఁ
గారణము లేక మాయని బారి కప్ప
గించి నొంచుట మానరా! కృష్ణదేవ!

సీ. అందాలు చిందుచు నానందసస్యముం
బండించుకొన నేర్చు ప్రణయవల్లి
యూరించి మరుకేళి పూరించి లలి వీణె
సారించు నొయ్యారి జాణకత్తె

కళలూరు వలరాజు చిలిపిచేతలంగోతు
నెనయించి తనివెదు వనజగంధి
ప్రణయవారాశిలో మునుకలు వేయించి
మోహదాహము దీర్చు ముద్దులాడి.

తే. యింద ఱిన్నివిధాల నీపొందుఁ గోరి
కుందుఁ జెందిన ననుతాప మంద వేల
సుందరీ లోచనచకోరచందిరుఁడవు
మందమేలము లేల గోవింద కృష్ణ!

గీ. నీకు హృదయము లేదేమొ నిన్నుఁ గోరి
కుసుమకోమలగాత్ర లే గోపభామ
లెల్ల మారునిచేఁ జిక్కి హీనతఁ గన
నాదరింపవు గమనింప నబలమనసు.

గీ. అనుచు నెఱజాణ లొకకొంద ఱటు వచోవి
లాసముల హావభావలీలలఁ జెలంగి
తను నిరుత్తరుఁ జేయ నతనువినోద
మగ్నుఁ గావింప బూనిన మర్మ మెఱిఁగి.

మ. తనయాలింగనమున్ మదిం దలఁచి త్రేతన్ వేడుకొన్నట్టి య
మ్మునులే గోపిక లౌట నెంచి శపథమ్ముం దీర్పఁగా విశ్వమో
హనుఁ డాతఁ డపు డాత్మమూర్తి యయి యాయబ్జాతపత్రాక్షులం
గని కోర్కెల్ ఫలియింపఁ జేసె వివిధాకారంబు లింపొందఁగన్.

కం. అటఁ గృష్ణుం డిటఁ గృష్ణుం
డెటఁ గన్నను గృష్ణుఁడే రహిం జెలువొందెం
గుటిలాలక లందఱికే
చ్చటి కచ్చట నొక్కఁడై వెసన్ మురిపించెన్.

వ. ఇట్లు వర్తించుచు భువనమోహనుం డతం డక్కామమోహితల
మోహంబు మాన్పఁగోరి యదృశ్యుం డైన

ఉ. దిక్కులు పిక్కటిల్లునటు దీనముగా వెడమాటలాడుచున్
మక్కువ మిక్కుటం బయిన. మానిను లోర్వక పిచ్చి పట్టిన

ట్లొక్కెడ నిల్వకే చని మహోగ్రవనంబున నెల్లచోటులన్
జక్కఁగ బారఁజూచి తమస్వామిని గానక ఖిన్నచిత్తలై.

సీ. ఓమాలతీలతా! మామనోహరుజాడ
దెలిపి మాజీవముల్నిలుపుమమ్మ!
యశ్వత్థవృక్షమా యతఁడు నీవే యండ్రు
నీవెఱుంగవె వాఁడు పోవుదారి
తెలుపరాదమ్మ యోతులసిమాతా! నిన్నుఁ
గాదని ప్రియుఁ డెట్లు కదలఁ గలఁడు
సిలతమాలమా నిన్నుఁబోలినవాని
జాడ దెల్పిన నేమికీడు మూడుఁ

తే. బర్ణలోచనములచేఁ బ్రపంచములను
గాంచువటరాజమా నీకుఁ గానఁబడఁడె
గోపికా చిత్తచోరుఁడు గోప్యవిధులఁ
దెలిపి మన్నింపరాదొ మావెలితి దీర.

గీ. ప్రేమహాసావలోకనప్రియము గూర్చి
గోపికాచిత్తధనములఁ గొన్నయట్టి
చోరుఁ గనుగొంటిరా మీరు చూతపనస
తాలతకోలమాలూరతరువులార!

ఉ. ఎంతటిపుణ్యశీలవొ కదే ధరణీరమ నీవు గోపికా
కాంతుని పాదరేణువులు గాంచెద వెప్డు వరాహమూర్తియై
వింతగఁ గౌఁగిలించెదు పవిత్రఫలంబొ త్రివిక్రమాకృతిం
బంతివిధానఁ ద్రొక్కఁగనశుభంబొ తలిర్చె ననంతశోభమై.

తే. అనుచు నెలఁతలు కృష్ణమయమ్ములైన
స్వాంతములు మేఱమీఱి విభ్రాంతి దనర
భ్రమరకీటకన్యాయంబు పరిఢవిల్లఁ
గృష్ణలీలల నటియింతు రెలమి వొలయ.

కం. పూతనకీతి నటించెడు
నాఁతి యొకర్తుకకుచంబు నాయకినటనా

ఖ్యాత మహోత్కృత గుడుచుచుఁ
జేతము రంజిల్ల విందుఁ జెందఁ దొడంగెన్.

గీ. కృష్ణశిశువట్లు లేడ్పు నటించి యొకత
శకటదనుజునిఁబోలి నాటకము నాడు
తలిరుబోడిని గాలెత్తి తన్ని వేసి
చెలఁగి భావప్రదర్శన ల్చేసి రట్లు.

గీ. నాఁతి యొకతె తృణావర్తనటనతోడ
బాలకృష్ణునట్లు [illegible] బట్టి యెత్తి
గాలిపడగవిధాన శృంగారనటనఁ
జేసిమెప్పించెఁ దన తోడిచెలుల నెల్ల.

గీ. ఒకత కృష్ణాభినయము వేఱొకత బకుని
నటనఁ బూని యథావిధి నాటకమ్ము
నాడి సంతృప్తచిత్తలై యతివలెల్ల
గృష్ణుకీర్తి వర్ణించుచుఁ గెలిలి రిట్లు.

కం. బలరామకృష్ణమూర్తులు
వలె సతు లిర్వురు నటింప వత్సములగతిన్
జెలు లెల్ల నభినయించుచుఁ
బలుభంగులఁ గృష్ణయశము పాడిరి వేడ్కన్.

ఉ. పిల్లనఁగ్రోవి నూది యొకబిత్తరి కృష్ణునిఁబోలె నావులం
జల్లగఁ బేళ్ళతోఁ బిలువఁ జానలు గోవులకీతి నేకమై
మెల్లగఁ జేరవచ్చి తమి మించి ముకుందునినాట్యకర్త్రితో
నుల్లసమాడు రేవఁ గడు గొప్పగ నర్తన మాడి రొయ్యనన్.

గీ. కృష్ణవేషధారిణి యైనకృష్ణవేణి
యురగకాళియనర్తకి శిరముపైనఁ
జగణములు మోపి యాడుచు సరభసమునఁ
గృష్ణతాండవ మని హరికీర్తి నొందువు.

గీ. కృష్ణుఁడను నేను గల్గ సంతృప్తి గనుఁడు
భయ మదేల గోవర్ధన పర్వతంబు

నె త్తెద నటంచుఁ బయ్యెద నెత్తి పట్టి
గోపిక యొకర్తు హరిలీల గుర్తుఁ జేసె.

గీ. ఏను కృష్ణుఁడ గోపిక లీరు మీఁదు
కట్టుపుట్టములను గొని చెట్టు నెక్క-
దనుచు నొకలేమ చెలులపీతాంబరములు
పట్టి లాగుచు గగ్గోలు పరపఁదొడగె.

గీ. అజగరంబువోలె నభినయించులతాంగి
నోరు దెఱచి మ్రింగుతీరు జూపి
చెలుల భీతిగొల్ప శ్రీకృష్ణనటి దాని
గళము నొక్కి క్రీడ సలుపఁదొడఁగె.

వ ఇట్లు వర్తించి యాభీరలతాంగులు వెండియుఁ గృష్ణాన్వేషణ తత్పరలై

సీ. సంపూర్ణ శారద చంద్రబింబాననుం
గంటివా నీవు? మాకందశాఖ!
శ్యాముఁడే లోకాభిరాముఁడే అభినవ
కామునిం జూచితే కల్పవల్లి!
గోపికావ్యూహచోరు గోపీవరకుమారుఁ
గనుఁగొంటి వటవె యోప్రణయలతిక!
మధుతులసీవనమాలా విరాజితుఁ
గృష్ణుఁ గాంచితె కేతకీలతాంగి!

గీ. సుందరీ హృదయాకాశచందిరుండు
మదనమోహాన సత్కళామందిరుండు
ప్రణయసుందరు గోపాలబాలకృష్ణుఁ
గంటిరా? లతాతరుకుంజకాంతలార!

సీ. కోయిలా! నీ విట్లు కులికి కూసెద వేల?
హరిగాత్రమాధుర్య మందఁగలనె?
వనమయూరి! త్రుళ్లిపడి యాడఁబోకుము
నీకన్న వెన్నుఁడే నీటుకాఁడు

మాధవీలత ! యుంతమద మేలనే ? మమ్ము
బొందెడు హరిరీవిఁ బొందఁగలవె ?
హరిణమా ! పోతర మది యేలనో కృష్ణు
నేత్రచాలనకీర్తి నెగడఁగలవె ?

గీ. నీలజీమూతమా! గర్వ మేల నీకుఁ
గృష్ణుమైచాయ సొబఁగు వహింపఁగలవె ?
ననుచు గోపిక లెల్ల రవ్వనమునందు
తిరిగి తిరిగి వేసారిరి హరిని వెదక.

ఉ. నల్లనివాఁడు రేవెలుఁగునవ్వులవాఁడు విలాసవైఖరు
ల్చల్లెడువాఁడు జవ్వనులస్వాంతములననువాఁడు చేతిలోఁ
బిల్లనగ్రోవివాఁడు శిఖిపింఛము మౌళి ధరించువాఁడు సం
ఫుల్లసరోజనేత్రుఁ డగు ముద్దులకృష్ణునిఁ జూచియుంటిరే.

వ. అనుచు నాతన్వంగులు

మ. కనఁబడినట్టి సర్వలతికాతరుగుల్మనికుంజవారమున్
బని గొని ప్రశ్నఁ జేసి యవి పల్కకయున్న విలోలచిత్తలై
కనలుచు సూత్రభంగ మగుగాలిపటంబులువోలె సౌచు న
వ్యోమమున సంచరింతు రొక వంకయు డొంకయు నాఁక తేకునన్.

సీ. వల్లజ! మ మిన్నంత గలఁతఁబెట్టెదుకదా
మాభర్త వచ్చి నీమద మడంచు
త్త మాడెదవుగా? నెలరాజ మాతోడఁ
బర్వమునాఁడు ని న్బాము కఱచ
మలయసమీరుఁడా మత్తిల్లఁబోకుము
హరి వచ్చి నీపొగ రణపఁగలఁడు
ఎలనాఁగల హసింపఁ దలఁచితేమొ వసంత!
తాళుము కాలము దరియవచ్చె

తే. భర్త నెడఁబాసి విరహతాపమున గ్రస్త
ప్రమదలను గేలిసేయుదే రజనిచూడు

రేపు మొదలుగ నీపాటు తీపి చెడును
ననుచు సాక్రోశలై సతు ల్వానటఁ గనుచు.

సీ. కమ్మని హరిముద్దు కొమ్మరో గొనుమంచు
మగుడ యిం కొకతెను ముద్దులాడు
నధరసుధారస మానుమా యని యొక
యింతి వే ఱొకత కందిచ్చు బెదవి
వలరాజు కేళికిం దొలికాన్క యని స్తన
మంజరుల న్బట్టుమగువ యొకత
వనిత నిం కొకతఁ బైకొని కృష్ణుఁ డేల నే
యని పల్కి మరుకేళి నభినయించు

తే. నిట్లు నానావిధంబుల నింతు లధిక
ప్రేమభక్తి విశ్వాసము ల్వెనగొనంగ
వలపు దులకించు హరిఁ గృష్ణుఁ దలఁచి తలఁచి
నిముసము యుగమ్ముగాఁగ గాలము గడుపుచు.

క. ఎలుగెఁత్తి భోరుభోరున
గలకంఠనినాదములను గామిను లెల్లన్
వలవల నేడ్చిరి పెన్నిధి
తొలఁగిన పేదలటు భరము దుర్వహ మాటన్.

చ. హలకులిశ ధ్వజాంకుశ నవాంబుజరేఖలు పొల్చునడ్గు జా
డలు పులినస్థలంబున హఠాత్తుగఁ దోఁచినఁ జూచి వెంటనే
చెలు లవి కృష్ణమూర్తిపదచిహ్నము లంచు నెఱింగి యాతఁడే
కెలకులఁ కేగె నంచుఁ బరికించుచు నేగిరి యంద ఱేకమై.

చ. హరిచరణంబులం దగులున ట్లొకకామినిపాదచిహ్నముల్
పొరయుచునుండ నొండొరులు మోములు ద్రిప్పుచుఁ జూచి కంటిరే
దురితుఁడు మమ్ముఁగాదనుచుఁ దొయ్యలి నొక్కతవెంట సంటియు
దిరుగుచునున్నవాఁడు మదిఁ దీరనికూరిమిఁ జేరియుంటచేన్.

ఉ. తుండముఁ దుండము న్గలిపి తోరముగాఁ బయనించుచుండు వే
దండక రేణుదంపతుల దర్పముతో నలకృష్ణుపై భుజా

దండము మోపి యోసరిలి తన్వి యొకర్తుక హాయిహాయిగా
నండజవాహునిం గలసి యాడుచు నేగెడుజాడఁ జూడుఁడీ!

మ. అరరే! యెంతటిపుణ్యభాగినియొగా యాలేమ? త్రైలోక్యసుం
దరహృత్పీఠము నెక్కఁజాలినది సత్తామాత్రకేళీవినో
దరహాస్యార్థము నెల్లఁ జూఱగొనెఁ బ్రాప్తంబన్న నట్లేకదా!
హరియుం దానికిఁ జిక్కిపోయె మదనవ్యామోహపారీణుఁడై.

వ॥ అని పరితపించు నమ్ముగువలు రోషాతిశయంబున

సీ. మొగ్గదంతములతో మూఁగన వ్వెందుకే?
మల్లికా! తెలియవా మగువమనసు
మొగలిరెమ్మా! నీవు మగనిజో లెఱుఁగవా?
వెక్కిరించెదవేమె రెక్కలార్చి
రంగుపువ్వులచీరె రమణమీఱుననియా
కుంజమా! మముఁ గాంచి కులుకుచుందు
వాఁడుదానవెకదా! యుపహసింతువె మమ్ము
మాలతీ! జతగాని మరులుగొనవ?

తే. యింతవిడ్డూర మేలనే! యెన్నఁడేని
వలపుఁదీ పెఱుఁగకయుండె వకుళతరువ!
యెంతయెల్లిద మైతిమే యిందఱకును
మామనఃపతి మము వీడి మపలుకతన.

సీ. హరాంతకారివి కాన కంతుఁడా! శశిమౌళి
కంటిమంట న్నిన్నుఁ గాల్చివేసెఁ
జవరాంద్ర నేడ్పించుజడుఁడ వౌటనె శశీ!
పర్వపర్వమున ని న్బాము గఱచు
వెన్నెలా! నీవిట్టివెటకారి వౌటనే
క్షయరోగి భర్తగా సంభవించె
విరహిణీచిత్తములీ తఱుగురజని నిన్నుఁ
దామసు లందుకే తగిలియుందు

తే. మలయపవనంబ! నీయహంభావ మరసి
కోదె విధి నిన్ను పాఁపలోకమున కెల్లఁ
బట్టి మ్రింగుం డటంచు నేర్పా టొనర్చెఁ
బాప మది పండదే యెట్టివారి కైన.

ఉ. అందఱకు న్సమష్టి యయినట్టి ముకుందుని మోవితేనియల్
సుందరి యొర్తు గూఢముగఁ జూఱగొనం గని యోర్చియుందుమా?
యందఱ మేకమై చని మహాత్ముని నాతని చెల్మికత్తియన్
ముందుకు లాగి యుద్గనము మోహవిలాసము దూసిపోవఁగన్.

చ. అదె కనుఁగొంటిరా సతిపదాంకము లచ్చటఁ గానరావు తా
ముదితుఁడు గాన నెత్తికొని మోసెడుఁగావలె దాని నెత్తిపైఁ
బదములు లోఁతుగా దిగినభంగి కనంబడుఁ గామదాసుఁడై
పొదలెడు కృష్ణుఁ డేడ? మము బొందుట లేద యటంచు దీనలై.

కం. ఇదిగో మాడుఁడు జారిణి
పదచిహ్నము లున్న విచటఁ బాదపముకడన్
ముదితను దించి సుమంబుల
నదయుఁడు కోసినవిధంబు చక్కఁగఁ దోఁచున్.

మ. ఇదిగో యిచ్చట గూరుచుండె సతితోఁ గృష్ణుండు సోల్లాసియై
ముదితారత్నము కొప్పులో నిడె సుమంబుల్ ప్రేమతోఁ గాంచుఁడ
ల్లదె! చెల్లాచెదరౌ దళంబులు మరువ్యాపారము ల్దానితోఁ
బొదవం బోలును బాపురే యిది కడున్మోసంబు మా కెల్లనున్.

చ. అదె మునివ్రేళ్ళపై నిలిచినట్టులఁ బాదము లంటి యంటకే
ముద మొదవించుఁ గన్గొనుఁడు ముద్దులరాణికిఁ గొప్పు దిద్దఁగాఁ
బదముల నెత్తఁబోలుఁ బరభామినితోఁ జెలగాట మాడు దు
ర్మనుఁ డయిపోయెఁ గృష్ణుఁ డని మానిను లేడ్చిరి దుఃఖమగ్నలై.

గీ. ఆత్మరతుఁడు నాత్మారాముఁ డతఁడు స్త్రీవి
లాసములకు లొంగనివాఁడు మోసకారి
కామదాసుల దౌష్ట్యముం గలుగుఫలము
వెలుప వర్తించె నట్టు లాచెలులఁ గూడి.

గీ. ఇట్లు గోపికలెల్ల శ్రీకృష్ణుచేష్టి
తములఁ జేయుచు వెదకుచుఁ దమి దలిర్ప
మైమఱచి సంచరించిరి మదనమూర్తి
వెంటనంటిన సతితోడ విశ్రమించె.

క. నాదే భాగ్యమటంచున్
(శ్రీ)దయితునిఁ బొందినట్టి చెలువ దలఁచుచున్
బ్రోదిఁ జెలంగుచునుంతయు
మీఁ దెఱుగక పలికె కోలఁది మించి విభునితోన్.

గీ. తలిరుటాకులఁ బోలుపాదములు తొగరు
వన్నె గన్నవి నడువఁగా భార మయ్యె
నన్ను వహియించి నడువు మోవన్నె కాఁడ
యనుచు గర్వమునం బల్కె వనజగంధి.

ఉ. చేతులు సాచి ర మ్మనుచు శ్రీపతి పిల్వఁగ మందయానయై
బ్రీతిని జేరవచ్చి భుజపీఠి వహింపఁ దలంచుచున్న యా
నాతిఁయహంకృతిం గడప నందకుమారుఁ డదృశ్యుఁ డయ్యెఁ గే
లూఁత దొలంగి నేలఁబడి యుగ్మలి భగ్నమనోరథంబుగన్.

ఉ. కూరిమి దీరినంతటనె కోరి వరించినదానికన్నులం
గారము గూరి పారెదవ? కాముకుఁడా యిది యేటిమాట? యే
తీరున నమ్మవచ్చు గడిదేరినమీామగజాతి నయ్యయో!
యేఱు దటించి తెప్ప రగిలించెడు చందము లిట్టివే కదా?

క. నీవె సర్వస్వం బని
భావించి యభీష్టములను బరిపరివిధులన్
గావించి నిన్నుఁ గొల్చిన
సేవాఫల మిట్టిదౌన? శ్రీహరి! కృష్ణా!

గీ. చెట్టు నెక్కించి మూలముఁ జెండినట్లు
పట్టు దప్పించి నేలకు నెట్టినావు
కట్టిడి కృతఘ్నుఁడవు నిన్నుఁ గట్టుకొన్న
నిట్టికృతి గాక సౌఖ్యము లెట్టుగలుగు.

గీ. పూవులోఁ దేనె పూర్తిగాఁ ద్రావినంత
మత్తు తల కెక్కి పాడెడు మధుపమట్లు
నావయస్సుధఁ బీల్చి యున్మాది తెఱఁగు
చెప్పి చూపక పోదువా చిన్నికృష్ణ!

గీ. అమృతముం గ్రోలుదానికి హాలహాలము
ద్రావ నర్పించి చల్లగా దాఁటుకొంటి
విట్టిదేకద నీ ప్రేమ యింతులందు
నాకుఁ దలవంపు గూర్చి తనాగరకుఁడ!

ఉ. నీనటన ల్దలంచి నవనీతమనస్కుఁడ వంచు నమ్మి నీ
వే నను నుద్ధరింతువని, యింతికి భూషణ మైనమానముం
గానుక పెట్టినాను; మమకారము కోరినకీతిఁ దీర్చితిన్
దేనియపూర్తకర్తి ఎఎ తెక్కలి నేరకపోయితింగదా!

ఆ. వె. ప్రమానిలోఁజేవ మనుజులో మర్మ మెవరు
తెలియలే రనులోకోక్తి తెల్ల మయ్యె;
మాయలకుఁ బుట్టినిల్లు నీమనసు దాని
లోతుఁబాతులు దెలియ నాచేత నౌనె?

ఆ. వె. లేనిపోని ప్రేమ లూని చానలమాన
హానిఁ జేయు టేమిన్యాయ మనుచుఁ
బూనుకొంటి వంతపూచకో లైరోకో!
మానవతులు నీకు మాయకృష్ణ?

ఉ. ఎన్నివిధాలుగా నభినయించితి వావలరాజుచిన్నెకున్
వన్నెలు దీర్చి దిద్దునటు వర్తిలుచుంటివె యేడఁ బోయె నీ
మన్నన లన్ని కాంతయెడ మక్కువ లెక్కడ దాఁచి తయ్యయో!
యన్నియు బూటకంబులటరా యదిరా! కుహనావిలాసుఁడా!

ఉ. కమ్మనిమోవిపానకము గానుకఁ బెట్టి, కడానిబంతులన్
సమ్మతిఁ జేతి కిచ్చి, మనసార ననంగునిసంగరంబులో
ముమ్మరముం ఘటించునవమోహిని న న్విడనాడి యొంటిగాఁ
గ్రుమ్మరుచుంటి వెందులకొ? ఘోరవనంబున నోయికృష్ణుఁడా!

గీ. వలపు దల మీఱ చేతలు సలిపి సలిపి
ముద్దుముచ్చట్ల జడివాన ముంచి తేల్చి
యులుకుఁ బుట్టించి విడనాడుఫల మ దేమి
గాంతువో! కృష్ణ! తఱితీపికడఁ లేల?

గీ. మాట మాత్రము రతనాలమూట విప్పు
నవ్వులో తేటవెన్నెల నొవ్వనాడు
చేతలో మాట లూరించుఁ జిత్తములను
గాని ఎలసల యేడ్పించు కామినులను.

మ. మనదాంపత్యసుఖంబు నిత్యమని, శుంభన్మోదవారాశిలో
మునక ల్వాయిగ వేయవచ్చు నని, సమ్మోహానురాగార్థమా
నని, యూహించితిఁ గాని యివ్విధముగా నట్టేట నాపుట్టి ముం
చు నిషాదార్థముగాఁ దలంప నకటా! చోద్యంబు నీచెయ్దముల్

సు. అని వాపోవుచు గుండె బెందువడఁ బర్యాలోచనాధీనయై
వనమం దొంటరిగాఁ జరించునెడ నావామాక్షి నీక్షించి, త
క్కినగోపాంగన లెల్లఁ జేరుకొని, శ్రీకృష్ణప్రభావంబుఁ జె
ప్పిన నాలించి, తదీయవృత్తులకు స్తంభీభూత లై యెల్లరున్.

శా. ఔరా! యెంతటిమోసగాఁడు హరి నిత్యానందదుం డంచునున్
నీరేజేక్షుణ లెల్ల గోరెదరు కానీ వారియాంతర్యము
లాకారాకూరముఁ జేసి నొంచుటయె యాకష్టాత్మకృత్యంబు మా
నాకీలోకముపట్ల నాతని దురన్యాయ్యంబు సామాన్యమే.

ఉ. చిక్కడువాఁడు కాఁ డతఁడు చిక్కియు దక్కఁడు ప్రక్కలాటలే
ద్రొక్కును గాని నిక్కమగుత్రోవను జూపఁడు చూపినంతనే
మక్కువ లేనికక్కురితి మానసము ల్లటియించు నక్కటా
యిక్కరణి న్వ్యధించు టది యెందుకొ నమ్మినముద్దు గుమ్మలన్.

మ. మనస్త్రీజాతికి సిగ్గుమొ గ్గను నదేమాత్రంబయే నున్న నా
తనితోఁ గాపుర మింకఁ జేయకుఁడు కాంతాద్వేషి యై మమ్ము నొ
ల్లనివానిం బ్రతిమాలి పొందనగు సల్లాభంబు లే ముందు నో
వనితారత్నములార! మానుఁడిఁక నవ్యాజానురాగంబులన్.

చ. చని పులినస్థలంబుకడ శర్వరిశేషముఁ బుచ్చి ప్రొద్దుటన్
మనమన యిండ్లకేగుదము మానము న్యానముఁ జేసి వీడిపో
యిన గజదొంగ నమ్ముకొని యేల వృథా మనకాపురంబులన్
హాననముఁ జేసికోవలయు నంగనలార యటంచు నొండొరుల్.

వ. మనముల నిశ్చయించుకొని మానిను లెల్లరులేచి చయ్యనన్
జని యమునానదీతటవిశాలసమున్నతసైకతస్థలం
బున వసియించి కృష్ణపతిపూర్వకృతంబుల వల్లెవేయుచున్
వనట భరింపలేకునికి వావిరికన్నుల నీరు నించుచున్.

మ. ఇదమిత్థం బని కృష్ణు చెయ్దముల నూహింపంగ దుస్సాధమై
ముదితల్ పొందఁబు చందురుఁ డనుచు "సమ్మోహాస్త్రిఁడేమో"యటు
చది కా "దీతఁడు విష్ణుమూర్తి" యని యానొఁ గాదు కా దంచు గ
ర్మదవృత్తంబు లి వేమిటంచును నసంబద్ధంబుగాఁ బల్కుచున్.

ఉ. టక్కుటమారివిద్యల బడాయి హజావుడిబారుఁజేయుచున్
జక్కనిచుక్కలన్ వలపుచక్కిలిగింతలు పెట్టిపెట్టి కై
పెక్కి విరాళి సోలిన గుభిల్లున నేలకుఁ ద్రోసి చక్కగాఁ
ఏక్కబలంబు జూపి కనుపింపఁడు మాయలమారి యక్కటా!

ఉ. తక్కుచు దారుచు న్మరులు తాళములీలల మేళవించుచున్
గ్రక్కునఁ జేరవచ్చి తనకౌఁగిట నొత్తుచు ముచ్చటాడుచున్
జిక్కనిమోవిపానకము జిందుచుఁ జెందుచు హాయి హాయిగా
మక్కువదీరు దీర్చుఁ మటుమాయ మగుం దమి తీరిపోయినన్.

ఉ. అక్కునఁ జేర్చి ముద్దు లిడి యౌవనచిహ్నము లంటి హాయిగాఁ
జెక్కిలి నొక్కి మోవి గొని చిన్నెలు దీర్చి యనంగకేళిలో
నొక్కులు నొక్కి మాటిడెడునుత్కటతం గిలిగింతఁ బెట్టి మా
మక్కువఁ దీర్చు స్వామి యిఁక మాకుఁ గనంబడఁడా తలోదరీ!

ఉ. ఎక్కడ నేర్చెనో వలపు లిట్టివి యెంతమనోహరుండె? యా
చక్కెరవింటివానిలలిసాములు గోములు దీర్చువేళలో

నుక్కిరిబిక్కి గాదనుక నుగ్మలి వీడఁడు మెల్ల మెల్లఁగాఁ
జొక్కి లతాంగు లాతనికి జోత లొనర్తురు ముమ్మరంబుగన్.

ఉ. అట్టివిచిత్రవర్తనుని నయ్యయొ వీడి భరింపవచ్చునే?
యెట్టిఁడునైన నేమి యలయించిన నేమి? మనోజరాజ్యసా
మ్రాట్టుపదాంబుజంబులసమక్షమునం దొకలిప్తకాలమున్
మెట్టినఁ జాలదే? యువతి మేకొను కాఁకలు తీరిపోవవే?

క. రతిసుఖసారము నెఱిగిన పతితో
నొకరేయి సౌఖ్యపడుటయె చాలున్
స్థితి గతి దెలియని విభుతో రతి
వేయేండ్లైన నేమి రమ్యము సతికిన్.

క. అతని విలాసము లన్నియు
నతను విలాసములె కడఁకలన్నియు మరుమేల్
జతనములే హరిఁ బొందిన
సతివా జన్మంబె ధన్య మయ్యెడు జగతిన్.

ఉ. పుట్టిననాఁటఁగోలె మనపొంతలనే వసియించుచుండియున్
గుట్టును రట్టుఁ బెట్టఁదగు కొంటెపను లొనరించుచుండఁగా
వట్టివిగాఁ దలంచి వలవంతల గాలము వ్యర్థపుచ్చినా
మిట్టి విలాసమూర్తి యని యిప్డుకదా గ్రహియింతు మింతసిన్.

ఉ. జీతము లేనికొల్వునకుఁ జేరితి మిందఱ మందు చేతనే
ప్రీతి దొలంగె దీవు వెతఁబెట్టెదు నీకమనీయలోక వి
ఖ్యాతవినీలవిగ్రహము గన్నులపండువు కాఁగఁ జూచుమా
చేతము లొప్పుకోవు ఋజుసేవలు సేయక మామనోహరా!

ఉ. నీవు యశోదపుత్రుఁడవె? నీరజపత్రవిశాలనేత్ర! కృ
ష్ణా వరదా! ముకుంద! జగదాత్మవు సాక్షివి సర్వసాక్షివై
భావలయంబు లేలు హరిమూర్తివి లోకవిడంబనార్థమై
దేవహితంబు గోరియకదే? జనియింతువు గోకులంబునన్.

ఉ. యాదవవంశమండనుఁడవై జనియించి నిరంతరాజ్ఞతా
ఖేదవిలోలమానసులక్రించుఁధనంబు హరించి సర్వదా

యాదుకొనంగ నానభయహస్తము నాదలలందు మోపి స
మ్మోదము గూర్పవయ్య నినుఁ బొందినముమ్ము ననుగ్రహింపుమా

క. నీముఖసందర్శన మిడి
వ్యామోహము దీర్పరాదొ వలచినసతులన్
బాములఁ బెట్టుట చెల్లునె?
స్వామీ దయ చేయు మింక సన్నిధిఁజేరన్.

క. నీవే మే మని మేమే
నీవని నిర్భేదబుద్ధి నిను సేవింపం
దీవరము నొంది యుంటిమి
రావే దర్శనము నీవె రామారమణా!

సీ. బ్రహ్మేంద్రరుద్రాదిభవ్యు లెవ్వానిపై
హృదయపుష్పంబు లర్పించుచుందు
రిందిరాదేవిహృన్మందిరమున నెవ్వి
పదిలముగా నిల్పిభజన సేయుఁ
గాళియ భోగిభోగములపై నెయ్యవి
హృద్య నర్తనము వర్తించి యించె
జిజ్ఞాసువు లెవాని సేవించి భావించి
నిర్వాణపదమున నేరుచుందు

తే. రట్టి మీపాదకమలము లబ్జనేత్ర
మాదువక్షోజముల నిల్పి మమతదీర
నర్తనము సేయరాదొ?మీనాంక భీతి
మాన్పఁగా రాదొ నిర్దయ మానరాదొ.

సీ. పాపకూపమునుండి కాపాడె దనుటను
నఘదైత్యవధ సాక్ష్యమై రహించు
విషయవిహ్వలచిత్తవిషహారుం డనుటకుఁ
గాళీయుచరిత తార్కాణ మగుచు

గర్వాపహృతిశాక్యకర్తృత్వము వచింపఁ
బర్వతోద్ధరణము సర్వసాక్షి
భక్తప్రపాలనపాండితిఁ బ్రకటింప
వివిధదానవవధావిధము గుఱుతు

తే. కామదాస్యనిరోధము కడఁకఁ జూప
మామనీప్రస్తుతావస్థ మహితసాక్షి
యిన్ని యాదర్శములు నీవు వెన్నుఁడ వని
తెలుపుచుండినఁ దెలియ మో దేవదేవ!

సీ. జ్ఞానకర్మకాండలు మాదు స్తనయుగంబు
వానిపై జ్ఞానసంప్రదపాదయుగము
మోపి మరుతాప మనుభేదబుద్ధి మాపి
పాలనము సేయరాద గోపాలబాల!

సీ. అతనుతాపము గా దిది కృతకపాప
దీపితావస్థ దీరెడుదివ్య పథము
బాలగోపాల మాపాలిప్రభుఁడ వౌచు
నేలుకోవయ్య వలరాజులీల దేలి.

మ. అనఘా నీ వుపదేశమిచ్చు నల సోహం బ్రహ్మ యన్వాక్యముల్
వినుచున్ జ్ఞానకళాప్రదీపముల నుద్వీక్షించుచున్ సర్వదా
మనసానందముఁ జెంది పొందుగను బ్రహ్మానంద సారంబు గ్రో
ల నపేక్షింతుము జాల మేల నిక? లీలాబాలగోపాలకా!

శా. సంసారానలతప్త జీవదమునున్ జ్ఞానైకసమ్మాన్యమున్
శంసార్హంబును బాపమోచనమునున్ శ్రావ్యంబు నౌఁ గాదొకో
కంసారాతి భవత్కథామృతము యోగ్యప్రాప్తమై దుఃఖవి
ధ్వంసప్రజ్ఞఁ జెలంగి బ్రోచునుగదా బ్రహ్మాండమున్ సర్వమున్

తే. ముక్తికాంతానివాస మై మొనయునదియుఁ
బాపహార మైనత్వత్కథాభవ్యసుధను
మనన మొనరించి మథియించు జనులు కనరు
జననమరణ ప్రవాహ సంసక్తి దేవ!

—* గోపికా గీతలు *—

క. హరి! కృష్ణా! యని యొకపరి
మురిపెముతోఁ బిలువవచ్చు మోహానుడవఁటే
పరిపరివిధములఁ బిలిచిన
దరిఁజేరవు ముద్దు దీర్పఁ దలఁప వ దేలా!

క. పరిశుద్ధాత్మల మగుదుమొ
దురితలమో నీకె తెలియుఁ దుహినాంశుముఖా!
దరిసెన మీయ వ దేలా?
పరితాపము దీర్చి బ్రోవ భారము కృష్ణా!

క. గిరిధర గోపాలా శ్రీ
కర హరి బాల సామగాన విలోలా!
వరదాభయశీలా గో
పరిపాలనఖేల దుష్టపాపాభీలా!

క. సురపోషణ భవశోషణ
వరగుణభూషణ వినోదభూషణ తరుణీ
వరమానససంతోషణ
పరభీషణ నందగోప వంశాభరణా.

క. గుణశేఖర! రణభీకర!
ప్రణయవశీకర దయార్ద్రభావాకర శ్రీ
వనితాచిత్త విహారా!
ఘనకరుణాకర వినోదకర గోపాలా!

క. పరమార్థంబులఁ ద్రచ్చియు
కుఱుతుగ జూపించునట్టి గురుఁడవు నీవే
తరుణులమొఱ వినకుండిన
పరు లెవ్వరు చూతురయ్య పావనమూర్తీ!

మ. మదనోద్దీపన హేతుభూత మగునీమర్మంబు సాంకేతిక
ప్రదలక్ష్మీనిలయంబు పేరురము సంభావించి వీక్షించి యం
గద దీరం భ్రమ జెందినాము సుళువై కందర్ప దర్పాగ్నిలో
మొదలంటం గుదియింపగాఁ బడితి మంభోజాక్ష నిన్నానకే.

గీ. చాతకములట్లు మాకను ప్రీతి గదురఁ
గృష్ణచంద్రు విలోకించు తృష్ణగాంచు
నుత్పలములఁ గుందించెడు నుదయభాను
రీతి నేడ్పించెదవు నీవు ప్రీతి దొఱఁగి.

గీ. నీశిరంబున ధరియించునెమలిపింఛ
మునకుఁ గలరంగు లవి మనోముకురమందు
బింబితమ్ము లౌనో లేదో వెదకి వెదకి
చూచుమా హృదయములను ద్రవ్వి సుందరాంగ.

క. తీయని భావము లిట్టుల
నీయెడ మా కొదవుచుండ నిరసించి మమున్
మాయమయి త్రోవఁ జూపక
కాయక్లేశమును గూర్ప ఘనమా? కృష్ణా!

గీ. పాంచభౌతిక మా కళేబరమునకును
బతుల మని చెప్పుకొనువారు బ్రతిమిలాడి
వలదు వల దని వేనోళ్లఁ దెలుపుచున్న
వచ్చినాము వియోగాబ్ధిఁ జొచ్చినాము.

ఉ. కాయము లున్న వన్నియుటఁగాలినకట్టెలువోలె యాత్మ నీ
కే యనుయాయి యయ్యె గమనింప ద దేపెడత్రోవఁగాని నీ
మాయలు విప్పుభాగవతమంత్ర మెఱింగిన దద్ది చాలులే
వోయి! బడాయి నీపరువు పోవదులే దయచేయు మింతటన్.

సీ. తలఁపులఁ జివురించు మొలకనవ్వులమోము
జిలకింపకయ భ్రాంతి నిలుపలేము
లలి వీణె సారించు చిలుకపలుకులముద్దు
వినఁబోక వ్యసనము నణఁపలేము
వలపులు పులకించు తలిరుపాదము లంటి
సేవఁ జేయక శాంతిఁ జెందలేము
కనులలో నమృతంబు దొణఁకించు చేష్టలఁ
దమి దీరఁ జూడక తాళలేము

తే. హృదయభారము తీర నీపదరజంబు
వేగఁ దలఁ దాల్పకున్న జీవింపలేము
జాలమొనరింపకుముర గోపాలబాల
యిమ్ము దర్శన మిమ్ము చేకొమ్ము మమ్ము.

సీ. తలిరుటాకులకన్న లలిత మౌపదములు
పొక్కు లెత్తినవేమొ చక్కనయ్య
కుసుమకోమల మైనయసమాన తనుకాంతి
కందిపోయినదేమొ సుందరాంగ
నిగనిగమ్ముఁ జిందుపొగ లీనుకనులలో
నీర మూరునొ యేమొ సారసాక్ష
తొగరేనివగ లూరునగుమోముజిగి గోము
డంబు వీడినదేమొ కంబుకంఠ

తే. పల్లవారుణరుచిఁ గేరుపాణియుగము
తొగరుకొన్నవొ యేమొ యోసొగసుకాఁడ
కంటకశిలావృతం బైనకాననమున
నొంటిగా నేడ నుంటివో కొంటెకృష్ణ!

గీ. భక్తసులభుఁడ వని యనురక్తుఁడ వని
ప్రణయపాశములకుఁ గట్టువడియెద వని
పలుకుచుందురు పెద్ద లాపలుకు లన్ని
సత్యమే యైన వచ్చి దర్శనము నిమ్మి.

క.. గర్వించినామొ యేమో
సర్వేశ్వర తెలియలేమొ చపలల మగు మా
గర్వము నశించె హరి నీ
పర్వేందుముఖంబుఁ జూపి పాలింపఁదగున్.

ఉ. మూరెడుత్రాడు చాలినను ముగ్ధల మిందఱ మేక మైనచో
బారలు లక్ష కావలయు భర్తృవినాకృతు లైనమాకుఁ జే
కూరుచువారు లేకునికిఁ గోరితి మీయమునాతరంగిణిం
దూరి యసుస్థలం గడపఁ దొయ్యలు లందఱ మోమనోహరా!

క. స్థిరమై యజరామర మై
ధరణిని నాసూర్యచంద్రతారకముగనున్
బొరసెడు దిగ్దేశంబులఁ
దరుణీహింసకుఁడ వన్నధవళయశంబున్.

సీ. జీవిలో జీవుఁడే త్రోవ దప్పి చరింప
భావప్రపంచ మేపగిది నిల్చు?
భావప్రపంచమే పాడుబీ డయిపోవ
గాలిమేడలకివి పొలఁగలదె?
గాలిమేడలు నేలకూలుచో నందాల
పూలడోలిక లెట్లు పొలుపు నిలుపు?
పూలడోలికసొరు దూలిపోవుటఁ జూచి
లీలాపతస్వి లాలింపఁగలదె?

తే. అతఁడు పాలింపకున్న దివ్యానుభూతి
కలునో? కల్గకున్న విచ్చలు జపించు
మంత్రఫలము సిద్ధించునా? మలయకున్న
బ్రతికియేమి? కళాజీవి బ్రతు కిఁకేమి?

సీ. సౌదామనీభామ చక్కిలిగింతలే
కాఱుమేఘములకుఁ గళలు గూర్చు
పుష్పభోగినులసంపూర్ణకటాక్షమే
భృంగరాజమునీవి నింగి కెత్తు
తంత్రులసయ్యాటతానకంబులెసుమీ
మంజువీణాగాన మధురిమంబు
చంద్రికావైభోగసామ్రాజ్యభాగ్యమే
నెలరాజుకులుకుచిన్నెలబజాలు.

తే. శక్తిసన్నిహితవశిత్వసారఫలమె
శంకరుశివశంకరత్వవిస్తారమహిమ
సుందరీమణికడగంటిచూపుఫలమె
పురుషుఁడనువానివ్యక్తితన్ ధరణి నిల్పు.

సీ. మదిరాక్షిదృక్పథమధుర కటాక్షమే
జీవితాశయముల జీవగఱ్ఱ
గృహలక్ష్మి సహానసన్నిహితబాంధవ్యమే
రసజీవితమున శ్రీరామరక్ష
ప్రణయినీహృదయసామ్రాజ్యవైభోగమే
యానందసుందరోద్యానవసతి
చేడియ వాగ్విపంచీస్వరగరిమయే
తలఁపులు చిగురించు వలపుపాట

తే. కామినీమణిసరససంకల్పశుద్ధ
తేజమే కీర్తివిస్మృత దీపకళిక
లేనివాఁడు ప్రపంచమే లేనివాఁడు
పురుషుఁ డనువాఁడు పొలఁతుల కరుణలేక.

సీ. మగువలఁ దెగనాడు తగవరిమగవాఁడు
చంద్రిక న్నిరసించుచందమామ
ప్రణయినీసౌహార్ద రస మెఱుంగనివాఁడు
మధుమరందము రోయుమధుపరాజు
రసవిలాసినిచిత్త ముసురుపెట్టెడు హీనుఁ
డనపరాధుల నొంచు మనసిజుండు
వలపులవాణిఁ జివ్వలు బెట్టుజతగాఁడు
తను దానె వంచించుకొనెడు జడుఁడు

తే. మానినీస్నేహలౌల్యము మఱచువాఁడు
సొమ్ము దిని బొమ్ము గ్రుద్దెడు క్షుద్రుఁ డగును
నవసరము దీరి యువతుల నలఁచుకుమతి
యేఱు దాఁటి తెప్పను గాల్చు హీనబుద్ధి.

సీ. నరులు వానరులు కిన్నరు లాది సర్వులు
పరిపూర్ణుఁడ వటంచుఁ బల్కుచుండ్రు
భక్తులు మోహానురక్తు లాసక్తులు
ప్రణుతార్తిహరుఁ డని ప్రస్తుతింత్రు

మునులు సజ్జనులు ధీమణు లెల్లరును గూడి
దిక్కు నీవే యని మ్రొక్కుచుంద్రు
శ్రుతులు సంస్కృతులు సత్కృతులు నెల్లప్పుడు
నీమార్గములనె వర్ణించుచుండు
తే. నట్టిపూర్ణత్వము భయార్తిహరము దిక్కు
మ్రొక్కు లేచక్కి కరిగ నోమోసకాఁడ
యెంత పిలిచిన బలుకవు వంతఁ గుందు
కాంతలను జింత దీర్పవు కరినచిత్త!

మ. అని గోపాంగన లెల్ల సొమ్మసిలి కృష్ణాయత్తచేతస్కలై
వినతుల్ సేయుచు బాడుచున్ బ్రణయవిద్వేషంబు వాటించుచున్
వనటం గుందుచు బెక్కురీతుల విలాపభ్రాంతలై యార్చుచో
గని జాలిం గొని దర్శనం బొసఁగె శ్రీకాంతుం డనంతుం డటన్.

సీ. కుంచితాలకములు కొమరొప్ప ముడిచిన
జడపైని నెమలిపింఛము రహింప
బాలభానుని లేఁత పైడికాంతుల నీను
పీతాంబరంబులు ప్రియమెలర్ప
కమనీయమై తోఁచు కర్ణయుగ్మంబున
గుంజావతంసము లొక్కమరునింపఁ
గంబుకంఠంబున డంబు మీఱెడు నవ్య
వనపుష్పదామము వ్రేలుచుండ
తే. వామచరణంబుపై సవ్యపదము దనరఁ
బులినతలమున నిలిచి నమ్మోహ మొదవ
మురళి మ్రోయించుచును జగన్మోహనుండు
దర్శనం బిచ్చె గోపికాతతికి నపుడు.

గీ. ఒకత కైదండ నొసఁగె నింకొకత చిలిపి
తనమున న్మోతి బొడిచె మంతనములాడె
నొకత కన్నీరు విడుచుచు నుస్సురనియె
నొకత నిష్ఠురముల నాడి నొవ్వఁ జేసె

గీ. హరివదనమునం బచ్చకప్పురపు విడెము
గోరి వెట్టించుకొని మఱి కొసరి కొసరి
కన్నులకు నద్దుకొని మ్రొక్కి కనకగాత్రి
స్వీకరించె ప్రసాదము జోక మురిసి.

గీ. ఱెప్పలార్పక యొప్పులకుప్ప యొకత
తనివిఁజెందనియనిమిషత్వమునఁ జూచి
వఱలుచుండెను నానందబాష్పములనె
మై మఱచి నర్తనముఁ జేసె మచుత దీర.

ఉ. మానసమందిరంబున ననూనుమబాలకుమారకృష్ణునిం
జ్ఞానినిరీక్ష్యవిగ్రహము, స్పష్టముగా నెలకొల్పి, సంతత
ధ్యానవిలీనలై ముదము నందుచుఁ గౌఁగిట గ్రుచ్చియెత్తుచుం
దేనియలూరఁ బాడి వినుతించుచుఁ గాంత్రమకంబుఁ గామినుల్

వ. ఇటు లాగోపికలెల్ల నార్తిహరు శ్రీకృష్ణు నాలోకించి, ప్ర
స్ఫుటమోదంబున, భూతభేదముల సంపూర్ణంబుగా వీడి, దు
ర్ఘటకామ్యంబులు దీర నొప్పిరి; పరబ్రహ్మంబు నీక్షించి సం
కటసంసారవిచారముల్ దలఁగు విజ్ఞానిప్రకాండంబు నాన్.

సీ. సత్త్వాదిమహనీయశక్తిసంపన్నుఁడై
యవతరించినపరమాత్మ నోలె
జ్ఞాన, వీర్య, బలాది, సర్వప్రభావవి
శారదుం డగునుపాసకుని రేవ
సకలప్రకృత్యాదిశక్తులం గూడు దే
హేంద్రియాద్యభిమానహితునికరణి
స్వపరవిభేదవిచక్షణానూన్యుఁడై
సమదృష్టిఁ జూచువిజ్ఞానిరీతి

తే. పీతకౌశేయార్తలైనగోపికలతోడ
భక్తసంత్రాణగుణనిధి పరమమూర్తి
కృష్ణబాలుఁడు చెలరేగి క్రీడఁజేసె
నుల్లములు పొంగి గోపిక లుత్సహింప.

వ. అట్టి సుసమయంబున.

సీ. మల్లికాచంపకమందారనవపుష్ప
పరిమళముం గొనినచ్చుగాలి
రమ్యప్రసూనమరందపానాసక్తి
ఝుమ్మని పాడెడుతుమ్మెదగమి
శారదపూర్ణిమాచంద్రికాసుందరి
మందమేలము లాడుమధురరజని
చెలరేగి కలనాదములఁ దోఁగి పొలుపారు
రమణీయవిహగతూర్యస్వరములు

తే. వెలయుశుభసమయంబున విశ్వమూర్తి
పూతయమునాతరంగవిఖ్యాతరమ్య
తరళహస్తాంచితపులినస్థలమునందు
వెలసెయువతులతోఁ గృష్ణవిభుఁడు చెలఁగి.

చ. హరికరుణాసముద్రుఁడు వ్రజాంగన లెల్లర నాదరించుచున్
బఱచినయుత్తరీయములపై హరినీలమణిప్రకాశనుం
దరుఁ డయి మందహాసరుచి తాండవ మాడ వసించె సేవలన్
గొరయుచు, గోము దీర్చుచు నపూర్వవిలాసము లొప్పఁజెప్పుచున్.

గీ. సేవ లొనరింప నుపకరించెదరు కొంద
ఱట్టి దేదియు లేక యయాచితముగ
నుపకరింతురు మరికొంద ఱుభయవిధుల
నాయపడకుంద్రు కొంద ఱోసరసిజాక్ష!

క. ఇది యేకారణమగునో
విదితంబుగఁ బల్కు మనుచు వేడెడుసతులన్
హృదయాశంక లడంపఁగ
సదయుండై పల్కె శౌరి చతురత మీఱన్.

సీ. తృణముఁ జే జార్చి యంత వే టెదిరియొఫలము
కోరి వర్తించు వాఁ డుపకారి గాఁడు
యెరను వేసి మత్స్యంబును బొరయనెంచు
వాఁడెపో స్వార్థపరుడు విశ్వమ్మునందు.

సీ. పాల నాసించియో పసిపాట లెంచియో
పశువుల మేపగాఁ బాలుగొనుట
పైరుపంటలు పొందఁ గోరియే భూముల
నెరువు వెంపలి వేయ మురియుచుంట
ఫలపుష్పముల భ్రాంతి దలపెట్టియే లతా
తరుకుంజముల బెంపఁ దలఁచుచుంట
నేత్రోత్సవము జెందు నిరతి వాంఛించియే
పులుఁగులఁ బోషించుతలపు గొనుట

గీ. స్వప్రయోజనమును గోరి సకలజనము
లొకరి నొకరు సేవించుచునుందు రందుఁ
బరహితంబును స్నేహముఁ బొరయ దందుఁ
దమకొఱకె వ టి శ్రమియింత్రు తరుణులార!

చ. పితరులుబోలె కూర్మిగని పెంపెసలార ననేకరీతులన్
సతతముఁ జేయుచుండెదరు సజ్జనులోలిఁ బరోపకారముల్
వితతయశంబు ధర్మమును విస్ఫురితప్రియమందుఁ గల్గు, భా
వితపరమార్థమార్గ మది విశ్వజనీనపవిత్రధర్మ మౌ.

సీ. ఏయుపకారము నెంచి వృక్షమ్ములు
ఫలపుష్పముల నిచ్చుఁ బ్రాణితతికి
నెవనిసాయము గోరి యిందుసూర్యులు మింట
వెలిఁగి రేఁబవళులు వెలుఁగుచుంద్రు
ప్రతిఫల మెద్దాని దలచి ప్రకృతిమాత
ఫలదయై తా లోకముల నహించు
నుపకృతి యెదికోరి యుర్వీధరంబులు
ఖనిజసంపద లిచ్చి తనుపుచుండుఁ

తే. బరహితంబు దలంచెడు ప్రాజ్ఞు లెప్డు
డొరులసాయము గోరక యోగ్యమైన
రీతిని సమాచితముగ వర్తించి మిగుల
నుపకరింతురు సర్వదా యువిదలార!

సీ. జీవనోపాధికిఁ జేవ గల్పించెడు
జలముల వర్షించు జలదపంక్తి
జంగమస్థావరసకలజీవులయందు
వర్తించి బ్రతికించు వాయుమూర్తి
చేతనాచేతనస్థితికిఁ గారణభూత
మగుచుఁ బోషించెడు నవనిమాత
యఖిలలోకంబుల కాధార మగుచు భు
క్తాన్నంబు నరిగించు వహ్నిదేవుఁ

తే. డిదె పరోపకార మనెడునది జగానఁ
బ్రత్యుపకృతి నాసింపక పరమమైన
మార్గమున సాయ మొనరించుమహితవృత్తి
సర్వదా స్వవనయము జగతియందు.

గీ. తమ కుపకరించువారలం దలపఁబోక
మేలు మఱచుకృతఘ్నులు మేల తలార!
యన్యులకు సాయపడ నెంతురా! వృథాభి
మానగర్వితచిత్తు లమ్మనుజు లవని.

సీ. తమలోనె తాము సంతసపడి తృప్తులై
ముందుముం దెఱుఁగనిమందబుద్ధు
లనుభవార్థం బైనవన్ని తీరె నటంచుఁ
గడచుచుక్కలఁ జూచుకఠినచిత్తు
లుపకారములలోన నున్నతాశయుల పో
ల్కి గుర్తింపని మూఢభావు
లుపకరించినవారి కపకార మొనరించి
బహుభంగులఁ గలంచుపాపబుద్ధు

తే. లిట్టి నాల్గు తెఱంగులహీననర
నులు కృతఘ్నులు ధారుణీతలమునందుఁ
శాపభూయిష్ఠులై వృత్తిఁ బడయుచుండు
రట్టివారికి ముక్తి లే దబలలార!

క. మీ రడుగుచుండు ప్రశ్నల
కీరీతిని నుత్తరంబు లిచ్చితి వానిన్
సారాంశ మెఱిఁగి యందఱు
దీరం దగు సంశయములు స్థిరతరబుద్ధిన్.

సీ. తరికవ్వ మమరించి పెరుగుఁ జిల్కఁగాని
నవనీత మందు సంభవము కాదు;
రోకలిపోటుల రోట దంపినఁగాని
భోగ్యతండులములు పొసఁగఁబోవు;
కఱఁగించి మూసఁబోసి మెరుగు దీర్చినఁగాని
సిద్ధలోహములు ప్రసిద్ధిఁ గానవు;
సానఁ బెట్టి కుదించి సరి చేసిననెగాని
వజ్రఖండము దీప్తి నలరఁబోదు;

తే. సంస్కృతి నెఱుంగనట్టి విజ్ఞానమునను
దఱచి, భ్రమపెట్టి భక్త్యౌషధము నొసంగి
జ్ఞానదీపము వెలిపినఁగాని యతఁడు
పక్వహృదయుఁడు కాలేఁడు భామలార!

గీ. ధరఁ గులాలుఁడు తప్తమృద్ఘటము లెల్లఁ
జేతఁ దట్టి విమర్శించురీతి సర్వ
మయుడు భక్తాంతరంగము మలినతలను
గలఁచి యగ్నిపరీక్షలుఁ జలుపుచుండు.

చ. సులుఁగున నుండి మీవినయమంజులవాక్యము లాలకించియున్
సరిగొను దుఃఖముం గనియు, దర్శన మీయఁదలంప మిమ్ము నం
దఱఁ బరిపూర్ణభక్తిపరితప్తలఁ జేయదలంచి కాన సుం
దరసఖులార! నాయెడలఁ దామసము న్వహియింపఁబోకుఁడీ!

చ. పొలఁతుకలార! మీరు పరిపూర్ణలు; దుర్భరగేహబంధనం
బులు విడి నన్నుఁ గొల్చితిరి పూర్ణఫలంబును గంటి రింక నేఁ
జలుపఁ గలట్టి ప్రత్యయవిచారము లెవ్వియు లేవు. సాధుస
త్కులఫల మిట్టిదై వెలయు; దోషనివృత్తి యొనర్చు నెప్పగిన్.

వ. అని కృష్ణుండు పలుకుటయును

చ. పరమపవిత్రమై మృదులభావవిలోలితమై నివారితాం
తరవిషయార్తియై పరఁగు తన్మధువైరి మనోజ్ఞధోరణిన్
సరసిజనేత్ర లెల్ల విని, స్మారవికారము దీరి భక్తిత
త్పరతఁ దదీయసద్యశము పాడి వినోదము లాడి రందఱున్

—* రాసక్రీడలు *—

గీ. రమ్యమై యొప్పు నాశరద్రాత్రియందు
విమలయమునాతటిప్రదేశమునఁ గృష్ణ
దేవుఁ డాభీరవనితల భావరాగ
రంజితంబుగఁ బొనరించె రాసకేళి.

చ. హారికర మొక్కలేమ బిగియారఁ గదించిన దానిహాస్య మొ
క్కరిత గ్రహించెఁ దత్కరము కొంత మఱొక్కత పట్టె నిట్టుల
గరితలు, సర్వులున్ గొలుసుకైవడి నొండొరులం గదింపుచున్
వరుసగ బారు దీరి పలుభంగుల నాడిరి కృష్ణదేవుతోన్.

సీ. అంతయుఁ దానయై యాడించుపరమాత్మ
సచ్చిదాకాశప్రశస్తతలము
నం "దహంబ్రహ్మాస్మి" 'యయమాత్మ' యనునఖం
డబ్రహ్మరూపమై డంబు మీఱి
"సోహం"వినిశ్చలస్ఫురితవిజ్ఞతఁ గను
బ్రహ్మేతరస్త్రీప్రపంచమంతు
నానాత్వమను న దేనాఁడు కాని దటంచు
నేకత్వమును నిరూపింప నెంచి

తే. బాహ్యదృష్టికి లోచనపర్వమైన
విజ్ఞులకు మానసానందవేశ్మమైన
రాసకేళి దనర్చె నిరంజనుండు
గోపికాప్రపంచముతోడఁ గూడి యాడి.

సీ. రమణీయమోహనరాగవల్లకు లైన
తరుణు లిర్వురతోడఁ దారసిల్లి
కమనీయకరమృణాళములు కంఠంబున
నెలకొల్పి భామలు నిలిచియుండె
నెవరికి వారు శ్రీకృష్ణుఁడు దనవాఁడె
యనుభ్రాంతి హృదయమునందు నిలుగ
మండలాకృతి గాంచి మహితభంగిమముల
గోపికాయువతులు గోష్ఠిఁ జేయ

తే. నాకసంబున వేడుక లరయుకొఱకు
దివ్యులు విమానముల నుండ దివ్యదుందు
భులు సెలంగఁ బువ్వులవర్షములు కురియఁగఁ
జేసెఁ గృష్ణుఁడు చెలులతో రాసకేళి.

తే. బంగరువికార మైనయాభరణములకుఁ
గూర్చు మణులమధ్యమ్మునఁ గొమరు మిగులు
మరకతము వోలె నందకుమారుఁ డొప్పెఁ
బ్రేమఁ జూపెడు నాసతీమణులనడుమ.

తే. ఘటిత, పార్శ్వగ, మర్దితోద్ఘనవిలాస
పాదవిన్యాసములచేతఁ బద్మకోశ
కర్తరీముఖ, శుకతుండ, కలపిత్థ
హస్తవిన్యాసములు నొప్పులారుచుండ

తే. కుంచిత, నికుంచితాకుంచితాంచితముగఁ
గంపితాకంపితవినోదగరిమ దనర
హత, పరాహతవృత్తసంయుతమనోజ్ఞ
భావములఁ జూపి వెలసిరి భామ లెల్ల.

సీ. శ్రీకృష్ణవిభునితోఁ జేరి కామిను లెల్ల
రొకరితర్వాత నింకొకరు కాఁగఁ
దమయంఘ్రు లతనిపాదములతోఁ జేర్చి
ఘటితపదన్యాసగరిమ దనరఁ

పార్శ్వములందుఁ జొప్పడంగ బొటనవ్రేళ్ళ
నేలరాచి పదంబు నిలుపుకొనుచు
నందఱు గూడి సానందులై యొకపరి
నించు కించుకగతు లంచితముగ

తే. హస్తవిన్యాసచతురత లలమికొనఁగ
మధ్యసంచారభావము ల్మలసియాడ
భ్రూవిలాసము లొప్ప నంభోరుహాక్షు
లంద ఱొందిగి రాసక్రీడ లాడి రట్లు.

సీ. నందకిశోర మహాసుందర శ్యామాభి
రాముఁడు నీలనీరదము గాఁగఁ
దప్తచామీకరరోచిశ్ఛాయ దనరారు
లలనామణులు తటిల్లత లనంగ
రమణీయ కేళికాశ్రమజాత మై తోఁచు
స్వేద మదె తుషారవృష్టి గాఁగ
గాంధర్వపాండితీగరిమతో గీతికా
రవళియే మేఘగర్జనము గాఁగ

తే. సచ్చిదాకాశమందు విజ్ఞానజలద
ముపనిషద్భావరూపవిద్యుత్తుతోడఁ
జేరి గంభీరవాక్య విస్తార మగుచు
నమృతవర్షము గుఱిసె మురారి శౌరి.

సీ. రమ్యపాదన్యాసరక్తిఁ జెన్నారెడు
వివిధాభినయముల వేడ్క దనరఁ
గరమృణాళంబులు కదలించి హాయలుగా
నవభంగిమముల మంతనము లొప్పఁ
జెక్కుటద్దములపైఁ జేరాడు నవరత్న
కుండలమ్ముల కాంతి గునిసియాడఁ
గనుఁదొను ల్మడిపెట్టి కదలించి కుదియించి
ప్రణుతభావంబుల ఘణితౌ వెలయ

తే. మోములం జిరునవ్వులు మొలకలెత్త
గండముల రత్నకుండలకాంతు లమరఁ
గుచయుగం బంద మొలుకుచుఁ గొమరుమీఱఁ
జెలువ లెల్ల రాసక్రీడఁ జేసి రటుల.

ఉ. ఊడిపపోకముక్కు, నడి నోర్వక విచ్చినకొప్పుముళ్లు, గో
రాడెడుజంటపయ్యెదలు, రాయిడిమై బరవస్త్రదోఃక్రమం
గీడలతోడఁ గంచుకము లేకవలఁ జూచుగులాబిచెండ్లు, జీ
రాడెడుచెంగులుం గలిగి కన్నన లెల్లను రాసకేళిలోన్.

ఉ. ఎవ్వనివేణుగానమున నెంతయు గేహము లీఁగి వచ్చిరో
యెవ్వనిదర్శనం బభిలషించి తపించిరొ, యట్టిమూర్తితో
జవ్వను లందఱుం గలిసి సంభ్రమ మందుచు రాసకేళిలో
దవ్వుల నిల్చి తాకి సురతప్రియలై యలిఁ దేలి రొయ్యనన్.

గీ. శ్రావ్య మగుకృష్ణదేవుగాత్రంబుతోడఁ
గంఠమును మేళవించి యొక్కరిత ముద్దు
లొలుకఁగా స్వరజాతులు పలికి శౌరి
మెప్పునఁ మోదవార్నిధిం దొప్పదోఁగె.

గీ. మగుడ నా స్వరజాతినే మనసు దీర
వఱలుధ్రువతాళమునఁ జేర్చి పాడి రంత
మెచ్చి శ్రీకృష్ణదేవుఁ డామెలఁత కొసగె
గానవేదినిబిరుదంబు కరుణఁ జేసి.

ఉ. నీలతమాలభూజమును నెక్కొనుగోమునఁ బ్రాకియున్న, యా
లాలితపుష్పశోభనవిలాసలతాసతిఁబోలె సొంపుగా
బాలమరాళయాన యగుభామ ముకుందుభుజస్థలంబుపై
వ్రాలెను, వేనలి న్విడచి గ్రక్కునఁ బూలసరాలు రాలఁగన్.

గీ. రాసమండలభ్రమణకారణముచేత
గునిసియాడెడు నవరత్నకుండలముల
కాంతు లింపొందు చెక్కిలికడ నొకర్తు
చెక్కిలిం జేర్చ మునిపంట నొక్కె శౌరి.

ఉ. చందనలిప్తమై కుముదిసౌరభము ల్వెదఁ జిమ్ముచున్న గో
పింపుని బాహుదండమును, బేర్మి భుజస్థలిఁ దాల్చియున్న యా
సుందరి తత్సుగంధమును సొంపుగ మూర్కొని మై గగుర్పఁగ
నందకుమారు ముద్దుగొని నర్మము లాడఁదొడంగె హాయిగన్.

ఉ. ఆడుచుఁ బాడుచున్ మిగులనందముఁ జిందుచు ముద్దుముద్దుగా
జేడె యొకర్తు కృష్ణవిభుచేతినిఁ జేతఁ గదించి ప్రేమవి
క్రీడలఁ దాండవించి కికురించి కుచస్థలి నుంచి సొంపుగాఁ
గోడిగ మాడి లేనగవుకొప్పులుఁ జూపఁదొడంగె నత్తఱిన్

సీ. కొప్పులు దిగజారి కొమరారుపూదండ
లంసభాగమ్ముల నావరింప
గాలితాకున రేఁగి కమనీయమై తోఁచు
ముంగురుల్ మోముల న్మురిసియాడ
నింపుగాఁ జెవులధరించినకువలయ
దళములు విడఁబాఱి తళుకు లీనఁ
గేళీభరంబున జాలువారెడుఘర్మ
బిందుసందోహము విందు సేయఁ

తే. గాలియందెలుమువ్వలు ఘల్లురనఁగ
మర్దళాదిసువాద్యము ల్మ్రోయుచుండ
భ్రమరగాయకరభస మహారాసకేళి
యందు హరిఁ గూడి యాడి రయ్యతివ లెల్ల.

సీ. జిలుగుఁబయ్యెదకొంగు తొలఁగి క్రొంజక్కవ
లరమూపుఁ జూచునే యరయ దొకత
కుచ్చెళుల్ సెలరేగికొనువింపు తులకింప
సిగ్గు మొగ్గెఱుగదు చేడె యొకతె
తొగరువాతెఱసొంపు బిగివంపు దలవంపు
తెలియనే తెలియదు లలన యొకత
సునుజెక్కుటద్దముల్ గొనురదనక్షతుల్
తలఁపనే తలఁపదు లలన యొకత

తే. ఇట్లుకృష్ణాశ్రితగాఁగ నింతు లెల్లఁ
నిమదు దేహాభిమానము ల్దలంపఁబోక
ప్రాణప్రమానము లర్పించి రాసకేళిఁ
దేలి సోలిరి బాలగోపాలుతోడ.

చ. తనప్రతిబింబముం గనుచుఁ దక్కుచుఁ దాఁకి చెలంగుచుండుబా
లునివలె శ్రీరమాపతి విలోలుఁడునై తనతోడనాడు జ
వ్వనులను హాసభావములు వన్నెలుఁ జిన్నెలు దిద్ది కౌఁగిటం
గొనుచు గరంబును న్మగువ గొలుచన్వల్పవినోదమొప్పఁగన్.

తే. కృష్ణదేహసంపర్కముప్రియ మెలర్ప
నతివ లానందపరవశ లై ప్రపంచ
విధులు పాటింపఁబోక యవ్విభునిఁ గూడి
యాడుచుండిరి యేకలక్ష్యంబుతోడ.

క. ఏడినపూలను ముడువరు
నూడినచీరలను గట్టుకొల్లరు ధరఁ జీ
రాడెడుకొంగులు దిద్దరు
చేడెలు క్రీడావినోదచేష్టిత లౌటన్

ఉ. ఒకొక్కకభామ కొక్కఁడయి, యుల్లము రంజిలఁబెక్కుభంగులన్
మక్కువఁ జక్కఁజేయుచును మన్మధచర్యల నాచరించుచున్
జిక్కనిస్వామి, చేడెలకుఁ జిక్కి మనోహరరాసకేళికన్
నక్కనఁజేసెఁ దృప్తినవనీతము కాంతల స్వాంతవీథులన్.

క. రాసక్రీడావిభవముఁ
జేసి యనంతుండు కలతఁ జెందినస్త్రీలన్
గాసి దొలంగెడునట్టులఁ
జేసె విలాసాంచితముగ సేవావిధులన్.

ఉ. ఆకసమందు దివ్యజను లందఱు శ్రీహరిరాసకేళికా
లోకనశీలులై వెలసి లోచనపర్వ మొనర్ప మెచ్చి సు
శ్లోకునికీర్తిఁ బాడుచు విరుల్వాదఁజల్లుచు దూర్యరావ మ
స్తోకముగాఁ దలిర్పుచును జొక్కిరి మక్కువ పిక్కటిల్లఁగన్.

ఉ. అమృతరసాంచితాంబు లగునాకడఁగంటినిరీక్షణంబులున్
సుమరుచిహాసముల్ కడుశోభ దనర్చెడుమందహాసమున్
దమి దనియించు మలాలనవిధాన మనంగకళావిలాసమున్
బ్రమదలు గాంచి మించి హరిపజ్జ నొదింగిరి ముక్తవాంఛలై.

—* జలక్రీడాభివర్ణనము *—

మ. జలమధ్యంబున (శ్రీ)రమాపతి విలాసప్రోద్ధతిం గ్రీడ సే
యు లతాంగు ల్వలయాకృతిన్ నిలిచి, సర్వాత్ము న్విలోకించుచున్
జలముం గైకొని పైనిఁ జల్లుచు, మహాసంరంభము ల్సేయుచున్
బలుచందంబుల విందు. జెందిరి పరబ్రహ్మానుసంధానలై.

గీ. అతివ లెల్ల రాత్మారాము నటులఁ దడుప
మొలకనవ్వుల నొలికించి సలిలములను
బాణితలమునఁ దట్టుచుఁ బైకిఁ జల్లెఁ
గరి కరంబున నెగఁ జిమ్ము కరణి నతఁడ

ఉ. చల్లనిగాలి కమ్మనగుసంపఁగిపూవులతావి పూలతో
నుల్లసమాడుతుమ్మెదలయుత్సవకేళి విహంగగీతికా
వల్లకికేవి గాంచి హరి వత్సలతన్ భరియించె గోపికా
వల్లరులం గరేణువుల వారణరాజు వహించు చాడ్పునన్.

గీ. ఘనరసాశ్రయ పరాకాష్టకదలు గోపి
రమణ కాశ్రయపరాశరద్రాత్రులందు
సత్యకాముఁడు కృష్ణుఁడు సఖులతోడ
నస్ఖలితుఁ డయ్యుఁ గ్రీడించె నతిముదమున.

గీ. ఇంద్రియస్ఖలనము లేనిసాంద్రసురత
సౌఖ్య మొసఁగూర్చె దను మనసారఁ గోగ
హృదయపుష్పము లర్పించి ముదిత లైన
ముదిత లెల్లరివాంఛితమ్ములుఫలింప.

గీ. ధర్మరక్షణ సేయ సధర్మమడఁప
గృష్ణరూపముగా జగదీశ్వరుండు
తనదుపూర్ణాంశమున ధరిత్రిని జనించి
లీల ప్రీతి జెలువొందఁ గ్రాలె నపుడు.

సీ. బ్రహ్మ పురుషుఁడు బ్రహ్మేతరమ్ము లెల్ల
స్త్రీలు వారి సంయోగమే సృష్టిఫలము
లిట్టి దృశ్యప్రపంచము లెసఁగుచుండు
లేనినాఁ డెల్ల లోకము శ్లేస పోను.

సీ. అఖిలజీవులలోన నేకైకమూర్తి
బింబమె ప్రతిఫలించుచో భిన్నమేమి ?
తన్నుఁ దాను రమించుట తప్పిదంబె
ధర్మబాహ్యమె దోషవర్తనమె తలఁప.

సీ. సర్వభక్షకుఁ డగునగ్ని సర్వదా ప
విత్రుఁ డైనట్లు త్రిజగతీవిభుఁ డతండు
తన్ను వలచిన గోపికాతతినిఁ గూడె
నభిమతముఁ దీర్ప నది దోష మనఁగరాదు.

సీ. తన్నెఱుంగఁగఁ జాలినధన్యజీవి
కృతము లజ్ఞాని చేయుఁ గోరికలు గనుట
నక్షరాభ్యాస మొనరించునర్భకుండు
వేదపారముఁ జదివెడువిధము కాదె ?

సీ. గోపిక లనంబడుమునీంద్రకోటి హృదయ
కలశములలోని క్షీరము గలఁచి తఱచి
విష్ణుగోపాలుఁ డందులో వెలసినట్టి
మిసిమి గ్రసియించి సాయుజ్య మొసఁగె నట్లు.

ఉ. తావియు రూపము న్బలువిధంబులుగాఁ గనుపట్టుచుండినన్
బూవులలో మరంద మొకపోల్కి రహించెడునట్లు సృష్టిలో
జీవులు భిన్నభిన్న మగు చిత్రవిచిత్రతనూస్వభావముల్
చేనల నెన్ని పొందినను జీవి యొకండె వికారశూన్యుఁడై.

సీ. ఒకమహాద్భుత మగుహరినుండి వెడలు
భూతకోటులు ముల్లోకములను జేరి
వివిధతను రూపములఁ బొంది వెలుఁగుచుండు
నగ్నిలో పేచు రవ్వలయట్లు వెడలి.

సీ. మదకుంభికుంభస్థమాంసము బెకలింప
హర్యక్షమే కాక హరిణి యౌనె?
బ్రహ్మాండభాండము భాసురముగ శశి
ద్యుమణులే కాక ఖద్యోత మౌనె?
కులపర్వతంబుల గుదియించి విదళింపఁ
గులిశధారయె కాక గొడ్డ లౌనె?
కలనినాదశ్రుతిను లాలికించి తలకింపఁ
గాఁ బికంబగు గాక కాక యౌనె?

తే. బహుళసలీలల గోపికాభామినులను
వలచి వలపించి తుల లేనిఫలము నొసఁగ
సర్వశక్తిసంపూర్ణుఁడౌ శౌరి కాక
దురభిమానమానవునకుఁ దరమె ధరణి.

సీ. శివుఁ డొక్కఁడే కాక క్షీరోదధిం బుట్టు
హాలాహలము గ్రోలఁజాలు నెవఁడు?
హరి గాక మంధరగిరి మూపునం దాల్చ
గమఠరూపంబును గాంచు నెవఁడు?
(శ్రీ)రాముఁడే కాక చెలఁగి కోఁతులమూఁక
తోఁ గూడి రావణుఁ ద్రుంచు నెవఁడు?
పద్మయోనియె కాక బ్రహ్మాండభాండముల్
సృష్టించువిధము నూహించు నెవఁడు

తే. ప్రభు వొనర్చెడుకార్యము ల్పటుఁడు సేయఁ
దలఁకొనిన నెట్టిఫలములు దారసిలునొ!
నట్టివే చూవె (శ్రీ)కృష్ణు ననుసరించి
పరసతీకేళిఁ గోరెడుపాపికృతులు.

వ. ఇప్పట నిట్లుండ.

ఉ. ఎఱుఁగరు గోపకు ల్దమదువింతులు కృష్ణునిఁ గూడిపోయిగా
వరయమునాస్రవంతికడ నంతులు దీరెడువింతవృత్తముల్
హారికరుణావిశేషమున నందఱిశయ్యలయందు వారిసుం
దరులువసించుచాడ్పునను తర్పితులైరి యథాక్రమంబుగన్.

మ. రజనీరాజ్ఞి శశాంకసుందరు సుహృద్రాగంబునం బూని యం
బుజనాభ్రాజ్యముహద్దులం గడచుచోఁ గైకొన్నకార్యంబునన్
నిజవైలాస్యము నీఁగి పాండురకళానీతాంగి యైనట్లు న
క్కజమై దిక్కులు తెల్లనాయె రజనీకాంతుండు గ్రాంసుంగగన్.

ఉ. చక్కనికాంత యశ్వినియుఁ జాలక కౌముదికామినీమణిన్
దెక్కలి సొక్కి యంత తమిఁ జెందక రేపటిపొందు గోరగా
నక్కున నందె బంగినుక మైకొని జారకశంకితుండు నా
చుక్కలరేనిపొం గణఁప సూర్యుఁడు తూర్పునఁ దోఁచె నయ్యెడన్.

క. సిగ్గు చెడియున్న గోపికాస్త్రీలవదన
ములను దిలకించి చిలిపిచేతలబడాయిఁ
జేటుఁ జెఱఁగెదురీతి రాజీవరమణి
మొలకనవ్వుల నొలికించె మొగ్గ విప్పి.

సీ. నలరాజుచిలిపికోర్కులఁ జూపెద నటంచు
నొయ్యారముగ నాడ నూనె నెమలి
కేళిలో లాలింపుజోలపాట లివంచుఁ
గులికి కో యని కూసెఁ గోయిలమ్మ
యుల్లసమ్ములతోవి పెల్లగించెద మంచుఁ
గ్రేళ్ళుఱికెను గన్నె లేళ్ళగుంపు
మంగళాంగులహంసుపాంగు లిట్లే యని
కులికె సీతాకోకచిలుకభామ

తే. పడఁతు లొలికించునానందబాష్పము లటు
కురిసె మంచుబిందువులను దరులతికలు
కొడిగము లిట్టు లాదవినఁ జేడె లెల్ల
సిగ్గుపడి మోము లెత్త వాంఛింపరైరి.

సీ. చెరఁజీరముంగురు లసరి దిద్దె నొకలేమ
చివురువాతెఱఁగంట్లు నివిరె నొకతె
చెక్కుటద్దమ్ములచెలువు దీర్చె నొకర్తె
తిలకము నుదుటిపైఁ దీర్చె నొకతె

నలఁగిపోయిన చీరె దులిపి కట్టె నొకర్తు
ప్రిదులుపయ్యెద చక్కఁ బెట్టె నొకత
పిగిలినజైక చక్కఁగ దాఁచె నొకతెమ
వాడినమాలల వీడె నొకత

తే. గతనిశీథనిమదనసంగ్రామ మందుఁ
గలుగునగుఁబాట్లు నగచాట్లు గప్పి పుచ్చ
ముప్పు త్రిప్పలు పడి గొల్లముగుద లెల్ల
దమతమకొలంది మర్మము ల్దాఁచుకొనిరి.

ఉ. అంతల గోపికారమణు లందఱుఁ గృష్ణుఁడు తొందరింపఁగా
భ్రాంతి దొలంగలేక హరి బాయ మనస్సులు రాక యెట్టులో
చింతలు దీరి గేహములుఁ జేరఁ బ్రయాణము సేయుచున్ మును
కాంతుని దిక్కుఁ జూచుచును క్రమ్మరిపోయిరి మందయానలై.

చ. మధురనిశీథమందు హరిమన్ననఁ గన్నమనోజ్ఞవృత్తముల్
పృథులముగాఁ దలంచుచు హరీ యని పాడుచు, వారివారిదృ
క్పథములలోనఁ గృష్ణుఁ దమపాలిమనోభవుగాఁ దలంచుచున్
వ్యథలు దొలంగి, సంతతము, ప్రార్థనఁ జేయుచు నుండి రెల్లరున్.

క. శ్రీకృష్ణునాజ్ఞఁ గైకొని
రాకాశశివదనలిండ్లు రయమునఁ జేరన్
బ్రాకృతులు గాన గోపకు
లేకరణిన్ సంశయింప రింతుల నెవరున్.

క. శ్రీకల్యాణీహృన్నా
ళీకప్రణయమధువృత్తిలీలాభృంగా!
శ్రీకరకరనీరజహే
లాకల్పితభువనచయవిలాసతరంగా!

గ. ఇది శ్రీసుబ్రహ్మణ్యేశ్వరకృపాకలితకవితావిధేయ, వాడేలవంశసుధా
పయోనిధి కలానిధిగేయ, వేంకటశేషగిరిరాయ నామధేయ ప్రణీ
తం బైన శ్రీకృష్ణాభ్యుదయ మహాకావ్యంబునఁ బ్రథమాశ్వాసము.

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.

ఓమ్

# శ్రీకృష్ణాభ్యుదయము

## ద్వితీయాశ్వాసము

శ్రీమద్వైకుంఠనగరీ
ధామా! స్వీయపరపక్షతారహితగుణా!
ద్దామా! కళ్యాణప్రద
నామా! సకలాభిరామ! నందితసోమా! 1

క. నీ లీలలు నా ముఖమున
నాలింపం గోరుకొంట యది సంసరణ
వ్యాళోలుని ముక్తిరమా
పాలితు నొనరింపఁగాదె పలికెద వినుమా! 2

క. నీవే చరచరాత్మక
జీవులుగా భిన్నరూపచేష్టలఁ దొడరన్
నీ వెవ్వరు నే నెవ్వరు
నీ వే నే నీవెకద మనీషామూర్తీ! 3

తే. కాని మఱి శ్రోతృ వక్తృ వక్తృత్వరూప
బాంధవమ్మున నుత్తమత్వంబు నాకుఁ
గూర్ప వక్తవ్యుఁడగు నందగోపబాలుఁ
డీవు మాధ్యస్థ్య మూనితి వింక వినుము. 4

—* సుదర్శనశాపవిమోచనము *—

వ. ఒక్కనాఁడు నందాదు లయిన బృందావనవాసు లగు గోపు
లెల్లరు దైవతోత్సవ వీక్షాపేక్షు లయి యంబికావనంబున కరిగి
శివు నారాధించి వేకువ సరస్వతీతరంగిణిం గ్రుంకులిడి తీరంబు
గదిసి రంత. 5

మ. తటినీప్రాంతమహోపలావిదితభేదం బొక్క ఘోరాహి ప్ర
స్ఫుటవిక్రాంతిఁ బరిక్రమించి ధరణీవ్యోమంబుల న్మ్రొట్టఁగాఁ
జటులాకారతఁ దాలువుల్ విడఁగ నాస్యం బంతటన్ విప్పి సో
త్కటగీతిన్ గని పట్టె నందుని భయార్తధ్వానముల్ మెండుగన్. 6

మ. విని గోపాలకహారవంబు లటకున్ విచ్చేసి శ్రీనందనం
దనుఁ డావ్యాళముఁ గాంచి తా నెడమపాదం బెత్తి తన్నంగ నం
తన దర్వీకరరూపమున్ విడిచి గంధర్వుం డొకం డప్డు తోఁ
చె నటన్ గోపసమూహ మంతయును నచ్చెర్వొంది వీక్షింపఁగన్. 7

తే. ఇట్లు గంధర్వరూపంబు నెనసినతఁడు
శౌరికి నమస్కరించి సాత్త్వ్యహుఁడగుచు
వినిచె నాత్మవృత్తాంతంబు విపులమోద
బాష్పములు గండయుగమునఁ బర్వికొనఁగ. 8

మ. అనఘా! నేను సుదర్శనుం డనుఁ బ్రభిల్యం గల్గు గంధర్వుఁడన్
ఘనసౌందర్యతపోవిలాసితుఁడనై గర్వించి, సంపత్ప్రయో
జన మొప్పారఁ, విమానయానమున, స్వేచ్ఛాయాత్ర గావించుచున్
మునులం గన్గొని నవ్వితిన్ వికటరూపు ల్వార లం చెంచుచున్. 9

తే. వార లాంగిరసులను తపస్వివరులు
నన్ను నాగర్వముం గాంచి పన్నగముగ
నంబికావనంబున నుండు మనుచు శాప
మిడిరి నే నాటనుండియు నిందు నుందు. 10

ఉ. లోకగురుండవై, ప్రణతలోకము నేలుచు నుండునట్టి సు
శ్రీకరుఁడ వీవు, నీచరణసేవ లభించెను దద్ద్విజంబు పై
నాఁకుటచేఁ దరించితిని శుద్ధుఁడ నైతిని మహానాయకు
ల్నా కిడినట్టి శాపపరిణామఫలం బిటు లొప్పె నీశ్వరా! 11

క. స్వామీ! నీదర్శనమునఁ
గామితములు దీరెఁ బాతకములు నశించెన్
నా మునుపటిరూపం బిడి
శ్రీమహాత్మ యనుజ్ఞ సెలవీయుఁ డనున్. 22

వ. అని మధువైరికీర్తిఁ గొనియాడుచు నాజ్ఞను బొందుచుం బ్రద
క్షిణ మొనరించి, మ్రొక్కి విలసిల్లు ముహంబు సుదర్శనుండు చ
య్యన దసభూమిఁ జేరుకొనె నచ్చటియుత్సవము లుగ్గించి గ్రొ
బ్బున వ్రజవాసు లెల్లరును బోయిరి పొంగుచు మందఁ జేరఁగన్. 13

—* శంఖచూడవధ *—

కం. శ్రీకృష్ణుఁడు బలరాముఁడు
రాకాశశివదన లైనరామలతోడం
బ్రాకటముగ యమునానది
సైకతతలమున వసించి సంభ్రమ మొప్పన్. 14

సీ. [illegible]హాహృద్యు లైన. పడఁతులతోఁ గూడ,
లలితగాంధర్వంబు నోలుకఁ జేసి,
కలధౌతవస్త్రము గట్టి, యంచితపుష్ప
వనమాలికలు కంఠమున ధరించి,
మలయజపంకము నలఁది, కస్తూరికా
తిలకము నొసటిపైఁ దీర్చి, దిద్ది,
జడపైని నెమలిపింఛము హొంగుగా నిల్పి,
గుంజావతంసము ల్గొమరు గొల్పి

తే. కడఁగి బలరామకృష్ణులు, పడఁతుకలను
గలసి మెలసి యానందశృంగారరసము
లోలికిపో యెడురీతిగా లలితకళలఁ
దేలియాడిరి కాళిందితీరమందు. 15

సీ. సంపూర్ణకళలతో శారదాచంద్రుఁడు
పండువెన్నెలల శోభనము దీర్ప,
సిందురాగముఁ జెంది యిందీవరాంగన,
వికసించి కమ్మతావిని విదల్ప
గంధవాహుఁడు మెల్లఁగాఁ గమ్మపుష్పాళిం
గొని వీచి, సౌరభమును సృజింప,
మధుమరందము గ్రోలి, మత్తిలి ఝుమ్మని,
తుమ్మెదల్ గానము గ్రుమ్మరింప,

తే. నగవు లిగురొత్త నయ్యమునాస్రవంతి
కృష్ణబలరాము లాడెడుక్రీడ గాంచి
మురిసిపోవుచు, రత్నమంజరులు విసరెఁ
గంకణములు తరంగసంగతము గాఁగ. 16

ఉ. వామభుజంబుపై నొరుగువైఖరి దోఁప శిరంబు వాంచియున్
మోమునఁ గ్రోవి నుంచి, యరమోడ్పుగనుంగవ జేవురింప, గా
రామున నూఁదుచున్, విమలరాగసుధారసధార లూరఁగా
శ్రీమహితుండు చెన్నలరఁ జేసె జగజ్జనానుమోదమున్ 17

కం. మురళీగానమరందము
నరవిందేక్షణలు గ్రోలి యానందముచేఁ
బరవళ్ళు ద్రొక్కి యాడుచు
మఱచిరి దేహాభిమాన మర్యాదలనున్. 18

చం. ఎఱుఁగరు కొప్పులందు విరు లెల్లను రాలుట కట్టుపుట్టముల్
పరువు నలంతిఁ జేయుటలు పయ్యెదకొంగులు జీరియాడుటల్
హరిమురళీనినాదమధురామృతపానవిలోలచిత్తలై
మఱచిరి దేహము ల్వినుతమార్గము లన్నియు గోపభామినుల్. 19

గీ. ఇట్లు స్వేచ్ఛగ మురళి మ్రోయించి గమ్య
కామరసమును గురియించు కాలమందు
శంఖచూడుం డనుకుబేర నార్వభౌము
సేవకుఁడు రామకృష్ణులఁ జేరవచ్చి 20

ఉ. చక్కెరవింటివానిసుమసాయకపంక్తివిధానఁ దోఁచు నా
చక్కనిచుక్క లౌ చెలులఁ జయ్యనఁ బట్టి భుజస్థలంబునం
దక్కునఁ జేసి, మోసికొని, తాండవ మాడుచు, నుత్తరంబుగా
నక్కజ మొప్పనేఁగె జలజాక్షులు నేడ్చుచు నున్న వీడకే. 21

శా. పులివాతఁబడి యేడ్చు నావులవలెం బాలేండ్లు సోన్మాదుఁడా
ఖలుచేఁ జిక్కి మహార్తి నొందుచు, హాకే! కల్యాణకృష్ణా! మహో
త్పలనేత్రా! రతిరాజసుందర! కృపాధౌరేయ! కాపాడవే
లలనాపాలనఖేలనా! యనుచు నాలాపంబులం జేయుచోన్. 22

చ. హరి బలరాముతోఁ గలిసి యక్షభటుం డురువేగగామియై
పఱువిడుచున్న మార్గమును బట్టి శిలీముఖవేగులై భయం
కరమగు సాలవృక్షముఁ గైకొని యోడకుఁ డీ రటంచు ని
ట్టురములు బల్కుచు న్దరియఁ బాఱుచుఁ జేరిరి శంఖచూడునిన్. 23

గీ. కాలమృత్యువుగతి భయంకరులు గాఁగఁ
దోఁచు బలరామకృష్ణులఁ జూచి యక్ష
భటుఁడు భీతిలి కాంతల వదలివేసి
బ్రతుకుజీవుఁడా యనుచును బాఱిపోయె. 24

మ. దురితాత్ముండు కృతాపరాధి యితనిం దున్మాడి లోకంబునం
బరికాంతాహరణ ప్రయుక్తఫలసం ప్రాప్తం బిదే యంచునుం
బరమాదర్శనము జూపఁ గోరి హరి యాపాపాత్ము వెంటాడి త
చ్ఛిరముం దద్గతశంఖముం బొడిచి సంఛేదించి శీఘ్రంబుగన్. 25

గీ. తనువుతో వేఱువడిన యాతనిశిరంబు
శంఖముం దోడఁ గొని వచ్చి సకియ లెల్లఁ
జూచుచుండఁగ గృష్ణుఁడు సోదరునకు
నిచ్చె బలరాముఁడుం గొని మెచ్చె ననుజు. 26

క. అంత నుషఃకాల మగుటఁ
గాంతుఁడు బలరాముఁ గూడి కాంతలతోడన్
వింతలు దెలుపుచు నిండ్లకు
సంతసమున నేగె నిట్లు సరసత మెఱయన్. 27

—* గో పి కా వి ర హ ము *—

ఉ. శ్రీమతు లెల్ల గేహములఁ జేరిరి కాని మనోజ్ఞకేళికో
ద్దామకళావిలాసములఁ దాండవ మాడెడు కృష్ణదేవుఁడే
ప్రేమమయస్వరూపుఁ డయి హృత్ఫలకమ్ములఁ దోఁచి హాయిగా
గోములు దీర్చుచున్నటుల గోచరమైన విలోలచిత్తలై. 28

క. పరికిఁ దోఁచినవిధమున
వారలు శ్రీకృష్ణుఁ దలఁచి వాత్సల్యముతో
నారాధించుచు మెలఁగిరి
నారీమణు లెల్ల ప్రణయనాయకుఁ డనుచున్. 29

సీ. హృదయ సింహాసనమున వసించియున్న
ప్రేమమూర్తి నర్చించుచుఁ బ్రీతి దనర
జ్ఞానసుమములఁ బూజించి ధ్యానముద్ర
గొనియె నొకలేమ నిశ్చలముని యనంగ. 30

ఉ. ఆతఁ డనంగుఁ డంద్రు రుచిరాంగము కన్నులఁ గట్టినట్లుగా
ద్యోతకమౌ నిదేల యని తొయ్యలి యొక్కత ఱెప్పలార్పకే
ప్రీతి విహాయసంబువెస వీక్షణఁ జేయుచు భక్తియుక్తయై
చేతము నప్పగించి నుతి సేయఁదొడంగెఁ గదేకచిత్తయై. 31

చ. అలికులవేణి యొర్తు పరమాత్ము ననంతవిలాసరూపము
ల్తలఁపులు నిండుకొన్న దమి దాళక యాతని గూడియాడుచున్
బిలుచుచు ముద్దుముచ్చటల పెంపు వహించుచునున్న రీతిగాఁ
దలఁచి తదన్యవృత్తముల ధర్మము నెంచక యుండె మానతన్. 32

ఉ. వామకపోలభాగమును వామ భుజస్థలి నిల్పి కన్బొమల్
గోములఁ దీరుచుం గానెడఁ గ్రోవి ముఖంబున నిల్పి యాడుచున్
బ్రేమసుధారసంబు గురిపించు మనోహరు పిడియుండ నే
భామ భరింపనోపు నని పల్కుచు నొక్కత యుల్కిపోయఁగన్.

మ. మురళీనాదమహత్త్వ మెట్టిదియొ సమ్మోహాస్త్రసాదృశ్యమై
తరుణీలోకము వెంటనంటి మృకుచిత్తస్వాస్థ్యము ల్దూసి ని
ర్భరమోహంబు ఘటించుచుండు శ్రుతిపర్వంబై మనోజ్ఞంబునై
పరమానందకరంబునై మనులు సంభావించు మమ్మెల్లరన్. 34

చ. మన మన నెంత? నింగిని విమానములందు బతిప్రయుక్తతం
దనరు సురాంగనామణులు దన్మురళీనినదంబు విన్నచో
మనములు పొంగి యాడెదరు మన్మథమన్మథుఁ బొందుఁ జెందనె
మ్మనములఁ గోరుచుండుదురు మానని మారకళావిలోలతన్. 35

ఉ. ఆమహనీయ మూర్తి రుచిరాననుఁడై దరహాసచంద్రికల్
కామకళావిలోలితముగా రహియింపఁగ వేణు వూదుచో
నీమహి సర్వజీవులు నహీనసుఖానుభవప్రమోదులై
స్వామిపదాబ్జము ల్గొలువ సంభ్రమ మందెద రెల్లవేళలన్. 36

గీ. గోష్ఠమందలి లేఁగలు గోగణములు
కృష్ణమురళీనినాద మాలించినంత
గొఱికతృణములు నీడి మైమఱచి దోర
చెవులు నిగిడించి వినుఁ జిత్తరువులువోలె 37

గీ. గైరికాదిధాతువులు మయూరపింఛ
ములును కెంజివురాకులు మున్నగునవి
కలిగి విలసిల్లుహరి ముద్దులొలుకు మురళి
నూదినఁ బసులు చెలరేగి మోదమందు. 38

సీ. నదులు వేగము మాని నమ్రతరంగ హ
స్తములతోఁ గృష్ణుపాదములు వట్టు
వరులతాకుంజసంతానంబు ఫుల్లప్ర
సూనమరందము సోనగురియు
ప్రకృతి మహాలక్ష్మి భాగ్యవిస్తార యై
యమృతకరము లెత్తి యాదరించు
శృంగారవనరాజి సంగీతముం బాడు
పులుఁగుల సేవకై నిలుపుచుండుఁ

తే. బంచభూతమ్ములు ముకుంద పాదసేవ
సేయఁ దఱి వేచిసిద్ధులై చెలఁగుచుండు
రట్టిమహానీయమూర్తి గానామృతంబు
మఱచు టెట్లు విరాళిని దొఱగు టెట్లు? 39

సీ. వర్ణనీయుం డగుదళితారి కృష్ణుఁడు
వనసీమలోని సువాసనగల
తులసీప్రసూన నిస్తులమరందము గ్రోలి
మదియించి పాడు తుమ్మెదలరమ్య
గానము నాలించి వేణువునూదుచో
గొలనునం గల్గు హంసలును జక్ర
వాకము ల్మున్నగుపక్షులు గానశ్ర
వణముచేత విరాళిఁబడి తపించి

తే. కన్ను లరమూసి మౌనము గాంచి తన్మ
యత్వమునఁ దోగుచుండఁగా నతని వలచి
తలపులం గని భ్రమసినచెలుల మేము
తాళియుండుమే హరి వీడి తమి భరించి. 40

సీ. పూలదండలు నిజకర్ణభూషలుగ ధ
రించి కొండలలోనఁ జరించునపుడు
వేణువూదినన్ మేఘుఁడవ్విధముగానె
యురుముచు స్వర్షధారలు గురియుచుండు. 41

మ. మురళీకృష్ణుఁడు వేణుగానమును సమ్మోహంబుగాఁ జేయుచో
స్వరసాహిత్యవిశారదుల్ హరి, హర, బ్రహ్మేంద్రులున్ వాణియున్
శిరము ల్వంచెద రెల్ల గానఫణితిశ్రీకంబు గుర్తింపకే
పరమామ్నాయముఁ జెందినట్టి తలఁపు ల్భావింత్రు సానందులై. 42

వ. అని తలపోయుచు 43

వ. వలపులరాణి యొకట్రత దివాకరమూర్తిని జూచి, యెంతగాఁ
గులికెదవయ్య! మాయసురు కొట్టకపోవున! రాజు వచ్చినీ
యులుకు నడంపకున్నె? కనవో! పరివేషము పాటి వచ్చి ని
న్నలమఁ దలంచుచున్నయది; యాఁగక పొమ్ము పశ్చిమాద్రికిన్.

చం. కలువలతేనినిద్దమగు కాంతులలోఁ బతిసేవఁ జేయగా
దలఁచెదుమాకు, నీ వెచట దాపురమైతివో? యేకధాటిగా
వెలుఁగులుఁ జిందుచున్ బగటివేషము వేసి విలంబగామివై
చెలువల నేడిపించెదవు; శీఘ్రముగాఁ జనుమింక భాస్కరా! 45

కం. క్రూరగ్రహ మని పండితు
లూరక నే యనిర నిన్ను? నుగ్రకరుఁడవై
నీరములను గ్రసియింతువు
నీరజములఁ గూడి యాడ నేర్తువు మిత్రా! 46

సీ. అత్తవారింటి సత్త్వము నపహరించి
జలదములకు దానం బిడుస్వామి వీవు;

నిన్ను నిందింపరాదు; వందింపరాదు;
మంచివాఁ డని యెంచి మన్నించరాదు. 47

చం. నిలుకడమీఁదనే తెలియు నిక్క మటన్న విధాన సర్వముం
దెలిసెను లే విడాకు లిడి దేశముపైఁ బడి పోయెఁ గామిని
తిలకము ఛాయ నీదుకంతెవ్రత నోర్వకగాదె? క్రూరుఁడా!
పోలఁతుల నేడిపించుటయెఁ బరివాటికెకదయ్యా! నీయెడన్ 48

చం. మఱచితివేమొ? నీయులుకు మాచుప ని న్నరికట్టినట్టిసుం
దరి సుమతీరమామణిని; దర్పముఁ జూపకు స్త్రీలపై నికం
ద్వరపడి పారిపోఁదగును; దప్పితివా? హరితోడఁ జెప్పి నిం
బొరిగొను రాహుసర్పమును బుత్తుము; గత్తర తెత్తు నిత్తాకిన్. 49

కం. మును పాకకోఁతిముఖాంతర
మునఁ బడి కను లొట్టవోయి మోఁచసి యెట్టో నీ
జనయిత్రి కడుపుచలువన్
మనఁగల్గితి వెట్లొ దుడుకుమానుము తపనా! 50

కం. క్షణ మొకయుగముగఁ గడపెడు
వనజేక్షణలం దపింపవలవదు మిత్రా!
జను మీఁకఁ బశ్చిమదిశకును
గనుగొందుము ప్రాణనాథుఁ గన్నులతోడన్. 51

—* వృ ష భా సు ర వ ధ *—

శా. (శ్రీ) కల్యాణగుణాభిరాముఁ డగు లక్ష్మీనాథుఁడే భర్తగా
రాకాచంద్రనిభానన ల్మదనసామ్రాజ్యంబుఁ బాలించుచున్
నాకల్యానుభవప్రమాణముల, విజ్ఞానంబు దీపింప, న
స్తోకానందము గాంతు రిట్లు గతసంక్షోభాత్మసంచారలై. 52

కం. కతిపయదివసము లవ్వల
క్షితిపతి కసుండు నసుపఁ జెలఁగెడుపగతో
దితిజుండు వృషభుఁ డనియెడు
పతితుఁడు విచ్చేసెఁ గృష్ణబాలకు నొంపన్. 53

సీ. ఎవ్వాని ఱంకె లాలించినమాత్ర గ
ర్భస్రావ మగు సతీవారమునకు;
నెవ్వానిమూఁపుర మీక్షించి, మేఘము
లచలవిభ్రాంతిచే నాశ్రయించు;
నెవనిగిట్టలపోటు లెసఁగినంత, నవంత
విశ్వాంతరాళము వ్రీలిపోవు;
నెవ్వానిశృంగాగ్ర మొన లేనిశూలాగ్ర
ధారాసమానమై తనరుచుండు;
తే. నెవనివాలముఁతాకిడి నెనయుకతనఁ
దోరపుశిలావళులు తునాతునియ లౌనొ
యట్టి దనుజుఁ డరిష్టనామాంకితుండు
వృషభరూపము గొనివచ్చెఁ గృష్ణుఁదాక. 54

సీ. ఖురఘట్టనములచే ధరణీతలం బెల్ల
నడనడ నడఁకి కీడ్పడుచునుండ;
మేఘనిర్ఘోషల మించుఱంకెలు విని
పశుపక్షిమానవు ల్బడలుచుండ;
శృంగాగ్రనిహతిచేఁ జెడి పట్టుదొఱఁగియు
గిరివప్రములు నేలకొఱఁగుచుండ;
వాలతాడనమున వనమహీరుహములు,
గూఁకటివ్రేళ్ళతోఁ గూలుచుండ;
తే. నేలఁ గాళ్ళను ద్రవ్వుచు, నింగివైపు
మోరనెత్తియుఁదోక దైవారఁ జూడఁ
జెంగుచెంగున దూఁకుచుఁ జెనఁటిదైత్య
భటుఁడు విచ్చేసె గోపనివాసమునకు. 55

ఉ. ఆవృషభాసురుం గని భయాతురులై వ్రజవాసు లెల్లరున్
జేవ దలంగి నల్దిశలఁ జిక్కకఁ పాఱిరి మంద వీడియున్
గోవులు, లేగలుం బెదరి గోష్ఠముల న్విడి బిగ్గనార్చుచున్
బ్రోవయి, డొంక కన్గొనక, దూఁకుచుఁ బాఱె నరణ్యభూమికిన్. 56

ఉ. గోకులభూమియందుఁ గలగొల్లలు కొందఱు శౌరిఁ జేరి, కృ
ష్ణా! కరుణింపరావె! వృషభాసురబాధఁ దొలంగఁజేయరా
దే! కఠినాత్ము నింక వధియింపకయున్న భరింపలేము; సు
శ్రీకర! యంచు వేడుకొన, శ్రీపతి దాపునఁ జేర్చి వారలన్. 57

మ. కలఁతి న్మానుఁడు బంధులార! మదవిక్రాంతుండు నై వచ్చి గో
వుల గోపాలుర, గోపికాసతుల, సంపూర్ణంబుగాఁ ద్రచ్చు నీ
ఖలుఁ దున్మాడెద; నిప్పుడే యనుచు శ్రీకాంతుండు, క్రోధాగ్నికీ
లలు నేత్రాంతములందుఁ దోఁప వృషభు న్లక్షించి గర్జించుచున్. 58

తే. హుమ్మనుచు నొడుగఱచి యత్యుగ్రదృష్టి
నసురపేరంబు సేఱుగా నరసి రోష
మున భుజాస్ఫాలన మొనర్చి వనజనేత్రుఁ
డవ్వృకలిఁ గోడ [illegible] దా ననియె నంత. 59

తే. ఓరి పసరమ! నాచేత నొక్క రొక్క
రై జమునిఁ జూడఁగన్న నీయాప్తకోటిఁ
జూడ మనసయ్యె నేమి? యయాత్మనక్య మద్ది
తీర్చెదంగాక! నమ్ము భీతిల్లకుండ. 60

క. కాలాంతకసన్నిభుఁ డై
నీలాంబుదదేహుఁ డట్లు నిలిచి పిలువఁగా
వాలము ద్రిప్పుచు వృషభుఁడు
వాలాయము వచ్చి తాకె వసుదేవసుతున్. 61

గీ. మొనలు దేలినకొమ్ములు ముందుసాచి
కనుల నుల్కలు రాలఁగాఁ గాళ్లు నేల
ఱాచుచు న్బాణవేగుఁ డై ఱంకెలిడుచు
వచ్చె హరిఁ దాకెఁ వృషభుఁ డవారితముగ. 62

చ. కరి కరి దాకినట్లు గిరికాయునితో హరి మోహరించి తే
వగముగ గొమ్ములం గదియఁబట్టి కుదించి గిరాటుపెట్టినన్
దురితుఁడు ముమ్మరం బుడిగి దూరమునం బడిపోయి లేచి హుం
కరణముఁ జేయుచు న్గదియ గ్రమ్మఱ వచ్చె నుదగ్రకోపియై. 63

గీ. పదియునెన్మిదియడుగుల వఱకు వెనుక
కొఱగిపోయిన వృషభుఁడు హుంకరించి
మేను చెమరింప రోజుచు మిడిసిపడుచుఁ
గొమ్ములం గ్రుమ్మ వచ్చె రోసమ్ము వెంచి. 64

ఉ. అట్టుల వచ్చుచున్న వృషభాసురుఁ గన్గొని వాని శృంగము
లట్టిగఁ బట్టి యంబురుహకాండము తుండముతోడ లీలదాఁ
బట్టి కుదించు బాలకరిభంగిని ద్రుంచియు వానితోడనే
గట్టిడి రాక్షసాధముని కాయముఁ గ్రుమ్మెను గృష్ణుఁడుమ్మయిన్ 65

చ. విలవిలఁ గాళ్లు దన్నుకొని వెచ్చనిరక్తము నోటఁగ్రక్కుచున్
మలమును మూత్రము న్విడిచి మ్రాన్పడి కన్నులు దేలవైచి దు
ష్కులజుఁడు వజ్రభిన్న మగుగోత్రములీలగఁ గూలె నేలపై
జలజల పుష్పము ల్గురిసి సన్నుతిఁ జేసిరి దేవబృందముల్. 66

గీ. పారిపోయినగోపాలవార మెల్లఁ
జేరుకొని కృష్ణు సన్నుతిఁ జేసి మఱలి
యాత్మవాసములకుఁ జేరి యధికముదము
గదుర హరితోడఁ గాలము గడపి నంత. 67

—* నారదుఁడు కంసునితో సంభాషించుట *—

శా. శ్రీరామాహృదయాబ్జభాస్కరుఁడు సాక్షివ్యక్తి గోపాలుఁడై
నీరేజప్రభవాండజాలములగ్లానిం దీర్ప జన్మించి వి
స్తారోదంచితకీర్తిశాలి యయి దుష్టవ్రాతముఁ గూల్చుచున్
గారుణ్యామృతదృష్టితో సుజనుల న్గాపాడు వాలాయమున్. 68

క. శ్రీకృష్ణుఁ డరిష్టాసురుఁ
బ్రాకటముగ జంపినట్టి బలదర్పవిధం
బాకర్ణించినకంసుఁడు
వ్యాకులుఁడై స్థిరత దప్పి వర్తించునెడన్. 60

ఉ. నారదమౌనిసత్తముఁ డనారతవైష్ణవనామకీర్తనా
ధారవిహారజీవనుఁడు తద్దయుఁ గంసనరేంద్రు పాలికిన్

జేరగవచ్చి సన్నుతులఁ జేయుచుఁ దంబుర మీటి యాడుచున్
శ్రీరమణీమనోరమణు చిత్రకథాస్మరణంబుఁ జేయుచున్. 70

క. వచ్చినదేవర్షిని గని
యచ్చెరువడి కంసనృపతి యాతిథ్యమ్మొ
నెచ్చెర నిడి పూజించుచు
వచ్చినపని దెల్పు మనుచు వాంఛించుటయున్. 71

గీ. నారదుండు హరికథా విశారదుండు
దేవకార్యము సాధించుభావ మూని
కంసుఁ బురిబెట్టి యాతనిగర్వమడఁపఁ
దలఁచి నఘనము లల్లార్చి పలికె నిట్లు. 72

ఉ. కంసనరేంద్ర మోడకుము కర్మవిపాకము భిన్న మాటచే
శంసితకార్యము న్విడక విచారముఁ జెందగరాదు శత్రువి
ధ్వంసము సర్వదా యుచిత ధర్మము క్షత్రియజాతి కిట్టివీ
మీమాంస యిఁకేల? శాత్రవులమర్మ మెఱుంగుము నీకు దెల్పెదన్. 73

సీ. ఎఱుఁగుదో యెఱుఁగవో వరదైత్యుల వధించు
బలరామకృష్ణుల భవ్యకథలు
వసుదేవదేవకీవరపుత్రకులు వారు
నందగోపకునిల్లుఁ జెందినారు
సప్తమగర్భసంజాతుఁడు రాముఁడు
కృష్ణుఁ డష్టమజాతకీర్తిధరుఁడు
వసుదేవుఁడే వారి వ్రజమునఁ జేరిచెఁ
బెఱుగుచున్నారు నీకొఱకె వారు

తే. బలుఁడు శేషాంశమునఁ గృష్ణబాలకుండు
వైష్ణవాంశమునన్ మిత్రు వారిఁ గొలఁది
గాఁ దలంపకు మెన్నఁడు కంసరాజ
శత్రువధ నెంచుటయె సమంజసము సూవె. 74

చ. అన విని తోఁక ద్రొక్కిన మహాభుజగంబు విధాన నుగ్రుఁడై
కనుగొనలందు నిప్పుకలు గ్రక్కిన రాల నుదగ్రశాతభీ

షణకరనాలహస్తుఁ డయి చయ్యనఁ గంసుఁడు లేచి దుష్టవ
ర్తను వసుదేవబాలిశు శిరంబును ద్రుంచెద నంచుఁ బల్కుచున్. 75

గీ. పాఱుచుండఁగ గన్గొని నారదముని
యభిముఖంబుగ నిల్చి యయ్యసురతోడ
సానునయవాక్యములఁ గోపసంభ్రమంబు
దీర్చుచుం బల్కె హితవులు దెల్పినటుల. 76

చ. నరవర యేమిలాభ మని నాట్యమొనర్చెద విల్లు ధీరుఁడౌ
పురుషుఁడు గంటెకిం దిగులు పుల్లను గాచె యెటుల్ల నెంచులల్
హరినిగదా యెదుర్కొనుట తాను త్వదీయుల కర్హపౌరుషం
బెఱుఁగనివాని బైకొనుట యేమిఘనం బని పొమ్ముపోకదా! 77

ఉ. ఇంతకు నిన్నుఁ జంపునది కృష్ణుఁడ, యవ్వసుదేవుఁడా, మనో
భ్రాంతిని వీడి కన్గొనుము; వైరి నెదిర్చి రణప్రతాప వి
క్రాంతి పరిక్రమించుటయె క్షత్రియధర్మము; మూల నున్న వి
భ్రాంతుల వృద్ధులందునుఁ బాల్గొను టొప్పిదమౌనె చెప్పుమా. 78

గీ. సాముగరిడీల నారుమాసములు నేర్చి
మూల నున్నట్టిముసలమ్మఁ గూలఁద్రోసె
నన్న చందాన నున్న దీయాగ్రహంబు
చాలు లేవయ్య నీప్రతాపాలఘనత. 79

గీ. చెప్పుచుండెడుకథనంబుఁ జెప్పనీక
పానకములోనిపుల్లగాఁ బరిణమించె
నీయసమయరసాభాసనిగ్రహంబు
విషయమెట్లు గ్రహించెదో వెడఁగుకంస! 80

కం. నీమేలు గోరి పల్కెడు
నామాటలు నీకు చెవిని నాఁటవు; పైగాఁ
దామసము నొంది యక్కట
భూమీభృత్సహజ ధైర్యమును గోల్పడుదే! 81

కం. అను శాపాయుధుపలుకులు
విని తాలిమి నంది ముందువెనుకలు నాలో

చనఁ జేసి కంసభూపతి
వినయముగాఁ బల్కె ముందువిషయము లెఱుఁగన్. 82

గీ. పంజరములోని రాచిల్కపగిది బద్ధుఁ
డగుచు నూపిరాడనిబంధనాలయమున
నున్న యానకదుందుభి కన్నవారి
నెట్లు గోకులమునఁ జేర్చె సిద్ధ చరిత! 83

గీ. అనిన దరహాస మొలుకంగ ముని వచించెఁ
గంసభూపాలకా! మదికలవరంబు
మాని వినుము; విజ్ఞానివై మర్మ మెఱిఁగి
కర్మ మొనరించి నిష్కృతి గనుము; మనుము. 84

సీ. ఆనాఁడు యోగమాయారూపమున నిన్ను
దండించినది యశోదాతనూజ;
శ్రీకృష్ణ విభుఁడు నీచెల్లెలుదేవకి
కష్టమగర్భజుఁ డైనసుతుఁడు;
నీవు చంపెద వని, నిసువును గొని చని
వసుదేవుఁ డునిచె వ్రేపల్లెయందు;
నయ్యశోదాదేవియాత్మజఁ గొని తెచ్చి
దేవకీసతి ప్రక్క దించె నిచట,
తే. చెఱతలుపు లెట్లు వీడెనో శృంఖలములు
తొలఁగె నెట్లో రమేశుఁడే తెలియవలయు
నెఱిఁగినంత వచించితి ధరణిపాల!
సత్య మిది; కృష్ణుఁడే నీకు శాత్రవుండు. 85

కం. దేవకిస ప్తమగర్భ
స్రావము కనుకట్టు గాక సత్యం బగునే?
యావరపిండమె రోహిణి
దేవికి గర్భస్థ మయ్యెఁ దేజముతోడన్. 86

గీ. రెండుగర్భములందు వర్ధిలుటఁ జేసి
బలుని సంకర్షణుండని పిలుచుచుంద్రు

రోహిణీసుతుఁ డద్భుతబాహుబలుఁడు
నీకు శత్రుఁడు కృష్ణునినేస్త మతఁడు. 87

కం. అనివినిచినఁ గంసుడు నె
మ్మనమున యోజించి విసిగి మౌనివరునితో
ననఘా! బంధుద్వేషం
బెనయుట కేకారణంబొ యెఱిగింపు మనన్. 88

—* కంసుని జన్మ రహస్యము *—

చ. అడిగితిగానఁ జెప్పెద ధరాధిప నీకుఁ బురాకృతంబుగాఁ
బొడమెను బంధుమత్సరగత పోఁజన దెట్లు లడంపఁ జూచినం
గడుసరివోలె బంధులకుఁ గన్పడె దీవు పురాకృతంబె యీ
వడుపున నుండఁ దప్పుకొనవచ్చునె యెంతటివారికైననున్. 89

ఆ.వె. ఐన నొక్కమాట నాలింపుము నృపాల
తామసుఁడవు నీవు తల్లిఁగూర్చి
నేను జెప్పఁబోవు నిశ్చయార్థము విని
కనలు గొనకుమయ్య కంసభూప! 90

చ. పరమపవిత్రురా లపరపార్వతి విద్యలపుట్టినిల్లు సుం
దరతరుణీవతంస మగుతల్లి సుమీ జనయిత్రి నీకు నా
గరిత మహాపతివ్రత యొకానొకనాఁడు లతానికుంజసుం
దరతరుబంధురం బగు కనన్నవ పుష్పవనాంతరంబునన్. 91

సీ. పూచిన పున్నాగములు పోకము లశోక
జాజీలసిత పారిజాతములును
మందార పిచుమంద మాకంద కురువక
చందన ఖర్జూరసాలములును
మల్లికా మాధవీ మాలతీ పాటలీ
కోవిదారవినోదకుంజములును
శారికాకలకంఠకీరమయూరాది
నానాశకుంతసంతానములును

తే. గలిగి నందనోద్యానము వెలితిసేయు
నట్టి రమ్యగృహారామమందు నొకట
నిన్నుఁ గన్నమ్మ యానందనియతితోడఁ
జేరి ప్రకృతివినోదము లొందుచుండె. 92

సీ. రంగురంగులహంగు పొంగులారఁ జెలంగి
నింగిని బాఱువిహంగవితతి
కమ్మతేనియ లాని ఝుమ్ము ఝుమ్మని పాడి
ముమ్మరంబుగఁ దోఁచు భృంగకోటి
వింతవింత బెడంగు విరిబంతుల ధరించి
మంతనంబుల నాడుమధురలతలు
వన్నెచిన్నెలచెన్ను మిన్నుమన్నును గుప్పఁ
గ్రేళ్లురికెడు కన్నెలేళ్లగుంపు
తే. పొట్టలను జిట్టిపాపలు పట్టివ్రేలఁ
గొమ్మకొమ్మను దూఁకెడు కోఁతిమూఁక
గలిగి యానందనిలయమై వెలయుచున్న
వనమహాలక్ష్మి నెలవొందెఁ బడఁతిమిన్న. 93

సీ. చిలుకసానివజీరు పలుకులు మన్నించి
వలపుపాటలు ముద్దు లొలుకఁ బాడె
గండుతుమ్మెదబారు కందర్పునాజ్ఞచేఁ
బుప్పొడిగంధముం బూయఁదొడఁగె
మిత్రవసంతుఁ డున్మిషితశోభను జూచి
శృంగారపారము ల్చెప్పసాఁగె
రతిరాణి పతియాజ్ఞ మతి ద్రిప్పుశ్రుతులచే
వలయుప్రయత్నము ల్సలుపుచుండె
తే. వానికిం దోడు పక్షిదంపతులు చెలఁగి
వలపు దాఁగిలిమూఁతలకులుకుఁ జూపె
నిన్ని సంఘటన లొక్కటై యన్ను మిన్న
మనసు మరులూని కైపెక్కె మఱచెజగము 94

ఉ. హాయిగఁ బాడుకోయిల రసాంచితగానము నాలకించి యం
దే యలనొక మోజు గొని యింపుగ నాడుమయూర రాజితోఁ
దీయగ నెత్తమాడి తమి దీరి యొయారము లొప్ప సొంపుగాఁ
గూయుమరాళముం గని యోఁ గోమలి ప్రామినకామవహ్ని చేన్. 95

ఉ. పల్లనిపిల్లగాడుపుల చక్కిలిగింతలు పైనిరాలు పూ
జల్లులకోడిగమ్ములు వసంతుననంత వికాసనర్మముల్
పిల్లవగ్రోవు లూది మెరపించెడు పక్షులరమ్యనాదముల్
తల్లడఁ బెట్టుచున్న సతి తాళక మారవికారమగ్నయై. 96

గీ. అది వసంతకాలము; మధురాతిమధుర
నియతవనశోభ; నవనవోన్మేషమైన
లేఁతవయసుకోమలి; ఋతుస్నాత; యిట్లు
లోదవిన న్మదనుం డింక వదలఁగలఁడె? 97

ఉ. చక్కెరవింటియందు సుమసాయకము ల్ఘటియించి, మిక్కిలిం
జొక్కఁగ నారి లాగి గుఱి జూచి, బరాబరి భామఱొమ్మునం
జక్కఁగ నాట నేసె సుమసాయకుఁ డెంతయు రేగి యెట్టు లా
చక్కనిచుక్క, లేవయసుఁజాన భరించును నిస్సహాయయై. 98

గీ. ఉవిద రతనాలడోలలో నూగినటుల
నుబ్బ తబ్బిబ్బు లౌచుండు నొక్కసారి;
యుస్సు రనుచును వేడినిట్టూర్పు విడిచి
కుంది దిగజారిపోవు నొక్కొక్కయపుడు. 99

మ. తరుణోన్మాదము సాంద్రవేగమున జిత్తంబున్ విదారింప నా
తరుణీరత్నము సర్వము న్మఱచి యుక్తాయుక్తవిజ్ఞానవి
స్ఫురణం బేర్పడఁగానికాలమున సమ్మోహానురాగక్రియా
పరితోషంబును గోరి యాత్మవిభు సంభావించెఁ దా నాత్మలోన్

చం. అతనువిదాహమో, మమత లారనిమోహమొ యేమొ కాని య
య్యతివ భరింపలేక, యనిలాహతకోమలమాలతీలతా
స్థితిని వడంకుచున్ జెమటచిత్తడి యొత్తిడి తత్తఱింపఁగా
మతి చెడి యుగ్రసేనవిభు మక్కువఁ జెంది విరాళిఁ దేలుచున్. 101

గీ. ఊవిద మరులూని తత్పతి యుగ్రసేను
నాత్మలో నిల్పి జోహారు లప్పనంబుఁ
జేసి వలరాజు మెలివెట్టుగాని దీరఁ
గోరి యున్మాదిని విధానఁ జీరఁదొడఁగె. 102

వ. ఆ సమయంబున. 103

ఉ. అచ్చటనే యదృశ్యుఁడయి యయ్యెలనాఁగ మనోహరాకృతిన్
ముచ్చట దీరఁ గాంచుచు విమోహరసార్ణవమందుఁ దేలు వై
యచ్చరుఁ డొక్కఁ డన్యహృదయస్థితభావ మెఱింగియుంటచే
నచ్చపుటుగ్రసేన విభు నాకృతి గైకొని వచ్చెఁ జెచ్చెరన్. 104

ఉ. వచ్చినభర్తృరూపధరు, వావిరికన్గవ నెత్తి చూచుచున్
రెచ్చినసిగ్గుచేతఁ గిరింతలబంతులక్రింతఁ గప్పుచున్
వచ్చియు రాని లేనగవు వాతెఱఁబింబముడంబు దాచుచున్
కుచ్చిత మైనయత్నములఁ గోమలి చేసెఁ బ్రవాభరంబునన్. 105

సీ. అరమోడ్పుకనులలో దొఱఁగుకటాక్షము
ల్విరిబాణములతీవి మురువు సేయఁ
జిరునవ్వుమోముపైఁ జెరగట్టునునుసిగ్గు
పాలవెన్నెలపూతఁ బైనిబూయ
వలరాజువలపుపువ్వులకటారిబడాయి
బంగారుమైచాయ దొంగిలింప;
హృదయకోశము నింపుమదనాయతితలంపు
నధరబింబము కెంపు లపహరింప

తే. పాండురంబయ్యె దేహంబు పర్వికొనియెఁ
జెమటచిత్తడి మృదుకపోలములు వాడె
గగురుపాటొదవెన్ బట్టపగటివేళఁ
బతిని రతిఁ గోరువెత నందుపడఁతి కపుడు. 106

గీ. ప్రిదులుపయ్యెద నొత్తుచు వదలుచున్న
పోకముడిఁ బట్టి కట్టుచు వీఁకఁ బొదలు
గబ్బిగుబ్బల నదిమి తబ్బిబ్బువడుచు
నేలఁ జూచుచు నిలిచె నాసీలవేణి. 107

గీ. ఉగ్రసేనరూపంబున నువిదఁ గూడ
వచ్చియున్నట్టి గంధర్వవల్లభుండు
ద్రమిడుఁడనువాఁడు పరకాంత తలఁపువలనఁ
జేర నేరఁడు పత్నితోఁ జేరినట్లు. 108

సీ. జారుపయ్యెదకొంగు సవరించుకొనుఁ గాని
తొంగిచూచు పసందు పొంగు గనదు
నడుము దాటెడుకోకముడి బిగించును కాని
కనుచూపు కోపులఁ గాంచఁబోదు
పత్యనురాగంబుఁ బడయనెంచును గాని
కిసురించు మగవానికిటు కెఱుఁగదు
వలపు దీపులు నోలిఁ జిలుకరించును గాని
ఫలసమీక్ష నొనర్చుతలఁపు కొనదు

తే. మదనమోహనవిలసనమార్గణముల
కుసుమపుఁగదుపుల వ్యథ గొన్న కోమలాంగి
హృదయభారము దీరెడు ముదము దక్క
నరయనేరదు భావిఫలానుభూతి. 109

ఉ. ఉల్లము పల్లవింప నతఁ డొయ్యనఁ జేరి రసాలశాఖపై
నల్లినద్రాక్షపందిళుల నంటిపెనంగు మనోజ్ఞమల్లికా
వల్లరు లొప్పు గుప్పు నొకభవ్యనికుంజమునందుఁ గూడె నా
హల్లకపాణితోఁ బరమహర్షనిమీలితనేత్రరమ్యతోన్. 110

ఉ. మోమున మోము గీల్పరచి ముద్దులహద్దులు రద్దు సేయుచున్
గోమలబాహువల్లరులఁ గోరిక లీరిక లెత్త హత్తుచున్
గోములపంట పెన్వగలకోపులు తీపులు దిద్ది నేల యో
డోఁ మఱి యాకసంబన నెదో కనరాని రసాబ్ధిఁ దేల్పఁగన్. 111

చ. అలఘుపతివ్రతాతిలకమైన సతీమణి వాని నన్యుగాఁ
దెలిసి నితాంతఖేదమున దిమ్మెరపోవుచు నీసడించుచున్
గలుషవిలోచనాశయవికల్పము లందుచు నోరినీచుఁడా!
చెలువలమానము ల్చెఱపఁ జేరితివా? యెవఁ డీ వటంచునున్. 112

గీ. ప్రేటువడిననాగాంగన విధము దోఁప
జివ్వనన్ లేచి తలపూలు చిమ్మివైచి
గుండెలం బాదుకొంచు గగ్గోలుపడుచు
భోరుభోరున నేడ్చె నంభోరుహాక్షి! 113

తే. గీ. ద్రవిడగంధర్వుఁ డంత దత్తరముఁ జెంది
కాలభుజగినిలీలమై గానుపించు
తరుణిదరిఁ జేర శంకించి తప్పుకునికి
సానునయవాక్యములఁ బల్కి సాహసించె. 114

మ. తరుణీ! యోడకు మేను బ్రాజ్ఞుఁడను గంధర్వుండ నశ్రాంత మ
చ్ఛరలేమ ల్ననుఁ గూడి యాడెదరు మానాంత్యమున్ మర్త్యసుం
దరు లేనాఁడును జెందలేరు మనప్రాప్తం బట్టులై నీకుఁ జే
కురె నాభాగ్యము తప్పు కాని దిది సంకోచింప నేలా? చెలీ! 115

గీ. ఎన్నితపములు వ్రతములు నెట్లు సేయ
మాదుసంయోగ మొదవు మీమానవులకు
నరులకును సురల కగునంతరము లీవు
తెలియకునికి నీకతిని బలికె దబల! 116

మ. అని స్వోత్కర్ష వచించువానిఁ గని క్రోధావేశురాలౌచు నే
మని యోదార్చెద వోయి! మందమతి! యన్యాయంబుగా మానినీ
మణిమానంబు హరించు నీచమతి వై మాయింపఁగా లేనిపో
నినిగూఢార్థము లేమొ చెప్పె దవి నీనేరంబు హరించునే? 117

సీ. అలసుఁడా ధాత్రీజలాగ్నిసమీరణా
కాశాఖ్య భూతసంఘమ్ము చూడ
లోకచక్షువు లగురాకాశశాంకభా
స్కరతారకలు నెల్లఁ గాంచుచుండ
ధర్మ దిక్కాలప్రాత స్సాయనాదిసం
ధ్యలు వెక్కసముగ నీయులుకుఁ జూడ
సంగారక బుధసురాచార్య కవిమంద
తారాగ్రహంబులుఁ జేరియుండ

తే. నందఱ నతిక్రమించి యానందమునకుఁ
బరమదౌర్భాగ్యకామతత్పరత మించి
భర్తృరూపముతోఁ బతివ్రతను గూడి
మలినపరచితె యోరోరి కలుషచిత్త! 118

ఉ. కన్నులఁ గట్టినట్టిమదగర్వముతోడఁ బతివ్రతామణిం
జెన్ను దొఱంగఁజేసితివి ఛీ తులువా యిది యేటివృత్తి నిం
గన్నది తోడఁ బుట్టినది కాంతయె కా దఁటరా యిట్టిట్టులే
బన్నము నెందుచోఁ గనెదవా కితవా కులనాశకా శఠా! 119

తే. గీ. కామదాసుఁడ వయి యవుఁగాము లెఱుఁగ
కయ్యయో యేర్తువా మగనాండ్ర నిటుల?
కామరూపము గంగలోఁ గలిసిపోను
నీవు నివు రయిపోవె దుర్నీతిపరుఁడ! 120

తే. గీ. నీదు కామపిశాచికి నీరజాక్షు
లెంద ఱెందరు బలియైరొ యేమొ వారి
యుసురు నీకేల కొట్టదో యుబ్బిపోదు
వౌర దుర్మార్గుఁడా నీతు లాడెదవుగ! 121

తే. గీ. అనుచు నానావిధంబుల నంబుజాక్షి
ద్రమిడ గంధర్వు నిందింప దర్ప ముడిగి
తరుణి నెట్లైన నూరార్పఁ దగు నటంచు
వలపుఁజినుకులు కుఱియుచుఁ బలికె నతఁడు. 122

ఉ. ఒప్పమి కాదు మర్త్యసతి కున్నతలోకనివాసిమైత్రి యో
యొప్పులకుప్పరో! యిటుల నూరక యేడ్చెద వేల? యిందు నా
తప్పిద మేమి లేదు విధి తప్పదు నీకుపురాకృతంబుచే
నిప్పని యిట్టు లేర్పడియె యేల వృథా ననునింద సేయుటల్. 123

మ. మెలతా యిందు విచారణీయకృతి యేమే లేద దేమందువా?
బలసంపన్నుఁడు మాననీయుఁడు రిపుధ్వంసక్రియాలోలుఁ డు
జ్జ్వలదశ్రాంతయశోవిశాలుఁడు మహాసామ్రాజ్యధౌరేయుఁ డౌ
కులవిస్తారకుఁ డైనసత్సుతుఁడు నీకుంగల్గు శాతోదరీ! 124

ఉ. అన్నియుఁ దీరిపోయె నిక నాఱడి జెందినఁ గార్య మున్నదే?
కన్నులు వట్టిపోవుటయె కాక గతంబులు గూడివచ్చునా?
యన్నులమిన్న! దైవకృత ఘటనె నీదుసతీత్వశుద్ధియం
బెన్నఁడు నెట్టిహాని ఘటియింపదు నమ్ముము నాదువాక్యముల్ 125

సీ. మునిరాజుతోఁ బొందు గనియున్న యాసత్య
వతిసతీత్వమున కేవన్నె తగ్గె?
వ్యాసమహర్షికి వయసు నర్పించిన
యంబికాసతి కేమిహాని వచ్చె?
సురలతో భోగించి సుతులఁ గాంచినపృథన్
వెలివేసిరే రాచకొలమువారు?
రాకాశశాంకుతో రంకు సాగించిన
తారారమణి కేమితప్పు వచ్చె?

తే. భామినీ! యేల విభ్రాంతిపడెద వీవు?
దివ్యమహిమలఁ బొందుచో తెరవకెపుడు
దప్పుగాదు; సతీత్వము తఱిగిపోదు;
ధర్మసమ్మత మగుఁజూవె! తలిరుబోడి! 126

శా. నా తేజం బది రిత్తఁ బోఁ జనదు చానా! పూజ్యమై, సర్వదా
చేతోమోదము గూర్చు నిత్యఫలమై, శ్రేయంబుగా నీ కిఁకన్
మాతృత్వంబు ఘటింపఁ జేయు; బుధసమ్మాన్యార్హ లోకోత్తర
ఖ్యాతిం జెందెద వీవు; నీకొడు కజేయాత్యంత విక్రాంతుఁడౌ. 127

వ॥ అనుటయు నవ్వనితామణి 128

గీ. విత్తొకటి వేయఁ బుట్టునే వేఱుచెట్టు
కట్టడివి నీవు; నీవంటికటికవాఁడె
పుట్టఁబోయెడుమాయావి చిట్టిపాప
మచ్చలేని మావంశము మలినపఱుప. 129

గీ. నీకుఁ బుట్టినకొమరుఁడు నిన్నుఁబోలి
దుష్టుఁడై క్రూరకృత్యుఁడై దుర్గుణముల

నహరహంబు దేవబ్రాహ్మణాపకారి
యయ్యెడుం గాక యోగ్యుఁ డె ట్లౌను వాఁడు. 130

క. సత్యాచరణము దలఁపక
నత్యాచారము దలంచునధముల కెపుడున్
వ్యత్యయఫలములె కానీ
నిత్యానందంబుఁ జెందనేరఁడు చెనటీ! 131

తే. అని యనేకవిధంబులఁ గనలు గాంచి
తనసతీత్వము చెడె నని తలఁచుచున్న
సీమతల్లి శాపం బిడునేమొ యనుచుఁ
దలఁచి భీతిలె, ద్రమిడగంధర్వుఁ డనఘ! 132

శా. విన్నావా కథ కంసరాజ! ద్రమిడున్ ద్వేషించి "యోదుష్టుఁడా!
యన్నం డి ట్లపచారము ల్దలఁప కీ వెవ్వారి కిపైని, నే
పున్నెంబో నిను రక్షఁ జేసె నది, పో! పో! యంచు సింహింపఁగా
ఖిన్నుం డై దివి కేఁగె "మీకొడుకు మీకే శత్రుఁ డౌనంచునున్".

కం. ఇది నీజన్మరహస్యము
ముదితామణివాక్య మది యమోఘం బౌటన్
బొదవెను బంధుద్వేషం
బదయుఁడ వై నీవు గలఁతు వాప్తుల ననఘా! 134

తే. అది మొదలు నీవు ద్వేషింతు వాప్తవరుల
వారు ని న్నట్లె తలఁతురు వైర మూని
కారణం బిట్టి లోదవ్వుట కర్మసంచి
తంబు కంసేంద్ర యయ్యది తప్పఁబోదు.

ఉ. ఇంతటిభ్రాంతుఁ డ వనుచు నెన్నఁడు నే నెఱుఁగన్ దిగంతవి
శ్రాంతయశోవిశాలుఁడవు క్షత్రియజాతి యిసీ యనంగ వి
క్రాంతిని జూప నోడెదవుగా వసుదేవుని ద్రుంతువా బళీ
పంతము సిగ్గు సిగ్గు నగుబాటూ సువిూ యిది కంసభూవరా! 135

శా. ఆలోచింపుము నీవె నీతలఁచుకార్యార్థంబు సార్థంబొ హా
స్యాలాపప్రతిమాన దుష్కృతము వేద్యం బౌను నీకేక్రియా
శాలీనుండ వృథాప్రగల్భవచన వ్యాలోలుఁ డౌ నెంచుమీ
కాలక్షేపముఁ జేయ నేమిటికి నోకంసాధిపా పోయెదన్. 136

తే. గీ. ఇట్లు వైటకారముల గుఱియించి కంసు
పుత్త్రి కెక్కించి చిక్కనిపుకులు వెట్టెఁ
కృష్ణుపై శాత్రవమ్ము నాఋషి గడంగి
భక్తవసుదేవు రక్షించుభావ మూని. 137

ఉ. నారదమౌని యిట్లు తెగనాడి విపంచి ధరించి హాయిగా
సారెలు మీటుచున్ విజయసారథిపాటలు పాడి యాడుచున్
జేరె దివంబు కంసుఁ డొకచిత్తరువుంబలె నట్టె నిల్చి యే
దారి సమంజసం బయినదా యని యోజన చేసె నత్తఱిన్. 138

చ. అతఁడు యథార్థవాది నిజ మాడెను బో వసుదేవుఁ జంపిన
న్నోత లణఁగారునా మిగుల వీరుఁడ నం చుచు విఱ్ఱవీగు దు
ర్మతి హరి బాలకృష్ణుఁ బరిమార్చిన సర్వము దీరుఁ గృష్ణుపై
నతితరభక్తిఁ గొన్నసుర లందఱు వందురునారు వెల్లుగన్. 139

చ. ఇదిగద! యోజనం బనిన నిట్లెకదా యొనరింపఁబోలు నా
రదముని యూహ యెట్టి దదిరా యొక కార్యముచేత నే దురా
స్పదములు సర్వకార్యములు చక్కఁబడున్ భళిరే! యటంచు దు
ర్మదుఁ డయి దైవయోగమున మార్గము దప్పఁ దలంచెఁ గంసుఁడున్

క. నాకూడు గుడ్డ గొనుచున్
నాకే యెస రుంచినారు నమ్మఁగరా దీ
రాకాసిమూక నిప్పుడె
చీకాకొనరించి చంపఁజెల్లు నటంచున్.

గీ. నారదుఁడు తెల్పినట్లు గంధర్వజుండ
బంధువిద్వేషవిధము తప్పనిది నాకు
వారినుంచిన నొంచిన వాదు లోకమె
త్రుంచుటయ యుక్తవిధ మనితోఁచు ననుచు. 141

చ. మనమున నిట్టు లూహ గొని మంత్రుల రాఁ బిలిపించి యిట్లనెన్
జని వసుదేవ దేవకుల సత్వరమే చెఱసాల నుంచుఁడీ
ఘనుఁ డగు కేశిదానవుని గ్రక్కునఁ గృష్ణు వధింపఁ బంపుడీ!
మనపని తీరుసందనుక మానక పూనికఁ జేయుఁ డిందఱున్. 142

క. ననుఁ జంపఁ బుట్టియుండిన
యనయుల బలరాముఁ గృష్ణు నవనికిఁ బాపన్
మనకుం గర్తవ్యము కా
వున నేనొకఁ డెంచినాఁడ బొందుగ వినుఁడీ. 143

ఉ. ముందుగ వారి నిచ్చటకు ముఖ్యముగాఁ బిలిపించి వారితో
విం దగుమల్లయుద్ధమున వేడుకఁ జూపి యఖండపాండితీ
చందము లేర్పరించి విరసంబుగ నిర్వురఁ బట్టి చంపుఁడీ
యందఱుఁ జూచుచుండ వ్యసనార్తులు నై జను లార్చుచుండఁగన్.

గీ. మల్లశాల నలంకారమాన్య మైన
యున్నతస్తంభముల నిల్పి యొప్పు గదుర
భద్రసింహాసనముల నేర్పఱచి మిగుల
సుందరముగఁ దనర్చుఁడీ మందిరంబు. 145

ఆ.వె. ప్రముఖ, పౌర, జానపదు లెల్లరే కాక
యఖిలజనులుఁ జేర నర్హమైన
రీతి మల్లశాలఁ బ్రీతిమైఁ దీర్చిచి
యాసనము లమర్చుఁ డతిరయమున. 146

గీ. ఆతఁ డసహాయశూరుఁ డౌ ననుచు వెందుఁ
బూతనాదులఁ గికురించి పొట్టఁ బెట్టు
కొన్న మాయావి యెంతటిక్రూరకృతికి
వెఱవనికిరాతుఁ డెట్లు చంపెదరొ మీరు? 147

ఉ. బాలురు వారు చూపులకు వన్యమృగంబులఁ బోలుమానవా
భీలురు నాగసర్పములపిల్లలు భిల్లులవంటివారు దు
ర్జాలము లెన్నొ నేర్చిన నిషాదకుమారులు మల్లులార యే
లీల భరించి వారి విదళింతురొ చింతలు గిరిపోవఁగన్. 148

గీ. మల్లయుద్ధ పాండితియందు మహితు లగుచు
నరలుచాణూరముష్టికాసురుల కిట్టు
లాజ్ఞ లిడి మాపటింతో ననియెఁ గంస
ధరణిపాలుఁ డుదగ్రభీకరత దోఁప 149

గీ. గండముల్స్రవ్వఘుమత్తవేదండతుండ
మంకులోహముద్గరమునుం బొందుపరచి
భద్రముగ మల్లమందిరద్వారమందు
నిలిపి కాఁపుండుఁడీ మీరు నిశ్చలముగ. 150

గీ. బహుళపక్షచతుర్దభానువాస
రమున నారంభ మొనరించి క్రమవిధానఁ
జలుప నౌ ధనుర్యాగము; బలు లొసంగ
వలయు భేతాళునకుఁ గూర్పవలయుఁ బసుల. 151

గీ. కృష్ణపక్ష మూని మను నిర్జింపనెంచు
నలసు లౌ నుగ్రసేననందాదిఖలుల
కన్ను లవి మండిపోయెడు కరణి బాల
కీటములఁ బట్టి తొక్కుఁడీ కీర్తి గనుఁడి ! 152

చం. భయమునఁ బల్కుచుంటె నని భ్రాంతి వహింపకుఁ డాకపోతముల్
భయదమహోగ్రతీవ్రప్రతిభండనపండితుఁ డైనకంసభూ
దయితునకా ? బయప్రదులు తచ్ఛిశుయుగ్మము నే నెదుర్పని
ప్రియు లయి, హాస్యము ల్పలుపరే కనుచుండుసదస్యు లెల్లరున్.

గీ. 'మత్కుణముఁ జంపుటకు మహామంత్ర మేల ?
దోమపైని బ్రహ్మాస్త్రమా ? చీమ నలఁప
వ్రేలు చాలద ? యలసు లౌ తృణబలాఢ్యు
లేడ ? వారల నే నెదిరించు టేడ ? 154

ఉ. అందఱుఁ జూచుచుండ మదహస్తినిఁ ద్రోలెదను; మీరు వారిపైఁ
గుందము నెట్లు నేలపయిఁ గొట్టి పదంబులఁ దట్టి బిట్టుగాఁ
జందనపంకసామ్యముగఁ జల్పునొ, యట్టి కుమారవీరులన్
మ్రందగఁ జేయు నయ్యదియొ; మామను మీకును దీరుఁ గోరికల్.

గీ. కువలయాపీడ మనుపేరు గొన్నయట్టి
మత్తదంతావళము సుకుమారశిర
పోతములఁ ద్రుంచు టెంత ? యాఁబోతుపైని
బ్రాలుడోమనుఁ ద్రోలెడు లీల గాక. 156

ఉ. బాలురు వారు కాఁపురము పల్లియ యల్పమృగాలతోడనే
కేళి; పురంబు లెప్డు పరికింపరు వచ్చియు రాకమున్నె యా
భీలమృగంబు గన్పడిన బిత్తరులై కినుచుందు రట్టియ
క్కాల మొఱంగి ద్రోలుఁ డది కాలభుజంగమురీతిఁ బైకొనున్. 157

గీ. నేఁటనుండియే పారము ల్నేర్పవలయు
మత్తదంతావళమునకు మావటీఁడ !
సహజమాంద్యమ్ము వాసి సోత్సాహ మగుచు
నదియు వర్తించుఁగాక నీయాజ్ఞ లెఱిఁగి. 159

ఉ. మీఁగలు మీకు మీకు నియమించిన వన్నియుఁ జొప్పుదప్ప కే
తీరుపుఁ డట్లు గాక, దరితీపులకోపుల ప్రాపు గందురా
క్రూరశిలీముఖాగ్నిఁ బడి కుప్పగఁ గూలుఁడు తప్ప దిండ్లకుం
జేరుఁడు పొండు పొం డనుచుఁ జెప్పి నృపాలుఁడు కార్యమెంచుచున్

—* అక్రూరసందేశము *—

గీ. అర్థతంత్రజ్ఞుఁడై నకంసావనీశుఁ
డంత యదువంశవిఖ్యాతు నమలచరితు
ధీరు నక్రూరుఁ బిలిపించి గారవమునఁ
జేయిఁ జేతిని గదియించి చెప్పె నిట్లు. 161

మ. అనఘా! దాశపతీ! మహాత్ముఁడవు నాయందెప్డు బద్ధానురా
గనయత్వంబులుఁ జూపుచుండెదవు నికన్నన్ హితప్రాప్తు నె
వ్వని నేఁ గానను భోజవృష్ణికులసంబంధంబునం గానఁ గార్యసా 162
ధనకై యాశ్రయుఁ డీవె యంచు మది నిర్ధారించితిం బుణ్యుడా!

మ. హరిప్రాపుం గని స్వప్రయోజనము లాహ్లాదంబుగాఁ జెందు ఖ
చరనాథుంబలె నీదునాశ్రయముచే సాధింపయోజింతు మ
త్పురుషార్థంబును గార్యగౌరవములం బుణ్యాత్మ! సంపూర్ణస
త్పురుషుంబోలె యథార్థవృత్తి గృతకృత్యుం జేయఁ బ్రార్థించెదన్ 163

ఉ. వైష్ణవపక్షపాతు లగువారలు కొందఱు దేమొ కాని యా
కృష్ణుఁడె నాకు మృత్యు వని కీడు సుచించిరి నారదుండునున్
విష్ణువు కృష్ణుఁడే యనుచు వింతలు పల్కెను గాన గీర్తిరో
చిష్ణువుగా దలంచితిని చిన్నరికృష్ణుని లీలలన్ వినన్. 164

ఉ. కావున నీవు పోయి నయగారవముగ బలరామకృష్ణులం
దీనరు లైనగొల్లలను దీసుకరాఁ దగు స్యందనమ్ముపై
నీవక నిన్ను నమ్ముకొని తెల్పితి నా మహారహస్యము ల్కృపా
భావము నొంది సత్వరమె బాలుర గోపులఁ దెమ్ము వీఁటికిన్. 165

గీ. మనధనుర్యాగమిషపైని మందలోని
వారి నెల్ల నాహ్వానింపవలయు నీవు
మధురలో వేడ్కలం గాంచుమనుచుఁ గూర్చి
రామకృష్ణుల నిటఁ గొనిరాఁగదయ్య. 166

ఉ. వారల నీవు దెచ్చునెడ వారణహస్తనిపీడ్యమానులై
ధారుణిఁ గూలఁ జేసెదను దత్క్రియఁ దప్పిన ధీరులైనచా
ణూరుఁడు ముష్టికాసురుఁడునుం దలకించి యెదిర్చి యుద్ధవి
స్తారపటుత్వఘాతములఁ జంపెద రిట్లొనరింతు వారలన్. 167

గీ. రామకృష్ణులు నిహతులైరా తమంత
విష్ణుభోజదాశార్హులు విసము మెసవి
చచ్చెదరు చావరా వారిఁ జలము నూని
నేలఁ గూల్చెద మత్కరవాలధార. 168

శా. ఆశాపాతకుఁ డైనవృద్ధపతి రాజ్యాకాంక్ష నానాఁటి కా
కాశస్థానము నంటుచున్నది దురాక్రాంతంబుగాఁ దామసా
వేశుం డై నను ధిక్కరించుఁ బయిగా వ్రేపల్లె శ్రీకృష్ణుపై
నాశాకల్పము నిల్చియోసరిలు న్యాయంబౌనె యీహైద్యమున్ 169

గీ. అగ్నికిన్ సమీరణుఁడు తోడైనయట్టు
లుగ్రసేనునితమ్ముఁడు నిగ్రహించు
నన్ను నావారి; వారల నలగఁ గొట్టి
దాహముం గొనకున్న నేఁ దాళలేను. 170

ఉ. ఇట్టులశత్రుసలం గడచి యేను నిరంకుశరీతి లోకసా
మ్రాట్టును గాఁ దలంచితిని మద్గురుపాదననుగ్రహంబుచే
నెట్టిమహార్థమైన ఘటియించుట తథ్యము దుష్టు లౌటచేఁ
గట్టిడిబంధువర్గమును గాఱియపెట్టఁ దలంతు నెయ్యుఁడా. 171

గీ. నందగోపునితో మంతనములు చేసి
కలుషుఁ డానకదుందుభి కన్నసుతుల
మందలో దాఁచికొన్నాఁడు మాటదప్పి
యాతఁ డనవధ్యుఁడా? తెల్పు! మార్యమిత్ర! 172

క. ఇది యంతర్నాటకమగుఁ
బదువురు దుర్మార్గులైనబంధువు లొకటై
తుది సేయ నెంచెదర నను
సదయా! యిది మాపసియసందర్భంబే? 173

చ. హరియఁట కొంటెకృష్ణుఁ డురగాధిపు నంశమ రాముఁడంట దు
శ్చరితులు బాంధవు ల్దలఁచి సాయముగాఁ గని వారితోడ సం
దురమున నొంపనెంతురఁట దోర్బలశాలురు సూవె వారు మం
దరగిరితో నజాశ్వకము దాఁకెడుచందము కాదె మిత్రుఁడా. 174

ఉ. అందఱుఁ జూచుచుండ నాతమార్పు విధించెద రామకృష్ణులం
దుందిలు లేమి చేసెదరొ తుండముఁ జాచి ప్రచండవేగ సం
స్పందితమారుతంబునటు పైకొని మత్తగజంబు బాలురం
జింది తదంఘ్రిఘట్టనలఁ జిందఱవందఱఁ జేయునప్పుడున్. 175

మ. అని కంసుండు వచింప రిచ్చపడి యారా! యిట్టిదుర్వ్యూహముల్
చను నే దుష్టవినాశనార్థము ధర న్జన్మించుగోపాలకృ
ష్ణుని వీఁకా బుచుమాడువాఁడు కడునీచున్ వీని బోధించిన
న్వినబోఁ డెంతయు నంగశోష ముగుఁ గాని యంచు నక్రూరుఁడున్.

చ. జరిగిననాఁటి కన్నియును సక్రమమార్గములే నరేశ్వరా!
పొరయమి సంభవించు నెడ బుట్టు ననర్థము లెన్నొ వానిచే
నరుడు వితాకు నెంది తననాశముఁ దానె వరించి చేతితో
బొరియలు ద్రవ్వుకొంట యనఁబ్రోలు నసంగతయత్నధర్మముల్. 177

చ. హరి యని నారదుండు తెగనాడెను గావున నట్టివానితోఁ
బోరుపులు మాని చెల్లెలి సుపుత్రునిగాఁ బ్రియమారఁ జూచుటే
యురవగు నంతవాఁడు హరియో గిరియో మరి యెవ్వఁడైన నీ
యురి మెడఁజుట్టుకోవలయు నొప్పని తప్పదుగాద భూవరా! 178

మ. అనినం గంసుఁడు కోపఘూర్ణితుఁడునై యక్రూరు నీక్షించి, " యి
ట్లని; నే నింతకుమున్నె యోచితిని; నీయర్థంబు నూహింతుఁ గా
ని నిరాడంబరజీవి వీవనియు నన్ నిష్పక్షపాతంబుగాఁ
బనులం దీర్చెదవంచునుం దలఁచె సంభాషింతు నిన్నిత్తఱిన్. 179

మ. మదిలో నున్నది నోటఁ దెల్పెను నన్మార్గానఁ జేసైన త
ప్పిదము ల్లానెడఁ జూపినావు; సరె; యేభేదంబు లెట్లైన నా
ముదలం దీర్తువ? లేద? తెల్పుము; వృథా బోధామృతస్రావము
ల్విదిలింపం బని లేదులే! యనుచు నావేశంబుగాఁ బల్కెనన్. 180

గీ. జనుఁడు దైవోపహతుఁడుగా సకలకామ్య
ములను గోరుచు సుఖదుఃఖములను బొందు
వెనుకముందెంచ నేరఁడు, విఫలుఁడైనఁ
గాని తలపోయఁ జాలఁడు కానిపనుల. 181

మ. హననానర్థము దీరఁగా నిపుడు నత్యాసక్తిఁ గావించు నీ
ఘనసన్నాహములన్ని యున్నిగులశ్లాఘ్యంబయ్యె, నవ్వానిలో
ననుకూలప్రతికూలభావములు, దైవాధీనమే కానిమో
కటనియత్నంబున బొందజాలినవాకో? కంసావనీనాయకా! 182

గీ. ఏది యెట్లైన జరుగ నిమ్మాశ్వరాజ్ఞ
యాఫలాఫలమ్ముల బాధ్యుఁడౌదువీవె
చెప్పఁదగినంత చెప్పితిఁ జిత్తమునకుఁ
దెచ్చుకోలేవు మనసున నొచ్చుకొనెగు. 183

ఉ. నమ్మినవాఁడు, దుష్టుఁడయినన్ జడుఁడైనను గోరుకొన్నసా
యమ్మది చేతనైనది యఘావృతి లేనిది సత్యమానెడన్
సమ్మతి దీర్చుటే సుజనసమ్మతకార్యము న్యాయబద్ధధ
ర్మమ్మగుఁ గాన నీపనుపు మానక చేసెద [illegible] భూవరా! 184

మ. నను నిమిత్తముగాఁ దలంచి హృదయస్వార్థము ల్చెప్పినం
దున నే నింత యచింపఁగావలసె విధ్యుక్తంబుగా ధర్మచిం
తన మూహించితి స్నేహవత్సలుఁడ వై ధాత్రీశ్వరా! నీదు మే
లును నీవే కొనగోటఁ జిమ్మెదవు వ్యాలోలుండవై యెన్నకే. 185

ఉ. ఇప్పటికైన మించి న దదేమియు లేదు; నిజాగ్రముం గనుల్
విప్పి గ్రహింపఁబోలు; బలవేగముతో నెదిరించినట్టి నీ
మెప్పులపూతనాదుల ప్రమేయము లేమయి పోయె నెంచు మో
యప్ప! కృతార్థుఁ డీవగుదు వా హరి కృష్ణుని మెప్పుఁ జెందినన్.

ఉ. వేరము మాని గారవము పేర్మిని ముద్దుల మేనయల్లునిన్
గూరిమిఁ బిల్వనంపు మొనఁ గ్రూరుడను సద్విధానుకూల్యముల్
ధారుణినాయకా! హృదయ తామసమున్ శయించు మంచు న
క్రూరుఁడు దెల్పుచుండ విని క్రోధవిలోలితుఁడై నకంసుఁడున్. 188

చ. చొరవ యొసంగినందులకుఁ జొక్కపు బుద్ధులు దెల్పుచుంటి వ
ద్దిర! హరిపక్షపాతి వయి తేసువ లోకువఁ జేసి యెంతగా
మురిసెద? వింటిదీప మని ముద్దిడ మీసలం కాలినట్లు నీ
విరస వచోక్తు లయ్యె విడి వే జను మాజ్ఞవిధింతు రాజనై 189

మ. అన నక్రూరుఁడు మందహాసమున నయ్యా యేల నే నిప్పుడే
చనెదన్ ప్రాప్తమవశ్యభోగ్యమది దుస్సాధంబు దప్పింపఁగా
నని యాజ్ఞం గొని పీఠముం డిగి సమర్యాదుండు నై యేఁగె నం
తన గంసుండు నిజాలయంబునకుఁ జిత్తభ్రాంతి పీడింపఁగన్ 190

గీ. కేశిదనుజసంహారము గాంచి
ఘోరహయరూపమున భీతి గొలుపునట్టి
కేశిదనుజుఁడు తామసావేశమునను
మందఁ జేరఁగ వచ్చె సమంచగతుల. 192

సీ. హేషాతిభీషణ ఘోషమాశావీధి
నలమిదిక్కరికర్ణములు పగుల్ప
ఖురఘట్టనా మహోత్తర తాడనమ్ములు
వెక్కసమ్ముగ భూమి వ్రక్కలింప

గటుసటావిశేషపటుఘాతములు పాఱు
సుర విమానమ్ముల దుఱుముసేయ
నంజన భూధ్రసమాకృతిచ్ఛాయల
పుక్కిలింతలు సూర్యు నెక్కిరింప

తే. విపులవిజటాస్య కోటీరవిభవుఁ డతివి
శాలలోచనుఁ డుం మహాననుఁడు వికృత
కరబృహద్గళుఁ డైన రక్కసుఁ డతండు
వచ్చె మంద కమందజవంబుతోడ. 193

క. వచ్చెడు హయదానవుఁ గని
చెచ్చెర హరియెదురు వోయి చెడుగా రారా!
వచ్చెను నీకు వినాశము
వ్రచ్చెద బలదర్ప మడఁచి వారక యనుచున్. 194

క. రెచ్చినకోపము పెంపున
జిచ్చుఱపిడుఁగట్లు రేగి శ్రీకృష్ణుం డా
కుచ్చితుని బిల్వ నాతఁడు
మచ్చరమునఁ జేర వచ్చె మాధవుఁ డాఁకన్. 195

చ. గరుడుఁడు నాగసర్పమును గాఱియవెట్టువిధానఁ గృష్ణుఁ డా
దురితు నరాంతకుం బొడివి దోర్బలము న్మెఱయించి కాలితో
నురిమియుఁ బార వేయునెడ నూరుధనుస్సుల దూరభూమిపై
నొరిగెఁ గరాళవక్త్రమును హోరున విప్పుచు వాఁడు ముప్పొచన్.

గీ. అగ్నితప్తలోహశలాక యై యుపేంద్రు
కరము, స్పర్శమాత్రముననె తురగదనుజు
దంతముల నూడఁగొట్టుచోఁ దాళలేక
పెనఁగులాడుచు నుండె జీవనము గోరి. 197

ఉ. అంతకు నంతకుం బెరిగి యంచులు దాఁటుచు నుండె దైత్యువ
క్త్రాంతరమందు నున్నహరిహస్తము, యోగ్యచికిత్స లేక య
త్యంతపురోభివృద్ధి గనువ్యాధివిధాన క్రమాభివృద్ధియై;
క్రంత బిగించుచుండునెడ గాసిలి రోసమునంది కేశియున్. 198

మ. తల నాడించుచు బాష్పము ల్విడుచుచున్ దట్టాడి మట్టాడుచున్
మలమూత్రంబుల వీడుచున్ చెమటకుంభ ప్రాప్తిగా వీడుచున్
దలఁగం జూచుచు నూర్పుసల్పక గడుం దారాడి గోరాడుచున్
ఖలదైత్యుం డిలఁ గూలె సంతట మహాత్మాభృత్సమాకారుఁడై.

చ. ప్రళయదవానలంబువలె బర్వి సమస్తము నేకధాటిగాఁ
జలమునఁ గాల్పవచ్చినన్నృశంసుఁడు కంసమహీశుబాలిశుం
డిలపయిఁ గూలిసంతఁ గని యెంతయు నుబ్బుచు దేవబృందము
ల్జలజల పుష్పము ల్గురిసి సన్నుతిఁ జేసిరి కృష్ణదేవునిన్ 200

— నారదాగమన ఘట్టము —

సీ. ...క్షీణాంశుకులచేఁ దంబుర మీటుచు
డాకేల జిరుతలడంబు మీరఁ
బంచమస్థాయిలో స్వరమేళన మొనర్చి
హాయిగా రాగము నాలపించి
భక్తివిశ్వాసము ల్వారిధవిలైదురీతి
నమ్మఘువైరి నామామృతంబు
ద్రాల్గఁ గంగ నోరారఁ గీర్తించుచు
వింతనృత్యంబు గావించి మించి

తే. బ్రహ్మమానసపుత్రుఁడు పరవశుఁడయి
పాలితాఖిలలోకు గోపాలబాలుఁ
గృష్ణభగవాను సేవించఁ బ్రియముగదుర
మండకుం జేర వచ్చె సానందుఁ డగుచు. 201

చ. వచ్చినమౌనిసత్తముఁ గృపాగసదృష్టినిఁ జూచి కృష్ణుఁడుం
జెచ్చెఱ నేగి సన్నుతులఁ జేసి కరంబుఁ గరంబుతోడఁ బెన్
మచ్చికతోడఁ బట్టుకొని మందిరమందునఁ జేర్చి భక్తిమై
హెచ్చుసపర్యలం జలిపి యెంతయుస్రమత దోఁప నిట్లనెన్. 202

ఉ. నారదమౌనిచంద్ర! కరుణామయుఁ డీవు పరోపకారవి
స్ఫారితసత్యకృత్యుఁడవు పావనమూర్తి వకారణంబుగాఁ
జేరగరావు తాము దయచేసిన లోకహితార్థ మెద్దియో
తారుణికోత్తమా! తెలుపఁగాఁ దగు నన్న మహర్షి నవ్వుచున్ 203

గీ. కలహాభోక్తవు నీవెన్న కానిపాపు
నిష్కృత్యయముగఁ బిల్చినావు కృష్ణ!
సత్యసంకల్పుఁడవు జగత్సాక్షి వవ్వ
యుండవు నీవెఱుఁగని దేమి యుండు జగతి. 204

గీ. అనఘ భూభార దైత్యసంహారకులల
నవతరించియుఁ దనసురూపాచరణము
వలన విశ్వముఁ బాలించు ప్రభుఁడ వీవు
లేవు భయశంక లేనాఁడు లేదె మైక. 205

ఉ. ఈవె సమస్తమందు జగదీశ్వర విశ్వనియంత వాసుదే
వా వరయోగిమానసమహాంబుజభాస్కర దేవదేవ నీ
భావము లీ వెఱుంగుదువు పాలనభాగము ఏది నీకు నే
నా వచియింప నౌను సకలాంశము లీవు గ్రహింపనేరవో 206

గీ. దారువున నగ్నిపోలె భూతముల కీవు
నాత్మవై నిరంతరముగ నంటియుండు
బుద్ధికిన్ సాక్షివియు మహాపురుషవరుఁడ
వీశ్వరుఁడ వాదిదేవుఁడ వీవె కృష్ణ! 207

క. నీవు స్వతంత్రుఁడ వైనను
దేవా మాయాశ్రయుఁడవు త్రిగుణమ్ములచే
నావిర్భావస్థితి లయ
భావములు ప్రపంచములకుఁ బఱపెద వనఘా! 208

ఉ. ఎవ్వని ఘోషణంబువిని యెల్లసురల్ భయమందుచుందురో
యెవ్వని నాశనంబు కొఱ కీభువనంబులు వేచియుండునో
యవ్విగతప్రభావుఁ దురగాసురుఁ గేశి వధించి పెక్కులా
చివ్వ లడంచినావు గుణశేఖర నందకిశోర మాధవా. 209

ఉ. అన్ని యెఱింగియుండియు రహస్యముగా నెఱవేర్చుచుందు వా
పన్నులపాలికల్పమవు ప్రాకృతులెల్లరు నిన్ను బాలుగా
నెన్నెద రీవు లౌక్యముగ నేమి యెఱుంగని బాలకుండవో
యన్న భవద్విలాసముల నారయనేరరు క్రూరదానవుల్. 210

ఉ. కంసనృశంసుఁ డెంతయునుగర్వముతో నినుఁ జంపఁ బూని వి
ధ్వంసన యత్నము ల్సలిపి వారక ని న్గొనితేర సజ్జనో
త్తంసుని నీదుభక్తుఁ డగు దాశపతిం బనుపంగ నుండె మా
మాంస మొనర్చియుం గడఁకమానని వానితలంపుఁ దీర్పగన్. 211

గీ. వచ్చుచున్నాఁడు సన్నుతభక్తనరుఁడు
పూజ్యుఁ డక్రూరుఁ డిచటికి పుణ్యపురుష
మేదినీ శుభసుర్యాగమిపను మిమ్ము
మధురకుం గొనిపోవును మానితముగ. 212

మ. పరమాత్మా హరి కృష్ణ దుష్టవధకుం బ్రారంభసంరంభముల్
జరిగెన్ మూఁడవనాఁడు ముష్టికుఁడునుం జాణూరుఁడుఁన్ మత్తసిం
ధురముం దక్కినమల్లనాయకులునుం దుర్మార్గుఁ డా కంసభూ
వరుఁడున్ నేలఁ ద్రెంగి పోయెదరు దేవా నిప్రతాపంబునన్. 213

గీ. కంసవధ యైనపిమ్మటఁ గడఁగి కాల
యవన నరకాసుర మురాసురాది ఖలులు
నీవలనఁ జంపఁబడెదరు నీరజాక్ష
కన్నులకఱవుదీర నేఁ గాంచగలను. 214

గీ. పారిజాతాపహరణము బలనిహంత
యోటమియు రుక్మిణీదేవి యున్నతియును
సత్యభామాపరాజయసంభ్రమంబు
నన్నియును గన్నులం జూతు నబ్జనాభ. 215

సీ. వీర్యశుల్కాదిపవిత్రలక్షణలక్షి
తములైనకన్యకోద్వాహములును
వగ నొంది బెగడొందు నృగమహారాజేంద్రు
శాపమోక్షణకథాచతురతయును
ఘనశమంతకమణి గొని తెచ్చి జాంబవ
తీ సత్యలం బొందు దివ్యచరిత
సాందీపగురునకుఁ జచ్చినపుత్రులఁ
దెచ్చియర్పించెడు సచ్చరితము

తే. ద్వారకాపురి నుండు విందారఁ జేయు
మహితకార్యసంరంభము మానసియు
భక్తపరిపాలనక్రియాభవ్యవిధులు
గన్నులారంగఁ జూచెదఁ గమలనాభ. 216

గీ. రాజసూయాధ్వరమునందుఁ బూజనీయు
లను హసించెడి శిశుపాలుఁ దునిమె దీవు
దంతవక్త్రు వధింతు వుద్దండ దాన
వులను గూల్తువు గెల్తువు ఖలుల నెల్ల. 217

గీ. పార్థసారథి వగుచు భూభార మడఁపఁ
బదియు నెనిమిదక్షౌహిణుల్ పఱఁగు సైని
కులను మ్రందించుటలు గాంచఁగలను నీదు
భవ్యయశముల నాలించి బ్రదుకఁగలను. 218

గీ. అవని నాచంద్రతారార్కమై దిగంత
కీర్తి విశ్రాంతమై యొప్పు గీత దీవు
చెప్పెదవు యుద్ధవిముఖుఁడై యొప్పుకొనని
విజయునకు రణభూమిని విశ్వనాథ! 219

గీ. నిఖిలపరిశుద్ధవిజ్ఞాననిధి సమాప్త
సర్వకార్యార్థియు నివృత్తసంసరణమ
హాప్రవాహస్వరూపి యనాదిదేవు
శరణు వేడెద నినుఁ బ్రోవు మురగశయన. 220

ఉ. నే నట కేఁగి వచ్చితిని నీరజనాభ నృశంసకంసభూ
జానిప్రయత్నము ల్దెలిసి చయ్యనఁ దెల్పఁ దలంచుకొంటి నా
హీనుఁడు మూఁడురోజులెసుమీ ధరపైఁ జరియించు నందుచే
వానిని బ్రోత్సహించితిని వైరముఁ బెంచితిఁ గోపు లొత్తుచున్. 221

చ. తెలిపితి మర్మధర్మములు తెల్లముగా వసుదేవదేవకీ
నిలమణు లీ రటంచు నుసిగొల్పితిఁ బల్కితి వానిజన్మసం
కలనవిశేషగాథల నిఁ కన్ నిను జంపుటకే ముకుందుఁ డీ
యిలజనియించెఁ గంసధరణీశ యటంచని తెల్పితింజుమీ. 222

ఉ. కన్నులఁ గట్టినట్లు విధిగాఁ గనిపించుచునున్న నీదు సం
పన్నబలప్రతాపవిభవంబుల నెంచఁడు మేలుకోరువా
రెన్నివిధాలఁ దెల్పిన గ్రహింపఁడు కాలము చేరువయ్యె సం
పన్నమదాంధుఁ డాతఁడు కృపానిధి మాటలు వేయు నేఁటికిన్ 223

క. బలవంత మైనదుర్విధి
బలుశృంఖలలందగిల్చి పట్టి యమపుర
స్థలికిం గొనిపోవు నెడం
గులనాపకుఁడెట్లు బుద్ధి గొననేర్చు హరీ! 224

గీ. జాతిమాత్రముచేతనే సద్గుణములు
కలుగనేరవు సంస్కృతివలనఁ గాక
గ్రామసింహము సింహ మగునా ముకుంద
పిల్లి పులి యగునె యొకజాతిపేర్మిఁ జేసి. 225

చ. అతఁడు కులీనుఁ డయ్యు సుజనాళి చెంగటనున్నఁ బూర్వ సం
గత మయి వచ్చినట్టి యవగాఢమలీమసతన్ విడఁడు గు
ర్మతి యయి బంధుశాత్రవము మాధవ విప్రియమున్ బొనర్చు నే
గతి రుజ పీడ నేఁడు ప్రకామ్యము హెచ్చుచు నుండె మాధవా! 226

మ. తనపంచత్వము నెంచనేరఁడు నినుం దండించి ఖండింపఁగా
మనసోత్సాహముఁ జెంది పెక్కులగు దుర్మార్గప్రయత్నంబు లే
పునఁ జేయించుచునున్నవాఁడు నిదియోఁ బో ప్రాకృతంబన్న నా
తనికై యాతఁడె గోయి ద్రవ్వుకొని సిద్ధంబయ్యెఁ జూ కాలఁగన్. 227

తే. ద్వంద్వయుత మైనయీధరాతలమునందు
మంచిలోఁ జెడ్డ చెడ్డలో మంచి యన్న
చందమున వానిదౌష్ట్యము సత్ఫలము లె
కూర్చు వానికి నీచేతఁ గూలుకతన. 228

తే. చలుపు నెవియేని యుత్కటస్థాయి గాంచి
గాని పక్వము కాలేవు కంసరాజు
సేయఁగలయన్ని దుష్కృతుల్ సేసినాఁడు
నిష్కృతియె వానిఫల మగు నీరజాక్ష! 229

వా ఘనుఁ డక్రూరుఁడు కంసుపంపున మిముం గళ్యాణగోపాలురం
గొనిపో వచ్చుచున్నవాఁ డతనినిం గోపింపగారాదు స
జ్జనుఁ డత్యంత ముదంబునం జని మహాసంరంభవిభ్రాంతుఁ గం
సునిఁ జెండాడుము తల్లిదండ్రులను నీచుట్టాల రక్షింపుమీ! 230

మ. నిను వ్రేపల్లెకుఁ జేర్చి, నందపతితో నేస్తంబు గావించినా
రని నీతండ్రిని దేవకీసతిని కారం ద్రోసె నయ్యుగ్రసే
నునిఁ జక్కాడఁ దలంచె దేవకుని నున్మూలింప యోజించె నం
దునిఁ దద్బంధుల నెల్ల జంపుటకునై దుష్ట్వ్యూహముల్పన్నెడున్ 231

క. అనఘా సర్వజ్ఞుఁడ వ
య్యును నన్నడిగితివి కాన నున్నవియున్న
ట్లనె తెల్పితి మన్నింపుము
దనుజవినాశకుఁడ వీవు తాండవకృష్ణా! 232

క. శ్రీరమణీవర నావిధి
తీరెను నేఁ బోయివత్తుఁ దిరుగన్ నీద
ర్శనభాగ్యము కంసాధిపు
మరణానంతరమె నూత్ననందిరమందున్. 233

చ. అని వినుతించి నారదమహర్షి ముదమ్మున మ్రొక్కి కృష్ణునా
జ్ఞను గని భక్తియుక్తుఁ డయి సత్వరమే చనె వీణమీటుచున్
వనజదళాక్షుఁ డీలల నవారిగఁ జూచుచుఁ గృష్ణదేవుడుం
జనె, దనవారితోడ సరసంబున నాఁడు వినోదకేళికై. 234

—* వ్యోమాసురవధాఘట్టము *—

ఉ. శ్రీలలనామనోవిభుఁడు చిన్మయరూపుఁడు కృష్ణమూర్తి గో
పాలకుమారులం గలసి భవ్యవినోదవిహారలోలుఁడై
యాలను గాచుచుండి మహితాటవిఁ జేరియు నందు మండలం
ద్రోలి హితాళిఁగూడి పరితోషము మీరఁగఁ గ్రీడలాడుచోన్. 235

ఉ. కొందఱు గొర్రెలల్లి మరికొందఱు కాపరులల్లు దొంగలై
కొందఱు నేర్పరింపఁగొని కోపముఁ జాఁగిలిమూఁతలాట నిం

పొందఁడు వినర్చువేళ గదనుక్కివుఁ డొక్కఁడు దేవతాద్విష
న్నందనుఁ డంతఁ జేరె గుహావ్రజశాలకుఁ డై రయంబునన్ 236

ఉ. దొంగలజట్టులోఁ గలిసి దుష్టుఁడు వ్యోముఁడు గోత్రిలల్లు క్రీ
డం గనువారిఁ గొందఱ విడంబముగాఁ గొనిపోయి యొక్కలో
యం గలగహ్వరాంతరమునందున దాఁచి ముఖానఁ బెద్దరా
లిం గదియుంచి మూసి చనుదెంచుచు నేగుచునుండె నిట్టులన్. 237

ఉ. కొందఱఁ గొందఱన్ మరియుఁ గొందఱఁ గొందఱ నిట్లు చేసి యా
నందముతోడ దాఁచు నెడ నచ్చట నేపదిమందిగాలురో
చిందరవందరం బడుచు శ్రీహరిపజ్జ యుండి రట్టి యా
చందము గాంచి యక్కపము నత్వరమే గ్రహియించి కృష్ణుఁడున్. 238

శా. మాయారాక్షసనందనుం డితఁడు, దుర్మార్గుండు వ్యోమాసురుం
డియన్యాయము సేయఁ బాల్పడియె నిద్దే వని దుర్వృత్తికిం
బ్రాయశ్చిత్తము గూర్తునంచు హరిశుంభద్వేగసంరంభుఁడై
హేయుం బట్టె, మృగేంద్రమొక్క వృకమున్ హింసించుచందంబుగన్.

ఉ. అంతట వ్యోమదానవుఁ డహంకృతిఁ జెందుచు హుంకరించుచున్
ఎంతగఁ బెంచియాకృతిని భీకరమైయిం బెనఁగంగఁ జొచ్చె శ్రీ
కాంతుని తోడ శౌరియును గ్రక్కున వానిని నొక్కివేయుచుం
బంతివిధాన నెత్తి ధరపైఁ బడవేసె నుదగ్రకోపియై. 240

తే. శౌరిశౌర్యదావాగ్నిలో శలభ మగుచు
వ్యోమదనుజుండు విక్రాంతి యుడిగి యడఁగి
మడిసె బ్రోసె నొక్కుమ్మడి వడిసెలంగ
దేవదుందుభుల్ జయజయారావములును. 241

ఉ. అంతటఁ గృష్ణమూర్తి గహనాంతరమందలి శైలగహ్వర
ప్రాంతముఁ జేరి తన్ముఖము పర్వి కనంబడునట్లుగుండునుం
బంతగ ద్రక్కలించి వెలవించుచు నున్న యమూరగోపక
స్వాంతము లుల్లసిల్లఁగఁ గృపన్ వెడలించె గుహాప్రదేశమున్ 242

క. శ్రీకృష్ణవిభునిమహిమం
బాకల్పముగా నెఱుంగఁజను లెవరో
లోకాతీతులు వారలు
శ్రీకైవల్యంబు వారి స్థిరసత్త్వంబౌ; 243

—* అక్రూర సందేశ ఘట్టము *—

వ. అంత నక్రూరుండు కంసునానతిమెయి బృందావనంబునకు వచ్చు
వాఁడు తనలో 244

ఉ. ఎట్టిమహాతపంబు లొనరించితినో ఘనపుణ్యశాలినై
నట్టికృతార్థజీవనున కర్మిలి దాన మెది చ్చియుంటినో
యెట్టిపవిత్రకార్య మొనరించితినో తొలి సర్వలోకస
స్రష్టుఁ గుమారకృష్ణు హరిమాధవు నిప్పుడు చూడఁబోవుదున్ 245

చ. విషయవిలోలు రై పతితవిస్తృతకామవినోదకేళికా
కృషు లొనరించుచుం బులకరించుచుఁ జందనపుష్పమాలికా
మిష గనుసక్తచిత్తులకు మిక్కిలిదుర్లభ మైనవేదవై
దుషి వలెఁ గృష్ణదర్శనము దుర్లభమే మొ యటంచు నెంచితిన్. 246

మ. ఇది నాభాగ్యము కంసుపంపునఁగదా యే నిట్లు లోకేశ్వరున్
ముదమారం గన నేగుచుంటి నతఁడే మోక్షప్రసాదంబు నా
కొదవం జేసెను, మృత్యుఁ డయ్యు సఖుఁ డైయున్నందు కీలాఁటిసం
పదఁ జేకూర్చె నయారె! యిట్టు లగునే వైచిత్ర్య మెందేనియున్

సీ. గోపికాకుచకుంభకుంకుమాంకిత మయి
యెవ్వానిచరణము లింపు సొంపు;
బ్రహ్మేంద్రశంకరప్రభృతులిచ్ఛావాప్తి
కెవని పాదములు భజించుచుందు;
రాదిలక్ష్మీదేవి యహరహం బేమూర్తి
యంఘ్రియుగ్మము నాత్మయందు నిల్పు;
బృందావనేందిర పొందుగా నేపుణ్యు
పాదచిహ్నమ్ములఁ బడసి తనరె,

తే. నట్టి శ్రీకృష్ణమూర్తిదివ్యాంఘ్రియుగము
గాంచి పూజించుభాగ్యము కల్గె నాకు;
ధన్యుఁడను భవంబు సార్థకముసూవె!
కరతలామలకంబయ్యెఁ బరమపదము. 242

సీ. శ్రీరమాహృదయసంస్థితనిధానము కాన
భవ్యసౌభాగ్యసంపత్కరంబు;
బ్రహ్మేంద్రరుద్రసంభావ్యయోగం బౌట
సద్గుణైశ్వర్యవిజ్ఞానకరము;
గోపాంగనాకుచకుంకుమాంకితమౌట,
శుద్ధప్రణయమాత్రసులభగరిమ;
సంయమి జనచిత్తసామ్రాజ్యపద మనన్
వరపురుషార్థసంపాదనంబు;

తే. రమ్యబృందాగతచరాచరప్రపూత
నృత్తిసంబౌటఁ గరుణైక విలసితంబు
హరిచరణయుగ్మ మది కొల్చునట్టి పరమ
భాగ్య మొనఁగూడెఁ నాపుణ్యఫలమ దేమొ 249

సీ. సరిసంధిగర్వనిర్వాపణోద్యోగి యై
ప్రభవించినట్టిగోపాలుఁ డతఁడు,
ప్రణతమూర్ఛనయు ముక్తిపథదర్శిని యటన్న
యాదర్శముంజూపునఘుఁ డతఁడు;
నిర్వాసితులఁ గరుణించి యాపదఁ బాపఁ
బుట్టు సంవినసురపూజ్యుఁ డతఁడు,
ధరణీరమాదేవతతిమ్రొక్కులం గని
పాలింప వచ్చినప్రభు వతండు;

తే. దేవతామాత దేవకీదేవిగర్భ
శుక్తిముక్తాఫలం బైనముక్తుఁ డతఁడు;
ధన్యు లగుయశోదానందదంపతులకుఁ
గనులహోపాప చిన్నారితనయుఁ డతఁడు. 250

సీ. కేశవ నారాయణా శివప్రియ మాధ
వా విష్ణు గోవింద వసుమతీశ
మధుసూదన త్రివిక్రమా వామనా శ్రీధ
రా హృషీకేశ ఘోరాఘనాశ
పద్మనాభ ముకుంద వరద దామోదరా
సంకర్షణా శౌరి జగదధీశ
వాసుదేవ యశోఽజా సుధీపాల ప్ర
ద్యుమ్న జనార్దనా ద్యుమణితేజ

తే. నరహరీ యనిరుద్ధ బృందారకార్థ
పాలనా పురుషోత్తమా పరమపురుష
శ్రీహరి యుపేంద్ర కృష్ణ దాసోఽహ మనఘ
మారమాచిత్తలోల యాభీరబాల! 251

చ. శుభశకునంబుసూచె ననుఁ జుట్టెను శ్రేష్ఠ ప్రదక్షిణంబుగా
విభగమనుం బరాత్పరు విశ్వము విశ్వసురేశ్వరార్చితుం
బ్రభుని స్మితావలోకరసభాసుర కంజదళాక్షు మేఘస
న్నిభశుభగాత్రుఁ గృష్ణు రమణీయముఖాబ్జునిఁ గాంచఁగల్గెడన్. 252

శా. ఈనాకన్నులు కల్గినట్టిఫల మాయిందీవరశ్యాము వి
జ్ఞానానందమయస్వరూపు సురరక్షాదక్షు వేదాంతవి
ద్యానాథున్ రమణీయమోహనమనుష్యాకారు భూభారహా
రానీతాద్భుతకార్యశూరుఁ గని యారాధించు సౌభాగ్య మా. 253

మ. బహురూపున్ జగదేకపూజ్యతమునిం బ్రహ్మాండభాండోదరుం
విహరాకాశవిహారధీరు ననఘున్ ధాత్రీమహాభారని
ర్వహణోద్దామకృతిప్రపాలకు గుణప్రాధాన్యుఁ జిద్రూపునిం
గహనానందకిశోరమూర్తిఁ గనెదం గోపాలచూడామణిన్. 254

సీ. కార్యకారణములఁ గనుచు నహంకార
మమకారగుణములమఱఁగుఁ ద్రోచి
సత్యస్వరూపసాక్షాత్కారములచేత
నజ్ఞానభేదకృత్యములఁ గడపి,

ప్రాణేంద్రియవిలోలభావము లర్పించి
తన్నుఁ బొందెడుజీవతతిని గూడి
గోప, గోపీగృహ, గోష్ఠములను బృంద
వనభూములవిహార మొనరఁ జేసి

తే. సర్వకర్మములొనరుచు గర్తవట్టు
లహరహంబు విలాసకృత్యములతోడ
లీలలం దేలుగొల్లగోపాలమూర్తిఁ
గాంచి వినుతించి సుఖములు గాంతుఁగాక. 255

సీ. గుణజన్మకర్మముల్ గూడి యెవ్వఁడు తన
చేష్టలచే వింత సేయుచుండు
విజ్ఞానకరకార్యవితతిచే నెవ్వఁడు
కాలుష్యములను బోకార్చుచుండు
ఘటనాఘటనకార్యకర్తుఁడై యెవ్వఁడు
తులలేనిప్రణయము నిలుపుచుండు
గోపాలనోద్యోగగోష్ఠిచే నెవ్వఁడు
భూతసమత్వముం బొనరఁ జూపు

తే. లోకకల్యాణవిభవుఁడై ప్రాకటముగ
నెవ్వఁడు చతుర్దశజగత్తు నేలుచుండు
నట్టినిరవద్యసుశ్యాము నఘవిరాము
గోపికాకాముఁ గనుఁగొందుఁ గోదువ దీర. 256

ఉ. ఇంతకు నేను బోయి యలకృష్ణునిపాదసమీపమందు ని
శ్చింతగ వ్రాలిన న్నెనరుఁ జెందుచు కాలభుజంగరంహస
భ్రాంతవిలోలభక్తపరిపాలకహస్తము నానతాంగమం
దెంతయు నిల్పి నా కభయమూఁదునె చేరఁగఁ దీయఁ జేయునో. 257

ఉ. ఏమహనీయహస్తము సురేంద్రబలిప్రముఖుల్ భజించుచుం
దాము త్రిలోకరాజ్యసుఖధర్మములం జవిచూడఁజాలిరో
యామహనీయహస్తతల మానసల నొంపి, మహార్తిఁ బాపి న
న్నేమును సత్యసిద్ధిమహామహోన్నతుఁ డాతఁడు భక్తపాలుఁడున్ 258

గీ. ఇట్లు లక్రూరు డాత్మలో నెంచి యెంచి
యరదముం ద్రోలుకొనుచు సూర్యాస్తమయము
దఱియువేళకు గోష్ఠమ్ముం దఱిసి మురిసి
కాంచె బృందావనంబును గఱవుదీర ! 266

గీ. వీరసురనాథమౌళికోటీరరత్న
దివ్యనీరాజనముఁ గొన్న దేవదేవు
పాదచిహ్నములఁ దనర్చు భవ్యసీమఁ
గుతుక మొదవంగఁ గాంచె నక్రూరుఁడంత. 267

వ. సరసిజ, శంఖచక్రరథచ్ఛత్రయవాంకుశరేఖ లొప్పు నా
హరిపదచిహ్నము లన్ని మహాద్భుత నుందుచు మై గగుర్పన
త్వరమునఁ దేరు డిగ్గి తను తాళక తచ్చరణాంకితంబులం
దొఱఁగి ముదశ్రువారిఁ బులకోత్తమువర్ణులజాడఁ గప్పెనుక్. 268

గీ. హరిపదన్యాసములయందుఁ బొఱలు పొఱలి
పొడమునానందబాష్పము ల్విడిచి విడిచి
ధీరుఁ డక్రూరుఁ డంతటఁ దేరు నెక్కి
మందకుం బోనఁ జొచ్చె సానందుఁ డగుచు, 269

సీ. శ్రీనికేతనులు సుశ్రీకులు శ్యామల
శ్వేతవర్ణు లుదారచేష్టితులును
బాలద్విరదమహాబలులు వజ్రాంకుశ
పద్మలాంఛనయుతపాదయుగళు
లతిలోకసౌందర్యు లాజానుబాహులు
కరుణారసావలోకనులు ఘనులు
వీతరాగద్వేష, విమలచేతస్కులు
జగదేకధవళవిస్తారయశులు

తే. రుచిరకేళివిశారదు, లచలమతులు
భక్తసంత్రాణశీలురు భవ్యమూర్తు
లైన బలరామకృష్ణుల నచటఁ గాంచె
ధీరభక్తాగ్రగణ్యుఁ డక్రూరుఁ డచట. 272

సీ. తారహారములతోఁ జేరికచేతుల
సీసవమాలలు చెలువు నింప
మలయజగంధసంకలిత పూమైప్రాంత
లలరు కమ్మనివాసనలు రహింప
జానువాసిరిగంమసేలిమిష్టపీ
తాంబరములకాంతు లవఘటింప
విమలరత్నప్రభావిభ్రాజితము లైన
భూషణమ్ములు మేనఁ బొలుపు నింప

తే. మంగళాంగులు వినుతసర్వాంగసుంద
రులు జగన్మోహనులు దనూరుచులతోడ
దిక్తటంబుల తిమిరము ద్రుంచువారు
నైనబలరామకృష్ణుల నతఁడు గాంచె. 273

సీ. నిండుజాబిల్లియూ పండువెన్నెలఁ గాంచు
మోమది పక్వలచూటవిప్పె
గండుతుమ్మెద లేల గ్రమ్ముకొన్నవి మొగ
మ్మందుఁ గా నవ్వినీలాలకములు
బింబమూ కెంపువిడంబిగా తొగరీను
గా డగి నాతెఱకాంతి గాని
కాబోలుఁ బుండరీకను లవ్వి కావను
రాగమాంజిష్ఠనేత్రముల యువ్వి

తే. అద్దములఁ బోలె బింబిత మౌ న వేమి
విమలమై యొప్పు గండభాగములు సూవె
చూర మూర్తిభవించినయతనుఁ డతఁడు
కాఁడు వానిని కడుపారఁ గన్నతండ్రి, 274

శా. ఆకర్ణాంతవిశాలలోచనులు దివ్యాదర్శసన్మూర్తు ల
స్తోకప్రోజ్జ్వలరత్నభూషితులు సంతోషాంచితస్వాంతులున్
రాకాచంద్రనిభాననుల్ పురహరబ్రహ్మేంద్రసంసేవ్యు లౌ
రా! కన్గొంటిని రామకృష్ణులను ధన్యం బయ్యె నాజన్మమున్. 275

గీ. జగదలంకారభూతులు జగము లేలు
ఘనయశులు చతుర్దశజగత్కారణులును
జగముకొఱకు స్వాంశములచే జన్మ మొందు
పరమలీలావతారు లీపురుషవరులు. 276

క. మరకతగిరివలె హరియును
వరరజతగిరీంద్రమట్లు ఫణిశయ్యుఁడునుం
ధర జన్మము నందిరి సో
దరులై యిట రామకృష్ణధన్యాఖ్యలతోన్. 277

చ. కనుఁగొనుచున్న నెమ్మనము గంతులు వేయఁదొడంగెఁ గానలో
చనములు జాలువారె గుణసత్త్వము పొంగులువారె నిర్మల
ప్రణయము తొంగి చూచె శ్రుతిపర్వముగా లలిపెన్మ్రోఁగెఁ గిం
చనుఁడయి బ్రాహ్మగోత హరిచారులఁ జూడం దొడఁగె నాతఁడున్.

సీ. కన్నులున్నందుకుఁ గలఫలం బిది యని
మించుదృక్కుల నివాళించుచుండె
కరయుగ్మ మమరిన, గరిమ ఫలా నని యెత్తి
నిటలతటంబున నిలుపఁ దొడఁగె
జన్మంబు గాంచిన సార్థక్యమిదియని
హృదయప్రసూన మర్పించుకొనియె
రసనేంద్రియము గన్నపస యిదియే యని
నోరార హరికీర్తి నుడువఁదొడఁగె

తే. భావనాప్రపంచములోని ప్రణయపీఠి
హరిని నిల్పి యేకాగ్రతఁ బొరయునట్లు
తత్త్వమసి వాక్యసిద్ధి సార్థకముఁ జేసె
శౌరిభక్తాగ్రగణ్యుఁ డక్రూరుఁ డపుడు. 279

సీ. హరిహరాదులకేని దొరకఁబోవనివాఁడు
నాభాగ్యవశమున నాకుఁజిక్కె
శ్రీరమామణికనుల్వెలుఁగు సింపెడు వాఁడు
నాకన్నులకు విందు సలిపె నౌనర్చె

మునిపత్నులకు దర్శనము సీయనివాఁడు
తనయంత వచ్చి ప్రత్యక్ష మయ్యె
బహుయత్నసిద్ధిచేఁ బడయఁజాలనివాఁడు
లీలగాఁ బ్రాప్తించె బాళిఁ దీర్ప
తే. ఔర నాభాగ్యమే భాగ్య వశానుగాక
భక్తచింతామణి వినోదబాలకృష్ణుఁ
గాంచఁ గల్గితిఁ గన్నులకఱవు దీర
ననుచు సత్రహారుఁ డెంతయు మనము పొంగ. 280

గీ. కొంతవడి కన్ను విభ్రాంతచింతనమున
నిలిచి విస్మితుఁ డన్నఁ దాఁ దెలిసికొన్నఁ
దేరు డిగ్గి రయమ్మునఁ జేరఁ బోయి
హరికి సాష్టాంగవందనం బాచరించె. 281

గీ. ఉత్కటం బైనయానంద మొదవ కతనఁ
గనుల నానందబాష్పము ల్గ్రమ్మికొనియెఁ
గంఠగద్గద్య మొనఁగూడెఁ గంప మొదవెఁ
జూడఁగా లేఁడు మాట మాటాడ లేఁడు. 282

మ. భగవంతుఁ డగుకృష్ణదేవుఁడు కృపాపారీణుఁ డై గోలపా
భగద్భక్తు లయిసెయ స్మేరముఖుఁ డై భక్తాంతరంగంబు నొ
ప్పగ రంజించుచు చక్రచిహ్నాంకకరంబు నాచి శిరంబుపైఁ
నిగ సంధించి మృదూక్తులం బిలిచెఁ దాతా యంచు సత్రాజునిన్

ఉ. ఆతని డాసి యెత్తి బిగియారఁ గవుంగిట హత్తి ముద్దుగాఁ
దాత యి దేమికార్యమగు ద్వాదృశు లీగతిఁ జిన్నవారికిం
జేతులు సేతురా యనుచు సొంపుగఁ బల్కుచు, రాముఁ గూడి యా
పూతచరిత్రు వెంటఁ గొని పోయెను మందిరమునకుఁ జేరఁగన్ 285

గీ. స్వాగత మొసంగి క్షేమలాభములఁ దెలిసి
భద్రసింహాసనము నిచ్చి పాదములను
జలమునఁ గడిగి మధుపర్కముల నొసంగి
బంధుమర్యాదఁ జేసిరి ప్రమద మొసఁగ. 286

గీ. అతిథిపూజ లొనర్చి పూజాంగముగను
ధేను వొసఁగి పథశ్రమ దీరునట్లు
పాదసంవహన మొనర్చి మోద మెసఁగఁ
బంక్తిభోజనమునఁ దృప్తిపఱచి రపుడు. 287

గీ. అమృతసమమైన దివ్యష్టాన్నములను
గుడిచిన సుఖోపవిష్టులై కార్ష్ణిబంధు
వులకుఁ దాంబూలచందనాదుల నొసంగి
పరమధర్మవిదుం డగుబలుఁడు చెలఁగె. 288

గీ. ఇట్లు సంభావితుం డయి యెసఁగుచున్న
మిత్రు నక్రూరుఁ గూడి పవిత్రమూర్తి
నందగోపుఁ డిష్టగోష్ఠిఁ జెందుచుండి
పరవశుండయి యిట్టులఁ బ్రశ్నఁ జేసె. 289

గీ. కటికవానింటిలోనిమేకలవిధానఁ
గాముసీడవసించుకప్పలనుబోలి
యేగడియ కేమొ యని గుండె లెగసిపోవ
నెట్లు జీవింతురో మీర లిందఱచట. 290

ఉ. క్రూరుఁడు దుర్మదాంధుఁడు నకుంఠితబాహుపరాక్రముండు భూ
భారము నైనకంసనరపాలునిపాలనయందు నెట్లు మీ
వారలు మీకు ప్రాణములు వాయక యుండుటో చిత్ర మయ్యె న
క్రూర! కిరాతుచేతఁ బడుకోయిల లెట్లు సుఖింప నేర్చెడిన్. 291

చ. పరమనిశాచరాధముఁడు పావని దేవకిమాతకుత్తుకం
దఱుఁగఁ దలంచి పైకొనినదానవుఁ డాసతికన్నకూనలం
బరపరి కంఠముల్దఱిగి పాఱ విదల్చినక్రూరకర్ముఁ డా
దురితునివోముఁ గాంచినను దోషమువచ్చును జూడ మిత్రమా!

చ. జనపతి యుగ్రసేనగుణశాలికి మేటివ్రణంబురీతిగా
జననమునందె వీఁడు బుజుసంగతులం బఱికింపఁబోఁడు దు
ర్మననముఁ జేసి నీచ మగుమార్గములె తలపోయువాఁడు స
జ్జనులకుఁ గీడు మూడ విరసమ్ముల నెంచెడువాఁడు వాఁడగున్. 293

చ. అన విని నవ్వి దాశపతి యట్లె యగున్ ఖలుదుష్టపాలన
మ్మున వెత లందియు న్విడుచఁబోలదు పౌరులు జన్మభూమినిం
గనుక నసంగతార్థములఁ గాంచుచు నెట్టెటులో తెగించి జీ
వనములఁ జేయుచుంటి మట భావిఫలంబుఁ దలంచి మిత్రమా! 294

శా. ఆశాజీవులు పూవె మానవులు ప్రాణాంతప్రమాదంబు తా
న్క్లేశవ్రాతము చుట్టుముట్టుకొనినం గ్రీగంట వీక్షించి యే
ప్రాశస్త్యానుభవంబొ కల్గునని విభ్రాంతాత్ములై మానసా
కాశజ్యోతులవెల్గులో సుఖము నాకాంక్షింత్రు శ్రద్ధస్మితై. 295

గీ. గతవిఘుల విస్మరించి ప్రస్తుతము ననుభ
వించుచును భావిసౌఖ్యప్రపంచభోగ
విషయముల నెంచి తఱి వేచి వెతలుగనుచు
జీవయాత్ర లొనర్తురు జీవులవని, 296

గీ. ఎన్నఁడో యేదొ సత్ఫల మొసఁగు ననెడు
నాశయే మానవుని జీవితాశయంబు
గడపఁజాలెడుతరణి యై పోషముచుండు
లేనినాఁడు ప్రపంచమే లేకపోవు. 297

చ. దురితుఁడు కంసభూవిభుని, దుర్మదరోగము లంతకంతకుం
బెరుగుచు నాఁటినాఁటి కొకభీకరరూపము దాల్చుచుండినన్
విఱుగుడు లేక పోదనుచు వేసట నొందియు నెల్ల యాశుభో
త్కరసమయంబు వేచి కొఱగాములు భావనసేయ మింతయున్ 298

మ. అదియుం జేరువ యయ్యె నాతనిదురన్యాయ్యంబు లోకోత్కట
ఘుము రై దొంతఱ లయ్యె నింగిదనుకం గోరాడుదీర్ఘస్థితిం
బొదివెన్ నిల్చుట కష్ట మింక బరువై పూర్ణంబుగా నూఁగుచు
న్నది నేఁడో మరి రేపొ పృథ్విపయిఁ గాలంబోలుఁ బుణ్యాత్ముఁడా!

మ. అని యక్రూరుఁడు నందగోపకునితో నానందసంభాషణ
ప్రణయుండై త్రుటికాలముం గడపి సంభావ్యంబుగా నాత్మలోఁ
దన మార్గంబున నెంచినట్టితలఁపు ల్ధన్యంబుగా నొంది చి
త్తసమూహింగని కృష్ణదేవు మదిలో ధ్యానించి నానందుఁడై. 300

సీ. మోక్షసామ్రాజ్యలక్ష్మికి మూల మైన
కృష్ణభగవానుఁడే యాదరించి సుప్ర
సన్నుఁ డై యున్నసితరవాంఛలఁ దలంప
నేల? లాలసవృత్తి మన్నింప నేల? 301

సీ. పరమభక్తాగ్రగణ్యు లౌ భాగవతులు
కోరుకోర్కులు హరిఁ జేరుకొనుటెగాక
యన్యసామాన్యవాంఛల నంద నెంచ
రాప్తకాములు కావున నార్యమిత్ర! 302

వ. అంత నయ్యక్రూరు పలుకులు విని 303

మ. హరి కృష్ణుండు ప్రసన్నచిత్తుఁ డయి తాతా దాశరాజా కృపా
పరతన్నేఁటికిఁ జూడవచ్చితివి మాభాగ్యంబె పో బంధులం
దఱు క్షేమంబున నుందురే సుఖులొకో తత్పౌరు లావారలున్
మఱి పుణ్యుల్ వసుదేవదేవకులు సమ్మానంబుతో నుందురే! 304

గీ. మమ్ముఁ గన్నమ్మ దేవకీమాత పుణ్య
మూర్తి మాతండ్రి వసుదేవభూవరుండు
చెల్లెలు సుభద్ర సేమమా! చెప్పుమయ్య!
మమ్ముఁ దలపోసెదరె వారు మాన్యచరిత! 305

గీ. ఎన్నఁడో యామె కేము జన్మింతు మనుచు
గటిక చెఱఁ ద్రోసి గారించెఁ గంసనృపతి
మాదుపుట్టువఁ బో లోకమాన్యులకు వి
చారకారణ మయ్యె నిచ్చాయ నకట! 306

సీ. కడుపారఁ దనయులఁ గాంచు టొక్కటె కాని
యద్దుము ద్దెఱుఁగని ముద్దరాలు
కల్యాణతిలకముం గాంచిన దాదిగాఁ
గారలోఁ గ్రుస్సు దుఃఖవశురాలు
కడుపుపంటనె యెత్తి కంససింహమునోటి
కందీయవలసిన యార్తురాలు
పదిరానియిడుమలు పడుచుండియు విరోధి
యంత మెంచనిగుణసంస్థిరాలు

తే. భువనమాన్యపాతివ్రత్యపూర్ణురాలు
విశ్వరక్షకుఁ దైవత్రివిక్రమునకుఁ
దల్లిగాఁ జేరు వడసినధన్యురాలు
దేవకీమాత యయ్యెనో దీన యయ్యె. 307

సీ. బురదలోఁ గుమ్మరిపురువట్లు సంసార
మున నంటి యంటక మెలఁగువాఁడు
మిన్ను మన్నేక మైతన్నలంచినఁగాని
స్థిరతరాశయములఁ బొరయువాఁడు
నఖిలంబు సర్వేశ్వరాత్మ మ్మని యెంచి
హృదయప్రసూన మర్పించువాఁడు
తను జేయుపుణ్యాత్మలను సర్వదా పరి
పూర్ణులఁ గావించి పుచ్చువాఁడు

తే. నిరుపమానందనిరతుఁడు నియతధర్మ
పాలకుఁడు పాపవిముఖుఁడు భవ్య సుగుణ
శేఖరుఁడు వసుదేవుఁడు చింత నంది
యెంతగా దీను డయ్యెనో యెఱుఁగదరమె? 308

మ. అనఘా పెద్దలు మీరు సర్వమును సువ్యక్తంబులే యింక గో
పనమేలా విను నారదర్షి కడువిస్పష్టంబుగాఁ బల్కెఁ గం
సునిదుర్నీతిమయప్రయత్నములఁ జచ్చుం బుచ్చు లేకుండ నా
తనిపాపంబులు పండ వచ్చి విపరీతం బయ్యె దుర్మార్గముల్. 309

క. మీరాకఁగూర్చి వివరము
నారదుఁడే తెల్పె నైన నందప్రవరుం
డీరాయబార మెఱుఁగఁడు
ధీరాగ్రణి వారితోడఁ దెలుపుము దయతోన్. 310

తే. దేవకీ దేవికి జనించితిని యశోద
మాతచనుబాలచలువచే మనికిగంటి
మథుర నాజన్మభూమి యీమంద నాని
వాసభూమి యిట్లయ్యె నావర్తనంబు. 311

చ. అనఘ నృశంసకంసవిభునానతి వచ్చితి గాక మాయెడం
బ్రణయము కల్గునా హితులు బంధులు జ్ఞాతులు పెద్దలెందఱు
న్ననుఁ నొక రైన మమ్ముఁ గనినారొకొ వారల నేముఁ గంటిమా?
కనుఁగొని కోరి వచ్చుటకుఁ గన్నులు కల్గవుకాదె పుణ్యుఁడా! 312

చ. అన విని దాశరాజు, హృదయంబునఁ దానము నంది, కృష్ణదే
వునిఁ గని దీనదృక్కులను బుణ్యుఁడ! సర్వమెఱింగినట్టి పా
వనుఁడవు; నీవె యిట్లనినఁ బల్కన దే మిఁకఁ గంసరాజుఁ గా
దని పని దీర్చుమానవుఁడు దక్కెఁడునే? మధురాపురంబునన్. 313

క. అని కన్నీ రొలుకుచు నె
మ్మనమున దిగు లందుచున్న మాన్యునిఁ గనియు
వ్వనజదళాక్షుఁడు నవ్వుచు
ననఘా! నవులకు నంటి నని యోదార్చెన్. 314

గీ. అంత నక్రూరుఁడు ముకుందునాజ్ఞఁ జేసి
నందునికిఁ జెప్పెఁ గంసునానతులు నచటి
యత్నములును నాతనిధనుర్యాగవిధముఁ
బూసగ్రుచ్చినవిధముగాఁ బొల్లువోక. 315

ఉ. నందుఁడు సర్వము న్విని మనంబున భీతిలి వింతచూపులన్
నందనుఁ జూచుచుండ హరి నవ్వుచుఁ గంసనరేంద్రుఁ డింకపై
మ్రందుట సత్య మాను బరిమాణము చేరువ యయ్యెనీకు నీ
చందమునం గలంత గొనఁజన్నె యనన్ దిటవొంది యంతటన్.

మ. హరిదివ్యాద్భుతశౌర్యసంపదలు ప్రత్యక్షంబుగాఁ గన్నధీ
వరుఁ డానందుఁడు కారణార్థములు దుర్వారంబు లెద్దానికిం
బరితాపంబు వహింపఁబోల దని సంభావించి మే లెంచి స
త్వరసన్నాహములం బొనర్చెఁ బురికిం బైనంబు గావింపఁగన్. 317

గీ. గోపకులఁ జూచి యనె నందగోపుఁ డీరు
పాలుఁ బెరుగు వెన్నయు నేయి భద్రపఱచి
కావిళులు గట్టి యర్వసహాకానుకలను
సిద్ధపఱుపుఁడు మధురకుఁ జేరుకొఱకు. 318

గీ. గ్రామనాయకుఁ బిలిపించి కంసయాగ
విషయమును మధురాపురి వెళ్ళవలయు
సంగతులు గోకులంబునఁ జాటఁ బంచెఁ
బాటకజనాళులకుఁ దేటపడెడు రీతి. 319

గీ. కంసుఁ డనునట్టి పెద్దరోగమున కర్హ
మైన శ్రీకృష్ణవైద్యవిఖ్యాతరసము
నిచ్చి ఫలసిద్ధి గాంచంప నేఁగవలయు
బంధులార సిద్ధంబు కండు పయనమునకు. 321

గీ. కంసభూపాలునకుఁ దగు కానుక లిచ్చి
యాతఁ డొనరించు నాధనుర్యాగవిభవ
మందఱము గాంత మచ్చటి కరిగి యనుచుఁ
దెలిపె నందుఁ డవ్వార్తలు దెలిసి సతులు. 320

చ. మధురపురాధినాథుఁ డగుమాధవకృష్ణుఁడు తమ్ము వీడియున్
మధురకు నేగువార్త విని మానిను లెల్లరు మానసంబులన్
వ్యథ గని యోర్వలేక పలుభంగుల నేడ్చుచు బాష్పబిందువుల్
పృథులముగా దొఱంగఁ ద్రప వీడి యసూరని యార్చి యాడ్చుచున్.

ఉ. జారినకేశపాశములు చక్కదొఱంగిన కంకణాలు పై
జారినపయ్యెద త్రిప్పిదిలి స్థానము దప్పెడు కంఠహారము
ల్గాఱెడు బాష్పబిందువులు ఘర్మకణంబులు సంతరించి శృం
గారము వీడుదేహములు గాంచిరి సుందరకామినీమణుల్. 323

క. శ్రీకృష్ణధ్యానంబున
లోకవ్యాపారవిధులు లోపించియు ను
త్సేకత పెనఁగొన నాత్మా
లోకన మొనరించుచుండ్రు లోలుప లాటన్. 324

గీ. కృష్ణభగవాను శైశవక్రీడ లెల్లఁ
దలఁచుకొని త్రుళ్ళి త్రుళ్ళి యాతనివినోద
వృత్తులన్ మదినెంచుచు మత్తునంది
మూర్ఛ మునిఁగిరి కొందఱు ముగ్ధ లపుడు. 325

చ. తరుణి యొకర్తె హృద్వ్యథకుఁ దాళక బావురుమంచు నేడ్చి సుం
దరశరము ల్విహాయసపథంబున కెత్తుమ నోవిధాత నీ
దుసుసుతనంబుఁ జూపులకుఁ దోయజగంధులె చిక్కినారొకో
పరమనికృష్టమైనతలవ్రాతలు వ్రాసితి కృష్ణుఁ బాయఁగన్. 326

ఉ. సుందరబాలవిగ్రహుఁడు సూరిజనోత్తమచిత్తకౌముదీ
చందిరుఁ డిందిరావిభుఁడు శ్యామలకోమలమూర్తి గోపికా
నందుఁడు నందనందనుఁడు నమ్మి భజించి తరింపనెంచు మా
కందని వ్రాసిపం డయిన నయ్యయొ ప్రాణము లింక నిల్చునే. 327

ఉ. బాలుని బాపలక్రియలభంగి రొనర్చెద నెల్లకార్యముల్
జాలి యెఱుంగ వీవు పిలుచన్ వెతలన్ బడఁద్రోసి మమ్మురి
త్నాలసరాలు రాలునటు నవ్వి ముదింపెద వందుచేత దే
వాలయ పూజనాదికము లన్నియు సున్న విరించి నీకిలన్. 328

క. తలవాకిలి వాలఁతుకతోఁ
గులుకుచు నీచెడుఁగు నీవె గుర్తింపవు మ
మ్మలయింతు వేమిపెద్దవొ
పలుకులచెలి నీవు కన్నపట్టియె కాదా? 329

గీ. నీవొసంగినకనులతో నీరజాక్షు
దరిసెనముఁ జేయుభాగ్యంబుఁ దనరఁజేసి
మఱలఁ గైకొంటి వేమిసంబరమొ నీకు
దుర్విధీ యెంత సేసెదు దుష్కృతమ్ము. 330

ఉ. గృహములఁ దల్లిదండ్రుల స్వకీయుల భర్తలఁ బిన్నపాపలన్
స్పృహ విడనాడి యన్నియును శ్రీపతియే యని నమ్మి ప్రేమతో
సహమిక దీరి యున్న మము నాఱడిపెట్టి విదేశభూములన్
విహరణముం బొనర్చుమని నీరజనాభునిఁ బంపెదే విధీ. 331

ఉ. క్రూరుఁడు కామినీహృదయగోప్యరసానుభవప్రమోదముల్
నేరని దుష్టచారుఁడు నికృష్టుఁడు నిల్చుచుఁ జేరఁ బాఱి దు
ర్వారము మాపయిం జలుపవచ్చె నకారణఘోరశత్రుఁ డ
క్రూరుఁడటంచు యాఘనుఁడు కోమలులు గూర్చెదుదుంప కాదొకో?

క. ఎన్నఁడో యక్రూరుండఁట
సతిజననిప్రేమం జూపం జయ్యన వచ్చెం
దవు విభుకు వెంటనె కొని
యవహితుఁడై నాథుఁ జేకరిగెను గాదే! ౩౩౪

గీ. పేరుమాత్ర మక్రూరుఁడు కోరిచేయు
కార్యములు క్రూరములు భయకారణమ్ము
లకట యితఁ డేడ దాపుర మయ్యె మాకు
దుర్విధీ యెంత సేసెను దుష్కృతమ్ము. ౩౩౫

మ. హరి గోపాలుఁడు నూత్నప్రియుఁడు దివ్యాదర్శరాజ్యోజ్జ్వలో
త్తరుఁ డామూర్తిఁ గాంచి నాగరికలా తన్వంగు లుప్పొంగరే
తరుణీమన్మథుఁ డట్టివారివశుఁడై దర్శింపఁ డేమో మమున్
భరియింపంగలమా యిఁ కేదిగతి తాపం బెట్లు చల్లారెడిన్. ౩౩౬

ఉ. అందఱ మేకమై చని ప్రయాణ మొనర్చెదునప్డు తేరికిన్
ముందర వ్రాలిపోవుదము మోహనకృష్ణునిఁ బాయలేక యీ
చందముఁ జేసినా మనుచు సాకు వచింతము తప్పదన్న మా
యందరపైని స్యందనము హాయిగఁ ద్రోలుఁ డటందు మెంచుచున్

ఉ. ఒకరిభయంబు లేమి మన కున్న యథార్థమె తేటతెల్లమై
సకలజగంబులం బుణికి చాయలు దిద్దినదే కదా యమా
యికలను జేసి కృష్ణుఁ డతిహీనముగాఁ గడగంటఁ జూచుచుం
గరితిఁ జెందినాఁడు కలకాలము బాధల నోర్వవచ్చునే? ౩౩౭

క. నవనాగరిక కాంతలతో
వ్యవసాయము సాగఁజేయు వల్లభుఁ డకటా!
యవసరము దీరిపోయిన
యువిదలముఖమైనఁ జూడనోపున చెపుమా! ౩౩౮

క. నెఱజాణల రమియించెడు
తరుణీమన్మథుఁడు ప్రాంతతరుణుల మగుమ
మ్మరమర లేక వరించునె
మఱలియుఁ బురిఁ జేరెనన్న మాటవినవమే!

ఉ. క్రొత్తయె వింత ప్రాంత యొకటోంత యనంగ విలాసి కృష్ణుఁ డా
జిత్తులమారి పత్తనపుఁజేడెల పొత్తున మత్తుఁ జెంది కిం
చిత్తయినం దలంచునొకొ స్నేహితురాండ్రను మిమ్ము నక్కటా
చిత్తముఁ డెంతఘోరతరశిక్ష లొసంగి తపించునో మమున్. 340

మ. ప్రణయాధీశ్వరునిన్ స్వహస్తములతో బ్రహ్మార్పణం బంచు ప
ట్టణకాంతాతతి కప్పఁజెప్పి నగుఁబాటై మూలఁ గూర్చుండుటే
మన ప్రాప్తం బిఁక నేమి సేయనగు నామాయావి గోపాలుఁడే
గుణశూన్యుం డయి వట్టిబూటకపురంగు ల్చూపి రాపాడుచోన్.

ఉ. ఇంతకు మించి కాంతల కనిష్టము కష్టము వేఱ యున్నదా?
కాంతుని మోహనప్రణయ గౌరవలాలన లన్యకాంత ల
త్యంతసుఖప్రమోదమున నందుచుఁ బొందుటఁ జూచి యయ్యయో
స్వాంతము దాళియుండి నగుఁబాటున కోర్చుటకన్న నుర్విపై. 342

చ. అరనిముసంబు గన్గొనమి నాఱడిఁ జెందెదుమమ్ము వీడియున్
హరి సనుచుండ నోర్వఁగలమా మన మేఁగి సమక్షమందున
న్మఱలుత నీప్రయాణమును మానినులార యిఁ కేల జాల మం
దఱ మొకటై వచించునెడఁ దప్పక యొప్పుమి తప్పిపోయెడున్. 343

గీ. కర్మవశమున కృష్ణసాంగత్యమొదవి
బాహిరముగ వర్తించెడుసాహసికల
నేమి సేయంగలరు బంధులింతులార!
రండు పోదము కృష్ణుఁ జేరంగ నిపుడు. 344

గీ. ప్రాణతుల్యుఁడు శ్రీహరి పయనమయ్యెఁ
బోవుచున్నాఁడు మనయాసు వొందఁబోఁడు
భయముచే నూరకున్న సంబంధ మింక
నేఁటితోఁ దీరిపోవు నోనెలఁతలార!

మ. అని గోపాంగన లెల్ల రాత్రి గొని కృష్ణా! కృష్ణ! ప్రాణప్రియా
చనుచున్నావొకో మమ్ము వీడి యని లజ్జం బాసి వాపోవుదో
విని గోపాలుఁడు కామినీమణులయావేశంబుఁ బోకార్చి సాం
త్వనవాక్యంబులు ముచ్చటించి కజలం దప్పించి యొప్పించుచున్.

గీ. దైవ మనుకూల మైన చేతఁ బ్రయాణ
మెట్టులో యాగిఁపోవు నదేది లేదు
పిడుగో దుశ్శకునమొ కాని వచ్చిపడదు
మనము దైవోపహతులము మగువలార! 347

మ. అనఁ దృప్తిం గని గోపభామినులు కృష్ణా! నీవు కార్యంబు దీం
రిన వెన్వెంటనె రమ్ము పొమ్ము నిను సంతృప్తిన్ విలోకింపకే
మనలేమీ చెడుకాల మెట్టెటులొ సంబాళించి నీ రాకకై
యనిమేషంబును వేచియుందుముసుమీ యాలింపుమీ! మా మొఱల్

వ అని వేడుకొనుచుండి రపుడు 349

సీ. అంతఁ బ్రాతఃకాల మైన నక్రూరుఁడు
నిదుర లేచి కడంగి నిత్యవిధుల
నెఱవేర్చుకొని తనయరదంబు సంసిద్ధ
పఱచె నందాదిగోపకులు నెల్ల
దధి ఘృతక్షీరపాత్రలుఁ గానుకలు కట్టి
యర్హు లౌ వారి మోయంగ నిలిపి
బండ్లు గట్టి ప్రయాణపరికరములు గూర్చి
సంసిద్ధులైన నాసమయమందు

తే. హరియు, బలరాముఁడు యశోదయాజ్ఞ బొంది
గృహము వెలువడి తమకుల వృద్ధులెల్లఁ
జెలఁగి రాశీర్వదించి జేజేలు చెప్ప
నరద మెక్కిరి యక్రూరు ననుసరించి. 350

గీ. బండ్లలో నందగోపాదిప్రముఖు లెల్ల
నెక్కి రంతట నిఱుదెసల్ క్రిక్కిరియుచుఁ
దప్పెటలు, శృంగములు మ్రోయుఁ దద్రథంబు
కదలె నంతట మధురమార్గంబుఁ బట్టి. 351

గీ. సాఁగ నంపి వచ్చిన గొల్లచాన లెల్ల
రథపతాకము గుఱి భూపరాగము గను
పించునందాఁక నచటనే ప్రేమదృక్కు
లొలయఁ దలలెత్తి చూచుచు నిలిచి రంత. 352

సీ. వాయువేగముగాఁ బాఱువాహనములు
గూర్చినరథంబు గడపి యక్రూరుఁ డపుడు
పావనం బగుయమునాస్రవంతికడకుఁ
జేరె బలరామకృష్ణు లచ్చెరువడంగ 353

చ. ఘనయమునాస్రవంతికడ గ్రక్కునఁ దేరును నిల్పి నిమ్మమం
దునఁ గరపాదము ల్గడిగి దోయిళు లెత్తి జలంబుఁ గ్రోలి య
వ్వనజదళాక్షు లిర్వురును వచ్చి రథంబును ద్రోలి తత్తటం
బునఁ గలవృక్షకుంజములపొంత వసించిరి సంతసంబునన్. 354

వ॥ అయ్యెడ సూర్యోదయమైన గమనించి, నిత్యవిధులు నియత
కాలమున నెఱవేర్ప నుంకించి 355

—*అక్రూరుఁడు యమునాజలంబుల మునింగి బలరామకృష్ణులఁ గాంచుట *—

మ. ఘనుఁ డక్రూరుఁడు స్నాన మాడుటకు సంకల్పించి తత్స్యందనం
బున నుండం బలరామకృష్ణులకు నుద్బోధించి కాళిందికిం
జనుచో నిట్లు తలంచె ముష్టికునినిం జాణూరునిం బోర మూ
రోఁకని గెల్పొంబెదరో క్ష్మా కోమలతనుల్ గోపాలచూడామణుల్ 356

గీ. వారు గిరికంధరులు క్రూరవారణములు
వీరు బాలురు సుమసుకుమారతనులు
వారితో మల్లయుద్ధ మేతీరు సనునో
వ్యత్యయం బైనఁ బాపి నే నోదు నేమొ! 357

సీ. అని మనోవికారమునంది చని స్రవంతి
జలములం జొచ్చి ధర్మోక్తసరణి స్నాన
మాడుచుండఁగఁ దజ్జలమందుఁ గానఁ
బడిరి బలరామకృష్ణు లవ్వారియందు. 358

మ. పరమానందముతోడఁ గన్గొనియె నాభక్తాగ్రగణ్యుండు స
ర్వేశ్వరునిం బాలతమాలకోమలఘనశ్యామాభిరామున్ మనో
హరగోపాలకుమారకృష్ణు సురలోకారాధ్యచిద్రూపునిన్
స్ఫురదిందీవరచారులోచనుని సంపూర్ణప్రభాధామునిన్. 359

మ. కనియాశ్చర్యము నంది బాలుఁడు కృతాంగంబందు వర్తించుచో
గనుపింపం గతమేమి యుండదని వరాంగం బెత్తి వీక్షించి స్వాం
తనమం దాడెడువారిఁ గాంచి భ్రమచేతం గంటినేమో యటం
చని నీరంబున గ్రమ్మఱ న్మునిఁగె నయ్యుత్కృష్టుఁ డవ్వేళలోన్ 360

తే. లలితవరఫణాసాహస్రవిలసితబహు
సన్మణివిరాజితశిరస్కు సర్పనాథు
భవ్యనీలాంబరు ననంతభారవహుని
నాదిశేషునిఁ గాంచె జలాంతరమున. 361

సమాలిక:- శ్రావణనీరదశ్యామాభిరాముని
వరపీతకౌశేయవసనధారిఁ
బురుషోత్తముఁ జతుర్భుజు శంఖచక్ర
దాపద్మధరుఁ బ్రశాంత స్వరూపు
బద్మపత్రవిశాలభద్రలోచను హాస
హాసచాంద్రీభాసురాననేందు
భక్తప్రసన్నసువ్యక్తమృగ్జాలుని
శ్రీకర్ణు సుకపోలు స్నిగ్ధదేహు
బింబాధరుఁ బ్రలంబపీవరభుజుఁ గంబు
కంఠుఁ దుంగాంసు శృంగారవేషు
శ్రీవక్షు నతనాభు సింహమధ్యుని బృహ
త్కటితటు విస్ఫురద్గాత్రు నములుఁ
గమనీయజానుజంఘాయుతుఁ దుంగగు
ల్ఫాఢ్యు నరుణనఖు నబ్జచరణు
హారకేయూరకోటీరనూపురకటి
సూత్రావతంససంశోభితాంగు
బ్రహ్మేంద్రరుద్రనారదయక్షకిన్న
రుగరుడోరగస్తూయమానుఁ
బ్రహ్లాదనారదవ్యాసాంబరీషశు
కాదిభాగవత సేవ్యవరమూర్తి

శ్రీధారుణీసతీసేవితు శక్తివి
ద్యాజ్ఞానసంయుతు ధవళకీర్తి
తే. నాదిశేషపర్యంకమునందు వెలసి
భక్తవర్యులఁ బాలించుపరమమూర్తి
శుద్ధసత్త్వస్వరూపునిఁ జూచి భ్రమసి
కన్నులరమోడ్చి మ్రొక్కె నిష్కలుషుఁ డగుచు. 362

చ. ఘనపులకాంకితుం డగుచుఁ గన్నులుదొట్టి ప్రమోదబాష్పముల్
చినుకులువాఱ నెమ్మనము చిందులు ద్రొక్క ననంతరూపిపొ
ల్పున రుచిరాననుం డగుచు లోచనగోచరమైనమూర్తినిన్
మననముఁ జేసి చేసి యనుమానము దీరి నుతించె నిట్టులన్. 363

ఉ. నీయుదరంబునం దున జనించిన దంబుజ మందుఁ బుట్టినాఁ
డాయజుఁ డాయనం బగుసమస్తజగమ్మును వానిచేత ని
ల్లై యెనసెన్ సమస్తవిబుధావళి నీకరుణం బ్రతాపల
క్ష్మీయుతమై ప్రవర్తిలెదుఁ గృష్ణ నినున్ గనులారఁ గాంచితిన్. 364

—* కృష్ణాదులు మధురఁ జేరుట *—

చ. హరి తనస్వస్వరూపవిభవాతిశయంబును జూననట్లు ము
మ్మరమున దాశరాజు పరమాత్ముని సన్నుతిఁ జేసి చేసి మై
మఱచినవేళ గ్రమ్మఱసమాహృతరూపకుఁ డయ్యె శౌరి య
చ్చెరువడి లేచి దాశపతి చేరెను శ్రీబలరామకృష్ణులన్. 365

క. వచ్చెదనక్రూరుం గని
మచ్చికతోఁ బల్కె శౌరి మహనీయుఁడవై
యెచ్చట నెట్టివిశేషము
లచ్చుపడం గంటి తెల్పు మనఘా మాకున్. 366

సీ. చూచినావె భూమ్యాకాశసుధలయందు
భవ్య మగుస్వస్వరూపవైభవము నీవు
తాత యక్రూర నీ కది ప్రీతి యౌనె
తెల్పుమా యని శ్రీకృష్ణదేవుఁ డడిగె. 367

మ. హరి కృష్ణా కనులారఁ జూచితిని భూవ్యోమాగ్నితోయంబులం
దరు దానిదగుస్వస్వరూపవిభవం బానంద మేపారఁగాఁ
బరమాత్మా సకలంబు నీవె యని విస్పష్టంబుగాఁ గాంచె నా
దురితవ్రాతము తీరిపోయి ధృతసంతోషుండ నై వచ్చితిన్. 368

వ. అనినఁ గృష్ణుండు

శా. తాతా యేల వినోదసంభ్రమముచేఁ దారాడుచున్నావు వి
ఖ్యాతానందవిశేష మే దయిన దృశ్యం బయ్యెనా నీకిలో
నేతన్మాత్రవిశేషమే యమున నీ వీక్షింప నేనాఁ డుం
ప్రీతిం జెందవు తద్విశేష మెదియో విన్పింతువే మాకనున్. 369

ఉ. ఏమును జూచివచ్చెద న దేమివిశేషమొ యంచు మోముపై
లేనగ వొప్పు ముద్దు నాగలీను కనుంగవ నప్పళించుచున్
మానవబాలరూపి యగు మాధవకృష్ణుఁడు పల్కుపల్కులన్
వేణునినాదమట్లు వినిపించిన దాశవిభుండు నవ్వుచున్. 370

చ. అగు నగు బాలకృష్ణ యిది యద్భుతమో పరమాద్భుతంబొ యే
యగణిత దివ్యవైభవ మహాద్భుతమో మఱి యేమొ కాని యా
నగవులుఁ జింతలేనియసునల్లని యల్లరి గొల్లపిల్లవా
ని గడుసు చెయ్దమేమొ యని నెమ్మది నమ్మద మందెఁ గేశవా.

ఉ. మాయలమారివాఁ డఁట యమానుషచర్యల బాలుఁడంట యే
తాయము పెట్టియో తనదు దారికిఁ ద్రిప్పెడువంట హాయిగాఁ
దీయని వేణుగానమున దిమ్మెరపుచ్చెడువాఁడయంట శ్రీ
బ్రాయపుగొల్ల బాలుఁడట భ్రాంతిని గూర్చెడునంట మాధవా.

శా. భూవ్యోమాగ్నిజలంబులం దొదవు సంపూర్ణానుమోదక్రియా
స్వామ్యం బయ్యెడు నేమొ యవ్విధము విజ్ఞానార్ధకల్పంబులౌ
కామ్యంబు ల్గని వేరిపో యెనుగదా కాళిందితోయంబులన్
రమ్యానందవిశేషము ల్గనుటకున్ నాపుణ్యమే పుణ్యమా. 373

శా. నీయందే కనుఁగొంటి సర్వమును సందేహాస్పదం బైనహా
ద్వైతయామంబు వసింపఁజేయుటకునై యాదర్శరూపంబు నెం

తోయజాక్షా యనను మెప్పుఁ జూపితివి సంతోషించితిం గృష్ణ నీ
మాయాకల్పము దీర నేరితరమా మాయామానినీ నాయకా! 374

గీ. శూరచాణూరముష్టికాసురులె కారు
పదియునాలుగుభువనములు బ్రదికొనినను
నీచరణరేణువుగడల్ప నేర రెపుడు
సర్వలోకైకజేతవు సాక్షిరూప! 375

గీ. మృత్యువాసన్నమై కంసమేదినీశుఁ
డకట! వైరము నంచె నియమముఁ బూని
కర్మతంత్రముసూవె యీకానిపనులు
వానిచేఁ జేయ నేమించె వనజనాభ! 376

వ. అని యక్రూరుఁడు హరితోఁ బ్రసంగించిన యనంతరంబ 377

బండ్లపైఁ బయనించుగోపకులు వచ్చి
చేరినంత నక్రూరుఁడు చిన్నకృష్ణు
నాజ్ఞఁ గొని తేరు ద్రోలి సాయంతనమున
మధురఁ జేరంగఁబోయె సమ్మదము గదుర. 378

ఉ. దారిని వచ్చువారు రథము దాపునఁ బల్లెజనంబు గుంపులై
చేరుచు దేవకీసుతులఁ జిన్మయరూపులఁ గాంచి సంతసం
బార మృదూక్తులం బలికి యచ్చట ముచ్చటఁ దీరి కానుకల్
గూరిమి నిచ్చుచుం బ్రణయగోష్ఠిఁ దనర్చుచు నుండ్రు భక్తులై. 379

గీ. అచ్చటచ్చట నిట్లు దేరాఁగఁ జేసి
పాటకజనంబుతోడ సంభాషణాది
కములఁ జేయుచుఁ బోవుచోఁ గడమదారి
ముందె చేరిరి మధురకు నొమ్మద మలర. 380

కం. నందాదులు మధురాపురి
యందలి యుద్యానవనమునం దుండియు గో
విందుని రాకం జూచుచు
విందుగఁ గనుచుండి రచట వేడుక లెల్లన్. 381

మ. హరియున్ రామునితోడఁ దేరు డిగి యయ్యక్రూరు హస్తంబుతోఁ
గరముం జేర్చి పట్టి యిట్లనియె మార్గాయాసముం దీరనిం
దఱ మీరేయి వసింతు రెచ్చటనె ప్రాతఃకాలమం దేమునుం
బురిఁ జేరం జనువెంతు మీవు చనుమో పుణ్యాత్ముఁడా యింటికిన్.

మ. అని మారాక నెఱుంగఁ జేయఁ దనుఁ గంసాహితున్ సన్నఁ గిం
చనుఁడై స్వామి! యిదేల నేఁటినిశి విశ్రాంతంబుగా మద్గృహం
బున నాతిథ్యము స్వీకరింపఁదగు సంపూర్ణానురాగమ్మునన్
నను ధన్యాత్మునిఁ జేయునా కరుణమై నాకోర్కెఁ జెల్లింపుమా

చ. పరమసుహృద్వరుండవు కృపామయమూర్తివి మాప్రభుండవుం
గరుణ దొలంకు చూపులను గాదిలిబంధులఁ గూడి నీవు స
త్వరముగ రమ్ము మాగృహము పావనముం బొనరించి పొమ్ము శ్రీ
వర కడుదుర్లభం బయినభాగ్యము నేఁటికి నాకు [illegible]సన్. 384

సీ. పరిశుభ్ర మైననీ పాదోదకముచేత
బితృదేవతలును సంప్రీతిఁ గంద్రు
నీపదయుగ్మము నియతిఁ బ్రక్షాళించి
బలి యఖండైశ్వర్యఫలము గాంచె
నీపాదమందు జన్మించి వియద్గంగ
యభవునౌదలఁ నిల్చుయశము గాంచె
తజ్జల స్పర్శచే ధన్యులై సాగరుల్
స్వర్గసౌఖ్యము లంది సఫలులైరి 385

తే. యట్టినీచరణాబ్జము లంబుజాక్ష!
పాద్యములను బ్రక్షాళించి పావనుండఁ
గాఁ దలంచితి దయచేసి గౌరవమున
మాగృహంబునకున్ రమ్ము మాన్యచరిత 386

చ. అన విని నవ్వి శౌరి యనఘా పరితాప మదేల? తొల్త దు
ర్జనుఁడును యాదవాన్వయవిచారకరుండును గ్రూరుఁడైన కం
సుని వధియించి కాని యొకచో నుదకంబును గ్రోలఁజాల నా
పని పరిపూర్తి యైన నుడిఁ బాయక వచ్చెద నీగృహంబునకున్. 387

గీ. అంత నక్రూరభక్తుఁడు స్వాంతమందుఁ
జింత నందియు హరియాజ్ఞఁ జేసి మఱలి
మధురఁ జేరియుఁ గృష్ణాగమనముఁ గంస
విభునకుం దెల్పి గృహమున కరిగె నంత. 388

—* రామకృష్ణులు మధురలో విహరించుట *—

గీ. పిదప సంకర్షణునిఁ గూడి వేర్మి గదుర
గోపకులు పరివేష్టించి కొలుచుచుండ
సరసిజాక్షుఁ డపరాహ్ణ సమయమందుఁ
గదలె మధురాపురంబును గాంచఁ గోరి. 389

సీ. మహితస్ఫటికకుట్టిమములచే నొప్పారు
భవ్యగోపురపురద్వారములును
రమణీయ హేమతోరణము లొప్పుచునుండి
తామ్రమారగోష్ఠవిస్తారితమును
భద్రమరాసదపరిఘాపరీవృత
ముద్యానవనశోభనోజ్జ్వలంబు
బహువిధరమ్యోపవనశోభితంబును
శ్రీనికేతన మనఁ జెలువు నింపు

తే. మహితమధురాపురంబును మమతదీరఁ
గాంచుచును గోపబృందము లలసి రాఁగ
బలునితోఁ గూడి సంభ్రమపడుచుఁ గృష్ణ
దేవుఁ డత్యంతముదమునఁ దిరుగఁదొడఁగె. 390

గీ. గృహబహిర్ద్వారములయందు నెసఁగి యున్న
పల్లవారుణతోరణపంక్తి పూర్ణ
కలశములు కేతనంబులు చెలువు మీఱు
వృక్షపంక్తులు కన్నులవిందు సేయు. 391

సీ. ధవళమై యత్యున్నతమ్మునై శృంగార
మైతోఁచు రమ్య హర్మ్యములు దనరె

మందిరమ్ముల నంటి సుందరోద్యానము
లందాల కెక్కులై యింపు సేయ
హారాయలుగా నెలకొల్పి యుంచిన బంగారు
కలశము ల్బొమ్మలకొలువు లమర
రంగురంగులహంగు చెంగలించెడుకాంతు
లమరుతోరణకేతనములు దనర

తే. తేజమీఱెడు మణిమయ దీపికావి
తాన మది రేలుఁ బవలులుగా నొనర్ప
వైజయంతాదులకుఁ బ్రతిస్పర్థ గొలుపు
సౌధముల మీఱునారాజవీథిఁ గాంచి. 392

సీ. అమల మహాదేవతాయతనము ల్వేదాఢ్య
యనపారశాల లుద్యానవనులు
సత్రము ల్మఠములు చావిళ్ళు భజన మం
దిరములు నృత్యైకనిలయములును
రమణీయనాటక రంగస్థలంబులు
మల్లశాలలు రమ్యమంటపములు
సంగీతనిలయము ల్సంగీతవాద్య ని
కేతనంబులు వైద్యగృహవితతియు

తే. నాత్మకౌశల సంజీవితాశ్మచిత్రి
తామరీచారుతామోహితాబ్జగర్భ
శిల్పి సామూహికానల్పసిద్ధహస్త
తాప్రబోధకశిల్ప సంతానములును. 385

సీ. రత్నసంఘంబులు రాసులుగాఁ బోసి
యమ్మకము లొనర్చునట్టి చోట్లు
ప్రోజ్జ్వలనవరత్నభూషణమ్ములు భర్మ
రజితవస్తువు లమ్మురంగములును
వివిధసామగ్రుల విక్రయించెడునెడల్
పరిమళద్రవ్యము ల్వాఁగుచోట్లు

ఫలపుష్పచందనాదుల నమ్ముచాళ్లు
కమనీయవస్తువ్రగ్గలు గుత్తావు

తే. లెడ తెఱపి లేక జనములు విడియునెడలు
గలిగి యున్నట్టి విపణిమార్గమునఁ గదలి
వింతలు విశేషములు గనుఁగొంచుఁ గాఁగఁ
గాంచుచుండిరి కృష్ణుఁ గలసి సఖులు. 394

మ. పురమం దిట్టుల సంచరించుచును సమోద్యానమ్ముగా నొప్పు సుం-
దరగోపాలకుమారులం గని సుహర్షోత్సాహంబు చెన్నొందఁ ద
త్పురవాస్తవ్యులు దేవకీ వరసుతుల్పుణ్యాత్ము లారాధరా
భరముం దీర్ప జనించినా రనుచు సంభావించి యుప్పొంగుచున్

ఉ. గుంపులు గుంపులై ప్రజలు కోరిక లీరిక లెత్తఁ గాంచుచుం
బొంపిరిపోవుమోదమున పొంగుచు శ్రీహరిఁ జుట్టుముట్టుచున్
బెంపు రహింప భక్తిఁ గని పేర్మిని జేతుల నెత్తి మ్రొక్కుచున్
సొంపుగఁ బాడుచున్ మెఱుఁగుఁ జూపులఁ జూచెద రెల్లవారలున్

ఉ. కొందఱు మేడ లెక్కి మఱికొందఱు చెట్లకుఁ బ్రాకి యింకనుం
గొందఱు నున్నతం బయినగోపురశృంగములందుఁ జేరి యా
నందముఁ జెంది యందఱును నందకులాభరణంబుఁ గాంచుచున్
సందడి చేయుచుండ విని చానలు కృష్ణకుమారుఁ జూడఁగన్ 397

ఉ. తొందరతోడ మై మఱచి తోయజనేత్రలు వారు వారు నే
యందగుకార్యము ల్విడచి యప్పటి కప్పుడు నేది దోఁచు నా
చందముగాఁ బ్రవర్తిలుచుఁ జయ్యన మేడలపైన నెక్కి యా
నందము చిందులాడ హరి నాయకుఁ గాంచుచు నుండ్రు వేడ్కగన్.

సీ. చీరె సింగారించు నారి కుచ్చెళ్లను
దిగఁద్రోచి మెడపై నెగసిపోయె
ముక్కుకుఁ ముక్కెఱఁ జక్క నొత్తఁగ లేమ
చెవిరంధ్రమునఁ బెట్టి చేరఁబాఱె
యొకకమ్మ ధరియించి యొకటి యావలఁద్రోసి
యొలఁత యూర్తక యొకమేడ నెక్కె

కనులఁ గాంచక దిద్దుకొనుచు నొకకంటి
యందమే చాలని భాగ్య మెక్క

తే. ప్రభులు బలరామకృష్ణు లప్పట్టణమున
వచ్చుచుండఁగ నగరుసాహోత్సవముఁ జూడ
వేడుకం గని యువతులు వివిధగతుల
మైమఱచి చూడ వచ్చిరి ప్రేమ గదుర. 399

సీ. అంటి యంటని తలకట్టులే సిడిపించి
స్నానమాడక యేగెఁ జాన యొకతె
కబళంబు మెసవుచుఁ గడఁ ద్రోసి విసవిస
జేతులం గడుగక చేరె నొకతె
స్తన్య మిచ్చుచు సుపుత్రతనయుని నొడినుండి
దిగఁబెట్టి పఱువిడెఁ దెరువ యొకతె
పతి కామమడుపుల భక్తితో నిచ్చుచు
విడనాడి వెడలెను వడఁతి యొకతె

తే. యిట్లు మధురాపురాంగన లెల్లఁ గృష్ణు
రాక విని కాంచునిచ్ఛమై రమ్యగతుల
గృహముల న్వీడి బలరామకృష్ణవరులఁ
జూడ వచ్చిరి వేడుకతోడఁ గూడి. 400

గీ. వినుటయే కాని యేనాఁడు గని యెఱుఁగము
వారు లోకైక విఖ్యాతవీరు లంట
మారసుకుమార చారు శరీరు లంట
పోద మని యొండొరు ల్దలపోసికొనుచు. 401

గీ. గోపికాచారునయన చకోరచంద్రు
లందచందాలకిక్క లౌసుందరాంగు
లతులబలపరాక్రమ తేజు లమలయశులు
గాంత మని గుంపులై పురకాంత లెల్ల. 402

వ. అరవిందాక్షుఁడు నీలనీరదఘనశ్యామాభిరాముండు సుం
దరగోపాలకుమారరూపకుఁడు శీతాంశ్వాననుం డూర్జిత

ద్విరదేంద్రోపమబాహువిక్రముఁడు గంభీరస్వభావుండు శ్రీ
వరుఁ డానందమయస్వరూపుఁడు [illegible]భావుండు శ్రీదుం డగున్.

చ. మొగమునఁ దోఁచు లేనగవు ముద్దులమూటలు విప్పుచుండఁగా
నగపడు మోహనాంగత, దృగంచలచంచలవీక్షణంబు లొ
ప్పుగ మదిమర్మములఁ గదుప, మోహనకృష్ణునిఁ గాంచి కాంచి య
మ్మృగుదలు కామతప్తలయి, ముమ్మర మందిరి నెమ్మనంబులన్.

చ. హృదయములందు నిల్పుకొని యెంతయు భక్తిపురస్సరంబుగా
సదయునిచిత్రరూపమును సన్నుతిఁ జేయుచుఁ గౌఁగిలించుచున్
బదముల నొత్తుచు న్వివిధబంధురకేళిక లాడి సోలుచున్
ముదితలు కామతాపమున ముగ్ధలు నైరి విలోలచిత్తలై. 405

మ. విరిమొగ్గ ల్వెదఁజల్లి ముత్తెపుసరు ల్వ్రేఁ జిమ్మిపూగుత్తులన్
సరిగా వ్రేసి వసంతము ల్జిలికి భాస్వద్రత్నమాణిక్యము
ల్పొరయం జల్లుచుఁ గామినీమణులు సంపూర్ణానురాగంబుతో
హరి వేంచేసెడుమార్గమంతు గుములై యానంద మేపారఁగన్ 406

గీ. హరి చరించెడుమార్గమం దచ్చటచట
నుదకపాత్రలు చేఁబట్టి యెదురు నడచి
యక్షతలఁ బూలమాలలఁ నగరుగంధ
ములనొ బూజించి రెల్లవిప్రులుఁ జెలంగి 407

సీ. ఇతఁడఁటే రాకాసియతివ పూతనపాలు
గ్రోలి దున్మాడినగోపసుతుఁడు
చరణాఘాతంబున శకటాసురు వధించె
వీఁడేకదా భూరివిక్రముండు
గోగోపకులఁ బ్రోవ గోవర్ధనం బెత్తె
వీఁడె కా లోకైకవిదితబలుఁడు
యితఁడు కాఁడటె మునిసతుల పుణ్యమ్ములు
పండించినట్టి పావనచరిత్రుఁ

తే. డితఁడు మన్మథమన్మథుఁ డింతులార
గణన మీఱిన గోపికాకామినులను

మోహవివశలఁ గావించి ముద్దు దీర్చి
హృదయమున నిల్పుకొనెనంట యింతులార! 408

సీ. కనుచూపుమాత్రాన వనితలచిత్తము
లత్తఱిల్లఁగఁజాలు చిత్తజుండు
దరహాసచంద్రికల్ బఱపి స్త్రీహృదయముఁ
జూఱగొనంజాలు మారమూర్తి
పలుకుపల్కినతోనె లలనలమానముల్
గొల్లగొనంజాలు గల్లరయ్య
మారవిలాససంచారవైఖరులతో
సతులదాస్యము గొనుచతురమూర్తి

తే. మదన జగదేకపూజ్య సామ్రాజ్యలక్ష్మి
కుత్తరైకొని పాలించుకోమలాంగుఁ
డౌర! యీమకరాంకశశాంకమూర్తిఁ
బొందిననె యాడుపుట్టువు పుట్టుఫలము. 409

గీ. ఈ మహానుభావునితోడఁ గామితములఁ
బొందుగోపాంగనలుసూవె పుణ్యవతులు
వారు నందయశోదలు భవమహాబ్ధిఁ
గడతు రీతనిఁ బెనిచినకారణమున. 410

క. అని నానావిధములఁ బుర
జనులాడుచునుండ శౌరి స్వజనులతోడన్
జని చని యమ్మార్గంబున
గనుఁగొనె నొకరజకుఁ గంసుగాదిలిబంటున్. 411

—* రజకవధా ఘట్టము *—

చ. కనిబలరామమూర్తి రజకా నరపాలునికోఁక [illegible]
కొని చనుచున్నవస్త్రములఁ గోరినవాని నొసంగి పొమ్ము [illegible]
మును ధరియింప నర్హులమె మోసముఁ జెందెదు [illegible] కలు [illegible]
కనిన నతండు నవ్వి చెలగాటము [illegible]. 412

చ. వనములలోఁ జరించు మృగవర్గము బోలినమీర లెన్నఁడై
నను గనుగొంటిరా ధరణినాథులు దాల్చెడు రమ్యవస్త్రముల్
ఘన మగు పట్టువస్త్రములఁ గట్టఁదలంచితిరా బళే! బళే
వినఁబడుచుండె వింత లటవీప్రజ కేలకొ మేల్మిపుట్టముల్. 413

ఉ. బాలకులార! మీమిడిసిపాటుఁ దలంగి యధేచ్ఛగాఁ జనం
బోలును గాని చో విఱుగమొత్తెద రల్లదె రాజసేవకుల్
కాలుని చేతికిం దొఱికి తా దనవచ్చును గాని కంసభూ
పాలుని భృత్యకోటి కరవాలము దూసిన నోర్వవచ్చునే? 414

గీ. బ్రతుకుపై నాస కలదేని సారిపొందు
లేడిశాబక మేడ విక్రీడ గోరి
భయదసింహముపై కెగఁబ్రాకు టేడ
పొందు పొందు మీ రింతట బుద్ధి గలిగి. 415

గీ. సుందరముఖారవిందము లూచి చూచి
మనసు పొంగి వారించెదఁ గనికరమునఁ
గాని చో నేలఁ బడవైచి కాలమట్టి
కాలుప్రోలికిఁ ద్రోలగాఁ గలరు వారు. 416

మ. అని వెటకారముల్పలుకు నారజకాధముఁ బాఱఁ జూచి మొ
ల్లనినగ వంసభాగమున లాస్యము లాడ వినోది కృష్ణుఁ డో
య్యనఁ జని గోటితో గళము నట్టె కసిక్కున నొక్క నంత లో
చనములు దేలవైచి జముసన్నిధిఁ జేరఁగఁ బాఱె వాఁడునున్. 417

ఆ.వె. అత్తిపండు బొజ్జ నొత్తుచో లోనున్న
పురువు లెల్ల నెగసిపోవునట్లు
రజకుఁ డీల్గ వానిస్వజనంబు మూటలం
బాఱవైచి పఱుఁగువాఱె లెల్ల. 418

క. బలరామకృష్ణు లంతట
వలువలమూటలను విప్పి వలయుదుకూలం
బులఁ గొని ధరియించిరి య
వ్వాల గోపకు లెల్లఁ జేర వచ్చి ముదమునన్. 419

ఉ. వారికి వారికి స్వలయువస్త్రము లన్నియుఁ దీసి యింపు సొం
పార ధరించి చిక్కినవి యచ్చటనే దిగఁబెట్టి కృష్ణునిం
జేరి ప్రసన్నచిత్తు లయి చెచ్చెర మార్గముఁ బట్టి పోయి యిం
పారు పురంబుఁ గన్గొనిరి యయ్యయివీథులఁ బట్టి పోవుచున్ 420

క. తనయోగ్యతయును నావలి
మనుజుజస్థితి తెలియఁబోక మాటాడుటయే
ఘన మని కాఱులు వాగెడు
చెనఁటికి దుష్ఫలము కాక శ్రేయ మొదవునే. 421

గీ. తెలిసి తెలియను లవి తప్పు దీర్పలేవు
ఫలము రెంటికి నొకటయి పరిణమించు
ఫల మనియెదూను నగ్గిలో నేలభమద్ది
నూడి మసి గాక యున్నె యేమాడ్కినేని. 422

గీ. ద్వంద్వయుత మాచుఁదోఁచుప్రపంచమందు
మంచిలోఁ జెడ్డ చెడ్డలో మంచి యన్న
జోకఁ గంసనాగేంద్రవల్మీక మైన
మధురయందును గలరు సన్మార్గపరులు. 423

గీ. పురవిహార మొనర్చుచుఁ బోయి పోయి
గోపకులతోడ బలరాముఁ గూడి కృష్ణ
విభుడు సాలెవా రుండెడువీథిఁ జొచ్చి
నడచుచుండెను వింద విన్నాణ మొనర. 424

—* శ్రీకృష్ణుఁడు వాయకు ననుగ్రహించుట *—

ఉ. వాయకుఁ డన్నపేరుగలవాఁ డసురాంతకునందు భక్తిమై
డాయగ వచ్చి నూతనపటంబులు గానుక లిచ్చి మెచ్చి శ్రీ
నాయకు పాదరేణువుల నర్మిలి నొదలఁ దాల్చి మ్రొక్కియా
అప్యాయనమొప్ప వేడుకొనె నంబరము ల్దరియింపుఁ డంచుఁ దన్

ఉ. భక్తులకోర్కి దీర్చుభగవంతుఁడు కృష్ణుఁడు సాలెవాని యా
సక్తి దలంచి సమ్మతిలి చయ్యన నమ్మనుపర్కము ల్మహా
సక్తిగ దాల్చె నంతబలరాముఁడు నట్లె యొనర్చె గోపకు
లున్ముఁ డితండటంచుఁ గడుమోదముఁ జెందిరి యంతఁ గృష్ణుఁడున్

ఉ. శ్రీపతి సంతసించి సరసీరుహలోచననిరతంబులా
చూపులు వానిపై నిలిపి సుందరహస్తము లెత్తి యౌదలన్
మోపి కృతార్థుఁడీవు పరిపూర్ణముగా నిహలోకసౌఖ్యముల్
చేపడు నీకు నంత్యమునఁ జెందెద వుత్తమలోక మంచుచున్. 427

ఉ. కోమలనీలగాత్రుఁ డగుగోపరిపాలుఁడు శ్వేతవర్ణుఁ డౌ
రాముఁడు వాయుసం డిడినసామ్యపటంబులు దాల్చి యొప్పఁగా
శ్యామల శుక్లవర్ణ విలసన్మహనీయ గజంబులట్లు శో
భామితసత్త్వులై కనులపండు వొనర్చిరి చూచువారికిన్. 428

తే. శుక్ల, కృష్ణభేదము లొప్పుచుండఁ బూర్ణి
మయు నమవాస్యఁ గోలి యన్మహితు లిర్వు
రమరి వాయకు దీవించి యంత వీధు
లందుఁ దిరుగాడఁ బోయి రానంద మొదవ. 429

తే. అట్లు చనిచని పూవుల నమ్మువీథిఁ
జేరి యొకమాలాకారు పూరిగుడిసె
యందుఁ జొచ్చిన వాఁడు సానందుఁ డగుచుఁ
గదియఁ బోయి సాష్టాంగవందన మొనర్చె. 430

శా. స్వామీ! నాభవ మిప్డు సార్థకముగున్ సాక్షాత్తుగాఁ గాంచి శ్రీ
రామానాయకు నాదిశేషు మనసారం గోరి పూజించి సే
వామాధుర్యము గంటిఁ బాపవనము ల్భస్మంబుగా సంతత
క్షేమప్రాప్తి ఘటిల్లె వంశము తరించెన్ ముక్తి సంధించెడిన్. 421

చ. పితరులు మోదవారినిధిఁ బెంపెసలారుచు నున్నవారు; చి
త్తతిమిర మారిపోయె నిరతప్రమదంబు దలిర్చెఁ బూర్వస
త్కృతఫల మైన మీచరణదాస్యము నాకు లభించె దేవతా
తతికిని దుర్లభం బయినదర్శనభాగ్యము కల్గె, మాధవా! 432

చ. జగము సృజింపఁ బెంప, లయసత్త్వము నింప గుణోజ్జ్వలుండవై
యగపడు దీవు నిర్గుణుఁడ వచ్యుత! విశ్వమయుండ వౌచు, దు
ర్భగుల వధింప సజ్జనులఁ బాలనసేయ నధర్మమాఁగఁగా
జగమునఁ బుట్టుచుండెదవు సాక్షివి నిన్ను నెఱుంగ శక్యమే? 433

చ. ఒకఁడు త్వదీయమిత్రుఁ డన నొక్కఁడు శాత్రవుఁ డన్న భేద వా
చకముల నెంచ వెన్నఁడును సచ్చరాచరభూతజాలమున్
సకలవిధాల నొక్కటిగ సాఁకుచు నుందువు జ్ఞానయోగులౌ
నకలుషులే గ్రహించి పరమార్థముఁ దెంపుచు నుంద్రు శ్రీధవా! 434
మ. అనినన్ హర్షము నంది కేశవుఁడు భక్తాగ్రేసరుం డౌ సుదా
ముని నాలింగితుఁ జేసి హస్తమును దనస్కంధంబుపై నిల్పి యో
యనఘా నీ వొనరింపసాధనములు లే వాత్మప్రకాశంబె సుమీ
మనుజాదర్శవిధాయకం బనుచు సన్మానించి మాపిమ్మటన్. 435
గీ. కష్టసుఖమిశ్రిత మగుజగంబునందు
వలయు సౌఖ్యము లెవ్వాని కలవొ చెపుమ
భక్తుఁడా యని సాదరభావ మొప్పఁ
బలుకు హరిఁ గాంచి నవ్వుచుఁ బలికె నతఁడు. 436
ఉ. ఇంతకుఁగన్న గానలయు నేమి మహాత్మ త్రివిక్రమున్ రమా
కాంతుని నేత్రపర్వముగఁ గాంచితి సంచితము ల్దరించితిన్
స్వాంతమునందు సంతత మచంచలభక్తియు నీదుభక్తులం
దెంతయుఁ గూర్మి భూతదయ యిచ్చి నను గరుణింపు మచ్యుతా.
వ. అనిన నతని భక్తితాత్పర్యంబులకు ముదితుండై. 438
శా. స్మేరాంకూరము లొప్పు నుప్పువెడ సస్నేహంబుగాఁ జూచుచున్
బారావారగభీరుఁ డాతఁడు పరబ్రహ్మంబు సద్భక్తవాం
ఛాపూర్తుల్ మననీయమానముచు నిష్టప్రాప్తిఁ జేకూర్చి వి
స్ఫారైశ్వర్యయశోవిభూతు లిడె భక్తత్రాణపారీణుఁడై. 439

— కుబ్జా పరిపాలనము —

చ. తిరుపరిఁ గృష్ణదేవుఁడు సుదాముని వీడ్కొని బంధు లెల్లరుం
గదలియు వెంటరాఁ జని యొకానొకవీథిని వచ్చి వింతలన్
ముదమునఁ గాంచుచుండఁ దమముందఱ నేగుచునున్నదానినిన్
సుదతి నొకర్తుగాంచి హరి చోద్యముగాఁ జిఱునవ్వు నవ్వుచున్ 440
మ. తరుణీ! యెవ్వరిదాన వౌదు వడి గంధం బేమొ చేనున్న ద
ద్దిర! నెత్తావులఁ జిమ్ముచున్నది కడున్ దివ్యంబుగాఁ దోఁచు నో

గరితా! దానినిమా కొసంగెదవె సౌఖ్యం బౌను నీ కన్నఁ జె
చ్చెర నాలేమ యుపేంద్రునిం గనుచు సస్నేహంబుగా నిట్లనున్ 441

ఉ. సుందరమూర్తి నీ వగుదు శూద్రకులీనను నేను రేనికిం
జందనగంధము ల్పలుపుచాకిరిదానను దాసి నోము మీ
కుం దగినట్టివే కలవు కోరెదరేని యనుగ్రహించి యీ
చందనపంకముం గొనియు సౌఖ్యముఁ గాంచుఁడు మీరు పావనుల్.

గీ. కంఠ కటి వక్షములును వంకగలు కలిగి
కుబ్జ నాటఁ గురూపగా గోచరింతుఁ
గావున త్రివక్రయనుపేరు గలిగెనాకు
మదనసామ్రాజ్యనాయకా మావినోద 443

క. నానవకూర్పు నలంకృతి
మానవపతి కంసరాజు మక్కువతోడన్
మానించును నాభాగ్యము
చే నిచ్చెద మీకుఁ గొనుఁడు శ్రీముఖులారా! 444

గీ. ఇట్లు చెప్పి యాకుబ్జ శ్రీకృష్ణమూర్తి
హావ భావాదిచేష్టల నట్లె కనుచు
వినయమితగాత్రి యై వినతిఁ జేసి
చిత్తరువువోలె నిలిచెను జేష్ట దక్కి 445

మ. అని నమ్రోక్తుల నాడి దీన యయి మారాకారుసందే లయిం
చినదృష్టి న్మరలింపలేక కనునా చెల్వన్విలోకించి స
ప్రణయుండై హరి కృష్ణకీర్తితపరబ్రహ్మంబు తత్కాంత నే
డక నెసంగన్ మమమిక్కగా మదిని సంకల్పించె హృద్యంబుగన్

చ. సతి కడుభక్తిచే నిడిన చందనపంకము మైని నలంది స
మ్మతు లయి రామకృష్ణులు క్రమంబుగ నాడుచునుండఁ గృష్ణుఁ డ
య్యతివను జేరఁబోయి తనయంఘ్రియుగంబున దానిపాదముల్
మితముగఁ ద్రొక్కి పట్టి యగమీఁటెను గడ్డము వ్రేళ్లఁ బట్టియున్.

గీ. హరికరస్పృశ్యమై నప్పు డతివమేను
వంకరలు దీరి దీర్ఘమై పొంక మైన

పిఱుఁదులుం గుచయుగళముఁ గరపదములు
గలిగి యందాలరాణి యై వెలసె నంత, 448

గీ. సుదతి చారురూపాద్యాసుగుణములను
వెలసి మదనవికారము గలిగినంత
కృష్ణుచేలాంచలమును గీలించి వ్రేళ్లఁ
జుట్టుచున్ ముట్టుచున్ నేలఁ జూచుచుండె. 449

మ. కరుణాసింధు! రమేశ! నీకరుణచేఁ గాన్పైన నా యీమనో
హరసౌందర్యము దేహసంపదయు నీ కర్పింతు నే కాని యె
వ్వరినిం గోరను మన్మనఃఫలకదివ్యస్థానమం దీవు సు
స్థిరుఁడై యుంటివి రమ్ము పొవుదము సందేహింపకే మాధవా! 450

ఉ. ఏనితపంబు జేసితినొ యేమొ యకారణబాంధవుండవై
నీ మహిమావిశేషమున నింద్యపదార్థము స్తోత్రజాత్రమౌ
గోములు దీర్చి దిద్దితివి గోపరిపాలనఖేలనావిలో
లా మహనీయ కూర్మి గనుమా యనుమానము మాని మాధవా!

ఉ. సురతవినోదశూర! ఘనసుందరనీలకళేబరా! మనో
హర సుకుమార! మారసుకళాంచిత రమ్యశరీర! శ్రీవరా
తరుణిని నిన్నుఁ గోరి మరుదాహము నోర్వక వేడుచుంటి మం
దిరమును జేరరమ్ము మదిఁదీర్పుము నమ్మితి నెమ్మనంబునన్. 452

మ. బలరామాదులు చూచుచుండు రనునాభావంబె కన్పింప కా
లలనారత్నము కామకేళి కయి, కల్యాణస్వరూపాంచితుం
బిలువం జూచి హసించి కృష్ణుఁడు బలేపేరంటమా; సద్దిరా!
వెలఁదీ! యింతగ సిగ్గుమాలెదవె? సంవీక్షింపవే పెద్దలన్. 453

మ. మన సయ్యున్ సమయంబు, దుస్సమయమున్ మానింపరో కాముకీ
జనముల్ పెద్దలనైనఁజూడరొ రహస్యాగంబు లిట్లొప్పునా
వనజాక్షీ! యికఁ జాలు నీవలపుదుర్వ్యాసంగము ల్పొమ్ము వ
చ్చినదారిం బడి నీదునింటి కనుచున్ శ్రీశుండు వారించినన్. 454

మ. విని కన్నుల్పయికెత్తి గోపకులనున్ వీక్షించి, దానప్డు చే
సిన దౌచిత్యము కాదటం చెఱిఁగి గాసిం బొంది చేఁ దాల్చియుం

చినశ్రీకృష్ణుని చెంగు వీడి యెడగాఁ జింతిచుచు న్నిల్చెఁ బా
వనురా లైనత్రివక్ర యంతఁ గరుణాపాంగుఁడై కృష్ణుఁడున్. 455

మ. తరుణీ! చింతిల నేల? నీ వలపు సార్థంబౌను మున్ముందుగాఁ
బురమం దే మొనరింపఁజాలినపను ల్పూర్ణంబు గావించి స
త్వరమే వచ్చెద నీగృహంబునకు, శాంతం బందుమీ యన్న శ్రీ
కరువాక్యంబుల నాలకించి సతి శంకాహీన యై యుబ్బుచున్. 456

గీ. నవమరాళము రీతిగా నడలు దనరఁ
గదలి గోపాలకృష్ణుఁ గ్రీఁగంటఁ గనుచు
మఱలి చూచుచుఁ జిఱునవ్వు విరులు విసరి
చిలిపిపలుకుల నోలుకుచు జెలువ వెడలె. 457

ఉ. అంతట రామకృష్ణులు నిజాప్తులతోడ వణిక్పథంబునం
దంతట సంచరించు నెడ నచ్చటివర్తకు లెల్లఁ గృష్ణు న
త్యంతముదమ్మునం గనుచు హర్షముగా విడెమాదు లీయనా
విం తగుకానుక ల్గొనుచు వేఁ జని రెల్లరు సంతసించుచున్. 458

క. కరుణారసభరితాంతః
కరణా! కలశాభికన్యకానిత్యనవా
భరణా కల్యాణాత్మక
చరణా! సకలాద్భుత ప్రశస్తా చరణా! 459

వ. ఇది శ్రీసుబ్రహ్మణ్యేశ్వరకృపాకలిత కవితావిధేయ, నాదేలవంశసుధా
పయోనిధి కలానిధిగేయ, వేంకటశేషగిరిరాయ నామధేయ ప్రణీ
తంబైన శ్రీకృష్ణాభ్యుదయ మహాకావ్యంబునఁ ద్వితీయాశ్వాసము.

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.

ఓమ్

# శ్రీకృష్ణాభ్యుదయము



## తృతీయాశ్వాసము

క. శ్రీరుచిరాధరపల్లవ
హారివదనకుందకుసుమితాంచితరాగ
శ్రీరుచిరాధరపల్లవ!
హారిస్మిత చంద్రికాపహసిత సితాంశూ! 1

తే. అవధరింపంగఁ గదవయ్య యంబుజాక్ష
ప్రథమపురుషార్థకలనా విరాజిత ప్ర
శస్తకృతి సాధనైక దీక్షాకృతావ
తార మగు కృష్ణచరిత్రప్రకార మింక. 2

—* శ్రీకృష్ణుఁడు ధనుశ్శాలలో నాయుధములం దిఱుచుట *—

చ. తనుఁ గని కామినీమణులు దర్పకశస్త్రనిపీడ్యమాన లై
తనువులు విస్మరింప మదదంతిమనోహరయాన సూచితా
తను వరలీలలన్ దఱిలి దర్పకదర్పకుఁ డైనకృష్ణుఁ డ
త్తనుతరగాత్రులన్ బ్రకటితస్మితరోచులఁ బల్కరించుచున్. 3

తే. బహుళవీరసింహనినాదభరిత మవిర
ళాసిసంఘట్టనాశబ్దితాశ ముగ్ర
టాంకృతిస్ఫీతసంతతజ్యారవమ్ము
నగుధనుశ్శాలఁ జేరంగ నరిగియందు. 4

చ. తనుఁ గొని కృష్ణుఁ డొక్కఘన కార్ముక మియ్యది యుగ్రచాపమా
నని మదిఁ దోఁచుఁ నే దయిన నయ్యది మాకు ధరింప నర్హమాఁ
జనెద నటంచుఁ బోవునెడఁ జప్పునఁ గానలివాఁడు దన్నెది
ర్చినఁ బరిమార్చెఁ గొందఱను జిందఱవందఱఁ జేసెఁ గొందఱన్. 5

మ. ఎదిరింపంగలజెట్టి లేక చని శ్రీకృష్ణుండు కోదండమున్
మదదంతావళి మిక్షుకాండమును సామాన్యంబుగా లీలమై
విదళింపంగలరీతి మీఱఁ గరము న్వే సాచి సంధించి నా
రి దిగన్ లాఁగియు నెక్కుఁ బెట్టి విఱిచెం గ్రీడావినోదంబుగన్. 6

ఉ. దిక్కరికర్ణరంధ్రములు దిమ్మెర వోవఁగ భూనభోంతరం
బాక్కడ నిండి యార్భటిల నుల్కలు వేయి దొలంగినట్లుగా
దిక్కులు పిక్కటిల్లి నప్రతిధ్వను లీన ధనుస్సు వ్రీలుచో
వెక్కసమైన నిస్వనము వీనులు వ్రయ్యలు చేసె నెల్లరన్. 7

క. దారుణలయకాలపయో
దారవ భీషణము దాని నాలించి కతం
బారయుఁ డంచును గంసుఁడు
వీరుల నాదెసకుఁ బనుప వేగమ వారున్. 8

తే. వచ్చియాయుధాగారముఁ జొచ్చి యందు
రామకృష్ణులఁ గాంచి సర్వమ్ము నెఱిఁగి
శలభములు వహ్నిపయి మూఁగు చంద మమర
మూఁక లై యన్నదమ్ముల ముట్టడింప 9

ఉ. అంతకునంతకుం బలుచనై భటవర్గము కూలుచుండఁ గా
లాంతకులార వీరు మన కందఱకున్ మృతి దప్ప దింక భూ
కాంతుని ప్రీతికై పెనఁగఁగా దొరఁకొన్న నటంచు భీతులై
యెంతయుఁ గాందిశీకు లయి రెల్లవ్రజావళి గేలి సేయఁగన్. 10

ఉ. అక్కడఁ జేరినట్టి ప్రజలందఱుఁ జోద్యము లెల్లఁ గాంచియున్
మ్రుక్కడి రాక్షసాధములఁ ద్రుంప జనించినదివ్యు లంచునుం
జుక్కలలోనిచంద్రునటు సుందరవిగ్రహు లౌదు రంచునుం
బెక్కురు పెక్కుభంగిగల గణించిరి బాలుర సద్గుణావళుల్. 11

తే. అంత సూర్యాస్తమయ మైన హరి విభుండు
బండ్లు విడిచినయుద్యానవనముఁ జేర
బంధువులఁ బ్రోత్సహించుచు బయలుదేరి
చీకటులకన్న ముందుగాఁ జేరె నచట. 12

మ. సిరికిం దావల మైనవక్షమును సుస్మేరాననంబున్ మనో
హరలావణ్యము దేహసంపదయు నేత్రానందమై తోఁపఁగాఁ
బురికాంతల్ హరిఁ గోరి చేరెదరు సమ్మోహంబుతో నంచు సుం
దరగోపాంగన లన్న వాక్యములు సార్థం బయ్యె నప్పట్టునన్. 13

మ. మధురాపట్టణమందు యోషితలు శ్రీమంతు న్విలోకించి మ
న్మథసామ్రాజ్యము నేలురాణు లయి యానందింప వాంఛించుటల్
వృథ యై కృష్ణుఁడు తమ్ము నీడి చనుటల్ వీక్షించి లోలో మనో
వ్యథలం బొందిరి నాఁటిరేయి వివిధవ్యాసంగము ల్మానియున్. 14

ఉ. శ్రీరమణీమనోవిభుఁడు చిన్మయగోపకుమారరూపుఁడై
ధారుణి జన్మమంది తనదర్పవిసర్పణ మార్చి వేయఁగాఁ
జేరె నటంచు భోజపతి చిత్తమునం దలపోయలేక దో
స్సారము నమ్మి వ్యర్థ మగు సాహసవిక్రియలాచరించెడున్. 15

—* కంసుఁడు మృత్యుభీతి నొందుట *—

చ. మధురనిశీథిలో హరి కుమారుఁడు బంధులతోడ నాఁటి స
త్కథలు దలంచుచు న్నియతకార్యవిధానము లెల్ల నెమ్మదిన్
మథనముఁ జేయుచున్ విమలమార్గము లెంచుచు నిద్ర వోయె న
మ్మధురవనప్రదేశమున మార్గము దప్పినకంసుఁ డింటిలోన్. 16

ఉ. ఒక్కనియుత్సవంబు మఱియొక్కనిఁ జక్కిలిగింత వెట్టు వే
ఱొక్కని నుక్కడంచు నిఁక నొక్కనిఁ జక్కడఁగించు నట్టు లై
యొక్కవిధానమే నరుల కొక్కొకరూపముతోడఁ దోఁచియుం
జెక్కుల నొత్తుచుండువిధిచేత యథాతవిపీతకూపకా. 17

క. తనవా రందఱు ప్రమగ్నుట
విని కంసుఁడు వికలచిత్తవృత్తుం డౌచుం
ఘనువుచు విఱచిన దిట్టరి
ఘనరూపము గోచరింపఁగా జడియుచునున్, 18

గీ. ఉరిసినవ్రణంబుపైఁ గార ముంచినట్లు
లూఁత సెడి కూలువాని నుఱ్ఱూఁతలూఁచి

నట్లు మతి సెడి వర్తించు నధమనృపున
కార్తిపై నార్తి యయ్యె సైన్యములు చెడుట. 19

మ. మొదలే ముక్కిడి దానిపైఁ బడిసెమున్ మోసెత్తె నన్నట్టు లా
పదపై నాపద వచ్చెనన్నటు ధనుర్భంగంబు గావించిన
ట్టి దురాలోకమహాస్వనాఢ్యలయకంరేకాలరూపంబు ల
న్నిదిశల్ముట్టి ప్రచండమై వెలయుచో నిర్వేద మిట్లేర్పడెన్. 20

గీ. మొదలు నఱికిన వృక్షంబు ప్రిదిలి కూలి
వ్రాలిపోయినరీతి నృపాలు చిత్త
మరుస మది మాసి విగసత యగలింపఁ
బలుకలేక నిశ్చేష్టుఁడై నిలిచె నొకట. 21

గీ. కొంతనఱు కట్టు లుండి యొక్కింత దిటవు
నొంది జీవచ్ఛవంబుగా నొఱిగిపోయి
పగటికలలు గాంచుచుఁ జిత్త మగడు వడఁగ
నులికిపడి లేచుచును దూలి యుస్సురనుచు. 22

సీ. దర్పణాదులయందుఁ దనప్రతిరూపంబు
గప్పించు శీర్షము గానరాదు
తానెటనో యుండఁ దనబింబ మేడనో
లేనితావులయందుఁ గానఁబడును
శుద్ధమై వెల్గు తేజోరూపములు నెల్లఁ
బాగ క్రమ్మి యొకటి రెండుగను దోఁచు
శ్రవణము ల్మూసిన నవగత మాప్రాణ
వాయుశబ్దము వినఁబడకయుండు

తే. తనదుమైఛాయ ఛిద్రమై కనఁబడెడును
జరణములనీడ యెంతు గోచరము కాదు
వృక్షముల బంగరుతళుక్కు దృశ్యమాను
మరణచిహ్నము లిటు దోఁచె నరవరునకు. 23

సీ. ఎచట జూచినఁ గృష్ణుడేఁ పొడగట్టును
బట్టఁబోవును ద్రుళ్ళిపడుచు లేచు

మీసము ల్వడి ద్రిప్పి రోసముతో లేచు
గాసి నంది బిరాన మూసిపోవు
నెలుఁగెత్తి వీరులఁ బిలుచు ఖడ్గము ద్రిప్పు
నంతలో దిగజారి యావులించు
మిడిగుడ్లు ద్రిప్పుచుఁ మిటకరించును బండ్లు
పటపట గొఱుకు భూపతితుఁ దగును

తే. సర్వమయుఁ డైనదేవతాచక్రవర్తి
కృష్ణదేవోత్తముని నిగ్రహింప నెంచి
కంసనరపాలుఁ డాశలఁ గాంచు నంచి
తుండయి పరాక్రమము వీడి తూలుచుండు. 24

ఉ. గాడిద నెక్కి-పోయినటు గాఁగిటఁ బ్రేతముఁ బట్టినట్లు ము
ద్దాడుశవంబుఁ గన్నయటు దానునికాడ్తలు దిన్నరీతి గో
రాడెడుమాడ్కి నూనియఁ దలంటినయట్లు వివస్త్రిడాచుఁ బా
రాడెడుభంగి స్వప్నముల నాతఁడు గాంచె విలోలచిత్తుఁడై. 

గీ. మహిష మెక్కి జపాపుష్పమాలలు మెడఁ
దాల్చి దక్షిణదిశఁ బట్టి తఱలినట్లు
మరణ మాసన్న మైనభూవరుఁడు కలలఁ
గాంచి దెశ్శకునములుగాఁ గలఁత నందె. 25

సీ. చేతులఁ దట్టుచుఁ జలిపినవ్వులు నవ్వు
పరిహాసముల విని భగ్గు రనును
రారా! కంసా యని చీరిన ట్లనిపించి
కరవాలమును దూసి పఱుఁగు వాఱుఁ
డలఁ బట్టి యీడ్చినతలఁపు పైకొనినంత
వలవల నేడ్చుచు వణఁకుచుండు
మల్లురం గజమును మర్దించిన ట్లయి
యుస్సురు మనుచు నిట్టూర్పు విడుచు

తే. భావనాప్రపంచములోనఁ బడిననృపతి
చేపటివిశేషములు నేఁడె స్మృతిపథమున

దోఁచుచో రేయియంత నిద్దురయె లేక
దద్దఱిలుచుండెఁ జపటదద్దమ్మవోలె. 26

ఉ. ఏమి యొనర్ప నౌనొ యిఁక నేక్రియఁజేసిన ముప్పు తప్పునో
కామిత మెట్లు తీరెడునొ కండలు చెండియు దుండగీంద్రనున్
సేమముఁ జెందు టెట్లొ యని చిందఱ వందఱ నంది కుందుచుం
దామసుఁ డైనభోజపతి తాళక యోజన సేయు నొక్కటన్ 27

ఆ. వె. హరికి మధుర మైనయవ్విభావరి కంస
పతికిఁ జావుబ్రదుకుపాట యయ్యె
యెట్లొ రేయి గడచి యినుఁ డుదయాద్రిపై
నెక్కనంతఁ గంసుఁ డెగసిపడుచు 28

—* శ్రీకృష్ణుఁడు కువలయాపీడమును వధించుట *—

సీ. నాఁటిదినము గావింప సామేటికృతులఁ
జేయ నేమించె భృత్యులఁ జెలఁగి వారు
మల్లరంగస్థలంబును మహితగతులఁ
దగునలంకారములఁ జేయఁ దలఁచి రపుడు 29

ఉ. తోరణకేతనంబులను దోరముగా నమరించి బొమ్మలం
దీరిచి పూలమాలికలు దివ్యపటంబులు మేలుకట్లు నిం
పార నమర్చి పీఠములు బారులు దీరిచి చక్కఁజేసి శృం
గారములం బొనర్చి రధికారులు కోరినమల్లరంగమున్. 30

గీ. కువలయాపీడ మనుమత్తకుంజరంబు
మూఁపుపైని బరిస్తోమమును దనర్చి
కరమునకు ముద్గరము నిచ్చి కడఁగి మల్ల
మందిరద్వారమున నిల్పె మావటీఁడు 31

సీ. అర్హులగువారి కెల్ల నాహ్వాన మంపి
పౌరలోకమునకుఁ జాటఁ బంపి తెలిపి
ప్రకటనాపత్రములు బహిరంగపఱచి
బహుళసన్నాహము లొనర్చి భటులు చెలఁగి 32

క. బలరామకృష్ణవిద్వేషు
లలఘులు చాణూరముష్టికాసురులు దగన్
బలితంపుమల్లయుద్ధముఁ
జలిపెదరఁట కాంచ రండు జనము లటంచున్.

గీ. పట్టణారి బంతటను జాటఁబంపినంతఁ
బ్రజలు గుంపులు గుంపులై పఱుఁగువాఱి
మల్లమందిరప్రాంగణమందుఁ జేరు
చుండి రాబాలగోపాల మొక్క-మొగిని 33

ఉ. అంతట బట్టణంబునఁ గలట్టిసమస్తజనంబు మంత్రిసా
మంతపురోహితాశ్రితులు మల్లురు భిల్లురు సేవకాళి శ్రీ
మంతులుఁ బేదలుం గదలి మల్లగృహంబును జేరి రెల్లరున్
వింతగునూత్నవస్త్రములు వేడుకగా ధరియించి యుబ్బుచున్. 34

శా. భేరీభాంకృతు లొక్క-డన్ దుడుము తప్పెట్లొక్క-చోఁ గొమ్ముతా
షా రుంజా లొకదిక్కు-ఁ దూర్యముల ఘోషం బొండుచో నిండఁగా
బూరా వల్లకిమార్దళంబు లొకచోఁ భూవ్యోమము లప్పునా
తీరై నాదము లుల్లసిల్లెఁ బెలుచం దివ్యప్రబోధంబుగన్. 35

ఉ. వీరభటోత్తము ల్గొలువ, విప్రులు వేదముఁ బాడ మాగధుల్
కీరితి సేయ సేవకులు కేతనముం గొన నాతపత్రమున్
జారులు పట్ట భృత్యతతి చామరము ల్విసరంగఁ గామినుల్
హారతు లీయ భోజపతి యందల మెక్కి-యు వచ్చెఁదానటన్. 36

ఉ. వచ్చెడుతేనిఁ గాంచి సభవా రెదు రేఁగి నమస్క-రింపఁగా
మెచ్చి సుఖాసనం బధిగమించెఁ బదంపడి తూర్యరావముల్
హెచ్చుగ మ్రోసె సభ్యులును నెవ్వరిస్థానములందు వారలై
చొచ్చిరి భోగకామినులు నృత్యముగా నటియించి రయ్యెడన్.

గీ. పల్లెటూళ్ళజనంబులు బండ్లపైని
వచ్చి బారులు దీరిరి బ్రాహ్మణనృప
వైశ్యశూద్రవర్ణమ్ములు వారు వారు
వారి కర్హమౌచోటులఁ జేరుకొనిరి. 38

గీ. శలుఁడు చాణూరుఁడు బలతోసలుఁడు బలుఁడు
కూటుఁడును ముష్టికుఁడు తమోఘోరు డనఁగ
మల్లయుద్ధవిశారదు లెల్ల రచట
సరభసంబుగ నుండి రాసనములందు. 39

గీ. మల్లతాళధ్వనులతోడ మలసియాడు
మల్లురున్ జెట్టివా రసమానబలులు
గూడి బలరామ కృష్ణులకొఱకు వేచి
యుండిరచ్చట వేదండతండమట్లు 40

గీ. కంసభూపతి పిలిపింపఁగానె వచ్చి
నందగోపాదు లెల్ల భూనాయకునకుఁ
దాము దెచ్చిన కానుక ల్దక్షిణ లిడి
యర్హ్వాపీఠముల వసించి రాజ్ఞఁ జెంది. 41

వ॥ అయ్యవసరంబున 42

ఉ. పాప మిదన్నియుం దనకుఁ బట్టము గట్టు నటంచు నెంచెఁ గా
నీ పడుపాట్లు దాఁ దెలియనేఁడు కోరి స్వయంబుగా నుహా
కూపము ద్రవ్వుకొంటి నని కొందల మందఁడు పిన్న వాప యీ
కూపమునందు నానిఁ బడఁగూల్చు టెఱుంగఁడు కంసభూపుఁడున్.

క. ఎచ్చటఁ దావసియించెనో
యచ్చటనే కూలిపోవు టరయఁడుమదిలో
హెచ్చుగుమచ్చరమునఁ దల
పుచ్చియు దలపుచ్చనట్టిభూపుం డకటా! 44

క. బలవత్తరమ్మై విధి శృం
ఖలలం బంధించి తెచ్చి కంసనరేంద్రుం
బలి యూపస్తంభముకడ
నిలుపుతెఱం గొప్ప నిలిపె నియత విధముగన్. 45

ఉ. ఈతఁడు మేనమామ వధియించుట పాతక మేమొ యంచు వి
ఖ్యాతబలుఁడు రాముం డనఁగా విని యెట్టిఁడునైన నేమి దు
ర్జాతుఁడు వాఁడు సాధువులఁ జంపఁ బ్రయత్నముఁ జేయువాఁడు నీ
పాతకిఁ జంపుటే మనను భావ్య మనెన్ హరి నవ్వులాటగన్. 46

ఉ. అట్టుల నిర్ధరించి పరమాత్ముఁడు రామునిచేతిఁ జేతితోఁ
బట్టియు, మల్లశాలకు గుభాలున దూరుచునుండ మావటీ
లట్టె యదల్చి వారణము లాపసికూనలపైకిఁ బంపఁగా
గట్టులు వీడి పాఱునదికైవడి నేనుఁగు శేగ నార్చుచున్. 47

శా. కాశ్కోక బిగించి ముంగురులు చక్కం దిద్ది యుద్దీపితా
వేశుండై భుజదండముం జఱచి గబ్బిల్లొత్తుచుం గేసరీ
ప్రాశస్త్యంబుగఁ జెంగునం దుమికి దుర్వారప్రతాపంబుతో
శౌరిసుం డామదకుంభిపోతరము నిర్వీర్యంబు గావింపఁగన్. 48

శా. ఓరీ మావటి పోతరించితివా గర్వోద్రేకివై మమ్ము మా
దారిం బోవఁగనీక నడ్డముగ నీదంతావళం బుంచినా
వా రోగంబు కుదుర్చ జాలెదను సుంతా దాని మళ్లింపుమా!
శూరమ్మన్యుడవై మృతిం గనెడి సంక్షోభంబు నీకేలరా. 49

ఉ. నాగులతోడి కేళి తగునా వెడఁగా మదిక్రొవ్వువీడి నీ
నాగము ద్రోలు మావలకు నాముపలం దలఁ దాల్చుకున్న నీ
భోగిఫణంబు పైకెగయుఁ బోయెద వేనుఁగు పీనుఁగౌను నీ
రోగము మాన్పుపాలుబలు రోగము వేగమ మాను నింతటన్. 50

మ. ఘనగర్జాఘనదంబుచందమున నుల్కాపాత మైనట్టు లీ
శునివాక్యధ్వని మావటీంద్రుడు వినియున్ శోకింపకే హస్తినిన్
ఘనవేగంబునఁ ద్రోలుచుండి రది ఘీంకారంబు లొప్పం బ్రకం
పనసత్వంబునఁ బోయి తుండమున గోపాలుం బ్రకర్షించుచోన్. 51

మ. ధరణీచక్రము క్రిందు మీఁదు వడునో తారాశశాంకార్కఖే
చరబింబంబుల నేలపైఁ బడునొ విశ్వం బింక నీనాటితో
నరుమానో యని మల్లశాలఁ గలబంధుల్ మిత్రశత్రుల్ భయా
తురులై చూడఁగ వచ్చి కాంచిరి మహోత్తుంగాంగ మాతంగమున్

ఉ. బాలుఁ గాంచి పై దుముకు పారము నేర్చిన క్రూరమత్తశుం
డాలము గండు మీఱి వికటంబుగ ఘీంకృతిఁ జేయుచున్ మహా
వాలము ద్రిప్పుచున్ ధరణి బ్రద్దలుగాఁ బదఘట్టనంబులం
గ్రాలుచుఁ దుండ మెత్తుచును గ్రక్కున నొక్కటఁ దాఁకెఁ గృష్ణునిన్.

చ. అకనిమునంబు తాళుకొనుఁ డన్నియుఁ దీరును బాలకృష్ణుపో
తరమును రామభద్రుభుజదర్పము గొల్లలయుల్లసంబులున్
హరి యని వీని మెచ్చు దురితాత్ముల పొంగు నటంచు బిగ్గఁదా
నఱచి నచించె మావటి సమాత్తమృతిక్షణలక్షణంబుగన్. 54

వ. అయ్యవసరంబున

శా. తుండాగ్రంబును నింగివైపులకు నుత్తుంగంబుగా నెత్తి వే
దండం బుగ్రముగా బయల్వెడలి సత్తామాత్రగోపాలమా
ర్తాండుం బట్టఁ దలంచి పైకొనియె నాదంతి న్విలోకించి పో
గండుం డొప్పుగఁ జేతితోఁ జఱచె శంకాహీనుఁడై యంతటన్.

మ. కరిహస్తంబున కందరానటుల శృంగారంబు నట్టిటుల్
పఱుఁగు ల్వాఱలచు దెబ్బ తప్పుకొని శుంభద్వేగసంరంభుఁడై
కరిపాదంబుల లోనఁజొచ్చి హరి శంకాహీనుఁడై నిల్చె న
త్తఱి వేదండము బాలుఁ గానక మహాధ్వానంబు గావించుచున్. 56

మ. చరణవ్రాతనితాంతఘట్టనలు భూచక్రంబునున్ వ్రక్కలిం
ప రుషాభీషణఘీంకృతుల్దశదిశావ్యాప్తంబు గాఁగా భయం
కరనాగంబు రమేశు గుర్తు గనియెన్ ఘ్రాణేంద్రియవ్యాపృతిన్
బరికించెం గర మెత్తి పట్టుకొనఁ బైపైఁబోయె నుగ్రాకృతిన్. 57

మ. అరరే కృష్ణుఁడు దంతికిం దొఱకె నౌనౌ గాదు కాదద్దిరా
పఱుగుల్ దీయుచుఁ దప్పిపోయె హరిదే పై చేయి మేల్మేల్ వృథా
భరమే బాలుఁడు చచ్చె చచ్చె గదతో బాదెం గరీంద్రంబు బా
పురే! దంతిం బొరిపుచ్చె వాఁడని జనమ్ముల్వ్రాతు రవ్వేడుకల్. 58

మ. ఇటు లాబీలముగాఁ బెనంగొనెడు మత్తేభంబుతోఁ బోరుచున్
నిటలాక్షప్రతిమానశూరుఁ డయి గ్లానిం దీరుచుం దాని నో
క్కటు మర్దించుచు లేఁగదూడవలె సింగారంబుగా నప్పుడో
త్కటనాగంబును జుట్టు ముట్టుచు బలోత్కట్యంబునం బొంగుచున్.

ఉ. అంతట శౌరి పామువలె నట్టిటు లూఁగెడు దంతితోఁక వి
క్రాంతి యెలర్పఁ బట్టుకొని త్రాఁచును దార్క్ష్యుఁడు ద్రిప్పినట్లుగా
సంతసమారఁ ద్రిప్పుచును జయ్యనఁ బాఱ విడల్చె నంత దు
ర్దాంతబలంబునం గరి ధరాస్థలిఁ గూలె గిరీంద్రమట్టులన్. 60

గీ. ఇట్టువదైదుబారలదూర మరిగి కూలి
మఱలఁ గువలయాపీడము కరము నెత్తి
యూఁగుచున్ ఘీంకరించుచు నొక్కమొగిని
బాలకృష్ణునిపై కెగఁ బ్రాకవచ్చె. 61

మ. ఇఁక నీ వ్రేటున గొల్లని ల్గణఁచు నంతే యంచుఁ జండాంకుశం
బాకటం గ్రుమ్మచు మావజీఁడు కరి తెంతో బ్రోత్సహింపన్ వెసన్
సకలోర్వీతల ముల్లలాడునటు దిక్చక్రంబు ఘోషింపఁ గ
ర్ణకఠోరంబుగ ఘీంకరించి చనియెన్ నాగంబు వేగంబుగన్. 62

ఉ. చండమయూఖు నూష్మరభసంబునఁ బైకొనవచ్చుమత్తవే
దండము గుండెబెండువడ దండిమగండు గడంగి తద్భుజా
దండము నప్పళించి లయతాండవభండనభీముఁడై వడిం
గండరగండఁడై బిరుసుగా నెదిరించెఁ బ్రచండవేగుఁడై. 63

చ. అవిగదిగో మదేభమున కాహుతి యయ్యెఁ గుమారుఁ డాగవో
యి దిగఁబడెం గజంబు భళిరే హరి గెల్చెను గండ్లు విప్పి యు
న్నను గనవోయి పాపను సమాధిని గట్టుఁడు చాలుఁ జాలు నీ
మదకరిపాటు చూచుకొనుమా యని చూపఱు పల్కుచుండఁగన్

చ. కిలకిలనవ్వు నివ్వటిలెఁ గృష్ణునిపక్షమునందు గోలన
వ్వులు చెలరేగెఁ దీవ్రగ భూవరుఁ జేరినవారిలోన వి
చ్చలవిడి హస్తితో హరి ప్రచండముగాఁ దులకించునప్డు గ
బ్బలి బిగియించు నవ్వు ముడివెట్టు బొమల్ హరి యప్పు డప్పుడున్

గీ. పక్షపాతముగ రాజభటులు పలుకఁ
గటకటంబడి కృష్ణపక్షంబువారు
మిడుకుచుండగ యుద్ధము మించఁదొడఁగె
నందఱకు వేడ్క పాతఱ లాడఁ గడఁగె. 66

మ. ప్రళయోగ్రానలకీలలో యనఁగ నేత్రద్వంద్వ మొప్పార ను
జ్జ్వల మాతేజునఁ బైకి దూఁకుగజకుంభద్వేగసంరంభముం
జలజాతాక్షుఁ డెఱింగి యాకొనినపంచాస్యంబు వేదండముం
బలెఁ దుండంబును బట్టి లాఁగి విడచెన్ బ్రహ్మాండభీమంబుగన్. 67

గీ. మూగమునఁ బోయి పడి మదవారణంబు
కుంభగతమదధారలు కుఱియుచుండ
సంధు లన్నియు విడిపోయి సడలుచుండ
లేవలేక యెట్టెట్టులో లేచి నిలిచి. 68

గీ. మావటీనియంకుశఘాటి మాటుపాటు
వలనఁ గ్రమ్మఱఁ జెలరేగి వచ్చుదాని
హస్తతలమున హరి కొట్టినంతఁ దూలి
బేల యై కూలెఁ గువలయాపీడ మవని. 69

చ. విలవిలఁ దన్నుకొంచు, బృథివీగగనంబులు ముట్ట నార్చుచున్
వెలకిల వ్రాలి తుండమును వీసర నేలకుఁ గొట్టి త్రోఁక యె
త్తిలి పడిపోవుచుండఁ గడుదీర్ఘశరీరము సాచి నీల్గి య
స్రులు దొఱఁగం గతాసు వగుచున్ గరి ధాత్రికిఁ బాసె నంతటన్.

గీ. మత్తవేదండ మొఱిగినఁ దత్తరమున
మావటీంద్రు పర్వెత్త రామప్రభుండు
గాంచి వెన్నంటి త్రుటిలోనఁ గాలయముని
యాలయముఁ జూడ నంపె నాభీలుఁ డగుచు. 71

గీ. వెఱ్ఱిగొల్లబాలురు గడువింత నంది
పల్లెలం బైకి విసరుచు వచ్చివచ్చి
కృష్ణుఁ గౌఁగిటఁ గదియించి ప్రేమ గదురఁ
బెక్కురీతుల మోదముం బెంచి రపుడు. 72

చ. అది వెఱబొమ్మ యేమొ కరినాయసవిగ్రహ మేమొ గోడపై
నొదవిన పెద్దచిత్రపటమో యని చూపఱు లెంచ నంగము
ల్గదలక ఱెప్పలార్పకయు గన్నులుమూయక యేకదృష్టితో
మది చెడి నిల్చియుండె నట మానవనాథుఁడు కంసుఁ డత్తఱిన్. 73

క. మదవారణంబు కూలినఁ
బదపడి రాముఁడును గోపబాలురు కృష్ణున్
ముదమున ముద్దిడి కౌఁగిట
నదుముచు మురిసెములు దీర్చి రా రంగమునన్. 74

చ. కరిమద మంగమందు దిగఁగాఱఁగఁ స్వేదకణంబు లెల్ల సుం
దరవదనారవిందమునఁ దాండవ మాడఁగ నేన్గునెత్తురు
న్మరకలు గానుపింప యదునాథుఁడు వాల్చుచు హస్తిదంతము
న్వరభుజపీఠిఁ దాల్చి వ్రజబాలకులన్ జత గూడి సొంపుగన్. 75

సీ. దట్టీలు గట్టిన జెట్టీలకెల్లను
గుండెలో గాలమై గండుమీఱె
నుష్టితో చాణూరముష్టికాసురులకుఁ
గాలకంఠకాలు కరణిఁదోఁచె
సామాన్యజనులకు సామ్రాట్టువలె నుండె
గోపకులకు బంధుగుఁ దనర్చె
మగువల కపరమన్మథుఁడుగాఁ గన్పించె
జెడురాజులకు శిక్షకుఁడుగ దోఁచెఁ

తే. దల్లిదండ్రుల కందాలతనయునట్లు
గనఁబడియె మిత్రులకు స్నేహితుఁడుగఁ దోఁచెఁ
గంసభూనాయకునిపాడుకనుల కపుడు
మృత్యుదేవతగాఁ గానుపించె శౌరి. 76

గీ. ముక్తసంగు లౌసంయమిముఖ్యులకును
విమలపరతత్త్వ మై వృష్ణివీరవరుల
కపరదైవము నై ప్రజ లందఱకును
బాలనాయకుఁ డై తోఁచె బాలకుండు.

మ. ఎవ రేరూపము నెంతురో యటులె కన్పించెం గృపామూర్తి య
ధ్యవసాయంబునఁ గాచె దృక్పథము సవ్యార్థంబు లూహించు శ్రీ
ధవుఁడున్ రాముఁడు మల్లమంటపమునం దర్పంబుతో నిల్వ న
ట్టువు లై దోఁచిరి రమ్యభూషణపటాటోపంబు దీపింపఁగన్. 77

మ. భళిరే! నందకిశోరమా యనుచుఁ దద్భక్తు ల్ప్రశంసింప ము
ద్దులతండ్రీ యని కన్నవారు పిలువం దోర్విక్రమా యంచు శూ
రులు మన్నింప శశాంకమోహనకళారూపోజ్జ్వలా యంచుఁ జె
ల్వలు భూషింప విలాసరూపధరుఁ డై భాసిల్లె గోపాలుఁడున్. 78

మ. సింకిం గన్నులవిందుసేయునల సాక్షివ్యక్త గోపాలుఁ డి
ద్దిర! వేదండము దండపాణి వినయాదేశంబునం బోలు రూ
పరఁ జేసెం గనువింత గాఁగఁ బుటము ల్బంధించి సంధించి కు
రుకరమై పోయెను వానిచేతి కది దిక్కున్ ద్రొక్కు లేనట్లుగన్.

ఉ. ఒక్కర యిర్వురా పలువు రొక్కటియై యెదిరించి వానిచేఁ
ద్రుక్కినపేలుగా నలఁగి కూలిరి తక్కినవారు చక్కగాఁ
బిక్కబలంబుఁ జూపి రిది విన్నది మున్నను విన్న నే కదా!
చెక్కలు ముక్క లై ధనువుఁ జీలినయప్పుడు వీనిచెయ్యమున్. 81

గీ. కర్ణధారియై భవవార్ధి గడపుచుండు
సూత్రధారి యై లోకాలు జోలపాడు
వేత్రధారి యై దుష్టులగోత్ర మార్చు
ప్రభువు కాని యితఁడు గోపవిభుఁడు కాఁడు. 82

గీ. ధరణిభారంబు దీర్పగా ధాతవలనఁ
గోరఁబడి సురమాన్యుఁ డై కుతలమందు
బాలగోపాలమూర్తిరూపమున నుద్భ
వించియున్నట్టి కేవలవిష్ణు వితఁడు. 83

గీ. వీని నెదిరించి యెవఁడు జీవింపఁగలుగుఁ
గొండలం జెండువానికి బండపాయ
నంగ నెంత దానిని బట్టి భంగపఱచు
టనఁగ నది యెంత తృణవిధ మాను గాక. 84

మ. ఒకకేలం బయికెత్తి పుట్టగొడుగ ట్లుర్వీధరం బాటవే
డుకగాఁ దాలిచి యేడహర్నిశలు కీడుం బాపి గోగోపర
క్షకుఁ డై యొప్పిన బాలయోధునకు లెక్కా పత్రమా యిట్టిను
న్మత్తకరీంద్రంబుచు ద్రుంచుటన్న కడు వింతల్ వీని లీలల్ భళీ. 85

గీ. అది పరోక్షమునం దయ్యె నిది సమక్ష
మందొదవెఁ జూడకుంట సామాన్య మయ్యెఁ
జూచియుండుట నిది గొప్పచోద్య మయ్యె
నట్టిదే భేద మగు రెండునంతరముల. 86

ఉ. ఎన్నఁటిమాటలో పలుక నేఁటికి నిన్నటి కుబ్జమారుపునుం
గన్నులఁ గాంచుమా యసముగాఁ జరణముల నొక్కి గడ్డముం
దిన్నగ బట్టి యెత్తి తగ దిద్ది త్రివక్రను రంభఁ జేయఁడా?
యెన్నని చెప్పవచ్చుఁ బరమేశ్వరులీల లనూహ్యముల్ సుమీ! 87

ఉ. ఇన్నియు నింక నిన్న మఱి యీతలవెండ్రుకలన్ని యింక నె
న్నెన్నొ నిదర్శనంబుల గ్రహించియుఁ గన్నులఁ జూచి యెందుకో
మన్ననఁ జేయఁబోఁడు రణముల్లుర నల్లురఁ భూమిభర్తనుం
గన్నులు పోయెనో చెవులక్రంతలు పూడెనో బుద్ధి మాడెనో!

గీ. అనుచుఁ గొందఱు జనులు నెమ్మనములందు
నపర విష్ణ్వవతారుఁ డీయర్భకుఁడని
తలఁచుచుండిరి కొందఱు దంభ మనుచుఁ
దప్పఁ దలఁచి నిందించిరి యొప్పుకొనక. 89

ఆ. వె. జనులు లక్ష లాది శాలలోఁ జేరిరి
మనిసికొక్కనాల్క; మంచియొ చెడొ
యనుట నైజగుణము మనసు వోయినయటు
పలుకుచుండి రెల్ల వార లచట 90

ఉ. అమ్మకచెల్ల యిట్లగునె? యంత్రమొ తంత్రమొ మంత్రమో మఱే
కుమ్మొ యదేదొ వీనికడ గుప్తముగా రహియించుఁ గాని వోఁ
గొమ్ములతోడఁ గొండలను గ్రుమ్మి పెకల్చెడు దంతి యేడ యీ
దిమ్మరిచేతికిం దొఱకి త్రెళ్లుట యేడ విచిత్ర మాఁగదా! 91

ఆ. వె. వేవు రెత్తలేనివిల్లును డాకేల
నెత్తి నారి లాగి యిందఱమును
గాంచుచుండ విఱిచెఁ గానైనపనియొకో
బాలగోపకునకుఁ బోటి యౌనె? 92

ఉ. తీరము మీఱి పాఱెడునదీజలమట్టు లనంతసంఖ్యమైఁ
చేరినపౌరజానపదశేఖరు లెల్లరు వారివారి కే
తీరునఁ దోఁచు నట్లు వినుతించుచు దూఱుచు నౌను గాదు నా
నారవివాదము లెలిపి సందడిఁ జేసిరి వుల శాలలోన్. 93

ఉ. ఎవ్వరి నాఁగవచ్చు బకులేమని చెప్పఁగవచ్చు నవ్వులుం
జివ్వలు స్తోత్రపాఠములు చిత్రవిసర్పము లెన్నొ కోయిలల్
గువ్వలు చేరి రమ్యవనిఁ గూసినరీతి ననేకభంగులన్
నివ్వటిలెం బ్రతిధ్వనులు నిండునరాటవియం దఖండమై 94

ఉ. యాదవవంశవర్ధనులు నచ్యుతవీర్యు లటంచు క్షత్రియు
ల్మోదము నొంద ఖేదమున మూర్ఖజనంబులు కుందఁగా ఘను
ల్వేదవినోదు లైనబలవిక్రము లొప్పిరి మల్లశాలలో
ఖేదము గొంత దీరి రణకేళికి నిల్చినజోదు లంతటన్. 95

గీ. ఎంతపెద్ద దైనను బల మెట్టి దైన
పశువు పశువేకదా మహీపాల బుద్ధి
బలము గలమానవు నెదిర్చి బ్రదుకగలదె
కువలయాపీడవధ మేమి గొప్ప కాదు 96

క. మీాటిజగంబులఁ బిడికిటి
పోటున మర్దింపఁజాలుపూర్ణబలాఢ్యుల్
పోటరులు మల్లు రుండఁగ
నేఁటికి వెత జెంద ధారుణీశ్వర నీకున్. 97

గీ. మల్లయుద్ధంబులో నోర్చి మమ్ము గెలిచి
నప్పుడుగదా భయంపడనౌను మీారు
మీాదునుప్పుఁ బులుసు జిన్న మేము గలుగ
నింతలో నింతవంత మీాకేల దేవ! 98

శా. మాతోఁ బోరుట లన్న మాట లవియా మాతంగముం జెల్చినా
రీతు ల్సెల్లవు మల్లయుద్ధవిషయోద్రేకంబులే యన్య వీ
ప్రేత ల్గాని యెఱుంగఁజాల రిఁక గాంభీర్యంబు వాటింపుఁడీ
కూఁత ల్నేర్చినకొంటెవారిగతి యేకోశంబులం జేయనో! 99

క. అని పరిపరివిధముల నం
తనములు తెగఁబలికిపలికి ధాత్రీశ్వరునె
మ్మనమొకదారికిఁ దెచ్చియు
ననుమతి గొని ముష్టియుద్ధ మాడెడుపేర్మిన్. 100

క. చాణూరుఁడు ముష్టికుఁడును
రాణువులకు ముందు నిల్చి రభసముతోడన్
వేణువినోదుని రాముని
నేణములను హరి కుదించునేపునఁ గనుచున్. 101

శా. ఒకీ వీరక్షపాతమా నిలుము గర్వోద్రేకి పై నాగముం
బాలింజిమ్ముట కాదు మల్లురము మాపై వచ్చి నీభూరిదో
స్సారంబు న్వెలిగింపు మట్లయినచోఁ జండాగ్ని విస్ఫారతే
జోరూపంబుల హెచ్చుతగ్గులవియున్ శుభ్రంబుగాగన్పడున్. 102

శా. రారా కృష్ణుఁడ రార రాముఁడ యిఁకన్ రారాపు లేలంచుఁ జా
ణూరాభిఖ్యుఁడు ముష్టికాభిధుఁడు మిన్ను ల్పట్టు వాక్చారులై
చేరం బిల్చుచుఁ బైకిఁ బై కెగయుచుం జేరంగరాఁ జూచి వి
స్తారోదంచితవిక్రమక్రముఁడు శ్రీదాముండు తా నిట్లనెన్. 103

ఉ. అంగుఁడు లేనిపోనియడియాసలమోసులు లేవదీసినం
బాగులె బాలురం గదిసి భండనపండితు లెందునున్ రణో
ద్యోగము నెంతురా యదిగుణోన్నతకృత్యమ కానివాని కీ
వాగుట లేల పైపయికి వచ్చి కలంచుట లేల దుర్మతుల్ 104

శా. పోపో మీనరవాలునే యడుగుఁ డీబుద్ధు ల్ప్రశంసార్హమా
నో నీచంబా నచించు నాతఁడు వృథా నోరట్లు పో నిచ్చినం
గానౌకార్యము కాన యాను ద్వరలోఁ గంసుండునుం గ్రుంగు నో
చాణూరా సరివార లౌదు లటరా చర్చింప నీబాలకుల్. 105

చ. కలరుకదా వివేకగుణగణ్యులు వీరిని బ్రశ్న చేసినం
దెలియు సమస్తధర్మములు తెల్లముగా నని కృష్ణుఁ డాడుచో
గలకల నవ్వి ముష్టికుఁడు కర్మఠుఁడా కడుఁగొంటె వాదు వే
ఫల మెటు లైన యోజనలు బాగుగఁ జేసెద వాసుగక్రియన్.

వ. అనినఁ జాణూరుం డిట్లనియె.

చ. ఇది యొకపెద్దయెత్తు మము నిందఱుఁ గన్నులు మూసి మెల్లగాఁ
గదనతలంబు వీడి సరిగాఁ బఱువెత్తెదనొండదారి నీ

చదువులు చాలు యుక్తులకు స్థానము లేదిట పాఱిపోయినన్
వదలము పట్టి పోరెదము వారక నిల్వుమురోరి మందుఁడా. 107

ఉ. అంతటఁ గృష్ణదేవుఁడు సభాంతరమందలి పండితావళిన్
వింతగఁ జూచి కాలవిధివృత్తములం దలపోసి శుష్కదు
ర్దాంతులు మల్లురం చెఱఁగి తప్పుమి నెంచియు బాహుయుద్ధమం
దెంతయునేర్పు కల్గియును నిట్లనె భూరివిలాసవైఖరిన్. 108

ఉ. బాలుర మేము గొప్పబలవంతులు మల్లురు వీరు వీరితో
నాలము సేయుటగి యుక్తము మా సరివారితోడుతం
బోలును గాని యియ్యది యపూర్వవిధానము గాకయున్న ధీ
శాలురు మీరు చెల్వుఁ డవిచారత గూడ దధర్మ మంచునున్. 109

ఉ. పౌరులు చిన్నమాపు గనుపల్లెలవారము మేము ఘోరకాం
తారములందు మాయునికి తల్లులుపోలెఁ దలంచు గోవు లా
ధారము మాకు నాగరకతావిధు లెన్నఁ డెఱుంగ మిట్టిమా
తో రణమా మహాత్ములకు దూరముగాఁ దలపోయుఁ డెల్లరున్.

ఉ. ఆవులఁ గాచుటో పెనఁగులాడుటొ పాలును వెన్న మీఁగడల్
ద్రావుటొ బాలు రందఱును తక్కుచుఁ దాఱుచు నాటలాడుటో
కోవిదులార చావుబ్రతుకుల్ విధియించెదు గీటురాయి యు
ద్ధావనిఁ జొచ్చుటన్న నిది ధర్మమొ కాదొ వచింపుఁ డిందఱున్.

చ. సభఁ గలవార లందఱును స్పష్టముగా వచియింపఁ జాలియుం
బ్రభునకు నోడి వాకొనక ప్రక్కలఁ జూచుచు నావులించుచున్
సభమున దృష్టి నిల్పి వదనంబుల వాంచుచు నుండఁ జూచి శ్రీ
విభుఁడు మనంబున న్నగుచు వెక్కస మాడెను బాహిరంబుగన్.

క. రాజసభఁ యౌనఁటే యిది రాసభసభ ?
రంగసభయో రసాభాసరభససభయొ ?
యుభయము శుభము నెఱుంగనియర్భకులము
ప్రశ్న సేతుము ధర్మముఁ బలుకఁడొకఁడు 113

గీ. ఔను లే! తప్పు మీ దెటు లౌను రాజ
దర్ప మిది "యథా రాజా తథా ప్రజా" య
నెడు ఛలోక్తి బరాబరి నెగడె నిందుఁ
గంసవిభునకు నోడి పల్కరు తెగించి. 114

గీ. ఇంతమల్లోఁ బెద్దవా రెంద ఱుంకురో క
దా! వచ్చియిటుల్ నాగోరు జారివచ్చెఁ
గానిమాట క్షమింపుఁడు కదుపుకుదుపు
లగ్నికిన్ వచ్చులోహము నంటుకతన. 115

వ. అని గంభీరముగా వచించుహరివాక్యార్థంబు లాలించి యే
మనకే మౌనము దాల్చి రెల్లరును మల్లాచార్యుఁ డౌముష్టికుం
డు నితాంతాగ్రహాభీష్మనేత్రుఁ డయి యాటోపంబుగా లేచి యి
ట్లనె మీసందియ మేను దీర్చెద నవేలా యింత వాచాలతల్. 116

ఉ. మీరు పరాక్రమాంచితులు మిక్కిలినేర్పు గలారు భూరిదో
స్సారము గల్గి మ మ్మెదిరి సంగరరంగమునందు వీందుగా
బోరెదువీరు లంచు విని భూపతి మిమ్ముల మెచ్చి చూడఁగాఁ
గోరియె పిల్వనంపె రణకోవిదులం బిలిపించె నమ్ములన్. 117

గీ. మనుజవిభుఁడు సకలభూతమయుఁడు గాన
నతని పనుపుఁ జేయుట భూతతతికిఁ దృప్తి
దానిచే సౌఖ్యముల నందు మానవుండు
గాన రాజాజ్ఞఁ దీర్పఁగాఁ బూనవలయు. 118

గీ. అనుదినము మీరలానందమున వనాంత
రమున గోవత్సపాలురై రమ్యకేళిఁ
దేలుచున్ మల్లయుద్ధంపులీల లెఱింగి
యాడుచుందురుగద భయ మంద నేల? 119

గీ. బాలుఁడవొ కాలుఁడవొ నీవు తేలఁబోదు
రెండువేలయేనుంగులదండిబలము
గలుగు కువలయాపీడము గెలిచినావు
నీవు పసివాఁడ వౌదువా నెటుకాఁడ! 102

గీ. బలుఁడు నీయంతవాఁ డని పలుకవచ్చు
మావటీంద్ర వధించెడుశేవ తెలిపెఁ
బిన్న పెద్దలభేద మే మున్న దిచట
మాకు సరిదీటువారె సమంచితముగ. 121

గీ. నేనుబలరామునితో పోర నిశ్చయింతు
నిన్నుఁ జాణూరు డెదిరించు; సన్నుతాంగ
మల్లయుద్ధ మొనర్తము మనుజపతియు
సభ్యు లందఱు జూతురుఁ సరగననిన. 122

శా. జెట్టీపట్టులు పట్టఁ బూనుకొని రాజీవాక్షుఁడున్ రాముఁడున్
దట్టీలన్ సవరించి కట్టుకొనియున్ దట్టంబుగా, జాళువా
పట్టీకోక బిగించి నిల్చి భుజమాస్ఫాలించుచున్ ధీరతన్
జెట్టీ రా యిఁకఁ జూచుకొంద మని సాక్షేపంబుగాఁ బిల్చుచున్

ఆ.వె. భుజము లప్పళించి పొందుగాఁ దొడలపైఁ
జఱచి కరము లెత్తి సాచి దిగిచి
బాలగజములట్లు బాలురు చెలరేగి
యుద్ధయత్నములకు సిద్ధులైరి.

తే.గీ. ఆఱితేఱినవారు చాణూర ముఖులు
బాలవీరులు తెలియనిగోల లౌర!
కోరికోరి యుద్ధముఁ జేయువారువారు
వారిబలవంతమునఁ జేయువారు వీరు. 125

శా. లంగోటీలు బిగించి కట్టుకొని సోల్లాసంబుగా దానిపై
జెంగుల్ హొంగుగఁ బొంగి జోడు లిడ గాసెనక్కజ బంధించియున్
రంగారన్ హరిచందనం బొడలిపై రాణింప శృంగారముల్
సాంగోపాంగముగా నొనర్చికొని రాఁ జాగెన్ రణం బంతటన్ 126

ఉ. కండలు మెండుగా బలిసి కంఠమునందును ఎత్తుమందు దో
ర్దండములందు మెండుకొని దట్టముగా మెలిక ల్వహించు-చో
గండజఱగండ లై విమతకాండముగుండెలు బెండుఁ జేయును
ద్దండవిచండదర్పమునఁ దాండవమాడుచునుండి రిర్వురున్. 127

ఉ. కొండలువోలెఁ గన్పడుచు గుండెలుదీసినబంటులై యయః
పిండములట్లు వారెసఁగ బిత్తరిచూపులతత్తరంబుతోఁ
దండము లేనిబాలకరిదోర్బలశక్తిని మీఱుబాలురై
ఖండనరంగమందు గనుపట్టిరి చూపఱ కెల్ల వింతగన్. 128

క. చాణూరునితో గృష్ణుఁడు
బాణముతో శశకమట్లు పైకొనునప్పుడే
యేణము సింగముతో వలె
రాణన్ ముష్టికు నెదిర్చి రాముఁడు నిలిచెన్ 129

తే. అల్లనేరేడుపండును మెల్లఁగ దిను
మర్కటమ్మువోలె చాణూరమల్లుడు హరి
వెలగపండును దిగమ్రింగుకలభమట్లు
ముష్టికుడు రామభద్రుని ముట్టిరపుడు. 130

తే. గంధసింధురమదకుంభబంధురపిశి
తాశనముఁ గోరి రేగి యావేశ మొప్పి
దుముకుచుండెడుకొదమసింగములువోలె
రామకృష్ణులు పొదివి రారక్కసులను. 131

తే. చూచువారెల్లరును గడుఁజోద్య మంద
నొకరి నొక్కరుఁ బొడుపుచు నొడిసిపట్టి
కరముఁ గరమునఁ గదియుచుఁ గాలుఁగాలు
నొఱయుచుం గూడి యొండొరు లొర్వరసి రపుడు. 132

తే. శ్రీచాణూర రామముష్టికులు రేగి
యొకరి నొక్కరు గబ్బిళ్ల నొత్తి జాను
శిరవక్షఃప్రహారము ల్సేసికొనుచు
నుక్కరోషంబునం బోరుచుండి రపుడు. 133

—* బలరామకృష్ణులచే ముష్టికచాణూరులు చచ్చుట *—

తే. ఒండొరులు పరస్పరవిజయోత్సుకమున
పాదములు పాదము నొత్తి పాఱఁజిమ్మి
జానువులలోన జానువు లూన్పనగజేసి
త్రోయుచున్ ద్రోయుచున్ మహాక్రోధ లగుచు. 134

చ. కరములఁ బట్టి యెత్తి కినుకన్ గడుమించి యనంతవేగులై
గిరగిరఁ ద్రిప్పికొట్టుచును గ్రిందికి లాగుచుఁ బట్టుఁ బట్టుచున్
శిరములతోడఁ గ్రుమ్ముకొని చేతులఁ జేతులు మట్టుచుం బర
స్పరవిజయాభిలాషుల లయి బంధము లన్నియుఁ జూపి రేపునన్.

ఉ. ఇటు లుద్దండ తరప్రఘాతములచే నెమ్ముల్ విశీర్ణంబుగాఁ
బటుదర్పంబున సంఘులం బొడుచుచుం బాలించి తూలించి యు
త్కటముష్టిప్రహతుల్ భరమ్ముగ బలోత్కర్షం జెలంగించుచున్
నిటలాక్షోపమవిక్రమోద్ధతులు నై నేమంబుగాఁ బోరుచున్. 186

చ. అచ్చటఁ జేరి యున్నప్రజలందఱు నివ్వెరపోయి చూడఁగా
నచ్చపులోహవిగ్రహము లౌ నను మల్లురతోడఁ బోరుచున్
ముచ్చెమట ల్ముఖంబుపయి ముత్తెములట్లు దొఱంగ నూర్చుచుం
గచ్చుగఁ గాలు సాచి కడఁక న్విడకే సరి పోరి రర్భకుల్ 137

ఉ. మదవేదండము తుండ మెత్తి చెఱకున్ మట్టాడునారీతి దు
ర్మదులై మల్లురు గోపబాలయుగమున్ మర్దింప నుంకించుచోఁ
బదము ల్ద్రొక్కుచు దెబ్బ దప్పుకొని సంభాళించుచున్ సింగపుం
గొదమల్వోలె హఠాత్తుగా నెగసి చొక్కు ల్దీర్తు రబ్బాలురున్.

మ. సరిగాఁ బోరెడు రామకృష్ణులను విస్పష్టంబుగా జూచియుం
దరుణుల్ మిక్కిలి కుంది కృష్ణునెడల న్వారెంచు ప్రేమంబు ము
మ్మరమై సమ్మతి వమ్ముఁ జేయునెడ భీమప్రౌఢతిం బోరు మ
ల్లురతోనా పసివారు యుద్ధముల కల్లోలంబు వాటించుటల్. 139

చ. ఇది సరి కాదు వీరలకు నెక్కడి కెక్కడిపోటి యద్దిరా!
మదగజ మెడ సూక్ష్మ మగుమంజులనీరజ మేడ యయ్యయో!
తుది మొద లేమి కన్పడదు తోరపుబాలకు లెట్లు లౌదురో
యదయుఁడు కంసభూపు డిటు లౌనె తులారణ మేర్పరింపఁగన్.

ఉ. అమ్మక చెల్ల యెంతపని యయ్యెను ధర్మము కూలిపోయెనా
యిమ్మహి న్యాయమూర్తు లొక రేనియుఁ గన్పడరా దురాసలే
క్రమ్మి ప్రచండతాండవవికాశముఁ జెందున యెందు కింక వా
రెమ్మలు వేనవేలిచటఁ జెడ్డయు మంచియు నేర్పరింపకే. 141

మ. అదిగో ఘాతక చక్రవర్తి పౌడ ప్రాహస్తంబుఁ బైఁ జాఁచి దు
ర్మదుఁడై కృష్ణుని గొట్టఁబోవ భళిరే మాన్యాబ్ధియే గెల్చె, నే
మది చాణూరుఁడు కాలితో గదుము నిర్మర్యాదుఁడై శ్రీహరీ
యిది యేపాపమురా కుమారుఁకును నల్లే చేయునా చెచ్చెఁ అన్.

చ. శివశివ యెట్టి నీచమగుచేతలు ఱొమ్ములపైని దన్నునా
కువలయనేత్రు నాతులువ గొప్పఁట గొప్ప భళీభళీ ఖలున్
దవుడలు వాచిపోవ హరి తన్నెను దంతము లూడె నేమిటో
యవగత మెట్లుఁ గాదు నిది యంతయు నాటకమట్లు దోఁచెడున్.

మ. కలలోఁ జిత్రములట్లు గన్పడును జంఘాలుండు చాణూరుఁడే
యిలపైఁ గూలెను జాపచుట్టగ విజృంభించెంజుమీ శౌరి లేఁ
గల కాఁబోతులు జోతఁ జేసె నయయో కాల్సేతులం దన్నె న
బలరామున్ ఖలముష్టికాసురుఁ డహో! బాలుండునుం దన్నెడన్

ఉ. నందకుమారుదివ్యవదనంబును గాంచుఁడు ఘర్మబిందువు
ల్చిందుచు నీటియందు వికసించినసుందరజంకపుష్పము
ట్లందముఁ జిందుచుండు నదిరా బలరామునిమోమునకందియుం
బొందగునవ్యకోకనదపుష్పమువోలె రహించు నెట్టనె. 145

మ. మనుజాకారము నంది సర్వులకు సామాన్యంబుగాఁ దోఁచుచున్
వనమం దావులఁ గాచుచుం జెలులతో వాత్సల్యముం దీరుచున్
మనకుం గన్పఁడు బాలకృష్ణుఁడు జగన్మాన్యుండు లక్ష్మీనికే
తనుఁ డాద్యుండు పురాణపూరుషుఁడు రుద్రాదిత్యసంసేవ్యుఁడే.

మ. మురళీగాన సుధాప్రసార మమరన్ ముద్దార బృందావనాం
తరమం దాతఁడు సంచరించి వ్రజకాంతాస్వాంత రమ్యప్రసూ
న రసాస్వాదనముం బొనర్పకిటు కృష్ణస్వామి నేఁ డయ్యయో
పురమం దేఁటికిఁ జేరె మల్లురకు నీపోరాట మింకెందుకో. 14

చం. ప్రతిపనిఁ జేయునప్పుడును పావనకృష్ణునిదివ్యనామమే
శ్రుతముగఁ బాడుచుండెదరు చూపులయందలిపాపలందు సం
తతమును మూర్తిమంత మయి వ్యగనభాగ్యము నొందుచుందుర
య్యతివల కట్టిదృశ్య మహహా! భరియింపను శక్యమౌనొకో! 148

చం. అహరహ మిమ్మహామహుని నాత్మలలో నెలకొల్పి భర్తగా
మహితునిగా గురూత్తముగ మన్ననఁ జేసెదుగోపభామ లీ
ప్రహరణసంకులం బయిన పాదురణంబును జూడ నెంతగా
స్పృహ చెడిపోదురో విసుగుఁ జెందెదరో తలక్రిందు లౌదురో!

మ. అని యారీతిని గామినీమణులు సవ్యాపసవ్యదివ్యార్థము
ల్గొనుచుం బేర్మి దలంచి పల్కుచు మనోగోళంబులం జెందుభా
వన పర్యాయముగా జయాపజయసంభావ్యంబు వర్ణించుచున్
మనములోఁ బొంగుచుఁ గ్రుంగుచుం గనిరివింతల్ ద్వంద్వభావోన్నతుల్.

ఉ. కొందఱు కామినీమణులు కొందలపాటునఁ బోయి దేవకీ
సుందరితో వచించిన నుసూ ఎని యూర్చుచుఁ గన్నమాట నా
కుం దగెఁ గాని నేటివఱకుం గనియుండను వారి నిప్పుడీ
చందము విందు నందును విచారము ఘోరముగాఁ గలంగెడిన్ 151

మ. కరతాళంబులు మ్రోయువారు నుతులం గావించువా రందఱు
విరులం జల్లెడువారు వేకనులతో వీక్షించువా రద్దిరా!
హరి కృష్ణుండె జయించెఁ గాంచుఁ డనువా రానందు లౌవారు నై
పురుషుల్ గొందఱు భావరాగములకొప్పు ల్చూపి రాశాలలోన్. 152

గీ. ఇటు తెఱంగులఁ బురుషులు పోరయుచుండఁ
గామినీలోక మొకప్రక్కనె యుండు
రిన్ని భావము లెత్తఁగినవన్నె కాఁడు
తలఁచె దుష్టచాణూరుని దర్ప మార్ప. 153

మ. హరి చాణూరుని డాసి పట్టుకొని వజ్రాఘాతసంవిష్ట ని
ష్ఠురముష్టి ప్రహతిన్ వడిం బొడువ రక్తోద్వమనవక్షస్స్థలాం
తరమారం బొకముద్ద యయ్యె నెముకల్చూర్ణంబులై సంధులున్
విఱిగెన్ నేల కొఱఁగె వాఁడు మహోత్కోపజంబు చందంబుగన్ 154

ఉ. పదఁపడి లేచి వేగవలెఁ బాఱుము నూరుచు శౌరిఁ జేరి సో
న్మద మగువారణంబునటు మహోద్ధతి వక్షమునందు గబ్బిటం
గుదిమి కుదించుచుండ హరి కోపముతోఁ బద మెత్తి తన్న నం
గద భరియింపలేక వడిగాఁ బడె నాతఁడు కొండకైవడిన్ 155

గీ. బోరగిలఁబడి మఱి లేవఁబోయి మగుడి
తూలిపడు నేలనూని గగ్గోలుపడును
ప్రేవులుం గండలున్నల్ల పెకలి వచ్చి
నోర వెడలంగ మడిసెఁ జాణూరుఁ డపుడు. 156

గీ. బలుఁడు ముష్టికునక్షము గ్రయ్యువట్టి
చందమున ముష్టిఘాతము సరఁగఁ జేసి
కాలిఁ గోఁ దన్ని నేలపైఁ గూలఁ జేయఁ
బడియు మఱి లేచి యాతఁడు కడఁగి వచ్చి. 157

ఉ. హుమ్మని హుంకరించుచు మహోద్ధతి మించుచుఁ [illegible]
గమ్మన రాముఁ బట్టి వెటకారముగాఁ గడు నొచ్చి ముష్టిచే
నమ్మలపోటులల్లు విరసమ్మన గ్రుమ్మిన వానిశక్తిమం
గిమ్మనఁ బోక రాముఁడు నికృష్టునిఁ దన్నెఁ బదంబు నెత్తియున్.

గీ. ఆఱు బారల దూరమునందు వ్రాలి
నోట నెత్తురు గ్రక్కుచు, నుదుకు నేలఁ
గొట్టుకొని కొట్టుకొని బాధఁ దట్టుకొనక
కులిశహతి గోత్రముం బోలెఁ గూలె నేల. 159

గీ. కూటమల్లుఁడు వర్ధిత కోపమునను
బిరుసుగా వచ్చి రామునిఁ బొరసినంత
నెడమపిడికిటఁ బొడిచి యా చెడుగుఁ డుడుకు
నడఁచె క్షణకాలమున రాముఁ డాగ్రహించి. 160

క. శలమల్లుని వేడుకగాఁ
దల గోటం గిల్లి చంపె దర్పమ్మునఁ దో
సలమల్లుం డెదిరించినఁ
నిలువున నెఱిఁ జీల్చి చంపె నిగమవిదుండున్. 161

క. శలతోసలకంబుల మఱి
యలఘులఁ జాణూరముష్టికాసురవరులం

బలదర్ప మోర్చి చంపియు
వెలసిరి బలరామకృష్ణవిభులు కడంకతోన్ 162

సీ. మల్లవిద్యావిశారదు లమ్మడిసినంత
బాలమల్లురు ప్రాణాలపైని దీపి
ఎలనం జేం జిక్కకయ దిశ ల్వట్టి చనిరి
బ్రదుకుజీవుండా యని పిక్కబలముకొలంది 163

మ. అమితోద్దండభుజప్రతాపు లయి గర్వాధిక్యు లౌ మల్లురన్
యమలోకంబున మల్లయుద్ధమునకై యంపించి నిర్వక్రవి
క్రములై దుర్దమచండభాస్కరుసరేణం దుర్నిరీక్షప్రతా
పమహోత్తేజితమూర్తులై వెలసి రాబ్రహ్మాండభాండోదరుల్. 164

చ. కనుంగొనలేక శాత్రవులు కన్నులు గట్టిగ మూసి రాప్తులై
మనములు పొంగి మిత్రతతి మంగళహారతు లిచ్చి రక్షులన్
వనితలమాటః జెప్పంగ దగనా ననమన్మథమన్మథాంగునిం
బ్రణయవిలోకనప్రభల బ్రహ్మరథంబును బట్టి రొప్పుగన్. 165

ఉ. నింగులతో జయధ్వనులు నేస్త మొనర్చె నసంగనుంగళో
త్సంగము నెక్కి రంగనలు సన్నుతు లష్టదిశాపరీత మై
రంగులు చెంగలించె యనురాగమహోద్ధతరంగసంగమై
పొంగులు వారుచుండెం బరిపూర్ణతం గాంచెను మల్లరంగమున్. 166

క. విరులం గురిసిరి ముత్తెపు
సరులం దిగజార్చి రెలమి శౌరిని గనుచున్
వరకీర్తనలం బాడిరి
పరమామోదమున సురలు పరిపరివిధులన్. 167

— కంసునిమరణము —

సీ. ఐదుప్రాణముల వ్రాలు గంతరించి
యున్న దేమాలసో పడి యూంగుచుండె
గాలి పీల్చును చూచును గాని లేండు
పలుకలేండు ప్రతిక్రియ యెంచంబడేడు. 168

చ. ఇది విరసోక్తి కాదు జను లెవ్వని నేవి ప్రసిద్ధుఁ జేయునో
యదె తుది సేయు నాతనిని నాంతరకార్యము లెట్టు లైన న
య్యది తలపోవు నంత్యసమయంబునఁ దప్పదు కంసరాజు దు
ర్మదుఁడు భయంకరుం డతనిమారణకారణ మల్లికాదొకో ? 169

గీ. ఫలము గాంచినఁ దమప్రజ్ఞ సలవ విఫల
మైన దేవునిదయ యన్న మనిన నొడలి
పొంగు సున్న మనం దలకొంగుమూఁత
పామరజనంబు నైజ మీపగిది నుండు.

గీ. నడుచునందాక నది బండి నడునకున్న
బండ యీతీరె మానవప్రకృతివిధము
వెలుఁగు వెగ్గైన రాశులు వెలయునటకు
నిలిచినంతటఁ ముడుతు రంజలులు కలఁగి. 171

చ. కలఁత మునింగి భోజపతి కన్నుల నీరము గూర్చుచుండ ని
శ్చలు లయి గోపబాలకులు సత్వరమే తమముద్దుకృష్ణునిం
గలిసి వినోదకేళికలఁ గాంచి హసించి నుతించు మందు చి
ట్టిలుకకుఁ బ్రాణసంకట మదే చెలగాటము పిల్లిపిల్లలకున్. 172

ఉ. బాలురలో నొకండు తనబాహువు పట్టుచు కృష్ణుఁ గాంచి రా
రా లలితాంగి మల్లుఁడ విహారముఁ జేయుద మామఁ బల్కు నా
కేలు గదల్పు మం చొకఁడు కేరడము ల్వచియించుఁ బాఱుచుం
బాలుఁడ నన్నుఁ బట్టు మని పగ్గెలు పల్కు నొకండు నవ్వుచున్. 173

గీ. ఇట్లనేకవినోదము లెసఁగ నాడి
యందఱుం జేరి శ్రీకృష్ణు నభినుతించి
చేతులం బట్టి పైకెత్తి చేత మలం
చింతగా గంతు లిడుచును వెలయుచుండ్రు. 174

గీ. అంగనలలోనఁ గలకల మధికమయ్యె
మంగళాంగునిముఖచంద్రమండలమును
జక్కవలుకోలెఁ గందురు సరి యపాంగ
వీక్షణముల నివాళించి వెలయుచుండ్రు.

క. మెల్లని నగవున నయనము
లల్లాడ్చుచుఁ గంసుఁ గాంచి యనె నోమామా!
గొల్లలఁ బిల్లల నడఁచుట
చెల్లదు వా రేమి నీకుఁ జేసిరి చెపుమా!

శా. ఏదో యైనది నీకు మాచలవఁ గానీ తప్పులే లేనివా
రీ దాయాదులు గొల్లవార లిటు గానే వారిపై నల్గుటల్
కోదు గోరెదు గూర్గ వూని మన సౌచో మాపయిం గొప్పగా
నీదౌస్సారముఁ జూప వచ్చు నిఁకఁ గానీ మామ! యే మార్గ్గదో?

క. తృణముగనో కేవలమొక
యణువుగనో యల్పకీటమట్లో యెట్లో?
కనిపించెడునాతోనే
రణముం బొనరించి తీరరాదా భయమున్.  186

క. అని యావేగంబునఁ జనియా
మనుజేశ్వరుఁ డెక్కి యున్న మణిమయసింహా
సనమున కెగఁబ్రాకియు నా
తని యొడుకుగ నిల్చె శౌరి దర్పముతోడన్  187

శా. మామా! యేల నిరాదరించెదవు నీ మా బాంధవం బెంచవా?
నీ మేనల్లుర మైన మాయెడలనా నిర్హేతుకక్రోధ మే
మేమైనం జెడుఁ జేసి యుంటిమొకో నీ కేనాఁడు నే గాని మా
పై మాత్సర్యముఁ జూప నేల యనుకంపన్ నీడి నష్టుండవై.  188

ర. పనిపడి పిల్వఁ బంపితివి వచ్చితి మేమును బట్టణంబులం
గనుఁగొన లేదు కానఁ దిరుగాడుచు నుంటిమి యిందు నందు మీ
ధనువును జూడ నేగితిమి తాఁకినఁ దాఁకకమున్నె ముక్కలై
పని చెడె నద్ది యిట్టిపొరపాటొక యబ్బు క్షమింపరాదొకో.  189

ఉ. నీకొలమందె పుట్టితిమి నీ కపకారముఁ జేయ నేర్తుమే
మాకును నీకుఁ బోలె నభిమానము మానము నుండకుండునా?
యేకముగా మముం గలప నెంచినఁ నోర్వఁగలారమే వృథా
నీ కిటు లేల మాయెడల నెయ్యము నెంతటెనిసి భావముల్.  190

ఉ. ఎన్నివిధాలఁ జూచితివి యే మయిపోయెను నీప్రయత్నముల్
కన్నులు విప్పి సర్వమును గాంచియు వంచన వీడ వెందుకో
తిన్నని రాచబాట గుఱితింపవు కంపలురొంపపెంపు లౌ
సన్నపెడారిమార్గములచాయలు గాంచెద వేమికర్మమో. 191

మ. అనుఁగుం జెల్లెలు దేవకీసతిని గారాగారమం దుంచి పు
ట్టిన లేఁగందులఁ బుట్టఁ బొట్టుకొను జెట్టీవై వృథాయాసముం
గనుపాపం బది దక్కెఁ గాక విధిగాఁ గానున్నకార్యార్థము
ల్పనెనా? నీమదురాశ లాప్తిఁ గనెనా సర్వంబుఁ జింతింపుమా! 192

ఉ. కన్నులఁ గట్టివెల్లు కృతకక్రియ లన్నియు నొక్క టొక్కటే
నిన్నుఁ గ్రసింపఁ బాలుపడి నిశ్చలతాండవమాడుచుండ నీ
తెన్నుఁ దొలంగ నెంచవు మదించి కదెంపఁ దలంతు మమ్ము నీ
యన్నలు మున్ను నచ్చి మము నంటిరి మింటికిఁ బాఱె రందఱున్.

శా. మామా యింతట నైన బుద్ధి గొనుమా మానంబు గోల్పోకుమా
ప్రేమప్రాప్తుఁడ నేను నన్నవఁడు సంప్రీతి న్వాలోకింమనో
యామాన్యు న్విడనాడఁబోను విధిగా నర్చించు గోపాలునన్
భామ ల్పొందెడుమార్గ మయ్యదియె సంభావింపుమా నెమ్మదిన్.

ఉ. శత్రులు మిత్రు లన్నగుణతత్వము లెన్నను శిష్టపూజ్యతే
మిత్రులు లోకకంటకులె నేమర శాత్రవు లట్టిదుష్టులుం
బాత్రత గాంచి నచ్చి ఋజుభావము నంద ననుగ్రహింతు నీ
శత్రుత వాపి మైత్రియ యొనంగఁగఁ జేయుదు నేఁడుమామ యెడన్ 195

మ. ఇది నాధర్మము దుష్టచిత్తముల నే నే రీతెలం దిద్ది దు
ర్మదమార్గంబులఁ బాపి నాదెసకుఁ గ్రమ్మం జేయుటల్ కానిచో
నదయత్వంబు వహింప నెవలయు నీరాపురా దేశకాలోచితా
స్పదసత్కార్యమె నావినోద మనఁ జెప్పం బోవు సుమ్మాటికిన్.

ఉ. మామ వటంచు రాజకులమండన సఖుండు వటంచు నందు నీ
సీమకు నేత వంచు గుణసింధుఁడ వంచుఁ దెలంగి నిన్నుఁ జే
తోముద మొప్పఁ జూడఁ గనుకానుకలముం గొని వచ్చినార మే
మీమెయి నీదుసన్నిధికి దేనివిరోధముఁ గొందు మాయెడన్. 197

క. మేనల్లుఁడు గాని ధర
లో నెవ్వరు ప్రేముడింత్రు లోకవిరుద్ధం
బూనఁగ నేమిటికి కోమా
మా నీ కెవ్వారు మెచ్చుమార్గమె 198

వ॥ అనినఁ గంసుం డిట్లనియె. 199

శా. వింటి న్నీ చరితంబు సర్వమును నీ వేషంబు నీనాఁటికిం
గంటిన్ గొల్లఁడ యింక నేమిటికి నీకాపట్య మెవ్వారికిం
గంటం గారము చల్లు నేర్పరివె యైనన్ నన్ను వంచింప నే
దంటల్ నేరరు దేని కీనుడులు పందా మిత్తి వాటిల్లఁగన్. 200

మ. నినుఁ గన్గొంట్కకె వేచియుంటినిజుమీ నే నింతకాలంబు ధా
త్రిని గాలించితి నెంకుఁ జిక్కవు నినుం బ్రేరించి కర్మంబు ని
ల్పెను నా చెంగట నాకు శౌర్యమును ని ప్పీఙ్గంబు లోకంబు లె
ల్లను వీక్షించు నిఁకేల కేలఁ గరవాలం బిప్డు కీలింపుమా! 201

ఉ. టక్కరి యిన్ని నా ళ్లెచట డాఁగితి వేగము ప్రాళిశీగ ముల్
వ్రక్కలు సేయునాఁడు విపులావలయం బది యష్టదిక్కులుం
గ్రక్కదలంగ స్యందన మఖండగతిం బఱపించునాఁడు నీ
వెక్కడ లేనిధైర్య మిపు డెట్లొనఁ గూడె నెఱుంగఁ జెప్పుమా!

క. ఈనయగారపుఁబలుకుల
తో నెన రూనంగ ని న్నెదుర్కొన కంటికే
పోనిత్తు ననుచుఁ దలఁచితి
వే నీచుఁడ పట్టి చంప కిఁక నిపు డనుజున్. 203

వ. కృష్ణుం డిట్లనియె. 204

గీ. కన్నవారినెమ్మనములఁ గాల్చివేసి
చెల్లెలి యెడంద నారని చిచ్చుఁ బెట్టి
కులము వారి కన్నులలోని నలుసవగుచుఁ
బ్రాముకొను టేమిటో కంసమామ నివు. 205

ఉ. నాలుగువైపులం గనుము నా యనుది క్కొకఁ డైనఁ గల్గి నిన్
జాలిఁ దలంచు నేనొ ఘటసర్పము గాంచె నకట శత్రులై

తాళక కాంత్రు నిన్ను భుజదండము సాచి ఫణంబు నొత్తగాఁ
గాలునిఁ బోలె నిల్చునను గాంతురు దైవముభంగి నెల్లరున్. 206

ఉ. ఇంతటిచేటు మూడుటకు హేతువు నీ వొకరుండుఁ జూపు దు
శ్చింతలపాపపంకిలవిశేషము గా దొకొ క్రూరబుద్ధివై
పంతముఁ బూని నీ సలుపు పాతకమేదురరీతులేకదా!
గొంతుకుఁ ద్రాడుఁ జుట్టి నినుగోతను ద్రోయఁగ సిద్ధమయ్యెడిన్. 207

ఉ. మానవజన్మ మెత్తి నరమాంసము గోరెడు క్రూరరాక్షస
స్థానము నాక్రమించితివి చానఁగ నుంటివి నేఁటికేని వి
జ్ఞానము నంది దుర్మతముఁ జంపి క్షమార్హివిగా దలంచుచోఁ
బ్రాణము నిల్చు దుర్యశము వాయు సుఖింతు వొకింత యైననున్.

ఉ. హుమ్మని హుంకరించెదు మదోద్ధతి మానుము నిన్నుఁ గూర్చి నా
దిమ్మహితార్థము న్దెలుపనెంచితి నీ వనివార్యదుష్టభూ
తమ్మయినన్ నినుం దలఁచి తల్లడిలుంచెదునట్టి యవ్వ మా
యమ్మ తపింతు రంచుఁ గని యాడెద నింతగఁ గంసభూవరా! 209

వ. అను వారి ప్రియవచనంబుల ననాదరించి కంసుండు.

గీ. అగ్గిలోఁ గ్రుమ్మరించిన గుగ్గిలమటు
భగ్గుభగ్గున మండుచు డిగ్గున వర
పీఠముం డిగ్గి ఖడ్గముఁ జేతికి పట్టి
పగ్గెలం బల్కఁ జొచ్చె భూపాలవరుఁడు. 211

సీ. వ్రేపల్లెవాడలో నేపాఁపడినట్లు
చెల్లపురా యిందు కల్లరీఁడ
గొల్లభామలముందు బొల్లులాడెడు సల్లు
కాదురా యిచటఁ బ్రగల్భవాడ
మన్నించువారికి మహిమఁ జూపెదుబుద్ధి
పోలదురా నేఁడు బాలిశుండ
దొంగవై యింటింట దూరి ముచ్చిలుకీర్తి
నొల్లమురా మేముగొల్లవాఁడ

తే. రంగురంగులుఁ జూపించి పొంగిపోవు
కొంచెపు కోణంగి చేష్టలు కూడ వింతఁ
దక్కరిగ నాయికకుఁ గ్రొత్తడమడమలకు
స్వస్తియే నీకు నిలుము మర్జాతివాఁడ. 242

సీ. రాకాసిమూఁకలఁ జికాకుపఱచిన
ఛేకము ల్నాముందఁ జెల్లి రావు
యెద్దునో గుఱ్ఱపులద్దినో యణఁగార్చు
పెద్దరికపునుడు ప్రియము గావు
ఉరగముపై నీటిపురుగుపై ఖరముపైఁ
జూపినతరితీపు లేపు గావు
ఎండుగడ్డిని బండి బండపామును గొంగఁ
బట్టి మట్టాడుటల్ భయము సేవు

తే. ఆడుదానిని బాలుర నడలఁ జేయు
చాకచక్యంబు లిచ్చటఁ జాగిరావు
జోలు మెడఁ గట్టుకొనుబుద్ధి కోకి నిలుము
గద్దరితనంబుఁ జూతువుగాక కృష్ణ. 213

ఉ. నీవు కిరాతభూతమవు నీ వొనరించని పాపకర్మము
లేవు మదించి గోవులను లేఁగల బాలుర నాడువారలం
జావఁగఁ జేసినావు వ్యభిచారవిశారదుఁడీవు చౌర్యసం
భావన మగ్గువా లగుస్వభావమునొందితి వేమి చెప్పనౌ. 214

శా. ఏవీ నాయెడ నిట్టినింద్యకృతు లేవే నున్న వర్ణింపుమా
చేవ ల్వచ్చినవారినిర్ముచ్చులు సదా చింతించి వాపోదురే?
నీవే దేవుఁడ వంచు శిష్టభరణానీతాఖ్యఁ బేర్వంచు నీ
దేవత్వం బది త్రెళ్ళిపోను బను లింతే యూన గోపాలకా 215

ఉ. నీవు నిరంకుశాత్ముఁడవు నీతియు జాతియు సున్న స్థావర
ప్రాణిగణమ్ము లన్న నవి ప్రాకృతముల్ నరతత్త్వధర్మము

ఉ. సివిమతప్రసక్తియును నీకలరూపు పదార్థవిజ్ఞతా
భావము లన్నియుం దెలిసెఁ బల్కెడ లోకవిడంబనార్థ మీ
త్రోవఁ జరింపఁగావలసె దుష్టుఁడు కంసుఁడు కృష్ణుఁ డెంతస
ద్భావముదోడఁ జెప్పినను దా వినబోఁడని లోకు లాడరే. 223

శా. సర్వజ్ఞుండని నమ్ముపండితుల కా శంక ల్నివారింపనై
సర్వార్థంబులు విప్పి చెప్పెదను విస్పష్టంబుగా నీవు దు
ర్గర్వోద్రేకివి క్రూరదైత్యుఁడవు లోకద్రోహి వుగ్రక్రియా
దుర్వారుండవు చత్తు వీగడియలో దుర్మార్గచూడామణీ! 224

ఉ. రోగి కొసంగునౌషధము రోగము దీర్పక యనంత కంత కా
రోగముఁ బెంచుచున్నపుడు రోగికి నెట్టియవస్థయో యదే
బాగును గోరి చెప్పఁబడుపల్కులు ముల్కులరీతిఁ దోఁచు దు
ర్యోగముఁ జెందుతామసమహోద్ధృతరోగికిఁగూడ భూవరా! 225

ఉ. చచ్చిరి మల్లు రెల్ల నుతసత్త్వులు చచ్చిరి నీవు నాపయిం
బుచ్చినరాక్షసాధములు బోరనఁ జచ్చిరి ప్రాణభీతిచేఁ
జచ్చితి వీవు పర్వ లిడి చావక నిల్చిన దింక నొక్కటే
నుచ్చర మద్దియు న్మిగియుమార్గము చేరువ యయ్యె దుష్టుఁడా 226

ఉ. నీవు ఫలోక్తులం దయిన నిక్కవమే వచియింతు స్థావర
ప్రావరణమ్ములున్ విషయభాసవిభావన లాది యొవ్వియున్
లేవిది సత్యసమ్మతము లిప్ప దలంగి తలంచునట్టియా
భావమె జ్ఞానభావము విపర్యయ మంథవిధంబు కంసుడా! 227

ఉ. పాముకుఁ బాలుఁ బోయుటలు పాపరచెట్టుకుఁ దేనెఁ జిల్కుటల్
వేముకుఁ బానకంబు లిడి పెంచుట యుల్లికిఁ గమ్మగంధముం
బ్రాముట కుక్కతోఁక వడి వంకను దీర్చుట యొట్టి వట్టివే
తామసచిత్తవృత్తులకు ధర్మపథమ్ములు సెల్వఁబోవుటల్ 228

మ. ఇఁక నాయత్నము లేదు చెప్పగలయంతేఁ జెప్పి యున్నాఁడ నెం
తకు మౌర్ఖ్యంబున కంతు కన్నడదు కర్తవ్యార్థము ల్దీర్పఁబో
వక నాకు న్సరి గాదు కాచుకొనుమో పాపిష్ఠ కంసాధమా
సకలంబుం ద్రుటిలోనఁ దీరెదుఁ బ్రజాసంఘంబు లీక్షింపఁగన్. 229

గీ. నీకు జనని మాతామహి నాకుఁ బూత
చరిత పెద్దముత్తైదువు పరమసాధ్వి
యింక సుతునిగ నన్ను మన్నించుఁగాక
నిన్ను విడువను దుర్మతీ నిలువు నిలువు. 230

గీ. గంధసింధురకుంభముక్తాఫలంబు
గోరి కదిసెడుసింగపుంగొదమవోలెఁ
గృష్ణమూర్తి యిటు ల్వాలిఁ నృపునిపైకి
దూఁకుచోఁ గాంచి కంసుఁడు తూలిపడుచు. 231

గీ. భయమొ తామసమో దుఃఖభరమొ యేమొ
పఱుఁగు పఱుఁగునఁ దూలుచుం బడచు లేచి
భద్రసింహాసనము నెగఁబ్రాకి యందుఁ
గూరుచుండెను దలవాంచికొని వడఁకుచు. 232

గీ. కరము లొత్తి యడ్డముగ ముఖంబు దాఁచి
తాళు తాళు కృష్ణా యింక దాళు మాతు
లాంతకా యని గగ్గోలు వింత నుడుల
నాడు కంసునిఁ గదిసె శ్రీనాథుఁ డపుడు. 233

చ. నరపతికొప్పుఁ జేతఁ గొని నందకుమారుఁడు పీఠినుండియుం
జరజర క్రింది కీడ్చె విరసంబుగఁ గంసనృపాలు పత్నులా
తరుణులు దుఃఖమంది కనుదమ్ముల నీరము గ్రుమ్మరింపఁ గిం
కరులు భయంబు నంద జనకాండము హాహారవబోరు వెట్టఁగన్. 234

క. అంతకు మున్నె భీత
స్వాంతుఁడు నై మడిసియున్న జనపాలుని శ్రీ
కాంతుఁడు లాగెనుజనములు
వింతలు గని యుస్సురనుచు వేసట నందన్. 234

ఉ. పగ్గెలు పల్కి పల్కి నరపాలుఁడు వేగఁ గపాలమోక్షమై
నిగ్గుపండువెన్నెలలనీటునఁ గాంతులు రెచ్చి సాఁగుచుం
భగ్గున వెలి జ్యోతివలెఁ దానవమర్దనులోన నైక్యమై
బగ్గిలఁ జేసె నెల్లరను బెద్దవిశేషముఁ జూచినట్లులన్. 235

మ. ఘనుఁ డక్రూరుఁడు వేచి గద్గదిక మా కంఠంబుతోఁ గన్నులం
జినుకు ల్రాలఁగ మేనుచిత్తడిదడ ల్చేకూర శోకంబుతో
జనులారా! మనరాజు లేఁ డతఁడు దుశ్చారిత్రుఁడై తోఁచినం
ఘనుఁడౌ నాతని దివ్యతేజ మిది యైక్యం బయ్యె బ్రహ్మంబులోన్.

మ అది దుర్నాథము సాధుకోటికె సుఁడీ యావైభవం బయ్యెడిన్
మదవిన్యాసుఁడు నయ్యుఁ గంసుఁడు సదా మానాను రూపంబు నె
మ్మదిలో నిల్పి దుర్గ్రహంబుననో యున్మాదంబుచేనో భయం
బు దిగంద్రావని తన్మయత్వముననో మోక్షంబిటుల్ గాంచెడిన్.

సీ. శ్రీకృష్ణదేవుఁడే శిశుకుఁ డని తాను
చిన్న దాదిగఁ గంసవీరసింహ
ముద్విగ్నహృదయమై యుత్పాత లూఁగుచు
నహరహంబును జిత్తకుహరమందుఁ
జక్రాయుధముఁ బట్టి చనుదెంచుహరిమూర్తిఁ
బ్రత్యక్షముగఁ గానఁబడుచునుండ
భయమంది భోజనభాజనపానవి
హారనిద్రాసమయములయందుఁ

తే. గలవరించుచుఁ గాలంబుఁ గడపెఁ గాన
మరణ మంది సామాన్యులు పొరయలేని
విష్ణుసారూప్యవిభవము విస్తృత మగు
కృష్ణులో నైక్యమై పోయెఁ గీర్తిధరుఁడు. 238

క. అని పల్కెడు నక్రూరుని
ఘనవాక్యము లాలకించి కల జన మెల్లన్
మనములఁ దోఁచినవిధమున
ననుకొనుచుం గడపుచుండి రట్టి యదనునన్. 239

గీ. కంసనరపాలుతమ్ములు కంసుఁ డాది
గలుగు నెనిమిదిమందియుఁ గలఁత గాంచి
క్రోధతామ్రాక్షులై యుక్కురోస మొదవ
నొక్కపరిఁ గృష్ణుఁ బైకొన నుంకుచుండ. 240

గీ. కాంచి బలభద్రుఁ డుగ్రుఁడై కడురయమున
నట్టె వారించి కేసరి హరిణ గణము
నట్లు న్యగ్రోధ కంకాది కాసురాళిఁ
పరిఘమున మోది చంపె భీకరతఁ దొడరి. 241

గీ. కృష్ణుఁ డా కంసుని వధించి కీర్తిఁ గాంచె
బలుఁడు తత్సోదరులఁ జంపి కులుకుచుండె
ముసలికన్నిట్లు విడుచు నీ ముసలి తాత
యనుచుఁ దజలిరి సాక్షికజనులు కినిసి. 242

గీ. అట్లు రిపుశూన్య మైన సభాంగణమున
వెలసియున్నట్టి మిత్రులు విమలమూర్తి
కృష్ణభగవాను నుజ్జ్వలకీర్తి దిశలు
ముట్టజేజేరవంబులు మొరసి రపుడు. 243

చ. హరిచరణారవిందముల నంచితభక్తిఁ దలంచి సర్వదా
మురిపెముఁ జెందుచుండు సురముఖ్యులు దివ్యమునుల్ ప్రమోదవి
స్ఫురణ వినోదితాత్ములయి పొంపిరివోవు ననంతభక్తిచేఁ
గురిసిరి పూలవర్షములుఁ గోయిలగానముఁ జేసి రొప్పుగన్. 243

శా. ఆకంసాదులభార్య లెల్లఁ దను దుఃఖాక్రాంతచేతస్కలై
శ్రీకృష్ణార్పితు లైన నాయకుల నాశ్లేషించి బాష్పాంబుపు
ల్యాకీర్ణం బయి పాఱ ఘోరముగ భూమ్యాకాశము లుట్టుగ
శ్లోకగ్రీవముగా రవం బెడల స్థాయిన్ వీడి వాపోవుచున్. 244

ఉ. హా రమణీమనోహరణ హా కులవర్ధన హా త్రిలోకవి
స్ఫారితభూరివిక్రమ విచారవిదూరుఁడవౌచు నెంతగా
శ్రీరమణుండు కృష్ణుఁ డని చెప్పిన నొప్పు గ్రహింపలేక యూ
హా రణమందుఁ గూలితి రయయ్యొ యమిత్రసహాయ్యము వీడియున్.

ఉ. మా గతు లేమి యింక? మము మన్నన జేయువారు లే
రి ? గణనీయ మా బ్రతుకు లింతటఁ దీరెఁ గదా ? ప్రపంచమం
దే గతి మోము లెత్తుకొని యింక ననాథల మై చరింతు? మ
య్యో! గుణగణ్యుఁ డీ వయిన నొప్పుమి తప్పెదునే మనోహరా

ఉ. వచ్చితి నీవు మే మఱునఁ జచ్చినవారము యిప్డు పృథ్వియుం
జచ్చినదే నృపాలకులసత్తము గోల్పడి చావకున్న దా
మచ్చమె సాధుసజ్జనులమానసము ల్వాలిసేయునట్టిదే
యచ్చటి కేఁగువార మిఁక నెయ్యది యాశ్రయమో మనోహరా!

ఉ. లోకము లేర్చువాఁడు సుఖలోలితుఁ డెన్నఁడు గాఁడు శిష్టులం
బ్రాకటమూర్తు లౌ నిరపరాధుల వేధలఁ బెట్టినట్టి నీ
ప్రాకృతబుద్ధియే తఱిమి పాపయి నిన్ను హరించె నయ్యయో
శ్రీకరమూర్తిఁ గృష్ణు నిరసించితి విట్లు నశించి తుర్విపై. 248

చ. అతఁడు సమస్తజీవులకు నాదట యూ భగవంతుఁ డాశ్రయ
స్థితుఁడు, మహాదయామయుఁడు సృష్టికిఁ గారణమైనవాఁడు దు
ర్మతుల వధించువాఁ డతని మానవుగాఁ దలపోసి రోసి దు
స్థితిఁ గయికొంటి విట్టిదియె శ్రీహరి నమ్మనివారి ప్రాప్తమా. 249

ఉ. అని తనివోక పల్కుచు నుహార్ధము లాడుచు బాష్పబిందువుల్
చినుకులు వాఱ దేహములఁ జెమ్మటచిత్తడి గ్రమ్మ భోరుభో
రున వగఁ జెంది కుందుచును ఱొమ్ములు బాదుచు దీనలౌ నృపా
లునిజవరాంద్రఁ గాంచి హరి లోచనయుగ్మము చెమ్మగిల్లఁగన్. 250

మ. అమ్మా! మీరు కలంతఁ జెందకుఁడు కానాకార్యమయ్యెంగదా!
నమ్మైత్రయత్నము లిట్టు లేర్పడియె దివ్యజ్ఞాన మొప్పారుమీ
రిమ్మాడ్కిన్ వగఁ జెందరాదు హరి సర్వేశుండె మాయండ యా
నమ్మంగల్గినవారిపా మ్మతఁడు చింతల్మానుఁడీ యింతటన్. 251

ఉ. కామితచిత్తవృత్తులకుఁ గాఁ దగు నేదొ యదర్థ్యోఁ గాని మీ
స్వామి మహానుభావుఁ డనవచ్చు ముముక్షుల కర్హమైనస్వ
ర్ధామ మలంకరించె దురితంబులు దీరె శమింపుఁ డింక నో
భామినులార యంచు భగవంతుఁడు పిమ్మటి కార్యకర్తయై. 252

క. కంసునకు వానియనుజులు కంకుఁ ప్రాది
యైన యెనమండ్రకున్ మల్లురై ముగురకుఁ
బార లౌకికక్రియల స్వాభంగి నొసఁగఁ
జేయ నేమించెఁ దాఁ బరిశీలనుఁ డయి. 253

—*రామకృష్ణులు దేవకీవసుదేవులను సందర్శించుట*—

గీ. అంత బలరామకృష్ణు లత్యాదరమున
దేవకీవసుదేవుల తావు జేరి
సంకెల ల్విప్పి వైచి సాష్టాంగదండ
వత్ప్రణామ మొనర్చిరి భక్తియుక్తి. 254

ఉ. మ్రొక్కెడు కన్నపుత్రకుల ముందు గనంబడుచున్న విజ్ఞులై
యొక్కెడు భక్తిచేత జగదీశ్వరు లెక్కడ మర్త్యులైనమే
మెక్కడ నంచు గౌఁగిటఁ గదింపక దోయిళు లొగ్గి దీనమౌ
దృక్కులఁ గాంచుచుం గడునుతించెడి వారినిఁ గాంచి కృష్ణుఁ డనెన్.

మ. నను సర్వజ్ఞునిగా నెఱింగి ఘనవిజ్ఞానంబుచేఁ బుత్రభా
వనయే కోల్పడినారు లౌల్యవిషయవ్యాసంగము ల్లేవు కా
వున దుర్లభ్యతనూభవప్రణయసంబోధంబు గావించుటే
ఘన మౌ నిప్పు డటంచు నెంచి హరి సంకల్పానుకూల్యంబుగన్.

గీ. వీరు పరిపక్వహృదయులై కోరుకొనెడు
స్వస్వరూపవిజ్ఞానము సంతరించు
టెంతొ పని కాదు సుతులుగా నెంచుకొనెడు
పదవి దుర్లభ మని జగత్ప్రభువు తలఁచి. 257

ఆ.వె. విశ్వమయుఁడు శౌరి విష్ణుమాయను గప్పి
లౌకికేతరులను లోక విహిత
లోలుపుల నొనర్చ లోలాక్షి దేవకి
బాళి నంది చూచె బాలకులను. 258

ఉ. స్తన్యము లూరఁ గైరవముఁ జంద్రునిఁ రేపఁ జకోరచంద్రికా
మాన్యత మీఱ నెమ్మనముమల్లడి దీఁ మనోజ్ఞరూపస
మ్మాన్యులఁ గన్నపాపల నమానుషచర్యులఁ బిన్నగోపులన్
ధన్యత మీఱఁ గాంచెఁ గనువమ్ములు చెమ్మగిల న్విలోలలై. 259

శా. అన్నా! కృష్ణ త్వదీయమాతను గదా? యమ్మా యటం చొప్పుగా
నన్నుం బిల్వుము చేర రమ్ము కొడుకా నాతండ్రి చిన్నారి రా
మన్నా! చేర వదేల రా చెడుఁగనా యానాఁటి కీనాఁడు నా
కన్ను ల్చల్లగఁ జూడఁ గల్గితిని రాకాచంద్రబింబమ్ములన్. 360

క. అని కడునాప్యాయనమునఁ
దనయులఁ గౌఁగిట గదించి తలఁపులకలఁతల్
వెనుకటి వన్నియు మొనగొనఁ
గనుఁగొలఁకుల నిరు గ్రమ్మఁగా దేవకికిన్. 261

క. కని బాలురు చిఱుచేతుల
జనయిత్రినిఁ బట్టి బాష్పజలము దుడుచుచున్
మనసారఁ జూడి వసించుచు
వనఁటుచు బోకార్చె మాతృవత్సలు లసించున్. 262

శా. అమ్మా దేవకిమాత యూరడిలు మయ్యా తండ్రి యిన్నాళ్లకుం
మిమ్ముం జూచెదు నమ్ముదమ్ము పొడమెన్ మీపాదము ల్గొల్చుభా
గ్య మ్మొప్పారెను కాని కాలమగుటం గష్టాలు ప్రాప్తించె స
త్యమ్మే దిగ్విజయమ్ము గాంచినది మిథ్యాతత్త్వ మన్యాత్వమై. 263

ఉ. కట్లబిగింపు మించి మమకారవికారము దీరు దుర్వ్రణం
బల్లె నశించిపోయె మహితాస్త్రచికిత్సను బొంది దేహ మి
క్కట్లు విడాను లిచ్చె చనెఁ గాఁగలకార్యవిభాగ మయ్యె వా
కట్లును బెట్టు రద్దుపడెఁ గంసనరేంద్రునిపాలనంబునన్. 264

వ. అని యూరార్చినఁ గొంత యూరడిలి పుత్రోత్సాహసమ్మోదవా
హిని మేధావరణంబులో నెచటనో యేమూలనో డాఁగి యుం
డిన దల్లె చెలరేగి పూర్ణ మయి యుడ్డీనంబుగాఁ బొఱలో
చనరంధ్రమ్ముల జాలువాఱె నన బాష్పవ్రాతము ల్జాఱఁగన్. 265

తే. కడుపుఁదీపి నెఱింగినకన్నతల్లి
గాంచి పొఁగొట్టుకొని యేడ్చు కరుణహృదయ
సుతులకై యష్టకష్టాలు చూఱగొన్న
తల్లి పోయినసుతుఁ గని తాళఁగలదె! 266

తే. గర్భమునఁ గాంచెనే కాని కన్నులారఁ
గాంచి యెఱుఁగదు చిన్నారికన్నవారిఁ
బాకృతప్రణయము గాక భక్తితోడఁ
గాంచునట్టిది ప్రేమచేఁ గాంచె సుతుల. 267

సీ. కంపితకరములఁ గన్నపాపల నెత్తి
కంసుచేఁ బెట్టినకఠినురాలు
పురిటికూనలతలల్ పగపగఁ బగులఁ జూచి
భరించిన తాఁచుపాము
భరియించి పొక్కిలిపసిబిడ్డ వేపల్లె
కనుప నేమించినయధమురాలు
బుద్ధిపూర్వకముగఁ బూనిగర్భస్రావ
మున కొడిగట్టిన మూర్ఖురాలు
తే. పరమనరకమునం బడి మరిగి మరిగి
పండువాఱినపరమనిర్భాగ్యురాలు
కొడుకులం గాంచి కాంచని గొడ్డురాలు
దేవకీదేవి దీనాతి దీనురాలు. 268

సీ. కల్యాణతిలకము కళ దొఱంగకమున్నె
బాలహంతకునిచేఁ బడితి మయ్య
రవిరశ్మి లేనినారకకూపమునఁ గూలి
పడరానిపాట్లన్ని పడితిమయ్య
కఠినశృంఖలముల గాసిల్లి స్వేచ్ఛగా
నూపిరి విడుటకే నోప మయ్య
కాలకింకరులట్టికఠినులతర్జన
భర్జనంబుల నార్తిఁ బడితి మయ్య
తే. వనజపత్రములో నీటికణములట్లు
వణఁకుప్రాణము లరచేతఁ బట్టి యెట్లొ
గడపినామయ్య! పాడుదుష్కాల మిట్లు
గాంచినామయ్య కన్నులకఱవు దీర. 269

వ. అని తను దానె దూఱుకొని యశ్రులు వెల్లువలై తొరఁగ మోహనసుకుమారబాలకుల హాయిగఁ గౌఁగిటఁ గ్రుచ్చి ముద్దులం గొని యొడిలోన నుంచుకొని కోరికలీరికలెత్తఁ జెక్కిళుల్ పుణుకుచు ముద్దుముద్దుల నపూర్వవినోదము లాలకించుచున్. 270

మ. తనమాతృత్వము సార్థకంబయినచందం బంద మై తోఁప రె
చ్చినవ్యామోహము చెంగలింప సతి యక్షీణానురాగక్రియా
ప్రణుత ప్రాప్తము గోరి శైశవవిధు ల్పౌగండ విన్యాసముల్
తనివోకే పచరించుచుండెఁ గడు శ్రద్ధాభక్తు లొప్పారఁగన్. 271

సీ. తలయంటి పన్నీట జలక మాడించెడు
నానందమునఁ దేలియాడినట్లు
కస్తూరికాతిలకము ఫాలమున దిద్ది
పాగ వేసి నిద్దురపుచ్చునట్లు
పూలడోలికలోన లాలించి లాలించి
జోల పాడుచుఁ గేళిఁ దేలునట్లు
కమ్మని ముద్దిడి కౌఁగిట నదుముచుఁ
జేతుల నాడించి చెలఁగునట్లు

తే. ఒడిమునఁ జేర్చుకొని చనుబాల నిచ్చి
మురిసి తనివోని ప్రేమను బొరయునట్లు
భావనాప్రపంచములోనఁ బడి లతాంగి
రామకృష్ణుల లాలించు రమణ మీఱ. 272

సీ. బారకౌఁగిలి సాచి రార నాన్నా! యని
చేరఁ బిల్చుచు కూర్మిఁ జెందుచుండె
నవ్యక్తమధురవాక్యము లాలకించి యూఁ
కొనుచున్న మోదము గొని చెలంగె
బుడిబుడినడలతోఁ బడి లేచు చిన్నారి
కొడుకుల నాడించుకోర్కి గాంచె
నాట లాడుచుఁ గీచులాడుసోదరులను
వారించి యూరించుతీరు నందె

తే. వారిని బవళించి గోముల వెడఁగునుడులు
గుఱిసి మురిపించుముచ్చట నరయుచుండెఁ
బ్రణయసంపూర్ణహృదయ యై బాలకేళిఁ
దేలుచుండెను దేవకదేవి యపుడు. 273

క. కని నివ్వెరపాటున న
వ్వనజాయతనేత్ర గాంచు వాత్సల్యమునం
దను వగువిధమునఁ బొదలుచు
మనసును రంజింపఁజేసె మాధవుఁ డెలమిన్. 274

క. కనులను నీరము నింపుచు
జననిం గని పామరతను సరసిజనయనుల్
ప్రణుతు లొనర్చి వినోదం
బెనయఁగ మృదువాక్యఫణితి నిట్లనిరి వెసన్. 275

మ. ఇది దుష్ప్రాప్తము కన్నవారి కెడ మై యెన్నోచ్చటనో మేమునున్
హృదయోద్వేగముఁ జెంది సింహగుహలో నేనాఁటి కేదో మహా
పద పైపైఁ బడి వచ్చి మీరును సదా పర్యాకులాంశగ్యముల్
పొదువం గీడ్పడి నొచ్చుచుండు టొదవెంబో పూర్వకర్మంబునన్.

శా. మా కాభాగ్యము లేదు తల్లి! మిము సన్మానించి పూజించి లీ
లాకాళిందితరంగడోలికలలో లాలించి తేలించుటల్
మీకున్ లేవు కుమారపత్యులకలో స్నేహానురూపక్రియా
శ్రీకంబుల్గని సంతసించువినుతశ్రేయంబు లోయమ్మరో! 277

గీ. పదియునాల్గుజగంబుల నుదరమందు
వెలసి యున్నట్టి శ్రీరమావిభునిఁ గన్న
కొడుకుగాఁ గన్నతల్లికిఁ గూడఁ బూర్వ
కృతము తప్ప దఁటన్నఁ బ్రాకృతుల కగునె? 278

గీ. జగతి ధర్మార్థకామమోక్షముల కెల్లఁ
గారణం బైనభౌతికకాయ మెవరి
వలన సృష్టింపఁ బడి పెంపఁబడెనో యట్టి
పితరులఋణంబు దీర్తురే వేయువిధుల. 279

క. జననీజనకులఁ బోషిం
ప నొల్లకే వేఁచువడినవాఁ డా యధముం
డనయము జీవన్మృతుఁ డై
మని నరకమునందుఁ దనవమానము నొందున్ 280

చ. తనతలిదండ్రులం గురుల దారసుతాదులఁ దోడబుట్టులన్
మునులను భిక్షు గోగణముముక్షుల రక్షణఁ జేయఁ డెవ్వఁడా
మనుజశవం బ దుండియును మండియు నొక్కఁటె యట్టివారి న
గ్నినిఁ బడఁద్రోసి యేర్చెదరు కింకరు లంతమునందు మాతరో! 281

ఉ. కంసునిచేత మీరు పడుకష్టము లన్నియు నాలకించి యా
శంసితు లౌట నెంచియు విషాదము దీర్ప సమర్థు లయ్యు నా
హంస వహించియున్ సలుపఁ జాలియుఁ జేయము కాలమృత్యువే
ధ్వంసితుఁ జేయు వాని నని తల్లిరో! మన్ననఁ జేయుఁడొప్పుడున్.

చ. అని బలరామకృష్ణులు మహామతు లౌవసుదేవ దేవకీ
ఘనులను నూరడించి తమకంబు విడంబను డంబు నూర్పఁగాఁ
బ్రణవ ఘనస్వరూపుఁ డగుప్రాజ్ఞుని గన్నకుమారు నట్లు నె
మ్మనముల నెంచి యెక్కుడుగ మన్ననఁ జేసి చెలంగి రెంతయున్.

గీ. దేవకీవసుదేవులు దేవదేవుఁ
బాపఁగా నెంచి వ్యామోహపాశములను
గట్టువడియు బ్రహ్మానంద కలితు లగుచు
బలుకలేరైరి తమదేహములను మఱచి. 284

వ. ఇట్లు తలిదండ్రుల నూరడించి సెలవందినపిమ్మట.

— * ఉగ్రసేన బంధవిముక్తి * —

క. బలరామకృష్ణు లిరువురు
సలలితముగ నేగి తాతసన్నిధి నిలువం
గల గనినట్లు దలంచుచు 295
నులికిపడి విలోకనముల నొప్పుగఁ జూచెన్. 286

గీ. వచ్చి నాఁడవా నాతండ్రి వాంఛదీర
వచ్చితావని మీతాత చలముఁ దీర్పఁ
బసిఁడి సంకెళ్ళలో నిటుపడి కృశించి
క్రుగ్గుచున్నాము నాయనా! మనసునొగిలి. 287

చ. అట మిము గన్నవార లిట నందఱు మే మొకరూప కాని ని
ష్కుటమున మేసుచుం జెలులఁ జొచ్చుట వాగలుఁ దాళలేక యు
త్కటహృదయావదాగణము గాంతుము కంసు ననంతకల్ప సం
కటములఁ జిక్కి స్రుక్కి యవకాశవికాసము లెవ్వి కల్గమిన్. 288

క. అని వనఁటం గను తాతను
గని కృష్ణుఁడు యోగ్యమైన కమ్మని నుడులన్
వినిచి నిరంకుశపాలన
మున కంతంబయ్యె నింక మోద మొదవెడున్. 289

గీ. కంసమామతో స్పష్టముగా వచించి
విషయములు విస్తరించితి వినఁ డతండు;
కాఁదగిన కార్యము తనంతఁ గడచిపోయెఁ
జింత మానుఁడు మీరు మనశ్శాంతి గనుఁడు. 290

—* శ్రీకృష్ణుఁడుగ్రసేనునికిఁ బట్టంబుగట్టుట *—

ఉ. ఎచ్చట నెవ్వఁ డెవ్విధిని చేఫలమొన్ని దినంబు లొందనో
నచ్చట వానిఁ జేర్చ విధియయ్యయి రూపుల నందఁజేయుమన్
ముచ్చటఁ దీర్చు గర్మఫలము ల్పరిపూర్తి గొనంగ జీవి తా
వచ్చిన తావుఁ జేరు ననివార్యవిధాన మి దౌను భూవరా! 291

మ. అఘా! కంసనరేంద్ర పాలనమునం దానందముం గోలుపో
యినధాత్రీరమ సంవరించుఁ బతిగా నీ వందుఁ కర్తృండ వా
పని నిర్విఘ్నముగా నొనర్చు ముదలం బాటింప నే ముంటి మొ
య్యన సామ్రాజ్యపదంబు నేలుకొనుమయ్యా ధర్మపాలుండవై. 292

చ. ప్రజలము మేము మమ్ముఁ బరిపాలనఁ జేసెదు ధర్మరాజ వీ
వు జనుల సౌఖ్యముం దలఁచి పొందుమి, చేయుము నీకునాజ్ఞ చె
ల్లి జవమునం బొనర్పఁ బదిలంబుగ నుండెద మేము భూపతీ!
సుజనములు మెచ్చఁ గైకొనుము శోభనరాజ్య రమాకరంబిఁకన్.

గీ. మును యయాతి యిచ్చిన శాపముచేఁ దదన్వ
యాదవు లెవార లేని సింహాసనమ్ము
నెక్కి పెద్దలుగా రిది యిా వెఱుఁగుదు
కాఁక దాత యప్పుల మేము కాము గాదె? 294

మ. జనకా యుష్మదనుజ్ఞ గోరెను దుస్సాధంబు లౌకార్యముల్
పొనరింపం బని యుండు సీదు నవి సంపూర్ణంబు గావించినం
తనె బృందావనభూమిఁ జేరెన యశోదామాత నారాక కై
యనుతాపంబున నుండునేమొ దయతో నాతల్లి మాన్పింపుఁడీ 302

సీ. ఆత్మకన్నను నాత్మజులందుఁ బ్రేమ
మధిక మై కన్నవారు ప్రాణాధికముగఁ
బెనుచుచుందురు తనయులఁ గనుక వారు
దైవసములు గురుబాంధవులు చూవె. 303

సీ. తాము పోషింపఁగలసమర్థతలు లేని
బాంధవులు తెచ్చి యిచ్చినబాలు నెవరు
పెంచి పెద్దఁ జేతురో వారె యెంచఁదగిన
తల్లిదండ్రులు వారికి ధర్మమూర్తి! 304

మ. పరమోదారులు మీరు దంపతులు పాపాభీలుఁడౌ కంసు ఘో
రమకోపంబుఁ దలంచి కాదనక సంభావించి [illegible] మీ
కరమం దుంచిన నన్నుఁ గన్నసుతుగా గారాబ మేపార హృ
త్సరసీజమ్ముల దాఁచి ప్రోచితిరి వాత్సల్యాంబురాశిం గదా. 305

గీ. కన్నతల్లి దేవకిమాత యున్నవిధులఁ
దనువు పోషించినది యశోదాసవిత్రి
తండ్రి వసుదేవుఁ డన్నిటఁ దగఁ బుట్టి
నీవు గురుఁడవు తండ్రివి నిక్కువముగ. 306

గీ. దేవకీనందనుం డని తెలియఁబడుచుఁ
బడసెదను యశోదావత్సుఁ డనుకీర్తి
నందకులదీప మన యదునాథుఁ డనఁగ
నిలు తెలుంగుల గుర్తింతు ధరణి జనులు. 307

గీ. మమ్ముఁ గనకున్న నరసిముసమ్ము లేపి
యోర్వలేనిమాయ నన్నును నోర్పుఁ జెప్పి
యందఱిని నడిగితి మని మందలోని
వారి కెల్ల వచింపుఁడీ మీరు కరుణ. 308

చ. అన విని నవ్వి నందుఁడు మహాపురుషా పదునాల్గులోకముల్
ఘనముగ బొజ్జ నిల్పుకొను కర్తవు భర్తవు హర్త వీవు ని
న్ననుప నెవారికిన్ వశమె కనిపెంపు నొకర్తువు గాని యే ప్రమా
జనము దలంపఁబోవు గుణసాగరుఁ డీవు హరీ మహాప్రభూ! 309

ఉ. శ్రీరమణీమనోరమణ జీవుల కాశ్రయ మైననీదయా
పూరము లేనిభూతములు పుట్టుట చచ్చుట గాని యెన్నఁడుం
బారముఁ జేర నేరవు కృపాపరిపూర్ణుఁడ వీవు సర్వము
న్నిను తెలుపు నాదిభూతమవు నీరజనాభ యొసంగ నేర్తువే. 310

వ. అని నందుండు నుతించిన సానందుండై వసుదేవనందనుండు. 311

గీ. ఉచితభూషణవస్త్రాదు లొసఁగి పాలు
పితుకుటకుఁ గంచుపాత్రలుఁ బ్రేమ నొసఁగి
వ్రజనివాసులఁ బూజించి వారితోడ
నందు నంపించె బృందావనంబుఁ జేర. 312

గీ. నందుఁ డానందుఁ డయ్యును నందనునెడఁ
గల్గియున్న వ్యామోహముకతనఁ జిత్త
విహ్వలుం డయి కన్నీరు వెడల మూర్ఛ
పడుచు విడలేక విడలేక విడిచి చనియె. 313

వ. తదనంతరంబ 314

గీ. కృష్ణుఁ డుద్భవించినవేళ హృదయమందు
దత్త మొనరించియున్న గోతతిని దెచ్చి
వత్సములఁ గూడఁ గైసేసి బ్రాహ్మణోత్త
ముల కొసంగెను వసుదేవ భూపుఁ డపుడు. 315

గీ. ఉపనయనమహోత్సవముల నొప్పఁ జేసెఁ
జెలఁగి వసుదేవుఁ డాత్మపుత్రులకు ధర్మ
శాస్త్రవిధుల బ్రహ్మోపదేశము నొసఁగె
కులగురుం డగు గర్గాచార్యుఁ డెలమి గదుర. 316

గీ. అట్టు లుపవీతు లై బాలు రతులవిధుల
బ్రహ్మచర్యవ్రతంబు సాంప్రతము గాగ
దగ ననుష్ఠించి మానవధర్మములను
నేఱపెదరు రామకృష్ణు లిర్వురును జెలఁగి. 317

— సాందీపమునికడ రామకృష్ణులు విద్యలభ్యసించుట —

గీ. గురుకులావాస మొనరింపఁ గోరి వార
లాసియం దవంతీపురవాసి యైన
విమల, సాందీపగురుని యాశ్రమముఁ జేరి
రామకృష్ణులంతేవాసు లై ముదమున. 318

చ. గురుచరణారవిందములఁ గొల్చి యనారతభక్తియుక్తు లై
యరువదినాల్గువిద్యలను, నర్వదినాల్గుదినంబులందునం
గఱచిరి రామకృష్ణు, లతిగౌరవభావముఁ బేర్మి సద్గురుం
డెఱుఁగ నొకొక్కతేప వచియించిన మాత్రముచే నెఱుంగుచున్.

క. గురుశుశ్రూష నొనర్చెడు
పరమాదర్శమును జూపఁ బరిపరివిధులం
గురు సాందీపుని సేవిం
చిరి భక్తిని రామకృష్ణ చిద్రూపు లిలన్. 320

సీసమాలిక. గానశాస్త్రము వాద్యకలవిద్యనృత్య మా
లేఖ్యంబునుం జిత్రలేఖనంబు
బుష్పాస్తరణ మణిభూమికాకర్మలు
నుదకవాద్యంబులు నుదకఘాత
ఘనవిశేషకచ్ఛేద్యమును దండులప్రస
వ బలికారమ్ము విద్వత్ప్రసక్తి
రదనవస్త్రాద్యంగరాగము మాల్యగ్ర
థనవికల్పమును జిత్రకృతియోగ
మును శేఖరాపీడమును యోజనమును నై
పథ్యయోగము కర్ణపత్రరక్తి
భూషణయోజనమ్ము సుగంధయుక్తియు

తృతీయాశ్వాసము

హస్తలాఘవవిద్య యైంద్రజాల
మొగి కామమార్గప్రయుక్తియుఁ జిత్రశా
కాపూపభక్ష్యవికారవిద్య
పానకాసవరాగ భవ్యయోజనముసూ
చీకర్మ సూత్రవిచిత్రకేళి
పుస్తకవాచకమును బ్రహేళిక ప్రతి
మాలయు వాచక మహితవిద్య
నాటకాఖ్యాయిక నవయోగమునుసమ
స్యాపూరణము తర్కుశాస్త్రవిధియుఁ
బట్టికా వేత్రసుబాణవికల్పము
తత్క్షణక్రియ వాస్తుతత్త్వకర్మ
రూప్యరత్నపరీక్ష రూఢమహాధాతువా
దము మణిరాగశోధనసువిద్య
యాకరజ్ఞానవిద్యయు ద్రుమాయుర్వేద
గరిమయు శుకశారికాప్రలాప
గోష్ఠియు మేషకుక్కుటలావుకరణవి
ధియు కేశమార్జనదీధితియును
చతుర ష్టికాభ్యాసము మ్లేచ్ఛిత
భ్రమ దేశభాషల పాండితియును
బుష్పశకటికసంపూర్ణ విజ్ఞానము
యంత్రధారణ మాతృకాదివిధులు
మానసీమాతృకామహితవిద్యయు నభి
ధానకోశము ఛందఃప్రసక్తి
చలితయోగము క్రియాసాధనాకల్పము
వస్తుగోపనవిధి వైదుషియును
ద్యూతవిశేషవిఖ్యాతి బాలక్రీడ
యాకర్షణక్రీడలందు నేర్పు
వైనాయకీవిద్య వైజయికీవిద్య
వైతాళికీకళావైభవంబు

తే. వరుసదియునాల్గు విద్యలయందుఁ గల్గు
మర్మముల నెల్ల నేర్చిరి మహితవిభుల
గురుఁడు సాందీపమౌని సత్కరుణవలన
రామకృష్ణు లలౌకికప్రజ్ఞు లగుచు.

1. గానశాస్త్రము—సంగీతవిద్య
2. వాద్యము—జంత్రవాద్యములు పలికించుట
3. నృత్తము—భరతనాట్యము
4. ఆలేఖ్యము—వ్రాయుట్టిచెప్పు
5. పుష్పాస్తరణము—పూలచేత, బుజ్జపు సింహాసనములు, సభలు మొదలగునవి యలంకరించుట
6. చిత్రలేఖనము—చిత్తరువులు వ్రాయుట
7. మణిభూమికాకర్మ—మణులచేతగాని, అలంకారవస్తువులచేగాని, అలంకారములు చేయుట
8. ఉదకవాద్యము—నీటియందు వాద్యములు మ్రోయించుట
9. ఉదకఘాతి—నీటియందీదుట, నీళ్ళనుకొట్టి దారలుచిమ్మునట్లు చేయుట
10. విశేషకచ్ఛేద్యము—బొట్టుపెట్టుట, ఆకర్షించుట
11. తండులప్రసవబలివికారము—బియ్యముచే, పుష్పములచేత, చిత్తరువులు వేయుట
12. రదనవస్త్రాద్యంగరాగము—దంతములకు వస్త్రములకు రంగులు వేయుట.
13. మాల్యగ్రథనవికల్పము—పూలదండలచేత పల్లకీలు చిలుకలు సింహాసనములు మున్నగునవి కట్టుట
14. చిత్రకృతియోగము—చింతలను జేయుట
15. శేఖరాపీడయోజనము—కిరీటములు, కొప్పులు మొదలగునవి కట్టుట
16. నైపథ్యయోగము—వేషములను వేయుట
17. కర్ణపత్రరక్తి—కర్ణాభరణములమర్చుట
18. శయనరచనము—పాన్పులను వేయుట
19. భూషణయోజనము—జరీమొదలగువానితో నాభరణములు చేయుట

20. సుగంధయుక్తి-పరిమళవస్తువులనుచేర్చునట్టి నేర్పు
21. హస్తలాఘవము-చేతియందు వస్తువులను దాచుట
22. ఐంద్రజాలము-మంత్రతంత్రవిద్య
23. కౌచుమారయుక్తి-వెండ్రుకలను మొలిపించుట
24. చిత్రశాకాపూపభక్ష్యవికారము-కూరలు పిండివంటలు రుచివంతముగా తయారుచేయుట
25. పానకాసవరాగము - పానకములు మద్యములు మున్నగునవి తయారుచేయువిద్య
26. సూచీకర్మ-కుట్టుపనులుచేయుట
27. సూత్రవిచిత్రకేళి-దారముతో అల్లుటమొదలగుపనులు
28. పుస్తకవాచకము-పుస్తకములుచదువుట
29. ప్రహేళిక-కట్టుకథలనుజెప్పుట
30. ప్రతిమాల-ప్రతివాక్యములనుజెప్పునేర్పు
31. వాచకసుహితవిద్య-అపశబ్దములు రాకుండచదివెడునేర్పు
32. నాటకాఖ్యాయికదర్శనయోగము - నాటకములయందు వేషములు వేసి యభినయించుట
33. సమస్యాపూరణము-సమస్యలను పూర్తిచేయుట
34. తర్కశాస్త్రనిధి-వాదించుటయందు తర్కశాస్త్రపాండిత్యము
35. పట్టికావేత్రసుబాణవికల్పము - పలకలుబెత్తములు బాణములు మొదలగునవి చేయుట
36. తత్క్షణక్రియ-వడ్రంగముజేయుట
37. 'వాస్తుతత్త్వకర్మ-గృహవాస్తు, మొదలైనవి తెలియుట
38. రూప్యరత్నపరీక్ష-నాణెములు రత్నములు మొదలయినవి పరీక్షించుజ్ఞానము
39. ధాతువాదము-గనులనుండి వెండిబంగారు మొదలైనవి కనిపెట్టుట వానిని శుభ్రముచేయించుట మొదలైనవానియందు నేర్పు
40. మణిరాగశోధనవిద్య-మణులను పరీక్షించుట, మెరుగుపెట్టుట మొదలగునవి
41. ఆకరజ్ఞానవిద్య-గనులనుకనిపెట్టెడువిద్య

పోతి వారాశిలో వానిపాల కువ గని
తెచ్చి గురుదక్షిణగ నిండు ధీరులార ! 325

ఉ. వీరకుమారులార పృథివీభరముస్ హరియింప మానవా
కారము నందియున్నగుణగణ్యులు నన్ను ననుగ్రహింపఁగాఁ
గోరి గురుత్వ మిచ్చితిరి; కొందలమందెడుచిత్తవృత్తిఁ బెం
దీరుప నెంచరే తనయుఁ దెచ్చి యొసంగి యనుగ్రహింపరే! 326

గీ. మీరు సర్వసమర్థులు మీరు దక్క-
నిట్టిఘనకార్య మొనరింప నేరితరము ?
కాన నర్థించుచున్నాను గనికరమునఁ
బుత్రభిక్షఁ బెట్టుఁడి వీరమూర్తులార ! 327

చ. అనవుడు సద్గురూత్తము తదాశయుఁ దీర్చుట లెస్స యంచు నె
మ్మనమున నెంచి సత్వరమె మాధవుఁ డంబుధిఁ జేరఁ దత్తటం
బున వసియించియుండిన సముద్రుఁ డెఱింగి మనుష్యరూపుఁడై
వనజదళాక్షుసన్నిధికి వచ్చి వినమ్రుఁడు నౌచు నిట్లనున్ 328

మ. అనఘా తావకదివ్యపాదరజవిన్యాసంబుచే నేను పా
వనుఁడైతిన్ మిముఁ గంటి నానలన సేవాధర్మ మొద్దానిఁ గై
కొన వాంఛించెద రీయ తెల్పుఁ డనఁగా గోవిందుఁ డాచార్యపు
త్రునె సాందీపకుమారుఁ డిందుఁ గలఁడే నంభోధి రప్పింపుమా ! 329

గీ. మును దరంగహస్తములతో ముంచినాఁడ
ఘనుని సాందీపసద్గురుతనయు నేను
వాని గురుదక్షిణగ నీయవలయు మేము
వేగఁ గొనితెమ్మె చట నున్న వెదకి యతని. 330

గీ. అన సముద్రుఁడు గీతిలి యార్యమిత్ర
యిందు నాతప్పు లేదు నే నెఱుఁగ నొకటి?
పంచజనుఁ డనురాక్షసప్రభు వొకండు
గురుతనూజుని హరియించెఁ గుజనుఁ డతఁడు. 331

ఉ. ఆతఁడు పంచజనుఁడై జలమునందు వసించును మత్స్యరూపియై
నాతరవాత నే వానిఁ బ్రథనంబున నోర్చి జయింప వానిపా
పోతర మార్చి నీవ కొనిపొమ్ము గురూత్తమపుత్రు నన్న సం
ప్రీతిని గృష్ణదేవుఁడు గభీరజలమ్ములఁ జొచ్చెఁ జెచ్చెరన్. 332

గీ. శంఖముల నీనుమత్స్యమై జలధియందు
నెలవుఁ గనుపంచజనదైత్యు నిలువరించి
గర్భముం జించి గురుపుత్రుఁ గనక యందు
నెలయు శంఖము గొని నీరు వెడలి వచ్చె. 333

గీ. అంత బలరాముని గూడి హరి రథంబు
నెక్కి సంయమనీపుర మేఁగి యందు
శంఖ మొత్తిన విని యమసార్వభౌముఁ
డెదురుగా వచ్చి పూజింపఁ గృష్ణుఁ డనియె. 334

వ. మాగురుండగు సాందీపమహర్షి నందనుం డకాలమృత్యుం బొందె నాతని
మాకై నీలోకంబునుండి విముక్తుం జేసి భూమికిం బనుపవలయు నన
నతం డట్లు సేసె. 335

ఉ. అంతట రామకృష్ణులు మహాసుఖమంది రథంబు నెక్కి య
త్యంతకుతూహలంబునఁ బ్రయాణ మొనర్చియు రాజమందిర
ప్రాంతముఁ జేరి తేరు డిగి బాలకు నర్పణఁ జేసి ప్రమోదమున్
స్వాంతన వాక్యములు పలికి సమ్మతి నొంది యనంతరంబునన్. 336

గీ. మీరు కోరినరీతిఁ గుమారుఁ దెచ్చి
కూర్చియున్నాము గురువరా కోరఁదగిన
దింక నేవాంఛితార్థములేని యున్నఁ
బలుకుఁడీ యన్న సాందీపుఁ డెలమి గదుర. 337

గీ. నాయనా జగద్గురు లీరు నాయదృష్ట
వశమునన్ శిష్యులైతిరి వాంఛ దీరె
నట్టి నా కెందుఁ గొదువ యూ నమరపూజ్యు
లైనమీకుం గుశలం డంటి రదియ చాలు. 338

చ. చనుఁ డిఁక మీగృహంబులకు సత్పురుషోత్తములార! మీయశం
బనయము లోకమందు నజరామరమై వెలుఁగంగుచుండు చ
చ్చినగురుపుత్రుఁ దెచ్చినయజేయపరాక్రమనంతు లందు దీ
వెన లిడి రామకృష్ణులను వేఁ బనిచెం గురుఁ డుల్లసిల్లుచున్. 339

క. హరిహరవిధిముఖసంజ్ఞా
పరిభాసితకీర్తి నిగమభాషితతేజ
స్స్ఫురితనిజమూర్తి మునిహృ
త్సరసీరుహవర్తి దైత్యజనసమవర్తీ! 340

వ. ఇది శ్రీసుబ్రహ్మణ్యేశ్వరకృపాకలిత కవితావిధేయ, వాడేలవంశసుధా
పయోనిధి కలానిధిగేయ, వేంకటశేషగిరిరాయ నామధేయ ప్రణీ
తంబైన శ్రీకృష్ణాభ్యుదయ మహాకావ్యంబునఁ తృతీయాశ్వాసము.

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.



ఓమ్

# శ్రీకృష్ణాభ్యుదయము

## చతుర్థాశ్వాసము

శ్రీమత్స్య కచ్ఛప కిటి
సామి నృహరి వామన భృగు భాను యమ శ్రీ
రామ తథాగత కల్క్యా
ఖ్యామహితదశావతార యఖిలాధారా! 1

క. అవధారు జగన్నాయక
నవరసభరితంబు నందనందనుకథ న
ట్లవనీసురపుత్రుని మృతు
ని వెండి బ్రదికించి శౌరి నిఖిలస్తుతుఁ డై. ౨

చ. చని మధురాపురంబున భృశమ్మును బాంధవమిత్రగోష్ఠి నిం
పెనయఁగ నుండి సజ్జనుల నేలుచు దుర్జనులన్ హరించుచున్
ఘనత సురేంద్రవైభవమునన్ విలసిల్లుచు నొక్కనాఁడు బృం
దను దనుఁ గోరియుండు వ్రజతన్వుల నెంచి కృపాప్రపూర్ణుఁ డై ౩

—* శ్రీ కృష్ణుఁడుద్ధవుని బృందావనంబునకుఁ బంపుట *—

శా. భీతిం గంసుఁడు కామతాపమున గోపీలోకమున్ నిత్యముం
జేతోవీథి ననున్ స్మరించి యితరస్నేహంబులం బాసి రే
రీతిం బట్టిన గమ్యు మొక్కటయి యర్థిం గూర్పదే మోద మి
ష్ఠీతాత్పర్యముచేత గోపికలు నా కిం పౌదు రాత్మీయ లై. 4

శా. ఆపూఁబోఁడులచిత్తతాపమును బాయంజేసి జ్ఞానంబుసం
దీపింప న్విషయాతిదూర మగుతృప్తిన్ బ్రహ్మనిష్ఠంబుగా
నేపారం బొనరింపఁగా వలయు నిప్డెవ్వార లం దేఁగి సం
తాపంబుం బెడఁబాపి వారలకుఁ జిత్తస్వాస్థ్యముం గూర్తురో 5

వ. అని విచారించుచుండునెడ 6

మ. మథురాపట్టణమందుఁ బూజ్యుఁడును సమ్మాన్యుండు సద్బుద్ధియుం
బుధవర్యుం డగునుద్ధవుం డనుమహాపుణ్యుండు శ్రీకృష్ణునం
దధికప్రేమయు భక్తియుం గలిగి నిత్యానందుఁ డై సర్వకా
ర్యధురీణుం డయి యొప్పుచుండు విమలవ్యాపారపారీణుఁ డై. 7

గీ. వృష్ణివంశప్రవరుఁడు శ్రీకృష్ణునంత
రంగమిత్రుఁ డుద్ధవుఁ డౌట మంగళాంగుఁ
డతనిఁ బిలిపించి కడురహస్యముగ నిట్లు
పలికె నుడుల సుధారసం బొలుకునటుల. 8

మ. అనఘా గోకులభూమి కీ వరిగి నిత్యానందుఁ డౌ నందునిం
దనయుంగా ననుఁ బ్రేముడించెడు యశోదామాతనుం గాంచి వం
దనముల్ సెప్పుచు క్షేమముం దెలిపి సందర్భానుసారంబుగాఁ
గని గోపీతతి నాదు క్షేమమును వక్కాణింపుమీ మిత్రుఁడా ! 9

మ. నను గోపాంగన లెల్ల నమ్మికొని ఖిన్నస్వాంతలై యుంద్రు భో
జనపానాంబరభూషణాధికములన్ బ్రక్ష్యందనాగ్రిప్రయో
జనముల్ వాసి కృశించి రేఁబవలు నాఛాయ ల్విలోకించుచున్
గనఁబో రన్యము వారి నీవు గని చక్కం దెల్పువీ నానుడుల్. 10

గీ. నానిమిత్తమై యెవ్వరు నశ్వరంపు
లైహికసుఖంబుల న్వీడి యాశ్రయింతు
రట్టివారిని గనుపాపలట్టు లహర
హంబుఁ బోషించుచుంట నాయాశయంబు. 11

గీ. కాన నింతగఁ జెప్పుచున్నాను మిత్ర
మా సతీమణు లెల్లరు నట్టివారె
నీవు సత్వరమే పోయి నేను వత్తు
ననుచు నూరార్పవలయు మానినుల నెల్ల. 12

మ. త్వరలో వచ్చెద నంచుఁ జెప్పిన నుడు ల్పాటించి నాకోసమై
తరుణు ల్వేయివిధాలఁ జూచెదరు చింతామగ్నలై యేప్పుచుం
గురు గోపాలురుఁ దల్లిదండ్రులును వృద్ధుల్ బాలురుంగూడ నా
కౌఱకై కొంకలచుండుచుండెదరు చీకుం జెప్పుమా యుద్ధవా ! 13

మ. అనినంత న్వని యుద్ధవుండు పయనంబై స్యందనం బెక్కి చ
య్యన బృందావనభూమిఁ జేరఁ జనె సాయంకాల మానంతకుం
గని నందుండు ప్రహృష్టచిత్తమున నక్కల్యాణగోపాలుదూ
తను గైదండ నొసంగి తోడుకొని సత్కారంబు గావించినన్. 14

వ॥ ఉద్ధవుండును సంప్రీతుండై హరిసందేశంబు నందయశోదలకుం దెలి
యం బలికిన యనంతరంబ గోపకామినుల కెఱింగించు వాఁడై
చనియొక్కచోఁ గృష్ణలీలాసంస్మరణ పారవశ్యలైన యత్తన్వులం
గడిసిన వారును. 15

మ. స్మితవక్త్రస్ హరివేషభూషణుని రాజీవాక్షు దర్శించి యీ
చతురుం డెవ్వఁడొ మూఁడుమూర్తులను గృష్ణబ్రహ్మముం బోలెడున్
హితుఁడెమో యతఁ డంప నిచ్చటికిఁ దా నేతెంచెనో యంచు శ్రీ
మతు లెల్లం దలపోసి కృష్ణవిభు సంభావించి యుత్కంఠలై. 16

మ. వరసింహాసనమందు మోహనకళావర్ధిష్ణు వౌకృష్ణునుం
దరుపోలెం గనుపించు సుందరునిఁ బ్రత్యక్షంబుగాఁ గామినుల్
వరహాసాంచిత దృక్కులం గవి కృపాధారేయుఁడై శ్రీరమా
వరుఁ డంపించినవానిఁగాఁ దెలిసి గోష్ఠ్యారంబుగా నందఱున్. 17

మ. నిను శ్రీకృష్ణునిమిత్రుఁగాఁ దలతు మా నీరేజపత్రాక్షుఁ డం
పిన సందేశము దల్లిదండ్రులకు విన్పింపం బ్రమోదంబు గా
ర్పను విచ్చేసితి వంతెగాక హరి కీపాపిష్ఠగోష్ఠంబులోఁ
బని యే మున్నది బంధు లెవ్వరిట సంభావించి మాటాడఁగన్.

గీ.. పరమతత్త్వవేత్తల కైన శాంధనంబు
విడువరానిది యితరులయెడఁ గలిగెను
మైత్రి పని దీరువఱకె నెమ్మది గహించుఁ
బిదప నేకోశమునఁ గూడ నెదలఁబోదు. 19

వ. తరుణులయందుఁ బూరుషులు దాల్చుప్రేమరసానుబంధ మ
క్కఱ నెఱవేరునంతకుఁ గ్రమ్మి వాడినపూలడండగా
ఘనిశిని బాఱవై వెజరు తక్కుచుఁ బాఱుచుఁ దేనె లానఁగా
విసలను జేరుతున్మెపలనేషబ్రమె మగజాతి ప్రేమమా. 20

సీ. చదువు లన్నియు నేర్చి సద్గురూత్తము వీడి
చెప్పక మఱుఁగగు శిష్యునట్లు
దక్షిణాదులు గొన్న తదుపరి యజమానిఁ
దెగనాడిపోవు ఋత్విజునిఁ బోలె
ఫలరసమ్ములు గ్రోలి భ్రమ దీరి పట్టిచా
చెట్టును విడి పోవు పిట్టలట్లు
నాకంతముగ మెక్కి యజమాని సెలవుఁ గై
కొన కేఁగునభ్యాగతుని తెఱఁగున

తే.గీ. గాపురం బున్న గహనము కాలిపోనఁ
బఱుఁగు వాఁడెడు వనమృగపంక్తిరీతి
వలపు చివురించునందాఁక వాంఛ సేసి
మఱతు రవ్వలఁ బ్రియు రాంధ్రమాట మగలు. 21

మ. ఇది నా ప్రాప్తము చేరఁదీయఁ దగు ప్రాణేశుండె మాక్షోముఁ జెం
ది దురాలోకవిధానముం గనెఁ జతుర్ధీ చంద్రబింబంబుపై
వతనంబు లనుపించు నాతనికి నాపై జ్ఞాపకం బైన ను
న్నదొ లేదో యదియుం దురూహ్యమకటా న్యాయంబె యిట్లుండఁగన్

—* భ్రమరగీతలు *—

వ. ఇట్లు వల్కియుఁ దాపం బుపశమింప నెఱుంగని యమ్మెఱుంగుఁ
బోఁడులందు. 23

గీ. తరుణి యొర్తుకయంత నుద్ధవునిఁ గాంచి
భర్తయంపిన దూతికా భ్రమర మనుచు
భ్రమపడి విలోలహృదయ యై పలుకఁదొడఁగుఁ
జేత మెల్లెట్లు నచ్చు నాకేతిఁ జెలఁగి. 24

సీ. భృంగమా ఝుంకారసంగీత మేల నే
శృంగారకృష్ణు నెఱుంగ లేమొ
చిరకాలమనుభవించినహరి మమ్ముల
మఱచెఁ గాని విరాళి మఱవ మేము

హానియాధిక్యము వలచి పైఁబడుక్రొత్త
పొలఁతుల సన్నిధిం బొగడఁ బొమ్ము
విన్నంతనే వారు మిన్నంటి నిన్నుఁబో
మన్నించెదరు మంచి మధు వొసంగి

తే. గీ. నిన్నుఁ బోలినవాఁడె యా వెన్నదొంగ
మధుమరందముఁ ద్రావి మైమఱతు వీవు
మఱతు రిర్వురుఁ బని తీరి మన్ననలను
చెలులఁ గఱఁగించి తనిసి వంచింతు రతఁడు. 25

సీ. చంచరీకమ! మమ్ము వంచించి పోయిన
కుంచితాలకునిఁ బిల్పించరాదొ
ఝుంకారరవముచే హుంకరించెద వేమి
మంకెన పూలమా యంకిలిగొన
ఏనేర్పు గురునకే మానేర్పుఁ జూపిన
జాణల మేము గీర్వాణమేల
కొంటెకృష్ణున కీవు కుంటెనగాఁడవై
యుంటి నన్నపరాకుఁ గొంటివేమొ

తే. పగలు పనిలేదు మగువల రగులఁజేయు
తళుకుబెళుకులు విని మరు ల్తాళలేము
గురునితోఁగూడి వచ్చి మూగుఱుతు గనుము
కానిచో బాఱిపొమ్ము మావానికడకు. 26

ఆ వె: మోహజనక మైన మోవిపానక మిచ్చి
మమ్ము విడిచి పోయె మాధవుండు
వాని బూటకంపు వలపు ముచ్చట విని
మోసపోయి యేట మునిఁగినాము. 27

క. మొరమెచ్చు వాక్యములచే
సిరియును మది మఱఁగి వాని సేవించునఁటే
పరమాత్ముఁ డనెద రాతని
సురలు సదా భోగకలనఁ జొక్కి యరయమిన్. 28

గీ. మొలకనవ్వులపూలలో మొనయుతేనె
కనుబొమల నాటకిమునందు గలబడాయు
మూడులోకమ్ములను గూడ ముంచివేయు
వయసుగత్తెలస్థితి వేఱె పలుకనేల. 29

ఆ. వె. సొగసుగత్తెలైన సుందరులెల్లరు
పొందఁదగినవాఁడె పురుషవరుఁడు
కాన నమ్మి కొలువఁగాఁ జెల్లఁ డతఁడు మ
న్నించునట్లు లుండి ఋంచుఁ దుదకు. 30

గీ. ఆతఁ డుత్తమశ్లోకుఁ డటంద్రు బుధులు
పరమ కరుణామయుఁ డటంద్రు భాగవతులు
దీనపరిపాలకునిగ గుర్తింత్రు మునులు
సత్యమేయైన నిట్లు మోసంబు తగునె? 31

ఉ. తల్లులఁ దండ్రులన్ మగలఁ దక్కినబంధుల నేస్తురాండ్ర నే
మెల్లరఁ బాసి కృష్ణవిభునే మది నిల్పి పతివ్రతావిధుల్
చెల్లఁగవచ్చి నమ్ముకొని సేవలొనర్చుచు నుండ నయ్యయో
చల్లగ వీడి యెచ్చటికొ జారె నిఁ కేమనవచ్చు నాథుని. 32

సీ. మృగయుఁడై వేటాడు మృగమట్లు వాలినిఁ
జెట్టుమాటునడాఁగి చెండివైచె
భార్యావిధేయుఁడై వలచివచ్చిన చుప్పు
నాఁతిరూపముఁ బాపి నవయఁజేసె
బలిభుక్కుగా వచ్చి బలిచక్రవర్తి దా
నముఁ గొని వాని కల్పము వలనె
కర్ముడుఁడై రాజకంటకవులనెల్లఁ
బరశుధారల తల ల్తఱిగి వేసె

తే. నమ్ముకొని ప్రాణమానధనమ్ము లతని
కంకితముఁ జేసియున్నమ మ్మొందఱవిడి
పాఱిపోయెను గపట గోపాలుఁ డతఁడు
చాలుఁ జాలయ్య యాతని సఖ్యమింక. 33

ఉ. ఎన్నివిధాల మమ్ము నలయించుచునున్న నదేమిచిత్రమో!
వెన్నునియందు లగ్నమగు వెఱ్ఱిమనస్సులు మాఱ వెందుకో?
కన్నెడసేయువానియెడ గాఁగనమేమిటో వానిరాకకై
తెన్నులుచూచుచుందు మతిదీనత గాంతుము కానకుండినన్. 34

శా. ఏదో యూరటఁగోరి పల్కెదము కానీ వానిపైనున్న మా
యాదర్శప్రణయంబు మార్మ్రగము కాదయ్యా విలోకింపకే
వాదాలేల విరాళిఁదాళి బ్రదుకుల్భావింప లేమయ్యయో!
శ్రీశున్ మాకడనిల్పుమయ్య వినతుల్చేకొమ్మయా! పుణ్యుఁడా! 35

మ. హరిపుణ్యైకకథాసుధారసము కర్ణాప్యాయనంబౌచు శ్రీ
కరులేమానులు ముక్తసంగులయి రాగద్వేషము ల్దీరిపో
దురు సంసారభరంబుదీరి సుఖసంతోషంబులంగాంతు ర
ట్టిరమానాయకు గొల్చుమే మతనికౌటిల్యంబు గుర్తింపమే? 36

ఉ. ఆమహనీయురూపము నహర్నిశముల్ మదినెంచి సంతత
ప్రేమమయప్రసూనములఁ బెంపుఘ[illegible]ంపనమర్చి సర్వదా
నేమముతోఁడ గొల్చెదము నీరజనాభుని నట్టివానిపైఁ
గామముతీరునా వెగటుగల్గున యగ్గి యతండు వాసినన్. 37

ఆ. వె. మోహజనకమైన ముద్దుగోపాలుని
మాటనమ్మి యిట్టిపాటు లొదవె
వేటఁగానిమాట విని వానివలఁజిక్క-
నాడు లేళ్లమైతి మందఱమును. 38

చ. అతనినఖక్షతక్రియలు నాతని తేనెరసాలపట్టులున్
బ్రాఁతిగఁదీర్చు బూటకపుమన్నన లాచిరునవ్వువెన్నెలల్
వితతవిలాససంభరితలీలలు లాలన లన్నివాగురా
ప్రతతిగ మమ్ముఁ బట్టినవి వానిని వీడఁగలేము పూజ్యుఁడా! 39

ఉ. ఐనను మమ్ము మాధవుని నంకె నొనర్పఁదలంతు వన్నశ్రీ
రాణి సతంబు నాతనియురస్థలి నంటివసించియుండు మా
కౌనె సపత్నితోఁడ విభునధ్యవసాయము దీరఁ దీర్ప నే
ల్లా! నను బాటులిట్లు? కమలాయతపత్రవిశాలలోచనా! 40

చ. అతఁ డనుపంగవచ్చితివి యన్నియఱింగితి వింకఁ బొమ్ము మా
గతులిఁకమావి నీపనుపుఁ గార్యముఁ దీరెనుగానఁ బోయి స
మ్మతమగువాంఛితం బడిగి మక్కువదీరుము భృంగరాజమా!
పతియె విడాకులిచ్చునెడ బాపము నీవొనరింప నేదియా? 41

ఉ. నందకుమారుఁడన్ ప్రచురనామము గల్గిననాఁటిమాటలే
విందుమె వృష్ణివంశవీరవిలాసము లోజనెంతుమో!
మందుఁడు గొల్లబోయనికి మాధురుఁడాతని కేటిసాటి యా
చందమె మాఱియుండనగు శౌరి యదుప్రవరుండు గావునన్. 42

ఉ. ఎన్నఁడునైన మమ్ము మదినెంచునె? మాయనురాగవృత్తముల్
కొన్నయినం దలంచి మదిఁగోరునె? పెంచినతల్లిదండ్రులన్
మన్ననఁ జేయునా? సఖులమా కెదియేని తలంచునా పసే
మున్నదిలే మహాత్ముఁ డెటనున్న నదేగద స్వర్గమయ్యెడున్ 43

మ. ఇఁక నీజన్మములందు మాకనులతో నీక్షింపమా ప్రాణనా
యకు శ్రీకృష్ణకిశోరగోపు నకటా యక్రూరుఁడన్పేరుతో
నొకదుర్మార్గుఁడు వచ్చి క్రూరుఁడయి దుర్యోగంబుగావించి యి
చ్చకముల్వల్కి విరాళిఁగొల్పి మచ్చల్మాపె మమ్మందఱన్.

ఉ. నేఁటికి నీవువచ్చితివి నీకథ యెట్టెటుమారునో జగ
న్నాటక సూత్రధారునకు నచ్చినబంటవు నీవు వానికై
లాటలబూటకమ్ములకు లాస్యముదిద్ది తలంగిపోదువో
పోటరివాచు మాయబుసుఁ బుచ్చెదవో మము శౌరిఁ గూర్తువో

శా. ఏమైనన్ నిను నమ్మికొంటి మిపుడేమేకాని నీచిత్తమ
య్యా మాప్రాప్తము మంతదింతయె నిదెంతేనో మఱిమో సరే
యేమైనం దలవ్రాఁత తప్పదుకదా యీవేఁగి పెన్వెంట మా
స్వామిం దోడ్కొనిరమ్ము మానుదులు విస్పష్టంబుగాఁ జెప్పుమా.

ఉ. ఆతనిఁ గాంచకున్న క్షణమైన భరింపమటంచు రానిచో
గోతనొ నూతనో గలులు కోరియణంగెదరంచు నట్టిని
ఖ్యాతి జగంబులోన నజరామరమై నెలవందునంచు మా
చేతములెల్ల నాతనికె చెందెడుమంచు వచింపు మోయళీ. 47

—* ఉద్ధవుఁడు గోపికలకు శ్రీకృష్ణ సందేశము దెల్పుట *—

మ. అనువాక్యంబుల నాలకించి మఱియం దాశ్చర్యమై యద్దిరా
వనితారత్నము లిట్టిలొప్పెదరొకో వ్యామోహమో భక్తియో
ప్రణయంబో విషయం బదేదయిన సార్థంబయ్యె జన్మంబు స
న్మాలైనం గొనలేనిదీక్షఁ గని యంతో దీనలై రంచునున్. 48

మ. సతతధ్యానతపోవ్రతాంచిత జపస్వాధ్యాయహోమక్రియా
ప్రతతిన్ సాధ్యముకానిభక్తి యిది మీభాగ్యంబునం బూర్వసం
చితపుణ్యంబున లభ్యమైనది కడున్ శ్రేయంబులం గూర్చు శ్రీ
పతికిం బ్రాణసమానలై మనెడుసత్ప్రాప్తంబు మీకయ్యెనెన్. 49

ఉ. పూతచరిత్ర లీరు పరిపూర్ణుని పూర్ణకటాక్షవీక్షణ
ఖ్యాతమహాప్రసాదమును గాంచినవారు త్రిలోకవిస్తృత
ఖ్యాతి దలిర్ప శౌరి ప్రణయార్చితుఁ డన్ననిజంబుఁ జాటినా
రాతనివారు మీరు తగునా చెలులార కలంతఁ జెందుటల్. 50

చ. హరి కరుణాస్వరూపుఁడు గుణాగుణభేదవివక్ష లెల్ల గు
ర్తెఱిగినవాఁడు జీవులకు నెవ్వరి కెవ్వరి కేవిధాన మె
త్తరుణమునందుఁ గూర్పనగుఁ దత్క్రియలం బొనరించువాఁడు ని
ష్వరమగుకర్మసూత్రములు ద్రోసెడుధన్యుఁడు మాన్యుఁ డాతఁడో.

గీ. శ్రీపతివియోగమునఁజేసి చిత్తశాంతి
వీడి భక్త్యతిశయమున వేడబములఁ
బలెకదరుకాని నిజముగాఁ బ్రభునియెడల
మీయచంచలభక్తి విజ్ఞేయ మహహ. 52

గీ. మీసదుపదేశమున ధన్యుఁ జేసినారు
నన్ను శ్రీకృష్ణసఖునిఁగా నెన్ని నాని
భక్తునిఁగఁ దీర్చినా రహో భామలార!
చీకటిం బాపి వెలుఁగునఁ జేర్చినారు. 53

క. ఓశుభవతులారా మీ
యాశయములు దీరఁ గృష్ణునాంతర్యసుసం
దేశము వినిపించెద నా
వేశము విడుఁ డింక మతివివేకము లొప్పన్. 54

గీ. కన నిలాగ్ని జలానిలాకాశభూత
పంచకము చరాచరజీవపంక్తియందు
నిమిడియుండెడుపోల్కి నే నెప్పుడాత్మ
రూపినై యుందు మీయందు రూఢముగను. 55

గీ. సర్వదా మీరు నేనును సన్నిహితుల
మేప్రయత్నములం బాయ మెన్నఁడేని
లేనిదాని నున్నట్లుగా మానసములఁ
గించవడి చూడకుఁడు భ్రాంతి ముంచు మిమ్ము. 56

ఉ. కావున నే వియోగ మది కల్గదు మీకును నాకుఁ గాంతలా
రా! వృథగాఁ దపింపకుఁడు ప్రాకృతమార్గము. లెంచఁబోక స
ద్భావము నొంది చూచు నెడ స్పష్టముగాఁ గనిపించుచుందు మీ
తో విహరించుచుందు పరితోషము గూర్చుచునుందు నెప్పుడున్. 57

గీ. ఆత్మ మాయానుభావమునంగి చంద్రి
చంద్రికాన్యాయమున విభాజ్యంబుగాక
మలయుచుండెడు మాయాసమర్థతఁ గని
చేతు సృష్టిస్థితిలయము లాతతముగ. 58

గీ. తగఁ బృథివ్యాది పంచభూతములుఁ బదియు
నాలుగింద్రియములు త్రిగుణములు వీని
కెల్ల నాధారుఁడేనయి సృష్టివిధముఁ
జేయుచున్నాఁడ లీలావిశేషములను. 59

గీ. నిరుపమాద్వయ నిర్గుణ నిత్య సత్య
సచ్చిదానంద శుద్ధవిజ్ఞానమూర్తి
యయ్యు మాయాకృతంబులయందు విశ్వ
తైజసప్రాజ్ఞుఁడనఁ దోఁచు ధరణియందు. 60

గీ. నిదుర వదలినపురుషులు మదిఁ దలంచు
కల లబద్ధము లని చూడఁ గలిగినట్లు
దృశ్యజగతు లవశ్యము నశ్యమౌ న
టంచుఁ దెలియును విజ్ఞాని యూహమిక నే. 61

చ. మనసును సక్రమస్థితులనూర్ధ్వమునందుఁ జరింపఁజేసినన్
గనెదరు లోకనాయకునిఁ గన్నులపండువుగా విపర్యయం
బున ఫల మన్యథాత్వమగుఁ బూర్ణవికాసముఁ జెందునట్టిస
మ్మనసముఁ జేయుఁ డిందఱును మాధవుఁడెందము విందుఁ జెందెడిన్.

క. వేదవిజ్ఞానము కర్మ
ప్రాదేశము నుగ్రతపము భక్తియు యోగ
ప్రాదుర్భావమహత్త్వము
నాదేశము లివ్వి నిగ్రహార్థములు సుఁడీ! 63

గీ. ఎన్నిత్రోవలఁ బ్రవహించుచున్నఁగాని
నదులు చివరకు జలరాశిఁ బొందునట్లు
పథము లేవైన జీవులు పడయుచుండు
ఘనమనోనిగ్రహమె ముక్తికారణంబు. 64

ఉ. మీకుఁ బ్రియుండ నైన నను మిక్కిలి మక్కువఁ జేతు రంచు నా
రాకను వేయికన్నులను రాత్రులహమ్ములుగాంతు రంచుఁ బ
ర్వ్యాకులభావము ల్గలిగి ప్రాప్తము దూఱెదరంచు వేద్యమే
నాకును గాని కాలవిధి నన్నిట నిన్నె వికల్పబుద్ధి చేన్. 65

ఉ. సంచను దేహమందలివ్రణంబును బుచ్చి నిషాదవస్తువుల్
చిందుచుఁ గట్టుగట్టి సరి చేయఁదలంచెడితంత్రిపోలె నం
జెందఁదలంచు భక్తతతిచిత్తముల గదలించి వానిచెం
బొందినదుష్టవస్తువులఁ బుచ్చుట నావిధి కాన నిట్లగున్. 66

క. ప్రియుఁ డెంతదూర ముండినఁ
బ్రియ మంతగ వృద్ధిఁ జెందుఁ బ్రేయసులారా!
దయ యొక్కటియే యిర్వురఁ
బ్రియలౌల్యముఁ దీర్చి చిత్తతృప్తి ఘటించుచున్. 67

గీ. మీకు దూరముగా నున్న మీరు నన్ను
వలఁచుచుందురు సకల వృత్తులను మఱచి
యట్టి నిర్మలధ్యానము నభిలషించు
వారె నావారు నేను నవ్వారివాఁడ. 58

చ. కనులకు దూరమై నిలుతుఁగాని మనమ్ములలోన సర్వదా
నను గనుచుండిరా విషయనాటకము ల్గనునించుచుండరా?
ప్రణయిసిచిత్తమార్దవము భర్తృనంబున కంగరక్షయై
మననముఁ జేయు నట్టిబుజుమార్గము నాకు నిజానుభూతియౌ. 69

ఉ. కావున మీరు నన్ను మము కారముతోఁ దలపోతు రంచు స
ద్భావము నాకుఁ గల్గె నదె దైవవిచిత్రము ప్రేయసీప్రియుల్
కేవలకామలౌల్యమునఁ గ్రీడలు గోరి చరించుచుండినం
భావము లొక్క టొక్కటిని బైకొనుచుండెడు నేడ నుండినన్. 70

గీ. కామతపమునకన్న నిష్కామతపము
హెచ్చుగా నేరు మన్నింతు నింతులార!
యట్టి యధ్యవసాయము నలవరింప
నదను మీ కయ్యె నది యీశ్వరాజ్ఞ సుండు. 71

శా. శ్రీకృష్ణప్రభుదివ్యవాక్యములు నిశ్శేషంబుగాఁ జెప్పితిన్
మీకుం దోఁచిన రీతిఁ గైకొనుఁడు మీమేలే విలోకించి సు
శ్రీకుం డింతగఁ జెప్పిఁ పంపె నని యోజింతున్ సరోజాక్షులా
రా! కైలాటమొ బూటకంబొ యది యేరాద్ధాంతమో యూంచుఁడీ.

క. నమ్మినవారల సొమ్మగు
నమ్మనివారలకు దుమ్మొ నారాయణవా
క్యమ్ములనిర్వ్యాగమ్ములు
నుమ్మలిక దలంగి సూతయోజింపనగున్ 73

—: గోపికలుద్ధవునికి శ్రీకృష్ణలీల లెఱింగించుట :—

వ. అనవుడు గోపికలు హృదయేశు సందేశంబునందలి పరమార్థంబు నూ
హించుచుని ట్లనిరి.

మ. అనఘా యుద్ధవ కోపగింపకుము లోకారాధ్యువిశ్లేషమౌ
ర్వాని చిత్తంబులు తత్తరంపడి యనిర్వాచ్యార్థముల్ పెక్కు వా
కొనుచుండెన్ మితి మీఱి కృష్ణవిభు సంకోచించి భూభాగమా
తనువుల్ మా కిఁక నేల యాత్మఁడు వినా తప్పేమి చింతింపుమా.74

మ. అవిగో కాంచుము శౌరిదివ్యపదచిహ్నంబుల్ ప్రదర్శించుచు
న్నవి బృందావనసైకతస్థలులు నానాఁడా సరిత్తీరమం
దు విశాలాక్షునిఁ గూడియాడితిమి సంతోషంబుగా వానిన
ర్మవినోదంబులఁ గన్నకుంజములవే రాణించు నినాఁటికిన్. 76

ఉ. ఇచ్చటఁ గూడియాడితిమి యియ్యెడ వేణువు నూఁదె నూఁది మా
ముచ్చటఁ దీర్చె నాయమున మున్గితి మిందఱ మీఁదులాడినా
మచ్చటనే వినోదముల నాడిన దాస్థలమందె హాయిగా
మచ్చికఁ జేసి చేసిఁ దమి మార్గనిసర్గము నిర్గమింపఁగన్. 77

చ. పరపురుషుండ వీవు నగుబాఁటగుఁ జెప్పకొనంగ నుద్ధవా!
హరి మము గ్రుంగఁజేసినది యచ్చటనే వసనంబు లూడ్చి మా
పరువు ప్రతిష్ఠలం గడపి పక్కన నవ్వుచు జోలపాడి ము
మ్నరమున రెచ్చగొట్టెను గ్రమంబుగ సమ్మతిఁబుచ్చె మమ్ములన్.

క. ఆగోవర్ధనగిరినే
మాగోపాలురను బ్రోవ మాధవుఁ డెత్తెన్
గోగోపాలకు లెల్లరు
నాఁగితి మట చేడురోఁజ లనఘా కంశే! 79

మ. అదిగో అచ్చట యానికుంజములమధ్యంబందు నున్నట్టి ద
య్యదె కాళిందిహ్రదంబు దానసె మహావ్యాళంబు నిర్జించి స
మ్మదుఁడై తాండవకేళిఁ జేసె హరి సంపూర్ణాభిరామంబుగా
హృదయాబ్జాతమరందధారలురలెన్ శ్రీకృపై మాయెదల్. 80

మ. ఒకమాటా యొకయాటయా తెలుప నెన్నోయున్న వావెన్నదొం
గకు మాకుఁ గలసాంప్రతప్రణయసౌఖ్యానందకేళీకళల్
కికురించెన్ మధురాపురంబునకు నేగెన్ నేఁటి కేమెట్టులా
సకలారాధ్యుని వీడియుండఁజనునో సాధ్యంబె భాసింపుమా 81

చ. హరిచరణాంకితంబు లయినట్టిప్రదేశము లన్ని చూచుచున్
హరిచరణాంకితంబు లయినట్టిమనంబులు నిల్వనోపునా?
మఱతుమ నేర్తుమా మఱవ మాధవు మాధవు నెన్నఁడైన ని
ష్కరుణి నిరాకరించునొకో కాననిక్రంతలఁ బా వసించుచున్ 82

ఉ. నీయుపదేశవాక్యములు నిక్కములే హరిదివ్యబోధముల్
న్యాయమె కాని మీరు తెగనాడినరీతి వియోగతామసం
బేయువతీజనంబు భరియించి చరించి తరించు స్త్రీమనః
పాయసముం గ్రహించుపతి పజ్జ నసింపక యోర్వవచ్చునే? 83

చ. అతఁడు వచించినట్లు పరమాత్ముని దివ్యకళావిభూతి సం
తతము సమస్తమందునను దాండవమాడుచునుండుఁ గాని యా
స్థితి గమనింపలేక బలుచింతలఁ గాంతురు ప్రాకృతు ల్సదా
మతిగొని దృశ్యలోకములు మన్ననఁ జేతురు శాశ్వతంబుగన్. 84

గీ. బాహ్యనేత్రములకుఁ గనంబడఁడు కాని
మామనోలోచనములకు మాధవుండు
సర్వదా గోచరుం డయి సకలవిషయ
సౌఖ్యములఁ దీర్చుచున్నాఁడు లాలితముగ. 85

వ. ఇట్లు వచించు గోపాంగనలం గని యుద్ధవుండు విస్మితుండై. 86

సీ. సంసారగంభీర సాగరంబులు దాఁటి
ముక్తులై చరియించు మునిగణంబు
సతత తపోవ్రత స్వాధ్యాయములఁ గాంచి
బహుయత్నము లొనర్చు భక్తతతియు
ననిశంబు నితరచింతన లేక భజియించు
బ్రహ్మేంద్రరుద్రాది క్రతుభుజులును
వక్షస్స్థలంబున వసియించి సర్వదా
మందమేలములాడు నిందిరయును

తే. నేమహాభక్తి కెంచి శ్రమించుచుండు
రయ్యచంచల నిర్మలాధ్యాత్మసిద్ధి
యంగనల కొరి లభియించె నద్భుతంబు
జన్మసాఫల్యవిషయంబు జ్ఞానదంబు. 87

క. వనచరులు విషయసౌఖ్యము
లనయము వాంఛించువారు నాగమవిద్యన్
వినియెఱుఁగని ప్రాకృతులా
వనితల కిజ్ఞానమెట్లు వచ్చెనో తలఁపన్ 88

క. అనిసంతోషముఁ జెందుచు
వనితలతోఁ గృష్ణకథలు వర్ణించుచునుం
బ్రణుతు లొనర్చుచు బృందా
వనమున నుద్ధవుఁడు భక్తివశుఁడై యుండెన్. 89

గీ. కొంతకాల మిట్లేగినయంత నుద్ధ
వుండు మధురాపురిం జేర బుద్ధి పొడమి
నందదంపతులయనుజ్ఞఁ జెంద వచ్చి
వారితోఁ జెప్పి నగరికిఁ బయనమైన. 90

వ. నందుం డానందము చెంగలింప నుద్ధవుం గాంచి యోయన్న మా వెన్నదొంగ సోఁకుమూఁకలఁగొంగ మఱియు మఱియు నడిగితినని చెప్పి 91

సీ. అఖిలలోకారాధ్యుఁ డయ్యు లీలాబాల
గోపాలుఁడై మాకుఁ గొమరుఁ డనుము
విశ్వంభరుం డనువిజ్ఞాన మొదవియుం
బ్రాకృతప్రణయము పాయ దనుము
నంతరంగంబున ననిశంబు గనుచున్న
బాహ్యదృష్టికి నసంప్రాప్తుఁ డనుము
నశ్వరంబు ప్రపంచనాటకమని కూడ
సత్పుత్రలౌల్యము సడల దనుము

తే. వేయికన్నుల సర్వదా వేచి వాని
త్రోవఁ జూచుచుఁ గాలముఁ ద్రోతు మనుము
వచ్చి యొకసారి చూచి పోవచ్చు ననుము
పోయిర మ్ముద్ధవా యింకఁ బోయిరమ్ము. 92

వ. అనుటయు యశోద యిట్లనియె

సీ. హృదయగోళము నిండి యెగయు మాతృప్రేమ
పుత్రవాత్సల్యమే పొందుననుము
నానాఁడు నోట బ్రహ్మాండజాలముఁ జూపు
టరసియు లౌల్యము దొఱఁగ దనుము

భువనపాలనకళా పూర్ణుని లాలించి
పాలించుబుద్ధియే పడయు ననుము
కనుపాప లెడమైన కరణి పూర్ణాంధమై
బాహ్యేంద్రియంబులు బడలె ననుము
తే. తన్నుఁగనకున్న నిముసంబు తాళదనుము
దేవకియు నేను దనకొక్క తీరె యనుము
నందుఁ బెంచిన మమకార మధిక మనుము
చెలఁగి నాకన్నులకు విందుసేయు మనుము. 93

వ. అంతట గోపికాసతు లిట్లని పలికిరి

గీ. మామనోవృత్తు లనిశము మాధవుచర
ణములయందును బల్కులు నామభజన
యందుఁ దలఁపులు సర్వదా యతనిధ్యాన
మందు స్థిర మయ్యె నని తెల్పు మఘువిదూరు! 95

గీ. అట్లు శ్రీకృష్ణభక్తు లైనట్టి గోప
గోపికలవల్లఁ బూజలు గొని మహాను
భావుఁ డగునుద్ధవుం డప్పు పయనమయ్యెఁ
గృష్ణపాలితమధురాపురీంద్రమునకు.

గీ. చేరిమధురాపురంబున శౌరిఁ గాంచి
సాగిలంబడి మ్రొక్కి యచ్చట విశేష
ములను దెల్పి వా రిడుకానుకల నొసంగి
వారివారి సందేశము ల్వారుసఁ బల్కె. 96

—: శ్రీ కృష్ణుఁడు కుబ్జామందిరమున కరుగుట :—

వ. అంత నమ్మధురా నగరంబున నొక్కనాఁడు 99

గీ. సర్వదర్శనుఁ డగుశౌరి సర్వసముఁడు
కాన మనసార వరియించి కామబాణ
తప్త యాకుబ్జ హృదయసంతాప మార్ప
నామెమందిరమును జేరి నరిగె నపుడు. 100

సీ. అందంబు వింతగా నమరించినగృహాలోప
కరణము లౌనందర్యగరిమ నింప
గామకళోద్దీపకం బైన చౌశీతి
బంధబంధురచిత్రపటము లొప్ప
మౌక్తికాహారముల్ మణులు గూర్చినకేత
నమ్ములు శయనాసనమ్ము లమరఁ
బరిమళించెడునట్టిబహువిధధూపదీ
పములు సుగంధమాల్యములు వెలయ
తే. ప్రణయలీలావినోదసామ్రాట్టు గోరి
వ్రతముఁ జేయురతీసతిరమ్యభవన
మనఁగ శృంగారనిలయమై కనులపండు
వయ్యె కుబ్జాసఖీ మందిరాంగణంబు. 101

ఉ. శ్రీవరు గాంచి కుబ్జ నునుసిగ్గు ముఖంబును గప్పివేయుచో
వావిరికిన్నుదోయి యరవాలినవాలక మొప్ప దిగ్గనం
దా వసియించియున్నవిరితల్పము డిగ్గి ప్రియాళిఁ గూడి శ్ర
ద్ధా వినయంబు లొప్ప హరిదాఁపునకుం జనె ముగ్ధచిత్తయై 102

చ. ఎదురుగ నేగి కృష్ణవిభు నెంతయు భక్తిపురస్సరంబుగాఁ
గదిసి నమస్కరించి కరకంజముఁజేత గదించిపట్టియున్
సదనముఁ జేరఁ బిల్చుకొని చయ్యన నున్నతపీఠ మిచ్చి యిం
పొదవుసపర్యలంజలిపె నొప్పుగ బూజ లొనర్చె నుబ్బుచున్ 103

గీ. సాధుభావముచే హరిసచివుఁ డైన
యుద్ధవుని బూజఁజేసె నయ్యువతి యంత
లోకమర్యాదలఁ దలంచి శ్రీకరుండు
కుబ్జశయనమందిరమును గూర్చి వెడలె 104

వ. అంతఁ గుబ్జాదేవియు నమందానందకందళితహృదయారవిందయై 105

సీ. సంపెంగ నూనెచేఁ జక్కగా దలనంటి
పన్నీటి స్నానంబు పరఁగఁ గూర్చి
కస్తూరికాగరుగంధబంధుర మైన
మలయజపంకముం గలయ నలఁది

పూలసరంబులు బొట్టు పెట్టుక సొమ్ము
లమరించి ముంగురు లనువుత దిద్ది
జాళువా సరిగంచు మేలిమి పట్టుపు
ట్టము గట్టి అవికె దిట్టముగఁ దొడిగి
తే. పునుఁగుజవ్వాజు లలది తాంబూలమును గ
రంబునం బట్టి వ్రీడాభరంబు దోఁప
నేలఁ జూచుచు జిఱునవ్వు పూలుకురియ
చిలిపిచూపులతోఁ గుబ్జ చేరె శౌరి. 106

సీ. బాలభానుని లేఁతపైఁడి వెలుంగులో
సత్త్వముం దీసి మైచాయ దిద్దె
రేరాజుకళలందు సారము వడగట్టి
స్మేరాంకురంబుల చెలువు దీర్చె
శృంగారశోభలో హంగుపొంగుల నూర్చి
హావభావంబులరీవిఁ గొలిపె
మకరాంకుసుంకము మన్నించి వెన్నెల
వీవెనగా గోమువిప్పు నిలిపె
తే. నౌర! నాళీకసంభవుఁ డబ్జనేత్ర
రూపరేఖావిలాసముల్ రూఢిఁ జేయ
నెంతగా శ్రమించెనో యేమొ మరుని
దంతివలె దోఁచె నందాలదొంతిమరుని యింతి 107

ఉ. వచ్చినదానివాలకము వన్నెలుఁ జిన్నెలుఁ జూచి యద్దిరా!
యచ్చరలేమ లైన సరి యౌదురె దీని కటంచు నేలనో
చెచ్చెరఁ జేరరాదు యిది సిగ్గరి యేమొ? వినూత్న కేళి కా
పచ్చును గాననే యిటుల వారక నిల్చె నటంచు నెంచుచున్. 108

క. తొలికలయికలోఁ గలిగెడు
ఫలము చలిజ్వరము తెఱఁగున బరిణతిఁ గాంచుం
దలఁపులలోఁ జలిసుడుపులు
పులకించును మొదటఁ బొంగిపోయెడుఁ బిదపన్. 109

గీ. ప్రియునిదరిఁ జేరునందాఁకఁ బెచ్చుపెరిగి
భయము వడఁకించుఁ బ్రణయినీభావములను
వలపు చివురించి మోహ మగ్గలము కాఁగ
గాఁక రేకెత్తు లలివిద్య కడలు ముట్ట. 110

చ. బిసరుహపత్త్రమందు జలబిందువువోలెఁ జలించు బుద్ధితో
మసఁగొని కూడ భర్తయెడ మక్కువఁ జూపరు తొట్టదొల్తనున్
గసికసిక్కనం గొలుకఁగాఁ జెలరేగి యనంగసంగరా
భ్యసనసమగ్రపండితులభంగిఁ బెనంగెద రంగనామణుల్ 111

మ. భయసందేహము లొక్కదిక్కు ప్రణయవ్యామోహదాహమ్ము లొ
క్కయెడన్ సిగ్గుసిడెంబు లొక్కెడ మదిం గారింపఁగాఁ గార్యని
ర్ణయ మెట్లో పొనరింపలేక ప్రణయన్యాయంబు వ్యర్థంబుగాఁ
బ్రియుఁజేర న్వనకంజయాను తొలిరాత్రిన్ గాంత యెచ్చోటనున్

శా. ఏలా ? బాలకురంగలోచన ! క్రియాహీనంబుగా దేనికో
నేలం జూతువు గోళ్ళుగిల్లుకొను దింతేనా ఫలప్రాప్తి మే
దో లాభించున ? పల్కనే పలుక వేమో? కోపమా? నోటి ము
త్యా లేమైనఁ దొలంగి పోవున? బళే! దాంపత్య మిట్లైనచోన్. 113

ఉ. వచ్చినకార్య మేమి ? వలవంతలముచ్చట రెప్పగొట్టు నీ
తచ్చన లేమి ? కుచ్చితపుఁదార్పులమార్పులఁ దెచ్చుకోలుచే
వచ్చెడులాభ మేమి ? బలవంతపుఁబంతము మెచ్చవచ్చునా
మచ్చికతోడ వచ్చి విభుమన్ననఁ గన్ననఁ జెందరాదొకో! 114

సీ. అతిపిపాసార్తున కమృతకూపముఁ జూపి
చేద లేదని నిర్వచించునట్లు
ఘనలాలసునకు దర్పణమున బింబించు
మాటఁ జూపి గ్రహింపఁ జాటినట్లు
వక్కలాకు లొసంగి వలయుసున్నము నీక
శూన్యహస్తంబులఁ జూపినట్లు
షడ్రసోపేతభోజన మిడి యతిథి కా
పోశనోదక మీక పోయినట్లు

తే. విరహవిషయార్తుఁడను ముద్దుమరుల జూపి
మన్మఃకాంక్ష దీర్ప సమ్మతిని గనవు
విమతమో నన్నుపేక్షించువిధమొ లేక
యేమొ తలపోయఁ జాల రాకేందువదన. 115

సీ. పర్వేందుచంద్రికాప్రతిమ మోముఖకళల్
చిరుసిగ్గుమబ్బు దొంతగలు కప్ప
రంగదుత్తుంగ తరంగమట్లు చెలంగు
లలిపొంగు మిసమిస లొలికిపోవ
మెఱపట్లు గన్నులం బారయు ప్రేమకటాక్ష
వీక్షణంబులు జారి వెగటు దోఁప
శశికళ సోకినశశికాంతమణివోలె
జెమటచిత్తడి మేను జొత్తు సేయ

తే. మదనజగదేకపూజ్యసామ్రాజ్యలక్ష్మి
వోలెఁ గన్పించి యంతలోఁ బాలిపోయి
మరులు జోకొట్టి దిగ జార్చి మలయుదీవు
ప్రథమసంగమమూట గావలయు నిట్టు. 116

వ. అని మేలమాడి లీలామానుషుండైన శ్రీగోలుం డంతట. 117

గీ. సురతసన్నద్ధయై మరుల్గురియఁ జాలు
చిరునగవుఁ గొంటెచూపులు స్మరవికార
చేష్టితములఁ గావించెడు చెలువ డాసి
కరముఁ గరమునఁ గీలించెఁ గడఁగి తానె. 118

గీ. హరికరస్పర్శమైనంతఁ దరుణిచిత్త
మగ్గిసోఁకిన నవనీతమట్లు కఱఁగె
భయవిసంకటములు బటాపంచ లయ్యె
వినుత లీలాశుకంబట్లు వెంట నడచె. 118

మ. అతివా రమ్మనిశయ్యఁ జేర్చి యరవిందాక్షుండు కుబ్జాసతిన్
వితతానంద వినోదకేళికలలో వేలావిలోలాను క
ల్పితరాగోర్మ్మిల నూయెలూచుచును లాలింబాడి జోకొట్టుచున్
గృతిహస్తుం డయి స్వర్గసౌఖ్యములఁ గూర్చెన్ లాహిరీదాహమున్.

చ. చిలుకవజీరుకౌతు పలుచేతల ఘాతలలోతులెంచి య
వ్వలపులరాణి శ్రీరమణువక్షము వక్షముతోడ నొత్తుచున్
గులుకుమిటారిగుబ్బలను గ్రుమ్మిచు గమ్మని మోవిపానకం
బలయక గ్రోలి సోలుచును హాయిగ నిచ్చుచుఁ బుచ్చెఁగాలమున్.

ఉ. హరిచరణాంబుజద్వయము హాయిగ మూర్ధ్నిని పట్టియొత్తుచున్
మురిపెముదీర మోహనుని ముద్దులువెట్టుచుఁ గౌఁగిలించి త
త్కరయుగళంబు వక్షమునఁ దాల్చిన నేర్చెడు మోహదాహపుం
గుఱుతులు కోరి కోరి కయికొంచు దమిం దులకించి రిద్వరున్. 122

ఉ. కోరినచందనం బొసఁగి కోమలి శ్రీరమణీమనోభవుం
గూరిమి నంది తుచ్ఛ మగు కోరిక గోరెనుగాక ఘోరసం
సారమహార్ణవోత్తరణసాధన మోజ వరించియున్న నా
తీరు లభింపకున్నె యువతీమణి మోక్షపదంబు నొందదే. 123

సీ. మేరుపర్వతముపై నౌరసత్వముఁ జెంది
గుంట్రాళ్ల భోగము గోరినట్లు
గల్పవృక్షము నింటఁ గలిగియు విస్తరా
కులఁ గోరి యత్నము ల్సలిపినట్లు
గామధేనువు తనకై వశమై యుండ
వ్యవసాయమునకు నై పంపినట్లు
చింతామణిభద్రసింహాసనము నెక్కి
మానవనైజము న్మరచినట్లు
తే. విశ్వమయు విశ్వనాయకు వేదవేద్యు
దక్షిసి వాత్సల్య మంది పామరత గదుగ
వలపుచినుకులజడివానకొలుపుఁ జొచ్చి
చలిపిడుఁగుతాకిడిభరింపఁ దలఁచి కుబ్జ. 124

సీ. తొలినాటిజిలిబిలిచూపులలోనె
ప్రాణేశ్వరుం డనుభ్రాంతి నెగడె
నొంటివక్రతఁ బాపు కొంటెచూపులయందుఁ
బ్రాణమే నీ వనుభ్రమ దలిర్చె

వలపులరస మూర్చి పలుకరించెడునప్డు
ప్రాణాధికుండ వన్న ప్రణయ మొప్పఁ
జేపట్టి శయ్యకుఁ జేర్చినప్పుడు ప్రాణ
మునకుఁ బ్రాణమ వని మనసు పండె

తే. వలపు తలమున్క లై పొంగి వెలికిఁ బాఱు
నిప్పు డేమనవలెనొ యూహింపలేదు
మారసుకుమార మంగళాకార ధీర
మేరుగంభీర నందకుమార కృష్ణ!

సీ. శ్రీరమాహృదయరాజీవబంధుఁడ వని
భక్తి నర్చింతునా పరమ పురుష!
మన్మథప్రాజ్యసామ్రాజ్యపూజ్యుఁడ వని
దాసినై కొల్తునా ధర్మమూర్తి!
నిస్తులానందవార్నిధి నోలలాడించు
ప్రభుఁ డని యెంతునా ప్రాణనాథ!
మూర్తిభవించినమోహదేవత వని
హృదయ మర్పింతునా మదనమూర్తి!

తే. నన్ను మన్నించి జన్మము చెన్నుఁ డేలుఁ
కున్న స్వర్గీయసౌఖ్యము నొసఁగి మరల
నించి లాలించి పాలించునేత వంచు
లీననై పోదునేమి నీలోనఁ గృష్ణ!

సీ. కడుగుదునా పాదకంజము లానంద
బాష్పతోయంబులు పదిలపఱచి
పూజింతునా మనఃపుటము నిండినప్రేమ
పారిజాతప్రసవముల నుంచి
కై సేతునా నిన్నుఁ గందర్పసుందర
మందస్మితమ్ములమాల వేసి
మానింతునా సుధామధురాధరం బిచ్చి
భక్త్యంతరంగ మర్పణముఁ జేసి

తే. నిమురఁ బుత్తున శృంగారహృదయపీమ
ఫూలతోలను లాలించి జోల పాడి
ప్రణయసుందర యేక్రియల్ పగఁగ జేసి
తృప్తి గందును జెందుదు దివ్యపదము. 128

చ. అని తమి దీర వాకొనుచు నచ్యుతు నర్చనఁ జేసి కుబ్జ కృ
ష్ణునిమృదువక్షమందునను సొం పెసలార నొఱంగి యంశుకం
బున మెలమెల్లగా విసరి ఫుల్లసరోజవిశాలచోరులో
చనవరోచు లొప్ప సరసంబుగఁ జూచి నివాళు లిచ్చెడున్. 129

చ. విని హరి కృష్ణుఁ డవ్వేలఁది వేడుక దీరెడునట్లు లొప్పుగా
ననునయవాక్యము ల్పలికి యవ్వలికార్య మొనర్ప నెంచి చ
య్యన విరిపాన్పు డిగ్గి సతియానతి వేడి పరిక్రమింప న
వ్వనిత వితాకుతాకున నివారితబాష్పవిలీననేత్ర యై. 130

చ. మనసిజరూపచారుసుకుమార మనోహర మేరుధీర నీ
ప్రణయిని నాదు నమ్మికొనిప్రాణము లిచ్చుచునుందు నెన్నఁడుఁన్
విని కని చెంది యుండనిత్రివిష్టపసౌఖ్యముఁ కూర్చి యింతలో
నను విడిపోదువా కపట నాటక మాడుదువా మనోహరా! 131

చ. నిను నెడఁబాయనోపఁ గరుణింపుము కొన్నిదినంబు లిట్టులే
మనసు రహించునట్లు నను మన్ననఁ జేయు మటంచు వేడుకా
మిని మతిఁ ద్రిప్పి తప్పుకొని మిత్రుని నుద్ధవుఁ గూడి యొయ్యనా
జనె నిజమందిరంబునకు శౌరి జగత్పరిపాలశీలి యై. 132

— * శ్రీకృష్ణుఁడక్రూరగృహంబున కరుగుట * —

వ. అంత నొక్కనాఁట ముకుందుం డక్రూరునకుం జెప్పినవచనంబుఁ దలంచి యుద్ధవబలరాములతోడంగూడి యక్రూరగృహంబున కరిగె నప్పుడు.

మ. పరమాహ్లాదముఁ జెంది దాశపతి సంభావ్యానురాగంబుతో
హరినిన్ రాముని భద్రపీఠములపై నాసీనులం జేసి త
చ్చరణాబ్జంబులు శుభ్రనీరములఁ బ్రక్షాళించి శేషాంబువుల్
శిరమం దొప్పుగఁ దాల్చి భక్తియుతుఁ డై సేవించి యాపిమ్మటన్.

మ. ఘనభూషాంబరగంధ మాల్యముల శృంగారంబు గావించి తీ
యనివాక్యంబుల నింపునింపి హరి పాదాంభోజయుగ్మంబు నొ
య్యన నూరుస్థలి నిల్పి యొత్తుచును బ్రహ్మానందవారాశిలో
మునుకల్ వేయుచు నీక్రియంబలికె నాపుణ్యాత్ముఁడవ్వారితోన్.

చ. పరమపవిత్రులార కులవర్ధనులార దురాత్ముఁడైన భూ
వరుఁ డగుకంసరాజు పరివారముతోడ నశించె ధారుణీ
భరము తలంగిపోయె యదువంశము నిర్మలమయ్యె యాదవుల్
నిరవధికప్రమోదమున నేఁడు చరింతురు నిర్భయంబుగన్. 136

ఉ. మీరు ప్రధానపూరుషులు మేదినిభారము దీర్ప నిట్లుగాఁ
గారణజన్మ మెత్తితిరి కర్తలు భర్తలు హర్త లీరె సం
సారనిమగ్నమానవులఁ జక్కఁగఁ దీరముఁ జేరవేయగాఁ
గోరెడుపుణ్యమూర్తులు నకుంఠితవీర్యులు దైత్యమర్దనా. 137

గీ. నివురు గప్పిన నిప్పుగా నెగడునిన్ను
నీమహత్త్వము గమనింప నేరనట్టి
కంసభూనాథుఁడు తనంత గట్టుత్రాళ్లు
తానె కొనితెచ్చుకొనె బద్ధుఁడై నశించె. 138

గీ. కొండయున్నతికి శతఘ్నిగోళ మెంత
పిండిపిండి యొనర్పదే ప్రేలినంత
యగ్నికణమేకదా దుర్గమాటవులను
గాల్చి బూది యొనర్చి పోకార్పఁగలుగు. 139

గీ. భౌతికశరీరములకుఁ బ్రపంచములకు
మూలకారణ మౌపంచభూతములును
స్థితినిఁ బట్టి రూపము వేఱు జెందునట్లు
నిఖిలమున జీవసంజ్ఞతో నెగడు దీవు. 140

మ. నిను సేవించెడువారివాంఛితములం జేకూర్చు సోల్లాసి వై
నిను నీ వర్పణఁజేసికొందువు దయన్ నీవంటి సత్పూజ్య స
జ్జనపాలున్ ఋతవాక్యునిన్ విబుధరత్నోదత్తు సేవింపఁగాఁ
మనమం దెంచనివాఁడు సంసృతిఝరిన్ మగ్నుం డగున్ దుష్టుఁడై.

గీ. ఎన్ని యత్నము లొనరించె నెంత సేసె
నన్ని యేమయ్యెనో హతమారెనతఁడు
నీటిపై వ్రాఁత కంసునిపోటుచేత
నిలిచినది లేదు చేసినఫలము లేదు. 142

గీ. ఆతఁడు గజాయుతబలుండె యౌనుగాక
విజితలోకత్రయీవీర్యవిదుఁడె గాక
సర్వసర్వంసహాతలచక్రవర్తి
తోడ నీడగునా? తేటిపూఁడ నగున. 143

గీ. ఎన్ని రీతులనో వచియించినాఁడ
నన్నియును బూదిలోఁ బోయు నాజ్యమయ్యె
తప్పులొప్పులుగాఁ జేయఁ దలఁచు నతఁడు
జిడ్డుకడుగఁగ మడ్డితోఁ జేసినట్లు. 144

గీ. జగములకు సేమ మొనరింపఁ జలిపినట్టి
వేదమార్గము బాధించు విమతబలుల
వితతపాషండుల వధించి విదితధర్మ
ములను నిల్పెదు సాత్త్వికమ్మును భరించి. 145

శా. ఏ నీదేహము దేవభూత పితృధాత్రీత్యాది రూపంబునా
యే నీపాదజలంబుచే జగము లెంతేఁ బూతమౌచుండునో
యా నీయూర్జితపుణ్యవంత వరపాదాబ్జంబులన్ నాగృహ
స్థానంబందున నిల్పినాఁడవు పవిత్రం బయ్యె సర్వంబునున్. 146

మ. అమరేంద్రాజ పురారిముఖ్యులకుఁ బ్రాప్యంబైన నీదర్శనం
బమరెం జన్మము సార్థకం బయి మహాత్మా శృంఖలాప్రాయమౌ
భ్రమయుం బుత్ర కళత్ర మిత్ర గృహసౌభాగ్యాను రాగక్రియా
మమకారంబులు మాసె ధన్యతముఁడన్ మానాథ నేనింతటన్. 147

గీ. అని యనేకవిధంబుల మనసు పండి
పలుకునక్రూరు వదనముఁ బాఱఁజూచి
నవనవోన్మేషణం బగు నగుమొగంబు
వెలయ భాషించెఁ గృష్ణుఁడు వేడ్క నిట్లు. 148

గీ. గురుఁడవు పితృవ్యుఁడవు నాప్తవరుఁడ వీవు
మీరు రక్షించి పోషించు భూరిదయను
బాత్రులౌ పుత్రులము మేము ప్రాకృతముగఁ
మమ్ము నగ్గింపవచ్చునా మహితు లీరు. 149

ఉ. శ్రేయము లెప్డు సాధుజనసేవలచే సులభప్రయోజన
ప్రాయముగా దలిర్చు భగవంతునిపైఁ గలభక్తి సంతతా
మ్నాయవిశుద్ధి తీర్థజలమజ్జనరక్తి యివన్ని యెన్నఁడో
యేయవసానమందో ఫలియించును ద్రుంచును మోహపాశమున్.

గీ. అరయ సంసార విషవృక్షమందు నమృత
తుల్య మౌఫలములు రెండు దోఁచుచుండు
భాగవతభక్తి మొదటిది ప్రభునిభక్తి
రెండవది యంతరము లిట్టు లుండు ననఘ. 151

గీ. సాధుభక్తి సద్యఃకాలసౌఖ్యద మగు
దైవభక్తి కాలాంతర భావరక్తి
నన్ను మన్నించువారలకన్న మున్న
భక్తులను గొలుచువారికి ఫలము మిన్న. 152

గీ. ఉదకమయము లై కైవల్య మొసఁగునట్టి
వారణాసీ ప్రయాగాది భవ్యతీర్థ
ములును మృచ్ఛిలావిగ్రహములును పూర్ణ
ఫలదములెకాని బహుకాల పక్వములవి. 153

గీ. దేవతలు స్వార్థవిధుల వర్తింతురేమొ
భాగవతులుపరార్థమై పాటుపడుచు
దర్శనము చేతనే ముక్తి దార్చుచుంద్రు
సాధుసేవయె శ్రేష్ఠము జగతియందు. 154

— శ్రీకృష్ణుఁడక్రూరుని హస్తిన కనుపుట —

మ. అనఘా దాశపతీ! మహాత్ముఁడవు మా కత్యంతముం గూర్చు స
ద్గుణవారాశివి నాప్తబంధుఁడవు సాంగోపాంగవిద్యావిశే
షనిగూఢార్థము లాకలించుకొనువిజ్ఞానస్వరూపుండ వం
గున ని న్నొక్కటి వేఁడవచ్చితిని బంధుప్రీతి గావింపఁగన్. 155

మ. మనచుట్టంబులు పాండునందనులు కర్మాధీనులై కూర్మితం
డ్రిని గోల్పోయియుఁ దల్లితోడుత మహార్తిం జెంది పెత్తండ్రియా
జ్ఞను పాలించుచు హస్తినాపురములోనం గాపురం బున్నవా
రని వింటిన్ దయచేసి నీ వరిగి క్షేమార్థంబులం జూడుమీ. 156

ఆ.వె. పుట్టుగ్రుడ్డి యైన భూపతి ధృతరాష్ట్రుఁ
డాత్మజులకు నోడి యార్తు లైన
తమ్మునిసుతులందు దయ దప్పె నని విందు
నెంతవఱకు నిజమొ యఱిఁగిరమ్ము 157

గీ. ఏ నెఱుఁగుదుఁ బూజ్యు లౌ మేన బావ
మఱదులను వారు కేవలమానధనులు
పుణ్యు లుత్తమమాత పూజ్యపూజ్యురాలు
గొంతిదేవియు గుణములఁ దొంతి యగును. 158

మ. మనకర్తవ్యము పూజ్యవర్తనుల సన్మానించి రక్షించుటే
కనుక న్నీవు విభు డేగి తత్క్షణమె కింకర్తవ్యతామూఢులై
ననఁట లొంచెడుపాండుపుత్త్రకుల సంప్రశ్నించి తత్తత్ప్రవ
ర్తనముల్ సూచి ధృతిం దగం గొలిపి యోదార్పంగ న్వార్థంబుగన్.

ఉ. నీ వెఱిఁగించునట్టివిధి నీతివిధానముఁ బట్టి నేనునుం
బోవుట పాకపావుటలుఁ బోలెడు దుష్టసుయోధనుండు దు
ర్భావుఁడు వానితండ్రి ధృతరాష్ట్రుఁడు పేరుకు రాజు వారిచే
బావలు దీను లౌ నెడలఁ బాపెద నాఁగెద దుర్విలాసముల్. 160

చ. అని వచియించి దాశపతి సౌననిపించి మహార్హసత్కృతుల్
గని యనుజన్ముతోఁ గలిసి కమ్మనివిందుల నారగించియుం
జనె నిజమందిరంబునకు శౌరి మహాత్ముల కెట్టియాపదల్
మొనసిన దైవమే కద ప్రపూర్ణకటాక్షముఁ జూపి ప్రోచెడున్. 161

ఉ. అంత శ్వఫల్కునాత్మభవుఁ డైనమహాత్ముఁడు దాశరాజు శ్రీ
శాంతనునియాజ్ఞ దీర్చుటకు గౌరవపీఠియశోంకితంబునై
వింతలకాకరం బగుచు పవిత్రము నై విభవాఢ్య మైన యా
సంతిపురంబుఁ జేరఁ జనె ధర్మవిచక్షణ సేయునిచ్ఛమై. 162

సీ. కులవృద్ధు భీష్ముని గురుపతి ధృతరాష్ట్రు
విభుని విజ్ఞుని యావిదురవర్యు
భగినిఁ గుంతీదేవి బాహ్లికున్ సోమద
త్తుని గురు ద్రోణుఁ దత్తనయు ద్రౌణి
ఘనుఁ గృపాచార్యునిఁ గర్ణదుర్యోధన
దుశ్శాసనాది చతుష్టయమును
ధర్మజ భీమ పార్థ నకుల సహదేవ
నామవిలసిత పాండవకుమార

తే. పంచకము స్నేహితులను బంధువర్గమెల్లఁ
గాంచి గౌరవముం బొంది గౌరవించి
క్షేమలాభము లడిగియుఁ జెప్పి యుచిత
రీతి నక్రూరుఁ డటఁ బ్రవర్తించి మించె. 163

గీ. పరమదుర్మార్గులైననూర్వురుకుమారు
లంతరంగాంధమునకు నేత్రాంధతయును
గలిసి కర్ణాదిదుష్టులకానిమతము
ననుసరించెడుధృతరాష్ట్రుమనసు నెఱుఁగ. 164

గీ. కొన్నిమాసము లచట నక్రూరుఁ డుండి
తమ్మునికుమారులందు నంధప్రభుండు
కౌరవశతంబుఁ జూపెడుగారవంబు
నిశితదృష్టి విమర్శించె నియతుఁ డగుచు. 165

ఉ. ఆయుధము ల్ధరించు నెడ నశ్వము లెక్కెడునప్పుడున్ సహా
ధ్యాయులతోడ వస్త్రవిషయప్రతివాదము లాడువేళలం
దాయువుపట్టుమంత్రపరనాదులయందుఁ గుశాగ్రబుద్ధులై
ధీయుతు లౌచుఁ బాండవులు దివ్యయశంబును గాంత్రునిత్యముల్.

మ. ధనురాచార్యుఁడు ద్రోణసద్గురుని శ్రద్ధాభక్తులం గొల్చి యా
తనికిన్ మెప్పు దలిర్చుశిష్యు లయి శస్త్రాస్త్రప్రయోగాది స
ర్వనిగూఢార్థము లొప్ప నేర్చుకొని కౌరవ్యాళికన్నన్ మహా
ఘను లన్ ఖ్యాతి వహింత్రు పాండుతనయుల్ కాండప్రయోగంబునన్

చ. విసములు పెట్టి చంపఁ దలపెట్టిరి కట్టియు నీటఁ ద్రోయఁగా
నసమువహించినారు హతమార్పఁ దలంచిరి యగ్నిఁ గాల్పగా
గసి గొనుచుండ్రు పన్నగముఖంబునఁ ద్రోయఁ గడంగుచుండ్రు వె
క్కసపడి కౌరవాధములు గాదిలిబంధులఁ బాండుపుత్రులన్. 167

గీ. వారివారి చేష్టితము లక్రూరవిభుఁడు
నిశితదృష్టినిఁ బరికించి నిశ్చయించి
తెలిసికొని పాండుపుత్రుల దీనతయును
నంధధృతరాష్ట్రమత్సర మరసి యెంచి. 160

గీ. విదురమందిరమున కేగి విషయ మడుగ
వినతుఁడై తెల్పెఁ బూస గుచ్చినవిధాన
జరుగుచున్నట్టియక్రమచరితములకు
వేఁడికన్నీరు బొటబొట వెడలుచుండ 170

ఉ. అని విధాలఁ గౌరవులకన్న బలాధికు లాప్తకీర్తిసం
పన్నులు పాండవేయులు కృపారహితాత్ములు కౌరవుల్ గడుం
బన్నము లెన్నొ కూర్చి పలుభంగులఁ గోతురు చేదుకాయలం
గన్నకుమారులందె మమకారముఁ జూపెడు నంధరాజునున్. 171

క. అని విదురుఁడు వచియించిన
విని కటకట పడుచు దుఃఖవివశుం డగుచున్
జని యక్రూరుఁడు గొంతిని
గని యేకాంతమునఁ బ్రశ్న గావించుటయున్. 172

క. .కన్నుల నీరము దొఱలఁగ
నన్నా! యని పిల్చి దుఃఖ మాఁగక తమిచే
మిన్నులు ముట్టఁ గలంగుచు
ఖిన్నత్వము నంది కొంత క్లేశము తొలఁగన్. 173

క. అన్నా వదినల కిప్పటి
కన్నన్ బన్నములు తొలఁగి యానందముతో
నున్నారా కన్నయ్యలఁ
గన్నులతోఁ గాంచుకొనెడుకలిమి గలిగియున్. 174

ఉ. అన్నివిధంబులం జెడితినయ్య కుమారుల నప్పగించియున్
నన్ను ననాథఁ జేసి నరనాథుఁడు స్వర్గముఁ జేరె భర్తతోఁ
జన్నది మాద్రి పృథ్విపయిఁ జావక నిల్చితి నొక్కదాన నా
యన్నలు ముద్దుబిడ్డలకునై భర మోర్చి చరింతు సోదరా! 175

శా. ఆపుణ్యాత్ముఁడు పోయినంత మము నాహ్వానించె నీఱేఁడు నా
కేపారంబును గానరాక వెడఁగై యేతెంచినా నిప్పుడి
కూపారంబున దూరియుంటిఁ గడునగ్గు ల్సేయుచు న్నారల
న్నా? పాపిష్ఠసుయోధనాదు లిట నీయల్లుండ్రకెప్పట్టునన్. 176

ఉ. కన్నులు విప్పలేని కసుగాయలు రెక్కలురాని వార లే
యన్నముఁ బున్నముం దెలియనట్టి యమాయికు లెట్టికుట్రలో
యన్న యనేక కష్టముల కాహుతియై పడరానిపాటు లె
న్నెన్నొ భరింత్రు దుష్టుఁ డయి యేర్చుసుయోధను కారణంబునన్.

ఉ తమ్మునిబిడ్డ లంచు దయఁ దాల్పఁడు రాజు కుమారు లెట్టి కృ
త్యములుఁ జేయుచున్న బదులాడఁడు కీడెడఁ జేయఁబోఁడు శు
భ్రమ్ముగ వాడు వాడినది పాటయు నాడిన చాట యయ్యె మే
మెమ్మొగి జీవయాత్రఁ దరియించెదమో తలపోయు మగ్రజా. 178

ఉ. ఎన్నని చెప్పికొందు భృతిహీనపుజీవిత మయ్యె నయ్యయో
నన్నములో విషం బిడిరి యగ్గిని ద్రోయఁ దలంచి చేతసా
నన్నిదురాక్రమంబులకు నఱ్ఱులు సాచిరి యిన్ని చేసినం
బన్నగశాయి పాపలకుఁ బ్రాపయి ప్రోచెడు నేఁటిదాఁకనున్. 179

క. పామున్న యింటిలో వలె
మే ముండెద మిచట భీతి మేకొని యున్నా
మే మై పోదుము మాగతు
లేమో యేగడియ కేని గాట్లు కలుగునో! 180

గీ. అనుచుఁ గన్నీరు మున్నీరు మైనకరణిఁ
దలరుచుండునభాగ్యసోదరిని గాంచి
నంచితమ్ముగ లాలించి యనునయములఁ
జెప్పి యక్రూరుఁ డార్తిఁ గుదింపఁజేసె. 181

శా. కుంతీదేవి యొకింత శాంతి గని యక్రూరు న్విలోకించి ధీ
మంతుం డీవు సహోదరా! యనుజ నమ్మానింప విచ్చేసినా
వింతే చాలును నేఁటి కైన దయ నీ కిట్లయ్యె నద్దానికే
సంతోషించెద క్షేమమే కద సమస్తప్రాజ్ఞ లౌ బాంధవుల్. 171

శా. ఎన్నాళ్లైనదొ నేను వారిఁ గని నేనాఁటికిం గాంచనా
పున్నెం బుండ దటంచు నేడ్చితిని నాపుట్టింటి దీపంబు నె
న్నెన్నో బాధలు పెట్టి కట్టిడినృపుం డేడ్పించు నన్నాళ్ళనుం
బన్నం బీఁగినసాధువార్త విని తాపం బారె నక్రూరుఁడా! 172

గీ. ధాత్రిఁ బోలుక మాగుణధన్యురాలు
మావదినె దేవకీదేవి మానవపతి
కఱకుఖడ్గముచేఁ గన్నపురిటివారిఁ
గఱకఱం గోయ నేరీతిఁ గాంచె నొక్కొ. 172

ఉ. ఆతతవిక్రమక్రముల నల్లురఁ గూరిచి లోకవిశ్రుత
ఖ్యాతిని శ్రోత్రపర్వముగ నప్పుడు నప్పుడు వింటిఁగాని యు
ద్భూత చరిత్రులం గనెడుపున్నెము కల్గదు నేఁటిదాఁక నా
వ్రాఁతఫలంబు మమ్ము నెడఁబాపెఁ బురాకృతపాపరూపమై. 174

ఉ. పుట్టిననాఁడె యెత్తుకొనిపోయి కుమారుల నన్యుచేతులం
బెట్టెడుప్రాప్త మయ్యె కని పెంచి సుఖించెడుకన్నవారికే
కట్టిడిబ్రహ్మ యిట్టికొఱగాములు బాములు తెచ్చిపెట్టి వా
కట్టులు గట్టియుండ నిఁకఁ గాఁగలవారము చేయ నేమి యహా. 175

మ. మనలో నెవ్వరిపోల్కెనో వదినవా? మాయన్నవా? యుగ్రసే
నునివా? యవ్వవ? నిన నావ? యెటు లున్నో! బాలకృష్ణుండు రా
ముని నెట్లెనొకో! మేనిచాయ లెటు లొప్పున్ సోదరా! వారి లో
చనపర్వంబుగఁ జూడఁగోరెద మనస్తత్త్వంబు నిత్యంబుగాన్. 176

గీ. నిన్న మొన్నటిదాఁకను బన్నములను
బడిరి వసుదేవదేవకు ల్వారిఁ జూడ
వీలుపడఁ దయ్యె మందలో బాలు రుండి
నాకతే వెలిఁగుచు విఁ ట్లెల్ల చూడఁగనుట. 177

శా. బాలప్రాయము దీరిపోనిపసిపాపం డౌఁ గదా కృష్ణుఁ డే
ట్లాలోకోత్తరవీరకేసరిని సంహారంబు గావించెనో
కాలుం గాలును జేయి చేయి దునుక ల్గావించి మర్దించెనా ?
కాలాగ్నిం బడ నీడ్చి మాడ్చెన శిఖన్ దండించి దండించెనా? 178

ఉ. బక్కకయంగముం దఱిగి యొత్తుగఁ గారము మెత్తి దేహముం
జెక్కలు దీసి బాడిసను జెక్కచు గ్రుక్కియున్నచోఁ
జక్కనిసారమా నతఁడు సల్పినపాపము లొక్కటొక్క పే
లెక్కకు వచ్చి వానిఁ గబళింపఁ గలం గెడుఁ జచ్చునప్పుడున్. 179

వ॥ అనినవిని యక్రూరుండిట్లనియె 180

శా. తల్లీ యన్ని యెఱింగి పల్కెదవు చింతల్ సౌఖ్యము ల్భాగ్యమై
చెల్లుం గాని నివారితంబు లగునా ? జీవించియు న్మేను నీ
యిల్లుం దిద్దెడుప్రాప్తిఁ గాంచ మిఁక శ్రీకృష్ణుండె మీ కండయై
జెల్లీ చెల్లనిదుష్కృతంబులను భంజించు న్నిముం బ్రోచెడిన్. 181

చ. అతఁడు త్రిలోకనాథుఁడు దయాపరిపూర్ణుఁడు కొల్చువారి సం
తతము భరించువాఁడు ఋజుధర్మలపాలిటివాఁడు సర్వదు
ర్మతుల వధించువాఁడు పరమాత్ముఁడు శ్రీహరి కృష్ణుఁ డమ్మరో!
సతతము గంటి ఱెప్పవలె సజ్జనమాన్యులఁ బ్రోచు నెప్పుడున్. 182

ఉ. అమ్మహనీయుఁ డంపినఁ బ్రమాణ మొనర్చితి వింతనట్టు మీ
యుమ్మలికంబు దీరెడు గుణోత్తరు లైనకుమారు లీవునున్
సమ్మతి నొంది యుండుఁ డిట సర్వము చెల్పెద నేను బోయి శీ
ఘ్రమ్ముగ వచ్చు వాఁడు కొఱగాములు బాములు నీస్బ నమ్మరో!

చ. జనపతి కంసరాజునకు జంకి తొలంగినవృష్ణిభోజలన్
మనకులబంధు లెల్లను మక్కువతోఁ బిలిపించి సస్తునా
హన ధనగేహభూవసతు లన్ని యొసంగి సమాదరించి తా
చినమహనీయబాంధవుఁడు శ్రీహరి కృష్ణకుమారుఁ డమ్మరో! 184

శా. నీమేనల్లుఁడు లోకబాంధవుఁడు నిన్నే గాక తన్నెవ్వఁ డే
మేమార్గంబునఁ గోరి చేరెడికొ యట్లే వాని చాత్రోష లో
క్షేమంబు ల్దయచేసి ప్రోచఁ గరుణాసింధుండు దుర్యోధనా
ద్యాయాంధ్యమ్ము నొలంగఁజేయు మాట సంధానించు ధర్మాత్మునన్.

ఉ. స్త్రీహృదయంబు తేటపడ శ్రీపతి యవ్వరిపోల్కి- యంచు స
న్నేహముతోడ నడిగెదవు చెప్పఁగనేమి త్రిలోకమోహనుం
డాహరి యామనోహరుని కాతఁడె సాటి స్వరూపవిక్రమ
వ్యాహృతులందు రాముఁడును నట్టె తలిర్పఁ బతివ్రతామణీ! 186

శా. లీలామానుషదేహధారి యగు లేలీతల్పుఁడే కృష్ణుఁ డా
వ్యాళాధీశుఁడె రామభద్రుఁడు ధరాభారంబుఁ బోకార్పఁగా
నాళీకోద్భవుఁ డాదిదేవతలవిజ్ఞప్తు ల్ప్రపాలించి యీ
భూలోకంబున దేవకీతనయుఁడై పుట్టొందినా రమ్మరో! 187

చ. అదితియె దేవకీరమణి యానకదుందుభి కశ్యపాఖ్యుఁ డా
యదుకులవర్ధనాంచితులునై జనియించిరి రామకృష్ణు లా
ప్పిదముగఁ దొల్లి విష్ణునెడ ద్వేషము చావని కాలనేమియే
మదయుతుఁడైనకంసుఁ డగు మానినిరో తగ నాలకించితే! 188

మ. యమునావేగము సంహరించె శిశువై యాపూతనం జంపె వి
క్రముఁడై బండిని బెండుఁ జేసెఁ దృణునిం గారించెఁ గంసావనీ
శుమహామంత్రుల దర్ప మార్చె ఖలులన్ శోధించె బాధించె నా
ప్పము లెల్లన్ సడలించి మించెను బరబ్రహ్మంబు తా నాటచేన్.

ఉ. ఎన్నని చెప్పవచ్చుఁ బరమేశ్వరుచిత్రము లన్ని వారికే
మన్నికగాని యల్ప మగుమానుషబుద్ధి కగోచరంబులౌఁ
బన్నగరాజు నొంచుటలుఁ బట్టపుటేనుఁగు ద్రుంచుటల్ మద
చ్ఛన్నుల మల్లవీరులను జంపుట సాధ్యమె పిన్నవారికిన్. 190

ఆ. వె. గొడుగువోలె నెత్తి గోవర్ధననగంబుఁ
బిడుగువోలె మొత్తెదుడుకుఖలులఁ
జేయనట్టిపనులుఁ జెడనట్టికుజనులు
లేరు సాధువులకు లేదు కీడు. 191

సీ. పోతపోసినంగోహపుపాత్రములటు
కాంతఁ బొడిచినఁ జావనిరాతు లేడ
లేఁతచేతలనిన్నారిపోతమేడఁ
"క్షైత్ర" మొత్తుచును జిత్తు సేయుఁ బేడ? 192

ఆ. వె. ఒడలు జలదరించు నోతల్లి నీప్రశ్న
విన్నఁ గంసమరణవిధముఁ గూర్చి
వీరపత్ని వీవు వీరమాతృత్వంబుఁ
బడయఁగలవు శుభము దొడరు నీకు. 193

తే. గీ. అయుతగజబలుఁ డైనకంసాననీసు
కఠినపాషాణసాదృశ్యకాయమందు
వడవడవడంక కున్నట్టిభాగ మొకటి
లేదు భయరాక్షసియ కబళించె వాని. 194

ఉ. కంసుఁడు కృష్ణరూపమును గాంచినతోనె ప్రకంపనోగ్రవి
ధ్వంసితవృక్షకాండము విధమ్మున నేలకొఱింగిపోయె నా
శంసల వీడి దుర్మదనృశంసులు పొందుననంత చింతలున్
హింసలుఁ జెందియే మడిసె హీననృపాలుఁ డవార్యభీతుఁడై. 195

మ. అది యేఘోరనితాంతపాపభయమో యావేశమో దుఃఖమో
మదవేదండబలుండు భండనకళామాన్యుం డఖండప్రతా
పమరాలోకుఁడు కంసరాజు బడుగై ప్రాణాలపైఁ దీపిచేఁ
బ్రిదులం బాఱెఁ గలంగెఁ దూలిపడెఁ బూరి స్మైసెఁ దారాడుచున్.

చ. బిరబిర నేగి పీఠిని గుభిల్లునఁ గూలి కలంగుచున్న యా
నరవరు కేశపాశమును నందకులాభరణంబు పట్టియున్
జరజర యీడ్చి గుంజి దిగజారిచి భూరిపరాక్రమక్రమ
స్ఫురణఁ దనర్చెఁ గంసపతి భూమిఁ బడెన్ గను మూసినంతలోన్.

శా. చెల్లీ! అల్లునిబాహువిక్రమబలోత్సేకంబుల న్వింటివా?
మల్లాధికులు డుల్లిపోయిరి మహామాతంగ మార్తాంగ మై
చెల్లెం గంసునితమ్ము లెల్ల రొకలై జేజేల వీక్షింప వె
ల్వెల్లం బాఱుచుఁ గూలినారు సుడిగాలిన్ భూజముల్ గాఁగనై.

ఉ. అన్నిటికన్న మిన్న యగునద్భుత మున్నది మున్నొకప్పుడున్
విన్నది కాదు కన్నులకు విందుగఁ గన్నది కాదు సోదరీ!
వెన్నుని చిత్రవృత్తములు వేద్యము కావు ప్రపంచభీకరుం
డన్ననృపాలుఁ గీడ్పఱచె నాత్మసకేలుఁడె స్వర్గసౌఖ్యముల్. 199

ఉ. ఎంతదయాళుఁ డో హరి యేమని చెప్పుదుఁ దల్లి! దుష్టభూ
కాంతుఁడు కంసుఁ డట్లు నిజకాయము వీడినయంతనే ప్రభా
వంతముగాఁ జెలంగి నరపాలునిశీర్షము వీడినట్టి స
త్కాంతి యొకండు తత్క్షణము కంజదళాక్షునిఁ జేరలే నమ్మె. 200

ఉ. అన్నిటి కన్నియుం దెలియనయ్యెఁగదా హరి కృష్ణుఁ డుండగా
నున్న భయంబు లేదు దురితోద్ధతు లైనసుయోధనాదు లే
పన్నగడ ల్పొనర్చినను భంగమె భీతిల కమ్మ వెంటనే
పన్నగశాయి నంపెదను బాధ లడంచు నతండు మీకునున్. 201

—* అక్రూరుఁడు ధృతరాష్ట్రునితో మాట్లాడుట *—

గీ. అని సమాశ్వాసవాక్యము లాడి గొంతి
ననునయించి యక్రూరుఁడు వెడలి యంతి
పురమునం గలధృతరాష్ట్రు దరియ నేగి
సత్కృతుం డయి కుశలము ల్సంప్రదించి. 202

ఉ. నేటికి మిమ్ముఁ గాంచుటకు నీరజనాభుననుగ్రహంబుచేఁ
బాటిలె నుత్తమోత్తముఁడు పాండునృపాలుఁడు ముద్దుకుఱ్ఱలన్
బాటలగంధిని న్విడి దినంబున కేగెను బ్రాప్తభోగ్యముల్
దాఁటఁగలేము కర్మపరతంత్రులు జీవులు మానవోత్తమా! 203

ఉ. ఎందఱు పుట్టుచుండి రిల నెందఱు చత్తురు ప్రత్యహంబుం
బెందఱు కష్టమందెద రిఁకెందఱు సౌఖ్యముఁ జెందుచుంద్రు వీ
రిందఱు గాంచుచుండియును నెందుల కీవ్యతిరేక మార్గము
ల్చెందెదమో యటన్నమతిఁ జెందరు జీవులు మానవోత్తమా! 204

మ. తన కారోగ్యమునుం జిరాయు వనుచందంబై దురాశాహతిం
దనతో సర్వసమానతల్ గలుగుభూతవ్రాతముం బ్రేమతోఁ
గనఁబో రన్యుల యున్నతు ల్వినఁ దహంకారంబు ప్రేరేప సా
ధనసంపత్తులతోడ సిద్ధు లయి చిత్తభ్రాంతులై దుర్మతుల్. 205

చ. పరిమితసత్త్వ విశ్వపృథివిఁ బ్రాణులనేకులు పుట్టుఁ గ్రందుటల్
మరణముఁ జెందుట ల్విధి నియంత్రితధర్మము స్వార్థజీవు లో
క్కొ-రికొఱకే సృజింపఁబడి కార్యము దీర్చెదు సర్వజీవులుం
బొఱసి తదీయకర్మఫలముల్గొనఁ గాంచెదమోరు భూవరా! 206

ఉ. నాలుగునాళ్ళ నాటకము నశ్వరమైన ప్రపంచరంగమున్
దేలవలేశమో సుగుణ మెంచి చరించుట లెస్స యందుకున్
గోలని హేయజీవితము భూభర మయ్యెడు శాశ్వతంబుగా
నోలము నుట్టి గట్టుకొని యూగెడువారలు లేరు భూవరా! 214

ఉ. ఎందఱు పుట్టి రీజగతి నెట్టిమహాక్రియ లాచరించి శే
చందము నంది రాజ్యములు స్థాపనఁ జేసిరి పుచ్చునక్క యుం
గొందెరో వెంటఁ గట్టుకొని పోయిరొ వెంబడి మంచిచెడ్డ లే
చెందునుగాక మానవునిఁ జెంద నవేమియుఁ జచ్చునప్పుడున్ 215

శా. బాబా యింతయుఁ జెప్పవచ్చినది యీపాపిష్ఠభోజేంద్రుడు
ద్వ్యాపంబుల్ పరిణామముసె ఖలుఁడు నై బాధించి బాధించి కో
పావేశంబున లోకకంటకుఁడు నై పాలించెఁ గొన్నాళ్ళు పూ
ర్ణావం బీగి శశించెఁ గృష్ణవిభుఁడే వానిన్ వధించెంజుమా! 216

శా. ఏగో మాటలఘోరణిం బలికితే నీ విస్తృథా యెంచఁగా
రాదయ్యా ధృతరాష్ట్రభూరమణ ధర్మాధర్మరీతుల్ నయ
ప్రామర్శానములుం దదీయఫలముల్ భాషించినా నింతగా
నే దెల్పిన రమేశుఁడే కలఁడు నా కేలా వృథాలాపముల్. 217

ఉ. ప్రాజ్ఞుఁడ నీవు లోకపరిపాటికిఁ జాటిరి నట్టిమాటలన్
విజ్ఞత సర్వపూర్ణ మయి విస్తృతమాట లెఱింగియుందు వ
ల్పజ్ఞులకైనఁ దెల్పనగు నన్నివిధాల నఖండ శేముషీ
ప్రజ్ఞఁ గలట్టినీయెదుటఁ బల్కుట చుల్కన మాట గాదొకో! 218

చ. పకుకులభూషణా యనుజుఁ గోల్పడి యంతట రాజ్యకర్తవై
ధరణిని నేలుచుంటివిక దా యిది ధర్మమొ కాదొ యేదొ నీ
వెఱుఁగకపోవు పెద్ద వయి యేలెదుగాక ప్రజానురంజక
స్థిరమతి వౌచుఁ బాలనముఁ జేయుట లెస్స యశఃప్రదం బగున్.

మ. ప్రజలే రాజ్యము రాజ్యమే ప్రజలు సంబంధమ్ము లీరీతి వి
శ్వజనీనానుమతంబు నై వెలయు ప్రాజాపత్య మాసించు నే
నృజనుండైన గ్రహింపఁబోలెనని ప్రాజ్ఞుల్ మెచ్చ రాజ్యంబుఁ బూ
ని జనానందకరంబుగా మనుము భూరా నీధర్మ మురీశ్వరా! 220

ఉ. బంధుగులందు సర్వసమభావము నంది చరింతువేని యా
నందముఁ జెందుఁ గీర్తియుఁ దనంత వరించును ద్వేషబుద్ధి నో
చందమునం బ్రవర్తిలిన సర్వవిషంబునకన్న మిన్నయై
కుందు ఘటించు జీవితముఁ గూలఁగఁ ద్రోయును రోయు లోకమున్.

ఉ. తమ్ముని బిడ్డలందుఁ దయఁ దాల్చుము కన్నకుమారులట్లుగా
సమ్మతి చూపుచుండు మవిచారకుమారశతంబు దుష్టమా
ర్గమ్ములు గ్రమ్మరింపుము ధరాసతిఁ బోలిన గొంతిదేవి తా
పమ్మును దీర్పుమయ్య కురువంశయశంబు సతంబు నిల్వఁగన్. 222

శా. ఏవో కొన్ని దురాగతక్రియలు గావింపం బ్రయత్నించుదు
ర్భావం బందె సుయోధనుం డనెడు దుర్వార్త ల్వినన్వచ్చె న
య్యావేగంబును దీర్పు మింతటనె మొక్కై సంగమున్నంత ప్రమా
దై వంగన్ సరిపోలునా కురుపతీ న్యాయంబుఁ బాలింపుమా! 223

ఉ. బాలురచాపలక్రియలు పాలకుఁ డెప్పటి కప్డు దిద్దుచుం
జాలిన ధర్మబోధనము సల్పకయున్నఁ జికిత్స లేనియా
భీలరుజాభిధానమున వృద్ధి యగున్ దలమీఱు నే ప్రయో
గాలకు లొంగిరాదు కలకాలవిషానలసామ్య మయ్యెడున్ 224

ఉ. చిన్నలు వీరు నాఁగు పెరభీతులఁ గాసగు చాపలంబుచే
నెన్నొ యనర్థము ల్సలుప నెంతురు పెద్దలు వాని నన్నిటిం
జిన్నతనంబునందె సరి సేయుట మే లగునయ్య రాజ! రో
మన్నఁ బ్రయోజనంబు గన మంతకు నంతకు రెచ్చిపోవుచోన్. 225

ఉ. చర్వితచర్వణంబు లిఁకఁ జాలును జెప్పనదేమి బావ యే
పర్వము పుచ్చినం దెఱకపాలకె చెప్పఁదనంబు పుట్టుటల్
సర్వవిధాలఁ దుల్యముగ నాఁకలిచా యుశ పూను గానిచోఁ
బర్విడుదుర్యశంబు పెరవారలు కారు కుమారపాండవుల్. 226

సీ. పోయి వచ్చెద నో బావ! పుత్రులందు
సర్వసమధికారముగ జనుఁడ వౌట
నింతఁ జెప్పితి నాలోఁచింతు నటకుఁ
దప్పు [illegible] తెలుగాఁ దలఁపవలదు. 227

ఉ. కురుకులవంశగౌరవము గోరెడువారలు గాననే దయా
పరు లయి రామకృష్ణు లిటు పంపిరి నన్ను హితంబు దెల్ప నే
నెఱిఁగినయంత దెల్పితి నిఁ కిందు నవాచ్య మెదేని బిట్టుగాఁ
గొలిచినచో క్షమింపఁదగు దొడ్డమతిం గొనఁబోలు భూపకా! 228

చ. అని విని రోషభీషణుఁడు నై చెలరేఁగియుఁ గృష్ణభీతిచే
మన మురిమాడుచుండ నొకమాటయు మాఱు వచింపఁబోక కిం
చనుఁ డయి కొంత తాళి నిరసప్రతిభాషలభూషణంబులన్
మనసునఁ దాఁకి వచ్చినటు మంచితనాన వచించె భూపుఁడున్. 229

ఉ. ఈవు వచించినట్టిపరమేశ్వరుఁడే తగినంతబుద్ధి చి
త్తావరణమ్ములో నిలిపె ధర్మ మధర్మము నేర్పరించుని
ద్యావిషయంబులం దయిన నంతయొ యింతయొ లేకపోవ దీ
భావము లేడ నేర్చితివొ బాల ప్రమాదవినోదమేయగున్. 230

ఉ. ధర్ముఁడు ధర్మరాజగునొ తత్పరసోదరు లాకవల్గగా?
యర్మిలిరాజసోదరులియట్టిడు నర్జునుఁ డేమొ? వహ్నిగా
ధర్మసితోడునీడ యగుతమ్ముఁడు భీముఁడు కాఁడొ యేఁటికీ
మర్మవిధానము ల్దగినమాటలఁ జేటు వచింపరాదొకో 231

శా. ఔరా! యెన్నివిధాలఁ బల్కితివి నీయర్థాంతరన్యాసముల్
సారాసారవినోదశోభనపతిభాషల్ ఘోషణోద్ఘోషముల్
కారాగారపుమాటతీరులును నేఁగ్రామీణుతో నైన నెం
తో రాద్ధాంతముఁ జేయఁగల్గెడివి నాతోఁ జెల్లునా భూపకా! 232

ఉ. ధీనరుఁ డెవ్వఁడేని నిజదీధితి సత్యపదార్థవిజ్ఞతం
భావనఁ జేసియే పలుకుఁ బల్కుఁడు నీవలె నోలి లాహిరీ
భావనిసర్గచంచలవిభావరసోక్తులు పల్కుచో నహం
భావహరాననూనపరభావము సేవన మాట నెంచెడిన్. 233

శా. ఏలా గద్దరిహద్దు దిద్దెదవు నీకే కాని కౌంతేయులం
దే గాఁ న్యనుగతానుకూల్యవిధు లేవీ మాకు లేవేమొ కా
దా శిష్యాసహులు నేఁటి కూడిపడెనయ్యా మీకు విన్నాళ్ళవే
మూలం గాలములం దడంగినవొ? గుంపు ల్గాఁడె విస్ఫుట్టునన్. 234

మ. ఇఁక రాజ్యంబును గూర్చి తెల్పెదను నాకే లేనియూహాస్క మా
మకసౌదర్యున కెట్లువచ్చు నరె సామ్రాజ్యంబుఁ బాలించు నా
యకుఁ డై వచ్చినవానిపుత్త్రకులె రాజ్యార్హు లగ్రాయందు వే
మొ? కుమారు లగువార లైనపుడెగా మోజు ల్విలోకించుటల్. 242

మ. ధరణీపాలుర కైన నివ్విషయసందర్భంబు లర్థం బగున్
గురువంశాగ్రణి నయ్యు నంధుఁడను నాకోసంబె నాతమ్ముఁడీ
ధరణిన్ బాలన సేయఁగాఁ దొడఁగెఁ బ్రత్యామ్నాయధర్మంబునన్
జరమానస్థుఁ జెందె నాతఁ డిఁక నాసత్త్వంబు నెవ్వారిదా? 243

క. తెలపియుఁ దెలియనిపల్కులు
పలికిన ఫల మేమి కృష్ణ ప్రశ్నించినచోఁ
దెలియును గూలంకషముగ
నులికిపడిపఁ దీరునొక్కొ యుద్యోగంబుల్. 244

తే. గీ. అయిన నొక్కమాట నాడెద నక్రూర
సగము తెలివి నలన సుగము కలదె
తెలిసి పలుకవలయుఁ దెలియనిచో నోరు
దెఱవరాదు బుద్ధి గఱపరాదు. 245

శా. అక్రూరా! యిటు లాడినా నని మనోవ్యాలోలత న్నెన్నుమీ!
ప్రక్రాంతార్థము లెన్నఁడేని యిటులే బాధించుఁ గౌంతేయులం
దేక్రౌర్యంబును లేనినన్నును గడున్ హీనాతిహీనంబుగా
నాక్రోశించుట సంతచే టగు నిదే న్యాయంబొ యూహింపుమా.

శా. నీవాక్యమ్ములలో విశేషములు విన్పించెన్ శ్రవఃపర్వమై
యేవో స్పష్టముకావు గాని మెఱప ల్లెల్లెఁగెనో మాయమై
బావా తప్పఁదలంతువేమొ విను మేప్రారబ్ధకర్మంబొ కా
నీ వాత్సల్య మనంత మూ సుతులపై నే దెల్లు వాటిల్లినన్. 247

మ. ఎవ రేరీతి నపోహలం గనిన నాయీమేనితోఁ బుత్త్రబాం
ధవవైముఖ్యముఁ జెంద నేర ఖలులో ధర్మాత్ములో దుష్టులో
యెవ రైనన్ సుతులే ప్రయోజకులు కానీ గాకపోనీ పరా
భవ మేనాఁడు సహింప వారికొఱకే ప్రాణాల నర్పించెదన్. 248

ఉ. ఉన్న యథార్థముం దెలుపుచుంటిని యాదవసింహ వాక్యముల్
మన్ననఁ జేతు పాండవులు మాత్రము నాకుఁ బరాయివారలా ?
యన్నివిధాల నాకొడుకులంతటివారలు వారి నెన్నఁడుం
గన్నడఁ జేయఁబోను మమకారముతో నయగార మొప్పెదన్.

మ. హరి కృష్ణుండను సర్వజీవులకుఁ దా నాధారమై యుండి యె
వ్వరి కేదారి యనుగ్రహించునొ యదే వర్తించు వైకల్పిక
స్ఫురదాదర్శము లస్థిరంబు లగు నచ్చుం బోవు సౌదామనీ
కిరణప్రసృతమై తనచ్చు నడఁగుఁ గీల్గొల్ప నా కౌనటే ! 250

ఉ. పుట్టుకతోడనే గుణము పుట్టును పూర్వకృతానుబంధమై
యట్టె విధాతయున్నదట నయ్యయిరీతుల వ్రాయుచుండు నిం
కెట్టులఁ దప్పవచ్చుఁ బరమేశ్వరలీలలు దాఁటవచ్చునే ?
కట్టడిఁ జేసి పుత్త్రకులఁ గాఱియఁబెట్టుటకాక మిత్రమ ! 251

గీ. వారివారకర్మంబులు వారివారి
వెట్లు జరుగునో జరుగనీ యేల చింత
చక్కదిద్దుతలంపులు సాగఁబోవు
లేదు మార్గాంతరము లవలేశ మేని. 252

గీ. అని వచించిన ధృతరాష్ట్రు మనసురీతి
దెలిసి మఱుమాటఁ బలికిన ఫలముగాంచ
మనుచు నక్రూరవిభుఁడు నెమ్మనమునందుఁ
గలఁత నందియు మెల్లగాఁ బలికె నిట్లు. 253

క. సెలవయ్యా! కురునాయక!
తెలిసె న్నీమనసు నీమతికి నెది ప్రియము చ
ట్టులె సేయు మన్నిటికిఁ బయిఁ
గలఁడు గదా యొకఁ డతండె కార్యముఁ దీర్పన్. 254

గీ. అనుచుఁ బీఠంబు డిగ్గి ప్రయాణమైన
బంధు నక్రూరుని న్నిల్పి యంధరాజు
సానునయవాక్యములు పల్కి చాల వసన
భూషణప్రతతి నిడి సంతోషి యనుచు. 255

క. బావా నావచనములుగ
శ్రీవరుతోఁ దెల్పవగును శ్రితమందారుం
డేవిధిఁ గూర్చిన నావిధి
తావలమై జరుగుఁ దప్పఁ దగ దెవ్విధినిన్. 256

గీ. పాండవులు కౌరవులు నాకు రెండుకనులు
దేసి కేకీడు వచ్చిన హాని నాకె
యని మనంబునఁ దలపోసి యహరహంబు
వారిఁ బోషింతు ననుము శ్రీవరునితోడ. 257

క. తనమేన తను గొంతిని
దనయులతోఁ బాటు గన్నతనయవిధముగా
ననయము గాపాడెద నని
మనవిగ నొనర్పుము ప్రియమ్మునై హరితోడన్. 258

మ. అనిన న్నవ్వివినోదసంగతముగా నక్రూరుఁ డోబావ నీ
కనులట్లే కనిపాండుపుత్త్రకులనుం గౌరవ్యులన్ సర్వదా
మనుచున్నారు నటంచు గొంతిని సదా మన్నించి యట్లే ప్రయో
జనముం గూర్చెద వంచుఁ జెప్పెదను గృష్ణస్వామితోఁ జప్పకే. 259

వ. అనిన భావార్థము గ్రహించి కటకటంబడి ప్రారబ్ధకర్మమునెలవ నంధుఁ
డై తెలిసి లోకసామ్యముగ దెల్పు పలుకు లాలించి సోల్లాసముల వచించు నని
యాలోచించి ధృతరాష్ట్రుం డిట్లనియె. 260

శా. బావా! నీసమయానుకూలకుశల ప్రావీణ్యసోల్లాపముల్
తీవెల్లా గెను బంగ్లు పండె ఘనమై దేదీప్యమానంబుగా
లో వెల్గొందు విశాలనేత్రముల నాలోకింపనే లేవు మే
ఘానంతుండవు గ్రుడ్డి నేను హృదయాంధం బొందుదీవిట్లుగన్. 261

క. ఇంతే భేదము మనలోఁ
గాంతువు సకలంబు నీవు కనుల న్నానో
యంతశ్చక్షుండ నగుటల్
స్వాంతములఁ బరీక్షఁ జేయఁగా లేద సరిగన్. 262

ఆ. వె. కాన నేట నరసపాడిగా నటియింతు
వంతె గాని పసుపమూడి తనను
గనులు లొట్టపోవ మన సట్టులే యూన
తెలిసి పలుకుమయ్య దేవుతోడ 263

వ. అనిన నక్రూరుం డిట్లనియె 264

క. తుదిలో దాఁగిలిమూతలు
పదనూపముగా నొకప్డు బయటపడునవన్
జనునది లందఱు కొందఱు
నదియేమో యనుచు భ్రాంతి నందితి బావా! 265

క. తెలిసినవిషయము లన్నియు
బలికెద నాకొలఁది కృష్ణభగవానుసతో
తెలిసియుఁ దెలియనిపలుకులు
పలికినఁ జేటౌనొ యేమొ పలుకంగ నేలా? 266

వ. అంతెగాక 267

మ. ధరణీరాజ్యము మాది మా దని తొడల్ ధట్టించి ధట్టించి ప
ర్వరసామ్రాజ్యపదమ్ము లేలుకొనుకూరమ్మన్య లేమైరొ యం
దఱి కేదో యొకనాఁటి కాచరమసిద్ధాంతం బవార్యం బగున్
బరమార్థం బొకటే స్థిరంబు, సుఫలప్రాప్తంబు భూమీశ్వరా! 268

ఉ. భారతవీరకేసరులు పండితనమ్య లవక్రవిక్రముల్
భూరియశోవిశాలు రసుపూజ్యులు ధార్మికు లెందఱెందరో
ధారుణిఁ బుట్టి వచ్చిరి, స్వధర్మముఁ గర్మముఁ దీరినంత నె
వ్వారును నిల్వబోర రిటఁ బాపముఁ బుణ్యము రెండు దక్కఁగన్ 269

మ. ధృతరాష్ట్రావనినాయకా! విను వచశ్శ్రీముఖ్యలున్నన్నఁ బో
లుతటస్థుం డిల లేఁడు లేఁడను నుడుల్ పోలంగ నీహాస్తినా
స్థితపౌవళి చెప్ప నెంత సిరి నీడే రాజవున్ నీవెపో
ధృతరాష్ట్రుం డనునార్థకాంక్షితము నీకే కాక యెవ్వానికో. 270

గీ. పోయినచ్చోద నోబాన పూర్ణకసుణ
గానుము నీబీసబంధు వక్రూరుపైనిఁ

దెప్పి యున్న క్షమింపుము తలఁపవలదు
జ్ఞాని-నీవు చెప్పెడు దేమి చవట లేము. 271

క. అని పయనం బై యానతి
గని కుంతిగృహంబుఁ జొచ్చి కలసంగతులన్
వినిచి రథం బెక్కి-యు ద
త్క్షణమే చనె మధురఁ జేర సౌమ్యుఁడు కడఁకన్. 272

మ. చని యక్రూరుఁడు రామకృష్ణులకు విస్పష్టంబుగాఁ గౌరవేం
ద్రునితోఁ దాను వివాదబాధ్యుఁ డగుటల్ దూరీకృతార్థానుభా
వనసోన్మాదవిలాపముల్ సుతులదుర్వ్యాపారంబు కుంతీసతీ
వినతుల్ పాండురకష్టము ల్వినిచె దీపింపంగ భావోన్నతుల్. 273

—* జరాసంధుఁడు శ్రీకృష్ణునిపై దండెత్తుట *—

శా. శ్రీకృష్ణుండు మదాంధకంసపతి శిక్షింపం జలంబూని స్వే
చ్ఛాకల్పంబుగ నస్తిప్రాప్తులు జరాసంధాత్మజాతల్ మహా
శోకాందోళితచిత్త లై వెడలి రక్షోనాథుతో సర్వమున్
నాకల్యంబుగఁ జెప్పి రాత్మవిభుపంచత్వంబు దీనంబుగన్. 273

ఉ. ఏమని చెప్పఁగావలయు ? నీశ్వరచిత్రము యేమొ! కాని మా
స్వామి సహస్రనాగబల బాహుపరాక్రమవిక్రమక్రమం
బేమయి పోయెనో బలవిహీనతఁ జెందెను గృష్ణుకంటికిం
జీమఁగఁ దోఁచె నాథు నిరసించి హసించి వధించె వాఁ డయో!

శా. కోటీరాజ్వలరత్నకాంతులు దిశల్ లోరాడఁజేరాడుచున్
శాటీసంహతు లూడిపోవ బడుగై చల్లారె నయ్యో ప్రభుం
డాటోపంబునఁ గృష్ణుఁ డవ్విభుని కేశాంతంబులం బట్టి యా
ర్భాటం బొప్పఁగ నీడ్చి జట్టు మని సంభవ్యోగసంరంభుఁడై. 275

ఉ. అంతటఁ గన్నమూసెఁ బ్రభు వయ్యయొ యెట్లు భరింతుమయ్య సి
యంతటిలోకవిశ్రుతబలాఢ్యునిగర్భమునందు బుట్టి వి
భ్రాంతయశోవిశాలుఁ డగు కంసనృపాలుని చెట్టపట్టి మా
కింతటిచేటు వాటిలె భరించి తరించుట యెట్లు? నాయనా! 276

మ. అని కన్నీరుప్రవాహరూపమున నేత్రాంతంబుల న్వీడి చ
య్యనఁ గంఠస్థల మాక్రమించి జనుమధ్యస్థానముం జొచ్చి గొ
బ్బున నాభీస్థలమందుఁ జేరి ప్రిదులం బూబోండ్లు సుస్నాతలై
వనమధ్యంబున నిల్చునున్న కరిణిన్ వాపోయి రెంతేనియున్ 277

చ. అన విని యాగ్రహాగ్రహ మనంతముగా మదిలో జ్వలింపఁగాఁ
గని వెఱఁగంది త్రుళ్ళిపడి కన్నుల నుల్కలు రాల దంతపం
క్తిని నెఱి గీటి మీసలను దిద్దుచు సర్దుచు దుర్నిరీక్ష్యభీ
షణుఁ డయి నిల్చి పల్కె దనుజప్రభుఁ డాయెడ నిట్టు లంతటన్.

శా. ఏమీ యంతటిపాపపోత మగునా కృష్ణుండు నాయల్లునే
నా మర్దించిన దద్దిరా కితవ దివ్యామోఘ బాణాగ్నికీ
లామాలావిసరప్రసారమున నీ లావింకఁ బోకార్చెదన్
భూమిం గృష్ణుఁ డటన్న శబ్దము వినంబో రింక నుర్వీజనుల్. 279

ఉ. మామను జంపినా నని యమాంతము నింగులు ముట్టఁబోను నీ
మామకు మామ నేను బినమామ యమప్రభు గీముఁ జేరఁగా
గోముగ నిన్నుఁ బంపెదను గొంకులు జంకులు వంక లార్చియున్
మామను జూడఁ బొమ్ము తనమామకృతం బని తెల్పి మ్రొక్కుచున్

ఉ. ఏమహిళాశిరోమణుల నింతయలంచి కలంచినావొ య
ట్లే మగవార లన్నయదువృష్ణికులప్రతివీరు లెల్లరన్
వేమరు నొంచి వంచి యలివేణుల నెల్లర నేడిపించెదన్
మామకుఁ దృప్తిఁ జేతు వినుమా హరి నీరుధిరాంబుధారచే. 281

చ. అని వచియించి పుత్రికల నంతిపురంబున కంపి మంత్రులం
గని తగ నెల్ల రౌతువులఁ గ్రక్కున సిద్ధముఁ జేయుఁ డిప్పుడేఁ
జని మధురాపురప్రజలసన్నిధిఁ గృష్ణుని వానివంశమం
డనుల నడంప నే నని హుటాహుటి నాజ్ఞ లొసంగినంతటన్ 282

గీ. పూర్ణముగ నన్ని సన్నాహముల నొనర్చి
మధురపై దండు వెడలఁగా మంత్రివరులు
సిద్ధ మొనరించి తామును సిద్ధపడిరి
దుందుభులు మ్రోగి మిన్ను మ న్నందునటుల. 283

క. హరిహేషలు నరఘోషము
కరిబృంహితములు శవాంగఘనతరరవముల్
మొరసెడుదుందుభిరవోత్కటలు
పరఁగి దిశావితతి శబ్దబంధుర మయ్యెన్. 284

క. చతురంగబలము లెల్లను
జతురముగా నడపుభూరిసత్త్వులు మొదలన్
గుతుకమునొందఁ జనుదేరఁగ
మతిమంతుఁడు రాజు గాంచె మధురాపురమున్. 285

ఉ. యాదవరాజధాని యగునమ్మధురాపురిఁ జేర్చి సేనలం
బాదుకొనంగఁ జేసె నలువైపుల మాగధరాజు భూరిసో
న్మాదవచఃప్రగల్భుఁ డయి మాధవు బాంధవకోటితోసహా
పాదులు కుళ్లగింతు నని పంతము లాడఁగడంగె నంతటన్. 286

ఉ. దిక్కులు పిక్కటిల్లునటుఁ దేరులు బారులు దీర్చి వానికిం
బ్రక్కల దిక్కరీంద్రములభంగిఁ దనర్చు ననేకపంబులుం
జక్కఁగ నిల్పి వాని కిరుచక్కియలన్ హయము ల్పదాతులున్
జిక్కఁగ నుంచె రాణువ ప్రసిద్ధచమూపతు లేర్పరింపఁగన్. 287

క. రథగజతురగపదాతులు
పృథులముగా నన్నిదిశలఁ బిక్కటిలంగన్
మధురాపురిఁ జుట్టిరి మా
గధులు జరాసంధనృపతికార్యము దీర్పన్. 288

ఆ. వె. నేల యీనినట్లు నిలిపిరి సేనలన్
బోతుటీఁగ దూరిపోవనేర
దిసుక వేయ రాల దిట్లయి మధురాపు
రమున భీతు లైరి ప్రజలు గాంచి. 289

శా. ఉద్వేలార్ణవసంకులం బయి రణోద్యోగంబుఁ బాటించు నా
విద్వేషప్రతిఘాతసైన్యము భయోద్విగ్నాత్మమై యోర్వకే
సద్వంశీయులుఁ జెందుతాపము ప్రజాసందోహభీభత్సమున్
విద్వాంసుం డగుశౌరి యెంచి తనలో వేకితులూహించుచున్ 290

ఉ. అంధమనస్కుఁ డయ్యసురుఁ డారయనేరక భూరిసైన్యసం
బంధముతోడ వచ్చి మముఁ బట్టదలంచెడుఁ గాని యగ్గిలో
నింధనతుల్య యోట గమనింపఁడు వీరలఁ ద్రుంచి యాజరా
సంధునిమందబుద్ధి కొకచక్కనిపారము తెల్పఁబూనెదన్ 291

గీ. ఇట్టి దుర్దమ సైన్యము లెన్నియేని
కలవు వీనికి నందఱుఁ బొలియుదాఁక
వీని వధియింపఁబోలదు సేనమాత్ర
మయ్యెలువిధంబుల నడంప నౌ నటంచు. 292

గీ. దుష్టశిక్షయు శిష్టసంతోషణమ్ముఁ
జేసి భూభారము నడంపఁ జెందినట్టి
నాదు నవతారవిధి దీర్పఁగాఁదగునని
శౌరి కృతనిశ్చయుం డయ్యె స్వాంతమందు. 293

మ. హరి కృష్ణుండిటు ధ్యానతత్పరుఁడు నై యాలోచన ల్సేయ నో
వరరత్నోజ్జ్వల దివ్యకాంతి విలసద్భర్మాంచితాహస్కరో
త్కరతేజః ప్రతిమాన మోహనరథద్వంద్వంబు శస్త్రాస్త్రసం
భరితం బై దివినుండి సారథియుతంబై వచ్చె నప్పట్టునన్. 294

గీ. తనయెదుర నిల్చినట్టిరథములను గని
సారథుల మ్రొక్కు లంది బృందారకవిభుఁ
డనుప వచ్చిన వని యెంచుకొని రమేశుఁ
డనుపమానందమునఁ గనె నన్నముఖము. 295

శా. తేతె మ్మోబలరామ! కంసుమరణక్లేశంబుచేతన్ రుషా
జ్వాలాభీలవిలోలచిత్తుఁడు జరాసంధుఁడు సన్నద్ధుఁడై
వేలాక్రాంతవిశేషసైన్యజలధిం బ్రేరించి క్రూరంబుగా
ఱాలామూలముగాఁ జెడ న్మదిని నాలోచించి విచ్చేసెడిన్. 296

గీ. కల విరువదిమూఁ డక్షౌహిణులు మహోగ్ర
శూరు లీయుద్ధభూమిలో వీరుగాక
యింక నెందఱో యుందు రాహీన మతుల
నేఁడె జతగూర్చు నిప్పుడు విమతుఁ డేని. 297

గీ. ఇట్లు దుర్మార్గు లైననికృష్టదాన
వాళి హరియించి నిశ్శేష మైనపిదపఁ
జంప నగు జరాసంధుని సమయ మరసి
యనుచు వచియించి సన్నద్ధు డయ్యె శౌరి. 298

ఉ. కృష్ణుఁడు పాంచజన్యము ధరించి విలాసవిధాన నూఁదు నోఁ
దృష్ణ దొలంగి యాదవులు దీనతచే రిపులుం ద్రిలోకప
రిష్ణునిమోము గాంచిరి తితిక్షువులై తమి గోలుపోవుటన్
వృష్ణికులోద్భవుండు బలవీరుఁడు రాముఁడు నొత్తె శంఖమున్. 299

ఉ. చిచ్చఱపిడ్గులో యనఁగ జెచ్చెర యుద్ధతలంబుఁ జేరఁగా
వచ్చెడు రామకృష్ణులను వారక చూచుచు సేన లెల్లనుల్
ముచ్చెమట ల్దొఱంగ దమమోజులు బూజులు పట్టె బింకమున్
వుచ్చి సురారిసైనికులు వోయిరి దిక్కున కొక్క రొక్కరై. 300

—* జరాసంధుఁడు పరాజితుఁడగుట. *—

ఉ. అంతఁ జమూపతు ల్గడఁగి యందఱునుం జతగూర్చి భూరివి
భ్రాంతి దలంగదిద్ది హరిపైఁ గర మెత్తుగరాసు వింత వి
క్రాంతి దనర్చినన్ వెగటుగాఁ జని మందలు మంద లై రమా
కాంతునిఁ జుట్టుముట్టి వెటకారము కారము గూఱ నార్చుచున్.

క. నానావిధ విశిఖంబుల
శ్రీనాయకుఁ గుప్పినంతఁ జిఱునగ వొలయన్
వానిని నడుమనె త్రుంచియు
రాణువ మర్దించె మించె రభసముతోడన్. 302

క. బలరామకృష్ణు లిర్వురు
బలదర్పము లొప్ప దమ్ముఁ బైకొనువారిం
జెలరేగి నేలపాలుగఁ
జలిపిజరాసంధుఁ జేరఁజని రయ్యెడనన్. 303

వ. జరాసంధుండిట్లనియె. 304

క. ఓరీబలరామా నను
నోరువఁ గలవేని రమ్ము యుద్ధమొనర్తున్
దీరుతు బీరముసారము
నారాచంబులను గుప్పి నానావిధులన్. 305

క. నీవే వీరుఁడ వైనన్
లావుం గనఁబఱచి విజయలక్ష్మిని గొనుమా
యేవిధ మైన సరే యని
రీవిగ వచియించె రుద్రుఁ రేవ నలుగుచున్. 306

చ. అన విని నవ్వి శౌరి యసురా హితవాక్యము లేల శూరు లి
ట్లనెదరొ యెన్నఁడేని జల మార్చిన తీవ్రదవాగ్ని పోలికన్
వినఁబడు వింతవాక్యములు వియ్యము గోరుట వచ్చినారమే
యనిమొన నిన్ను నోర్చి హతమార్పనుఁ గాక కిరాతభూతమా!

ఉ. అల్లునిఁ జంపినానని మహాగ్రహనిగ్రహ విగ్రహుండవై
గొల్లున నింతరాజునను గూరిచి తీరిచి చేరవచ్చినా
విల్లులుకంగఁ బంపుమని వొంచి మదించి యహంతఁ బెంచి నీ
యల్లుని యల్లునిం గనిన నాడి పీడి విడాకు లిచ్చెదో? 308

ఉ. చెల్లియొ చెల్లకో పనులు చేసితి వింతటిదాఁక నిప్పుడే
యెల్లిద మైనహీనకృతి కేల చెసెంతువు శూరునట్లు మ
మ్మెల్లర నోర్చి గెల్చుటయొ కాదన స్వర్గము జూరగొంటొ భూ
వల్లభు లైనక్షత్రియుల వాంఛలు రెండె సుమీ జగంబులన్. 309

ఉ. చల్లకు వచ్చి ముంత నొడిచాటున దాచెడునీచమట్లు గా
నల్లరిపాలు జేసెదవు నాలము నోర్వక పారిపోయినన్
బొల్లున దంచుబియ్యమునుబోలి వృథా వృథ నీప్రయోజనం
బెల్లవిధాల నార్తి గమనించి దలంచుము రాజధర్మమున్. 310

ఉ. తాతవు నీవు మాకు రణధర్మము చెప్పి చరింతువేని వి
ఖ్యాతకులప్రసూతులమె శాస్త్రమొ కూస్తమొ మాకునున్ యశో
ఘాతము వచ్చు బాంధవము కలుట సిగ్గును మొగ్గు లేనిని
చేత మహేట్టులైన నిఃసింతుము మేము జరాసుతాధమా! 311

ఉ. బంధునిహంత యన్న సడి బాపుకొనం దలపోతుఁ గాని ని
ర్బంధవిధాన మై యిటులఁ బైకొనుచున్నవి హేతువాదముల్
సింధువు గెల్వ నేగు చలిచీమలబారులునోలె నీవు నీ
బంధుకసేనలం గలసి వచ్చితి తప్పనె నిన్నుఁ జంపుటల్. 312

చ. అన విని రోమ రోమమున నాగ్రహముగ్రగతిం జెలంగఁగా
మనమును గ్రుమ్మి క్రుమ్మి యవమాన మహోష్మము భీష్మమై చనన్
గనులను విస్ఫులింగములు గ్రమ్మి కరమ్ము భరమ్ము నింప న
జ్జనపతి కృష్ణునొంపఁ గనుసన్నల నానతి నిచ్చె సేనకున్. 313

ఉ. అంతట రేగి సైన్యము మహానిలధూతపరాగవిస్తృతా
నంతదురంతధూమ పరిణామముగాఁ జని కృష్ణచండభా
స్వంతుని గప్పి కుప్పెఁ బరివారములం బలరామవీరునిం
బొంతల పిల్వరించె పలుపోకలకాఁకలఘాకఁ జూపుచున్. 314

మ. జలదచ్ఛన్నఖమండలగ్రహలసచ్ఛాయావికల్పంబుగా
జ్వలితారిందమవాహిని చయలసచ్చండారుకల్ రామకృ
ష్ణులు గుప్తాఘువిశేషతేజు లయి సంక్షోభింప కున్నంత భీ
తులు నై యాదవవీరు లెల్ల దిశలందుం బారి రుత్కంఠతన్. 315

మ. రిపుసేనాపరివేషవేష్టితుఁడు నై కృష్ణుండు గన్పింపకుం
డి పురాట్టాలకహర్మ్యగోపురమహోడ్డీనప్రదేశంబులం
దపు డప్పట్టణకాంత లెక్కి కనుచో నాతార్క్ష్యకేతోద్ధ్వజాం
కపరిష్కృత రథంబులం గనక దుఃఖాక్రాంతలై రెల్లరున్ 316

చ కనుఁగొనెఁ గృష్ణదేవుఁడు ప్రకంపనవేగశిలీముఖప్రయో
గనిపుణమానరాతిబలకాండము ఖండనభూమి వీడి గ్ర
క్కునఁ జను నాత్మసైనికులఁ గొందల మందెడుసుందరీమణీ
గణమును దాళు తాళుఁ డని గ్రక్కునఁ బల్కుచు నుక్కుమీఱఁగన్

క. సురదానవభీకర మగు
శరశార్ఙ్గముఁ జేతఁ బట్టి వాసవవినుతుం
డురువడి నారిన్ లాగెను
ధరణీవ్యోమములఁ గప్పు ధ్వని నిగుడంగన్. 318

క. నానానూనవిశేషక
బాణవ్రాతము గ్రహించి బలువడి వింటం
బూనిచి విడిచె నరాతి
శ్రేణిప్రాణానిలములు చెచ్చెర నెగయన్. 319

ఉ. కుంజరవాజియూథములు గుప్పలు తిప్పలునై ధరం బడెన్
భంజితులై విరోధిభటవర్యులు కూలిరి తాళఁజాలకే
రంజితమై రణాంగణము రక్తనిషిక్తత మృత్యుదేవికై
మంజులకేళిఁ గాలము యమర్చిన కెంజిపురాను సెజ్జగన్. 320

క. మండెడుకోటివివిధాన న
ఖండముగా రేగుకాండకాండము లొప్పం
గండరగండలు కూలిరి
ఖండింపంబడియెఁ దురగకరితండములున్. 321

గీ. కుంభములు వ్రీలి వ్రాలెడు కుంభిగణము
తలలు వగిలినహయములు లులితములగు
రథములుం బతాకములు సారథులు రథులుఁ
బోరు ఘోరమయ్యె మహాత్రి సూరుమనిన. 322

క. ముసలాయుధుఁ డెత్తినతన
ముసలము దింపకయ చావమోదుచు రిపులం
గసిమసఁగఁ దోడఁగె చలమున
నసమపరాక్రమవిధంబు నమరులు మెచ్చన్. 323

క. ఇరువదిమూఁ డక్షౌహిణు
లురవడిఁ బరువెత్తుచున్న నూరకవిడకే
తరిమి తరిమి విదళించుచు
దురితుల వధియించె బలుఁడు దోర్బల గరిమన్. 324

ఖండితఘోటకకరివీరభటదేహ
నిర్గతరుధిరఘనవితాన
మునఁ గమరంబులై పురుషులశిరములు
భుజములు పాములంగోల్కొఁదనౌ

ద్విపశరీరంబులు ద్వీపంబులై తోఁచె
హయతనువులు మొసళ్లట్లు లెసఁగెఁ
గరచరణంబులు చిఱుచేపలై తోఁచె
వరశిరోజములు శైవాల మయ్యె

తే. గీ. విండ్లు తరగ లాయుధములు వివిధకుంజ
సంతతులు జక్రము ల్సుళ్లు స్వర్ణరత్న
ఖచితభూషణములు ఫాళ్లు కరణిఁ దోఁప
శౌర్య వాహినియై రణస్థలి తనర్చె. 325

సీ. పోయి పోవని ప్రాణములు గల్గి బాధచే
మూల్గి నాల్కలు జాచి యూల్గువారు
మేరునగంబుపై గైరికధాతువు
లట్లు రక్తముగాఱ నార్చువారు
హాహారవంబుల జోహారు లొనరించి
విడుము వీడు మటంచు వేడువారు
గోడుగోడున నేడ్చి గుండెలు బెం డయి
కలగుండు వడి నింగిఁ గాంచువారు

తే. గీ. బ్రదుకు జీవుఁడా యని దిశ ల్వాటువారు
పీనుపెంటలలో డాఁగి బ్రిదులువారు
మృత్యుదేవిమహానసగృహమువోలె
భయదమై తోఁచె సంగరప్రాంగణంబు. 326

సీ. ఎవ్వానిసంకల్ప మెసఁగినమాత్రాన
సృష్టిస్థితిలయముల్ చెలఁగుచుండు
నెవ్వానికనుసన్న నేప్రొద్దు దేవాది
దేవులు తలఁదాల్చి తిరుగుచుండు
నెవ్వానికరుణచేఁ బాపాటవులు కూలి
భస్మీపటలమయి భరము దీర్చు
నెవ్వాఁడు లోకత్రయీపాలకత్వంబుఁ
జెంది విందుగ లీల లందుచుండు

తే. గీ. నెవఁడు ఘటనాఘటనసమర్థవిభవుఁడయి
చేతనాచేతనముల రంజించుచుండు
నట్టిలోకైకనాయకుఁ డాదిమూర్తి
కసురభంజన మొకపెద్ద యౌనె తలఁప? 327

గీ. సర్వశక్తిసంపన్నుఁడు సాక్షిమూర్తి
నిగ్రహానుగ్రహసమర్థనియతుఁ డట్టి
విశ్వమయునకు శాత్రవవితతి నొంచు
టెంతపని యౌను సంకల్ప కృతముగాక! 328

శా. మాయానాటకసూత్రధారి యయి సామాన్యంబుగా దోఁచు లే
బ్రాయంపుంబసికూన గాన హరిశుంభద్వీర్యసంరంభమున్
జ్ఞేయంబై యిటు స్తోత్రపాత్రమగుఁ గానీ దుష్టసంహారణా
ధ్యాయం బాతనినిత్యకృత్యమగుఁ గాదా శిష్టరక్షార్థమై 329

ఉ. అంతఁ జెలంగి రాముఁడు మహాబలుఁ డైనజరాసమారుసిం
హెంతకుఁ జేరి స్యందనముఁ జెంది యలంచి కలంచి నష్టవి
క్రాంతునిఁజేసి సింహము కురంగముఁ బట్టెడునీతి నొత్తి వి
క్రాంతి దలిర్ప బాశములఁ గట్టియు శంఖము నొత్తె నొత్తుగన్. 330

ఆ. వె. ముసలమెత్తి నెత్తి మొత్త నాయత్తమై
యున్నయన్నఁ జూచి వెన్నుఁ డతని
కడఁక నాగి వాని విడనాడఁ దగునని
యానతిచ్చె మందహాస మొలుక. 331

ఆ. వె. వీని నాశ్రయించి విమతులనేకసం
ఖ్యాకు లున్నవారు కదనమునకు
వారిఁ గూర్చునట్టివాఁడు వీఁడే కానఁ
జంపఁదగదు వీని సత్వరముగ. 332

చ. మనయవతారధర్మము కుమార్గుల నెల్లను నేకరాశిగా
హనన మొనర్చి భూభరము నార్చుటయే యగుఁ గాన నిప్పు డీ
యనదను ద్రుంపరాదు ఖలు లట్టులె పెక్కురు గాన సోదరా!
వినినయ మొప్పు నిప్పు డను వెన్నునిపల్కులు సన్నుతంబులై. 333

చ. విని బలరాముఁ డద్దనుజవీరుని ద్రుమశృంగారిపోవఁగన్
మనసున నొవ్వ నాడుచున మానుషవారణపాశముల్ విద
ల్చినఁ గడుసిగ్గు బెగ్గడిల లేచి వరాంగము డించి యొంటిమైఁ
జనెఁ దనసేన లెల్ల జనుసన్నిధిఁ జేరుటచే సురారియున్. 334

వ॥ ఇట్లు రాజ్యంబుసేరి యుపజయ సంతాపతప్తచిత్తుండై యస్వస్థుం
డై వంగని తన్మంత్రులు. 336

సీ. కనుసన్నలను గన్న వినతులై తలఁదాల్చి
పను లెల్ల నొనరించుభటులు కల్గఁ
జండప్రచండమార్తాండతేజఃకాండ
ఖండితోద్దండులు మంత్రు లుండ
సర్వసర్వంసహాచక్రంబు వడిఁ బట్టి
చాపచుట్టుగఁ జుట్టుసఖులు నెలయ
పరిపంథిగర్వనిర్వాపణోద్యోగు లా
నిర్వకవిక్రమనిధులు గలుగ

తే. మత్తవేదండతండము ల్మహితవాహ
వములు సుస్యందనములు దివ్యాస్త్రశస్త్ర
వితతి లెక్కకు మిక్కిలి వెలయుచుండ
నేమిలోటని యెంతు భూమీశ నీవు. 337

సీ. కాలవశంబున గడిపోచయే పెద్ద
నిట్రాడుపలె నిక్కి నెగడెఁగాక
కర్మఫలంబున గతిలేక మతి లేని
తాలుమూఁక భటాలి కూలెఁగాక
యుక్తిప్రయుక్తుల రక్తిగొల్పెడు మహా
ద్రిక్తులు మంత్రులు దెగిరిగాక
మేదోవిధానంబు భేదింపఁ గ్రోలుచోఁ
గరిహయంబులు నేల కూలెఁగాక

తే. మూలబలమున నీ విప్డు కోలుపడిన
సైన్య మేపాటి? యొక సహస్రాంశమైన

నుండునా జరాసంధ యిట్లోడెదేల
తప్పు నీయదియేసూవె మొప్పమిగన. 338

ఆ. వె. పాము చిన్నదైన బడితె పెద్దది గొని
చంపవలయు నండ్రు చతురమతులు
కృష్ణుఁ డెంత యతనిక్రియ లెంత యని యల్ప
సేనఁ గూర్చినావు చెడితి వీవు. 339

ఉ. అందున నింతచే టొదవె నాఱడి నొందితి వైన దానికిం
గుందు వహింపఁబోక సరి కోరిన సేనలతోఁ బ్రతిక్రియల్
పొందుగఁ గూర్చి శాత్రవులపోతర మార్చి యశంబు దిక్కులన్
విందుగఁ జల్లి మాకుఁ గనువిం దొనరింపుము పొమ్ము భూవరా.

వ. అని యోదార్చినంతట నిట. 342

గీ. శత్రునిశ్శేష మొనరించి శార్ఙ్గధన్వి
యన్న బలరామవిభుఁ గూడి యరుగుదెంచి
రాణువులతోడ మధురాపురంబుఁ జేర
సర్వజనముల నేత్రము ల్చల్లఁబడియె. 343

సీ. మంగళాంగు లనంగ సంగతశృంగార
సంగీతపారముల్ హంగుమీర
వీణాక్వణనమంజు గానతరంగిణీ
భంగ భంగిమములు పొంగులూర
వారాంగనామణీ వరనృత్య సాహిత్య
విన్యాసలాస్యముల్ వేడ్కఁ జెలఁగఁ
దంబురా మర్దళ తాళ సంయుతమగు
భక్తిగీతికల సంబరము దనర

తే. గుబ్బెతలగొబ్బిపాటల గోష్ఠి వెలయఁ
జెలఁగి గొబ్బిళ్ళ ద్రొక్కెడు చిన్నబాల
కులవినోదము చెలరేగ గోపబాలు
నెదురుకొనఁ బోయి రాజాసపదులు చెలఁగి. 344

సీ. బ్రాహ్మణు ల్వేదపారాయణములొనర్ప
స్వస్తివాచకులు ప్రశస్తిఁ బొగడ
వందిమాగధులు కైవారములొనర్పఁగా
భట్టుమూర్తులు కీర్తిఁ బాడుచుండ
వివిధవాద్యంబులు విస్ఫూర్తిమై మ్రోయ
మంగళవాద్యము ల్మిన్నంగి ముట్టఁ
గవిగాయకులు హాయిగా వర్ణనలు సేయ
నలఘువీరులు శంఖములను మ్రోయఁ

తే. గీ. పౌరు లానందవివశులై పాడి యాడి
వివిధ కేళీవినోదము ల్వెలయఁజేయ
బాలగోపాలకృష్ణునిఁ బట్టణమునఁ
జేర్ప నెదు రేఁగె నపు డుగ్రసేనవిభుఁడు. 345

సీ. సమ్మార్జనాదులు జరిపించి రాజమా
ర్గములందుఁ బన్నీరు గలయఁజల్లి
యిఱుగెలంకుల శోభ మెఱయుపతాక తో
రణముల నింపుగా నొనయఁజేసి
వెలయురంభాస్తంభములు నాఁటి యందందు
మణిదీపికలకాంతి మలయఁజేసి
రంగురంగులహంగు చెంగలించెడు మేలు
కట్టుపుట్టంబులఁ గట్టఁబెట్టి

తే. గీ. రంగవల్లులు వెట్టించి రాజమార్గ
ముల నలంకార మొనరించి మోద మలర
నఖిలపరివారములఁగూడి యాప్తవరులఁ
గూడియెదురేగ శ్రీదునిఁ దోడితేర. 346

చ. ఎదురుగ వచ్చుబాంధవుల నెల్లరఁ గన్గొని రామకృష్ణులొ
ప్పిదముగఁ దేరులం డిగి యభీప్సితము ల్నెఱవేరునట్లు వ
త్పదములు వట్టి మ్రొక్కి తమబాహుయుగమ్మునఁ గౌఁగిలించి చే
యఁదగినగౌరవక్రియల నన్నియుఁ జేసిరి సన్నుతంబుగన్. 347

గీ. మంత్రిసామంతగురుముఖ్య మాఖ్యవరుల
నుచితవిధముల మర్యాద లొనరఁజేసి
జానపదులను మిత్రుల సరసవచన
ముల నలర్చిరి రామకృష్ణులుఁ జెలంగి. 348

గీ. అంత నానకదుందుభి యవనివిభుఁడు
రామకృష్ణులు నొక్కటేరథమునందు
నధివసించిరి యక్రూరుఁ డాదిబంధు
లశ్వవాహనముల నెక్కి గతిముదమున. 349

వ. అననివ్యోమము తేక మానటులఁ దూర్యారావము మ్రోసెను
త్సవము లెల్లు చెలంగె బ్రాహ్మణులు లాజ ల్చల్లి దీవించి రై
దువ లెల్లన్ సుమమాల లక్షతలఁ బ్రోదుల్సేసి రానందనా
ట్యవిశేషంబులుఁ జెల్లె శ్రీవిభుఁడు వేడ్కన్ జాఁగియేతెంచు కో. 350

గీ. ఇటు లనంతవైభవమున నేగి యేగి
రాజమందిరముం గాంచి రథము డిగ్గి
బంగరుంబళ్లెరంబుల మంగళాంగు
లారతు లొసంగఁ జొచ్చిరి యాలయమును. 351

గీ. అఖిలజనులకు శ్రుతిపర్వ మై తలిర్ప
స్వాగవచనమ్ము లాడి ప్రసాదములను
బంచి కానుక లొసంగి సంబర మొనర్చి
రపుడు బలరామకృష్ణు లత్యాదరమున. 352

ఉ. సంగరరంగమం దొదవుశాత్రవపాళివిభూషణాదులన్
మంగళదివ్యవస్తువుల మానవనాథున కప్పగించి యు
ప్పొంగుచు దేవకీరమణిపొంతలకుం జని మ్రొక్కి యామెచే నా
లింగనభాగ్యముం బడసి లొప్పుగ రహించిరి రామకృష్ణులున్. 353

—* జరాసంధుని దండయాత్రా ప్రసంగము *—

గీ. అటు పరాజయమంది పర్యాకులమున
పురముఁ జేరుజరాసంధభూవిభుండు
శాత్రవులకుఁ బ్రతిక్రియం జెలుప నెంచి
నుగుడ నేతెంచె వీరుఁడై మధురఁజేర. 354

ఉ. తొల్లి టికన్న మిన్నలగుదోర్బలశాలుర నేరికూర్చియున్
బెల్లుగ సేనలన్ నడిపి పెంపుఁ బ్రాపు ననంతవీర్యుఁడై
ప్రల్లదముల్ దలిర్ప మధురానగరంబును జుట్టుముట్టె శ్రీ
వల్లభుఁ డట్టివార్త విని వానిమదం బడఁగింపఁ గోరియున్. 355

గీ. సేన నెల్లను మర్దించి చేతఁజిక్కి
నట్టిక్రూరజరాసంధు నణఁపఁబోక
విడిచి పుచ్చెను గృష్ణుడు వెనుకటివలెఁ
మనసున న్వానిపునరాగమనముఁ గోరి. 356

మ. సకలత్రైలోకవిభు నెంచ నేరనికజరాసంధుఁడు ద్వేషాంధుఁడై
యకలంకోజ్జ్వలకీర్తి గైకొనుట కెల్లైనన్ రమానాథుఁ ద
ప్పకశిక్షించుటయే విధాయకముగా భావించి వీరాతివీ
రకదంబంబులతోడ సప్తదశసంగ్రామంబులం జేసియున్ 357

సీ. పదునెన్మిదవసారి బవరంబునకు నేగ
సంసిద్ధుఁడై జరాసంధుఁ డుండ
బ్రహ్మర్షి నారదప్రవరుఁడు సంకల్ప
శుద్ధిగా క్షాత్రవక్షోభ మెంచి
మ్లేచ్ఛప్రభుం డగుమిడిమేలపుం గాల
యవనునిఁ జేరఁగా నరిగి వాని
వంచించి వైరముఁ బెంచి యాదవులపై
సమరంబొనర్పఁ బ్రోత్సాహపఱచి

తే. ముక్కగతుముక్క సేనలు మూఁడుకోట్లు
గూడి మధురాపురంబుపై దాడిసేయఁ
బనిచిన న్వాఁడు చెలరేగి బవరమునకు
నేగె శ్రీకృష్ణు నోర్చి మర్దింప నెంచి. 358

మ. అగరే యాదవులా యజేయులొకొ యద్ధాయుష్కుఁ గంసప్రభున్
బొరిగొన్నంతనె ఒక్కపీనుఁగు జరాపుత్రున్ విసర్జించి తీ
సగమార్పంగనె గొప్పవారయిరొ గోపాలాన్వయుల్ కాని మ
త్కరసిద్ధ్యుక్తమహాశుగాగ్నులకుఁ గాకర్పించు నెచ్చోర్చ్యముల్. 359

ఉ. సిగ్గెటు లేకపోయెనో యిసీ పసిపాపను నోడి యచ్చటే
మ్రగ్గక పాఱివచ్చెను జరాసుతుఁ డోలిఁ బదేడుసార్లు నీ
పగ్గెలు పాడుగాను కితవా! యొక బావియొ నూయి లేదొకో
భగ్గున మండుటగ్గిఁ బడి ప్రాణము గోల్పడరాదొ మేలగున్. 360

ఉ. వీరవరేణ్యగణ్యులకు విశ్రుతదివ్యయశఃప్రకాంతిలోఁ
దీరని నల్లమచ్చఁ గొని తెచ్చితి వోరి జరాసుతాధమా!
గోరున గ్రుచ్చి చంపఁదగు కుఱ్ఱనినోర్వక పాఱిపోయి నీ
పేరు చిరప్రసిద్ధముగఁ బృథ్విని నిల్పితి వ్యర్థజీవి వై. 361

గీ. పాలబుగ్గలపసివాఁడు పసరమట్టి
ముదురుమీసలమగవానిఁ జిదిమెనంట
యద్దిరా గద్దరితనంబు హద్దుమీఱె
నెద్దునే తన్నుకొనిపోవు గ్రద్దపిల్ల. 362

—* కాలయవన వినాశము *—

క. అని చతురంగబలంబులు
గొని యవనుఁడు మూఁడుకోట్లు క్రొల్వులులనఁగా
జనఘనసైన్యంబులతోఁ
జని మథురానగరి ముట్టె సరభసభంగిన్. 363

గీ. చీమదూరెడు నెడలేక భూమి యీని
నట్లిసుక వేసినన్ రాలనట్టి దట్ట
మైనసేనలు వలగొన్న నరసి జాన
పదులు వెఱఁగంది గుండెలు పగిలిరంత. 364

క. తగిలినకాలే తగిలెడు
తగవున పీఁడొకఁడు వింతదనుజుఁడు వచ్చెం
బాగ రడపఁగనగు నంచును
భగవంతుఁడు కృష్ణమూర్తి భావస్ఫూర్తిన్. 365

వ. బలరామునుం గనుంగొని మననివాసంబు శత్రుదుర్భేద్యంబుగా సలయు
నని చెప్పి 366

గీ. కాన దుర్గమమైన దుర్గంబొకండు
కట్టి మధుపురంబునం గలిగియున్న
ప్రజలనెల్లర నందులో భద్రపఱచి
పోరుదము వీని తోఁ దమి దీరునట్లు. 367

క. అనిబలభద్రునియాలో
చనఁజేసియు విశ్వమయుఁడు సంకల్పముచే
ఘన మగు కోటను గట్టెను
వననిధిమధ్యమున దివ్యవైభవ మొప్పన్. 368

క. ద్వాదశయోజనవిస్తృత
మౌదుర్గంబది యచట మహార్ణవమందున్
శ్రీదముగానిర్మింపం
బ్రోదిన్ నేమించె మయుని బురుషోత్తముఁడున్. 369

గీ. శిల్పవిద్యావిశేషము ల్చెలువమార
వాస్తుశాస్త్రవిధు లెల్ల వఱలునట్లు
విశ్వకర్మ నిర్మించెను వేదవేద్యు
కొఱకు ద్వారకానగరము గోరి కోరి. 370

మ. పరమేశుం డగుకృష్ణునానతులు సంభావించి శిల్పక్రియా
కరణంబు ల్నెఱవేరుచందమున లోకైకప్రభావంతమౌ
వరదుర్గంబును విశ్వకర్మసలిపె న్వారాశిమధ్యంబునం
స్ఫురదానందవిహారహర్మ్యముల నింపున్ సొంపుఁ బెంపారఁగన్ 371

సీ. ఒంగారు బంగారుసింగారపున్ మేడ
లున్నతి నింగిఁగ వుంగిలింప
నందాలు చందాలుఁ జిందెడునానంద
మందిరోద్యానము ల్విందుసేయ
నిందిరాసుందరీమందిరంబు లనంగ
విందారుసిరిఁ జెలువందుచుండ
శ్రీకరగోపురప్రాకారమంటప
శృంగము లందందుఁ జెలువుమీఱ

తే. గీ. నిఖిలలోకైకపూజ్యమై నెగడునట్టి
విశ్వకర్మనిర్మిత మహాత్రివిష్టపమున
రమణనొప్పారె ద్వారకాగమ్యనగరి
కృష్ణవిభురాజధాని నాఁ గీర్తిగనుచు 372

వ. అట్టి రమ్యపురంబున శుభముహూర్తంబున శ్రీకృష్ణుండు సబాంధ
వముగాఁ బ్రవేశించె నట్టిసమయంబున 373

మ. పరమామ్నాయవిధాత శ్రీహరి పరబ్రహ్మంబు శ్రీకృష్ణసుం
దరగోపాలకిశోరమూర్తి నగరిం ద్వారావతిం జేరఁ జోఁ
పురుహూతుండు బహూపహారముల సమ్మోదమ్మునం బంపి శ్రీ
కరకల్పద్రుమ పుష్పజాతములు కానుకల్వెట్టె నుప్పొంగుచున్.

గీ. వరుణదేవుఁడు శ్యామసుందరున కపుడు
నీలకర్ణంబులును నవనీతధవళ
వర్ణసంపన్నములయిన వాయువేగ
హయసహస్రము సంప్రీతి యలరఁ బంపి 375

గీ. మహిత పద్మ మహాపద్మ మత్స్యకూర్మ
నీల శంఖోదక ముకుంద ములనుబరఁగు
నిధు లెనిమిది యర్పించెనఁ నెమ్మిగాంచి
ధనదుఁ డత్తఱి శ్రీరమాధవునిఁ బొగడి. 376

మ. ధరణీభార మడంపఁ బుట్టె విమతధ్వంసంబు గావించు శ్రీ
హరికృష్ణ ప్రభుగౌరవార్థముగ నాశాధీశు లెల్లం బహూ
కరసవ్రాతము గానుకలంపి వినుతుల్ గావింత్రు ద్వారావతీ
పురసౌందర్యముఁ బెంపు సేయుటకు సంపూర్ణాభిరామంబుగన్.

—* కాలయవనుఁడు కృష్ణుని వెంబడించుట *—

మ. మధురాపట్టణవాసు లెల్లరును శ్రీమాన్యుండు యోగోన్నత
ప్రథమాహాత్మ్యముచేత ద్వారకపురంబం దొప్పుగా నిల్పి యం
దధికప్రక్రియ కగ్రజు న్నిలిపి యేకాంతంబుగా వచ్చి యా
యుధము ల్దాల్చక నెచ్చె వాకిట మహాయోగీంద్రసంకాశుఁడై. 378

గీ. అరుణనీలాభ్రములఁ దెరమఱుఁగు వీడి
తోఁచు శారద పూర్ణచంద్రుని విధాన
ద్వారకాపురీద్వారము దాఁటి బయలు
వెడలు కృష్ణునిఁ గని మ్లేచ్ఛవిభుఁడు చెలఁగి. 379

సీ. జీమూతసన్నిభశ్యామలగాత్రుని
గౌశేయ వాసు రాకాశశిముఖు
శ్రీవత్సలాంఛనస్థితవక్షుఁ గౌస్తుభ
కలిత కంధరు వధూకాంతశ్రీయుఁ
బ్రవిమల వరచతుర్బాహుని నవజల
జారుణేక్షణు వరస్మేరవదను
మణిమయాద్భుతలసన్మకరకుండలదీప్త
దర్పణరుచిసుందరకపోలు

తే. నిత్యసంతోషద వినోద నియతు రమ్య
మూర్తి సత్కీర్తి మునిహృదంభోజవర్తి
శమితసుజనార్తిఁ ద్రైలోక్య చక్రవర్తిఁ
గాలయవనుండు దర్శించెఁ గన్ను లలర. 380

చ. కనుఁగొని యీతఁడే యతఁడు గావగు నారదమౌని దాను జె
ప్పినవివరంబు లెల్లఁ గనిపించెడు వీఁడు నిరాయుధుండుగాఁ
గనఁబడుఁ బాదచారి యగుఁ గారణమేమియొ నేను ఖడ్గముం
గొనకయ వీనితోడ నని గోరి యొనర్చెదఁగాక యంచునున్. 381

మ. అని ఖడ్గంబును వీడి కాలయవనుం డత్యంత వేగంబుగాఁ
జని మున్ముందు పరాఙ్ముఖుం డయి మహోద్ధుంధుమారాంగుఁ బట్టు చి
వ్వనఁ జేఁ జిక్కక పాఱు శ్రీరమణుకోపు ల్వాచుచుం బోయి యా
తని వెన్నాడె నలభ్యుఁ డైనహరి చేతం జిక్కునే వానికిన్. 382

వ. కాలయవనుం డట్లు వెన్నుని వెన్నంటి చనుచు వాయువేగమనో
వేగంబుల న్మించిన యానంబున శ్రీకృష్ణు ననుసరింప భరం బై నోట
నురుగులు గ్రక్కుచు నెమ్మనంబున నిట్లు వితర్కించె. 383

సీ. వరమృగేంద్రంబొకో శరభమృగముఁ బట్టి
పగనెంచి పొగరెంచి యగడు మించు
గంధసింధురమొకో కడఁగి సింహము నోర్చి
యదరించి బెదరించి పదను దించు
నురగమా గారుడేశ్వరు గిరగిర ద్రిప్పి
నురుగులు గ్రక్కించి భరము నించు
మేకయా మువ్వన్నె మెకముపై లంఘించి
కుత్తుక నొత్తుచుఁ జిత్తు చేయు
తే. కప్ప పెనుబాము గ్రసియించు కరణి దోఁచు
మత్తవేదండమును ద్రింగు మాడ్కిఁ గృష్ణ-
బాలుఁడే కంసుపాలిటి కాలుఁ డయ్యె
నద్దిరా యద్భుతము పరమాద్భుతంబు. 384

సీ. కువలయాపీడముం గూల్పఁజాలినవాఁడు
బాలుఁడా పంచాస్యబలుఁడుగాక
మల్లుర గోటిచే గిల్లి చంపినవాఁడు
పిన్నయా రుద్రున కన్న గాక
కంసరాజును బట్టి కసిమసంగినవాఁడు
బడుగఁటే చిచ్చఱపిడుగు గాక
వరజరాసంధునిం దరిమికొట్టినవాఁడు
బడుగఁటే చిచ్చఱపిడుగుగాక
తే. తాడిఁ దన్నువాని తల దన్నువాఁ డుండు
నన్న సూక్తి స్పష్టమయ్యె నేఁడు
పేఁడఖండబలుఁడు విదళించి ధృతిగంట
సులభసాధ్య మనుచుఁ దలఁపరాదు. 385

వ. అనుకొనుచుఁ బఱుఁగువాఱుచుండు నెడ. 386

మ. పరమాభీల మహాబిలంబొకటి విస్పష్టంబుగా శైలకం
ధరమందుం బొడగట్టఁ గృష్ణుఁడు వినోదంబందుచుం దూరి తా
హరినాదం బొనరించె మ్లేచ్ఛవిభుఁ డల్లంతన్ గుహాసీమఁ దె
చ్చెరఁ జొచ్చెన్ హరిఁ గాంచ నేరమిని విస్మయంబు జృంభించుచున్.

ఆ. వె. వెదకి వెదకి విసిగి వేసారి హరిజాడ
గానరాక వెదక మానుకొనియు
నే నరుండొ యచటఁ గ్రీనీడలోఁశయ
నించినట్లు గోచరించినంత 388

ఉ. డాయఁగ నేఁగి చూచి వికటంబుగ నార్చుచుఁ గృష్ణుఁడే యటన్
హాయిగఁ బవ్వళించె నని యాత్మఁదలంచి యొకోరినిచుఁడా!
యేయెడ కింకఁ బోయెదవు నెవ్వనిగాఁ దలపోసి యిట్లు నీ
మాయబడాయిఁ జూపితివి మామను గాదు సుమీ! భయంపడన్.

శా. ఓరీ గొల్లఁడ పాలుబోత వయి యెన్నో సందులం గొందులం
దూరం జూచితి విట్టివేడబములా దుర్మార్గుఁడా! మేము బే
జారై ని న్విడనాడి పోదు మనియా సంబుద్ధి నూహింతు నీ
యూరుం బేరును మాపి వేసెదను గర్వోన్మత్తుఁడా యంచునున్.

సీ. చేపపోటుప నోడి చెడి యావులించిన
మతి లేనిమూఢసోమకుఁడఁ గాను
పందిపిల్ల ముఖానఁ బడి వడి గోల్పోవ
బఱుఁగు హిరణ్యనేత్రుఁడను గాను
నరసింహుఁడను వాని కెఱయై హరీయనఁ
జచ్చు హిరణ్యకశ్యపుఁడఁ గాను
నీమాయలోఁ జిక్కి నిఖిలంబు గోల్పోయి
పాతాళమునకేగ బలిని గాను

తే. గీ. కోఁతిమూకఁ జయింపగాఁ జేతగాక
వణఁకి చచ్చిన పిరికి రావణుఁడఁ గాను
నిన్ను నీ పోతరంబును మన్ను సేర్చు
కాలయవనుఁడ నీపాలి కాలయముఁడ. 391

ఉ. చిక్కవటంట యెవ్వరికిఁ జిక్కిన దక్కవటంట యద్దిరా
దిక్కు దలంగు దేవతలు దీనులు మానులు తిక్కబాడబుల్
మ్రొక్కెడరంట నీకు సరి పోయెను వారికి నీకుఁ జిక్కినా
వెక్కడికేగ దక్కవో గ్రహించెదనేను బ్రశస్తమూర్తుఁడా! 392

ఉ. అంతటి యాదవాన్వయమునందు జనించి దిగంతకీర్తి వి
క్రాంతుఁడ వన్నపేరు గని శాత్రవులన్ వధియించి పృథ్వి నా
యంతటివాఁడు లేఁ డని విహార మొనర్చుచు విఱ్ఱవీఁగు ని
వింతటివాఁడ వేనఁటర యేమొ యటం చనుకొంటెఁ దొల్లిటన్. 393

మ. అరరే! యెంతటిమోసగాఁడవుర యొయ్యారాలసయ్యాటలో
దవువు ల్దీరెనుదీరుగా మసుఁగునం దాఁకొన్నమాత్రాన నీ
హారువుం గోరుమిటారినై నిలుతునా యానందమందాకమల్
మరుగు ల్విప్పునా కవుంగిట నిను న్మన్నింతునా దుర్మతీ. 394

మ నను దద్దమ్మల కమ్మ కంసుఁ డనుకొన్నావేమొ గాజల్ధరిం
చినపెద్దమ్మ జరాసుతాధమునిగాఁ జింతించినా వేమొ నీ
ఘనవక్షస్స్థలిఁ జీల్చి రుధిరౌఘం బాని దాహంబుఁబా
పిన శత్రుంజయ చక్రవర్తి నని రూపింతున్ మహిన్ నేఁటికిన్. 396

మ. ఆనియావేగవశుండ డైయె యవనుఁ డీర్ష్యాకార్శ్యము ల్పైమ్మనం
బున ఘట్టించియు మట్టుఁ బెట్టునెడ రంపు ల్పెంపు గావించియుం
దనవామాంఘ్రి నిగిడ్చి తన్నె హరియే ధాత్రీస్థలిం బవ్వళిం
చినవాఁ డంచుఁ దలంచి మించి కుపితు ల్సైనుంబు గామింతు రే?

ముచికుందుని వృత్తాంతము

మ. చిరకాలంబుగఁ దద్గుహాంతగమునం జింతాదుల న్వీడి సు
స్థిరుఁడై హాయిగ నిద్రపోయెడు మునిశ్రేష్ఠుం డాకం డట్లు ము
ష్కరుఁడై దన్నినమ్లేచ్ఛనాయకు పదాఘాతంబుచే నొచ్చి న
చ్చెర కన్విచ్చి దిశాంతము ల్వెదకి వీక్షించెం దురుహాఖమున్

ఉ. ఆకనుచూపులోఁ గల మహత్త్వ విశేష మదేమొ కాని సో
త్సేకదవానలప్రతిభఁ జెంది దిశాంతములంటి ముందఱన్
మేకొనియున్న మ్లేచ్ఛవిభు మేను దహించెను నిట్టనిల్వునన్
గేకలువెట్టి పెట్టి తలక్రిందు పడెన్యవనుండు బూదియై. 398

ఉ. సాధుజనావళిం గలఁచునాహవవిక్రియ తెప్పు డిట్టులే
బాధల కాకరం బనెడువారెవరు లోకమునందుఁ దెల్పఁగా
శ్రీధరుఁ డిట్టె చిత్రములు సేసి జగంబుల మేలుకొల్పెఁ దం
తాధుజనావనుం డా హరిసత్కృప లెన్న నశంబె యేరికిన్. 399

క. క్రూరుఁ డౌకాలయవనుఁడు కూలినంత
భక్తజనవత్సలుం డైన పరమమూర్తి
స్వస్వరూపముతోడ దర్శనమొసంగె
వందనీయుఁడు ఘనముచికుందునకును. 400

వ. అంత ముచికుందుం డప్పుండరీకాక్షు నాలోకించి తనివోక విస్మితుం
డయి యిట్లనియె.

ఉ. ఓమహనీయుఁడా యెవఁడవో దయసేసితి విందు నొంటిగా
నీమహితాటవిం దిరుగ నేమిటి కీగిరిగహ్వరంబునం
దేమి తలంచి వచ్చితివొ యింతకుముందు మహాగ్నికీలకల్
ప్రామి నశించిపోయిన కిరాతకుఁ డెవ్వఁడు నాకుఁ దెల్పుమా. 402

సీ. తలిరుటాకులకన్న లలితమౌ చరణము
లుగ్రభూస్థలి నెట్లు లుంచినావు
యంటినఁ గసిగందు నమృతశరీరము
గాలితాకిడి కెట్లు దాఁటినావు
పాలబుగ్గల ముద్దుబాలుఁ బోలెడునీవు
చిట్టడవుల కెట్లు చేరినావు
పెనుభూత మట్టిమష్టుని బారిఁబడియిట్లు
వచ్చి నాగుహ యెట్లు సొచ్చినావు

ఆ.వె. తల్లిదండ్రు లెవరు స్థలమేది యెచట నీ
యునికి యిచట బంధులున్నవారె
.యింతబలగ ముండి యేల వచ్చితి వీవు
తెలుపు మయ్య తేనె లొలుకు నుడుల.

శా. తేజోమూర్తులుమూలమూర్తి వన నుద్దిష్టప్రభావుండవై
భ్రాజిష్ణుం డగువిష్ణుమూర్తి వనఁగా భాసించి లోకత్రయ
ప్రాజాపత్యము గొన్న బ్రహ్మకరణిం భాసిల్లుచున్నావు నీ
నైజం బేమొ యెఱుంగరాదు త్రిజగన్మాన్యంబుగాఁ దోఁచెదున్.

చ. అన విని నవ్వి కృష్ణుఁ డనఘా నను నెవ్వనిగాఁ దలంచి నె
మ్మనమున నిల్పి భక్తి గొనుమార్గము నెంతువొ యట్టివాఁడ నే

నన రహించుమంతుఁ బరమార్థముఁ దెల్పితి నింక నీచరి
త్రను వచియింపు మీ యన నతండిటు విన్నె స్వవృత్తమంతటన్.

గీ. ప్రవిమలేక్ష్వాకువంశసంభవుఁడ నేను
యౌవనాశ్వభూజానికి నాత్మజుఁడను
పేరు ముచికుందుఁ డందురు పెద్దకాల
మయ్యె నిట నుండి నిద్రింతు నహరహంబు. 406

గీ. అసురబాధితు లై క్షీణించుచున్న
యింద్రుఁ డాదిదేవతలు ప్రార్థించుకతన
నేను వారల రక్షించు నేమ మూని
స్వర్గమును భద్రముగను గాపాడుచుంటి. 407

మ. బహుకాలం బిటు లేగినంతట విరూపాక్షుండు సేనానియై
మహనీయంబుగ నేల సాగి నను సమ్మానించి బృందారకుల్
విహితాచారము దీర్చి పుచ్చి రటుపై విశ్రాంతి నాసించి నే
నిహసంబంధము రోసి యీగుహను నిద్రింతుం జగన్మోహనా! 408

గీ. బలము గలవానిలో నెల్లఁ బ్రబలమైన
దరయఁ గాలమే యద్ది బ్రహ్మస్వరూప
మవ్యయంబు పరబ్రహ్మ మంచువలన
వెలయు మార్పు లనేకము విశ్వమందు. 409

ఉ. ఏను నిలింపరక్షణము నెంచి సహించియుఁ బెద్దకాల మం
దే నివసించియుంటి నమరేంద్రునికొల్వున నింతలోన భూ
స్థానమునందు నాది యనుసర్వమునుం గడతేరిపోయె నా
మానవులే కనంబడరు మాఱెసమస్తము పుణ్యవర్తనా! 410

ఉ. నశ్వర మైన యీజగము నాటకరంగము సూత్రధారి స
ర్వేశ్వరుఁ డాదిమూర్తి నటియించెడుపాత్రలు జీవసంఘముల్
విశ్వమయుండు స్వేచ్ఛగని వేడుక దీరుచుఁ గొల్చువారికిన్
శాశ్వతపుణ్యలోకములసౌఖ్య మొసంగి యనుగ్రహించెడిన్. 411

ఉ. ఆమహితార్థసత్పదవి నంది తరించుతలంపుతోడ నే
నేమముతో భజించుచు ననేకదినంబులఁగోలె శ్రీపరం
ధాముని రాక వేచి వితతంబుగ యోగసమాధినిష్ఠ యం
దీమలలోన నొంటరిగ నిట్లు వసించెద నీరజేక్షణా! 412

తే. ఎన్ని యుగములు చనెనో నే నిటఁ బరుండి
యొక్కఁ డైనను రాఁడు నాచక్కి కెపుడు
నేఁటి కేసీచుఁడో తన్ను నిదుర లేపెఁ
గర్మఫలమును గుడువనై కాలిపోయె. 413

మ. నినుఁగుర్తించుట కెంతవాఁడ ననఘా! నీరేజసంభూతుఁడే
కనలేఁడన్న నలంతు లెంచఁగలరా? కాత్యాయనీమాతకున్
మననీయుండవు నైన నీమహిమ సామాన్యంబె? లోకేశ్వరా!
ననుఁ బాలింపుము భక్తవత్సలుఁడవై నారాయణా! మ్రొక్కెదన్.

చ. అని ముచికుందుఁ డాడినమహార్థము లన్నియు నాలకించి మో
మునఁ జిరునవ్వు చంద్రికలు మోసులు దాల్ప గభీరమేఘని
స్వనమునఁ గృష్ణదేవుఁడు కృపాపరిపూర్ణకటాక్షవీక్షణం
బును నిగిడించి పల్కె నిటు పూవులవాన తొఱంగు చాడ్పునన్.

మ. అనఘా మామకజన్మకర్మగుణకార్యాభిఖ్య లెన్నెన్నో యి
న్నని వర్ణింపఁ దరంబు గా నివి యనంతం బౌను లోకంబులం
దనయంబుం జరియించుచుండు మనసా ధ్యానించి మానించు స
జ్జనబృందంబులు నాకుఁ జుట్టములు విశ్వఖ్యాతుఁ డే నయ్యెదన్.

గీ. బహుళయత్నమునఁ బరాగపంక్తి నేని
యిసుమునైనను లెక్కించు టెసఁగునేమొ?
కాని నాజన్మకర్మగుణానుభవము
లెన్నఁగారాదు మహితులకేని నిజము. 417

తే. సత్యము త్రికాలములయందు నియతులయ్యు
నెవరు నాగుణాదులను ధ్యానించుచుందు
రట్టిమహానీయులే పరమాప్తులౌదు
రనఘ యోనాకమును జెందగట్టివారు. 418

మ. అనఘా యిప్పటి నామజన్మ కథ వ్యాఖ్యానించెదన్ ధర్మర
క్షణ గావించి ధరాభరం బడప విజ్ఞాపించు బ్రహ్మేంద్రసు
ద్రనిలింపాదుల వాంఛ దీర్ప యదువంశఖ్యాతుఁ డై యున్న స
జ్జనుఁ డాయానకదుందుభి ప్రియసుతుండై యుండుఁ గృష్ణుం డనన్.
శా. నియోగాగ్నికి నింధనంబయినయానీచుండు మ్లెచ్ఛుండఘున్
మాయోపాయ ధురంధరుండు బలసంపద్గర్వభూయిష్ఠుఁడా
నేయస్త్రాదులచేతఁ జావక కడున్ హేమించు నష్టాత్ముచేఁ
బ్రాయశ్చిత్తముఁ జేయఁ దెచ్చితిని నృపాత్మ్య సద్గోష్టికిన్. 420

—: కాలయవన జన్మ వృత్తాంతము :—

గీ. యాదవాన్వయమునకు మహావిరోధి
యదుకులోద్భవులకుఁ జావనట్టి చిత్ర
మైనజన్మరహస్యము నంగియున్న
వాఁడు తెల్పెద నాలింపు వానిచరిత. 421
క. మునుగర్గాచార్యుని నొక
దినమునఁ దనబావమరది తేకువతో నా
డినవాక్యసరణిఁజేసియు
జనియించెను వీఁడు పృథ్వి సద్గుణవర్యా! 422
ఉ. బావమఱందితో గలసి ప్రాజ్ఞుఁడు గర్గమహామునీశ్వరుం
డేవో విలాసవాక్యవిధు లెంచెడువేళ మఱంది హాస్యసం
భావనగాఁ నపుంసకుఁడవా రతిరాజ్యము నేలఁ జాలవా?
బావ యటంచుఁ బల్కె విని ఫక్కున నవ్విరి యాదవాన్వయుల్.
క. అది కారణముగఁ గోపము
మదినొంపఁ దపోధనుండు మగిడియు వాంఛా
ప్రదుఁ డగుశంకరుఁ గూరిచి
ముదమునఁ గావించెఁ దపము మునికులనాథా. 424
గీ. యాదవాన్వయభీకరుఁ డైనవాని
వారిచేఁజావఁ బోలని సూనుఁగవయునిఁ
దనయుగాఁ గోరి శంకరుదయను బొంది
కాంచె వాంఛాఫలంబును గర్గమౌని. 425

గీ. కాలయవనునిపిత బహుకాల మైనఁ
బుత్రకులులేమి జింతించి పుత్రభిక్షఁ
బెట్టు మనుచు గర్గాచార్యు వేడుకొన్న
నొప్పి కనె వీని నాతనియువిదయందు. 426

గీ. ఇది పురాణప్రసిద్ధమా సీశ్వరవర
జనితుఁడై యాదవులకు దుర్జయుఁ డితండు
భక్తనేత్రాగ్నిశిఖలచే భస్మమౌను
గాన నిచటికిఁ గొనితెచ్చినాను వాని. 427

వ. అని శ్రీకృష్ణుండు పల్కినంత విని బ్రహ్మానందచేతస్కుండై ప్రణుతు లొనసి యనేకభంగుల నతు ల్పాటించి యానందబా ష్పనిమిత్తంబుగఁ బాదపద్మములు ప్రక్షాళించి హృన్నీరజం బును నర్పించి మహార్ఘ్యపూజలను సమ్మోదమ్మునం జేయుచున్.

గీ. ఇరువదియు నెనిమిదవ ద్వాపరయుగాంత
మందు భగవానుఁ డుద్భవ మౌ నటంచు
వృద్ధగర్గమహాముని విశదపరచె
నేఁటి కది లభ్య మయ్యెను నిన్ను గంటి. 429

గీ. నీవు భువననిర్మాతవు నిఖలజీవు
లందు నంతశ్చరుఁడ వయి యుందు వెపుడు
నణువులైనఁ గదలవు నీయాజ్ఞ లేక
కర్మసాక్షి వమోఘసంకల్పుఁ డీవు. 430

—* ముచికుందుఁడు హరిని మోక్ష మర్థించుట *—

క. నిన్నుం జూచితి నాతప
మిన్నాళ్లకుఁ బండె ముక్తి నిం డని సుంలన్
ము న్నడిగితి నది యీ నొక
వెన్నుండే చాలు ననిరి వేఁచితి నీకై. 431

వ. అనవిని కృష్ణుఁడు మందహాససుందరాననుండగుచు నిట్లనియె 432

చ. నరవర! నీవు నిర్మలమనస్కుఁడ వంచితభక్తిభావవి
స్తరుఁడవు దేవతావిభుఁడు దారుఁడు నై బలవంతపెట్టి ని
న్వరములు గోరు మన్న సిరివైభవ మెంచియు లొంగిపోని సు
స్థిరుఁడవు శత్రుషట్కమును ద్రిప్పెదు నీహృదయానుసారమై. 433

గీ. నీవు నాయందు సర్వదా నిశ్చలముగ
మనసు నిల్పి భజించుచు మహిని గొంత
కాల ముండియు నాపైనఁ గలుషగహిత
మైన బ్రాహ్మణజన్మము నందఁగలవు. 434

మ. తగ నిక్ష్వాకుకులప్రసూతు ముచికుంద ఖ్యాతభక్తాగ్రణిన్
భగవంతుం డనుకృష్ణమూర్తి కరుణాపారీణుఁడై యాగత
ప్రగతుం దెల్పి యనుగ్రహింప నతుఁడై పాదార్చన జేసి కెం
పుగ సాష్టాంగనమస్కృతు ల్సలిపి తాఁబోయెన్ దపశ్చర్యకున్ 435

గీ. చనుచు ముచికుందభూపతి స్వల్పరూప
పరిమితముగఁ గన్పించెడు నర పశు తరు
లతలఁ జూచి కలియుగ కాలం బటంచు
నెంచి యుత్తరదిశఁ బయనించి పోయె 436

గీ. గంధమాదనగిరి కేగి కాంచి కదలి
యవ్వల నరనారాయణాయతనమైన
బదరికాశ్రమమును జేరి భక్తి గదురఁ
దపముఁ జేయఁదొడంగె శ్రీధవునిఁ గూర్చి. 437

ఉ. అంతటఁ గృష్ణదేవుఁడు గుహాముఖము న్విడిపోయి పట్టణా
ప్రాంతమునందు మ్లేచ్ఛనరిపాలుని సేనల ముట్టడించి వి
భ్రాంతి వలిర్ప సంగరపరాజితులం బొనరించి తద్ధనం
బంతయు ద్వారకాపురికి నంపెను యోగ్యభటాళితో సుతిన్ 438

—* జరాసంధుఁడు ప్రవర్షణ గిరిని దహించుట *—

సీ. గంతయెద్దులపైనుంచి కలధనంబు
నెల్ల ద్వారకాపురికి సాగించుచుండు
నింతలో జరాసుతుసేన లెదురుపడియ
రామకృష్ణులకున్ సాగరమ్మువోలె. 439

వ॥ జరాసంధుండు దురాగ్రహావిగ్రహుండగుచు, బడియునెనిమిదవ
పర్యాయము, చతురంగబలసమేతుఁడై త్రయోవింశత్యక్షౌహిణీసేనా
వారముంగూడి రంగదుత్తుంగసంగతమగు మహోత్సాహంబుమీఱి
శ్రీకృష్ణభగవానునిపై యుద్ధమున కాయత్తమై వచ్చునెడ కృష్ణుండు
బలరామునితో నిట్లనియె; 440

గీ. తొలుతబక లెల్ల గూలిరి మొదటిలో
ధాన్యమెల్ల మెదిగె దరగతులుగ
మెరికలట్టివారు మిగిలిరి వీర ల
వధ్యు లిపుడు కాలవశముఁజేసి. 441

గీ. ఈజరాసుతుఁడు నవధ్యుఁ డితనిఁజంపు
పురుషసింహుఁడు కరిపురిం బుట్టి పెరుగు
చున్నవాఁ డర్హకాల మాసన్నమైనఁ
గాని చావఁడు వదలుటే కార్య మిపుడు. 442

క. మనమొకవంచనమార్గం
బున గొని చనవలయు నిప్డు మూర్ఖుఁడు మనకుం
గనఁబడు ప్రవర్షణాద్రికిఁ
జనుదము రమ్మనుచుఁ జేరి సరభసగతులన్. 443

వ॥ రామునింగూడి ప్రవర్షణాద్రిఁ జేరంజనునావెన్నునప్పుడు 444

గీ. కనె జరాసంధభూపతి కనులవిస్ఫు
లింగములు రాల బొమలు వీరంగమాడ
నింగి ముట్ట నెలుంగు సెలంగ నార్చి
పట్టుఁడీ కొట్టుఁ డని వెంటఁబడి తరుముచు. 445

గీ. వాయువేగముగా సేన వచ్చుచుండఁ
గని మనోవేగమున బాఱఁగడఁగు వీరు
చిక్కినట్టులె కన్పింత్రుచిక్కఁబోరు
రామకృష్ణులు శాత్రవరాజుకపుడు. 446

మ. నిలువెల్లన్ వణఁకంగ ద్రవ్యముల నందే వేసి ప్రాణమ్ము లె
ట్టులొ దక్కించుకొనన్ హుటాహుటిగ దాటుల్వెట్టు నీచాతిదు
ర్బలచోరాధములట్లు పాఱెడు పరబ్రహ్మాదులం గాంచి చం
చలుఁడై దూఱుచు బిగ్గ నార్చుచు జరాసంధుండు వెన్నాడెడున్.

ఉ. ఇప్పటికేపదేడొయగునిట్టిరణంబులు నీకు మాకు నే
నెప్పుడుఁజూడనీవుపరువెత్తుట యప్పటికప్పుడెద్దియో
మొప్పితనంబుఁజూపి మముమోసముఁ జేయుచునుంటి విప్పుడా
గొప్పలుకుప్పగూలియొక గొల్లనికైవడిఁ బాఱుచుంటివా? 448

మ. అవతారంబులు దాల్చినా వఁట యివౌనా నీదు దివ్యాయతా
రవిశేషంబులు పాఱుఁబోతుతన మౌరా యిట్టిదుర్బుద్ధి ని
కవసానంబునకే తటస్థపడె వీరారాతితోఁ బోరుగా
ఎపముం గోల్పడి యున్నఁ జన్న నొక పేరా వీర దామోదరా. 449

గీ. నిన్నుఁ గన్నమ్మఁ దేవకి నెలఁతకడుపుఁ
జలువవలననె యిన్నాళ్ళు చావు రాక
బ్రదికియున్నావు నేఁటి కాప్రాప్తి దీరెఁ
బట్టరానట్టి దుర్బుద్ధి పుట్టుకతన. 450

చ. నిలునిలు మొందుఁ బోదు వవినీతుఁడ నీవు రసాతలంబులో
నిలుకడ నందిన న్వాడువ నీకులగౌరవ మీఁగిపోన రెం
దుల కిటు పాఱిపోయెదవు దోర్బల మొప్ప నెదిర్చి శాత్రవుం
గెలుచుటో యోధులకో తగినకృత్యము రాచకొలంబువానికిన్.

సీ. పులినోటఁ దలదూర్చి విలవిలలాడిన
గండము తప్పుట గగనసుమము
కోటిలో దల నుంచి కోకటిపోటుకుఁ
బలవించి గాలసిన ఫలము సున్న

మారెమ్మ కొంపలోఁ బారావతమువోలెఁ
జిక్కి దక్కుట స్వప్నచిత్రఫలము
వంటయింట శశంబువలెఁ జొచ్చి మఱపించి
జారిపోనెంచుట శశవిషాణ

గీ. మద్దిరా పాఱఁబోత నాయంతవాని
కరమునం బంటివై చిక్కి పరువు దక్కి
బ్రదుకఁజూచెదవా చాలుఁ గృతకవిధము
లన్ని సున్నయ వెన్నుఁడా యాగు మింక. 452

మ. అని గర్జించుచు వెంటనంటి హరిమాయాలోలుఁడై సేనతోఁ
జనుచుండెన్ బలవత్తరుండగు జరాసంధుండు కృష్ణప్రభుం
డును రాముండును బోయిపోయి వడి దాటుల్వైచుచుం బెక్కుయో
జనముల్దాఁటి ప్రవర్షణాద్రి గని యిచ్ఛామాత్రసంసిద్ధులై. 453

ఉ. ఏమహనీయ శైలముపయిన్ నిరతంబు సువృష్టి యొప్పునో
యమ్మహితాద్రి నెక్కిరి మహాత్ములు శ్రీబలరామకృష్ణులు
ద్దాముఁడు నై జరాసుతుఁడు తాళక యగ్గిరి నెక్కలేక తా
నేమియుఁ జేయలేక మది నెంతయు ద్వేషము ప్రజ్వలింపగన్. 454

గీ. పదునొకండు యోజనముల పరిమిత మగు
భీషణాటవీపరివృతపీఠభూమి
యీప్రవర్షణగిరిని దహించునెడల
నందుఁ బడిచచ్చెదరు క్రిములట్లు మాఁడి 455

చ. అని తలపోసి సేనలకు నానతులిచ్చిన వారుఁ దత్క్షణం
బునఁ జని నాల్గువైపులను ముట్టెడునట్టుల నూనెఁ బోసి య
గ్నిని రగిలించి రంత ధరణిగగనంబులు నంటుమంట లా
ప్పెను నిజసేనఁ గూడి చనె వేగ జరాసుతుఁ డాత్మసీమకున్

ఆ. వె. విశ్వమయుఁడు శౌరి విధివిధానము లెన్న
జగతిజనుల కేమిసాధ్య మౌను
మందబుద్ధి యైనమాగధేశ్వరుఁ డేమి
తెలియఁగలఁడు కృష్ణదేవు మహిమ. 457

గీ. కడలు ముట్టుము నల్దిశ లాల్చుమంట
లొగని దశైకయోజనోత్తుంగశైల
శిఖరముననుండి రామకృష్ణులు చెలంగి
నేల కుఱికిరి లంఘించి లీలవోలె. 458

గీ. సేనలం గొనిపోయెడు చెనఁటిరాజు
కనులఁ గారమ్ముఁ జల్లి శ్రీకరుఁడు మెల్ల
మెల్లగా ద్వారకం జేరి యిల్లుఁ జొచ్చి
సుఖముగాఁ గాలమును బుచ్చుచుండె నంత. 459

క. లీలానిర్జితదుర్జన
జాలా! శరణార్థి భక్తజనపరిపాలా!
లోలాక్షీనవమన్మథ
బాలా! కళ్యాణగుణవిభావిత శీలా! 460

వ. ఇది శ్రీసుబ్రహ్మణ్యేశ్వరకృపాకలిత కవితావిధేయ, నాగేలవంశసుధాపయోనిధి కలానిధిగేయ, వేంకటశేషగిరిరాయ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణాభ్యుదయ మహాకావ్యంబునఁ జతుర్థాశ్వాసము
ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.



ఓమ్

# శ్రీకృష్ణాభ్యుదయము

## పంచమాశ్వాసము

క. శ్రీరుక్మిణీశ! కేశవ!
నారాయణ! దుష్టశిక్షణా! శిశుపాలా
ద్యారాతిగర్వభంజన!
వీరోత్తర! వృష్ణివంశవిలసన! కృష్ణా! 1

వ. అనంతరవృత్తాంతంబవధరింపుము. 2

క. శ్రీమంతుం డానర్తక
భూమీశుఁడు పద్మగర్భప్రోత్సాహమునన్
శ్రీమతి రేవతికన్యను
రామునకు సంగగి పెండ్లి రయమునఁ జేసెన్. 3

ఉ. శ్రీనిలయంబునై సుజనసేవితమై సకలక్షమానుస
మ్మానితమై విరోధిజనమార్గనిరోధకవప్రసామ్యమై
దానులకాలవాలమయి సర్వజనప్రమదైకమూలమై
మానితమై విదర్భయనుమంజులదేశము కల్గు ధాత్రిపై. 4

చ. ప్రకటవిదర్భదేశపరిపాలకుఁడై యశమందుచుండె భీ
ష్మకుఁ డనురాజరాజతఁడు శత్రుభయంకరుఁ డాశ్రితావనుం
డకలుషపుణ్యమూర్తి పరమార్థవిచారపరాయణుండు శి
ష్టకమలబాంధవుండు వికటప్రతివీరభయంకరుండునై. 5

చ. అతఁడు తనూజపంచకము నర్మిలిపుత్రిక యొక్కతె కల్గి సం
తతహరిభక్తియుక్తుఁ డయి ధారుణినాథకిరీటరత్నశో
భితపదపంకజుం డగుచుఁ బృథ్వి నజేయుఁ డటంచు శౌర్యవి
శ్రుతుఁ డయి రాజ్యమేలెను యశోరమణీపరిశోభితభూమనున్ 6

ఆ. వె. రుక్మి, రుక్మరథుడు రుక్మబాహువు రుక్మ
కేతు రుక్మమాలి ఖ్యాతులైన
పుత్రపంచకమును పూతచరిత్ర యా
తనయ రుక్మిణి యనఁ దనరుచుండు. 7

తే. ఆణవికము కార్మికము మాయికమలంబు
దర్ప మాయేయికము తిరోధాన మనెడు
పంచమలము లనంగ భూపతికుమార
పంచకము వాసి గనియెఁ బ్రపంచమందు. 8

ఉ. పంచమలంబు లన్నసుతపంచకమున్ గుణవంతురాలు శో
భాంచితకీర్తిశాలిని గుణాఢ్య రమారమణీశిరోమణిన్
ప్రాంచదమానుషాంశమున బాహిరరూపము గన్నపుత్రినిన్
గాంచెను భీష్మకుం డతఁడు కర్మఫలాఫలమిశ్రమందుఁ గన్. 9

గీ. ఆణవికమలంబును బోలి యగ్రజుండు
రుక్మి "రుక్మ మ స్యాస్తీతి రుక్మి" యనఁగ
నశ్వరంబౌ శరీరము శాశ్వత మని
భ్రమసి మన్నించు స్వర్ణాధికముగ సతము. 10

గీ. కార్మికమలంబుకైవడి కడఁగి రుక్మ
రథుడు "రుక్మం రథే శరీరప్రయోజ
నే యనంగి" జ్ఞానార్థము లెన్నఁజేసి
వినవి దేహాభిమాని దుర్జనుడు శఠుఁడు. 11

గీ. మాయికమలస్వరూపి తృతీయసుతుఁడు
రుక్మబాహు విజ్ఞానవిరూఢిఁ జేసి
పాపకర్మప్రయోజకబాహుబలుఁడు
జడుఁడు మార్గర్వ విలసితస్వాంతుఁ డతఁడు. 12

గీ. దర్పమాయేయమలరూపధారి క్రూర
చరితుఁ డగు "రుక్మమేవ కేశాస యస్య
స ఇతి" దైహికానంద శశ్వత్ప్రికామ
సహితుఁ డగురుక్మకేశుఁ డజ్ఞానమూర్తి. 13

గీ. అగుఁ దిరోధానముల సామ్యుఁ డనగఁ రుక్మ
మాలి యనుపంచమసుతుండు మహితమార్గ
ములను బోఁద్రోసి క్షుద్రవిద్యలను మెచ్చి
దంభజీవన మొనరించు దర్పమూర్తి. 14

గీ. "తత్త్వమసి" "అహంబ్రహ్మాస్మి" తత్త్వవాక్య-
లరసి "ఏకమే వాద్వితీయం స్వయంప్ర
కాశపర్బ్రహ్మ' మను, తెల్వి గఱపునట్టి
పుణ్యభాగిని రుక్మిణి పుత్రి దనరు. 15

సీ. అపరంజిబొమ్మల కన్న మిన్న యనంగఁ
జెలువందు మోఁదీవెచెలువ మమర
శారదసంపూర్ణచంద్రబింబముఁ బోలి
డంబుమీఱుముఖాంబుజంబు దనర
వరపంకజములసౌరుఁ బురుడించి మురిపించు
రమ్యవిశాలనేత్రములు వెలయ
ముకురంబులబడాయి కికురించి పెకలించు
రమణీయమహాకపోలములు వెలయఁ
తే. కోమలారుణపల్లవకోటికన్న
లలితమై పాణిపదతలంబులు రహింప
దాడిమీబీజము లన రదనము లమర
బాలరుక్మిణి యందాలబరణి యయ్యె. 16

సీ. శశకచిహ్నము లేక స్వచ్ఛుఁడై శశియున్న
బాలనెమ్మోమును బోలునేమొ
యున్నత శేషన్న నుదయార్కకిరణముల్
చానమైఁజాయకుఁ జాలునేమొ
మృదులమై కెంపు రహించుచో బాలిక
వాతెఱతో దీటు వచ్చునేమొ
కింజల్కములు లేక కెఱలుచోఁ గమలముల్
సతినేత్రయుగముతో సమములేమొ

గీ. నిమ్ముపూవందనరసుధ గుఱిసి కుఱిసి
ముద్దుముచ్చట్లఁజడి చాన మొగియఁ జేసి
బాల రతిచాలమూల యై పరవశతను
గొల్పుచుండెను బాంధవకోటి కెల్ల. 20

సీ. ఈడుబాలికలతోఁ గూడి బాలక్రీడ
లాడుచు హారికీరిఁ బాడుచుండుఁ
క్రొమ్మించుకెంపుపవ్రజమ్ములతో బొమ్మ
రిండ్లు కట్టించి క్రీడించుచుండు
నాఁడు పెండిలివారి జోడుగాఁ దగఁ గూడి
బొమ్మలపెండ్లిండ్లు పొసఁగఁ జేయు
విందుభోజనముల వేడ్కకై గుజ్జన
గూళ్ళు వండించి పంక్తులను దిద్దు

తే. నెత్తముఁ బూస వైభవోపేతముగను
వేడుకల వేడబము లెల్ల వెలయఁ జేయు
బాలరుక్మిణి శైశవప్రాయ మిటుల-
గడపె హాయిని మిగులొత్తు కడకఁ బేర్మి. 21

ఉ. ఆమహిళాశిరోమణి గృహాగతభూసురగీయమాన సు
శ్యామలమూర్తి కృష్ణపరమాత్మనిరూపగుణప్రతాప వి
ద్యామహిమాంబుల న్విని మహామదమందుచు వానిఁ గోరి హృ
త్స్వామిగ నెంచి చిత్తజలజంబు సమర్పణఁ జేసె నొప్పుగన్. 22

శా. శ్రీకృష్ణుండును రుక్మిణీరమణిసౌశీల్యానురాగక్రియా
శ్రీకంబుం గుణరూపలక్షణసుధీశ్రేష్ఠత్వవిన్యాసముల్
సాకల్యంబుగ నాకళించి మధురేచ్ఛాబద్ధుఁడై సంభృతో
త్సేకం బొప్ప వరించెఁ దా హృదయరాజ్ఞిం గా నిరూఢంబుగన్.

ఉ. బాల గుణాలవాల పరిభావితరత్నకపోల మంజుతా
పాలవశీల శ్రీరమణపాదసరోరుహలోల భాసురో
త్తాలయశోవిశాల పరితర్పితపండితజాల చారుతా
మాల యనంగ రుక్మిణి సుమన్విలసిల్లె ననన్యసంపదన్. 24

సీ. భామయో లోకాభిరామయో లావణ్య
సీమయో రతనాలదామమేమొ
రాణియో చదువులవాణియో నీరద
వేణియో పల్లవపాణియేమొ
కొమ్మయో యపరంజిబొమ్మయో చివురాకు
రెమ్మయో ముద్దులగుమ్మయేమొ
బోటియో ముత్యాలమూటయో గుణముల
పేటయో లలిపొంగుబాటయేమొ
తే. ననుచుఁ గనుఁగొన్న సుజనులు మనములందు
వింతలొనరించి మెచ్చుచుఁ బ్రణుతిఁ జేయ
రుక్మిణీదేవి మంజులరుక్మదేహ
యయ్యె నవయౌవనంబుమై నంకురింప 25

సీ. కందమయ్యలివేణికచభారరుచి గేరు-
జంపకంబును మించఁజాలు మేను
నుత్పలమాలిక నోడించుఁ గనుదోయి
మత్తేభగతిఁ బోలు మగువ నడక
చెవులు మంగళమహాశ్రీలఁ బోలి రహించు
మత్తకోకిలతీరు మధురవాణి
పృథ్వీవృత్తముకీవి పిఱుఁదులహా యొప్పు
గీతమై సత్కీర్తి కెలయఁ బసంగు
తే. కృతుల వర్ణింపఁదగువృత్తతతిని నవయ
వములుగాఁ గూర్చి పద్మసంభవుఁ డనుకవి
యిమ్మహాకృతికన్య రచించె ననఁగ
నొప్పు శ్రీరుక్మిణీదేవి యుర్వియందు. 26

ఉ. శ్రీకరమూర్తి వృష్ణికులసింహకిశోరము కృష్ణమూర్తి [illegible]
యాకృతికన్యకామణి ననన్నివిధాల వచించుభర్తయై
ప్రాకటవైభవోన్నతులు భవ్యయశంబు [illegible]
కైకకవీశ్వరప్రసరుఁ డంబుజగర్భుఁడు [illegible]. 27

సీ. అరవిందకుసుమమో యన నొప్పునెమ్మోము
వికసించి కలరూపు విప్పసాఁగె
యౌవనచిహ్నము లంకురించి శరీర
లతకు నూతనశోభ నతుకఁజొచ్చె
సరసవాక్చాతురవిస్రంభసంరంభము
లొక్కటొక్కటె యిగురొత్తుచుండె
విలసిల్లులలహోయల్ మొలకరించి బడాయి
చెలరేగి నిలువెల్లఁ బులుమఁదొడఁగె

తే. నవ భావవిలాసవిన్యాసగరిమ
గొదలు నెత్తి నాట్యము లాడఁగడఁగె
నంగకమ్ముల శుభరేఖ తొంగిచూచె
రుక్మిణీదేవి యౌవనారూఢ యైన. 28

తే. రుక్మిణీదేవిహృదయవిరూఢి నెఱిఁగి
భక్తచిత్తప్రవృత్తి సాంప్రతముఁ దలఁచి
యన్నివిధములఁ గృష్ణుఁ కర్హ యైన
గృహిణి యని యెంచె భీష్మకనృపవరుండు. 29

తే. తాను పత్నితోడ యోజించి తగినబంధు
వరులయాలోచనలఁ గని ద్వారకాధి
నాథుకులరూపగుణములఁ గాంచి యతఁడె
తగినవరుఁ డని తలఁచె భూధవుఁడు మదిని. 30

ఉ. అంతట వృద్ధరాజు తనయాగ్రకుమారుఁడు రుక్మితోడ శ్రీ
కాంతునిఁ గూర్చి యాతనికిఁ గన్యనొసంగువిధంబుఁ గూర్చి నీ
మంతులు బాంధవుల్ తనదుమానిని తాను దలంచినట్టి వృ
త్తాంతము దెల్పినంత విని తాళక రుక్మి వచించు నిట్టులన్. 31

మ. జనకా పెద్దలు మీరు మీయెదుట వాచాటోపమున్ జూపనో
పను గానీ పసి కొక్కటొక్కటొకదివ్యాస్త్రంబుగా గ్రుచ్చి నె
మ్మనముం గ్రంతలఁ గొందఁ జేసి స్థిరతన్ మాయించి గోరించెఁ గా
ప్ర, నేఁ దెల్పెద నాపఁ దోఁచినవిధంబున్ దస్కు మన్నింపవే! 32

క. వియ్యమునకు నెయ్యమునకుఁ
గయ్యమునకు సమత వలయుఁగాదా తండ్రీ!
యెయ్యెడ నీకృష్ణుఁడు మన
వియ్యమునకు యోగ్యుఁడౌనొ విచరింపఁగదే! 33

చ. కులమున నా విహీనుఁడగు గొల్లఁడు వాఁడు గుణంబు లెంతయో!
పలురతనాల కిక్క యొకపాటియు మాటయు లేనివాఁడు శ్రీ
కలితుఁ డటంచనూ తనదిగా వచియించెదు పూరిపిల్లఁముల్
గలుగదు పొట్టకూటికొఱకై పడియుండెనుఁ దాతయింటి గోప. 34

శా. పోషింపీరవరేణ్యుఁ డంచు విధిగాఁ బూజింతమా యెట్టివాఁ
డౌనో ధీరజరాకుమారకుఁడె సాక్ష్యం బిచ్చు విద్యాదులం
దేనైపుణ్యము యున్న దన్న నది యెంతే యాయనాట్యం బగుం
గానీ రచ్చల మెచ్చుకోఁదగిన దొక్కండైనఁ గల్పింమనా? 35

శా. పదీవాడెవరించిపోరి విజయం బింపార న్యాయ్యక్రియం
బ్రోదింగాంచినయట్టియుద్ధగతి యేదో మాయపన్నాగముం
బాదుల్ నెట్టియమానుషక్రియల సంగాళించునేకాని యే
తోదుల్ మెచ్చెన రట్టిపచ్చ మగుమచ్చుల్ జల్లు నీచక్రియల్. 36

చ. పసిపుఁ బ్రతిష్ఠ లేనికులపాంసనుఁ డాప్తపరార్థి దొంగపో
టరి గుణహీను డూర్జితవిడంబనినోదుఁడు మోహంతకారి ట
క్కరి గజదొంగ జాణఁ దొకకాసును లేనిదరిద్రుఁ పట్టిపో
కిరి నాకౌ గొరి కొరి పరికించితి రల్లుఁడుగాఁ గ నిస్సిరో! 37

ఉ. బంగరుబొమ్మ భీష్మకనృపాలునిబంగరు మొప్పఁ జేయుత
న్వంగి సహోదరాళికిఁ బ్రాణము సద్గుణకల్పవల్లి మూ
త్రింగొనిపట్టిలక్ష్మి కులదీపము చెల్లెలి రుక్మిణీసతిన్
దొంగకుఁ గట్టఁబెట్టెదరె తోఁచదు గోపక చేయఁ జెల్లునే. 38

ఉ. ఎందఱు లేరు సుందరమహీపసుతు లన్నివిధాలయందు మా
కుం దులఁదూఁగువారు మనకుం దగువిప్రగృహాంగణేరి వియ్యముం
బొందఁ దలంచు నంచితు శిశుపాలమహీపులాఁడు గో
పికుమఁడె చిక్కెనాఁడె పృథివీతలమ్మ మ్మిఁక గొల్లరయనా! 39

ఉ. మాయలమారికృష్ణునకు మాయనుజాత నొసంగుకన్న నే
గోయియొ నూయియో వెదకి గొబ్బునఁ ద్రోయుట మేలు మీయభి
ప్రాయము లట్టులే యయినఁ బట్టి నొసంగి తదీయ భార్యగాఁ
జేయుఁడు నేసహింతునె యిట్టి యవ రేగతిఁ జెల్వి మాలినన్. 40

తే. మేము సుక్షత్రియుల మని మీస లెల్లఁ
బెఱుకుచున్ బారెడేసి ప్రవరలు దెల్పు
వారలా గోత్రసూత్రముల్ వరుస లేని
పసులకాపరితోడనా బాంధవంబు. 41

మ. అని వాక్రుచ్చె రుక్మినెమ్మొగము భీష్మాగ్నిత్యసంకాశమై
ఘనదీప్తుల్ ప్రసరింప నేత్రముల నుల్కల్ రాల వీక్షించి యా
తని వారింపను నోరు రాక యటులే తన్మూర్ధమున్ జూచుచున్
ఘనుఁ డాభీష్మకరాజు నిల్చె ఘటికాకాలంబు మూగాడకే. 42

ఆ.వె. కొంతవడికిఁ దెలిసి కొమరుని వీక్షించి
తండ్రి యేల యిట్టి తామసంబు
తగినమను వటంచుఁ దలఁచితిమే కాని
యిట్లు దలఁతు వనుచు నెఱుఁగ మేము. 43

ఆ.వె. పెద్దకొడుక వీవు వేయేలనాయంత
వాఁడ వైతి వీవె భార మూని
చేయ రాదటయ్య చెల్లెలిపెండ్లినీ
కిచ్చు వచ్చినట్టి నృపునిఁ జూచి. 44

వ. అనిన విని రుక్మి యిట్లనియె. 45

క. లేఁడా శిశుపాలుఁడు మన
వాఁడేకాఁడా యనాదిబాంధవ్యముఁ బో
నాడుట మేలా కన్నెకు
నీడుంజోడున్ సురూపవృత్తులఁ జూడన్. 46

ఉ. అన్నివిధాల వాఁడు తమకల్లుఁడు కాఁదగియున్నవాఁడు సం
పన్నుఁడు వానితోడి బాంధవ మబ్బిన రాజలోకమం

వెన్నఁగ రానికీర్తి వహియించుట తథ్యము నాదుచెల్లెలే
పున్నెముఁ జేసెనో యిటు లపూర్వగుణాఢ్యుఁడు నాథుఁ డయ్యెడిన్

మ. వరుఁడా యోగ్యుఁడు విద్యయా విబుధసంభావ్యంబు సంబంధమా
యరుదౌనట్టిది ప్రాయమా మృదుతరం బౌయౌవనం బెంచఁగా
సిరియా పెన్నిధి తేజమా యగు జగజ్జేగీయమానంబు న
న్నరనాథాగ్రణితోడివియ్యమునకన్నన్ మిన్న యున్నే భువిన్. 48

చ. అన విని భీష్మకుండు పరిహాస మొనర్చుచుఁ జేదినాయకుం
డనుపముఁ డయ్యు రుక్మిణికి నర్హుఁడు కాఁ డని యెంచి పుత్త్రునె
మ్మనముఁ గలంప నోర్లక సమస్త మెఱింగినకర్మసాక్షి యే
య్యనువు ఘటించునో యదియె యౌ నని మౌనముఁ బూనెధీరుఁడై.

చ. పదపడి రుక్మి యేగి శిశుపాలునియానతిఁ జెందినంత నొ
ప్పిద మగుసన్మహూర్తమును బెద్దలచే నియమింపఁజేసి ప
మ్మదమున నిల్లు సేరి పురముం దగు రీతి నలంకరింపఁగా
ముదల నొసంగి శీఘ్రముగఁ బూని యొనర్చెను బెండ్లియత్నముల్.

తే. గీ. వస్తుసంభారములును గావలయునట్టి
ధనము ధాన్యము వాహనతతి సమస్త
భూషణములను గూర్చి సంపూర్ణయత్న
సిద్ధుఁడై రుక్మి తఱి వేచి చెలఁగుచుండె. 51

వ. అంత రుక్మిణీదేవి రుక్మిపంతంబుఁ దలంచి యింతిం తనరాని కలవంతలఁ గలంతపడి స్వాంతమ్మున. 52

శా. నాచిత్తంబు సరోజనేత్రునెడ లగ్నం బౌటఁ జింతింపఁ బోఁ
డా చైద్యాధము మెచ్చి నన్నతని కీయం జూచుఁ బెద్దన్న కా
దీచందం బుచితం బనన్ వినఁడు శ్రీకృష్ణున్ విరోధించి నే
నేచాయం బరియింతు గండ మిది యెట్లిష్టంబు చేకూరునో! 53

మ. అబల న్నేను జగన్మోహుం గని యసూర్యంపశ్య నివ్వేళ నా
ప్రబలౌత్సుక్యము శౌరి కెవ్వ రెఱిఁగింపం జాలువా రెట్లు చ
ప్పు బలాత్కారపుఁ బెండ్లి కల్గు నెటు సమ్మోదంబు నీరేజనే
త్రుఁ బతింగాఁ బడయంగ నాసుకృతి మిందున్ డెంద మిం పొందఁగన్.

వ. అని చింతించి నందనందనుకిం దనడెందంబు చందంబుం దెల్లంబు గావింపం దలంచి యారాజనందన 55

శా. అగ్నిద్యోతనుఁడన్న బ్రాహ్మణుని నాహ్వానించి పూజించి యు
ద్విగ్నాంతర్యముతోడ రుక్మిణి మనోభీష్టార్థముల్ సర్వమున్
భగ్నం బయ్యె మహాత్మ! సోదరుఁడె నన్బాధించు శ్రీకృష్ణుపై
లగ్నంబై సమనంబు ద్రిప్పుకొనఁజాలన్ జేల నైతక్కటా! 56

శా. స్వామీ తండ్రికిఁ దుల్యులీ రనెడువిశ్వాసంబునం బిల్చి మీ
తో మాటాడఁ దలంచితిన్ గలుగు నేదోదారి యంచెంచి నా
క్షేమంబున్ దిలకించు బాంధవులకే చేదై ప్రపంచంబునం
దేమార్గంబును గానరాక యిటు లూహింతున్ మనస్సిద్ధికై. 57

ఆ.వె. కన్నెపడుచె యింతగా సాహసముఁ జేసె
నని తలంపఁబోకు మార్యవినుత
నన్ను మించిపోయె నామనోవ్యథ దాని
వెడలఁ గ్రక్కుకున్నఁ గడుపలేను. 58

శా. నే నూహించినచంద ముత్తమమె కాని దానిఁ బాలించుస
న్మానుం డగ్రజు మూఢచిత్తుఁ డయి ప్రాణాధిక్యుఁడౌ సోదరుం
డే నాదారికి నడ్డమయ్యెఁ బిత యేమేఁ జెప్పఁగాలేఁడు స
న్మానింపందగుతల్లి స్త్రీ యగుటచే మాటాడ దవ్వానికిన్. 59

ఉ. కాఁదగువార లిట్లయినఁ గామిత మెవ్వరితో వచించి స
మ్మోదముఁ దీరఁజాలెదను ముద్దియ నొక్కత నేమిసేయుదున్
నాదురదృష్ట మిట్లగుట నమ్మితి నన్నివిధాల మీరె నన్
గాదిలిపుత్త్రిగాఁ దలఁచి కార్యముఁ దీర్చెదగంచుభూసురా! 60

తే. నీవు నావాంఛితములు మన్నింతు వనుచు
నెన్నివిఘ్నములైన సహింతు వనుచు
మాటయిచ్చిననే కాని నోటివెంటఁ
దెలుపఁజాలును తండ్రి నాతలఁపు నీకు. 61

క. అని కన్నీటిం జిమ్ముచు
వనితామణి మోము వాంచి పల్కెడునుడులన్
విని యంతట నగ్నిద్యో
తనుఁడు కృపాపరతఁ బల్కెఁ దరుణీమణితోన్. 62

ఉ. ఏవిధమైనబాధకము లెట్లు తటస్థములైననున్ సరే
జీవితమే సమర్పణముఁ జేయుటయైనను మానెఁ దల్లిరో!
నీవు విధించినట్టి పని నిర్మలభావముతో నొనర్చి నీ
సేవ లొనర్చి సార్థకతఁ జెందెద జన్మము నమ్మి తెల్పుమా. 63

మ. అనినన్ సంతసమంది రుక్మిణి మనోవ్యాలోలతల్ గొన్నిత
ప్పనివై స్త్రీజనసైజమైన త్రప సంభాళించుచో మెల్లమె
ల్లన శీర్షంబును డించి కించవడి నేలం జూచుచున్ బల్కె నో
య్యన భూదేవ వతంసునెమ్మనము నీరై పోవు చందమ్మునన్. 64

తే. అవనిఁ బుట్టినహరి కృష్ణుఁడను నాదు
మనసు వర్తించు నన్న నా మన సెఱుఁగక
ఖలుఁడు శిశుపాలునికిఁ బత్నిఁగా నొనర్పఁ
దలఁచె నే నేమి సేయుదు ధరణిదేవ 65

వ. కావున నాయందుఁ గరుణించి నీవు ద్వారకంజేరి నీరజనాభుంగని 66

చ. అనునిమిషంబుఁ లెక్కడి సుధాకరుఁ గోరుచకోరి తీరుగా
మననముఁ జేయుచుందు నని మన్ననఁజేయు మటంచు వానిద
ర్శనము లభింపకున్న మనఁజాల నటంచు వచింపుమయ్య త
త్క్షణమునఁ బోయిర మ్మనుచుఁ జాన వచించిన బ్రాహ్మణుండొగిన్

మ. హరి కృష్ణుండు మహానుభావుఁ డగు నమ్మా సత్యపాలుండు వి
చరితంబున్ వినినంత మెచ్చు నిను సాఫల్యక్ష్మినిన్ శ్రీరమా
వరునిం గూర్చుఫలంబు నిచ్చితివి నాభాగ్యంబె భాగ్యంబగున్
దరుణీ! ధన్యుఁడ నైతి నాభవము సార్థం బయ్యెఁ బ్రత్యక్షస్థలిన్. 68

ఉ. పోయెద నిప్పుడే పురుషపుంగవుతో సకలంబుఁ జెప్పియున్
నాయముఁ గోరి పిల్చెదను సాధుజనావనుఁ డౌట వాఁడు ని
న్నాయెడఁ గ నచ్చు దుర్నృపకులంబములన్ విదళించి నిన్ను నా
న్యాయయుతుఁడై వరించును యథార్థము నూవె కుమారి రుక్మిణీ! 69

క. అని యగ్నిద్యోతనుఁ డ
వ్వనితామణి నూరడించి పసదనములిపం
గొని పయనం బై చనియెను
ఘనవేగముతోడ ద్వారకాపురిఁ జేరన్. 70

సీ. ఎవ్వానివప్రగేహ మిందిరాసుందరీ
మందిరప్రాయమై విందు సేయు
నెవ్వానివాకిట నిభమదపంకంబు
గుప్పున నెత్తావి గ్రుమ్మరించు
నెవ్వానిప్రాంగణ మెనలేని మణిమాలి
కావిరాజితము నై కానుపించు
నెవ్వానిముంగిట నేప్రొద్దు గాజులు
పడిగాపులై పంచ విడువకుండు

తే. రట్టిపావనమూర్తి లోకైకకీర్తి
సాధుజనవర్తి దేవతాచక్రవర్తి
కృష్ణమూర్తికివాస మౌగృహముఁ గాంచె
బ్రాహ్మణుఁడు పూర్వపుణ్యానుభవమువలన. 71

చ. కనుఁగొని నేత్రపర్వముగఁ గావలివారలఁగాంచి కుండినం
బునఁ గలబ్రాహ్మణుం డొకఁడు ముఖ్యవిశేషము ముచ్చటింప వ
చ్చె ననుచు వార్త నంప విని శ్రీహరి యానతి ద్వారపాలకుల్
గొనిచని రమ్మహీసురుని గొబ్బున నంతిపురంబులోనికిన్. 72

చ. కనుఁగొనె బ్రాహ్మణోత్తముఁడు కన్నులపర్వము కాఁగ శ్యామమో
హనరుచిరాంగు నవ్యవనజాయతచారువిశాలనేత్రుఁ బా
వనపదపల్లవాంచితుఁ గృపామయు దీనదయాళు దేవకీ
తనయు మహానుభావు విబుధప్రియుఁ గృష్ణకుమారు నయ్యెడన్.

మ. హరి నారాయణుఁ డద్ధరామరునిఁ బ్రత్యక్షంబుగం జూచి సుం
దరహేమాంచితపీఠమున్ డిగి సమాదర్శంబుగాఁ బోయి డ
గ్గరి కైదండ యొసంగి పిల్చుకొని శృంగారప్రభావంతమౌ
వరసింహాసనమందు నిల్పి కడు సంభావించె సోత్సేకుడై, 74

మ. పరమామ్నాయవిదుండు సాధులకుఁ బ్రాప్యస్థానమౌ వాఁడు శ్రీ
హరి విప్రోత్తము పాదము లడిగి మార్గాయాసముం దీరఁ ద
చ్చరణద్వంద్వము నొత్తుచున్ వివిధపూజల్ సేయుచున్ స్నేహసా
దరవాక్యంబుల నాడుచున్ జలిపె సత్కారమ్ము లొక్కుమ్మడిన్,

ఉ. అంతట వాసుదేవుఁడు ధరామరుతోడ గృహాంతరంబునన్
వింతగు షడ్రసాన్నములవిందు ముగించి విడెంబుతోడఁ బూ
బంతులుఁ జందనాదు విడి పర్వముగా సరసోక్తు లాడుచున్
స్వాంతము నొప్పఁజేసి తగుభంగిని బ్రశ్న లొనర్చె నంతటన్. 76

క. ధరణీదేవోత్తమ మీ
వరధర్మము లెల్ల లోటుపాటులు లేకే
జరిగెడుగద సంతోషము
బొరయుఁగదా యెందు గుందుఁ బొందరుగాదా? 77

తే. నిత్యసంతోషియయి పృథ్వి నెగడునట్టి
బ్రాహ్మణుండె సమస్తప్రపంచమునకు
సకలవాంఛలు సిద్ధింపఁ జాలినట్టి
కల్పభూరుహ మమరసంకాశుఁ డనఘ! 78

తే. ఎవఁ డసంతుష్టుఁ డగుచు వర్తించుచుండు
నట్టి విప్రుఁ డనిష్టుఁడై యుర్వియందు
నష్టమాహాత్మ్యుఁడౌనె యనారతంబు
కష్టముల నొందుచుండు నిక్కముగ దేవ. 79

చ. కలిగినయల్పమో తృణమొ కాఁగలభాగ్య మటంచుఁ దృప్తితో
మెలఁగెడువాఁడె భోగి పరమేశుఁడు వానిని మెచ్చి సర్వదా
కలిమి యొసంగి ప్రోచు నరి కల్గినివాఁడు మహేంద్రతుల్యుఁడై
నిలిచిన నిష్ఫలంబె యగు నిర్వృతి మార్గము లేమి నానికిన్. 80

మ. జగతీదేవకులోత్తమా విను యదృచ్ఛాలాభసంతుష్టుఁడై
భగవద్భాగవతార్చనాపరుఁడునై భావించి భూతంబులం
దగ నాత్మీయతఁ బ్రీతినొందెడు మహాశాంతస్వాంతుఁడౌ విప్రు నొ
ప్పుగఁ బూజించి శిరంబువంచి చరణాంభోజంబులన్ గొల్చెదన్.

మ. అది నానిత్యవిశేషధర్మ మగునయ్యా! యెన్మహీపాలుఁ డొ
ప్పిద మారీతిని దత్ప్రజానికరముం బ్రేమించి పాలించు నా
సదయుం డాతఁడె నాకు మిత్రుఁ డగు మీయాత్మనాయకుం డట్టిస
ద్హృదయుం డం చని యెంచు శ్రేనుమెకదా? దేవీసమేతంబుగన్. 82

ఉ. భూసురవర్య! మీరు శ్రమఁ బొంది యగమ్యపుద్వారకాపురీ
భాసురదుర్గమున్ గడచి వచ్చితి రెట్టివిశేషకార్యము
నోన్న సెలవీయఁబోలు నది యొప్పిదమైన దలం ధరించియున్
జేసెద నోపినంతఁ దమిఁ జెందెద బ్రాహ్మణకార్యకర్తనై. 83

చ. అనవుడు బ్రాహ్మణుండు పరమాత్ముని దారసరాగవృత్తముల్
మననముఁ జేసి తృప్తుఁ డయి మానిని రుక్మిణి యిచ్చినట్టి క
మ్మను హరిహస్తమం దిడి నమస్కృతిఁ జేసి విదర్భరాజనం
దన తను కందఁజేయు మని తద్దయుఁ బంపిన దంచుఁ దెల్పుచున్

మ. హరి కృష్ణా విను మాశ్రితావళికిఁ గాప్యస్థాన మైనట్టి నీ
చరణాబ్జంబులు రుక్మిణీరమణి యశ్రాంతంబు ధ్యానించుచున్
బరమానందముఁ జెందు నిన్నుఁ బతిగా భావించి పూజించు న
త్తరుణీరత్నము నగ్రజుం డొకఁడు మధ్యన్ వచ్చె విఘ్నేశుఁడై. 85

ఉ. ఆనితల్లిదండ్రులును నాప్తులు బంధువు లెల్ల మెచ్చి నీ
కే సతిఁ గూర్ప నెంచుకొని రిందఱుఁ గాదని రుక్మి యొక్కఁడే
దోసడిఁ బెట్టి తొయ్యలిని దుష్టుఁడు చేదినృపాలు కీయఁగన్
జేసి ముహూర్తమున్ స్థిరముఁ జేసెను నాల్గవనాఁట నయ్యెడున్ 86

శా. సన్నే నమ్మియు నన్నపానములనున్ వీక్షింపదే నీకునై
తెన్నుల్ సూచుచు నున్న దచ్చెలువ సందిగ్ధస్థితిన్ జెందియున్
గన్నుల్ వల్లఁ గఁ జూచుకొన్న బ్రదుకున్ గాదేని హత్యస్తమౌ
నన్నా విన్నప మాలకించి చనుమా యబ్జాక్షి రక్షింపఁగన్ 87

మ. ఇదిగో పత్రిక యిందు సర్వమును బ్రత్యేకంబుగా వ్రాసియు
న్నది నీవేకాని మాచుకొమ్ము తనమానప్రాణసౌభాగ్యసం
పద యెల్లన్ హరియే యటంచు వినతుల్ పాటింపఁగా వేఁడుకొ
న్నది నీచిత్తము లేవ ప్రాప్తముఁ గృష్ణా! తెల్పితిన్ సర్వమున్ 88

శా. సర్వజ్ఞుండవు దేవదేవుఁడవు కృష్ణా! సర్వసర్వంసహా
నిర్వోఢుండవు నీ వెఱుంగనిది లేనేలేదు శ్రీరుక్మిణీ
పర్వేందుప్రతిమాననన్ముఖి స్వభావం బింపుతో నామొఱం
దుర్వారం బగునీవెతం దొలఁచి సంతోషంబు గల్పింపుమా. 89

క. అని యగ్నిద్యోతనుఁ డి
చ్చిన పత్రముఁ జేత నంది శ్రీకృష్ణుఁడు చ
య్యన ముద్రలు విడఁగొట్టియు
మనమున వలిర్పంగఁ జదివె మానిని లేఖన్. 90

సీ. శ్రీమన్మహారాజ! శ్రితకల్పభూజాత
ప్రాణాధినేత కృష్ణా నమోస్తు
హరిహరరూప విఖ్యాత జగన్నేత
దీనజనోద్ధార తే నమోస్తు
లీలావినోద గోపాలబాలకరూప
మానినీమన్మథా తే నమోస్తు
నీలజీమూతసన్నిభ మంగళాకార
జ్ఞానస్వరూప కృష్ణా నమోస్తు
తే. గీ. భువనసుందర యిందిరాధవ ముకుంద
భక్తమందార యాశ్రిత పారిజాత
మానసినీ మానసాంభోజ మధుపరాజ
దేవదేవ! విమలభావ! తే నమోస్తు. 91

సీ. క్షీరసాగరుఁడు బంగారుపళ్లెమునఁ
గమనీయజలములఁ గడిగె నెవ్వి
హృదయపీఠిని నిల్పి యిందిరాసుందరి
గుప్తముగాఁ దాచుకొనెను నెవ్వి
బ్రహ్మేంద్రరుద్రాది ప్రముఖులు సర్వదా
హృదయాస్పదముగ నర్చింతు రెవ్వి
భువనపావనమైన వ్యోమగంగాదేవి
పుట్టినిల్లనఁ గీర్తి పొందె నెవ్వి

తే. గీ. యట్టి నీపాదయుగళము నబ్జనేత్ర
నిత్యముఁద్రికాలములయందు నియతిఁబూని
హృదయమున నిల్పికొనియు నర్చించుచుందు
దాసురాలను దీన నిదాన నేను 92

మ. శ్రుతిపర్వంబుగ విందు నీకథలు రక్షోనాథ శత్రుండవౌ
దతిలోక ప్రతివీర మాఁకుఁడ నబ్జాక్షీ మనోమందిర
స్థితపుష్పాస్త్రుఁడ వాశ్రితావనుఁడ వాసీమాంత కీర్తిప్రతి
ష్ఠితరమ్యధ్వజ మండనుండవు జగజ్జేగీయ మానుండవున్. 93

మ. నిను సేవించి తరింపనెంచితిని నిన్నే నమ్మియున్నాను ప్రా
క్తనపుణ్యంబున నిన్ను నాపతినిఁగా ధ్యానించుచున్నాను ని
న్ననకున్నం భరియింపలేను వినుతు ల్గావించు దుస్తంత్రముల్
దునియల్ సేసి యనుగ్రహింపుము ననున్ దోస్సార మేపారఁగన్.

మ. కులమున్ రూపము సత్స్వభావమును సాంగోపాంగ విద్యావివే
కలసత్సంపదలున్ బరాక్రమము నీ కౌఁగాక లోకేశ్వరా!
కలఁడే యట్టిఁడు మూఁడులోకములలోఁ గల్యాణగోపాల నీ
చెలినై సేవకురాలి నై మనుట వాంఛింతున్ బ్రపంచంబునన్. 95

శా. నా యీ దేహములోని ప్రత్యణువు కృష్ణా! కృష్ణ! హేకృష్ణ! రా
వో యీ! కృష్ణ! యటంచు సేస లిడుఁ బ్రత్యూషంబున న్లేచి నీ
మాయారూపము నాత్మలో నిలిపి సమ్మానింతు నేప్రొద్దు దే
వా! యీదాసిని నేలుకోఁదగుఁ గృపాయత్తుండనై యీశ్వరా! 96

ఉ. ఎల్లిద మాడు నేమొ యిఁక లే నయి యుల్లము విప్పి చెప్పుచో
దల్లియుఁ దండ్రియుం బుధులు తాదృశబాంధవు లెల్ల రేకమై
యెల్లరు మెచ్చి మీకు నను నిచ్చి వివాహముఁ జేయనెంత్రు నా
వల్లభుఁ డీవె నేను పెంభామను గాను మనోజసుందరా! 97

చ. త్రికరణశుద్ధిగా వలపు దీరిచి దిద్ది వరించియున్న రా
చకొలము లేమ యన్యదని స్వాంతమునం దెటు గోరు దాని వే
ఱొకనికి నంటఁగట్టుతలఁ పూనుట మాన్మను విచ్చులేకదా!
యకలుషమూర్తి యిట్టికలుషాగ్రము చెల్లుట నీవు నోర్తువే. 98

మ. ఇది నానిశ్చయ మేను నీకొఱకు నీ పీదాసినై పృథ్విలో
యదువంశంబున నీవు భీష్మకధరాధ్యక్షాన్వయంబందు నే
నుదితంబైతి మనాదిబాంధవము కాకున్నన్ నినుం గూర్చి యీ
హృదయావేదన కల్గ దింతలకు నీవే సాక్షి ప్రాణేశ్వరా! 99

ఉ. నాదయితుండ వంచు నెఱనమ్మి లిఖించితిఁ గమ్మ యీపయిన్
నీదయ యేమి చేసినను నీపదపద్మమరందపానస
మ్మోదముఁ గూర్తు నా మనసు పొంగి భజించెదఁ గాని వేళ స
మ్మోహసముతో శరీరమును భూమికి దూఁగ మొనర్తు రూఢిగన్. 100

శా. నేనే నీసతి నీవె నాపతివి నింతే యెన్నిజన్మంబులం
దైనం బాయనిసన్బంధ మిది నాథా సూక్ష్మ మూహించి నీ
చానన్ నన్నుఁ బరిగ్రహింపుము దురాశావేశు లుర్వీశ్వరుల్
గ్లానిం బొందెద రట్లు రాక్షసవిధిన్ గైకొమ్ము నిక్కమ్ముగన్.

క. రాక్షసవిధిఁ గైకొనుటలు
సుక్షత్రియవంశకీర్తి శోభనపాటన్
రక్షావదక్షుఁడవై నీ
పక్షమునం జేర్చుకొమ్ము పావనమూర్తీ! 102

చ. ఇఁక నొకమాట వ్రాసి ముగియించెద లేఖ సమస్తదేశనా
యకులసమక్షమందు నొకయంతిపురాంగనఁ బట్టుటన్నఁ ద
ప్పక సమరంబు బొనర్చి కలబాంధవులన్ సరివారి నొంచి కా
ని కలుగదంచు నెంచి మది నిస్పృహఁ జెందెదు మీవు మాధవా!

ఉ. ప్రాణపతీ! వచించెద నపాయములేనియుపాయ మొండు ప్రా
చీనకులానుపూర్వకృతిఁ జేతురు పెండ్లికి ముందురోజునం
జానలు పెండ్లికూఁతు లయి శాంకరిపూజ లొనర్పఁ బట్టణ
స్థానబహిఃప్రదేశమునఁ దద్దయు నుందురు దేవళంబునన్. 103

సీ. ఘనవివాహముహూర్తమునకు ముందటిరోజు
పెండ్లికూఁతురివి గావింత్రు నన్ను
నూరికి వెలుపల నున్న పార్వతియాల
యమునకుఁ బూజార్థ మనుపఁగలరు

చిత్తప్రశాంతిగాఁ జేయింత్రు పూజలు
ముత్తైదువలు విప్రముఖ్యవరులు
కలకలం బెద్దియుఁ గలుగ దొంటరిదాన
నుందును దరి వేచి యొదిగి యొకతె

తే. నందు వేచియుండి హస్తంబు సాచిన
నందుకొనెద మిమ్ము నరదమందు
నన్నుఁ జేర్చుకొనుఁడు నాప్రాణనాయకా
సులభమార్గ మెంచి పలుకుదాన. 104

ఉ. ఆతరువాత నేమయిన నన్నిటికిం బరమేశ్వరుండ వీ
వే తగురీతిఁ దీర్చెదవు హీనజరాసుతుఁ జేదినాయకున్
బాతకి దంతవక్త్రు బలవంతుని రుక్మిని యోగ్యరీతులన్
జేతువు నే నెఱుంగుదును శ్రీహరి ప్రస్తుత మాచరింపవే. 105

గీ. ఇట్లు మీపాదదాసి రాకేందువదన
రుక్మిణీదేవి చిత్తనిరూఢిఁ జేసి
వ్రాసికొనుమనవి యటంచు వదలునట్టి
పత్రికం జూచి కృష్ణుఁడు పరవశుఁడయి. 106

ఉ. భూసురవర్యు హస్తమును బొందుగఁ జేత గ్రహించి నవ్వుచున్
మీసుత ధన్యురాలు పరమేశ్వరుసాక్షిగ నామెఁ దెచ్చి సం
త్రాసము దీర్తు నో యనఘ! తత్క్షణమే చని నేనునాపుర
భాసురదేవతాయతనపార్శ్వమునం దటఁ వేచి యుండెదన్. 107

ఉ. ఆరమణీశిరోమణి యహర్నిశ మెట్లు తపించుచున్న దా
తీరునసే సతంబును మదీయమనంబు తదేకదీక్షగాఁ
గూరిమి మీఱఁ బాటి యులుకుం దిలకించుచునుండుఁ జిత్తమం
దోరిమి లేదు సంతతమహోద్యమ మియ్యది భూసురోత్తమా! 107

గీ. ముత్తియములట్టియక్షరములు తదీయ
విమలహృదయప్రసూనము విప్పుచుండె
సౌమనస్యసౌరభ్యముగోము దీర్చి
మధుమరందము గ్రోల నామనసు దీర.  108

చ. దురితుఁడు రుక్మి యాతనిమదోద్ధతి నొంచి తదీయ మిత్రభూ
వరులకు బుద్ధిఁ జెప్పి బలవంతముగాఁ దరుణీవతంసమున్
సరగునఁ దెత్తు నే ననిఁ జక్కఁ మథించియు నగ్ని దీయు న
త్తెఱఁగున భూసురాగ్రణి సతీమణి కింత యెఱుంగఁ జెప్పుమా' 109

గీ. అనుచు బ్రాహ్మణువలన గల్యాణసమయ
మెఱిఁగి దారకు బిలిపించి తురగములను
బూన్చి రథమును గొని తేర ముదల నొసఁగె
దీనమందార మగు దేవదేవుఁ డపుడు. 110

గీ. శైబ్య సుగ్రీవ మేఘ పుష్పక వలాహ
కము లనం జెల్లువరఘోటకములఁ బూన్చి
రథము నాయత్తపరచి దారకుఁడు తెచ్చి
దోసి లొగ్గియు నిల్చె నుద్యోగి యాచు. 111

క. ధరణీసురు తోఁ గృష్ణుం
డరద మ్మావేళ నెక్కి యతివేగముగా
గిరులున్ నదు లాన ర్తక
పురములనుం గడచి చనియెఁ బురి కుండినమున్ 112

క. చని బాహ్యోద్యానవనం
బునఁ గృష్ణుఁడు వసతి గాంచి ముందుగ విప్రున్
బనిచెను రుక్మిణిపాలికిఁ
దనయాగమనంబు దెల్పి తర్పితఁ జేయన్ 113

వ॥ ఇది యిట్టులుండ నందు

క. పాత్రాపాత్రత లెఱిఁగిన
ధాత్రీపతి భీష్మకుండు తత్సుతు పేర్మిన్
బాత్రుఁడు హరి విడనాడి య
పాత్రుని శిశుపాలుఁ గోరెఁ బట్టికిఁ బతిగాన్. 114

సీ. రాజవీథులను మార్గములఁ జతుష్పథ
ములఁ మార్జన మొనర్పు ముదల నొసఁగి
కలయఁగాఁ బన్నీటఁ గలయాంపిఁ జల్లించి
ముత్యాలముగ్గుల ముదవు దీర్చి

రమ్యధ్వజపతాక రాజిఁ జక్కఁగఁ గూర్చి
తోరణమ్ముల సొంపు మీఱ నిలిపి
యందందు విందుగాఁ బందిళ్ళు వేయించి
తగు నలంకారముల్ దనరఁజేసి

తే. గీ. మేలుకట్టులు గట్టించి జాళువాప
సందుపుత్తలికలు నిల్పి సరస మధుర
వాద్యముల మేళములు నిల్పి పట్టణమ్ము
గనులపండువుఁ జేయించె క్ష్మావిభుండు. 115

గీ. పట్టణమున నాబాలగోపాలము కల
స్త్రీ పురుషు లెల్ల రుక్మిణీదేవి పెండ్లి
వేడుకలఁ జూడఁ దగురీతి వివిధవస్త్ర
భూషణముల ధరించి రిం పొదవుభంగి. 116

సీ. శ్రీరుక్మిణీరమా సీమంతినీ మన
స్సీమాభిరామ రాజీవసుమము
మధురమరందసంభరిత మై నెత్తావి
గమగమల్ కలవీచికలఁ నిగుడ్చ
హరిభృంగసంగతానంగపరిష్వంగ
సాంగత్యసుఖసమాశ్వాస మరసి
తళుకారువాలుచూపుల రేకులు నిగిడ్చి
హిమబిందు బాష్పతోయము దొఱంగ

తే. దశదిశాక్రాంతమండలస్థాన మెల్లఁ
గలయఁజూచి చలన్మినవిలసితార్ద్రి
దృక్కులన్ మించి మించుల దీప్తి దనర
సంచితార్థము లెంచి యోజించుచుండె. 117

చ. అది నడురేయి రాజభవనాంతరమం దొకపూలపాన్పుపై
నొదిగి పరుండియుండె నలయొప్పులకుప్ప మనోజ్ఞ మల్లికా
భ్యుదయశరీరవల్లి యది యొత్తిలియున్నది కాని యెందుకో
వదనము చిన్నపోయినది వాలెఱబింబము డంబువీడఁగన్. 118

చ. సుదతులు కొంద ఱమ్ముగుదఁజుట్టి నితాంతలతాంతశయ్యలన్
నిదుర మునింగినారు సతినెచ్చెలులేమొ యెఱుంగ రొక్క ర
మ్మదిత తెఱంగు లేచి యొకమూఁగవిధాన జరించియట్టిటుల్
కదలి కవాటవాటికకు గ్రక్కున జేరియు మీట నొక్కటన్. 119

చ. వెలుపలఁ జేరి రత్నమయవేదిక నొక్కటి గాంచి దానిపైఁ
జలువగలీబుదిండ్లపయిఁ జక్కగ గూర్చొని మోము నెత్తియున్
లలిఁ దులకించు షోడశకళాపరిపూర్ణుఁడు జాలుగాయ వె
న్నెలదొరఁ గాంచి కాంచి నవనీతరుచుల్ గని యీసడించుచున్

చ. పలుకదు కాని రమ్యముఖపద్మముపైని మృణాలకోమలాం
చలకర ముంచె నడ్డముగఁ జారువినీలవిశాలనేత్రముల్
జలజల బాష్పబిందువులు జార్చవ దొడంగె నదేమిపాప మ
య్యలికులవేణి వాంచెను వరాంగము నంచిత యాటనోర్వమిన్

గీ. ఈవిశాలవిశ్వాంతరాకాశావరణము
నందలి యనంతకోటి జీవాత్మ లెల్ల
శాంతవిశ్రాంతి నందుప్రశాంతసమయ
మేలనో యామె నంతగ గ్గోలుపఱచె. 122

ఉ. జందనగంధి లేనగవు చంద్రిక గైకొనె మోముగోమునున్
చందురుఁ డందిపుచ్చుకొనె నాసన రెంటికి రెండు నేవియో
బంధువులున్ శశాంకమును బిచ్చము పెట్టిరి యందుకో గనూ
సుందరి బోలు నామె శశిఁ జూచినతోడనె డించె శీర్షమున్. 123

ఉ. చందురుఁ జూచి చూడక యొచక్కని పద్మము మోము వంచు నా
చందముగానె లేనుముఖ సారసమున్ ముకుళించె నుప్పలా
నందుఁడు కానఁ బాననయనంబులు విచ్చి సరాగబిందువుల్
చిందఁదొడంగెఁ గల్వల విశిష్ట పటిష్ఠత నొప్పనిమ్మఱగన్. 124

చ. చల్లనిపిల్లగాడుపులు చక్కిలిగింతలుఁ బెట్టుచుండ సం
ఫుల్ల మనోజ్ఞపుష్పములు పుష్పఫలలన్ నివలించుచుండె నా
బిల్లి వెలుంగులో మసుఁడు పిల్లనగ్రోవుల నూదుచుండె నా
పల్లవపాణి యుల్లమున భల్లము గ్రుచ్చెను నొక్కటొక్కటై. 125

గీ. మూఁగనోము పట్టెనదేమొ సోగకనుల
తోసరాగ విరాగ సంతోష దుఃఖ
ములను వెలిఁ జేయు గాని ముద్దుల మిటారి
నోరు విప్పదు చెప్పదు కోరికలను. 126

చ. హృదయవిపంచిలో నణఁగి యేలనొ రాగసుధారసాంచితా
స్పదమగు భావగీతికలు పర్వవు వారవు లేతనవ్వులున్
బెదవులలోనె డాగినవి భీతమృగేక్షణముల్ దిశాంతముల్
బొదివెడు కెంపుసొంపులను మోదమొ ఖేదమొ యేదొ గూఢమౌ.

క. అదిగో పైఁదలి యేదో
పెదవుఁ మెదలించుమన్న విధ మగుపించున్
హృదయస్పందన మేమో
యదరుట కన్పించు దేహమందు స్ఫుటముగన్. 128

—* శ్రీకృష్ణుని యాలస్యమునకు రుక్మిణి పరితపించుట *—

ఉ. మొన్నటి స్వప్నవైభవము ముద్దులహద్దులు మీఱలేకనున్
నిన్నటి సన్నివేశ మది నిద్దపుఁ జెక్కిలిసోకు పద్దుతోన్
సున్నయిపోయె నేటికథ చుక్కల కంటెడునేమొ కాని నా
కన్నులు విచ్చె నంతటనె గాంచితి లోకము వెఱ్ఱిమొఱ్ఱిగన్. 129

క. ఆమధురస్వప్నములం
దేమి మహత్త్వంబు కలదొ యేమో కానీ
స్వామి సదా కనుపాపల
లో మెదలుచునుండె హృదయలోలుపుఁ డౌచున్. 130

ఉ. ఎన్నఁడు జూడకున్న నది యేమొ మనోహరునాత్మరూపమున్
గన్నులు వేలు లక్షలుగ గాంచుచునున్నది నాదుడెంద మా
పున్నమచందమామ యఁట బూడిద వెన్నని కాలిగోటితో
నెన్నిభవంబు లెత్తి తపియించిన నిడగు మోముగోమునన్. 131

మ. యువతీమన్మథుఁ డిట్టివాఁ డగునొకో యుత్ప్రేక్షయా నేమొ యం
చవగాహించితి నిన్నినాళ్ళు ప్రణయవ్యాపారలోలాత్ముఁడై
యవతారంబును దాల్చినాఁడు నను నర్ధాంగిన్ విచారింపకే
యవమానంబున ముంచినాఁడు సరె యేమౌనో నిరీక్షించెదన్. 132

మ. అతఁడే నే నవి యాతఁ డని దివ్యఖ్యాతిఁ జెన్నారు మ
మ్మితరుల్ వేర్పరుపంగడంగెదరె? నా కీనాఁటి కీరుక్మియున్
గతజన్మంబులఁ జంద్రుఁడున్ సహజులై గారింతురే కాక దు
ర్మతముల్ చెల్లిన విప్పఁజాలివవొకో మాబంధసంబంధముల్. 133

క. నేను నేను గాను వానిలో నణువునై
మేను బంచుకొన్నచాన నౌదు
వాఁడు వాఁడె విశ్వభావనుఁడు ననంత
పావనుఁడు త్రిలోకసేవితుండు. 134

ఉ. రేపె కదా సశేషనిశి తెప్పలమాటున డాగియున్న చి
త్రాపకలాపమో హృదయరోదసికోణము లంటియున్న సం
తాపవిరూపమో యుచితతాండవ మాడి ఫలాఫలానుభో
గోపచయంబు లేర్పరచి యొప్పమి దప్పమి నేర్పరించెడిన్. 135

మ. యువతీమన్మథుఁ డిందు వచ్చునొకొ రాఁడో రాకపోనా రమా
ధవుఁడే జ్ఞప్తి దొలంగునా తొలఁగదో సంధాన మేలా వృథా
యవనీదేవునిఁ బంపుటానొకొ వృథా యానా మహాకీర్తిగా
నివురుం దీర్చుట యొప్పు నిప్పునకుఁ గానీ ప్రాప్త మేమైననున్. 136

క. అని తర్కవితర్కములను
మననముఁ జేయుచును రోసి మానసవీథిన్
ఘనశకటంబులు పర్విడ
వనజాయతనేత్ర శాంతి వఱలక నుండెన్. 137

ఉ. ఇంతకు బ్రాహ్మణుం డచటి కేగనొ మార్గమునందె యుండెనో
కాంతుఁడు లేఖఁ జూచి మమకారముఁ గాంచెనొ తప్పనెంచెనో
కాంతలపాలికల్పకము గౌరియనుగ్రహ మున్నొ లేదొ నా
స్వాంతము దీర్ప నీశ్వరుఁడు చాలునొ చాలఁడొ ప్రాప్త మెట్టిదో

గీ. మానవుఁడు మానవుఁడె యైన మంచిచెడ్డ
లనుభవించుటయే యోగ్య మౌనుగాక
నడ్డుకొనరాదు విముఖత నందరాదు
యత్న మొనరింప [illegible] ముకాదు. 139

గీ. కర్మసాక్షి యనంతుఁడు కలియుండ
నేను నే నను మమకార మూననేల ?
గాఁదగుఫలాఫలమ్ములు గాని యాను
గారణకళేబరార్థముల్ గడుపవలయు. 140

చ. మన సనుత్తోటలోన గుణమాన్యలతాంకురముల్ జనించె యో
జన లనుసేచన ల్వడసి సాగెను దీవెలుఁ బూలుఁ బూడె శో
భనమొ యశోభనంబొ యవి పాలితలోకపుభాగ్యరేఖలై
ప్రణయముఁ జూపుచుండ ననుభావ్యము గాక తలంగవచ్చునే? 141

గీ. కులుకుఁ జూపుల వలపులు గుఱియుఁ గొన్ని
తలఁపు చివురింపఁ దావులు చిలుకుఁ గొన్ని
రెంటికిం దగి మనసుల నంటుఁ గొన్ని
యెందుకుం గాని విరు లయి యేగుఁ గొన్ని. 142

ఉ. ఇటు లబ్జాల విలోలమానస మదెంతే డోలికంబోలి యొ
క్కట స్థాయిం గనఁబోక యట్టిటు బలాత్కారంబుగా నూఁగుచో
ఘటిక ల్దాఁటెను జాము మీఱెను నుషఃకాలంబు గావచ్చెఁగు
క్కుటము ల్గూసెఁ బ్రభాతశోభనకళాకోటీరపాటీరమై. 143

చ. కలకల మింటిలోఁ జెలఁగె గాంతలు నిద్దుర లేచి ప్రక్కపైఁ
గలయజమానురాలు తమకండ్ల కగోచర మోటఁ జిత్తచం
చలతను సర్వము న్వెదకి సందడి దందడి యై చెలంగ న
వ్వలఁ జని రెల్ల మందిరకవాటము దాఁటి బహిఃప్రదేశమున్. 144

—* చెలికత్తెలు రుక్మిణి నోదార్చుట *—

ఉ. తమ్ముల నేలుకన్నులను నమ్మునిఁ జూచుచు మోము నెత్తి ము
త్తెమ్ములఁ బోలుబాష్పముల దించుచుఁ జంచలచిత్తవృత్తితో
నిమ్మొయి నేకతంబున వసించుచునున్నది మెల్లమెల్లగా
నుమ్ములికంబుఁ దీర్ప నగు నుగ్మలి నం చని యోజ సేయుచున్.

మ. అరరే! చిత్రము చిత్ర మంబుజముతో నా? పద్మినీవైరిను
స్థిరకేళీ సరసానుమోదమున నుద్దీపించుటల్ చూడుఁ డ
త్తరుణీరత్నముమోము నెట్లు గనునో తారేశ్వరుం డందుకే
స్ఫురదిందీవరచారులోచనము లశ్రుల్ గార్చుఁ బ్రత్యర్థులై. 146

ఉ. వెన్నెలఱేఁడు కృష్ణునకు వేడుకబావమఱంది కాన నే
తెన్నననైన వానిఁ గొనితెచ్చుటకై పయనంబుఁ జేయగాఁ
దిన్నని కూనరాగములఁ దీయుచుఁ గన్నుల నప్పళించుచున్
వెన్నెలపుల్గుపోలెఁ గనిపించెడు రుక్మిణి కార్యదీక్షతోన్. 147

ఉ. తీయగఁ బల్కి-పల్కి తరితీపుల వేడబ మాడి యాశ యా
ప్యాయితుఁ జేసి భర్తకడ కంపుచునున్నది చంద్రు నల్లదే
పోయెడువాఁడు లేనగవుపువ్వులు క్రొవ్విరులందుఁ [illegible]ర్చి లేఁ
బ్రాయపు ముద్దరాలి తమిఁ బాయు నుపాయము నాకలించుమన్.

ఉ. పోయిన బ్రాహ్మణుం డెటులఁ బోయెనో యేమయిపోయెనో య[illegible]
ప్రాయము విప్పి చెప్పకయ ప్రాఁజదువు ల్వినిపించి వచ్చునే
మోయని యెంచి రేపటి త్రయోదశినాటికిఁ జేరునట్లు శ్రీ
నాయకుఁ దోడితేర లలనామణి పంపెడునేమొ చంద్రునిన్. 149

చ. అగునగు మోహదాహ మది యగ్గలమైనది రేఁబవళ్ళు నా
మగని విచార మొక్కటియ మక్కువ యుక్కవఁ జేయుఁ గాని యే
తగులములన్ సహింపదు విధాయక కృత్యము లెంచఁబోదు నాఁ
డగుపడుదాఁక నామొహ్రదయంబిటులే యగునేమొ చిత్రమా. 150

క. శిశుపాలుఁడు వలదో యని
మశకమునటు చిమ్మివైచు మానిని నేలా
వశవర్తినిఁ జేయ నిరం
కుశపాలకు లైరి నృపులు కోవిదు లయ్యున్. 151

క. శిశుపాలునకన్నను నా
పశుపాలుం డెట్టి ఘనుఁడో బాలాకుశికే
విశదం బగు గాని సా
దృశలమఁటే మన మెఱుంగ దేవ్రసిమహిమల్. 152

ఉ. చక్కనివాఁడఁటే వలపుఁజక్కిలిగింత [illegible]
చక్కనివింటివాఁ డయినఁ బాలుఁడఁటే జగదీశుఁడంట యా
నిక్క మెఱుంగ దేవులును నేరఁటె శిశుపాలుఁడేడ నా
చక్కలరాయఁ డేడ నొక చుక్కను రాజునుఁ బోట యెక్కటే. 153

మ. ఇఁక నేఁడే మన కీమెయూడిగము రే పీపాటి కీతల్లి యే
యకలంకస్థితి నేడ నున్నొ పతిపర్యంకంబునన్ వ్రాలి త
ప్పక శ్రీకృష్ణుఁడు వచ్చు మెచ్చు నదిగో ప్రాచీదిశాకాంతయున్
శకునంబు ల్ప్రకటించుచుండె ధవళాశావేశపూరంబుగన్. 154

మ. అరుణాభ్రంబును జించి యంచులకు మారాకొత్తు నీరెండతో
సరవిందాప్తుఁడు బాలభానుఁ డదిగో హస్తంబులన్ సాచి ది
వ్యరసార్ద్రాక్షత లింతిపై నిడి వివాహప్రాప్తిర స్తంచు బా
హిరుఁ డై దీవెన లిచ్చి మెచ్చుకొన రానేవచ్చె సంసిద్ధుఁడై. 155

శా. ప్రాచీదిక్సతి బాలభానుని పరిష్వంగానుషంగమ్మునన్
రోచుల్ దిక్తటముల్ గదింప రథ మారోహించి సప్తాశ్వతోఁ
బ్రాచుర్యంబుగఁ దెల్పుచున్న దిటులే పద్మాక్షుఁడున్ రుక్మిణిన్
బ్రోచున్ స్యందనమందుఁ జేర్చుకొని నమ్మోదించు నెంతేనియున్.

మ. అవిగో మంగళగీతిక ల్చెలఁగె రమ్యాకాశమం దొప్పుగా
వివిధానందవినోదకేళికల నావేష్టించి కోలాహలా
రవము ల్సేయు విహంగదంపతులు మారాకారుఁ గృష్ణప్రభున్
యువతీరత్నము పొందు నం చని తథాస్తూక్తు ల్ప్రశంసించుచున్.157

ఉ. ఇందఱు పట్టుకొన్నపని యేల వృథా యగునమ్మ కృష్ణునిన్
బొందును రుక్మిణీమణి పూవులు సైతము తేను లెత్తి యా
నందమరంద బిందువుల నర్మిలి కానుకఁ బెట్టుచుండె రా
కేందునిభాస్య యెందులకొ? యింకను నిద్దుర లేవ దియ్యెడన్.158

ఉ. పాపము నిన్న రేయిఁ బొరబాటున నైనను ఱెప్పవాల్ప దే
మో పరితాపభారమున నుత్పలశయ్యల నైన హాయిగా
జేపఁ బోనినిద్ర యిటు చెందునె వజ్రకరోరుపీఠమం
దీపగిదిన్ లతాంగి యిఁక నీమెను మేల్కొలుపంగ మేలగున్. 159

క. అని నెచ్చెలు లాలోచన
గని మెల్లగఁ దరుణిఁ జేరి కామశరంబో
యన రత్నమయాసనమున
ఘనసు ప్తిన్ మానిని యుండగాఁ బిలుచుచునున్. 180

శా. తల్లీ రుక్మిణి లేవవమ్మ నిను నీదాక్షాయణీదేవియే
యుల్లంబందున హత్తి చిత్తమథనంబాపొందఁ జల్లార్చు సం
ఫుల్లాబ్జంబులు కర్మసాక్షియొడిలోఁ బూర్ణానురాగంబుతో
సోల్లాసంబున నాడుచున్న వవిగో యుత్ప్రేక్షలక్షింపుమా! 161

ఉ. చందురుఁ డేగెనమ్మ జలజమ్ములు విచ్చెను లోకబాంధవుం
బొంది హసించుచుండె సరిపోలిన నీకనుదమ్ము లింకనున్
గుందములల్లె మూసితివి కోరిక లీరిక లెత్తఁజేయు నా
నందుఁడు నీదుబంధుఁ డిఁకనైనను రాఁడొ యనుగ్రహింపఁడో. 162

ఉ. తల్లులఁ గన్నతల్లి గుణధన్యులపాలిటికల్పవల్లి జా
బిల్లినిదాల్చువాని వలపించెడుముద్దులపాలవెల్లి. శ్రీ
వల్లభు చెల్లి మ్రొక్క విడ వచ్చెడుచల్లనితల్లి శాంభవి
పల్లవపాణి నీప్రణయవల్లభుఁ గూర్చును దీర్చు నీరుజన్. 163

ఉ. చక్రధరుం డనంతగుణసాగరుఁ డాశ్రితబాంధవుండు ని
ర్వక్రపరాక్రమాంచితుఁడు వచ్చును మెచ్చును నిన్ను శత్రులన్
వక్రతఁ దీర్చు నీవలపువల్లరి కాశ్రయమిచ్చు నన్నియున్
సక్రమమై తలిర్చునెడఁ గానరో యేల వృథాప్రయాసముల్. 164

ఉ. మానుము చింత నీప్రణయమందిర సుందరనందనంబులోఁ
బ్రాణసమానమై పెరిగి పందిరి కెక్కినద్రాక్షవల్లియే
తేనియలూరుకమ్మనగు తీయనపండ్ల నొసంగకుండునో
మానిని యేల యిట్టు లనుమానము నూనెదు దీనురాలవై. 165

ఆ.వె. ఆమబాధఁ దెలియ నాడుదే తగుఁగాక
పురుషుఁ డేమి యెఱుఁగఁబోలు నతఁడు
వలపులోని తీపి తెలిసి యేమాత్రమో
నిలుపలేఁడు బుద్ధిచలనతఁగని. 166

సీ. అని వినోదవిచార మోహానురాగ
రాగసల్లాపములదొంతఱలను బేర్మి
మేలుకొలుపులు పాడుచు మెలఁత లెల్ల
నిదుర లేపిరి మెల్లన ముదిత నపుడు. 167

వ. అట్టియెడ ససంరంభంబుగా రుక్మి రుక్మిణికిం గల్యాణవేషంబు ఘటింప ముదల యిచ్చుటయుం జెలులు శిశుపాలాదుల రాక తలంచుకొని కలంగుచుండ. 168

—* అగ్నిద్యోతనుఁడు రుక్మిణికిఁ గృష్ణునిరాక నెఱింగించుట *—

గీ. ఇంతలో మేడమె ట్లెక్కి యింతి యొకత
మంజుమంజీరనినదంబు మలయుచుండ
మొలకనవ్వులఁ దలఁపులు పులకరింప
వినయవినమితగాత్రియై విన్నవించె. 169

ఉ. వచ్చెను బ్రాహ్మణుండు కొనివచ్చెను వార్తలవేమొ యల్ల దే
వచ్చుచునున్నవాఁ డతనివైఖరిఁ జూచిన మంచివార్తయే
తెచ్చెడి నంచుఁ దోఁచు వితర్కిత మానెడ మమ్ముఁ జేరరా
వచ్చునె? యంచు వాకొనియ వావిరి కన్నవ నప్పళించుచున్. 170

ఉ. అంతిపురంబులం దయిన నాజ్ఞలు లేక చరించుచుండు సు
స్వాంతుఁడు కాన బ్రాహ్మణుఁడు చక్కఁగ సౌధములన్ని దాఁటి సీ
మంతిను లున్నయుప్పరిగ మంటపముం జొరవచ్చెఁ గాంచి య
య్యింతులలోన గొంద ఱెదు రేగియుఁ బాద్యము లిచ్చి మెచ్చుచున్

క. కాయా? పండా? స్వామీ
పోయినపని సఫలమైన పోలఁకువయేనా?
మాయువతియదృష్టము మీ
తీయనిశుభవార్త పైని దీధితిఁ జెందున్. 172

క. ఎవరికిఁ దోఁచినవిధముగ
నువిదలు వా రనుచు నుండ నోర్వక విప్రుం
డెవరికి నేమియుఁ దెల్పక
యువహితుఁడై నిలిచి యుండె నందఱఁ గనుచున్. 173

ఆ. వె. ఆడుపీడ యేమొ యర్థమే కాకుండు
మాటి ముడుచువారు ముక్కు విఱుచు
వారుఁ జెంప లొత్తువారు నై నెచ్చెలు
లరిగి రవల దేవియాజ్ఞఁ జేసి. 174

వ॥ అంతట నగ్నిద్యోతనుం డిట్లనియె. 175

ఉ. వెన్నెలతేఁడు కృష్ణునకు వేడుకబావమఱంది కాన నే
తెన్నునసైన వానిఁ గొనితెచ్చుటకై పయనంబుఁ జేయగాఁ
దిన్నని కూనరాగములఁ దీయుచుఁ గన్నుల నప్పళించుచున్
వెన్నెలపుల్గువోలెఁ గనిపించెడు రుక్మిణి కార్యదీక్షతోన్. 147

ఉ. తీయగఁ బల్కుపల్కు తరితీపుల వేడబ మాడి యాడి యా
ప్యాయితుఁ జేసి భర్తకడ కంపుచునున్నది చంద్రు నల్లదే
పోయెడువాఁడు లేనగవుపువ్వులు క్రొవ్విరులందుఁ గూర్చి లేఁ
బ్రాయపు ముద్దరాలి తఱిఁ బాయు నుపాయము నాకళించుమన్

ఉ. పోయినబ్రాహ్మణుం డెటులఁ బోయెనో యే మయిపోయెనో య?
ప్రాయము విప్పి చెప్పకయ ప్రాఁజదువు ల్వినిపించి వచ్చు నే
మోయని యెంచి రేపటి త్రయోదశినాటికిఁ జేరునట్లు శ్రీ
నాయకుఁ దోడితేర లలనామణి పంపెడు నేమొ చంద్రునిన్. 149

చ. అగునగు మోహదాహ మది యగ్గలమైనది రేఁబవల్ఫు నా
మగని విచార మొక్కటియ మక్కువ యుక్కువఁ జేయుఁ గాని యే
తగులములన్ సహింపదు విధాయక కృత్యము లెంచఁబోదు వాఁ
డగుపడుదాఁక నామెహృదయంబిటులే యగు నేమొ చిత్రమా. 150

క. శిశుపాలుఁడు వలదో యని
మశకమునటు చిమ్మివైచు మానిని నేలా
వశవర్తినిఁ జేయ నిరం
కుశపాలకు లైరి నృపులు కోపివశు లయ్యున్. 151

క. శిశుపాలునకన్నను నా
పశుపాలుం డెట్టి ఘనుఁడో బాలామణికే
విశదంబగు గానీ సా
దృశలమఁటే మన మెఱుంగ దేవునిమహిమల్. 152

ఉ. చక్కనివాఁడఁటే వలపుఁజక్కిలిగింత నిక్కు గానఁటే
చక్కెరవింటివాఁ డయినఁ జాలఁడఁటే జగదీశుఁడంట యా
నిక్కు మెఱుంగ దేవులును నేరరఁటె శిశుపాలుఁడేడ నా
చక్కలరాయఁ డేడ నొక చుక్కను రాహువు బోలె యెక్కఁడే. 153

మ. ఇఁక నేఁడే మన కీమెయూడిగము రే పీపాటి కీతల్లి యే
యకలంకస్థితి 'నేడ నున్నో పతిపర్యంకంబునన్ వ్రాలి త
ప్పక శ్రీకృష్ణుఁడు వచ్చు మెచ్చు నదిగో ప్రాచీదిశాకాంతయున్
శకునంబు ల్ప్రకటించుచుండె ధవళాశావేశపూరంబుగన్. I

మ. అరుణాభ్రంబును జించి యంచులకు మారాకొత్తు నీరెండతో
సరవిందాప్తుఁడు బాలభానుఁ డదిగో హస్తంబులన్ సాచి ది
వ్యరసార్ద్రాక్షత లింతిపై నిడి వివాహప్రాప్తిర స్తంచు బా
హితుఁ డై దీవెన లిచ్చి మెచ్చుకొన రా నేవచ్చె సంసిద్ధుఁడై. I

శా. ప్రాచీదిక్సతి బాలభానుని పరిష్వంగానుషంగమ్మునన్
రోచుల్ దిక్తటముల్ గదింప రథ మారోహించి సప్తాశ్వతోఁ
బ్రాచుర్యంబుగఁ దెల్పుచున్న దిటులే పద్మాక్షుఁడున్ రుక్మిణిన్
బ్రోచున్ స్యందనమందుఁ జేర్చుకొని సమ్మోదించు నెంతేనియుఁ

మ. అదిగో మంగళగీతిక ల్చెలఁగె రమ్యాకాశమం దొప్పుగా
వివిధానందవినోదకేళికల నావేష్టించి కోలాహలా
రవము ల్సేయు విహంగదంపతులు మారాకారుఁ గృష్ణప్రభున్
యువతీరత్నము బొందు నం చని తథాస్తూక్తు ల్ప్రశంసించుచున్. I

ఉ. ఇందఱు పట్టుకొన్నపని యేల వృథా యగునమ్మ కృష్ణునిన్
బొందును రుక్మిణీరమణి పూవులు సైతము ఱేకు లెత్తి యా
నందమరంద బిందువుల నర్మిలి కానుకఁ బెట్టుచుండె రా
కేందునిభాస్య యెందులకొ? యింకను నిద్దుర లేవ దియ్యెడన్.

ఉ. పాపము నిన్న రేయిఁ బొరపాటున నైనను ఱెప్పవాల్ప దే
మో పరితాపభారమున నుత్పలశయ్యల నైన హాయిగా
జేపడఁబోనినిద్ర యిటు చెందునె వజ్రకఠోరపీఠమం
దీపగిదిన్ లతాంగి యిఁక నీమెను మేల్కొలుపంగ మేలగున్.

క. అని నెచ్చెలు లాలోచన
గని మెల్లగఁ దరుణిఁ జేరి కామశరంబో
యన రత్నమయాసనమున
ఘనసుప్తిన్ [illegible] బిలుచుచునున్.

శా. తల్లీ రుక్మిణి లేవవమ్మ నిను నీదాక్షాయణీదేవియే
యుల్లంబందున హత్తి చిత్తమథనంబొప్పొందఁ జల్లార్చు సం
ఫుల్లాబ్జంబులు కర్మసాక్షియొడిలోఁ బూర్ణానురాగంబుతో
సోల్లాసంబున నాడుచున్న వవిగో యుత్ప్రేక్షలక్షింపుమా ! 161

ఉ. చందురుఁ డేగెనమ్మ జలజమ్ములు విచ్చెను లోకబాంధవుం
బొంది హసించుచుండె సరిపోలిన నీకనుదమ్ము లింకనున్
గుందములల్లె మూసితివి కోరిక లీరిక లెత్తఁజేయు నా
నందుఁడు నీదుబంధుఁ డిఁకనైనను రాఁడొ యనుగ్రహింపఁడే. 162

ఉ. తల్లులఁ గన్నతల్లి గుణధన్యలపాలిటికల్పవల్లి జా
బిల్లినిదాల్చువాని వలపించెడుముద్దులపాలవెల్లి. శ్రీ
వల్లభుచెల్లి మ్రొక్క విడవచ్చెడుచల్లనితల్లి శాంభవీ
పల్లవపాణి నీప్రణయవల్లభుఁ గూర్చును దీర్చు నీరుజన్. 163

ఉ. చక్రధరుం డనంతగుణసాగరుఁ డాశ్రితబాంధవుండు ని
ర్వక్రపరాక్రమాంచితుఁడు వచ్చును మెచ్చును నిన్ను శత్రులన్
వక్రతఁ దీర్చు నీవలపువల్లరి కాశ్రయమిచ్చు నన్నయున్
సక్రమమై తలిర్చు నెడఁ బానరో యేల వృథాప్రయాసముల్. 164

ఉ. మానుము చింత నీప్రణయమందిర సుందరనందనంబులోఁ
బ్రాణసమానమై పెరిగి పందిరి కెక్కినద్రాక్షవల్లియే
తేనియలూరుకమ్మనగు తీయనపండ్ల నొసంగకుండునో
మానిని యేల యిట్టు లనుమానము నూనెదు దీనురాల వై. 165

ఆ.వె. ఆడుబాధఁ దెలియ నాఁడుదే తగుఁగాక
పురుషుఁ డేమి యెఱుఁగఁబోలు నతఁడు
వలపులోని తీపి తెలిసి యేమాత్రమో
నిలుపలేఁడు బుద్ధిచలనతఁగని. 166

సీ. అని వినోదవిచారమోహానురాగ
రాగసల్లాపములదొంతఱలను బేర్మి
మేలుకొలుపులు పాడుచు మెలఁత లెల్ల
నిమగ లేపిరి మెల్లన ముదిత నప్పుడు. 167

శా. తల్లీ రుక్మిణి లేవవమ్మ నిను నీదాక్షాయణీదేవియే
యుల్లంబందున హత్తి చిత్తమథనంబాపొందఁ జల్లార్చు సం
ఫుల్లాబ్జంబులు కర్మసాక్షియొడిలోఁ బూర్ణానురాగంబుతో
సోల్లాసంబున నాడుచున్న వవిగో యుత్ప్రేక్షలక్షింపుమా ! 161

ఉ. చందురుఁ డేఁగెనమ్మ జలజమ్ములు విచ్చెను లోకబాంధవుం
బొంది హసించుచుండె సరిపోలిన నీకనుదమ్ము లింకనున్
గుందములట్లె మూసితివి కోరిక లీరిక లెత్తఁజేయు నా
నందుఁడు నీదుబంధుఁ డిఁకనైనను రాఁడొ యనుగ్రహింపఁడే. 162

ఉ. తల్లులఁ గన్నతల్లి గుణధన్యలవాలిటికల్పవల్లి జా
బిల్లినిదాల్చువాని వలపించెడుముద్దులపాలవెల్లి. శ్రీ
వల్లభుచెల్లి మ్రొక్కు విడ వచ్చెడుచల్లనితల్లి శాంభవి
పల్లవపాణి నీప్రణయవల్లభుఁ గూర్చును దీర్చు నీరుజన్. 163

ఉ. చక్రధరుం డనంతగుణసాగరుఁ డాశ్రితబాంధవుండు ని
ర్వక్రపరాక్రమాంచితుఁడు వచ్చును మెచ్చును నిన్ను శత్రులన్
వక్రతఁ దీర్చు నీవలపువల్లరి కాశ్రయమిచ్చు నన్నియున్
సక్రమమై తలిర్చునెడఁ గానరొ యేల వృథాప్రయాసముల్. 164

ఉ. మానుము చింత నీప్రణయమందిర సుందరనందనంబులోఁ
బ్రాణసమానమై పెరిగి పందిరి కెక్కినద్రాక్షవల్లి రే
తేనియలూరుకమ్మనగు తీయనపండ్ల నొసంగకుండునో
మానిని యేల యిట్టు లనుమానము నూనెదు దీనురాలవై. 165

ఆ.వె. ఆడుబాధఁ దెలియ నాడుదే తగుఁగాక
పురుషుఁ డేమి యెఱుఁగఁ బోలు నతఁడు
వలపులోని తీపి తెలిసి యేమాత్రమో
నిలుపలేఁడు బుద్ధిచలనతఁగని. 166

సీ. అని వినోదవిచారమోహానురాగ
రాగసల్లాపములదొంతఱలను బేర్మి
మేలుకొలుపులు పాడుచు మెలఁత లెల్ల
నెమర లేపిరి మెల్లన ముదితి నపుడు. 167

వ. అట్టియెడ ససంరంభంబుగా రుక్మి రుక్మిణికిం గల్యాణవేషంబు ఘటింప
ముదల యిచ్చుటయుం జెలులు శిశుపాలాదుల రాక తలంచుకొని
కలంగుచుండ. 168

—* అగ్నిద్యోతనుఁడు రుక్మిణికిఁ గృష్ణునిరాక నెఱింగించుట *—

గీ. ఇంతలో మేడమెట్లెక్కి యింతి యొకత
మంజుమంజీరనినదంబు మలయుచుండ
మొలకనవ్వులఁ దలఁపులు పులకరింప
వినయవినమితగాత్రియై విన్నవించె. 169

ఉ. వచ్చెను బ్రాహ్మణుండు కొనివచ్చెను వార్తలవేమొ యల్లదే
వచ్చుచునున్నవాఁ డతనివైఖరిఁ జూచిన మంచివార్తయే
తెచ్చెడి నంచుఁ దోఁచు వితతీకృత మానెడ మమ్ముఁ జేరరా
వచ్చునె? యంచు వాకొనియ వావిరికన్నవ నప్పళించుచున్. 170

ఉ. అంతిపురంబులం దయిన నాజ్ఞలు లేక చరించుచుండు సు
స్వాంతుఁడు కాన బ్రాహ్మణుఁడు చక్కఁగ సౌధములన్ని దాఁటి సీ
మంతిను లున్నయుప్పరిగ మంటపముం జొరవచ్చెఁ గాంచి య
య్యింతులలోన గొందఱదు రేగియుఁ బాద్యము లిచ్చి మెచ్చుచున్

క. కాయా? పండా? స్వామీ
పోయినపని సఫలమైన పోలఁకువయేనా?
మాయువతియదృష్టము మీ
తీయనిశుభవార్త పైని దీధితిఁజెందున్. 172

క. ఎవరికిఁ దోఁచినవిధముగ
నువిదలు వా రనుచు నుండ నోర్వక విప్రుం
డెవరికి నేమియుఁ దెల్పక
యుపహితుఁడై నిలిచి యుండె నందఱఁ గనుచున్. 173

ఆ. వె. ఆడుపీడ యేమొ యర్థమే కాకుండు
మూతి ముడుచువారు ముక్కు విఱుచు
వారుఁ జెంప లొత్తువారు నై నెచ్చెలు
లరిగి రవల దేవియాజ్ఞఁజేసి. 174

వ॥ అంతట నగ్నిద్యోతనుం డిట్లనియె. 175

శా. అమ్మా రుక్మిణి వెళ్ళివచ్చితిని నీయాంతర్యసంశుద్ధియే
సమ్మానించెను నన్ను నజ్ఞులకు దుస్సాధంబు లైనట్టి కా
ర్యమ్ముల్ సేసితి ద్వారకాపురముఁ జేరంగంటి శ్రీకృష్ణుపా
దమ్ముల్ గాంచితి జన్మతారకముగా ధన్యుండ నో తల్లిరో! 176

ఉ. ఇచ్చితి లేఖ సంగతుల లెల్ల నచించితి నొక్కి నొక్కి. వా
క్రుచ్చితి రాయబారమును కోమలి తాళ దటంచు గట్టిగా
నచ్చెడురీతిఁ బల్కితి ననాగతకార్యము లెల్ల జ్ఞప్తికిన్
దెచ్చితి సర్వబాధ్యతలు దీర్చితిఁ గోరితి వానిరాకనున్. 177

చ. అతఁడు దయామయుండగును మహామహితాత్ముఁ డనాథనాథుఁ డా
శ్రితజనరమ్యకల్పకము శిష్టజనోద్ధరణక్రియారతిన్
క్షితి నవతార మెత్తినవిశిష్టగుణాఢ్యుఁడు విష్ణుమూర్తి స
త్కృతిపరిపాలకుండు కరుణించె గ్రహించెను నన్ను భక్తుఁగన్. 178

గీ. ద్వారకాపురి భూతలస్వర్గ మమ్మ
యందుఁగలవారు దేవతలౌట నిజము
నాయకుఁడు వాఁడె బ్రహ్మాండనాయకుండు
ఏమనో నాయకుం డిఁక నేననుగదె. 179

సీ. తారాపథంబునఁ దనరుభాస్కరచంద్రు
లంబుజోత్పలహాసమానహితులు
రెక్కడో సుమరాజి యెక్కడో మధుపంబు?
లొండొంటికలయిక గొనువుచుండు
నడవిలో నుసిరికి యబ్ధిలో లవణము
జతగూడి కమ్మనిచవులు గుల్కు
నీరదము లవెడ నెమలితా నదియెడ?
చూచినమాత్రాన సంపుసంపు

తే. జే. నతఁడు ద్వారకాపురమునందు నున్న
కుండినపురమ్మునం దున్నఁ గోరికోరి
నొకరి నొకరు మన్నించుచు నుందు రిట్టి
సాక్షియే మిమ్ముఁ గలపించె జగము గాంచ 180

ప్రకృతి వీవును బురుషుఁ డా ప్రభువు మీర
లేడనున్నను జత కూడి యాడుకొనుచు
నుందు రాత్మసాక్షాత్కార మందుకొనుచు
నుంతయున్ భేదమే లేదు సుదతి మీకు. 181

తరుణీ యేమని చెప్ప నీశ్వరుచరిత్రం బద్భుతం బద్దిరా!
కరుణాకారుఁడె మూర్తి గైకొనియె రాకాచంద్రసంకాశసుం
దరుఁ డానందవినోదభాస్వరుఁడు సత్తామాత్రచిద్రూపగో
చరుఁ డైశ్వర్య విధాత ముక్తివిలసత్సామ్రాజ్యధౌరేయుఁడై 182

ననుఁ గనుంగొని యున్నతాసనము డిగ్గి
వచ్చి యెదురుగఁ గైదండ నిచ్చె నాకు
మెచ్చి లోపలికిం గొనితెచ్చి యుచిత
పూజ లొనరించె నాపూర్వపుణ్య మేమొ? 183

మెచ్చెను నిన్ను నీవలపు మిక్కిలిగా నుతియించె నీవు రా
లచ్చి వటంచుఁ జెప్పెఁ దనలక్ష్మివి నీ వని నొక్కి చెప్పె నిన్
దెచ్చునుపాయమే సతము నెమ్మది నిల్పెద నంచుఁ బల్కె నా
కిచ్చె ననర్ఘవస్తుతతి నెంతయు నాదరచిత్తవృత్తితోన్. 184

చెప్పియుఁ జెప్పకున్నపుడె వచ్చెరఁ దేరును దేరఁ బంచి మీ
యొప్పులకుప్పకోసమిడ్డ చనుచుంటిమి నీవిటు తేరు నెక్కు మో
యప్ప సురాసురాదు లెదురై కదనంబు నొనర్చి యోర్చినన్
దప్పక దెత్తు నామె నని దారులు తీసె మురారి కోమలీ. 185

చేరితి మేము నిన్నటినిశీథిని కుండినరాజధానికిన్
గారుణికోత్తముం డతఁడు కైతవనాటకసూత్రధారి యై
యేరు నెఱుంగనట్లు వసియించెడు మందిరసందనంబునన్
గోరికలూరఁ బంపె ననుఁ గూరిమి నీకు వచింప ముందుగన్. 186

అని యిట్లు భూసురుండు వచించినంత రుక్మిణీదేవి. 187

ఔనా? వచ్చెనా? నామనోరథముఁ దీనా? వాంఛ మన్నించెనా?
ప్రాణస్నేహము నెంచెనా? వలపు సంభావించెనా? యద్దిరా!
నే నేమిచ్చిన నీఋణం బుడుగుఁ దండ్రీ! భూసురగ్రామణీ!
మానప్రాణము లెల్ల నిల్పితివి సమ్మానించి నీపుత్రినిన్. 188

గీ. చంద్రునకు నూలుపోగట్లు జలజనాభు
నకుఁ దులసిదళం బన్నట్లు నానమస్కృ
తిఁ గొని మన్నించి యాశీర్వదింపఁదగుదు
పుత్రివంటిదానను నీకు బుధవరేణ్య! 189

క. అని సాష్టాంగనమస్కృతి
యొనరించిన మెచ్చి విప్రుఁ డోతల్లీ నీ
మనసున ముద మొదవుటక
న్నను గావలసిన దదేమి నాబోఁటులకున్. 190

ఉ. నిన్నె వఁడేని నమ్ముకొని నిశ్చలభక్తి నమస్కరించుచోఁ
బెన్నిధు లైనఁ గూరిచి త్రివిష్టపరాజ్యము నీయఁజాలుసం
పన్నసతీమతల్లివి కృపామయి వై నను మెచ్చి మ్రొక్కఁచో
నన్నియుఁ జేరువై కరతలామలకంబులు కావె సంపదల్ 191

ఉ. నీ కడఁగంటిచూపునన నీరజనాభ సురేంద్ర రుద్ర నా
ళీకభవాదు లెల్లరు బలీయమహత్త్వ విశేష వైభవ
ప్రాకట్యులై రహించెదరు పావనమాతవు నీదుమ్రొక్కులన్
జేకొను నాకుఁ గావలయు శ్రీ మఱి యేమి? రమాతలోదరీ! 112

చ. అని మనసార వాకొనుధరామరు నంచిలికేలి రుక్మిణీ
వనిత యనేకభూషణ సువస్త్రము లిచ్చి నమస్కరించి పం
పిన నతఁ డేగి నంతఁ బృథివీపతి యానతి రుక్మిణీసతిన్
గొని చని పెండ్లికూతురుగఁ గొబ్బునఁ జేరిసి కామినీమణుల్. 193

చ. అనుజుఁడు కృష్ణుఁ డొంటరిగ నట్లు ధరామరుతోడఁ గూడి కుం
డినపురిఁ జేర నేగుటయు డీకొనుశాత్రవు లెల్లఁ గేరుటల్
మనమున నెంచి రాముఁడు సమస్తబలంబులతోడ వెంటనే
చనె రణమైనచో విజయసాధనమార్గము నెంచి పొంగుచున్. 194

గీ. భృత్యు లెఱిఁగింప భీష్మకనృపవరుండు
రామకృష్ణులు వచ్చినా రని గ్రహించి
వారి నెదురేగి కొనితేర వైభవముగఁ
దఱలెఁ దూర్యారవంబులు మ్రోయుచుండ. 192

చ. ఎదురుగఁ బోయి భీష్మక నరేంద్రుఁడు మోహనరామకృష్ణులన్
ముదమునఁ గౌఁగిలించుకొని ముచ్చట లాడి యుపాయనంబు లొ
ప్పిదముగ నిచ్చి వస్త్రములు వేడుకమైఁ గయిసేసి గౌరవా
స్పదముగఁ బూజఁజేసె విధివంతముగాఁ దలపోసి నెమ్మదిన్. 196

గీ. రామకృష్ణుల సపరివారముగ నొక్క
యర్హసంపత్సమృద్ధ హర్మ్యంబునందు
విడిదిఁ జేయించి తగురీతి వివిధవిధుల
నతిథిసత్కార మొనరించె నతులితముగ. 197

మ. పరమానందములోడ భీష్మక ధరాపాలుండు శ్రీరుక్మిణిం
గరిమన్ గృష్ణునకిచ్చి వైభవముతోఁ గల్యాణముం జేయఁగాఁ
బరికించెం దొలుతొల్తఁ గావున మనోవాక్కాయకర్మంబులన్
నరుఁ డీతం డని నమ్మి శాస్త్రవిధులన్ బాటించి సోత్సాహుఁడై. 198

క. 'ఆతిథ్యం విదధే' యనఁ
బ్రీతుండై రాజు తగిన పెండ్లికొడుకు వి
ఖ్యాతుఁడు కృష్ణుండే యని
నాతిథ్యం బొసఁగెనేమొ యర్హవిధమునన్. 199

గీ. అంత నాబాలగోపాల మవ్విదర్భ
యందుఁ గలస్త్రీపురుషు లెల్ల నరిగి మోహ
నాంగుని గృష్ణు గాంచి యానందకలితు
లై నుతించిరి వేనోళ్ళ నర్హవిధుల. 200

మ. ఇతఁడే యన్నివిధాల రుక్మిణికిఁ బ్రాణేశుండు కానైనయ
ట్లత డైకొన్న మహానుభావుఁ డగు నన్యాయ్యంబుగాఁ జెల్లెలిన్
మతిహీనుండగు రుక్మి చైద్యునకుఁ గాంతం జేయ నూహించె శ్రీ
పతికిన్ వానికి నెంతయంతరము సంభావింపఁబోఁ డక్కటా! 201

క. పసులపాలుఁ డంచు బ్యాంతో
పసులపాలుఁడు జ్ఞానభానుభాస్కరుఁ డవనిన్
పసులపాలుఁడు ధామసన్నిధ
పసులపాలుఁడు మోహదాహసింధువు కానన్. 202

గీ. తారతమ్యము దక్షిణోత్తరపు ధ్రువము
లట్టులగునిట్టివొక్కఁడన్యమొత్తృణంబు
దంపతులకు నన్యోన్యత దనరదేని
కలుగనేమి సంసారము గలుగకేమి ? 203

ఉ. ఈమె యదృష్టమిట్లయిన నెవ్వరమే మొనరింప నచ్చు నే
దో మన సుండఁబట్టకయ యూరక వాగెద మింక హాని యే
క్షేమముఁ గూర్పఁజాలెదము శ్రీపతియే సతి నుద్ధరించు నా
ర్యామహిళాశిరోమణియె యామెకుఁ బ్రాపము గాఁగ యుండెడిన్

క. అనిజనములు నెవరికిఁ దోఁ
చినరీతిని వారు శ్రుతులఁ జేయుచునుండన్
వినిపించెఁ దూర్యనినములు
చని రంతట నెల్లవారు సంబరము గనన్. 205

గీ. చేదిపతి దమఘోషుఁడు వెలఁగి బ్రాహ్మ
ణోత్తములఁ బిల్చి యభ్యుదయోచితముగ
తనయుఁ డాశిశుపాలునిఁ దగినరీతి
స్నాతకాదులఁ జేయించె సంతసమున. 206

సీ. కదలుకొండలువోలెఁ బొదలుచుఁ గన్పించు
మదనాగములపంక్తి మలసియుండె
స్వర్ణవికారభూషణవికాసితము లై
స్యందనానేకముల్ విందు సేయ
దినరాజతురగములను బోలు జవనాశ్వ
ములు వేనవేలు బారులు రహింప
సంయుల మై నిరాతంకమాకరియూథ
మక్షౌహిణీసంఖ్య లమరి యుండె

తే. మంత్రిసామంత్రివరహితమహితబాంధ
వాళినిం గూడి యుగ్రవైభవముతోడఁ
దూర్యముల్ మ్రోయ సద్భ్రసంతోషప చుచు
చేదిభూపతి పండనక్షత్రమునఁ దర. 207

ఉ. వచ్చెడు పెండ్లివారిఁ దగుభంగి నెదుర్కొని గౌరవింపగా
జెచ్చెర రుక్మి భీష్మకుఁడు స్నేహితులాప్తులు గూడిమాడఁగా
నిచ్చిరి యర్ఘ్యపూజల నవారిగఁ జేసిరి మెచ్చివారలన్
వెచ్చి వినూత్నహర్మ్యమున దించిరి సంతసమంది యెల్లరున్. **208**

గీ. చైద్యపక్షు లగుజరాసంధ సాళ్వ
దంతవక్త్ర విదూరథ దాల్భ్య పౌండ్ర
కాదిరాజసహస్రము గదలివచ్చి
కుండినపురమ్ముఁ జేరి రకుంఠితముగ. **209**

గీ. తగువిధంబుగ వారిని ధారుణీశుఁ
డెదురుకొని యర్ఘ్యవేశ్మము లిచ్చి మెచ్చి
సర్వసంపూర్ణయత్నుఁ డై సరభసముగ
నాఁటిపను లెల్లఁ దీర్చె సానందుఁడగుచు. **210**

—* రుక్మిణి కాత్యాయనీ మందిరమునకేగుట *—

సీ. అంగనామణులెల్ల మంగళస్నానంబు
హాయిగాఁ జేయించి రతివ కప్పుడు
కురులు చిక్కులు దీసి సరి జారుముడి వేసి
విరిమొగ్గ పూదండ దురుమఁజేసి
బంగరుసరిగంచు పట్టుపావడ గట్టి
రంగారు రయిక జెలంగఁదొడిగి
నవరత్నఖచితనానాభూషణమ్ముల
నంగకమ్ములయందు నమరఁజేసి

తే. తిలకమును దిద్ది గంధము సలఁది చరణ
ములకుఁ బారాణియుం బెట్టి బుగ్గయందు
సొంపుగాఁ దోఁచు కాటుకచుక్కఁ బెట్టి
పెండ్లికూఁతురిఁ జేసిరి వేడ్కమీఱ. **211**

గీ. విమలఋగ్యజుస్సానుమంత్రముల చేతఁ
క్రమవిధాన రక్షాబంధనమును జేసి
రవనిసురులు నవోఢ యైనట్టి రుక్మి
ణీలతాంగికి విధ్యుక్తనియతిఁ జేసి. 212

గీ. తగ నథర్వవేదమునందు దక్షులయ్యు
మొగిఁ బ్రయోగోపసంహారముల నెఱింగి
సద్విజులు నవగ్రహశాంతి సలుప హోమ
విధులు నెఱవేఱె భీష్మకవిభు ననుజ్ఞ. 213

సీ. ఎలగొని రక్షకభటవర్గములు విచ్చు
కత్తులెత్తియుఁ గాపుగాఁచుచుండ
దాసీజనంబులుఁ దగు నుపాయముల
పళ్లెరములలోని పరిఢవిల్ల
నంతఃపురాంగన లర్హ తాబాపన
ముత్తైదువలు చుట్టుముట్టి నడువఁ
గన్నతల్లి కరంబుఁ గరమునఁ గీలించి
నడయాడు రాయంచవడువు దోఁప.

తే. పెండ్లికూతురు రుక్మిణి ప్రేమ నాథు
హృదయమందిరమున నిల్పి ముదము గదుర
స్వప్రకాశస్వరూపిణి శాంభవీల
తాంగిఁ బూజింప వెడలె నయ్యవసరమున. 214

గీ. కర్ణికను బోలి రుక్మిణీకాంత వెలయ
రేకులట్లు ముత్తైదువల్ తాఁకి నడువ
భటులు రక్షకపత్రముల్ పగిది దనర
పద్మమును బోలి యుత్సవప్రజ నహింప. 215

గీ. చైద్యమిత్రము లగుజరాసంధుఁ డాది
మనుజనాథులు రుక్మితో మంతనములఁ
జేయుచున్ దేవళమునకుఁ జేరి యంత
వారివారి రాణువులతో వరుసనేరి. 216

బలరామకృష్ణు లిర్వురు
సలలితముగ వారివారిస్యందనములలోఁ
జెలువంద నేగి ప్రక్కగ
నిలిచిరి సైన్యములతోడ నెలఁతుక కొఱకై. 217

మనసారన్ గిరిబాలపూజలను సన్మానించి పూజించి స
జ్జనమాన్యంబుగ రుక్మిణీ రమణి తాసాష్టాంగదండప్రణా
మనిరూఢిన్ ధర ప్రాలి మ్రొక్కె సుదతుల్ మంత్రాక్షతల్ చల్లి దీ
వెన లింపార నొసంగి మెచ్చిరి సుఖావిష్టంబు లౌనట్టులన్ 218

కరకంజంబులు మోడ్చి రుక్మిణి యుమాకల్యాణిసాన్నిధ్యమం
దరవిందాక్షుని నెమ్మది న్నిలిపి యమ్మా! శైలబాలా! మదం
తరవర్తిన్ హరిఁ గృష్ణమూర్తిని గృపాధారేయవై కూర్చి స
త్కరుణం● జిందుము తల్లి దీనజనరక్షాదక్ష వై శాంభవీ! 219

నిన్నే నమ్మితి నీపదాంబుజములే నిత్యంబు సేవింతు నా
పన్నన్ నన్ను ననుగ్రహింపుము కృపాపారీణవై నన్ను నా
వెన్నుం గూర్పుము సేదదీర్పుము దురావేశాత్ములై మాయెడం
బన్నం బెంచు ఖలాళికిం దెలియనిమ్మా యమ్మ ధర్మోన్నతిన్.221

అని ప్రార్థించుచు విప్రాం
గనలు వచించినవిధానఁ గాత్యాయనినిన్
ఘనముగఁ బూజ లొనర్చెను
వనితామణి శాస్త్రవిధుల వరుస నడపుచున్. 222

అగరు గంధాక్షతసుమవస్త్రాభరణాను
మాల్య ధూపదీపంబులచే మహితవితత
భోజ్యములచేత శాంకరీపూజఁ జేసె
రుక్మిణీదేవి భక్తినిరూఢిఁజేసి. 223

వృద్ధవిప్రాంగనల సమర్చించి భక్ష్య
పాయసమ్ముల నిచ్చి సువస్త్రమాల్య
భూషణముల నొసఁగి సంపూర్ణభక్తి
మ్రొక్కి దీవెనలను గాంచె ముగుదమిన్న. 224

సీ. నిండారుజాబిల్లి నెమ్మొగంబున వింత
యొలనవ్వు రేయెండ లొలుకుదాని
బంగారుతనువుపై హంగుగా నమరిన
భూషణమ్ములకాంతి పొరయుదాని
ముద్దుముంగురులకప్పున నుండి దోబూచు
లాడువిశాలాక్షులమరుదాని
కెంపువాతెఱ చివురింపుగా జతగూడి
తగుమల్లెమొగ్గదంతముల దాని

తే. నభ్యుదిత మైనకుచయుగ్మ మలరుదాని
కాలియందెలరవళి ఘల్లుఘల్లు రనఁగ
హంసగమనముతో నడయాడుదాని
దాని రుక్మిణిఁ గనియె శ్రీజాని యంత. 225

ఉ. శూరులు కీర్తిమంతు లగుసుందరరాజకుమారులెల్లఁ బ్ర
కాఱుమెఱుంగుచందమునఁ గన్పడురుక్మిణిఁ గాంచినంతనా
శారి దృగంచలంబు లర వాడి తళుక్కను గాంచి తేజని
స్తారితతేజులై కనులు చయ్యన మూసిరి విహ్వలాత్ములై. 226

సీ. కాఱుమేఘాలలోఁ గలిసియుండు శశాంకుఁ
డెందుకో సతిముఖమందుఁ దోఁచె
చికురములే మేఘశకలము లని వోలు
చిఱునవ్వె వెన్నెలపరువు లేము
సంజ కెంజాయతో సరసమేమయ్యెనో
యరుణాధరము గాంచి మఱచియుండె..
వెన్నెలపులులా కన్నులా యవి యవే
బొమలుండె మదనచాపములవోలె

తే. బింబమున కిరువంకల వెలయునవ్వి
రోహిణీతారలా కావు శ్రోత్రములకు
నమరుతాటంకయుగ మద్దిరా లతాంగి
యమృతమయి యయి రసమూర్తి యనన్యఁపు.. 227

స్యందనానేకపహయవాహనము లెక్కి
వచ్చియున్నట్టిరాజులు వారిజాక్షి
గని తదాయత్తచిత్తులై మనసు చెదరి
మూర్ఛ మునిఁగిరి యాయుధములను వదలి. 228

తనహృత్పద్మము కృష్ణదేవుచరణద్వంద్వంబున న్నిల్పిమో
హనసౌందర్యము నప్పగించెడు పవిత్రాంగి న్విలోకించి దు
ర్జనరాజన్యులు మోహదృష్టిఁ గని వాంఛాధీనులై చిత్తవృ
త్తిని గోల్పోయిరి మూర్ఛ మున్గిరి మదోద్రేకంబు లుప్పొంగఁగన్.

తలిరుటాకులు వోలు సలలితాంఘ్రులు మోపి
మెలమెల్లగా నడకలు రహింప
హరి కృష్ణుఁ డెచ్చోట బొరసియున్నాఁ డని
యుల్ల ముఱ్ఱూఁతల నూఁగుచుండ
వామాంగుళీనఖవ్రజము సారించుచు
చెరిగినముంగురుల్ సరిగ నొత్తి
సిగ్గునునుకప్పు మోముపైఁ జిందులాడ
మోమెత్తి కడగంటి ముద్దుచూపు దిశల్
కలయఁజూచి నృపాలకులను గాంచి
నేత్రచాలనమునఁ ద్రోఁగి నెలఁతమిన్న
గరుడకేతన మమరినయరదమందుఁ
బరఁగుహరిఁ గాంచె గన్నులకఱవు తీర. 230

తత్త్వదస్యాపదము ల్దనరు నంఘ్రియుగంబు
నసి పదంబందు నైక్యంబుఁ జెంది
సాంత్మవిచారవిద్యాపూర్వకంబుగా
సోహం పరబ్రహ్మసూక్తి నెలయ
సగుణబ్రహ్మ సన్నిధానము గోరి
చిత్తవృత్తు లనెడుచేతిగోళ్ల
సుపలసంగెల్ల నావరణవిక్షేపశ
క్తులఁ దొలఁగించి మనుజు లసఁ గోలు

తే. గీ. సగుణదృష్టి నాధారాదిచక్రనాయ
కులను గని సహస్రారమం దలరుచున్న
పరమకల్యాణమూర్తి శ్రీహరిని గాంచె
రుక్మిణీదేవి చిత్తనిరూఢిఁ జేసి.

చ. కనుఁగొని కృష్ణదేవుఁడును కాంతయపాంగసరాగవీక్షణల్
మనమున నెంచి స్యందనము మక్కువ నెక్కుడు నిక్కఁ ద్రోచి చ
య్యన సతి యున్న ప్రక్కకు శతాంగము ద్రోలి కరంబు సాచి చే
య్యన గ్రహియించి యందుకొనె నందఱు రాజులు చూచుచుండఁగన్.

క. మెఱపు మెఱసినట్టు లరదంబు నురికించి
దరియఁ జేరి తరుణి కరముఁ గరము
జేతఁ బట్టి యెత్తి చెచ్చెర సన్నిధిఁ
జేర్చుకొనె శౌరి చిత్త మలర. 233

ఆ. వె. బలునితోడఁ గూడి పలువిధసైన్యముల్
వెంటనంటి నడువ విశ్వమయుఁడు
తరుణితోడఁ గూడి గరుడకేతనుఁ డప్పు
డరదముం గదల్చె సరభసముగ. 234

ఉ. నివ్వెరఁ బోయి చూచుచు నునిషదొలంగి నృపాలలోక మా
జవ్వనిసాహసక్రియయు శౌరిబలోద్ధతి నాకలించియున్
దివ్వటిక్రిందిదీపములు తేజములట్టులఁ బొలిపోవుచున్
నెవ్వగ నందినుండెదరు నిశ్చయ మెద్దియుఁ జేయఁజాలరై. 235

సీ. శ్రీకృష్ణుఁ డనుబ్రహ్మజిజ్ఞాసువు కడంగి
తనయందు లీనమై తనరఁ దగిన
ముక్తికాంతను బోలు ముదిత రుక్మిణిఁ జెందఁ
బూని యంతశ్శాత్రవు లగు చైద్య
ధరణీశు లాదిముష్కరుల వంచించియు
సలలితాధారాదిచక్రములను
వెదకి తన్నాథుల విస్మరించుచు స్వప్ర
కాశసహస్రారకమలయందుఁ

చ. కని వనజాక్షి రుక్మిణి సకౌతుక దీన విలోలభావముల్
వెనఁగొని సిగ్గుఁ జెంది తన ప్రేమనిధానము కృష్ణదేవుమో
మును దిలకింప నవ్వి హరి మోహిని భీతిలఁబోకు మిప్పుడే
కనెదవు దుష్టశాత్రవుల కట్టడిగట్టుల గుట్టుమట్టులన్. 243

వ. అని ప్రియురాలికిఁ బ్రియుండు ధైర్యం బుపదేశించి శత్రురాజుల
దిలకించి. 244

గీ. క్షత్రియోచిత మైన రాక్షసవివాహ
విషయ మియ్యది యెదిరించు వీరవరులు
కలుగుచో రెండు గండు జాగిలములట్లు
గడఁగకుండు నట్టిపండ్ల బింకమ్ముకొలఁది. 245

గీ. పదియు నెనిమిదిమార్లు మాపై నెదిర్చి
వెన్నుఁజూపి పర్వెత్తిన వీరవర్యు
లౌ జరాసంధ సామ్రాట్టులౌ తెగించి
వచ్చితిరి రంపు మాయని మచ్చఁగూర్చు. 246

క. ఓహోహో మహనీయులు
సాహసు లకుడంతపక్ష్య జనపాలురొకో
మోహానమునకా వత్తురు
దాహము దీర్చెదను రంపు దయచేయుఁ డికన్. 247

మ. అని రాజన్యవరేణ్యులం బిరుసుగా నగ్గించి తగ్గించి చ
య్యన బాణాసన మెత్తి కృష్ణపతి దివ్యాస్త్రప్రకాండంబు లే
సిన దావానలసన్నిభం బయి దిశాశీర్షంబులం గప్పి గు
ప్పున సైన్యాటవు లెల్లఁ గాల్చఁదొడఁగెన్ భూమీశు లల్లాడఁగన్.

మ. బలరామప్రభు వంత సిద్ధమగు [illegible] గుప్పి శ
త్రులఁ బోకార్పఁదొడఁగెఁ [illegible] ని
శ్చలులై పోరి మహారిసైన్యములకష్టుల్ [illegible] చును
బలదర్పంబులఁ జూపి [illegible]. 249

గీ. అటు తిరోధానమొనరించి యవల నేగి
సఖుఁడు శిశుపాలు గని జరాసంధులాది
భూపముఖ్యులు నానిసంతాప మరసి
జాలి గొని యంతఁ గన్నీరు జాలుకొనుడు. 250

క. అనఘా శిశుపాలా నె
మ్మనమున వగ నందరాదు మనమనవిధులన్
బొనరించినాము దైవం
బనుకూలింపఁడు పరాజయము మన కయ్యెన్. 251

ఉ. కష్టసుఖంబు లెన్నఁడును గావడికుండలు జంటగూడి వి
స్పష్టముగా గహించు నవిభాజ్యము లౌను సుఖంబు నందునున్
గష్టము లేకపోదు నుడికాలమునం బరిణామభేదమై
కష్టము సౌఖ్యమౌ యని విశాసము నందును జెందు జీవునిన్. 252

మ. సుఖదుఃఖంబులు శాశ్వతంబు లగునా క్షోణీధవా నేఁటిదౌ
సుఖమే రేపటి దుఃఖమేమొ యది సంశోధింపనౌనా పరా
ఙ్ముఖుఁడై పాఱినకృష్ణుఁడే యిపుడు నాకున్నించెఁ నేనాటికే
ముఖమై యవ్వి తటస్థమానౌ యవి సంపూర్ణానుభోగ్యంబులౌ. 253

ఉ. అందిన జుట్టు బట్టుకొను నందని చోఁ జరణమ్ములంటు నీ
మందుఁడు గొల్లబోయని యమానుషకార్యము లిట్టి విట్టులే
యందఱినో గలంచె హరియించి సమస్తము పాఱిపోయె నే
చందముచేతఁ జిక్కఁ డతిసాహస విక్రము డౌను మిత్రమా. 254

చ. ఇతఁడు బలాఢ్యుఁ డయ్యు గుణహీనుఁడు కాఁడు మిత్రధర్మముల్
స్థితిగతు లెవ్వియుం గనఁడు చిక్కియుఁ జిక్కకఁ జక్కనేసు దు
ర్మతి యవమాన హీనతలమాట దలంపఁడు నాసిచిత్తమే
గతి విలసిల్లునో యటులె కార్య మొనర్చును కర్మసుండునై. 255

గీ. పదియు నెనిమిదిసారు లీపాఱుఁబోతు
తోడ రణ మయ్యె నాకు నేదో విధాన
దారి తప్పించి కనుగప్పి దాఁటిపోవు
నెంత వెదకిన గన్పింపఁ డెందు నేని. 256

ఉ. ఇంతకునీ యదృష్ట మిటు లేర్పడెఁ గృష్ణుఁడు ద్వారపురించె న
య్యింతి తనంతఁ దా వలచి యేగి రథంబున జేరె నెంతుకీ
వంత కులీను వీడి యొకపాతకిఁ గోరిన యట్టికాంతకై
భ్రాంతి వహింపరాదు కులపాలితు లైన ధరాధినాయకుల్ 257

చ. తటపట లేల? దానిఁ దలఁదన్నులతొంగినిఁ దెచ్చి నీకు నే
పటిసుముహూర్తమప్పుడె వివాహ మొనర్తము తప్పఁబోకి యి
చ్చుటఁ బని యేమి రమ్మి విలసన్మతి రుక్మి యొనర్చ్పయుల్నె ని
ట్లటవిని గాయు వెన్నె లయి యాదవవీరునిఁ జేరె వ్యర్థమై. 258

గీ. అపరదేవేంద్రుఁడవు సిరియందు మూర్తి
గొన్న మన్మథుఁడవు రూపగుణములందు
విద్యల బృహస్పతివియు వివేకమందు
శుక్రుఁడవు నీకు లోటేమి? క్షోణిపాల! 259

ఉ. అందనిద్రాక్షపండ్లు కటువైనవి పుల్లని వన్న రీతిగా
మందజరాకుమారుఁ డవమానభరంబునఁ గుంగిపోవు [illegible]
ద్యుం దగుకీలఁ దీర్చి తనతోఁ గొని యేరికిఁ [illegible]
గొందినొ దూరి మారి తనకొంపకు జేరెను [illegible] 260

సీ. వనజాక్షు లంకించుకొని రొత్తుకొనిపోయె
సోదరి రుక్మిణీసుదతి యనుచు
పచ్చపచ్చని పెండ్లిపందిళ్లలో నెచ్చు
వెచ్చరక్తపు టెల్లు వెలసె ననుచు
జూడవచ్చినవారుఁ జుట్టాలు పక్కాలు
పడఁ జచ్చి శవము లైపడి రటంచు
హతశేషు లెల్ల జీవితముపైఁ దీపిచే
దిశకొక్క రై పరతెంచి రంచు

తే. గీ. సుములు సుములై ప్రజాళి వాకొనెడు పలుకు
లొక్కటొకటొక్కటిశూలమై యుగము. గ్రసన్న
చిత్తుఁ జేసిన రుక్మి కృశించి నొచ్చి
క్రోధతామ్రాక్షుఁ డయ్యె గ్రహాకులి ముడిచి [illegible] 261

పాలిపోవుభీరుల కొంక కాలిపోవు
వీరకేసరిగర్జ విన్పించినట్లు
లవమతభరమ్మునన్ గ్రుంగుచుట్టెరుక్మి
కవనిపాలు రేఁగుట గొప్పయార్తి యయ్యె. 262

—*- రుక్మి కృష్ణునితో యుద్ధమునర్చి భంగపడుట *—

అవమానంబు నసూయ పట్టుదల మూర్ఖావేశమున్ గర్వశా
త్రవసంగ్రామజయంబు స్నేహవిఫలనిర్మర్యాద లేకమ్ముగా
గనయన్ డెందము బొందుఁబాడిపడఁ గింకర్తవ్యతామూఢుఁడై
పవమానాహతభూరుహమ్మువల గంపం బొందె రుక్మీశుఁడున్ 263

పెద్దలవాక్యముల్ పెడచెవిఁ బెట్టిన
ఫల మిట్టి దని నొక్కిఁ బలుకువారు
సత్యమే విజయధ్వజంబు స్థాపించెడు
నన్నృతంబు చెల్లునా యనెడువారు
నిర్మలప్రణయంబు నెలవు గాంచెనుగాక
బలవంతమా యని పలుకువారు
శ్రీకృష్ణుఁ డేడ యీచెనఁటిభూపతు లేడ
గెలుచు టేడ యటంచుఁ దలఁచువారు
మదపురోగము బాగుగాఁ గుదిరె ననుచు
మిడిసిపా టెందుకో రుక్మి పడెడు ననుచు
ప్రజలు నానావిధంబులఁ బలుకునుడుల
నాలకించి రుక్మి మహోగ్రహమున లేచి. 264

అగ్గితో నుంచుగుగ్గిల మట్లు భగ్గు
భగ్గునన్ మండుచుఁ గృపాణపాణి యగుచు
మీసలవి ద్రిప్పి రోషసంత్రాసములను
బ్రతిన గావించె రుక్మి భూపాలుఁ డపుడు. 265

మాయలు పన్ని తిన్నఁగ నసూయను రాలి గ్రహించి దొంగయై
పోయిన మాయకృష్ణుఁ గిరిపోతమునున్ మృగరాజమట్లు ఘో

రాయతనితోఁ ద్రుంచి యసహాయను రుక్మిణిఁ దెత్తు నట్లుగా
దా యిఁక నేను కుండినమహానగరంబును గాంచ నెన్నఁడున్. 266

క. అని రోషకషాయితలో
చనుఁడై శపథంబుఁ జేసి చయ్యన నక్షౌ
హిణిపరిమితసైన్యముఁ గొని
చనియెన్ హరిఁ దాఁక రుక్మి సంరంభమునన్ 267

వ. ఇట్లు చని యమ్మాధవుం దక్షిగోచరుం డగుటయు 268

చ. కనుఁగొని రుక్మి లోచనయుగంబున నుల్కలు రాల మేఘగ
ర్జనమటు "లాఁగుమాఁగు, మరి రాజభయంకరవీర కేరెన్
గని భయమంది పాఱకుము కష్టుఁడ దుష్టుఁడ నీచకృష్ణుఁడా!
నిను విడువక్ షమింప నిఁక నిల్వుము గెల్వుము చేతనైన దోర్. 269

ఉ. క్షత్రియవీరుఁ డిట్లగునొ? సంగరరంగము విడిపాఱునొ?
పాత్రుఁడ వేని నిల్వు మిఁక భండనపండితు నన్ను నోర్వరా
మైత్రుఁడ వయ్యెదో నిశితశాతవినీతకఠోరహేతికిన్
గాత్రము వీడెదో తెలియఁగా నగు నోరి కిరాతఘాతవరా! 270

శా. ఓరీయాదవవంశనాశనకరా! యుద్యోగివై వచ్చి యీ
వోరా వాయస మొండు పుష్కలహవిర్భాగంబు నాశించు మా
స్త్రీరామామణి రుక్మిణిం గొని కడున్ శీఘ్రంబుగాఁ బోయెదో
చోరగ్రామణి సిగ్గు లేద నిను నీచున్ నన్నుఁ బోకార్చెదన్. 271

చ. అని విని శౌరి శార్ఙ్గధరుఁడై వగి పగ్గెలు పల్కుచున్న రు
క్మిని నెదిరించి నిల్చె మదఘీంకృతిఁ జేసెడుమత్తవారణం
బును మృగరాజు డీకొనెడుపోలిక సంతట రుక్మియున్ శరా
సనమును బట్టి తీవ్రశరషట్కము నేసె మురారిపైనటన్. 272

ఉ. పట్టినవిల్లు పట్టి పటు భంగము సేయఁ దొడంగ శౌరి యు
ప్పొంగిన రుక్మియున్ బరిఘ పట్టిన నప్పుడె త్రుంచె నదియే
పట్టి గదాసి త్రుంచె నగు నాతఁడు గాఁడు మహోగ్రహమ్మునన్
నట్టి హేతిఁ జేత [illegible] 273

హరిని వధించుటో యతనియాయుధధారకు నేలఁ గూలుటో
పరువో పరాజయంబో యొకపద్ధతి నిద్దముఁ జేయ నౌనటం
చరిమురిపాటుఁ జెంది ప్రళయాగ్నిని దూకుపతంగమట్లు ని
ష్ఠురుఁడయి కృష్ణుసన్నిధికిఁ జొచ్చుకపోయెను రుక్మి చెచ్చెరన్. 274

తనపై దూఁకినరుక్మి గాంచి హరియుం దర్పించి కుప్పించి భీ
షణఖడ్గంబును రెండుగా నఱికి శీర్షత్రాణముం బట్టి తు
త్తునియల్ చేసి ఖరాసిఁ జేతఁగొనియుద్యుక్తుండుగాఁ గ్రూరు రు
క్మినిఁ దున్మాడఁగఁ గాంచి రుక్మిణి మహాఖేదంబు బాధింపగన్ 275

పుట్టింపను మెట్టింపను
గిట్టింపను నీవె కాక కృష్ణ ముకుందా!
గుట్టెఱుఁగనిదుష్టాత్ములు
నెట్టనఁ జెడిపోదు రిట్టె నీరజనాభా! 276

ఎట్టివాఁ డైన నాయన్న యితఁడు కృష్ణ
వాని మన్నించి విడి నాకు భ్రాతృభిక్ష
పెట్టఁదగు నీనిఁ బట్టి నాకట్టెదుట నె
తునుముటలు చూడఁజాల నో పంకజనేత్ర 277

అని కన్నీ రొలుకఁగ రో
దనమొనరించుచును బాదతామరసములన్
ఘనముగఁ బట్టినరుక్మిణిఁ
గని మనమునఁ గనికరమును గనియె హరియున్. 278

భయతాపములు ప్రకంపనవేగమున నూపఁ
గంపించుతనువల్లి గలుగుదాని
భ్రాతృమారణశిక్షఁ బరికింపఁగా లేక
హృదయము చెదరి వర్తించుదాని
తనుతాపవశమున నల్లలాడుచు జారు
హారము దెలియక యడలుదాని
కన్నీరు మున్నీరు గాఁ గ్రాఁచి నోరెండి
గద్గదికశ్రుతు లగ్గుదాని

తే. చరణతలమున నొదిగి సోదరునిఁ జంప
వలవ దని దీనముగ ముద్దు లొలుకుదాని
రాణి రుక్మిణి గని దయ బూని శౌరి
మానుకొనె రుక్మి వధియింపు మప్రానికలను. 279

గీ. ఉద్ధతిన్ బోయి రుక్మిని నొడిసిపట్టి
చేలమున వానిఁ దేరుకుఁ జేర్చి కట్టి
గడ్డమును మీసలును వెంట్రుకలను గొరిగె
చేవు రేవులు గాఁగ వికృతిగ శౌరి. 280

సీ. మెలివెట్టి త్రిప్పి చుక్కలు జూపుమీసలు
నేఁటి కూడలితోడ నిష్క్రమించు
నివిరి పాయలు దీసి సిగ్గులు సవరించు
బిరుసుగడ్డం బదే యుఱికిపాఱు
విమలసుగంధతైలము లంటిపెంచిన
కురు లదే సవరాలకొట్టుఁ జేరె
నభిమానధన మైనయాకారసౌష్ఠవ
మద్దాలపెడదారి ననుసరించె

తే. ననుచుఁ బరిహాసవచనము లాడ మూఁకె
సునిశితకరాసి చేఁ బూని శుభ్రముగను
జెలఁగి చెవులచేర్పు [illegible] రుక్మి
తల గొఱిగి కృష్ణపరమాత్మ తత్క్షణమున. 281

ఉ. కోపము వచ్చునేమొ సుమకోమలి నాయుపైఁ [illegible]
జూపినఖడ్గ మెన్నఁ డరిఁ జంపి కలంపక [illegible]
చాపలబుద్ధిచే నితనిఁ జంపక విడ్చితిఁ గాని [illegible]
ప్రాపగుమంగళ[illegible] సూడను [illegible]! 282

ను. భగినీభాగ్యవిశేషమే బ్రదుకు [illegible]! [illegible]
డగ బూజింపుము నీవు [illegible] [illegible] దే
విగ భావించి, తరించి పోయెదు [illegible]! [illegible] వమా
నిగళంబు ల్విడిపోయెన [illegible]! 283

యిట్టివిభ్రాంతియే మాయ యిందువలస
దెరను విడువక నరుఁడు దుశ్చరితుఁ డగును. 297

భూతపంచకమును నధిభూతములును
నరయఁ బ్రాణము లనెడు నధ్యాత్మములును
దనతు శబ్దాదు లనునధిదైవములును
గూడినది యీశరీరము కోమలాంగి ! 298

చావు పుట్టువుల్ గలుగు నశ్వరశరీర
మూపరబ్రహ్మమందు నారోపిత మయి
ప్రాణి దేహేంద్రియాద్యభిమాని యైన
జీవు సంసారమునఁ దిప్పుఁ జేయుచుండు. 299

తేజోము లిలలోన సూర్యుఁ డొకఁడే దీపింపఁగాఁబోలుఁ దే
జంబే శశితారకానిచయముల్ దీపింపఁగాఁజేయు న
ట్లే జీవుల్ పరమాత్మ చేతనతగం బ్రుద్ధిం బ్రదీపింత్రుగా
నీజీవాళికి స్వప్రకాశ మది లేనే లేదు చింతింపఁగన్. 300

కలయహంకారమమకారములు శరీర
మునకె కాని యాత్మకు లేవు జననమరణ
సౌఖ్యసంతోషములు లేవు దోసఁగుకల్ల
యాత్మసత్యము సత్యమా నబ్జనేత్ర ! 301

మనుజుఁ దోషింప శోషింప ననికి యైన
తామసాజ్ఞానభిత్తికఁ దలఁగదీసి
స్వస్వరూపవిజ్ఞానసంపదను గాంచి
నిలువు మోతల్లి ! కృష్ణుఁడు నీకు దక్కు. 302

—* రుక్మిణీకృష్ణుల వివాహము *—

అని రాముఁడు బోధించిన
విని రుక్మిణి సంశయమ్ము విచ్ఛిన్నంబై
మనము సమాధానము గని
కనుచును వత్తుగాఁ దత్త్వమునుఁ బ్రాపించెన్. 303

ఉ. ఎంచి శిరస్సు మెత్తక యవారితుఁడై చని రుక్మి తా నగా
వించు ప్రతిజ్ఞ నెంచి పలవించుచు స్వీయపురంబుఁ జేర కో
క్కించుక లోఁద లంచి పరికించి పరాపరిఁ జేరఁ బాపె మున్
గాంచి యుటుట్టి భోజకటకం బనుపట్టణమందు నుండఁగన్. 304

ఉ. అంతటఁ గృష్ణదేవుఁడు నిజానంగనతో బలరాముతో సహా వి
క్రాంతి దలిర్చు సైనికనికాయముతో జని ద్వారకాపురీ
ప్రాంతములందుఁ జేరు నెడఁ బట్టణవాసులు కర్ణపర్వ వృ
త్తాంతము లాలకించి ప్రమదంబున గుంపులు గూడి సన్నుతిన్. 305

సీ. మానాయకుఁడు రుక్మిణీనాయకుఁడు గాఁగ
ఘనాయకుల నెల్ల పొగరుడించి
యేణీవిలోచన రాణితో నన్నతో
రాణువుతో జయలక్ష్మి తోడ
వచ్చుచున్నాఁ డంచు చెచ్చెర నెదురుగాఁ
బోద మం చొండొరు ప్రోత్సహించుచు
కొనుచు గుంపులు కూడి ఘనమైన హారతులు
కొని రాజమందిరమునకుఁ బోయి

తే. యుగ్రసేనమహారాజు నుత్సవమునఁ
గలసి యాబాలగోపాల మెలమి నెదురఁ
దూర్యములు మ్రోయ దేవదుందుభులు సెలఁగ
నెదురు నడిచిరి సర్వసర్వేశుఁ జేర. 306

సీ. జేకృష్ణ జయకృష్ణ శ్రీకృష్ణ యనువారు
నభ్యుదయోస్తని యులరువారు
గోవర్ధనోద్ధార కువలయాధార జే
పరమేశ్వరా యని పలుకువారు
కంసాంతకా రిపుకాలాంతకా హరే
గోవింద యని పాడి పలుకువారు

రుక్మిణీప్రాణేశ ! రుక్మిగర్వవినాశ
సర్వేశయని నుతు ల్సలుపువారు

తే. పౌరుషము లుగ్గడించుచుఁ బలుకువారుఁ
క్రీడ లభివర్ణన మొనర్చి కేఱలువారు
నగుచు ద్వారకాపురవాసు లతిముదమున
హరిని గాంచి తేర నెదురేగి రవసరముగ. 307

అట్లు కోలాహలంబుగా నరిగి ప్రజలు
రాజులును రాజబంధులు రమణమీఱ
రామకృష్ణుల రుక్మిణీరమణితోడ
ద్వారకాపురిఁ జేర్చిరి ధన్యులగుచు. 308

ఉ. అంతఁ బురోహితుం డిభువనంపి ముహూర్తము నిర్ణయించి యు
త్యంతముదమ్మునన్ దగినయత్నము లన్నియుఁ జేసి ధారిణీ
కాంతుల బంధులన్ సఖుల గౌరవభంగిని బిల్వఁ బంపె న
త్యంతముదంబు మీఱ మధురాధిపుఁ డప్పుడు పెండ్లిపెద్దయై. 309

ఉ. ధారుణిఁ గల్గినట్టివిబుధవ్రజమున్ ధరణీశకోటి బృం
దారకవర్గమున్ మునిజనంబు సదస్యులు గాఁగ మంగళా
శీరవ ముల్లసిల్ల హరి చేకొనెఁ బట్టపురాణి గాఁగ సం
పూర్ణ విదర్భరాజతనయామణి రుక్మిణి లోకమోహినిన్. 310

క. నీకై చెప్పితి నీకథ
నాకై నీకథ త్రిలోకనాయక కృతిక
న్యాకలితుఁడ వై బంధుతఁ
గైకొని నను మఱవకేలఁ గదె గోపాలా ! 311

క. శ్రీకృష్ణాభ్యుదయంబన
నీకావ్యములో ననుత్తరార్థం బిది యో
కైకేశ యుత్తరార్థం
బేకవణిఘటింతొ భార్గమొల్లను నీకా 31?

క. ఏతాత్పర్యముతో నే
నేతత్కృతికిం గడంగి తీవెఱుఁగుదు వీ
వా తాత్పర్యముసార్థక
మూ తెఱఁగున నేలుకొనఁ గదయ్యా నన్నున్. 313

వ. ఇది శ్రీసుబ్రహ్మణ్యేశ్వరకృపాకలిత కవితావిధేయ, నాదేలవంశసుధాపయోనిధి కలానిధిగేయ, వేంకటశేషగిరిరాయ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణాభ్యుదయ మహాకావ్యంబునఁ బంచమాశ్వాసము

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.



విజయవాడ సుందరీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.